# తాపి ధర్మారావు

## జీవితం - రచనలు

డాక్టర్ ఏటుకూరి ప్రసాద్




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001

ప్రచురణ నెం : 1377
ప్రథమ ముద్రణ : సెప్టెంబరు, 1989.
ప్రతులు : 1000



టైటిల్ డిజైన్ : చంద్ర

**వెల : రూ. 80.00**

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞానభవన్, 4–1–435 బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు – 500 001

**విశాలాంధ్ర బుక్ హౌస్**
విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్నం, అనంతపురం,
తిరుపతి, హన్మకొండ, గుంటూరు, కాకినాడ.

**ISBN** : 81-7098-156-5

---

ముద్రణ :
**మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్**
1-1-694/2/ఏ, గాంధీనగర్, హైదరాబాద్ 500 380

# పరిచయం

ఊహ తెలిసిననాటినుండి ఊపిరి ఆగేవరకు సాహిత్యసేవే సర్వస్వంగా జీవించిన ధన్యజీవులలో ధర్మారావుగారొకరు.

86 సంవత్సరాల సుదీర్ఘ జీవితంలో వారు స్పృశించని సాహిత్య పార్శ్వం, లేదు. విశిష్టతను నిరూపించుకోని రంగం లేదు.

పద్య కవిత్వంతో మొదలైన వారి వ్యాసంగం నాటకాలు, నాటికలు, నవలలు, పరిశోధనలు, పత్రికారచన, సినిమా మాటల, పాటల రచన - ఇలా బహుముఖాలుగా సాగింది. తల్లిద్వారా ఆంధ్రంలోను, తండ్రిద్వారా ఆంగ్లంలోను అభినివేశం పొంది, వీరు ఉభయభాషా ప్రవీణులైనారు.

జీవనోపాధికై ఎన్నో వృత్తులు చేపట్టారు. బరంపురంనుండి మద్రాసు, తమిళనాడ్‌లోని ఊర్కాడ్ సంస్థానం - ఒకటేమిటి ఆంధ్రలోని అన్ని పట్టణాల లోనూ ఎప్పుడో ఒకప్పుడు వీరు వృత్తిరీత్యా నివసించిన వారే. హెచ్చు కాలం ఉపాధ్యాయ వృత్తిలో నున్నందున శ్రోతలకు బోధపడే విధంగా రాయాలి, మాట్లాడాలి - అనే వాస్తవం, వీరికి పూర్తిగా జీర్ణమైంది. జమీందార్ల పిల్లలకు ట్యూటర్‌గా ఉండే అనుభవమూ, స్వయంగా సామాన్య తరగతి జీవితానుభవమూ, వీరికి సమాజంలోని ఆర్థిక, సామాజిక అంతరాలను అవగాహన చేసుకునేందుకు తోడ్పడ్డది.

సాహిత్య పిపాసతో పాటు, సంఘ సంస్కరణ దీక్ష, ఆది నుండి అంతం వరకు వీరిని నీడలా వెంటాడిన ద్వితీయ ప్రకృతి. మాట ఎంత వదునైనా, మనసు మొదటినుండి మెత్తన. సాత్త్వికం వీరి ఆలోచనా విధానంలో అంతర్భాగం.

ఈ అన్ని కారణాల వలన అంతర్మథనం, ఆత్మ పరిశీలన వారికి స్వతస్సిద్ధంగా అలవడ్డది. వీర గ్రాంథికవాది సంపూర్ణ వ్యావహారిక వాదిగా మారటానికి ఇవన్నీ కారణాలు. పాత పాళీని వదలి కొత్త పాళీని చేపట్టారు. ముఖ్యంగా పత్రికారంగంలో వీరి ప్రవేశం భాషా విప్లవానికే తోవ తీసింది. సమదర్శిని, ప్రజామిత్ర, జనవాణి, కాగడా, తిరిగి జనవాణి - ఈ పత్రిక

లను వీరు తీర్చిదిద్దారు. ఆ పత్రికలు వీరిని తీర్చిదిద్దాయి.

కాల ప్రవాహంలో బ్రాహ్మణేతరోద్యమం, జస్టిస్ పార్టీ, పీపుల్సు పార్టీలతో వీరికి సాహచర్యం ఏర్పడినా, అవన్నీ తాత్కాలికం వీరిలో అంతర్వాహినిగా ఉన్న సాహిత్య సంస్కరణాభిలాష వ్యక్తీకరణకు సాధనాలు మాత్రమే.

జీవితంలో సగభాగం గడిచిన పిమ్మట వీరి ఆలోచనలు, భావనలు మరింత విస్తరించి, వామపక్ష ఉద్యమాలను మనస్ఫూర్తిగా ఆశీర్వదించే స్థితికి రావటం ఎంతో హర్షణీయ పరిణామం.

తెనాలిలో జరిగిన ప్రథమ అభ్యుదయ రచయితల మహాసభలో వీరి అధ్యక్షోపన్యాసం ఇందుకొక మచ్చుతునక. గతాన్ని గురించిన విశ్లేషణ, భవిష్యత్తుకు మార్గదర్శకత్వం - రెంటిలోనూ ఈ ప్రసంగం ఆదర్శప్రాయం. నాటి నుండి జీవితాంతం వరకు అభ్యుదయ రచయితల ఉద్యమం, శాంతి ఉద్యమం, ఇత్యాది ఉద్యమాలన్నింటితోను వీరు తాదాత్మ్యం పొందారు.

సుదీర్ఘమైన ఈ క్రమాన్నంతా రచయిత ఏటుకూరి ప్రసాద్ తన సిద్ధాంత గ్రంధంలో శక్తిమంతంగా వివరించారు. ధర్మారావుగారికి చివరి రోజులలో సాహిత్య అంతేవాసిగా ఉన్న రచయిత, పాత పాళీ నుండి కొత్త పాళీకి మారిన ధర్మారావుగారి సాహితీ జీవితాన్ని సమర్ధవంతంగా విశ్లేషించారు, వివరించారు.

కాగా సామాజిక పరిశోధనలకు చెందిన వీరి రచనలపై కొంత భిన్నాభిప్రాయానికి ఆస్కారం లేకపోలేదు.

సంతానోత్పత్తి ప్రధాన సమస్య అయిన అతి ప్రాచీనకాలంలో, సౌభాగ్య తంత్రం, మానవుని ఆలోచనను ప్రభావితం చేసిన ముఖ్యాంశాలలో ఒకటి. కాగా కాలం గడిచిన కొద్దీ ఇతరేతర భావనలు, అవసరాలు, విలువలు ప్రవేశించి, సంస్కృతీ ప్రవాహాన్నే మార్చి వేశాయి. మొదటి మెట్టును, దశను విస్మరించేటంతగా ఈ మార్పు జరిగింది.

తంత్రం, యంత్రం, మంత్రం - అన్నీ ఒకే మూఢవిశ్వాసంపై ఆధారపడిన భ్రమలు. వేల సంవత్సరాల చరిత్ర క్రమంలో వేర్వేరు వర్గ, వర్ణ అనుబంధాలతో ఇవి సమూలంగా మార్పు చెందాయి. హేయమైన తాంత్రిక వామాచారాలకు ఒకటి తోవ తీసింది. దేవాలయ నిర్మాణం పూజావిధులతో కూడిన మధ్యేమార్గానికి మరొకటి ఆలంబన అయింది. సాత్విక ప్రధానమైన జ్ఞాన మార్గానికి మూడోది బాట వేసింది.

ఆనాటి చారిత్రకసత్యం ఈనాటి భావజాలం దృష్ట్యా వివరించే కృషి

ఎంతో జటిలమైంది. ఈ రంగంలో ఇంకా ఎంతో విశ్లేషణ, వివరణ అవసరం. ధర్మారావుగారి పరిశోధనలు ఇందుకు తొలి ప్రాతిపదిక మాత్రమే.

అన్నిటిని మించి తాతాజీ వ్యక్తిత్వం మహోన్నతమైంది. విశ్రాంతి దశలో హైద్రాబాద్‌లో వారు నిర్వహించిన బహుముఖ సాహితీ కార్యక్రమాలన్నిటిలోనూ ఈ ఉదార గంభీర ప్రవృత్తి అడుగడుగునా వ్యక్తమౌతూ వచ్చింది. రచయిత ఈ అంశాన్ని కూడా సమర్థవంతంగా చిత్రించారు.

సిద్ధాంత గ్రంథాలను వెలువరించటానికి ప్రచురణ కర్తలు కొంచెం వెనకాడతారు. ఇంత భారమైన రచనలను పాఠకులు ఆదరిస్తారా అని సంశయిస్తారు.

మాకూ అలాంటి కించిత్ ప్రశ్న రాకపోలేదు.

అయినా, నలభై ఏండ్ల పాటు వామపక్ష ఉద్యమాలతోను, విశాలాంధ్ర సంస్థలతోను అత్యంత సన్నిహితత్వం కలిగిన ధర్మారావుగారి సాహితీ జీవిత చరిత్ర తప్పక పాఠకుల ఆదరణకు పాత్రం కాగలదని విశ్వసిస్తున్నాము.

రచయిత ఏటుకూరి ప్రసాద్ అభ్యుదయ గేయ రచయితగా సాహితీ రంగంలో ప్రవేశించాడు. ఆవేశ పూరితమైన గేయరచనలో వలెనే నిరావేశమూ, వస్తుగతమూ అయిన పరిశోధనా రంగంలోను పరిణతి సాధించాడు. ఇంతకుముందే ''కొంపెల్ల జనార్దనరావు జీవితం సాహిత్యం'' గ్రంథానికి సంపాదకత్వం వహించి లబ్ధప్రతిష్ఠుడయ్యాడు.

ఇలాంటి ఉత్తమ గ్రంథాన్ని ప్రచురించే అవకాశం లభించినందుకు మా ప్రచురణాలయం తరపున రచయితకు కృతజ్ఞత తెలియజేస్తున్నాము.

ఇట్లు

విజయవాడ
31-8-89

ఏటుకూరు బలరామమూర్తి
సంపాదకుడు,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

# సవినయంగా. . . .

యువకులనూ - వృద్ధులనూ, సాహితీవేత్తలనూ - సాహిత్యాభిమానులనూ సమానంగా ఉత్తేజపర్చే పుస్తకాలను రాసిన వ్యక్తి తాపీ ధర్మారావు. సామాజిక రుగ్మతలమీద చండపరశువెత్తి, అంధ ఆచారాలనూ — మూఢ నమ్మకాలనూ - ఎండగడ్తూ సంస్కరణదిశగా కదలండని సాహితీ శంఖం పూరించిన తాతాజీగా యువతరానికి తెలిస్తే; పరిశోధనా రంగంలో కొత్త ప్రమాణాలు నెలకొల్పుతూ ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యాల్సిన తీరుతెన్నులు వివరించిన వ్యక్తి తాపీ విజయ విలాసానికి పర్యాయపదంగా పండితమండలికి తెలుసు.

వీరి జీవితం - రచనలు అన్న అంశం డాక్టరేట్ కోసం పరిశోధనకు తీసుకున్న తర్వాత గానీ, ఇందులోని లోతు తెలీలేదు. ఓ సందర్భంలో నార్ల "ఆనాటి సమస్త రంగాల్లోనూ తాపీ కృషిచేశాడు. అగ్రగామి అయ్యాడు అయితే ఏ ఒక్క రంగాన్నో పట్టుకోనుంటే భారతదేశమే కాదు ప్రపంచమే గర్వించదగ్గ వ్యక్తి అయ్యేవాడు. తన శక్తి సామర్థ్యాలను పలు రంగాల్లో విభజించుకొని అన్నిటా విరాడ్రూపం ప్రదర్శించినవాడుగా మిగుల్తాడు" అనడం స్వభావోక్తి.

ఇన్ని రంగాలనూ స్పృశించటం నాకు తప్పనందువల్ల గ్రంథం పెద్దదైంది. ఆయా రంగాల పూర్వాపరాల నేపథ్యంలో తాపీ స్థానాన్ని అంచనా వెయ్యడానికి చాలా వివరాల ప్రస్తావనా తప్పనిసరైంది. ముఖ్యంగా 'రావేలుగలవాడ రార పొలిగాడ' - అన్న ప్రకరణంలో సామాజిక మానవ శాస్త్రాలనూ - సిద్ధాంతాలనూ, వీరి రచనల మూలతత్వాల విశదీకరణకు అన్వయించే ప్రయత్నం జరిగింది. ఇప్పటివరకూ వచ్చిన పలువురు మేధావుల ఆలోచనలే ఆకరాలుగా గ్రహించా. సిద్ధాంతాల అన్వయంలో భేదాభిప్రాయాలుండడం సహజం. దొరికిన సమాచారం, చూసే చూపూ వీటికి కారణం. ఏ అభిప్రాయాలైనా, ఎవరి నమ్మకాలనూ కించపర్చాలనే ఉద్దేశంతో రాసినవి

కావనీ మాత్రం నమ్మమని ప్రార్థన. కొత్త ఆలోచనలూ - సూచనలూ అందిస్తే అవకాశం దొరికినప్పుడు గౌరవిస్తా.

ఇక ....

గ్రంథం ఇలా మీ ముందుకు రావడానికి వెనక పలువురి చేతి సాయం - మాట సాయం ఉంది. ప్రతి చిన్న అంశాన్ని నిశితంగా చర్చించినవారు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి.

కొత్త భావాలకు ఆహ్వానం పలుకుతూ పర్యవేక్షించినవారు ఆచార్య యస్. వి. రామారావు.

ఆలోచనలు వివరించే క్రమం బావుందని వెన్ను చరిచినవారు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి.

తాతాజీ కుటుంబ సభ్యులూ, ముఖ్యంగా తాపీ మోహన్‌రావు, తాపీ సరోజిని, చాణక్య గారలు అందించిన సహకారం గొప్పది. అందిన సమాచారాన్ని పునర్విమర్శ చేసుకోవడంలో సుమారు 50 మంది వ్యక్తులు - శ్రీశ్రీ ముందు తరం నుండి నేటితరం దాకా అనేక రంగాలలోని ముఖ్యులు - సాయపడ్డారు. బరంపురం నుండి మద్రాసువరకూ చాలా గ్రంథాలయాలు తోడ్పడ్డాయి. ప్రధానంగా హైదరాబాదులోని సాలార్‌జంగ్ మ్యూజియం గ్రంథాలయం. ఫోటోల సేకరణలో ఎందరో సాయపడ్డారు. ఫోటోల రీ కాపీయింగ్ విషయంలో డాక్టర్ సోహాన్‌సింగ్, కీర్తిశేషులు చంద్రంగార్ల తోడ్పాటు పెద్దది.

విశాలాంధ్ర ప్రచురణాలయం ముందుకొచ్చి తమ ప్రచురణగా దీన్నితేవడం నేను జీవితాంతం గర్వించి గౌరవించదగ్గ అంశం.

పరిచయం అంటూ చిన్న పీఠిక రాసి మా అన్నగారు శ్రీ ఏటుకూరు బలరామమూర్తి నన్ను మన్నించారు.

మిత్రులు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, శ్రీ ఆర్వీ రామారావు, శ్రీ కె. చిరంజీవి గార్ల శ్రద్ధ గ్రంథంలో అడుగడుగునా కన్పిస్తూంది ఈ సిద్ధాంత గ్రంథం ఆధారంగా శ్రీ తాపీ మోహన్‌రావు 'తాపీ ధర్మారావు జీవితం - సాహిత్యం' అన్న చిన్న పుస్తకం రాశారు యిప్పటికే.

అగ్రవాల్ శిక్షా సమితీ, నేను పనిచేస్తున్న యస్ డి. సింగ్నోడియా ఆర్ట్స్ అండ్ కామర్స్ కాలేజి ప్రిన్సిపాల్, అధ్యాపక, అధ్యాపకేతర మిత్ర బృందం నిత్యం నా మంచినీ - అభివృద్ధినీ కోరారు.

అందంగా అచ్చువేసిన మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్ అధిపతి శ్రీ వాసిలి వసంతకుమార్, ప్రెస్ కార్మికులూ, ముఖచిత్రం గీసిన మిత్రుడు చంద్రా.... దీని బాగోగులు చూశారు. ఇలా ముస్తాబు చేసి మీకందించారు.

వీరందరికి **కృతజ్ఞతలు.**

భావ విప్లవం ద్వారా రాజకీయ విప్లవానికి ప్రగతి శక్తులు పోరాడే క్రమంలో ప్రాణాలొడ్డిన అనేకానేక యోధుల స్మృతికి

ఈ గ్రంథం **అంకితం.**

ఏటుకూరి ప్రసాద్

(వై. బి. యస్. ప్రసాదరావు)

# విషయసూచిక

## అనుబంధం

# 1
# మునెమ్మన వాలు

తెలుగునాట 19 వ శతాబ్ది చివరి పాదంలోనూ 20 వ శతాబ్ది ప్రథమ పాదంలోనూ వివిధ రంగాలలో గణనీయమైన సంచలనం కలిగింది. దేశ ప్రజలలో ఫ్యూడల్ వ్యవస్థ మంచి చెడ్డలను గ్రహించే శక్తి అధికమైంది. పశ్చిమ దేశాలలో అంతకు పూర్వమే అనేక రకాలైన మార్పులొచ్చి అక్కడి స్థితిగతులను కుదిపేశాయి. ఆ భావాలూ ఆ మార్పులూ క్రమేణా తెలుగుదేశంలో కూడా ప్రభావాన్ని కలిగించటం ఆరంభించాయి. వాటి పర్యవసానమే నాడిక్కడున్న యువతరంలో ఫ్యూడల్ వ్యతిరేకతా ధోరణీ, ప్రజాతంత్ర భావాల మీద సద్భావం ఏర్పడటానికి కారణమైంది. ఆ భావాలందే ఆసక్తి కలగడానికి ఆస్కారం కలిగించింది.

ఒక రకంగా మెకాలే కారణంగా 1835 తర్వాత మనదేశంలో ఆంగ్ల ప్రభుత్వం ఒక విధమైన విద్యా విధానాన్ని ప్రవేశపెట్టటం వల్ల మంచికి మంచి చెడుకు చెడూ జరిగిందనవచ్చు. 1835 లోనే గవర్నరు జనరల్ విలియం బెంటింగ్ తన ప్రకటనలో భారతీయుల్లో సాహిత్య, శాస్త్ర జ్ఞానాలను వ్యాపింపచేయటం ఆంగ్ల ప్రభుత్వ ఆశయమని చెప్పాడు.[1] ఇది ఎంతవరకు నిజమన్నది వేరే విషయం. అంతవరకూ అరకొరగా మనకందుబాటులోకొస్తున్న ఇతర దేశాల భావ విశేషాలు నేరుగా అధ్యయనం చేయటానికవకాశం కలిగించి.

తరతరాలుగా సంప్రదాయం పేరుతో మనల్ని పీల్చి పిప్పిచేస్తున్న విభిన్న రంగాలలోని మౌఢ్యాన్నీ మూర్ఖత్వాన్నీ ఎదిరించటానికి కొంత అవకాశం కలిగింది. మనస్సులో పేరుకొన్న బురదను కడగటం అవసరమన్న అభిప్రాయాలను అది అందించింది.[2] అదే సందర్భంలో ఇది ఆంగ్ల మానస పుత్రులను తయారు చేయటం, దాన్నింతవరకూ మన దేశం వదల్చుకోలేనంత పీడగా మారటం గమనించాల్సిన అవసరం కూడా ఉంది.

ఈ విద్యావిధానం - సంపర్కం మన వారి దృష్టిని ఒక విధంగా విశాలం చేసింది అంటే అంతవరకూ వేళ్ళూని ఉన్న భూస్వామ్య వ్యవస్థ అస్తిత్వాన్ని సమాజపరంగా అర్థం చేసుకోటానికి ఇది ఉపయోగపడిందనవచ్చు. అయితే ఆ వ్యవస్థలోని చెడుగులను గ్రహించే శక్తి ప్రజలకు అప్పుడప్పుడే కలుగుతున్నా ఆ భావాలు ప్రజల్లో వ్యాప్తి కాకుండా పాలకులు జాగ్రత్త పడుతూండేవారు. జనంలోకి విద్య బాగా దారులు వేసుకుంటూ పోతే ప్రజలు మరింత తెలివిమీరి పోతారేమోనన్న భయంతో వారిని జోకొట్టటానికి అవసరమైన విషయాలను కూడా విద్యావిధానంలో ఉండేలా చూసుకుంటూండే వారు. దానివల్ల ప్రజల్లో భూస్వామ్య వ్యవస్థ అంటే అడపాదడపా వ్యక్తమయ్యే కోపం - క్రోధం అంటుకట్టుకోలేకపోయింది

ఆ కొద్దిపాటి విద్య ప్రసాదించిన శక్తివల్ల బయటి ప్రపంచంలో జరుగుతున్న పరిణామాలను, ఆయా ప్రదేశాల్లో తమతమ దేశ స్వాతంత్ర్యాలకై జరుగుతున్న పోరాటాలను ప్రజలు అవగాహన చేసుకోవటం ఆరంభించారు. పరాయి పాలన తెచ్చిపెడుతున్న అనర్థాలను గ్రహించగల శక్తి ప్రజలకు అలవడసాగింది. ఇతర దేశాల స్వాతంత్ర్య పోరాటాల గాలులు ఇక్కడి నేల పైనా వీచటం ఆరంభించాయి. ప్రజలొక కొత్తగాలి పీలుస్తున్నట్టు భావించారు. దృష్టిలో మార్పు వచ్చింది. అంతవరకూ భూస్వామ్య వ్యవస్థను సమాజపరంగా అర్థం చేసుకోగలిగిన మేరకే ఎదిగినవాళ్లు దానిలోని లోపాలను గమనించటం, అవకాశమున్నంత మేరకు వాటిని ఎత్తిచూపడం వరకొచ్చారు. అంతకు మించి ఆ వ్యవస్థను వ్యతిరేకించగల స్థైర్యంగానీ, ధైర్యంగానీ వారికి అలవడలేదు.

ఈ పై లక్షణాలతో కొత్తగా రూపు కట్టుకొంటున్న బూర్జువాతత్త్వం ప్రజల్లో ఆరంభమైంది. ఈ వర్గంవాళ్ళు భూస్వామ్య వ్యవస్థలోని చెడును ప్రజలకు వివరించేటంత వరకే తమ అభ్యుదయశీలాన్ని ప్రదర్శించ గలుగుతారు.[3] బూర్జువా వ్యవస్థ జనించటానికి ప్రతిబంధకంగా ఉండే ఫ్యూడల్ అంశాలను నిశితంగా పరిశీలించి సవిమర్శకంగా బట్టబయలు చేస్తారు. సాధా

రణంగా పాత సమాజం నుండి కొత్త సమాజం రూపు సంతరించుకుంటున్న తరుణంలో వచ్చిన సాహిత్యానికి అభ్యుదయ శీలం ఉంటుంది. అలాంటి సంధ్యా సమయంలో పుట్టిన సాహిత్యవేత్తలలో నిర్భీకత్వం, నిస్వార్థం ఉంటాయి. సరిగ్గా అటువంటి సమయంలోనే తెలుగు సాహిత్య రంగంలో ఉద్దండులు ఉదయించారు. అలాంటి వారిలో అగ్రశ్రేణి యోధులు కందుకూరి, గురజాడ, గిడుగు.

అయితే బూర్జువా వ్యవస్థ పెంపొందుతున్న కొద్దీ తన పెరుగుదలకు ఆటంకాలుగా ఉన్న ఫ్యూడల్ సమాజ భావాలను తొలగించుకుంటూ అనుకూల మైన అంశాలను మాత్రమే పదిలపర్చుకుంటూ ఉంటుంది. కాలక్రమేణా ఇది కూడా సమాజ పరిణామ దశలో తన అభ్యుదయ పాత్రను కోల్పోతుంది. అప్పుడు సమాజం, సాహిత్యాలలో వచ్చే ఏ కొద్ది మార్పులకైనా మోకాలడ్డ టానికి కూడా యత్నిస్తుంది. ఈ దశలోని సాహిత్యకారులకు అసాధారణ ప్రతిభా వ్యుత్పత్తులుండటం చాలా అవసరం. ఎందుకంటే అటు ఫ్యూడలిజం లోని వైరుధ్యాలనే కాక తమ చుట్టూ ఉన్న బూర్జువా వ్యవస్థలోని వైరు ధ్యాలను కూడా నిశితంగా పరిశీలించి అవగాహన చేసుకోవాల్సి ఉంటుంది. వాటిని సవిమర్శకంగా చూసి, ప్రామాణిక సాహిత్య పునాదులతో దృఢ పర్చు కుంటూ వాస్తవికతను వెల్లడించే లక్షణాలు పుణికి పుచ్చుకొనగలిగి ఉండాలి. యూరప్‌లో 15 - 17 శతాబ్దాల్లో వచ్చిన సాంస్కృతిక ఉద్యమం తర్వాత కలిగిన చైతన్యం ఇక్కడ కూడా ప్రసరించింది. దీన్నే మనం సాంస్కృతిక పునరుజ్జీవనమని 'రినైజాన్స్' అనీ అంటున్నాం. ఇక్కడి తరం ఈ భావాల వల్ల తమ సనాతన హైందవ సంస్కృతి భావాలను కాలదన్ని నూతన భావా లను స్వీకరించాల్సి వచ్చింది. సంఖ్యాపరంగా ఇలాంటివాళ్ళు కొద్దిమందే అయినా వాళ్ల కృషీ - దాని ప్రభావం అపారమైందనే అనాలి. ఇది 19 వ శతాబ్దాని కొచ్చేటప్పటికి మత భావాల్లోనూ, కళాదృష్టిలోనూ సీరసపడి ఊడి గిల పడ్డ జాతికి కొత్త రక్తాన్ని అందించిందనొచ్చు.

ఫ్యూడల్ సంస్కృతి పతనావస్థలో ఉన్న దశకూ బూర్జువా వ్యవస్థ స్థాపన దశకూ మధ్య ప్రపంచ చరిత్రలో ఈ సాంస్కృతిక పునరుజ్జీవనం వచ్చిందన్న విషయం తెల్సిందే. దీనికి విజ్ఞాన శాస్త్ర రంగంలో జరిగిన అనేకానేక పరిశోధనలూ, వాటివల్ల ఆవిష్కృతమైన నూతన విషయాలూ హేతువులు. ఈ తత్వం భౌతికవాద అవగాహనతో సమాజాన్ని అధ్యయనం చేయటానికి పూనుకుంది.4 కనుకనే ఈ లక్షణాలన్నీ నాటి తరంలో గూడు కట్టుకున్నాయి.

ఈ భావాల ప్రతీక రాజా రామమోహనరాయలు (1772-1833) తన ప్రాచీన భాషా పాండిత్యంతోనూ ఉపనిషత్తుల మీద ఉన్న ప్రత్యయంతోనూ ఆంగ్ల విద్య ద్వారానే మన దేశంలోని ఛాందస సనాతనులతో హోరాహోరీగా పోరాటానికి దిగాడు సంప్రదాయవాదులతో ఆ పంథాలోనే తలపడ్డాడు. పునరుజ్జీవన భావాలు ఆయనలో మతం - సమాజాల పట్ల విమర్శనాదృష్టిని కలిగించాయి. ఆ కొత్తచూపుతో భారతజాతిని సంస్కరించాలన్న తలంపుతో రంగంలోకి దూకాడు.

అలాగే దయానంద సరస్వతి (1824 - 1883) స్థాపించిన 'ఆర్య సమాజం' సంస్కరణలను కాలదన్నలేదు. ఆర్యసమాజం (1875) ఆచారాలన్నిటినీ శిరసావహించాలనడానికి వ్యతిరేకం. ఇతర మతాలవాళ్లను తిరిగి హిందూమతంలోకి చేర్చుకోవచ్చంటూ మతాలన్నవి ఉక్కు చట్రాలు కావని వాటి ఇసుక పునాదులను వెల్లడించింది. ఇదీ ఆనాడు భారత జాతికి కొత్త రక్తాన్ని ఎక్కించటానికి కొంత తోడ్పడింది.

విల్ డ్యురాంట్ మాటల్లో చెప్పాలంటే - ఈ దశలోని వ్యక్తుల్లో సామాన్య లక్షణాలు ముఖ్యంగా బౌద్ధిక, మానసిక వ్యక్తిత్వాల (అడాసిటీ) చుట్టూ పరిభ్రమించాయనవచ్చు. నిశితమైన మేధ; కుశాగ్రమైన జాగరూకత, వివిధ విషయాలలో ప్రజ్ఞ; ప్రతి భావాలనూ ముద్రలనూ ఆహ్వానించటం; సౌందర్యారాధన, కీర్తికాంక్ష వంటి లక్షణాలే కాకుండా సంప్రదాయాలను ధిక్కరించటం, నీతులూ ఆంక్షలూ వంటివే కాకుండా చివరకు దేవుడి అస్తిత్వాన్ని శంకించటం లాంటివి కూడా నాటితరం వాళ్ళలో కనిపిస్తాయి.5

ఇలాటి పరిస్థితుల్లోనే కందుకూరి వీరేశలింగం (1848-1919) ఆవిర్భవించాడు. ఏ ఫ్యూడల్ వ్యవస్థనుండి తాను వచ్చాడో దాని మంచి చెడ్డలను రుచి చూశాడు.6 కులమత వ్యవస్థలు ఎలా నిలదొక్కుకున్నాయో గ్రహించాడు దాన్ని ఆశ్రయించుకొని పెరుగుతున్న డంబాచారాలను, వాటి నీడలో బతికే వారి ఆచారాల ఆర్భాటాలనూ చూశాడు. అసహ్యించుకొన్నాడు. తన చుట్టూ ఉన్న సమాజంలోని అవలక్షణాలను ప్రజలకెరుక పరచడానికి సాహిత్యాన్ని వినియోగించాలని తలచాడు.7 పైలక్షణాలవల్ల వీరేశలింగానికి బాధలకు గురవుతున్న ప్రజలపైన క్రమంగా ఒక రకమైన కరుణ కలిగింది. ఆ మానవతావాదమే ఆ కుళ్ళుపైన ఆయనలో ఏహ్యాభావాన్ని కలిగించింది. సంస్కర్తగా తీర్చిదిద్దింది 8

తన సంస్కరణలన్నీ మానవతావాదంనుండే వచ్చాయి కనుక అంతకన్నా, ముందుముందెప్పుడూ ఈ చెడుగులకు ఆదికారణాలైన వర్ణవ్యవస్థపై దెబ్బతియ్యాలనీ

కూలదొయ్యాలని కందుకూరి భావించలేకపోయాడు అయితే విధవా పునర్వివాహం-నాటి హైందవ సనాతనులు గొంతు పిసుక్కునేటంత సంస్కరణగానే మనం భావించాలి. దీనికి వారి వేలితో వారి కంటినే పొడవాలన్న భావంతో వారి శాస్త్రాలనుండే ఉదాహరణలను చూపటానికి యత్నించాడు. శాస్త్రాలు, స్మృతులూ అన్నీ చాతుర్వర్ణాశ్రమ ధర్మాలకు మూలాలు కనుక ఆ పరిధిలోనే కృషి చేయటంవల్ల వర్ణాలను అధిగమించే ప్రయత్నం చెయ్యటానికి తగిన వ్యవధికానీ, పరిణత సమయంకానీ లభించి ఉండకపోవచ్చు.

పండితులచేత తలలూపించుకుంటూ తను చెప్పే విషయాలపై వారికి విశ్వాసం కలిగించడానికే ఆదిలో వీరేశలింగం శ్రమించాడు. సాహిత్యం సంస్కరణకోసమే నన్నదాయన భావన.9 ఫ్యూడల్ వ్యవస్థలోని వైరుధ్యాలను సరిచేయాలన్న దానికన్నా వాటిని ప్రజల దృష్టికి తేవాలన్నదే కందుకూరి ఆకాంక్ష. కనుకనే ప్రజల సమీకరణకు తక్కువ అవకాశం ఉన్న వ్యక్తిగత సాహిత్యరూప ఉద్యమాన్నే చేపట్టాడు. నాడు ప్రజలంటే కేవలం చదువుకున్న వారే. వారి మనసులను తన రచనల ద్వారా ప్రభావితం చేసి అటు సంస్కరణ దిశలోగానీ, ఇటు సాహిత్య దిశలోగానీ మళ్ళించవచ్చని కందుకూరి భావించాడు. విశ్రాంతి ఎరగని పీడడిలా పోరాడాడు. రానున్న తరం మానవులు ఇంతకన్నా ముందుచూపుతో నాటి ఫ్యూడల్ వ్యవస్థను ఛేదించుకుని పోగల దారిని నిర్మించాడు. సాంఘిక విప్లవకర్తగా నిలిచాడు.10

గురజాడ అప్పారావు (1862-1915) కూడా ఇలాటి సామాజిక పరిస్థితులలోనే అవతరించాడు. తొలినాళ్ళలో అప్పారావు కుటుంబం చాలా పేదరికాన్ననుభవించినా మొత్తానికి ఫ్యూడల్ వ్యవస్థలోని మంచినే వీరుఅనుభవించారన వచ్చు. జమీందారుల, రాజాల మధ్య పెరిగారు. ఉద్యోగాలు నిర్వహించారు. ఫ్యూడల్ వ్యవస్థకు ప్రతినిదులైన రాజుల మధ్య తగాదాలూ వైరుధ్యాలనన్నిటినీ చాలా సన్నిహితంగా చూసే అవకాశం గురజాడకు కలిగింది. ఈ అవకాశమే తన చుట్టూ ఉన్న వ్యవస్థ ఇక ఎంతో కాలం ఉండబోదని చీకి చివికి పోతున్నదనీ ఆయన గ్రహించేలా చేసింది. కనుకనే మారుతున్న కాలాన్ని అంచనా వేయగలిగాడు గురజాడ. ఈ అవకాశం కందుకూరికి లభించలేదు. జమీలు జారటం, తగాదాలతో జమీందారులు న్యాయస్థానాల చుట్టూ తిరగడం గమనిస్తూనూ; ఆ వ్యవస్థ ప్రసాదించిన అవలక్షణాలైన పరువుకోసం పాకులాడే తత్వం, బ్రాహ్మణబ్రువుల ఆధిపత్యం; వర్ణ వ్యవస్థ తెచ్చిన నైచ్యాలను క్షణం క్షణం వీక్షిస్తూ ఉండటం చేతనూ వాటిని ఎదిరించాలన్న భావం ఆయనకు కలిగింది.

కందుకూరి నిశితమైన హాస్యంతో ఎదిరించాలనుకున్న సందర్భంలో గురజాడ మెత్తని హాస్యంతో ప్రజల్లో హృదయ పరివర్తన రావాలని ఆశించి సాహిత్యాన్ని సృష్టించాడు. కందుకూరి నాటికి పాదుకొనని అంతర్జాతీయత, గురజాడ ఉద్యమంగా సాహిత్య సృజన చేస్తున్న కాలానికి వేళ్ళూనటం ఆరంభించింది. కందుకూరి కృషి సంస్కరణదిశలో పీఠాధిపతులను కదిలించటంతో ఆరంభిస్తే గురజాడ దాన్ని ఆసరాగా తీసుకుని ప్రజలను పురికొల్పటానికి ఉద్యుక్తుడయ్యాడు. అందుకనే 'నాది ప్రజల ఉద్యమం' అనగలిగిన శక్తి కందుకూరికి లేనిదీ - దక్కనిదీ గురజాడకు దక్కింది.

గురజాడ చిన్నతనం నుండే తనలో సాహిత్యాన్ని నింపుకున్నాడు. గిడుగు రామ్మూర్తీ, గురజాడా కల్సినప్పుడల్లా ఇలాటిఘటనలు పైకొస్తూండేవి. 'మీ పేరేమిటి'లో రామ్మూర్తి పాత్ర గిడుగువాళ్ళబ్బాయే:[11] ఈ హాస్యాన్నే ఆలంబనంగా చేసుకుని కన్యాశుల్కాన్ని తీర్చిదిద్దాడు. సంఘంలోని దురభ్యాసాలు వ్యవస్థను ఎలా చెరుస్తాయో ఇందులో చెప్తాడు. ఒకే సమస్యను ఎవరెవరెలా స్వలాభం కోసం మల్చుకోగలరో తెలిపాడు. ఫ్యూడలిజానికి ప్రతినిధులైన అగ్నిహోత్రావధానులు, రామప్పంతులు వంటివారు తమ కనుకూలంగా సమస్యలను చూడడానికి ప్రయత్నిస్తే కొత్తగా తలెత్తుతున్న బూర్జువా వ్యవస్థకు ప్రతినిధిగా గిరీశం తన ప్రతిష్ట పెంచుకోవటానికీ, లేకపోతే పొట్టకూటికీ దాన్నెలా వినియోగించుకుంటాడో విడమర్చాడు. ఈ రెండు వ్యవస్థలూ ఒకదానికొకటి శత్రువులని రుజువు చేశాడు. రెంటికి చెందిన మనుషులూ ఒకరిని మరొకరు ఏరకంగా దోపిడీ చేసుకుంటారో కూడా వర్ణించి చెప్పాడు. అలాగే మూఢ నమ్మకాలనూ, అప్పటికే బూర్జువా సమాజ లక్షణమైన లంచగొండితనాన్నీ, ఆశ్రిత పక్షపాతాన్నీ కళ్ళముందు నిలిపాడు. పోలీసు వ్యవస్థ ధనవంతుల రక్షణకేనన్న అభిప్రాయాన్నికూడా గురజాడే అందించారు. ఛాందసుల మధ్య ఉంటూ వాళ్ళనెదిరించడంలోనే పూర్తిగా మునిగిన కందుకూరి దృష్టికి ఈ లక్షణాలన్నీ రేఖామాత్రంగానే కనిపించాయి. గురజాడకులా స్పష్టమైన అవగాహన ఆయనకు అందలేదనే అనాలి. కందుకూరి బోధన ఆదేశాత్మకంగా ఉంటే గురజాడది ఉపదేశాత్మకంగా ఉంది. కందుకూరి సంస్కరణోద్యమంవల్ల అనుకోకుండా కొందరు కుహనాసంస్కర్తలు బయలుదేరడంవల్ల జనం కందుకూరిఉద్యమాన్నే శంకించే దశను గురజాడ చాలా సమీపంగాఉండి స్పష్టంగాగమనించాడు. అందుకే సంస్కరణ బలవంతంగా ఉండకూడదని తలచాడు. ప్రజలహృదయాలను మార్చటం అవసరమని భావించి ఆ మనుషులను చెప్పడానికే 'సంస్కర్త హృదయం' రాశాడు.[12]

దేవుని పేరిట ఒరుగుతున్న అన్యాయాలను, మతం పేరిట ప్రజలను పక్కదారి పట్టిస్తున్న సంఘటనలను కందుకూరి తన రచనల్లో విశదంగా - వల్లభాచార్య మతం గూర్చి చేసిన వాటిల్లో వర్ణిస్తూ తీవ్రంగా ఖండిస్తూ నడిచాడు. గురజాడ ఇలా చేస్తూనే మరింత స్పష్టంగా భౌతికవాద దిశగా చూపు సారించాడు. దేశభక్తితో ప్రజలను కదిలించి, అంతకన్నా సమాజానికి అవసరమైన అంతర్జాతీయ దృక్పథాన్ని కూడా పెంచుకోమని ఉద్బోధించాడు. ఇదంతా కాలం మార్పుగా మనం పరిగణించవచ్చు.

కందుకూరి గ్రాంధికం నుండి సరళ గ్రాంధికం మేరకు మారి రచనలకు దారి చూపితే ప్రజల మనస్తత్వం మరింత బాగా తెలిసినవాడు గనుక వస్తున్న మార్పులకు హృదయపూర్వకంగా ఆహ్వానం పలకాలన్న భావంతో గురజాడ వ్యావహారిక భాషను చేపట్టాడు. తన సాహిత్య ఉద్దేశ్యం నిర్ద్వంద్వంగా ప్రజల కొరకేనని భావించాడు. లలితపద విన్యాసంతో హృదయానందకరంగా సున్నితమైన హాస్యాన్ని ఆశ్రయించి వాడుకభాష ద్వారా తన కృషి సాగించాడు.

ఇద్దరూ జీవించిన కాలం ఒకటే కనుక ఆంగ్ల భాషన్నా, ఆ విద్యావ్యాసంగం అన్నా ఇద్దరికీ అభిమానమే. గురజాడ కొంత మమకారాన్ని కూడా ప్రకటించాడు. జమీందారుల దగ్గర నౌకరీ చేస్తున్నా, గ్రంథాల నంకితం ఇస్తున్నా దేశ స్వాతంత్ర్యం కోసం జరుగుతున్న ఉద్యమాలనూ అంతర్జాతీయ రంగంలో వస్తున్న మార్పులనూ గురజాడ అధ్యయనం చేస్తూ అర్థం చేసుకున్నాడు. కనుకనే తను చేస్తున్న పనికీ ఇలాంటి ఉద్యమాలకూ మధ్య వైరుధ్యం ఉన్నా కుమ్మరి పురుగులా మసులుతూ మంచికి ఆవాహన పల్కాడు. పాత కొత్తల మేలు కలయికను ఆశించాడు. పశ్చిమ దేశాల నాగరికత వల్ల అబ్బిన భౌతికవాద శక్తితో శకునాలనూ తోరచుక్కలనూ శాస్త్రీయంగా చూశాడు. గురజాడకు భవిష్యత్తు మీద అచంచలమైన ఆశ ఉంది. సౌజన్యారావు వంటి వాళ్ళు కొందరొస్తారనీ, వాళ్ళు ప్రజల హృదయ పరివర్తనకు కృషి చేసి గిరీశం లాంటి కుహనా అభ్యుదయ వాదుల ఆట కట్టిస్తారని భావించాడు. గురజాడ చూపులో కనబడిన మరో విశేషం ఏమిటంటే దేశానికి ఆర్థిక స్వాతంత్ర్యం రావటం అవసరమన్న భావం. అందుకు ఇతర దేశాలతో వర్తక వాణిజ్యాలు పెంపొందాలన్న ఆకాంక్ష. కనుక ఒక సాహితీ వేత్తగా ప్రజల సమస్యలకు ఆర్థిక సమస్యలను జోడించి చూడటం గురజాడ కబ్బిన విశేషగుణంగా భావించాలి.

మనుషుల భావాలలో కుళ్ళును, గుడ్డి ఆచారాల వెనకున్న అసంబద్ధతను, ఘోరాలనూ నిర్దాక్షిణ్యంగా తుడిచేస్తూ కందుకూరి ముందడుగేస్తుంటే, దీనికి బాసటగా అంతర్జాతీయ దృష్టితోనూ ఆర్థిక పునాదితోనూ సమస్యలను సాహిత్యంలో ప్రతిబింబిస్తూ గురజాడ కలిశాడు. అక్షరాస్యతే అడుగంటి పోతున్న సమాజంలో విద్యావంతులను శాసనం చెయ్యంది ముందడుగు వెయ్యలేమనీ రచనలూ, రచయితలూ అందుకు కృషిచేయాలనీ, కనుక వారి భాష ప్రజల భాష కానంత వరకూ అది జరగదనీ గిడుగు (1863 - 1940) భావించాడు. విద్యావంతుల మనుకుంటూ గిరిగీసుకుని రాస్తున్న వాళ్ళపై పిచ్చుకపిడుగులా పడ్డూ కందుకూరి, గురజాడలకు సైదోడయ్యాడు.

పతనం కాబోతున్న అనాటి వ్యవస్థకు చెందినవారే ఈ ముగ్గురు. అప్పటికి కందుకూరి సంస్కరణ వాదం, వ్యావహారిక భాషతో కూడిన గురజాడ సంస్కరణ వాదం దేశంలో ప్రజలను ఆకట్టుకుంటున్నాయి. కందుకూరి తరహాను కొందరు ఛాందసులు ద్వేషించినా గురజాడ పద్ధతిని ప్రజలు మెచ్చుకోవటం గిడుగు గమనించాడు. విదేశాలలోని భాషోద్యమాలను ఆకళింపు చేసుకున్నాడు. వారితో ప్రత్యక్షంగానూ ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా పరోక్షంగానూ సంబంధాలు పెంచుకున్నాడు. ఒక ఉద్యమం వ్యాప్తి చెందాలంటే ప్రజలపాత్ర ప్రధానమైందని భావించాడు. ప్రజల సహాయం పూర్తిగా పొందకుండా పాండిత్య ప్రకటనతో పండితులను తానొక్కడే ఎదుర్కొన్న కందుకూరినీ, ప్రజల ఉద్యమాన్ని పెంచాలన్న ఆకాంక్షతో ప్రజలలో తక్కువ శాతంగా ఉన్న పండితులను లెక్క చెయ్యక తన సాహిత్యం ద్వారా పోరాడుతున్న గురజాడనూ గిడుగు సవిమర్శకంగా చూశారు. అంత వరకూ జరుగుతున్న ఉద్యమాలలోని ప్రధానమైన లోపం ప్రజల పాత్ర మృగ్యం కావడమేననీ; వారికర్థం కానిది సఫలం కాదనీ భావించాడు. అందుకే వ్యావహారిక భాషోద్యమాన్ని చేపట్టాడు. పండితులు మొదటి నుండీ సంస్కరణకు వ్యతిరేకులే. అది సమాజ సంస్కరణ అయినా, భాషా సంస్కరణ అయినా ఫ్యూడలిజం ప్రతినిధులుగా తాము వాటిని అడ్డుకోవటానికే నాటి పండితులు నిశ్చయించుకున్నారు

పండితుల ఆటకట్టించడానికీ, ప్రజల నుద్రేక పరచడానికీ భాషోద్యమం తప్ప ఆ దశలో గిడుగుకు మరోటి కనిపించలేదు. మరి పండితులనోరు మూయించాలంటే వారినిమించిన పాండిత్యం కావాలి. కావ్యపరిచయం, శాస్త్రాలతో సంబంధం అవసరం. అందుకే శాస్త్రాలన్నింటినీ ఆపోశనపట్టాడు. ప్రాచీన కావ్యాల నుండి ఉదాహరణలు చూపుతూ నాడు పండితులుగా చలా

పుణి అవుతున్నవారి రచనలనుండే గ్రాంథికేతరాలను చూపుతూ ఏ పండితునికీ గ్రాంథిక రచన రాదనీ కనుక వ్యావహారిక భాషనే ఉపయోగించమనీ హెచ్చరించాడు. పండితుల నెత్తిన అశనిపాతంలా పడ్డాడు. భాషాపరంగా దేశం అల్లకల్లోల స్థితిలో ఉంది. రాజాశ్రయం, జమీందారుల ఆశ్రయం పొందిన గ్రాంథిక భాషావాదులు గిడుగుకు ఎదుర్కోనారంభించారు. వారిని ఓడించాలన్న ఊపులో ప్రజలను కొంత మర్చిపోయి పండితులతో వారితో సమాన స్థాయిలో చర్చించటం మొదలుపెట్టాడు. పండిత భిషక్కుల భాషా భేషజం బయటపెట్టాడు. భాషాశాస్త్రకారునిగా పండితులపైనా, వారి గ్రాంథిక వాదంపైనా చండపరశువు నెత్తాడు. సమాజంలోని విభిన్న సమస్యలపై చూపున్నా ప్రధానంగా ప్రజలకు సన్నిహిత సంబంధం ఉన్న ఒకే ఒక్క భాషా సంస్కరణలో మునిగిపోయాడు. ఇక ప్రజలు కూడా భాషా సంస్కరణ జరిగిన నాడే జాతి, సాహిత్యం వేయి ముఖాలుగా విస్తరిస్తుందని భావించి గిడుగుకు అండగా నిలిచారు. ఈ విధంగా గిడుగు భాషా సంస్కరణోద్యమం రూపంలో ఫ్యూడలిజం మీద తిరుగుబాటు చేశాడు. అయితే కందుకూరి, గురజాడలలాగా గిడుగు సృజనాత్మక సాహిత్యాన్ని సృష్టించలేదు. కేవలం ఒక శాస్త్రకారుడుగా వ్యావహారిక భాషా ధర్మ రక్షణకు నిలబడ్డాడు.

ఇలాంటి పూర్వరంగం సిద్ధం అయిన దశలో తాపీ ధర్మారావు ప్రవేశించాడు. తెలుగునాడులో ఫ్యూడలిజం అవశేషాలు తన అంతిమ ఘడియల కోసం ఎదురుచూస్తున్నాయి. కందుకూరి, గురజాడ, గిడుగుల ఉద్యమాలు ప్రజలను చైతన్యవంతం చేస్తున్నాయి. హేతువాదం ముమ్మరంగా ప్రవేశిస్తున్నది. పాత వ్యవస్థ పోయి కొత్త వ్యవస్థ రావాలని ప్రజలు ఎదురు చూస్తున్నారు. చివికిపోయిన వ్యవస్థలోని వాళ్ళకు రూపుకడుతున్న బూర్జువా వ్యవస్థ మీద గట్టి నమ్మకం ఇంకా ఏర్పడలేదు. రెండు వ్యవస్థలూ పరస్పరం అనుమానంతో అవకాశం అందినప్పుడల్లా తమతమ రంగాల్లో దోపిడీ చేసుకుంటున్నాయి.

ధర్మారావు పాత వ్యవస్థకు చెందిన మనిషి. పైకివస్తున్న బూర్జువా సమాజంపైనా, వాటి లక్షణాలపైనా నమ్మకం కలగలేదు. అందుకే సాహిత్యరంగంలో వీరు సంప్రదాయవాదిగా అడుగుపెట్టి గ్రాంథిక భాషావాదిగా గిడుగును అడ్డుకున్నాడు. వ్యావహారిక భాషను రచనల్లో వాడినందుకు ఒక నాటకంలో గురజాడను అవహేళన చేశాడు. తాను సనాతనాచారాల కుటుంబంలో నుండి వచ్చినందువల్ల జమీందారుల దగ్గర ఉద్యోగం చేస్తున్న కారణంగానూ; వారిమీదా, వారు అంతవరకూ రక్షిస్తున్నారని అనుకుంటున్న

ఫ్యూడల్ వ్యవస్థ మీదా ఆ సంబంధమైన సాహిత్యంమీదా, సహజంగానే తాపీ అభిమానం ప్రకటించాడు.

అయితే దేశంలో ఆ నాటికే ప్రబలిన సునిశిత విమర్శనాత్మక దృష్టి, హేతువాద భౌతికవాదాల ప్రభంజనం, బ్రాహ్మణ-బ్రాహ్మణేతర ఉద్యమాల ఉధృతి, అతివాద మితవాద రాజకీయాలూ ఇవన్నీ తాపీ వారిపై బలమైన ప్రభావాన్ని కలిగించాయి. ముఖ్యంగా బ్రాహ్మణేతర ఉద్యమం, స్వాభిమాన ఉద్యమాలు వీరిని కొంత కాలం నడిపించాయనవచ్చు. ప్రాచీన సాహిత్యం, సంస్కృతులను గూర్చి అంతవరకూ సాంప్రదాయికంగా వస్తున్న ఆలోచనలకు భిన్నమైన దిశకు వీరు తమ దృష్టిని సారించేలా చేశాయి.

దానితో వారిలో బలమైన ఆత్మవిమర్శ ఆరంభమైంది అంతవరకూ పాతవ్యవస్థకు లక్షణమైన గ్రాంధికవాదంపై ఎంత పట్టుదల చూపేవారో, పాత సంస్కృతిపై ఎంత అబిమానం ప్రకటించేవారో అదంతా బీటలు వారింది. స్వతహాగా శాస్త్రీయ దృక్పథం కలిగినవారు కనక పాత వ్యవస్థ మారబోతున్న సూచనను వేగంగా పసిగట్టాడు. రానున్న లోకాన్ని ఊహించ గలిగాడు. బూర్జువా వర్గం నిలదొక్కుకోవడం ధర్మారావు చూశాడు.

ధర్మారావు, ఫ్యూడల్ సంబంధాలలోని వైరుధ్యాలనూ చెడుగులనూ, అప్పుడే పుట్టి బట్టకట్టుకుంటున్న బూర్జువా వ్యవస్థలోని అవకాశవాదాన్నీ, వైరుధ్యాలనూ, లోపాలనూ, స్పష్టంగా చూడగలిగాడు. దీనికి కారణం వారు పుట్టిన, జీవించిన నాటి పరిస్థితులే.

అందుకే ఆ వ్యవస్థలు ఏర్పరచిన సాహిత్య, సాంస్కృతిక విలువలను సమూలంగా మార్చాలన్న ఆలోచన వీరికి వచ్చింది. దేవాలయాల మీది శిల్పాలను, ఇనపకచ్చడాలను, పెళ్ళితంతునూ శాస్త్రీయ దృష్టితో పరిశీలించారు. కందుకూరి, గురజాడలు వివాహ వ్యవస్థలోని చెడుగులను ఎత్తిచూపుతూ సంస్కరణలకు ప్రయత్నిస్తే తాపీ ధర్మారావు తన నాటికి స్థిరపడ్డ స్వాభిమాన ఉద్యమ దృష్టితో పూజారులనూ, పురోహితులనూ, పెళ్ళి వ్యవస్థలనూ నిలేసి ప్రశ్నించి కూలదొయ్యడానికే యత్నించాడు. దేవుని అస్తిత్వాన్నే శంకించాడు.

తన వ్యావహారిక భాషోద్యమం సంపూర్ణంగా సత్ఫలితాలనందివ్వటం గిడుగు చూడలేకపోయాడు. 1940లో మరణించాడు. అయితే తాపీ వారిలాంటి పండితుడు తన ఉద్యమానికి లభించినందుకు గర్వపడుతూ మిత్రులతో అదే మాట అన్నాడు. భాషారంగంలో ప్రాచీన రాచరిక అవశేషాలుగా ఉన్న అరసున్న, బండిరాలను వదల్చుకోవాలనీ, చిన్నయ సూరి తెలుగుకు న్యాయం

కన్నా అన్యాయమే ఎక్కువ చేశాడనీ నమ్మి ధర్మారావు 'సూరి పరణం' రాశాడు. పాత పాళీ విసర్జించి కొత్త పాళీ స్వీకరించాడు.

'కొండెగాడు' కరపత్రాలతో ప్రజలకతి సన్నిహితమైన పత్రికారంగంలో ప్రవేశించి సమదర్శిని, జనవాణి, రాగడా పత్రికల ద్వారా సంఘ సంస్కరణాన్నీ, వ్యావహారిక భాషోద్యమాన్నీ అతి చాకచక్యంతోనూ, ఉత్సాహోద్రేకాలతోనూ నిర్వహించాడు.

రచయితలు తమ సాహిత్యంలో సవిమర్శనాత్మక వాస్తవికతను ప్రతిబింబించాలి. ప్రాచీన సాహిత్యాన్ని హేతువాద కరదీపిక సహాయంతో అధ్యయనం చెయ్యాలి. ఎలా చెయ్యాలో ధర్మారావు విజయ విలాసానికి హృదయోల్లాస వ్యాఖ్య రాసీ, పారిజాతాపహరణానికి భావ ప్రకాశికను రాసీ చూపించాడు. పద్దెనిమిదో ఏటి నుండీ విజయ విలాసం మీద అభిమానం పెంచుకుని మొదటి సారిగా 'విలాసార్జునం' నాటకం రాసి, తదాది నుండి పదాలకు అర్థాలు చెప్పడంలోనూ, అన్వయాలను కుదర్చడంలోనూ దాదాపు జీవితాంతం శ్రమించాడు. గతంలో పండితుల వ్యాఖ్యానాల్లోని తప్పులు చూపి ఆదర్శ వ్యాఖ్యానాన్ని అందించాడు. ప్రాచీన సాహిత్యంలోని అభ్యుదయశీలాన్ని వెతికి పట్టాలంటే గట్టి పునాది ఉన్న ధర్మారావుకే అది సాధ్యమైందనవచ్చు.

తెలుగు దేశంలో వచ్చిన అన్ని రాజకీయ సాహిత్య ఉద్యమాలనూ అధ్యయనం చేసిన వ్యక్తి ధర్మారావు. ఏటికి ఒక గట్టు నుండి మరో గట్టుకు కాలాన్ననుసరించి దూకినవాడు ఏ ఉద్యమంలో పని చేసినా తాను నమ్మిన దాన్ని ఒక ప్రచారకుడిగా జనంలోకి తీసుకెళ్ళటానికి శ్రమించాడు. అనేక ఆటుపోట్లకు గురయ్యాడు. చివరకు తెలుగు చలన చిత్ర రంగంలో కూడా మాలపిల్ల, రైతుబిడ్డ (1938 - 1939) లాంటి చిత్రాల నుంచి భీష్మ (1963) వరకూ తన ముద్రను బలంగా నాటాడు ధర్మారావు.

అభ్యుదయ రచయితల ఉద్యమంలాంటి వామపక్ష సాహిత్య ఉద్యమాల నుండి, వామపక్ష రాజకీయ పక్షాలవరకూ ఏది ప్రజల భావాలను ప్రతిబింబిస్తూ వారి ఉన్నతికి కృషి చేస్తుందని నమ్మాడో వాటితో ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ధర్మారావు సంబంధాలుంచుకున్నాడు.

ఇంతటి వైవిధ్యాలతో, విశేషాంశాలతో కూడుకున్న తాపీ ధర్మారావు జీవితాన్నీ, రచనల్నీ పైపైన చూస్తే పరస్పర వైరుధ్యం గోచరిస్తుంది. కనుకనే సన్నిహితంగా ఆయా సామాజిక పరిస్థితులూ ఉద్యమాల పూర్వరంగాలలో శాస్త్రీయంగా అధ్యయనం చేయటం అవసరం. అలా చేసినప్పుడే తాపీ వారిపై

పడ్డ ప్రభావాలు వారిని ఎలా మలిచాయో తెలుసుకోవచ్చు. వీరి ఉద్యమాల ప్రభావం ఆయా రంగాలలో ఎంతవరకు ఉందో అంచనా వేయగలం.

ఏది ఏమైనా కందుకూరి, గురజాడ, గిడుగు పిడుగుల ఉద్యమ పతాకాన్ని మరింత ముందుకు, జనంలోకి తీసుకెళ్ళిన వ్యక్తుల్లో తాపీ ధర్మారావు పేరు ముందుంటుందన్నది సత్యం. ఇది వారిని చక్కగా అధ్యయనం చేసిన వారికే గోచరిస్తుంది. ఈ దారిలో, ధర్మారావు జీవితాన్నీ రచనలనూ పరిశీలించిన ప్రయత్నమే ఈ పరిశోధన వ్యాసానికి పునాది.

## ముమ్మొనవాలు - సూచికలు


1. కె.వి. రమణారెడ్డి మహోదయం, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1969, పేజీ 24.
2. కె.వి. రమణారెడ్డి, మహోదయం, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 1969 పేజి 25. ''ఈ విషయాన్ని కాంగ్రెస్ నిర్మాతల్లో ఒకరైన సురేంద్రనాథ్ బెనర్జీ 'ఎ నేషన్ ఇన్ ది మేకింగ్' అన్న పుస్తకంలో వివరిస్తాడు.''
3. సంపాదకులు యం. రోసెన్థాల్, పి. యుడిన్, ఎ డిక్షనరీ ఆఫ్ పిలాసఫీ, ప్రోగ్రెస్ పబ్లిషర్స్, మాస్కో 1967.
4. సంపాదకులు యం. రోసెన్థాల్, పి. యుడిన్, ఎ డిక్షనరీ ఆఫ్ ఫిలాసఫీ, ప్రోగ్రెస్ పబ్లిషర్స్, మాస్కో 1967.
5. వి.ఆర్ నార్ల, గురజాడ, సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ 1979, పేజి 81.
6. కొడవటిగంటి కుటుంబరావు, వీరేశలింగం స్వీయచరిత్ర సంగ్రహం, నేషనల్ బుక్ ట్రస్ట్, న్యూఢిల్లీ 1980 పీఠిక. ''నిజానికి వీరేశలింగం కుళ్ళిపోయిన సమాజం మీదా కుళ్ళు సంస్కారం మీదా ధ్వజమెత్తడానికి పూర్వం, ఆ సంఘానికి సంస్కృతికి చెందిన కుళ్ళులోనే జీవించాడు.''
7. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన, హైదరాబాద్ 1972 పేజి 368.
8. వి.ఆర్. నార్ల, వీరేశలింగం, సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ 1968, పేజి 10. 'కేవలం పుస్తకాల ప్రచురణవల్ల లాభంలేదని, ఏదిప్రధానం అంటే-ధైర్యం-అదీ మనం నిజంఅని నమ్మిన విషయాలను ఆచరణలో పెట్టేది-కావాలి''అని తనడైరీల్లో రాసుకున్నారు వీరేశలింగం.
9. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన, హైదరాబాద్, 1972 పేజి 13
10. వి.ఆర్. నార్ల వీరేశలింగం, సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, పేజి 10. ''వీరేశలింగంగారే పుట్టకపోతే, ఆంధ్రదేశం, ఆంధ్ర ప్రజలూ నేడు ఈ స్థితిలో ఉండేవారు కాదు. ఆయన వాళ్ళను చైతన్యవంతం చేశారు. ఆయన అసత్యాన్ని ఎదిరించి పోరాడారు.'' వీరేశలింగం గురించి రాజాజీ చెప్పిన మాటలివి.
11. కె.వి రమణారెడ్డి, మహోదయం, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1969 పేజి 81.
12. గురజాడ అప్పారావు, ఆణిముత్యాలు, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1963.

# 2

# తొలినాళ్ళ తొలిచాళ్ళు

## 1887 - 1911

ఉగ్గ కాఫీతో పెరిగి పెద్దయిన ధర్మారావుచేత ఎవరైనా ఏ పనైనా చేయించుకోవాలంటే కాఫీ ఆశ చూపిస్తే చాలు” అని అనటం ధర్మారావు పరిచయస్థుల మధ్య నలిగే నానుడి. నిజమే మరి. అప్పుడు ధర్మారావుకు రెండేళ్ళు. పాలకు గోలెత్తి ఏడుస్తుంటే ఇంట్లో వంటమనిషి పాలకోసం వెతికితే పాలు దొరకలేదు. ఇన్ని కాఫీ నీళ్ళే ఉగ్గుగిన్నెతో పట్టింది. అప్పటి నుండే ధర్మారావు కాఫీని వదల్లేకపోయాడు. తిండన్నా మానుకోగలడుగాని, కాఫీ లేకుంటే అవస్థపడిపోయేవాడు. అందరూ ఆయన్ని ‘ఏమండీ మీ యింటిపేరు తాపీవారా, కాఫీవారా?’ అని అడిగేవరకూ వెళ్ళింది వీరికి అలవాటు.

సందర్భం వచ్చింది కనక చెప్పాలి. ధర్మారావు ఇంటిపేరు తాపీవారూ కాదు, కాఫీవారూ కాదు. బండారువారు. ధర్మారావు పూర్వీకులు చాలామంది సైన్యంలో పనిచేశారట. మామూలుగా బరంపురం శ్రీకాకుళం ప్రాంతాల్లో చాలామంది ముఖ్యంగా వెలమ, తెలగ కులాలవారు సైన్యంలో చేరి బర్మా, రంగూన్ వెళ్ళేవారు. ఆ ఉద్యోగం ముగిసిన తర్వాత స్వస్థానం వచ్చి అనేక వృత్తుల్లో స్థిరపడుతూండటం ఆనవాయితీ. అలాగే వీరి పూర్వీకులూ సైన్యంలో చేరి ఎక్కడ ఏ భాండాగారానికో కాపలా వుండి ఉండొచ్చు. మనలో ఇంటి పేర్లు వ్యక్తుల ననుసరించిగానీ, గ్రామాల ననుసరించిగానీ, పౌరుషకార్యాల ననుసరించిగానీ ఏర్పడుతూంటాయి. అలాగే వీరింటిపేరు కూడా భండాగారం

రక్షకులుగా ఉండేవాళ్ళు కనుక 'ఖండారు' అని వచ్చి ఉండవచ్చు. అదేఆనోటా ఈనోటాపడి 'బండారు'గా మారించనటంలో అనుమానం ఉండనక్కరలేదు.

బండారువారి వంశంలో లక్ష్మన్న అనే ఆయన సైనికోద్యోగంనుండి వచ్చి శ్రీకాకుళంలో తాపీపని చేస్తూ కాలంగడుపుతూండేవాడు. చాలా చక్కని పనిమంతుడు. అందరూ ఆయన్ని తాపీ లక్ష్మయ్య అని పిలుస్తూండే వాళ్ళు. ఆయన కొక కొడుకు. ఆ కొడుక్కి ఒక కొడుకు పుట్టాడు. లక్ష్మయ్యకు మనుమడు పుట్టిన తర్వాత కొడుకూ కోడలు చనిపోయారు అప్పటివరకూ ఆ వంశంలో ఒకే కొడుకు పుట్టేవాడన్న నమ్మకం ఉండేది. తల్లిదండ్రులు చనిపోయిన ఆ కుర్రవాడు తాత లక్ష్మయ్యదగ్గిరే శ్రీకాకుళంలో పెరుగుతూండేవాడు. అతడి పేరు అప్పన్న.

లక్ష్మయ్యకు తన మనుమణ్ణి బాగా చదివించాలన్న ఆశ ఉండేది. కానీ అప్పన్నకు అయిదు సంవత్సరాల వయస్సప్పుడే లక్ష్మయ్య చనిపోయాడు. లక్ష్మయ్య భార్యకు అప్పన్న పోషణభారమంతా నెత్తినేసుకోవాల్సి వచ్చింది. ఈ అప్పన్నని శ్రీకాకుళం బళ్ళో వేసినప్పుడు ఇతని పేరు తాపీ లక్ష్మయ్య మనుమడు అప్పన్న అని రాశారు. అప్పటినుండీ వీరింటిపేరు 'బండారు' మరుగున పడి 'తాపీ' అయింది.1 అప్పన్న మెట్రిక్యులేషన్ శ్రీకాకుళంలో పూర్తిచేసి మద్రాసులో డాక్టరు చదివాడు. అప్పుడు దాన్ని ఎల్ ఎం. పి అనేవారు. అప్పన్న చాలా తెలివైనవాడు గొప్ప పేరుప్రతిష్ఠంతో పరీక్షలో ఉత్తీర్ణులై శ్రీకాకుళానికే డాక్టరుగా వచ్చాడు. వేషభాషలన్నీ ఇంగ్లీషు తరహాలో ఉండేవి. ఆచారాలూ, అలవాట్లూ దానికి అనుగుణంగా సాగుతుండేవి. వీరు చాలా సరదా పురుషులని ప్రతీతి. వెలచీ, పానం చాలా ప్రియతమాలు. సంగీతంలో ప్రవేశముండి పిడేలు వాయిస్తుండేవాడు. ఇల్లు ఎప్పుడూ సాని మేళాలూ, పాట కచ్చేరీలూ, భజనలూ, గణపతి నవరాత్రులతో నిండుగా ఉండేది వచ్చేజనం పోయేజనంతో అది ఓ సత్రం.

అప్పన్న భార్య నర్సమ్మ. భయం, భక్తి కలిగిన వ్యక్తి. దేవుళ్లకు నిత్య నైవేద్యాలు పెట్టే మనిషి. ధర్మారావు మాటల్లో "పూజలు ముందు పుట్టి మా అమ్మగారు తరువాత పుట్టారు." ఏదో కూడబలుక్కుంటూ తెలుగు చదవటం వచ్చినామె.

ఈ అప్పన్న దంపతులకు 1887 వ సంవత్సరం సెప్టెంబరు 19వ తేదీన ధర్మారావు పుట్టాడు. అప్పన్న అప్పుడు బరంపురంలో డాక్టరుగా ఉంటూండేవాడు అమృతహస్తులని ప్రతీతి. వీరికి ముగ్గురు కొడుకులూ ఇద్దరు కుమార్తెలూ. ధర్మారావుకన్నా నరసింగరావు రెండేళ్ళు పెద్ద. ధర్మారావు

తర్వాత తులసీరావు, వెంకట నరసమ్మ, తిరుపతమ్మలు తమ్ముడూ చెల్లెళ్లూనూ చిన్నప్పుడు ధర్మారావును చూసినవాళ్ళు అతని ముఖం 'డిల్లీపాచ్చా'2 ముఖంలా ఉండేదని అనేవాళ్ళట. అదే క్రమంగా ధర్మారావుని చాలా కాలం పరకూ 'ఢిల్లీరావని' పిలవటానికి ఆస్కారమైంది. చదువులకు విజయనగరం వదిలేటంతవరకూ వీరి పేరు 'ఢిల్లీరావనే'.

ధర్మారావు విద్యాభ్యాసంలో విజయనగరానికి చాలా ప్రాధాన్యం ఉంది. అది విజయనగరం అవునోకాదో కాని "విద్యల్ నగరం" మాత్రం అవును. అప్పన్న వృత్తిరీత్యా - బొంబాయిలో (ప్లేగు వచ్చిన కాలంలో) పనిచేయటం నుండి, ఇప్పటి ఒరియా ప్రాంతాలలో అనేకచోట్లా, శ్రీకాకుళం విజయనగరాల్లోనూ ఉద్యోగాలు చేశాడు తల్లి నరసమ్మగారి నీడనుంటూ ధర్మారావు చదువు సాగించాడు.

ధర్మారావు తెలుగు సాహిత్య ప్రపంచానికి కవిగా, రచయితగా, వ్యాఖ్యాతగా, పరిష్కర్తగా, పండితునిగానే తెలుసు. కానీ వీరు లెక్కల విద్యార్థి-లెక్కలు చేస్తూ నిద్రాహారాలు మరిచిపోయేవాడు. విజయనగరంలో 4, 5 ఫారాలు చదువుతున్నప్పుడే తనకి లెక్కలు ముక్కు కంటుకున్నాయంటాడు ధర్మారావు విజయనగరం రిప్పన్ స్కూలులో హెడ్‌మాస్టర్ పీసపాటి వెంకట కృష్ణయ్య ఇంగ్లీషూ, వెలుటూరి లక్ష్మాజీ తెలుగూ, ఒంగోలు పట్టాభిరామయ్య సైన్సూ, మాగూరు రామదాసు పంతులు లెక్కలూ చెప్తూండేవారు కొచవంటి నరసింహంగారు కూడా లెక్కలకు వస్తూండేవారు

ముఖ్యంగా రామదాసు అధ్యాపకం ధర్మారావుకు బాగా నచ్చేది. రామదాసు కూడా లెక్కలు చేయించటంలో వీరిని రెచ్చిస్తూ ఉత్సాహపరుస్తుండేవాడు. కొచవంటి నరసింహం కూడా కష్టమైన లెక్కలు విసుర్తూ చేసింతర్వాత బహుమతులిస్తూ ప్రోత్సాహపరిచేవాడు. ఈ ఉత్సాహం ధర్మారావులో ఎంత వరకూ పెరిగిందంటే ఇంట్లో కాగితాలూ గోడలూ అన్నీ లెక్కలతో నింపేవాడు.

1903లో మెట్రిక్ పరీక్ష కెళ్ళాలి. అందుకోసం రెండు రోజులు తిండీ తిప్పలూ మాని మేడమీద కూర్చుని లెక్కలు చేస్తూండటంతో నీరసించి గుండెనొప్పి వచ్చింది. స్మారకం తప్పి, మెలికలు తిరుగుతూ నేలమీద పడి దొర్లటం ఆరంభించాడు. ఏవో మందులూ సూదిమందులతో తగ్గించారు కానీ ధర్మారావును ఆ సంవత్సరం పరీక్షకు వెళ్ళనివ్వలేదు. తర్వాతి సంవత్సరం 1904లో పరీక్షకెళ్ళి ఫస్టున పాసయ్యారు. ఈ లెక్కల పిపాస చదువు ముగిసేంతవరకూ, ఆ తర్వాత అనేక ఘట్టాల్లో "నన్ను నడపించింపంటాడు"



1. ధర్మారావు తల్లిదండ్రులు - నరసమ్మ, డా ॥ అప్పన్న.




2 బరంపురంలో ధర్మారావు టీచరుగా పనిచేసిన కల్లికోట కళాశాల భవనాలు. 1906



T. J. Swamy

శ్రీ

“వేగుంజుక్క” గ్రంథమాల

యొక్క

రెండవ మణి

విలాసార్జునము.

అను ఆరంకముల నాటకము.

మొదటి కూర్పు.

బరంపురము.

శ్రీ స్వేచ్ఛావతీ ముద్రాక్షరశాలలో

ముద్రింపబడినది.

3 విలాసార్జునము - ప్రతి ముఖపత్రం : 1906 - 1914



4. రవీంద్రుడితో కవితా సమితి సభ్యులు - విశాఖ. 1933

ధర్మారావు. ఇదే ప్రతీ విషయం ఎంతో చక్కగా అటూ ఇటూ పొల్లుపోకుండా సరిగా అంచనా వెయ్యటానికి వారికి దోహదపడి వుండవచ్చు. లెక్కల తార్కికజ్ఞానం తర్వాత తర్వాత సామాన్య తార్కిక జ్ఞానంగా పరిణమించి ఉంటుంది.

ధర్మారావు చుట్టూ ఎప్పుడూ అనేకమంది మిత్రులుంటూండేవాళ్ళు. పిల్లందరూ కల్సి ఒక డిబేటింగ్ సొసైటీ పెట్టి అనేక అభ్యుదయ అంశాలూ-సమస్యలూ చర్చిస్తుండేవాళ్ళు. ధర్మారావుకు డ్రాయింగ్ టీచర్ మందపాక కొండ్రావు పుణ్యాన బొమ్మలు బాగా గియ్యటం వచ్చింది. దీనివల్ల మిత్రులందరూ కలిసి వేసే నాటకాలకు వెనక, పక్కతెరలను ధర్మారావు స్వయంగా రంగుల్లో వేసేవాడు. నాటక రచనా, నిర్వహణా, వేషధారణా ధర్మారావే చేస్తూ నాటక సమాజాన్ని నడుపుతూ వాటికి చిన్న చిన్న టిక్కెట్లనూ అమ్ముతూండేవాడు. ఇవన్నీ వీరికి సినిమారంగంలో తొలి రచయితల్లో ఒకరుగా ప్రవేశించినప్పుడు బాగా సాయపడి వుండవచ్చు. కొండ్రావు మాజిక్ కూడా కొంత నేర్చినవాడు. ధర్మారావుకు అందులో కూడా ఆసక్తి పెరిగి పుస్తకాలు తెప్పించి చదివి కాగితాల్తో బూరెలు వండటం, టేబుల్‌మీద కానులను నడిపించటం లాంటివన్నీ చేసేవాడు. ఇలాటి తమాషాలన్నీ తాను మేస్టారుగిరీ చేసే కాలంలో బాగా సాయపడ్డాయంటాడు ధర్మారావు.

ఆ రోజుల్లో కోడి రామ్మూర్తి పేరు సర్కస్ రంగంలో మారుమోగిపోతుండేది. వారిదీ విజయనగర ప్రాంతమే. ధర్మారావుకు ఆయన కసరత్తు మేస్టారు. అప్పుడప్పుడే తన సర్కస్ కంపెనీని స్థిరీకరించుకుంటున్నాడు. ఆ రామ్మూర్తి ఫీట్లలో కొన్ని ధర్మారావు మిత్రబృందం వీరింట్లోనే చిన్న పిల్లలకు చేసి చూపుతుండేది.

ధర్మారావు మిత్రబృందంలో బచ్చు జగన్నాథదాసు, బులుసు వెంకటరమణయ్య, రెంటాల జోగారావు తదితరులెందరో ఉండేవారు. మొత్తానికి ధర్మారావు సర్వతోముఖ వికాసానికి ఆనాటి విజయనగరం పునాదులేసింది.

ధర్మారావు దూరపు బంధువులూ, విజయనగరం సంస్థానంలో 'హస్తబలి'[3] (ఏనుగుల శాల) అధికారిగా ఉన్న గోలకొండ అప్పడు మనుమరాలూ, కోరాడ ఆదెమ్మగారి కుమార్తె అన్నపూర్ణమ్మతో ధర్మారావుగారికి 1904లో వివాహమైంది. అప్పటికి ధర్మారావు మెట్రిక్ పాసయ్యాడు అన్నపూర్ణమ్మకు కొద్దిపాటి చదువే వచ్చు. అప్పటికే ధర్మారావు అన్నకు పెళ్ళయి విశాఖపట్నంలో డాక్టర్ చదువుకెళ్ళాడు

ధర్మారావు విజయనగరంలో చదువు కాగానే ఎఫ్. ఎ. చదవటానికి పర్లాకిమిడి వెళ్ళాడు. అది ఆ రాజుగారి పోషణలో నడుస్తున్న కాలేజి అక్కడ ప్రిన్సిపాల్ మంగు శ్రీనివాసరావు, ఇంగ్లీషు ఉపన్యాసకుడు ఎడ్మండ్ కాడ్లెర్, వైస్ ప్రిన్సిపాల్ - చరిత్ర ఉపన్యాసకులుగా గిడుగు రామ్మూర్తి, తెలుగు అధ్యాపకులు బంకుపల్లి మల్లయ్యశాస్త్రి. వీరందరూ అఖండ మేధావులు.

గిడుగు వారప్పటికి వ్యావహారిక భాషా ఉద్యమాన్ని ఊహించనుకూడా లేదు. కానీ చక్కని అధ్యాపకులుగా ప్రసిద్ధి. వీరి ప్రభావం ధర్మారావును ఎన్నో విధాల పైకి తెచ్చింది. ప్రతి గ్రంధాన్నీ క్షుణ్ణంగా నిశితంగా చదవాలన్న అభిప్రాయం, తెలుగు ప్రబంధాల మీద తొలిసారిగా దృష్టి పడటం, అందులోనూ విజయవిలాసం మనసుకెక్కటం వీరి ప్రభావంవల్లనే కావచ్చు. పట్టిన పట్టు విడువరాదన్న సూత్రం గిడుగు దగ్గరే ధర్మారావు నేర్చుకున్నాడు. ఇదే వారిని తాను ఏ ఉద్యమంలో ఉన్నా కొనముట్టేదాకా నిరంతర కృషి సాగించేలా చేసింది.

ఇక బంకుపల్లి మల్లయ్యశాస్త్రి వేదాలను తెలుగులోకి అనువదించిన పండితుడు. వీరి మీద తర్వాత ధర్మారావుకు అభిమానం కలగటానికి కారణం వీరు శారదా ఆక్ట ననుసరించి విధవా పునర్వివాహాన్ని సమర్థిస్తూ చక్కని శాస్త్రీయగ్రంథం రాయడమూ, తన కుమార్తెకు పునర్వివాహాన్ని జరిపించడమూ కావచ్చు. అప్పట్లో ధర్మారావుకు సహాధ్యాయులుగా బుర్రా శేషగిరిరావు, గిడుగు సీతాపతి, చిలుకూరి నారాయణరావు లాంటి ఉద్దండులుండేవారు.

ధర్మారావుకు జీవితాంతం చుట్ట కాల్చే అలవాటుండేది. అది పర్లాకిమిడి ప్రసాదించినదే. అక్కడికెళ్ళిన కొత్తలో వారికి మలబద్ధకం వ్యాధి ఉండేది. ఒక బొబ్బిలి మిత్రుడు చుట్ట కాలిస్తే అది పోతుందని చెప్పి చుట్ట అందించాడు. ఆనాటినుండీ అది అంటుకొంది.

ఎఫ్. ఎ కోసం చదివింది పర్లాకిమిడిలోనయినా పరీక్ష ఇవ్వటానికి విజయనగరం రావలసి వచ్చేది ఆ రోజుల్లో. కాలేజి ప్రిన్సిపాల్ కిళాంబి రామానుజాచారిగారు. ప్రతి పరీక్షనాడూ ఉన్న సమయానికన్నా ముందుగానే రాసిచ్చి వెళ్ళే ధర్మారావుని చూసి వీడొట్టి బడుద్దాయి అనుకునేవారు. తీరా పరీక్షా ఫలితాలు చూస్తే పర్లాకిమిడి నుంచొచ్చిన వాళ్ళలోనూ ఆ పక్క నాలుగు జిల్లాలలోనూ ధర్మారావుకొక్కడికే ఫస్టు క్లాసొచ్చింది. (1906)

ఆర్థిక పరిస్థితి నానాటికి క్షీణించటం కారణంగా ధర్మారావు ఎఫ్.ఎ. తర్వాత కొన్ని చిరుద్యోగాలు చెయ్యవలసిన అవసరం ఏర్పడింది. అన్న నరసింగరావు డాక్టరు పరీక్ష ఒక సంవత్సరంలో పూర్తి కాబోతోంది. తండ్రి

ఆశ్లన అంతంతమాత్రంగా ఉంది. ధర్మారావుకు అప్పట్లో ఆరోగ్యం కూడా కొంత బాగా లేదు. ఇవన్నీ కల్సి వారిని ఒక సంవత్సరం పాటు చెక్కలి, బరంపురాలలో టీచరు వృత్తిలో ఉండేలా చేశాయి (1906).

తర్వాత పరిస్థితులు కొంత మెరుగయ్యాక ధర్మారావు రాజమహేంద్రవరం కాలేజీలో చేరటానికి వెళ్ళాడు. అక్కడి హంటర్ దొర ఇంగ్లీషు, కొక్కొండ వెంకటరత్నం పంతులు తెలుగూ రెండూ అమృతమని విన్నాడు. వీటిని ఆపోశన పట్టాలన్న ఉత్సాహంతో వెళ్ళి ఫీజు కట్టాడు. మరునాడు మద్రాసు పచ్చయప్పాస్ కాలేజీలో కూడా సీటొచ్చిందని వెళ్ళి చేరమని తండ్రి బరంపురం నుండి టెలిగ్రాం ఇచ్చాడు.

మిత్రులతో ఆలోచించి సర్టిఫికెట్లన్నీ తిరిగి కాలేజీనుండి తీసుకుని మద్రాసుకు ప్రయాణమయ్యాడు ధర్మారావు. మద్రాసులో అప్పటికి పచ్చయప్పాస్ కాలేజీ, ప్రెసిడెన్సీ కాలేజీ, క్రిస్టియన్ కాలేజీ, ఇవే చాలా ప్రసిద్ధి చెందినవి. ఈ మూడిట్లోనూ లెక్కల తరగతులకు హాజరై పచ్చయప్పాస్ కాలేజీలో శింగారవేలు మొదలియార్ గారి లెక్కల బోధన మనసుకు నచ్చి ఆ కాలేజీ విద్యార్థిగా ధర్మారావు చేరిపోయాడు (1907).

కాలేజీకి ఎరిక్ డ్రూ ప్రిన్సిపాల్. తత్వశాస్త్రం బోధించేవారు. ఇంగ్లీషు కె. బి. రామనాథన్. చక్కని శైలిలో క్లాసులో పుస్తకాంకు పుస్తకాలే అప్పచెప్పగలిగినంతటి మేధావి. తెలుగుకు తెన్నె రంగయ్య. ఇక్కడే ధర్మారావుకి బాధ కలిగింది. మిగిలిన కళాశాలల్లో వేదం వారూ, అక్కిరాజు ఉమాకాంతం లాంటి ఉద్దండ పండితులు తెలుగు అధ్యాపకులుగా ఉండేవారు. రంగయ్య గైడ్లు చూసి పాఠాలు చెప్పే వ్యక్తి. కానీ ధర్మారావుకు లెక్కలు ప్రధానం. దానికి అధ్యాపకులు మణిపూసలాంటి శింగారవేలు మొదలియార్. అది చూసే వీరు మనసు సరిపెట్టుకున్నారు. ఇక రెండవ భాష తెలుగులో వ్యాసరచన, అనువాదానికి పి శేషాద్రి అయ్యంగారు. వీరు బెనారస్‌లో ఇంగ్లీషు ప్రొఫెసరుగా పనిచేసి ఇక్కడకు వచ్చారు. ఆయనకు తెలుగులో పరిచయం అంతంత మాత్రమే. తర్వాత ధర్మారావు ఆందోళనతో వీరి స్థానంలో మామిడిపూడి వెంకటరంగయ్య వచ్చాడు. ఇంగ్లీషు నాటకాలూ, పద్యకావ్యాలూ బోధించటానికి కాడ్వెల్ ఉండేవాడు. ఈయన 'కీట్సు' అభిమాని. చక్కని బోధనా పాటవం కలిగిన వ్యక్తి.

లెక్కల్లో ధర్మారావు ప్రతిభ శింగారవేలును ముగ్ధుణ్ణిచేసింది. ధర్మారావు లెక్కల నోట్సు చూసి క్లాసంతా రాసుకునేది. వీరి ప్రతిభ కాలేజీగోడలుదాటి కాలేజీల వరకూ ప్రాకటంతో వీరి రూము విద్యార్థులకు ఆటపట్టయింది.

పరీక్షల ముందు పది ముక్కలు ముక్కున పెట్టుకుని చదివే వ్యక్తి కాదు ధర్మారావు. పరీక్షలకు పది రోజులకు ముందే చదువు బంద్. తోడి విద్యార్థుల అనుమానాలను తీరుస్తుండేవాడు. కేవలం గతంలో చదివింది ఎలా రాయాలా అన్న ఆలోచనతో చక్కని ప్రణాళికను మనసులో రూపొందించు కోవటం వీరి కలవాటు. అది మెట్రిక్, ఎఫ్. ఎ. లలో పనికొచ్చింది. అలాగే బి. ఎ. లో కూడా చేయటం, ఫస్ట్‌క్లాస్‌లో పాసు కావటం జరిగింది (1909).

మద్రాసులో ఉన్న ఈ విద్యార్థిదశలోనే హరిహరయ్యర్ అనే అధ్యాపకుడి దగ్గర నెలజీతం ఇచ్చి అరవ సాహిత్యంలోని గొప్పతనం ధర్మారావు తెలుసు కున్నాడు. శిలప్పదికారం, మణిమేఖలై, కంబ రామాయణం లాంటివి చదువు కున్నాడు. ధర్మారావు భావి జీవితానికి చాలా దృఢమైన పునాదులు విద్యార్థి దశలోనే పడ్డాయి ముందు ముందు ఏర్పడనున్న భావాల తొలిచాళ్ళు అప్పుడే కనిపించాయి రాజకీయాభిప్రాయాల నొదిలితే మిగిలిన దాదాపు అన్ని రకాల ఉద్యమాలలో ధర్మారావు తీసుకున్న పాత్రకు నాంది విద్యార్థి దశ లోనే పలికినట్లు మనకు కనిపిస్తుంది.

## గుండెల్లో కుమ్మటగ్గి

పసితనం మనిషి జీవితంలో ప్రధానమైంది. ఆనాడు మనస్సులో ముద్ర పడిన భావాలు చివరి వరకూ వెన్నాడుతుంటాయంటారు. అందుకే ఆరోగ్య ప్రదమైన వాతావరణంలో పసితనం గడవటం చాలా అవసరం పసితనం జ్ఞాపకాల పొరల్లో ఏమైనా కటువైన సంఘటనలూ, మొరటైన అనుభవాలూ దాక్కున్నాయంటే అవి వాళ్ళ భావిజీవితాల మీద ప్రభావం చూపిస్తుంటాయి. గాంధీ జీవితం చూసినా, గోర్కీ చరిత్ర చదివినా మనకు తెలిసేది, ప్రపంచ సాహిత్యంలో ఏ రచయిత బాల్యాన్ని పరికించినా అర్థమయ్యేదీ ఇదే. శాస్త్ర పరంగా ఫ్రాయిడ్ దీన్ని విశ్లేషించాడు కూడా.

ధర్మారావు శ్రీకాకుళంలో చదువుకుంటున్న రోజులు. సుమారు పది సంవత్సరాల వయస్సుండొచ్చు. ప్రయిమరీ క్లాసులో- అంటే అప్పటి నాలుగవ తరగతి, ఈ నాటికది అయిదవ తరగతీ కావచ్చు. చదువుతున్నాడు దానికి సంవత్సరం చివరన గవర్నమెంటు పరీక్ష పుండేది. ఒకనాడు బడికాగానే ఇంటి

కొస్తున్న ధర్మారావుకి ఇంట్లో తండ్రి ఎదురయ్యాడు. చేతిలో పుస్తకాల్లేకుండా వస్తున్న ధర్మారావునిచూసి ఎక్కడి నుంచి వస్తున్నావంటే స్కూలునుంచని జవాబిచ్చాడు. పుస్తకాలేవన్నాడు తండ్రి ఆరోజు మార్కులన్నీకూడి వచ్చిన మొత్తం ఆధారంగా తరగతిలో విద్యార్థులు వాళ్ళవాళ్ళ నెంబరు వారీ స్థానాల్లో కూచొనే రోజని అన్నాడు ధర్మారావు నువ్వెన్నో వాడవన్నాడు తండ్రి. ఇరవై రెండవ స్థానం అని సమాధానం. ఫస్టెవరంటే ఎవరిపేరో చెప్పాడు. అతడు బ్రాహ్మణులబ్బాయి. ఇది విన్న అప్పన్న భార్యతో "ఈ చదువు బ్రాహ్మణులకేగాని మన కబ్బదు" అని అన్నాడు. ఇది ధర్మారావు విన్నాడు.

తలకాయలో అనేక ఊహలు. చదువు బ్రాహ్మణులకు తప్ప ఇతర్లకు రాదా ? ప్రయత్నిస్తే క్లాసులో మొదటి స్థానం బ్రాహ్మణేతరులకు ఎందుకు దక్కదు? ఇక నుండి ఆ స్థానం తనకు తప్ప మరొకళ్ళకు దక్కగూడదు. దీనికెంత శ్రమనైనా పడాలన్న భావం ధర్మారావు బుర్రలో నాటుకుంది. మనస్సులోపడ్డ ఈముద్రే చివరివరకూ పట్టుదలగలమనిషిగా వారిని నిలబెట్టింది. విజయనగరంలో చదివినకాలంలోనూ, పర్లాకిమిడిలో ఉన్న సమయంలోనూ, మద్రాసులోని పచ్చయ్యప్పాస్ కాలేజీలో చదువుతున్న దశలోనూ ఇదే దీక్ష ధర్మారావుని ప్రతిపరీక్షా మొదటి తరగతిలో ఉత్తీర్ణుడయ్యేలా చేసింది.

పరీక్ష విషయాన్ని అలా వదిలేసినా ధర్మారావు సాహిత్యరంగంలో కృషిచేస్తున్న కాలంలో ఈ బ్రాహ్మణుల ఆధిక్యత ఏమిటన్న భావం వారిలో బాగా పనిచేసిందనవచ్చు. ఆనాడు ఉద్దండపండితులందరూ బ్రాహ్మణులే. వారే ఎక్కువశాతం ఉండేవారు. ఆపాండిత్యంలో వారిని మించాలన్న పట్టుదలే ధర్మారావుని ప్రముఖ వ్యాఖ్యాతగా మార్చింది. నాటి బ్రాహ్మణ వర్గాల భాష గ్రాంథికంగా ఉండటం గమనించిన ధర్మారావు తానూ ఆ భాషనే అభిమానిస్తూ అందులో కూడా వారిని తలదన్నాలన్న ఆశే వారిని తొలిదినాల్లో గ్రాంధికభాషావాదిగా చేసి చివరకు వారినికూడా ఎదిర్చి నిలబడే స్థాయికి పెంచింది. సంస్కృతం - గ్రాంధికం - బ్రాహ్మణులూ యివన్నీ ఒకే వర్గమన్న భావంతోనే వాటిలో ఆధిక్యతను సంపాదించాలన్న తలంపు, వాళ్ళ మెప్పు పొందాలన్న భావం ధర్మారావుకు కలిగాయి. అవి తర్వాతర్వాత బ్రాహ్మణేతర ఉద్యమాభిమానిగానూ, జస్టిసు పార్టీ అభిమానిగానూ యెలా ధర్మారావుని నడిపించాయో ముందుముందు చూడొచ్చు. ఇవే వారిని చివరకు బ్రాహ్మణత్వ వ్యతిరేకిగా మార్చి మరింత అభ్యుదయగామిగా ఎలా తీర్చిదిద్దాయో కూడా పరిశీలించాల్సిన విషయం.

ఏమైనా, ఆనాటి ఆ భావం పరోక్షంగా వీరిలో పనిచేస్తూ 'స్పర్ధయా వర్థతే విద్యా' అన్నట్టు వీరిని అనేక రంగాల్లో ముందుకు నడిపించింది.

దీనికితోడు ధర్మారావుకు చదువుమీద మరింత శ్రద్ధ కలగటానికి మరో ఘటన కూడా దోహదం చేసుండవచ్చు. శ్రీకాకుళంలో చదువు ఆపేసి విజయనగరానికి వచ్చి సంవత్సరం మధ్యలో నాలుగో ఫారంలో చేరాడు. శ్రీకాకుళంలో వీరంటే టీచర్లకు అభిమానం. తరగతికి మానిటర్. చదువు సగంలో ఆపి ఇక్కడికొచ్చి చేరారు. వీరిని గురించీ - వీరి చదువును గురించీ విజయనగరంలోని స్కూలులో టీచర్లకు తెలియదు. ఏవో ప్రశ్నలడిగితే ధర్మారావు తెల్లమొహం వెయ్యక తప్పలేదు. దాంతో ఆ టీచరు

"మురుగులుంగరములు ముత్యంపుసరులును
పురుషునిగ్రైసేయు భూషణములె ?
అరనిమేషమునకు అన్నియు నశియించు
విద్యయొకటె యెపుడు విడనితొడవు" అన్న పద్యం చదివారు. అప్పటికి ధర్మారావు వేషం చేతులకు మురుగులూ, చెవులకు పోగులూ, గిరజాల జుట్టూ గట్రానూ. పై పద్యం తనను ఎద్దేవా చేయడానికే చదివారన్న భావం ధర్మారావులో మెదిలింది. గమ్మున ఇంటికొచ్చి ఆరోజే పోగులూ, మురుగులూ తీసేశారు.

ఇక పద్యంలో చివరి భాగం. అంతకుముందే శ్రీకాకుళంలో తండ్రి పెట్టిన చురక, దానికితోడు అవహేళనతో కూడిన ఈ మేష్టారు ఉద్బోధ రెండూ కలిశాయి. నూరు ఆరైనా చదువులో మొదటి స్థానం పొందాలనీ తద్వారా మేష్టర్ల అభిమానం సంపాదించాలనీ మనసులో పడింది. ఇదే వారిని విద్యార్థి దశంతా అధ్యాపకుల మనసుకెక్కిన విద్యార్థిగా నిలబెట్టింది ఈ 'విడని తొడవు'ను ధర్మారావు వివిధ రంగాల్లోనూ విడవలేదు. అన్నిటా తనదంటూ ఓ ప్రత్యేక స్థానాన్ని పదిలపరుచుకున్న విషయాన్ని మనం గమనించగలం.

అలాగే ఒక వ్యక్తి సమాజంలో ఒకడుగా మసలుకొంటున్నప్పుడు తన నెప్పుడూ ఇతరులతో బేరీజు వేసుకుంటూ తన స్థానాన్ని గమనించుకొంటూంటాడు. అవకాశమున్నంత వరకూ తన అర్హతకు తగిన గుర్తింపు రావటం లేదన్న భావం కలిగినప్పుడు తనమీద తనకు ఆధిక్యతాభావమో, లేక న్యూనతా భావమో యేర్పరచుకుంటాడు. ఆ భావం చూపిస్తున్న దృష్టితో సమాజాన్నీ, ఇతరులనూ చూస్తూ అంచనా వేస్తుంటాడు. ప్రతి సంఘటనను ఆ భావం వెలుగులో దర్శిస్తుంటాడు.

ధర్మారావులో తొలినుండీ తాను బ్రాహ్మణేతరుణ్ణనీ బ్రాహ్మణులకన్నా విద్య బాగా సంపాదించాలనీ పరిస్థితులెలాగున్నా యే ఆర్భాటాలూ లేకుండా చదువుద్వారానే పైవాళ్ళ మెప్పు పొందాలన్న తపన వుండేది. అలాగే తన దీక్షను కొనసాగించుకుంటూ వచ్చాడు.

విజయనగరంలో మెట్రిక్యులేషన్ పరీక్షలో మొదటివాడుగా పాసయి పర్లాకిమిడికి ఎఫ్. ఎ. లో చేరటానికి వెళ్ళాడు. ప్రిన్సిపాల్ మంగు శ్రీనివాస రావుని కలిశాడు. స్కాలర్షిప్ అడిగితే ప్రిన్సిపాల్ ఆర్థికంగా వెనకబడ్డట్టు సర్టిఫికెట్ పెట్టి విజ్ఞప్తి దాఖలు చేసుకోమన్నాడు. దానితో ధర్మారావు అహం మీద కొరడాతో కొట్టినట్టయింది. ఇంతకాలం చదువులో తన సామర్థ్యాన్ని ముందెట్టుకుని జీవితం నెగ్గుకురావాలన్న వారి అభిప్రాయానికిది దెబ్బగా తోచింది. ఆర్థిక స్థితిగతులకన్నా విద్యకే అధిక గౌరవం ప్రతిపత్తులుంటా యనుకున్న వారి నమ్మకం గంగలో కలిసినట్టయింది. వెంటనే కోపం కట్టలు తెంచుకుని "ఏం - మీ కాలేజిలో మెరిట్‌కు స్కాలర్షిప్ ఉండదా'' - అని ప్రిన్సిపాల్‌ని ధర్మారావు నిలేశాడు అసలే తన విద్యకు గుర్తింపు రాలేదన్న బాధకు తోడు, పేదరికాన్ని ఎత్తి చూపెడ్తున్నారేమోనన్న భావం కూడా కలిగింది. సరే - కాలేజిలో చేరిన రెండురోజుల్లోనే ప్రిన్సిపాల్ చెప్పే లెక్కల విషయంలో ధర్మారావే ప్రథములని తేలటం, వీరికి ఉచితంగా చదువుకోటానికీ హాస్టల్ సౌకర్యం లభించటానికీ ఆస్కారమైంది.

ఈ విధంగా పసితనంలో ధర్మారావు గుండెలో దాగిన బడబానలం అడుగడుగునా పైకి పొంగివస్తూ వారిని కార్యదీక్షలో మునిగివుండేలాగానూ, ఆశయసాధకులుగా రూపు కట్టుకోవడంలోనూ నిత్యం ఉడుకు రక్తం పొంగే యువకునిగా నిలిపింది.

## తెరచాపెత్తిన తిరుగుబాటు

తాపీ ధర్మారావు వ్యాఖ్యల రూపంలో పండితుల పాత విమర్శలను ఎదిరించినప్పుడూ, బ్రాహ్మణతత్వం మీద తిరుగుబాటు చేసినప్పుడూ, ప్రాచీన సంప్రదాయాల నెదిరించి పెళ్ళి తతంగాల్లో నూతన పద్ధతులను ప్రవేశపెట్టి

నప్పుడూ మాత్రమే ఆయనలోని తిరుగుబాటు తత్వం లోకానికి తెల్సింది. కాని ఈ తత్వం ఆయనకు విద్యార్థి దశ నుంచే అబ్బింది.

శ్రీకాకుళంలో ఉంటూ చిన్న తరగతుల్లో చదువుకుంటున్న రోజులు. ధర్మారావుకు ఆరేళ్ళుండవచ్చు. ఒకనాడు పంచె కట్టుకొని క్లాసుకెళ్ళాలన్న అభిప్రాయం వచ్చింది. క్లాసుకు తాను మానిటరు. దాంతో ఒక పంచెను తన కొచ్చినట్లుకట్టి అందరూ ఎడంచేతివైపు గోచీపెడితే, తాను కుడిచేతివైపు గోచీ పెట్టి - క్లాసుకెళ్ళాడు. మాస్టరు ఈ పద్ధతి చూసి "ఇదేమిటి?" అంటే ''అదంతే''- అన్నాడు. నలుగురూ నవ్వుతారంటే ''దారెంట వస్తూంటే ఎవ్వరూ నవ్వంది ఇకముందెలా నవ్వుతారని'' ఎదురుప్రశ్న. "అయితే అలాగే కడ్తావా?" అన్నదానికి ''అలాగే''నంటూ జీవితాంతం - పంచె కట్టినంత కాలం - కుడి గోచీతోనే ఉండేవాడు.

విజయనగరంలో రిప్పన్ స్కూల్‌లో ధర్మారావు 4, 5, 6 ఫారాలు చదివాడు. ఆ రోజుల్లో జరిగిన ఒక సంఘటన ఇది. ధర్మారావు గిరజాల జుట్టుతో ఉండేవాడు చొక్కా, పంట్లాము, కోటూ, నెత్తిమీద టోపీ ఇదీ వేషం. తల్లికి పూజాపునస్కారాల మీద తగిన శ్రద్ధ. ఇంట్లో ఒక దైవ మందిరం. ఆ ముందరి గదిలో కూచొని దేవుడి మందిరం వైపు కాళ్ళెట్టుకొని ధర్మారావు చదువుకుంటున్నాడు. పూజ చేసుకుంటున్న వీరి అన్నగారికి తగని కోపం వచ్చి ''దేవుడి వైపు కాళ్ళు పెట్టావేంటి, తియ్'' అని గద్దించాడు. ''కాళ్ళు ఏ పక్కనుంచేనేం దేవుడెక్కడ లేడని'' అంటూ - ఇందుగలడందులేడన్న పద్యం చదువుతూ లేచి వెళ్ళాడు ధర్మారావు కొంటెతనంగా. వెధవ జొన్నకర్ర ప్రశ్నలూ నువ్వూనూ అంటూ అమ్మగారు మందలించారు. ఇదే ధర్మారావుకు పది పదిహేనేళ్ళ తర్వాత జొన్నకర్ర వ్యాసాలకు శీర్షికగా పనికొచ్చింది.

రిప్పన్ స్కూల్‌లోనే అయిదవ పారం చదువుతున్నప్పటి మరో ఉదంతం. క్లాసులో ఫస్టు వచ్చేవాడే మొదట కూర్చుంటాడు. హిస్టరీ పాఠం నడుస్తోంది. మాస్టారుకు అభిమాన విద్యార్థి రెండో స్థానంలో ధర్మారావు పక్కన కూర్చున్నాడు ప్రశ్నలడుగుతూ ఎవరూ చెప్పలేకపోయేటప్పటికి ధర్మారావు దగ్గర ఒక్క క్షణమైనా ఆగకుండా వీరి పక్కవాడిని అడిగాడు. అతను బదులు చెప్పాడు. టీచరు ధర్మారావుని మొదటి స్థానం ఖాళీ చేసి ఆ రెండో కుర్రాడికిమ్మన్నారు. ధర్మారావు ససేమిరా ఇవ్వనంటూ ''తనకాలో చించుకోటానికే సమయం ఇవ్వక వెంటనే పక్కవాడినడిగారెందుకని'' ఎది రించాడు నువ్వు చదవలేదన్నది మాస్టారు ధర్మారావు నెత్తినేసిన నెపం. ధర్మారావుకు ఉక్రోషం వచ్చి పన్నెండు ప్రశ్నలడగండని అందులో ఏఒక్క

దానికి సమాధానం చెప్పలేకపోయినా చోటిస్తానన్న ఛాలెంజి. నాలుగైదు ప్రశ్నలకు సమాధానం చెప్పాడు. తర్వాత ఒక సంఘటనకు చెందిన సంవత్సరాన్ని అడిగారు. దాంతో ధర్మారావు తేదీలు గుర్తుండవనీ, ఎలాగైనా ఓడిద్దామనే కదా ఇలా అడిగారని దబాయిస్తూ ఆ డేటు సరిగ్గా చెప్పి కన్నీళ్ళ పర్యంతం అయ్యాడు. క్లాసు గొల్లుమంది. మాస్టారు సంతోషించారు. ధర్మారావు మొదటి ప్లేసు ధర్మారావుకే దక్కింది. తనది న్యాయం అని గట్టి నమ్మకమున్నప్పుడు ఎవరినైనా ఎదిరిస్తే తప్పేమిటన్న తత్వం ఆ విధంగా ధర్మారావులో పెరుగుతూ వచ్చింది.

ఇలాగే ధర్మారావు ఎఫ్.ఎ. చదవటానికి నేడు ఒరిస్సా రాష్ట్రంలోనూ, నాడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోనూ ఉన్న పర్లాకిమిడి రాజా కళాశాలలో చేరాడు. 1904 వ సంవత్సరం. వ్యావహారిక భాషోద్యమ నిర్మాత గిడుగు రామ్మూర్తి పంతులు ఆ కళాశాలకు వైస్ ప్రిన్సిపాలూ చరిత్ర ఉపన్యాసకులుగానూ ఉన్నారు.

ఆనాటి సాధారణ వేషంతో, గిరజాలూ పెద్ద జుట్టూ వేసుకుని గిడుగు వారి క్లాసులోకి వెళ్ళాడు ధర్మారావు. ఏవో ప్రశ్నలడుగుతూ ధర్మారావునూ అడిగిచూశారు. అంతే. "మొహాన బొట్టు లేదేం" అన్న గర్జన గిడుగు నోటి నుండి వచ్చింది. ఇలాటి ప్రశ్న తరగతిలో వస్తుందని ఎదురుచూడని ధర్మారావు కెటూతోచక తాను బ్రాహ్మణేతరుణ్ణని జవాబిచ్చాడు. అయితే బొట్టక్కర్లేదా అని మరోప్రశ్న. కుర్చీ మరోపక్కకు తిప్పేసుకున్నారు గిడుగు. ఇక నీ మొహం చూడనని. ఇలా కొంతకాలం గడిచింది. తన ప్రతిభతో-ప్రతి గ్రంథం చాలా శ్రద్ధతో చదివే మంచి విద్యార్థిగా నిరూపించుకుంటూ గిడుగుకు కోపోపశమనం చేశారే గానీ బొట్టెట్టుకోలేదు ధర్మారావు. అంత పట్టుదల ఇద్దరిదీ. కాని తర్వాత ఎప్పుడు ఆరంభించారోగానీ సుమారు నలభై సంవత్సరాలొచ్చేవరకూ - ముఖాన నిలువుబొట్టు పెట్టుకునేవాడు ధర్మారావు.

హేతువాదానికి నిలవనప్పుడు ఎలాంటి ఆచారాన్నైనా ఎదిరించే గుణం తప్ప, గుడ్డిగా అనుసరించటం ధర్మారావుకు తెలీదు. ధర్మారావు ఎఫ్.ఎ.పరీక్ష ఇవ్వటానికి పర్లాకిమిడినుంచి విజయనగరం వచ్చాడు ఆ కాలేజి పరీక్షలకు సెంటరు. ధర్మారావు అత్తవారింట్లో మకాం పెట్టి పరీక్షనాడు కాలేజీకి వెళ్దాం కదా అని బైటకొచ్చారు. ఎదురుగా నూనెకావిడి వస్తూంది. చూచినవారూ, వీరి శ్రేయోభిలాషులూ, తిరిగివెళ్ళమన్నారు. చివరకు కావిడి మోసేవాడుకూడా ఇది మంచి శకునం కాదనీ తిరిగివెళ్ళి రండనీ సలహా ఇచ్చాడు. కానీ ధర్మారావు దీన్నేమీ లెక్కచేయకుండా పరీక్ష రాయటాని కెళ్ళారు. పర్లాకిమిడి

నుంచి 14 గురు విద్యార్థులు పరీక్షకు కూర్చుంటే పదకొండుగురు పాసయ్యారు. ధర్మారావుకు ఫస్టుక్లాసు వచ్చింది. ఇలాంటివే వారిని క్రమంగా తరువాత జీవితంలో ప్రతి అంశాన్నీ శాస్త్రీయ, హేతువాద దృష్టితో అధ్యయనం చెయ్యటానికి ప్రయత్నించేలా చేశాయి.

విజయనగరం నుండి ఎఫ్.ఎ. పాసైన తర్వాత కొద్దినెలలు టెక్కలి మిడిల్ స్కూల్‌లో అధ్యాపకుడిగాను, బరంపురం కళ్ళికోట కళాశాలలో హైస్కూలు అధ్యాపకుడుగానూ ధర్మారావు పనిచేశాడు తర్వాత బి.ఎ చదవటానికి మద్రాసువెళ్ళి పచ్చయప్ప కాలేజీలో చేరారు. తెలుగు అనువాదానికి శేషాద్రి అయ్యంగారనే ఆయనవచ్చారు. ఒక పద్యం - భీమఖండం లోనిది - బోర్డుమీద తప్పులతోటి రాసి ఆంగ్లంలోకి అనువాదంచేసి తెమ్మన్నారు విద్యార్థులను. ధర్మారావు అయ్యంగారు రాసిన తప్పుల ప్రకారమే అనువాదం చేసి చివర "దిస్ మేక్స్ నో సెన్స్" అని నోట్ రాశాడు. అది చూసిన శేషాద్రి అయ్యంగారు కోపంతో మండిపడి ప్రిన్సిపాల్‌కు రిపోర్టుచేశాడు ప్రిన్సిపాల్ ఎరిక్‌డ్రూ ధర్మారావుని పిలిపించి విచారిస్తే ఱ, ర లకు భేదంచెప్పి వీటిని తప్పుగా రాస్తే తప్పర్థం వస్తుందని చెప్పాడు. తెలుగు లెక్చరరు తెన్న రంగయ్య దీన్ని సమర్థించారు ప్రిన్సిపాల్‌కి శేషాద్రి తప్పు తెలిసింది. ఇదే అదననుకొన్న ధర్మారావు అప్పుడే బి ఎ - విశ్వవిద్యాలయం ఫస్టులో-పాసై వచ్చిన మామిడిపూడి వెంకటరంగయ్యను శేషాద్రి స్థానంలో ట్యూటర్‌గా తమ క్లాసుకు పంపమని విజ్ఞప్తిచేశాడు. అంతే, ఆనాటినుండీ వెంకట రంగయ్య ధర్మారావు తరగతికి అనువాదకులుగా వచ్చాడు.

అందరూ అవునన్నది కాదనడానికి చాలా ధైర్యమూ చాకచక్యమూ ఉండాలి. ఇలాంటి తత్వం ఉన్నవాళ్ళే కొత్తదారుల్లో ప్రయాణానికి సిద్ధపడతారు. నలిగినదారులు నచ్చవు. ధర్మారావు బి.ఎ. చదివే రోజుల్లో పచ్చయ్యప్ప కళాశాలలో ప్రొఫెసర్ రామనాథన్ ఇంగ్లీషు చెప్పేవాడు. అఖండ పాండిత్యం వున్న వ్యక్తి. కన్నెమెరా గ్రంథాలయంలోని పుస్తకాలన్నీ వారి తలకాయలో నిండి వున్నాయంటే ఆశ్చర్యపడక్కర్లేదు. నిగర్వి. ఆయనొకనాడు విద్యార్థులకు సోమరితనం మంచిదికాదని ఉపన్యాసం ఇచ్చాడు. ధర్మారావు లేచి అదే చాలా మంచిదనీ, దానివల్లే ప్రపంచనాగరికత అభివృద్ధి చెందుతోందంటూ మాక్స్‌ముల్లర్ జీవితం సోదాహరణంగా చెప్తూ ఆయన వాదాన్ని ఖండించి ఔననిపించాడు. ఇలాటి తర్కబలం ఆనాటి నుండీ ధర్మారావులో ఉంది కనుకనే అటు గ్రాంథికవాదాన్ని సమర్థించిననాడూ, ఇటు వ్యావహారిక వాదాన్ని ఉద్యమంగా చేపట్టిననాడూ తన తార్కికజ్ఞానంతో నెట్టుకు రాగలిగాడు.

ఈ భావాలే వారిని అనేక ప్రాచీన విషయాలను కొత్త చూపుతో పరిశీలించడానికి అవకాశాన్నీ ఎంత పెద్దవారు చెప్పినా అందులో తార్కిక జ్ఞానానికి తప్పనిపించినప్పుడు నిర్మొహమాటంగా ఖండించే శక్తినీ పొందిన వ్యక్తిగా తీర్చిదిద్దాయి.

## లంగరెత్తిన సంస్కరణ

సమాజంలో ఒకడుగా ఉన్న వ్యక్తి సహజంగా దాని ప్రభావానికి గురౌతాడు. దాని మంచి చెడులకు తానూ కర్తృత్వం వహిస్తాడు. అయితే తన చుట్టూ ఉన్న సమాజానికీ తనకూ మధ్య వైరుధ్యాలున్నాయన్న విషయం గమనించిన వెంటనే తన వ్యక్తిత్వం నిలుపుకోటానికి కృషి చేస్తాడు. ఏనాడైతే తాను బలహీనుడై సమాజ లక్షణాలూ అవీ బలవత్తరమని గ్రహిస్తాడో తాను సమాజానికి తల వంచుతాడు. అలా తలవంచి కొందరు పూర్తిగా దానికి దాసోహమైతే, మరికొందరు అవకాశం చిక్కినప్పుడల్లా సమాజాన్ని తన ఆలోచనలకూ ఆచారాలకూ అనువుగా మార్చటానికి ప్రయత్నిస్తూ ఉంటుంటారు. వారి ధైర్యస్థైర్యాలతో కొందరు అనుయాయులను తయారు చేస్తూ అప్పటికి వారికి సమాజంలో కనిపించిన చెడును ధిక్కరిస్తూ మంచి దిశకు నడిపిస్తూ, నడిచేవాళ్ళనే మనం సంస్కర్తలని అంటూంటాం.

ఇటువంటి మహానుభావుల ఉద్యమాల వల్ల సమాజం ఎప్పటికప్పుడు పేరుకున్న కుళ్లను వదిలించుకుంటూ మంచిని పెంచుకుంటూ పురోగమించటం గమనించవచ్చు.

ధర్మారావు కుటుంబం సనాతనాచారాలతో నడిచే మధ్యతరగతి వర్గం లోనిది. మధ్యతరగతి వర్గం అనగానే మార్పును వెంటనే ఆహ్వానించే గుణం ఉండకపోవటం, కొత్తను చూసి భయపడటం, తన అస్తిత్వానికి ముప్పు రానంత వరకూ నిమ్మకు నీరెత్తినట్లుండటం అన్న లక్షణాలను పుణికి పుచ్చుకోనుంటుంది. పాత విలువలనూ, సంప్రదాయాలనూ భద్రపరుచుకుంటూ ముందుతరాల కందించడంలో నమ్మకమైన పాత్రను నిర్వహిస్తూంటుంది.

ఇటువంటి కుటుంబంలోని వ్యక్తికీ - అందులోనూ తెలుగు దేశంలో అంతగా ఆర్థికంగా అభివృద్ధికి నోచుకోని ఒక మారుమూల ప్రాంతం వ్యక్తికీ

ఇలాంటి సంస్కార భావాలు ఎలా వచ్చి ఉంటాయో తెలుసుకోటం ఆశ్చర్య కరంగానే ఉంటుంది.

ధర్మారావు తండ్రి అప్పన్న డ్రెస్సరు. అంటే డాక్టరు. ఆ రోజుల్లో డాక్టర్లు సాధారణంగా సైనికోద్యోగాలకే వెళ్ళేవాళ్ళు. అక్కడ వీళ్ళు చేసే పని యుద్ధంలో క్షతగాత్రులకు మందూ మాకూ వేసి కట్టు కట్టటం. అందుకే 'డ్రెస్సర్లు' అనేవాళ్ళు. మిలట్రీలో చేరకుండా మామూలుగా వైద్యవృత్తి చేస్తున్నా వాళ్ళనలాగే పిలిచేవాళ్ళు.

డ్రెస్సరు అప్పన్న చాలా తెలివైనవాడు. శ్రీకాకుళంలో మెట్రిక్ పాసయి, స్టీమరెక్కి మద్రాసెళ్ళి డాక్టరు పరీక్షలో అనేక బహుమతులు సంపాదించి ఉత్తీర్ణులై శ్రీకాకుళంలోనే మొదటి దఫా డాక్టరు వృత్తిలో ప్రవేశించాడు. ఈయన మద్రాసు నుండే ఆంగ్లభాషనూ వేషాన్ని తెచ్చేశాడు ఆ రోజుల్లో శ్రీకాకుళం, బరంపురం ప్రాంతాలకు కాఫీ తాగే అలవాటును కూడా వీరే ప్రవేశపెట్టారంటారు. ఇంగ్లీషువారి అలవాట్లు, ఆచారాలను ఇంట్లో స్థిరపర్చారు. ఆ రోజుల్లో కాస్త ఇంగ్లీషు చదివిన ప్రతి వ్యక్తికీ ఉన్నట్టే తెలుగంటే అలసత్వమూ అదీ ఉండేది. ఇంట్లో ఎవరన్నా తెలుగు పుస్తకం చదువుతూ కనిపిస్తే "అలా పిచ్చి చదువు కాకపోతే ఏ ఇంగ్లీషు పుస్తకమన్నా చదవరాదూ" అని తిట్టేవాడు అప్పన్న.

ఇంగ్లీషు అధ్యయనం తెచ్చిన అనర్థాలు ఎలాగున్నా అవి ప్రజల్లో కొంత శాస్త్రీయ దృక్పథం, ప్రతిదాన్ని విడమర్చి చూడగల హేతువాదం నేర్పించటంలో సందేహపడక్కర్లేదు. అప్పటికే రాజా రామమోహన్ రాయ్ భారతదేశంలోనూ, కందుకూరి వీరేశలింగం లాంటివారు తెలుగు దేశంలోనూ తమ కబ్బిన విజ్ఞానం మేరకు సంస్కార భావాలను ప్రచారం చేశారు. ఈ భావాలన్నీ నాటి విద్యార్థుల బుర్రల్లో గజిబిజి చేస్తుండేవి.

ధర్మారావు రిప్పన్ స్కూలులో చదువుకునే రోజుల్లోనే వీరేశలింగం ప్రహసనాలనూ, బుద్ధిరాజు ఈశ్వరప్ప[4] ప్రహసనాలనూ శ్రద్ధగా చదువుతుండేవాడు. వీరేశలింగం ప్రహసనాల్లోఉండే గొప్పగుణం అందరికీ తెలిసిందే. వారి అభిప్రాయాలను మృదువుగానూ అనేక సందర్భాలలో కటువుగానూ ప్రహసనాల్లో దూర్చి మన బుర్రల కెక్కిస్తారు. చదివినవాళ్ళ బుర్రలిక ఆలోచనలతో సతమతమౌతూంటాయి. అలాగే 'కమలాస్ లెటర్స్ టు హర్ హస్బెండ్'[5] లాంటి విషయవివేచనచేసే రచనలూనూ. దీనికితోడు ఆ రోజుల్లో ఉత్తరదేశం నుండి ఒక వర్మ[6] అనే ఆయనొచ్చి తెలుగునాడులో సంస్కరణల గూర్చి అనేక ఉపన్యాసాలిచ్చి వెళ్ళాడు. ఇవన్నీ ధర్మారావు అభిప్రాయా

లను సంస్కరణలవైపు దారితీయించాయి. వీటిని మించి ధర్మారావు "సోషల్ రిఫార్మ్"అనే పత్రికను శ్రద్ధగా చదువుతూండేవాడు.అలా గేరామమోహన్‌రాయ్, కేశవ చంద్రసేన్‌ల జీవితచరిత్రలనూ, రచనలనూ కూడా అధ్యయనంచేశాడు.

తండ్రి ఆంగ్ల సంప్రదాయాలు ఇచ్చిన చొరవా,పైన చెప్పిన గ్రంథాల అధ్యయనం ధర్మారావును సంస్కార భావాలవైపు నడిపించాయి. చదువుకునే రోజుల్లో ఒక సంఘటన కూడా సంఘ సంస్కారాలవైపు వీరి దృష్టి మళ్ళేలా రెచ్చగొట్టిందని ధర్మారావన్నారు.

విజయనగరంలో వీరింటికి రిప్పన్ స్కూలుకూ వెళ్ళే దారిలో ఒక శ్రోత్రియ పండితుని ఇల్లుండేది. ఆయన సోమయాజీ-మహాపండితుడూనూ. ఆచారాలకు పెట్టింది పేరు. వారి కుమార్తెకు చిన్నతనంలోనే పెళ్ళిచేస్తే భర్త చనిపోయి బాలవిధవగా తండ్రి ఇంట్లోనే ఉంటూండేది. వయస్సప్పటికి 15, 16 సంవత్సరాలు యవ్వనంతో తొణికిసలాడ్తుండేది. ఈ బడి విద్యార్థుల్లో కొందరు వయస్సులో పెద్దవాళ్ళు ఆ అమ్మాయిని చూసి గేలిచేస్తూండటం నలుగురూ గుసగుసలు పోవటం జరుగుతుండేది. పిల్ల తండ్రి నిప్పును కడిగేవాడు. కనుక ఆ పిల్లకు మళ్ళీ పెళ్ళి తలపెట్టేవాడు కాదు. ఇది చూస్తున్న ధర్మారావుకు వారి మిత్ర బృందానికి స్త్రీవిద్య, బాల్యవివాహాల సమస్య, స్త్రీ పునర్వివాహాలపైనా దృష్టిమళ్ళి వాదించుకోటాలూ, చర్చించుకోటాలూ జరుగుతుండేవి.

ఇలాటి భావాల చర్చల కోసమే ధర్మారావు ఇంట్లో శని, ఆదివారాల్లో డిబేటింగ్ సంస్థను ఏర్పాటుచేసుకున్నారు. ధర్మారావు అభిప్రాయాలన్నీ బాల్యవివాహాలుకూడదనీ స్త్రీకి విద్యఅవసరమనీ విధవావివాహాలు జరగాలనీ కట్నాలు, తీసుకోకూడదనీ,జాతి వర్ణ విభేదాలుండరాదనీ అన్నదిశగా రూపుదిద్దుకున్నాయి.

చిన్నప్పుడు దేవుడికి పెట్టిన దండం ఎవరికి అందుతుందోనన్న అనుమానం వేసిన ధర్మారావుకు, మద్రాసు చదువుకొచ్చేసరికి దగ్గరున్న పైసలతో ట్రాము లెక్కాలి తప్ప, వాటిని దేవుడికి అర్పించి మండుటెండలో నడిచిపోవడం అసందర్భమనిపించింది.

పాత ఆచారాల మీదా నమ్మకాలమీదా తిరుగుబాటుభావాలు కలుగుతున్న ఆ కాలంలోనే వీరి పెళ్ళి నిశ్చయమైంది. విజయనగరం స్కూల్లో చదువుతున్న వీరికి, గోలకొండవారి కుటుంబానికి చెందీ వీరికి బంధుత్వం ఉన్న అన్నపూర్ణతో 1902-1903 మధ్యలో వివాహం నిశ్చయమైంది. అంటే ధర్మారావుకు 15, అన్నపూర్ణకు 10 సంవత్సరాల వయస్సు. అయితే ధర్మారావు ఓ షరతు పెట్టాడు. అన్నపూర్ణ కొంతకాలం చదవాలని. అందరూ అంగీకరించారు. అన్నపూర్ణతాత గోలకొండ అప్పుడు విజయనగరం సంస్థా

నంతో 'హస్తబలి' అధికారిగా ఉండేవాడు. ఆయన దగ్గర అన్నపూర్ణ ఏదో వానాకాలం చదువు చదివింది. ధర్మారావు పెళ్ళికి ముందే పిల్లను చూడా లన్నాడు. ఆ రోజుల్లో అది చాలా అపురూపం. పెళ్ళికొడుకు తన భార్యను శోభనం గదిలో తప్ప చూసే అవకాశమే కల్పించని కాలం అది అందుకూ అంగీకరించారు. కట్నాలూ-కానుకలూ ఉండకూడదని ధర్మారావు పట్టు బట్టాడు. అందులోనూ నెగ్గాడు.

చివరకు మెట్రిక్యులేషన్ పరీక్ష పాసయిన తర్వాత 1904 లో ధర్మా రావుకీ అన్నపూర్ణకీ పెళ్ళయింది. భార్యను అప్పటికెవరూ పేరెట్టి పిలిచే ఆచారం వీరిళ్ళలో లేదు. ధర్మారావు ధైర్యంచేసి పిలవటమే కాదు. నాటకా లకూ వాటికీ వెంటబెట్టుకుని మరీ వెళ్ళేవాడు. ఇంట్లో కొందరు నోళ్ళు నొక్కు కునేవాళ్ళే ననుకోండి.

అలాగే చేతికి మట్టిగాజు లేసుకోవటం, ముక్కున బేసరి, చెవిపోగులు - చెవి అంచునిండా ఉండేలా-చెవి దొప్పలో ఒక నగా ఇవన్నీ పునిస్త్రీ లక్షణాలని నమ్మకం. చాలా నెలలు పోరాడి వీటన్నిటినీ మానిపించ గలిగాడు ధర్మారావు. అలనే కట్టూ, జాకెట్టూ ధరించటంలో గొప్ప మార్పు తేవడానికి చాలా శ్రమపడి సాధించాడు. అన్నపూర్ణమ్మ చనిపోయే వరకూ ఇలానే వుండేవారు.

కనుక సంస్కారభావం తలకు పట్టగానే, తన ఇంట్లోనుండే ఆచరణ ఆరంభం చేశాడు ధర్మారావు. వీరేశలింగం ప్రభావం పరోక్షంగానే వీరిమీద పడింది. కందుకూరిని ధర్మారావు చాలాకాలం తర్వాతగానీ బరంపురంలో చూడలేకపోయాడు. అప్పటికి అచ్చయిన తన 'ఉషఃకాలం' అక్కడే కందు కూరి కిచ్చినట్లు ధర్మారావు రాసుకున్నాడు.

ఈ సంస్కార భావాలే క్రమంగా ప్రోదఅయి తన కుమారులకు సంస్కరణ వివాహాలు చెయ్యడంలోనూ, సంస్కరణ పద్ధతిలో పలువురికి వివాహాలు జరిపించటానికి ఆచార్యత్వం వహించడంలోనూ, అనేక సాంఘిక సమస్యలను నిశితంగా పరిశీలించి శాస్త్రీయ అవగాహనతో రచనలు సాగిం చటంలోనూ ధర్మారావును ఒక ప్రముఖ వ్యక్తిగా నిలబెట్టాయి.

# సాహిత్య బీజాంకురం

వేదం వెంకటరాయశాస్త్రి లాంటి గొప్ప పండితులను చాలా మంది ప్రశంసిస్తారు ప్రాచీన కావ్యాలకు వారి వ్యాఖ్యానాలను చదివి గౌరవంతో నమస్కరిస్తారు. కానీ, అలాంటివారిని ఎదుర్కోవాలంటే ఎంతో సాహిత్య పరిచయమూ, ప్రతిభా, తార్కిక జ్ఞానమూ ఉండాలి ఇవన్నీ తాపీ ధర్మారావులో ఉండబట్టే వేదం వారితో విజయవిలాస వ్యాఖ్యాన సందర్భంగా తగాదాపడ్డాడు. ఊరూరూ తిరుగుతూ వేదంవారి వ్యాఖ్యానంలోనూ, పదాల కర్థాలనూ, అన్వయాన్ని చెప్పడంలోని పొరపాట్లను వివరించడం ఒక ఉద్యమంగా కొనసాగించాడు చివరకు వేదంవారి స్వస్థలం నెల్లూరు సీమలోనే సభలు పెట్టి తన వ్యాఖ్యానమే మేలనిపించుకున్న వాగ్ధాటి పాండిత్యం ఉన్నవాడు ధర్మారావు.

ఈ సాహిత్య పిపాస ధర్మారావుకు చిన్నప్పటినుండీ ఉంది. సాధారణంగా ఏ పిల్లలకైనా తొలి గురువు తల్లి, తొలి పాఠశాల తల్లి ఒడీనూ. అలాగే ధర్మారావు తల్లి నర్సమ్మ తండ్రి అప్పన్న డాక్టరు వృత్తిరీత్యా ఊరూరూ తిరగడంవల్ల తల్లి ప్రభావం ధర్మారావు మీద చాలా పడింది ఆమె కనక శ్రద్ధ చూపించి ఉండకపోతే ధర్మారావు చదువే కాదు, సోదరుల చదువూ సాగి ఉండేది కాదని ధర్మారావే అన్నాడు.

పుట్టింది బరంపురంలో కాగా తండ్రి బదిలీలవల్ల పెరికి 6-7 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ కొన్నాళ్ళు చత్రపురం లోనూ (నేడు ఒరిస్సా రాష్ట్రంలో ఉంది) కొన్నాళ్ళు శ్రీకాకుళంలోనూ గడిపారు. సెకండరీ అంటే అప్పటి థర్డ్‌ఫారం చదివి విజయనగరానికొచ్చారు. అంటే 1900 సంవత్సరం వరకూ శ్రీకాకుళమే.

శ్రీకాకుళంలో ఉన్న కాలంలో సామాన్యంగా అందరి పిల్లలకూ చిన్నతనంలో నేర్పించే ఆంజనేయ దండకం తల్లి నేర్పించారు. మనలో భయం పోగొట్టటానికి అదొక మందు. తరతరాలుగా వస్తున్న ఒక సంప్రదాయం ఆ కాలంలోనే ధర్మారావుకు అన్నవరసయ్యే హీరమళ్ళ వెంకటస్వామి అప్పుడప్పుడు వీరి ఇంటికొచ్చి కుశలాయకం, కబీరుదాస చరిత్ర, రామదాసు చరిత్ర, గంగా వివాహం లాంటి పుస్తకాలు పాటగా చదివి పాడుతుండేవాడు.

అర్థాలు తెలిసినా తెలియకపోయినా శ్రావ్యంగా ఉండటంవల్ల అమ్మలక్కలు చేరి విని ఆనందిస్తూండేవారు. నర్సమ్మ కాస్త తెలిసినా తెలియకున్నా అర్థమయ్యే విధంగా వ్యాఖ్యానం చెప్తూంటే ధర్మారావు చెవులు నిక్కబొడుచుకుని వింటూండేవాడు. కుశలాయకం అంటే కుశ, లవుల కధ. దీన్ని పెదమజ్జి పాలెం నివాసి రామచంద్రరాజు రాశాడు. రామ జననం నుండి వైకుంఠ పయనం దాకా ఉంటుంది.

అలాగే వీరిల్లు శ్రీకాకుళం చౌకులో వుండేది. బడికి వెళ్ళేదారిలో ఒక చోట వర్తకులు కొందరు చందాలేసుకుని పందిళ్ళేసి రామాయణం పురాణం చెప్పిస్తుండేవారు. ప్రతిదినం వస్తూపోతూ వింటుంటే ఈ పురాణం చెప్పే పద్ధతీ రాగం తీసే మట్టూ మీద ధర్మారావుకు ఆసక్తి పెరిగింది. రామాయణం పూర్తయ్యేలోగా వివిధ ఘట్టాలలో ఉత్సవాలూ అవీ కూడ జరుగుతుండేవి. అలా రామాయణం మీద శ్రద్ధ కలిగి హీరమళ్ల వెంకటస్వామిని రామాయణం తెచ్చివ్వమని అడిగాడు. శారదా రామాయణం 30 పుటలుండేది ఒకటి తెచ్చిచ్చాడు.

ఇందులో

''మధురమైనట్టి అమృతసారంబు
వెంకటేశ్వరుని పాలి దైవంబు
చేసినాడయ్య ఈ పురాణంబు
రామచంద్రుల మూర్తి దైవంబు' అని
''శ్రీరామచంద్రుని చరితంబు
.... ... . . . . . . .
చేర్చికూర్చితి నీ శారద పదంబు
సేతు రాముని సదంబు
రామభక్తకవి చెప్పు కథనంబు
వినవినగ వేడుకను మధురంబు" అని పుస్తకం చివరలో ఉంది.

వీటినిబట్టి ఇది రాసిన వారు రామభక్తుడయ్యుంటారు. వీటిని శారదకాండ్రు పాడతారు. వారు వాయించే వాద్యాన్ని శారద అంటారు ఈ రామాయణంలో దశరథుని పుత్రకామేష్టి నుండి రావణ వధ, రామ పట్టాభిషేకం దాకా ఉంది. ఈ విషయాలను బి. రామరాజు తమ తెలుగు జానపద గేయసాహిత్యంలో (పేజి 70 - 71) వివరించారు.

పగటివేషాలు వేసేవారు బైరాగి వేషం నుండి శారద వేషం వరకు 32 వేషాలు వేస్తారు. చివరి వేషంలో ఈ పాటలు పాడుకుంటూ ఇల్లిల్లు తిరుగు

తారంటూ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి తెలుగుభాషా సమితి ప్రచురించిన విజ్ఞాన సర్వస్వం (పేజి 915) నాలుగవ సంపుటంలో అన్నారు. ఈ చిన్న పుస్తకంలో పాటలను రాగం తీస్తూ చివర్లో ''హా శారదా కరుణానిధే'' అంటూ పల్లవితో పాడుతుండేవారు. కవి పేరు సరిగా లేదు. చిన్న చిన్న పదాలతో ఆయా రసాలకు తగినట్లుగా చేసిన రచన అది. ఇదే క్రమంగా ధర్మారావును వ్యావహారిక భాషా వాదిగా మారినప్పుడు వీరైనంత తక్కువ సంస్కృత పదాలతోనూ, దీర్ఘ సమాసాలు లేకుండానూ రచన సాగించటానికి ప్రోత్సహించి కలిగించి ఉండవచ్చు.

విజయనగరం రిప్పన్ స్కూలులో చదువుకుంటున్న కాలంలో ధర్మారావుకు 4, 5 ఫారాలలో సైన్సు మాస్టారు ఒంగోలు పట్టాభిరామయ్య. వారికి నాటకాలాడించటం - అందులోనూ ఇంగ్లీషువి - సరదా. ఆ విధంగా వీరికి షేక్స్పియర్ నాటకాల మీద అభిమానం పెరిగింది. తనకు బహుమానంగా వచ్చిన షేక్స్పియర్ నాటకాల సంపుటాన్ని ధర్మారావు చాలా ఉత్సాహంతో పాత్రల గొంతులను అనుకరిస్తూ చదివేవాడు.

అలాగే ఆ స్కూలు హెడ్‌మాస్టర్‌గా అప్పుడు పీసపాటి వెంకటకృష్ణయ్య గారుండేవారు. చక్కని విగ్రహం. పిల్లలకు వారి పాండిత్యం మీద చాలా అభిమానం ఉండేది. వారి మీద భయం కన్నా భక్తి ఎక్కువగా ఉండేది. ఆయన ఇంగ్లీషు చెప్పేవారు. "డెజర్టెడ్ విలేజ్" ''ట్రావెలర్'' లాంటి పాఠాలు బోధిస్తూంటే విద్యార్థులకు ఉత్సాహం. అలాంటి రచనలు విడిగా చదవాలన్న కుతూహలం కలుగుతూండేది. ధర్మారావుకు ఆ విధంగా గోల్డ్‌స్మిత్, కౌపర్ లాంటి రచయితల కావ్యాలు చదవాలన్న ఆసక్తి కలగటం అందుకు శ్రమ పడటం జరిగింది.

ధర్మారావు తండ్రి అప్పన్నకు తెలుగంటే వెగటు. ఇంగ్లీషంటే వ్యామోహం ఉండేది. కారణం వారి డాక్టరు చదువే. వేషభాషలన్నీ అలాగే. ఈ ప్రభావం ధర్మారావుకు ఇంగ్లీషు సాహిత్యంమీద అభిమానానికి దారి తీసింది. వెంకటకృష్ణయ్య సాహిత్యబోధన కావ్యపఠనానికి దారి చూపింది.

సహాధ్యాయులతో కలిసి ధర్మారావు తమ ఇంట్లో ప్రతి శని, ఆదివారాలలో సభలూ, వాగ్వివాదాలూ జరుపుతూండేవాడు. ఒక్కొసారి ఈ వాదనలు చాలా తీవ్రస్థాయికి పోతుండేవి. క్రమంగా పుస్తకాల గురించీ వాటిల్లోని విషయాల గురించీ జరిగే చర్చల కోసం తల్లి నడిగో, తండ్రి వైద్యాలయం గల్లాపెట్టెలోంచి తస్కరించో డబ్బు తీసుకుని పుస్తకాలు కొంటూండేవాడు ధర్మారావు. అలా మద్రాసులో ఆ రోజుల్లో అవా లైబ్రరీ పుస్తకాలను,

కాజిల్స్ నేషనల్ లైబ్రరీ అచ్చేసిన రెండణాల వెల పుస్తకాలనూ తెప్పించి చదివేవాడు.

తల్లి చేసే పూజలో పాలుపంచుకుంటూ ప్రార్థనా పద్యాలూ - దండకాలూ చదివే దశనుంచి క్రమంగా తెలుగు - ఇంగ్లీషు పుస్తకాలను తెప్పించి చదువుకునే దశ వరకూ విజయనగరంలో ఎదిగాడు ధర్మారావు.

నాటి గంజాం జిల్లా పర్లాకిమిడిలో రాజాగారి కాలేజీకి మంచి పేరుండేది. కొండగట్టుమీద చక్కని భవనంలో పర్లాకిమిడి జమీందారు పోషణలో ఆ కాలేజీ నడుస్తూండేది. దాన్ని బోయకొండ అనేవారు విద్యార్థి వేతనం దొరుకుతుందన్న ఆశే ధర్మారావును అక్కడకు నడిపించింది

ధర్మారావుకు మొదట్నుంచి పుస్తకాలు చదివే అలవాటుంది. దీనిని మరంత క్రమబద్ధం చేసినవాడు గిడుగు రామ్మూర్తి చరిత్ర అధ్యాపకులుగా ఉంటూ వీరిచేత దానికి సంబంధించిన అన్ని భాషల్లోని పుస్తకాలనూ చదివించేవాడు. ఆదిలో చిన్న కలహంతో ప్రారంభమైన వారిద్దరి పరిచయం చివరకు ధర్మారావంటే గిడుగు విశేషమైన అభిమానం ప్రకటించేంత వరకూ పెరిగింది గ్రంథాలయం నుండి ఒకటి కన్నా ఎక్కువ పుస్తకాలు విద్యార్థులకిచ్చే ఆచారం అప్పట్లో లేదు. దానిని ధర్మారావు పట్ల సడలించి ఎన్ని కావాలంటే అన్ని పుస్తకాలిచ్చేలా ఆజ్ఞ జారీ చేశారు వైస్ ప్రిన్సిపాల్ గిడుగు తరగతిలో తతిమ్మా విద్యార్థులకన్నా ధర్మారావువైపే చూస్తూ పాఠం చెప్పేటంతవరకు సాగింది ఆ అభిమానం చివరకు తన ఇంట్లోని సొంత గ్రంధాలయంలో ఉన్న వివిధ విషయాల గురించిన పుస్తకాలనూ ఇచ్చి ధర్మారావును చదవమనేవారు

విజయనగరంలో చదువుతున్నకాలంలోనే ధర్మారావు స్మయిల్స్ రాసిన కారెక్టర్, సెల్ఫ్‌హెల్ప్ అన్న పుస్తకాలను చాలా అభిమానంగా చదివేవారు అలాగే గోల్డ్‌స్మిత్ రాసిన 'సిటిజన్ ఆఫ్ ది వరల్డ్' కూడానూ. ఇవి ధర్మారావులో చెడు మీద అసహ్యం కలగడానికీ, మంచిమీద ఆప్యాయతా, స్వయంకృషి, అధ్యయనం మీద శ్రద్ధా కలగడానికి దోహదం చేశాయి. ఈ భావాలే పర్లాకిమిడిలో గిడుగు నేతృత్వం కింద చక్కని అధ్యయనశీలుడుగా, స్వయంప్రతిభను సంపాదించడానికి కృషిచేసేవాడిగా వీరిని తీర్చిదిద్దాయి.

అంతకుముందే తెలుగులో ధర్మారావుకు పరిచయం ఉండటం గమనించాం. 1902 - 1903లో విజయనగరంలో సురభి కంపెనీ వారి నాటకం చూసిన ధర్మారావు అలాగే వచ్చిరాని భాషలో మాటలు ఏవో పాత్రల నోట పలికించి మిత్రులతో నాటకాలు ఆడుతుండేవాడు. దీనికి పూర్వం

శ్రీకాకుళంలో ఉండగా ఒక పూనా నాటక కంపెనీ రావడం రామాయణం లోని కథలూ, ప్రహ్లాద కథనూ నాటకం ఆడటం ధర్మారావు చూశాడు. ఈ అనుభవంతో విజయనగరంలో మిత్రులతో కలిసి ఆదిభట్ల నారాయణదాసు హరిశ్చంద్ర కథను తీసుకుని కొన్ని పాటలు పాడిస్తూ సంభాషణలను ధర్మారావు చెప్తూ వాళ్ళచేత అనిపిస్తూ నాటకరచన ఆశువుగా చేయటం ఆరంభించాడు. నాటకమంతా మాటలు వీరు చెప్తూండగా అందరూ కూచొని గంటన్నరలో తయారుచేసుకొనేవారు.

పర్లాకిమిడి కాలేజీలో విద్యార్థి మిత్రులకు ధర్మారావుకు తెలుగులో ఉన్న ఆసక్తి తెలిసింది. ఆ కాలేజీలోనే బొబ్బిలి నుండి వచ్చిన సుసర్ల సత్యనారాయణ కూడా చదువుతుండేవాడు. అతడికి కాస్త గాత్రం బాగుండేది. తెలుగు పద్యాలను శ్రావ్యంగా చదివేవాడు. అతడి దగ్గర ప్రబంధ పద్య రత్నావళి అన్న పుస్తక ముండేది. అందులో ఆయా ప్రబంధాల్లో ఉన్న రసవత్తరాలైన పద్యాలన్నీ అనేక శీర్షికల కింద ఉన్నాయి. వీన్ని వెంకటగిరి సంస్థానం వారు ప్రచురించారు. కావాలని ఎవరడిగినా ఆ సంస్థానం వాళ్ళే ఖర్చులు పెట్టుకుని పంపుతూండేవాళ్లు. ధర్మారావు కూడా వీన్ని పంపమని తమ భాషా పరిచయం ప్రదర్శిస్తూ ఉత్తరం రాశాడు. కొన్నాళ్ళకు ప్రబంధ పద్యరత్నావళితోబాటు దాదాపు ఇరవై ప్రాచీన గ్రంథాలను వెంకటగిరి సంస్థానం వారు పంపారు. ధర్మారావు ఆ విధంగా ప్రబంధాలతో తొలి పరిచయం సంపాదించుకున్నాడు. అన్నిటినీ కంఠతా పట్టేవాడు. ఒకసారి చదివితే వచ్చే శక్తి వారికుండేది.

ఈ దశలో గిడుగు రామ్మూర్తి కాలేజీలోని విద్యార్థులను తెలుగు పుస్తకాలు చదవాలనీ, ఎవరెవరు ఏయేపుస్తకాలు చదివింది ప్రతిరోజూ ఒక రిజిస్టరులో నమోదుచెయాలనీ ఆజ్ఞజారీచేశారు. ఇది ధర్మారావుకు చాలా లాభించింది.

ఒకనాడు ఆ రిజిస్టరులో 'తారాశశాంక విజయం' అని ధర్మారావు రాశాడు. గిడుగువారు "నిజంగా చదివావా" అంటే కొన్ని పద్యాలప్పజెప్పాడు. దాంతో సంతోషించి తెలుగు కవులకున్న శృంగార పిపాసను గురించి ధర్మారావుకు గిడుగు ఉపన్యాసమిచ్చాడు.

ధర్మారావు ఎఫ్. ఎ. ద్వితీయ సంవత్సరంలో ఉన్నప్పుడు బొబ్బిలి నుండి సామవేదుల సోమనాథశాస్త్రి అనే విద్యార్థి వచ్చి ఎఫ్.ఎ. మొదటి సంవత్సరంలో చేరాడు. అతడికి తెలుగులో మంచి ప్రవేశం ఉండేది. ధర్మారావుకూ అతడికీ సహవాసం కుదిరింది. తీరిక ఉన్నప్పుడల్లా ఏవో తెలుగు

పుస్తకం చదివి చర్చిస్తుండేవారు. ఆ విధంగా ధర్మారావుకు తెలుగు ప్రాచీన గ్రంథాలన్నీ దొరికిన మేరకు చదివే అవకాశం కలిగింది.

విజయనగరంలో చిన్న చిన్న పద్యాలనూ పాటలనూ అల్లుతున్న కాలం నుండి ఇంతటి పరిశ్రమా ఇన్ని అవకాశాలనూ సద్వినియోగపరచుకోవటం వల్లనే ఎఫ్.ఎ. అయింతర్వాతా, బి.ఎ. చదివే మధ్యకాలంలోనూ వీరు చేసిన చిరుద్యోగాల్లో ఒక రచయిత కాగల అర్హత ధర్మారావు కొచ్చింది. బరంపురంలో కళ్ళికోట కాలేజీలో లోయర్ సెకండరీ సెక్షన్‌లో మాస్టారుగా పని చెస్తున్నప్పుడు (1906) మిగిలిన సహాధ్యాపకులందరికీ మంచి మిత్రుడిగా ఉండేవారు. దీనికి కారణం ధర్మారావు తనకొచ్చిన పద్యాలను సందర్భోచితంగా చదివి వినిపిస్తూండటం, మధ్యలో సొంతంగా పద్యాలల్లుతూండటం. వీటికి తోడు బూతు సమస్యలు సహాధ్యాపకులిస్తూంటే పద్యాల్లో ధర్మారావు పూరిస్తూ మిత్రులను ఊరిస్తూ కాలక్షేపం సాగిస్తూండేవారు. పద్యాల రచనలో సాధనకు ఈ సమస్యాపూరణం ధర్మారావుకు బాగాన లాభించింది.

ధర్మారావులో కవిత్వ దృష్టి బాగా ఉండేది కానీ కాలం మాత్రం చక్కని విమర్శకుడుగా ఆయన్ని స్థిరపరిచింది. అయితే ఆ విమర్శలో కూడా కవికుండే భావోద్వేగం కనిపిస్తూండటం మనం చూడొచ్చు. నాటక రచనలో మరింత. విజయనగరంలో 1904వ సంవత్సరంలో ధర్మారావు చదువుకుంటున్న రోజుల్లో దీపావళి వచ్చింది. ఇంటిల్లిపాదీ ఊరూ వాడా టపాకాయలూ సిసింద్రీలూ కాలుస్తూ ఆ రాత్రి సంబరం చేసుకుంటున్నారు ధర్మారావు మాత్రం తన గదిలో కూర్చొని ఆలోచిస్తూ ఒక నాటకం రాస్తున్నారు. అదీ తెలుగులో కాదు ఇంగ్లీషులో. 'ది అన్‌లక్కీబాయ్'. స్వకపోల కల్పితం ఆ నాటకం ఎప్పుడూ వెలుగు చూడలేదని అలాగే అంతమైందనీ ధర్మారావు రాసుకున్నారు. బహుశా ఇదే వారి తొలిరచన కావచ్చు.

ఒక వ్యక్తికున్న అన్ని కళలనూ ఉపయోగించటానికి నాటక రచన అవకాశం కల్పిస్తుంది. చిన్నతనంలో శ్రీకాకుళంలో, విజయనగరంలో కొన్ని నాటక సమాజాలాడిన నాటకాలు చూడటంవల్లా దీనికి తోడు మిత్రులతో కలిసి చిన్న చిన్న నాటకాలను విజయనగరంలో ఇళ్ళ డాబామీద - చేసుకున్న కిరీటాలతో, భుజకీర్తులతో, గినుకున్న తెరలతో ఆడటంవల్లా ధర్మారావులో ఈ నాటకాల మీద ఆసక్తి బాగా పెరిగింది అదే వారిని 'ది అన్‌లక్కీబాయ్' రచన చేసేలా చేసింది.

పర్లాకిమిడిలో చదువు పునాదులను గట్టిపరచింది. పెక్కలిలో, బరం పురంలో ఉద్యోగాలు మంచి మిత్రులను సంపాదించిపెట్టాయి. తెలుగు మీద మరింత గాఢ పరిచయాన్ని, అభిమానాన్ని పెంచాయి.

బరంపురంలో ధర్మారావుకో మిత్రుడు, సహాధ్యాపకుడూ ఇవటూరి సన్యాసిరాజనే వారుండేవారు. సంస్కారం సభ్యతా ఉన్న వ్యక్తి. వీరిద్దరూ ఒక నాటకం చూశారు. అది ఆ రోజుల్లో (1906) బాగా ప్రఖ్యాతి చెందిన బూర్ల బ్రదర్స్ అనే కంపెనీ వారాడిన నాటకం.బహుశా రాధాకృష్ణ కావచ్చు. రచయిత పానుగంటి లక్ష్మీనరసింహారావు. సాధారణంగా పానుగంటివారి నాటకాలను ఈ కంపెనీ ప్రదర్శించినంత బాగా మరెవరూ ప్రదర్శించలేరనే నానుడి ఆనాడుండేది.

నాటకం చూసి ఇంటికొచ్చిన ధర్మారావుకు ఒక నాటకం రాయాలన్న ఆలోచన వచ్చింది. అప్పటికే పర్లాకిమిడిలో చదివిన ప్రాచీన ప్రబంధాలలో వీరికి విజయవిలాసం బాగా మనస్సుకు హత్తుకొంది. దాన్నే నాటకంగా రాయాలని అనుకున్నారు. మూడురోజులు దీక్షపట్టి నాటకం రాశారు. పానుగంటి వారి ప్రభావం అడుగడుగునా ఉంది. విశారదుడి పాత్ర చిత్రణలో ఇది మరింత స్పష్టంగా కనిపిస్తుంది.

మిత్రులు సన్యాసిరాజు కీవిషయం తెలియదు. ధర్మారావు ఈ నాటకం ప్రతిని తీసుకెళ్ళి వారికి చూపారు. పానుగంటివారే రాసిన మరో నాటకం అనుకున్నారాయన. పద్యరచనలో గానీ నాటక నిర్వహణలో గానీ సరిగ్గా పానుగంటి పద్ధతే. చాలా సంతోషించాడు. ఇద్దరూ దీన్ని అప్పటికింకా అక్కడే నాటకమాడుతున్న బూర్ల బ్రదర్స్ వారికి చూపారు. దీనికి 'విలాసార్జునం' అని పేరెట్టారు. ఈ నాటకం 1914 లో వేగుచుక్క గ్రంథమాల ద్వారా అచ్చయి వెలుగు చూసింది.

ధర్మారావు తొలి తెలుగు రచన గానూ- వెలుగు చూసిన తొలి నాటకం గానూ విలాసార్జునాన్ని పేర్కొనవచ్చు. విజయవిలాసం మీది ఈ అభిమానం, క్రమంగా జీవితాంతం శ్రమించి ఎందరో పండితులను వాదోపవాదాలలో జయించి హృదయోల్లాస వ్యాఖ్య రచించేలా చేసింది. ధర్మారావును తెలుగు వ్యాఖ్యాతల్లో పెద్దపీట వేసి కూర్చోపెట్టింది.

బరంపురం ఉద్యోగం మధ్యలో వదిలి బి ఎ. చదవడానికి ధర్మారావు 1907 లో మద్రాసు వెళ్ళాడు. పచ్చయ్యప్ప కళాశాలలో చేరాడు. అక్కడ ఇంగ్లీషు వ్యాసరచన శేషాద్రి అయ్యంగారు చెప్పేవాడు. 'రైలు కిటికీలోంచి' అన్న వ్యాసం రాయమని కొత్తగా చేరిన విద్యార్థులందరినీ పురమాయించారు.

ప్రదునాగండరీపీ దిద్ది విమర్శిస్తూ సూచనలిస్తూ వ్యాసాలను ఇచ్చేస్తున్నారు. ధర్మారావు వ్యాసం ఊహాచాతురికి కవిత్వ ధోరణికి బాగుందని ప్రశంసిస్తూ ఇచ్చేశారు.

ఇవన్నీ ధర్మారావు, ముస్ముందు వ్యాస రచయితగానూ, నాటక రచయితగానూ, కవిగానూ రూపొందగలడన్న భావాన్ని కలిగిస్తాయి ధర్మారావు సర్వతోముఖ ప్రతిభను సంపాదించటానికి ఇవన్నీ క్రీడాంగణాలుగా ఉపయోగపడ్డాయి.

## విలాసార్జునం - పరిశీలన

ధర్మారావుకు హైస్కూలులో చదివేకాలం నుండీ సాహితీపిపాస ఉండేది. చిన్నచిన్న పద్యాలు రాసినా నాటకాల్లో పాత్రలకు చిన్నచిన్న డైలాగులు రాసినా అవన్నీ సాధనకోసం ఉపయోగపడ్డాయనవచ్చు. పర్లాకిమిడిలో చదివిన కాలమే వీరిలో ఆ సాహిత్య భావాల కొక రూపాన్ని సమకూర్చింది. ప్రబంధాలతో పరిచయం, కావ్యాల పద్ధతిలో పద్యరచనా, విశేషంగా చదవాలన్న ఆకాంక్షా ఇవన్నీ పర్లాకిమిడిలో ఉన్న కాలం సంతరించి పెట్టినవే. అనుకున్నది సాధించడంలో పడే శ్రమ వల్ల కలిగిన ఆనందాన్నీ, పట్టుదల ఎలా చూపాలన్నదాన్నీ గిడుగువారినుండే ధర్మారావు అభ్యసించాడు. ఎఫ్ ఎ. మొదటి శ్రేణిలో కృతార్థులయ్యారు ధర్మారావు. తండ్రి ఆర్జన అస్తుభిస్తుగా ఇల్లు గడవటానికి సరిపోయేది. అన్న నరసింగరావు విశాఖపట్నంలో డాక్టరు చదువుతున్నాడు. ధర్మారావు కప్పుడే పెళ్ళి కూడా అయి కుటుంబ రక్షణ పైన పడింది. ఇవన్నీ చూసిన ధర్మారావు కుటుంబ ఆర్థికపరిస్థితులు కాస్త కుదుటపడేదాకా చదువు ఆపాలని నిశ్చయించుకున్నాడు. అయితే ఉద్యోగం ఎలా దొరకాలి? అప్పటికే కొన్ని కాలేజీల వాళ్ళు స్కాలర్‌షిప్ ఇస్తాం. వచ్చి బి. ఏ చదవమని రాశారు. పరిస్థితులను నిశితంగా ఆలోచించి ఉద్యోగం చెయ్యటమే ధర్మంగా భావించాడు.

తండ్రి అప్పన్నకు పోలీసు ఇలాకాలో కొందరితో పరిచయాలున్నాయి. ప్రయత్నించారు. ఫలించలేదు. ఫారెస్టు డిపార్టుమెంటులో కొన్ని ఖాళీ లున్నా

యని తెలిసి పెద్దదొరను కలిస్తే లాభం ఉండవచ్చునని ఆయన్ని కలవటా నికి విశాఖపట్నం వెళ్ళాడు ధర్మారావు. అదీ అనుకూలించలేదు

అప్పుడు ఆ ప్రాంతంలో పాలిట్ దొర స్కూళ్ళ ఇనస్పెక్టరుగా పని చేస్తుండేవాడు. ధర్మారావు హైస్కూళ్ళలో చదివే రోజుల్లో ఇనస్పెక్టరుగా వెళ్ళి వారి ప్రతిభను గమనించినవాడీయన. కాకతాళీయంగా విశాఖపట్నంలో వారిని కలిసి పరిస్థితిని వివరిస్తే టెక్కలి మిడిల్ స్కూలులో ఒక టీచరు పని ఖాళీ ఉంది చేరమన్నాడు. పదిహేను రూపాయలు జీతం వస్తుందనీ త్వరలో ఎక్కువ జీతం దొరికే స్కూలుకి మారుస్తాననీ చెప్పడంతోనూ, ఇంటి ఆర్థికస్థితి ధర్మారావును తొందరపెట్టడంవల్లా వెంటనే వెళ్ళి టెక్కలి ప్రభుత్వ మిడిల్ స్కూలులో టీచరుగా 1906లో ప్రవేశించాడు.

కె. నమశ్శివాయ ఆ స్కూలుకు హెడ్‌మాస్టరు. బ్రాహ్మవివాహం, అదీ విధవావివాహం చేసుకున్నవాడు. ధర్మారావు ఇంగ్లీషు, లెక్కలు చెప్తుండే వాడు. ఒకటి, రెండవ ఫారాల్లో వీరి దగ్గర చదువుకున్న టంకాల జగన్నాధ మూర్తి టెక్కలిలో ఇంకా సజీవులే. వీరు దాన ధర్మాలు చేస్తూ ప్రశాంతంగా జీవితం వెళ్ళబుచ్చుతున్నారు. 85 సంవత్సరాల వృద్ధులు. తనకు ధర్మారావుతో ఉన్న పరిచయాన్ని గుర్తుచేసుకుంటూ సంతోషపడిపోయారు. ధర్మారావు నర సింహస్వామి కోవెల వీధిలో ఓ ఇంట్లో భార్యా సహితంగా కాపురం ఉండేవా రట. లెక్కలూ, ఇంగ్లీషూ చెప్పటంలో చాలా ప్రతిభ చూపెట్టేవారట. 'విమల' నవలను వారికి ధర్మారావు బోధించేవారట. కొద్దికాలం మాత్రమే అక్కడున్నా చక్కని పేరు సంపాదించుకొన్నారట వీరితోపాటు అయ్యల సోమయాజుల సూర్యనారాయణ, గోవిందు వెంకటప్పయ్య కూడా అక్కడ అధ్యాపకులుగా పనిచేశారు. ధర్మారావు బాగా కవిత్వం చెప్పేవారని అధ్యాపకులూ, విద్యా ర్థులూ కూడా అనుకుంటూండేవారు. ఇంటి దగ్గర విద్యార్థులకు ట్యూషన్‌లు కూడా చెప్పుకుంటూ, నమశ్శివాయ బ్రాహ్మ సమాజ భావాలతో తన అభిప్రా యాలను కలబోసుకుంటూ కొద్ది నెలలే ధర్మారావు టెక్కలిలో పనిచేశాడు

ఇంతలో పాలిట్ దొర బరంపురంలో కళ్ళికోట కాలేజీ లోయర్ సెకం డరీ సెక్షనులో మాస్టరుగా పనిచేయటానికి వీరిని తీసుకెళ్ళారు. జీతం 25 రూపాయలు. మూడో ఫారంలో ఒక డివిజన్‌కి టీచరుగా పనిచేస్తున్నారు. పాఠాలు బాగా చెప్తారని అనతికాలంలోనే పాకిపోయింది. ప్రస్తుతం బరం పురంలో జి.యల్. మిత్రా వీధిగా చలామణీ అవుతున్న ప్రాంతంలో ధర్మారావు ఉంటూండేవారు. తండ్రి అప్పన్నకు చాలామంచి పేరుండేది ఆప్రాంతంలో.

ఆ కాలేజిలో ధర్మారావు దగ్గర ఆనాడు రెండవ ఫారంలో విద్యార్థిగా ఉన్న ప్రముఖ రచయిత ఉప్పల లక్ష్మణరావు తన పాత జ్ఞాపకాల పొరలను తిరగేస్తూంటే చాలా ఉద్వేగానికి గురయ్యారు. ధర్మారావు నల్ల ఆల్పాలాం కోటూ, తెల్లపంచా, తలపాగాతో, చేతిలో పేకబెత్తంతో కళ్ళముందు కద లాడుతున్నట్టుగా భావించారు. విద్యార్థులందరూ ధర్మారావు తరగతిలో చదువు కోవాలని ఉబలాటపడ్తూండేవారట. క్లాసులో చాలా సరదాగా అన్ని విష యాలూ బోధించేవారట. రాష్ట్రపతిగా పనిచేసిన వి. వి. గిరి అక్కడ నాల్గవ ఫారం చదువుతూండేవారప్పుడు.

ఆ కాలేజికి గణపతయ్య ప్రిన్సిపాల్. ఇవటూరి సన్యాసిరాజు, ఉన్నం రామలింగస్వామి, బచ్చు లక్ష్మీనరసింహస్వామి తదితరులు టీచర్లుగా ఉండే వారు. ఉన్నం రామలింగస్వామి తర్వాత కాంగ్రెసులో చేరి బరంపురానికి చేర్మన్‌గా కూడా పనిచేశారు.

ధర్మారావు చుట్టూ ఎప్పుడూ మిత్రబృందం ఉంటూండేది. ఆ రోజుల్లో బూతు సమస్యలను పూరించటం ధర్మారావు సరదాలలో ఒకటి.

కొందరు విద్యార్థులకు ట్యూషన్లు చెప్తూ ధర్మారావు తన జీతానికి కాస్త చన్నీళ్ళు వేణ్ణీళ్ళను కలిపి మంచి టీచరుగా పేరుప్రతిష్ఠలు సంపాదించారు.

ఏట్స్‌దొరా, శ్రీనివాసయ్యంగారూ బోధనా పద్ధతులను సంస్కరించి డైరెక్ట్ మెథడ్ ప్రచారంలోకి తెచ్చిన రోజులవి. ఒక తనిఖీ సందర్భంలో ధర్మారావు 'పియర్స్' అన్న శబ్దార్థాన్ని కొన్ని కాగితాలలోకి చాకును గుచ్చి బోధిస్తూంటే ప్రిన్సిపాల్ గణపతయ్య వీరి బోధనా పద్ధతిని మెచ్చుకున్నారు.

అధ్యాపక బృందానికి ఆప్తుడుగా, విద్యార్థులకు ఆదర్శ ఉపాధ్యాయు డుగా ధర్మారావు అక్కడ ఉంటున్న రోజుల్లో ఒక నాటకం కంపెనీ తమ నాట కాన్ని చాలా రోజులు ప్రదర్శించింది. ఒకనాడాప్రదర్శన ధర్మారావు, సన్యాసిరాజు చూశారు. ఆ సంఘటన ధర్మారావు చేత తొలినాటకం 'విలాసార్జునం' రాసేలా చేసింది.

ధర్మారావు రాసినట్లు ఆ కంపెనీ బూర్ల బ్రదర్స్ వారు నిర్వహించేది. ఈ కంపెనీని గూర్చి మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి తన ఆంధ్రనాటక రంగ చరిత్రలో (పేజి 458 సం. 1969) ఇలా రాశారు. "పూర్వం ఆంధ్రదేశం లోనూ ప్రస్తుతం ఒరిస్సా రాష్ట్రంలోనూ ఉన్న బరంపురంలో జగన్నాధ విలా సినీ నాటక సమాజాన్ని బూర్ల సోదరులు స్థాపించారు. ఈ సమాజంలో నాయిక పాత్రధారణలో మద్దూరి అప్పారావు పంతులుగారు ప్రముఖులు. ఈ సమాజం ఎక్కువగా పానుగంటివారి నాటకాలనే ప్రదర్శించేది."

దీనినిబట్టి బూర్లవారు ప్రదర్శించిన నాటకం పానుగంటి వారిది. ఈ విషయాన్ని ధర్మారావు కూడా రాశారు. అయితే అది ఏ నాటకమని మీమాంస. పానుగంటివారు 1907 నాటికి నర్మదాపురుకుత్సీయము, సారంగధర, ప్రచండ చాణక్యము, రాధాకృష్ణ నాటకాలే రాసినట్లు వీరి రచనలు - జీవితం మీద పరిశోధన చేసిన ముదిగొండ వీరభద్రశాస్త్రి (1968) నిరూపించారు. పానుగంటివారి రచనలు అచ్చుకాకముందే చాలా నాటకసమాజాలవారు ఈ నాటకాలాడారని కూడా వీరన్నారు. పై నాటకాల రచనా క్రమం కాలానుసారిగా పరిశీలిస్తే నర్మదాపురుకుత్సీయం 26-4-1900 నుండి 26-5-1900 మధ్యా; సారంగధర 1904 లోనూ (ఇది అచ్చయిన సంవత్సరం); ప్రచండ చాణక్యము 20-3-1903 నుండి 15-11-1903 లోనూ (అచ్చు 1909 లో అయింది); ఇక నాలుగవది రాధాకృష్ణ. 1903 తర్వాత పానుగంటి వారు రచించారు. అయితే దీనిని తణుకులోని డి. వి. రమణారావు అండ్ కో వారు మొదటిసారిగా 1909 లో అచ్చేశారు ఈ మధ్య కాలంలోనే రాధాకృష్ణను తెలుగునాట అనేక నాటక సమాజాలవారు ప్రదర్శిస్తూండేవారు. సహజంగానే పానుగంటివారి నాటకాలనే ప్రదర్శించే బూర్ల బ్రదర్స్ వారి జగన్నాధ విలాసినీ నాటక సమాజం ఈ రాధాకృష్ణనే ప్రదర్శించటం, ధర్మారావు అప్పుడు కళ్ళికోట కళాశాలలో అధ్యాపకుడుగా ఉంటూ, సహాధ్యాపకులు ఇవటూరి సన్యాసిరాజుతో కలిసి చూడటం సంభవించింది. రాధాకృష్ణ నాటక ప్రదర్శననే ఆ రోజుల్లో ధర్మారావు చూశారనటానికి దాఖలాగా అక్కడప్పుడు జిల్లా మున్సిఫ్‌గా ఉన్న వి. రంగారావు పంతులు 29-3-1907 న రాసిన లేఖలోని అంశాలుకూడా ఉపయోగపడ్తాయి. ఆ లేఖలో పానుగంటివారి రచననూ, హిందూ సంప్రదాయాలను వారెలా ఉదాత్తంగా చిత్రించిందీ పేర్కొంటూ నాటకం చూసినప్పుడు తనకు కలిగిన అనుభూతిని వివరించారు.

అప్పటికి ధర్మారావు పానుగంటివారి నాటకాలు చదవలేదు. చూడలేదు. మొదటినుండీ ప్రాచీన సాహిత్యం మీద అభిమానం ఉండటం, అడపాదడపా పద్యాలు రాస్తూండటంతో ఈ నాటక ప్రదర్శనను చూడటం ధర్మారావు మీద గట్టి ముద్రవేసింది. తానూ ఒక నాటకం రాయాలనుకున్నారు. పానుగంటివారిలాగా రాయాలనుకున్నారు. మరి ఏ కధ తీసుకోవాలి? ఎలాగ రాయాలి? అన్నప్పుడు వారికి కళ్ళముందు విజయవిలాసం తప్ప మరోటిలేదు.

విజయవిలాసానికి హృదయోల్లాస వ్యాఖ్య రాస్తూ ముందు పీఠికలో తనను చేమకూరకవి పాకరుచి చాలా చిన్నతనంలోనే అంటే 15, 16 సంవత్సరాల వయస్సులోనే ఆకర్షించిందన్నారు. పర్లాకిమిడిలో ఉంటూ వెంకట

గిరి సంస్థానంవారు పంపించిన పూర్వ తెలుగు గ్రంథాల జాబితాలో ధర్మారావు దీన్ని తెప్పించుకున్నారు. కనుక అప్పటినుండే అంటే 1904 నాటికే ధర్మారావుకు చేమకూర రచన మీద అభిమానం ఏర్పడింది. దీన్నే ధర్మారావు రాధాకృష్ణ నాటకం చూసిన ఉత్సాహంలో ఒక నాటకంగా రాశారు తాపీ నాటకాన్ని మూడు రోజుల్లోనే రాశానన్నారు పానుగంటివారి పద్ధతికి తగినట్టు వారు శారదుడిని చిత్రిస్తే వీరు విశారదుణ్ణి చిత్రించారు.

ఈ రచనను సన్యాసిరాజుకు చూపడం వారికదంతా పానుగంటి రచనే అని అనిపించడం చాలా సంతోషంతో ఆ రచనను బూర్ల సోదరులకు చూపటం జరిగింది. వారు దీన్ని ప్రదర్శిద్దామని అనుకున్నారుగానీ అలా జరగలేదు. నాటకం పేరు ఇటునుండి అటు తిప్పి 'విలాసార్జునం' అని పెట్టారు. 1907కు కొన్ని నెలల ముందు బహుశా 1906 చివరలో రాసిన ఈ నాటకాన్ని ధర్మారావు తమ వేగుచుక్క గ్రంథమాల 6వ మరీచికగా 1914లో బరంపురం నుండి ప్రచురించారు.

బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాల్లో 1857లో విశ్వవిద్యాలయాల స్థాపన జరిగింది. తెలుగు జిల్లాల్లో ఆంగ్ల విద్యా వ్యామోహం పెరిగింది. దేశ భాషల్లో పండితులైనవాళ్ళు కూడా ఆంగ్ల భాషా ప్రభావానికి గురవుతున్నారు. తమలో జీర్ణించుకున్న సంస్కృత విద్యా సంస్కారానికి ఆంగ్ల విద్యాప్రభావం తోడయింది. ఈ రెంటి ఘర్షణలోకానీ, సమ్మేళనంలోకానీ కొత్త ఊహలతో ముందుకు వచ్చినవాళ్ళలో కోరాడ రామచంద్రశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం పంతులు, పరవస్తు వెంకటరంగాచార్యులు తెలుగు నాటక సాహిత్య విషయంలో ప్రథములు.

అప్పటి స్థితిని చూస్తే తొలి తెలుగు స్వతంత్ర నాటకం కోరాడ రామచంద్రశాస్త్రి రాసిన 'మంజరీ మధుకరీయం'. ఇది 1860 ప్రాంతంలో రాసింది. అచ్చయింది చాలా కాలం తర్వాత ఇక తొలి సంస్కృత రూపకాంధ్రీకరణం కొక్కొండ వెంకటరత్నం పంతులు 1871లో రాసిన 'నరకాసుర విజయ వ్యాయోగము'. దీన్ని 1872లో అచ్చేశారు అదేవిధంగా తొలిసాంఘిక నాటకం వావిలాల వాసుదేవశాస్త్రి రాసిన 'నందక రాజ్యం'. ఇది 1880లో అచ్చయింది.

తెలుగు నాటక రచన 1860లో ఆరంభమయినా కందుకూరి వీరేశలింగం 1880లో విద్యార్థి నాటకసమాజం స్థాపించి తమ నాటకాలను ప్రదర్శించటం ఆరంభించేటంతవరకూ తెలుగుదేశంలో నాటక ప్రదర్శనలంతగా

లేవనే అనాలి. తొలి రచయితలని పైన పేర్కొన్నవారి నాటకాలప్పటికేవీ ప్రదర్శితం కాలేదు.

పి. యస్. ఆర్. అప్పారావు అంచనా ప్రకారం 1860 నుండి 1886 వరకూ తెలుగు నాటక సాహిత్య చరిత్రలో ఆరంభదశ 1886 నుండి 1900 వరకూ వికాసదశ. ఈ వికాసదశలోనే ప్రాచ్య - పాశ్చాత్య రీతుల సమ్మేళనంతో స్వతంత్ర నాటక నిర్మాణ యత్నాలు సాగాయని వీరి నమ్మకం. తర్వాతి మూడవదశ 1900 నుండి 1920 వరకు నడిచింది. తెలుగు నాటక రచన సంప్రదాయ పద్ధతిలో - అంటే అంతకు ముందే ఏర్పడిన మార్గాలలోనే విరివిగా సాగిన దశ. ఈ దశలో వచ్చిన నాటకాలన్నీ ప్రదర్శనా సౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకుని రాసినవి. చారిత్రక నాటకాలు విరివిగా వచ్చాయి.

ఇప్పటికి ప్రసిద్ధ నాటక రచయితలుగా కందుకూరి వీరేశలింగం, వడ్డాది సుబ్బారాయుడు, ధర్మవరం కృష్ణమాచార్యులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, వేదం వెంకటరాయశాస్త్రి, ఆచంట వెంకట సాంఖ్యాయనశర్మ, గురజాడ అప్పారావు, కోలాచలం శ్రీనివాసరావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు తెలుగు దేశంలో పేరుబడ్డారు.

1900 సంవత్సరం నాటికి అంటే ధర్మారావు నాటకరచన చేయబోతున్న (1906) కాలానికి రచనా రీతులలో ప్రధానంగా మూడు లక్షణాలను గమనించవచ్చని పి.యస్.ఆర్. అప్పారావు భావన.

1. కన్యాశుల్కంగా కల్పిత సాంఘికేతివృత్తాలతో నాటకాలు రచించటం.
2. ప్రతాపరుద్రీయం మాదిరిగా చారిత్రక కథలను నాటకీకరించటం.
3. జాతీయోద్యమం దృష్టిలో ఉంచుకుని పౌరాణిక, ఇతిహాసాలలో కథలు తీసుకుని ప్రబోధాత్మకంగా నాటకరచన సాగించటం.

పానుగంటివారు నిజంగా ఈ దశకు చెందినవారైనా వారి రచనా పద్ధతి ధర్మవరం, కోలాచలం వర్గానికి చెందినదే.

ధర్మారావు కాలానికి ప్రధానంగా పైన పేర్కొన్న దశ కొనసాగుతున్నా వీరు తమ రచనను ఇంతకు పూర్వపు వర్గానికీ, తీరుకూ చెందిన పానుగంటి వారిని ఆదర్శంగా తీసుకోవటం గమనార్హం. ధర్మారావు ఆలోచనలుకూడా భాష విషయంలోకానీ, వస్తు స్వీకారం విషయంలోకానీ, రచనా పద్ధతి విషయంలోకానీ ఆ వెనుకటి వర్గానికే చెంది ఉన్నాయి. అందుకే వీరు స్వీకరించిన వస్తువు కూడా పౌరాణిక కథయే!

పానుగంటివారి నాటకాలను సంవాద కౌశలానికి పేర్కొనాలని పింగళి లక్ష్మీకాంతం అనేవారు.7 సంభాషణలు ఉక్తి — ప్రత్యుక్తులుగా ఉంటూ

ప్రసంగవశంలో ఉన్నత పాత్రల చేత కొన్ని వంకరమాటలనిపించటంకూడా కొన్ని సందర్భాల్లో చూస్తాం. రాధాకృష్ణలో సత్యభామ 'పురుషుల అనురాగం చర్మమాత్రగతమే' అంటుంది. ఇక దాసీలు మాట్లాడేవి చాలా అసభ్యకరంగా ఉంటాయంటూ దీనికి కారణం బహుశా పానుగంటి వారి మీద 'రెస్టొరేషన్ కామెడీ'ల ప్రభావం ఉండటంవల్ల కావచ్చని పి. యస్. ఆర్. అప్పారావు సమర్థిస్తారు.8

రాధాకృష్ణ నాటక రచనకు ప్రేరణ ముఖర్జీ రాసిన లార్డ్ గౌరాంగ అన్న ఇంగ్లీషు గ్రంథం. కూచి నరసింహం గౌరాంగ చరిత్రను నాటకంగా రాయమని చెబుతూ పై గ్రంథం ఇచ్చారు దానిలో ఉపోద్ఘాతం చదివేసరికి రాధాకృష్ణ నాటకం రాద్దామన్న తలంపు వచ్చినట్టు దాని తొలిముద్రణ పీఠికలో పానుగంటివారు రాసుకున్నారు. దీనిలో పంతులు రాధచరిత్రను నిష్కళంకం చెయ్యాలనీ, మధురభక్తి రసపోషణం గౌడీయ వైష్ణవ మతానుసారంగా వ్యక్తీకరించాలనీ, రచనాశిల్పం ఉదాత్తం చెయ్యాలనీ, ఆశించారని ముదిగొండ వీరభద్రశాస్త్రి అభిప్రాయం.9 ఈ నాటకానికి 'సత్యా గర్వభంగం' అని పేరుంచితే బాగుండేదని పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి అభిప్రాయపడితే దీనిలో లౌకికదృష్టికన్నా పరమార్ధదృష్టి ఎక్కువ కనుక రాధాకృష్ణ అనే పేరు పెట్టటమే సమంజసమని వీరభద్రశాస్త్రి తీర్మానించారు.

ఈ నాటకంలో 5 అంకాలున్నాయి. 1, 3, 4 అంకాలు బృందావనంలోని కథనూ; 2, 5 అంకాలు మధురలోని కథనూ చెప్తాయి. కథ ఉన్నట్టు పైకి కనిపించకపోయినా ప్రధాన కథ రాధ వృత్తాంతం. అవాంతర కథ సత్యభామది. ఈరెండు ప్రధాన పాత్రలమధ్య వైరుధ్యమే ఈరెండు కథలనూ పరస్పర పోషకాలుగా చేసింది. శ్రీకృష్ణుని అనుగ్రహం రెండింటికీ గమ్యం.

సంభాషణలతో నాటకం పరుగెత్తుతూంటుంది. నాలుగు పురుష పాత్రలు. ఐదు స్త్రీ పాత్రలు.

ధర్మారావు ఈ నాటకం చూసి ప్రభావితులయ్యారంటే ఆశ్చర్యం లేదు. కృష్ణుడి చుట్టూ తిరిగిన స్త్రీల కథను పానుగంటివారు రాస్తే, అర్జునుడి చుట్టూ తిరిగిన స్త్రీల కథను ధర్మారావు చేపట్టారు. పానుగంటివారి నాటకంలో కనబడకుండా ఆదినుండీ ఐదవ అంకం వరకూ కృష్ణుడున్నట్టే ధర్మారావు నాటకంలో కూడా ఆరవ అంకంవరకూ కృష్ణుడుంటాడు.

1914 లో విలాసార్జునం నాటకానికి సంపాదకీయ భూమికను రాస్తూ "ఈ నాటకంబున గథావిషయంబు గ్రొత్తకాకున్నను, రచనా చమత్కృతియు, ప్రకృతి వర్ణనలును, హాస్యరస పోషణంబునున్లోనుగాగల విశేషంబులారయ

దగియున్నయవి. ఒకవంక లీలార్జునుండును, సుభద్రయు, సులూచియు గలిసి శృంగార రసంబు బోషించుచుండ, ఇంకొక వంక విశారదుండును జేటియు సత్యభామయు హాస్యరసంబును వెల్లిగొల్పుచుండ నొక్కసారిగ జదువరుల మనంబులు విచారహితంబులయి యానంద తరంగంబుల నోలలాడు ననుటకు సందియంబు లేదు. ఉత్కృష్టంబులగు ననేక లోక స్వభావ విషయంబులాయాయెడల హాస్య పాత్రల నాల్కలనిడి కాళిదాస, షేక్స్పియారాది మహానాటకకారుల మార్గంబవలంబించిన గ్రంధకర్తగారి యూహయు దాని సాఫల్యంబును పాఠకుల మనంబుల నాటకుంట దుర్లభము'' - అని ధర్మారావన్నాడు దీనిలో కథ కొత్తది కాదన్న విషయాన్ని చెప్తూనే రచనా చమత్కృతిని చూడమన్నాడు. ప్రధాన రసం శృంగారం అన్నాడు. అన్నిటిని మించి గ్రంధకర్త భావాలు హాస్య పాత్రల ద్వారా తెలుసుకోవాలని సూచించాడు. మిగిలిన కథలోని పాత్రలు పాతవైనా కొత్త పాత్రలూ రచయిత మనసులోనుండి ఆయన భావాల కనుగుణంగా మలిచిన పాత్రలన్నమాట నాటి సమాజంలో ఉన్న పరిస్థితులు ముఖ్యంగా ధర్మారావు అభిప్రాయాలను పాఠకుల మనసుల్లో నాటాలని ఆయన తలంపు 'అవి నాటకుంట దుర్లభం' అంటే అంత బలంగా వాటిని పలికిస్తున్నానని రచయిత ఆత్మ విశ్వాసంతో అంటున్నారు.

ఈనాటకానికి పేరు బూర్లబ్రదర్సే 'విలాసార్జునం'10అని దీన్ని చదవగా వినిపెట్టారని ధర్మారావే అన్నారు. నామకరణంలో ఇవటూరి సన్యాసిరాజు ప్రమేయంకూడా ఉంది. విజయవిలాసాన్నే ''ఉల్టాసీదా'' చేశారు.

ఇందులో ఆరు అంకాలున్నాయి. పాత్రల్లో పదమూడు పురుషులవీ, ఆరు స్త్రీలవీనూ. అర్జునుడు కధానాయకుడు. సుభద్ర నాయిక.

నాందిలో సతీవితానాన్నీ, పేదలనూ రక్షిస్తూనూ, భక్తులను ప్రేమతో కాస్తూనూ ఉండే యాదవవంశ పాలకుడు మాకు శుభాలు కలిగించాలని శ్రీకృష్ణుణ్ణి స్తుతిస్తారు. దీనిలో కృష్ణ ప్రేమ సారధ్యంలో అభీష్టాలు పొందే కథను సూచ్యార్థంగా చెప్పి వదిలేశారు.

మొదటి అంకం గంగాతీరంలో జరిగింది. అర్జునుడూఅతని మిత్రుడు విశారదుడూ సంచరిస్తుంటారు. ధర్మజుడు భూప్రదక్షిణ చేసిరమ్మంటే అర్జునుడూ, అతని వెంట విశారదుడూ దేశాలు తిరుగుతున్నారు. అర్జునుడి మనసులో సుభద్రను చేపట్టాలని ఉంది. సౌందర్యరాశి సుభద్రను ఊహిస్తున్న అర్జునుడికి అడుగడుగునా ఆ గంగాతీరం, ఆ వనాలూ, ఆ సైకతస్థలాలూ

అన్నీ రమణీయంగా కనిపిస్తూంటాయి. కానీ వెంటవచ్చిన విశారదుడికివన్నీ "తుప్పల తంపరగానూ, పాడుభూమిగానూ" ఉండటంలో ఆశ్చర్యం లేదు.

ఏ రచయితైనా సందర్భం వచ్చినప్పుడు తన స్వాభిప్రాయాన్ని పాత్రల నోట పలికించటం సహజం. అలాగే ఆ సైకతస్థలాల వర్ణన సందర్భంలో విశారదుడితో సైకతస్థలాలు చేతగాని మంగలి క్షవరం చేసినట్టు ఎగుడు దిగుడుగా ఉన్నాయనీ, నది ఒకచోట పెద్దదిగానూ మరోచోట చిన్నదిగానూ ఉండటాన్ని ''చోరకవి చెప్పు కవితగతి ఇచట సత్యున్నతమై యటనత హీనమై'' అని అనిపిస్తారు.

ఇలాటి అందమైన తీరానికే నాగలోకం నుండి ఉలూచీ, చేటీ వస్తారు. భూలోకసౌందర్యాన్నీ గంగాతీర రామణీయకాన్నీ ఉలూచి వర్ణిస్తూ ముగ్ధురాలవు తూంటే చేటి విశారదుడిలాగా ఈ అందాన్ని ఈసడించుకుంటూంటుంది. భావాలు కలిసినవాళ్ళకు మనువులూ కలుస్తాయంటూ ఉలూచీ అర్జునుల గంగా తీర సౌందర్యారాధనను రచయిత మనముందుంచి చూసుకోమంటాడు.

ఉలూచి మనసు అర్జునునిపై ఉంచని ప్రతిమాటలోనూ వ్యక్తమవుతుంది. అర్జునునికి పలువురు భార్యలున్నారని, వారి నడుమ పోరాటముంటుందని అంటూ సాక్ష్యంగా కృష్ణుని స్త్రీలలో రాధాసత్యల పోరాటం మనం విననిదా అంటుంది చేటి. ధర్మారావు ఆ రాధాసత్యల భావపోరాటం ఈ నాటక రచనకు మూన్నాళ్ళ ముందు చూసిందేకదా. అదే అనిపిస్తారు ప్రసంగవశాత్తు. ఉలూచి అదే ప్రాంతంలో ధ్యానంలో ఉన్న అర్జునుడ్ని తనలోకానికి తీసుకునిపోతుంది.

ఈ అంకంలో కొందరు పశులకాపరులను ప్రవేశపెట్టి విష్కంభాన్ని నిర్వహించారు ధర్మారావు. నాటకాల్లో పాత్రోచిత భాషను వాడటం మీద అప్పటికే రచయితల - లక్షణకర్తల మధ్య సిగపట్లు నడుస్తున్నాయి. సంస్కృతనాటకాల్లో పాత్రోచితభాషఉన్నప్పుడు తెలుగునాటకాల్లోఉంటే తప్పు లేదనటమే కాదు ఉండాలంటూ ప్రముఖులు వేదంవారిలాటివాళ్ళు ప్రతాప రుద్రీయం (1897) ద్వారా స్థిరీకరించారు. అది గ్రామ్యమనీ, వ్యావహారికం కాదనీ వాదోపవాదాలు చెలరేగాయి గ్రామ్య భాషాప్రయోగ నిబంధనం అంటూ 1899 జూన్ లో వేదం వారొక విమర్శన రాశారు.

దీనికన్నా ముందడుగు కన్యాశుల్కం గురజాడవారు వ్యావహారికాన్ని ఉపయోగిస్తూ రచించానంటూ అదే ప్రజలకు సుబోధకం అని దాని మొదటి ప్రచురణ పీఠికలో అంటారు. ఈరకంగా భాషా విషయకంగా నాటక రచనలో భిన్నాభిప్రాయాలున్న కాలం. దానిలో ధర్మారావు పాత్రోచిత భాషనుపయో గించాలన్న వర్గానికి చెందినవారని దీన్ని చూస్తే బోధపడుతుంది. వ్యావహారిక

భాషన్నా, దాన్ని వాడిన వారన్నా వీరికి కంటగింపు అందుకే విష్కంభంలో పశుల కాపరుల పేర్లు కూడా గుర్రోడు, జడ్డోడు, అప్పిగాడు. ఈ పేర్లకున్న శ్లేషార్థాలను రచయిత చక్కగా వాడుకున్నాడనవచ్చు. ప్రసంగవశాత్తూ గ్రామ్యాన్ని తిట్టాడు కూడానూ. కేవలం ఈ విష్కంభాన్ని రచయితకు భాష మీదున్న అభిప్రాయాలను పాఠకులకి తెల్పటానికి వినియోగించుకున్నాడేగాని దీని ఆవశ్యకం అంతగా కనిపించదు. అర్జునుడ్ని ఉలూచి నాగలోకం తీసు కెళ్ళిందన్న విషయం చెప్పటానికీ, చేటీ విశారదుల మధ్య సమావేశం ఏర్పాటు చెయ్యటానికీ విష్కంభరచన చేయవలసి వచ్చిందని రచయిత పరితలకు నమ్మకం కలిగించలేకపోయారు.

ద్వితీయాంకం అంతా నాగలోకంలో నడుస్తుంది ఉలూచి అర్జునుడ్ని నాగలోకం తెచ్చింది. అర్జునుడికి స్పృహ వచ్చి పరిసరాలు చూసి ఆశ్చర్య పడేలా చేస్తుంది. అర్జునుడు ఉలూచిని కాంక్షించడం, చేటి విశారదుడ్ని కూడా భూలోకం నుండి తేవడం, ఉలూచీ అర్జునుల వివాహం జరగబోతోందన్న వార్తతో అంకం ముగుస్తుంది. ఈ అంకంలో ఉలూచి కంఠాభరణం అర్జునుడని ఒక చిన్న సన్నివేశంలో రచయిత స్త్రీ ఆధిపత్యాన్ని సూచిస్తాడు పానుగంటి రాధాకృష్ణలో మొదటి అంకం బృందావనంలో, రెండవది మధురలో సాగు తుంది. ఇందులో మొదటిది గంగాతీరం, రెండోది నాగలోకం. సత్యభామ కృష్ణుడి ముందు ఆధిక్యతతో మెలగటం అందులో అయితే, అర్జునుని ఎదుట ఉలూచి ఆధిక్యతతో ఈ విలాసార్జునంలో కనిపిస్తుంది.

రాధాకృష్ణలో పానుగంటివారే సత్యాగర్వభంగం కృష్ణుని శిరస్తాడన ఫలముతో పరిపాకము చెందిందని శారదుని నోట పలికిస్తాడు. భక్తిరస ప్రధా నంగా సాగిన రాధాకృష్ణ నాటకంలో భక్తి అంగాలుగా లలిత, మధుర రాధకు చెలికత్తె లయినారు కృష్ణుని దక్షిణ నాయకత్వం చక్కగా నిర్వహించారు.

అలాగే విలాసార్జునంలో అర్జునుడు శృంగార నాయకుడుగా దక్షిణ నాయకుని లక్షణాలను కనబరుస్తాడు. 3, 4, 5 అంకాలలో సుభద్రార్జునుల సమావేశానికి ధర్మారావు రంగాన్ని సిద్ధపరిచి ఆరవ అంకంలో పరిణయం కోసం ధర్మజాదులను రప్పింపమనీ వెంటనే కళ్యాణమనీ అంటూ ముగిస్తారు.

ఈ నాటకంలో అనేక రసాలను రచయిత పోషించాడని "ఉలూచీ చిత్రాంగద సుభద్రలం బెండ్లియాడునది శృంగార రసము. అందులకు నీవు (అర్జునుడు) పడిన పాట్లు జూచునపుడు హాస్యరసము ఆ పాటులను జూచి నే నాడిన మాటలెల్ల హాస్యరసము. ఇంక మాటలీయక వచ్చుచున్నవి (బలరా

ముని సేనతో యుద్ధము) వీర రౌద్ర భయానక రసములు. ఇన్ని రసముల కిల్లు" అని విశారదుడి నోట ఆరవ అంకంలో (పేజి 42) అనిపిస్తారు.

ధర్మారావే అన్నట్లు "పానుగంటివారి పద్ధతికి తగినట్లు విశారదుడ్ని" చిత్రించారు. రాధాకృష్ణలో శారదుడే అలాంటి లక్షణాలతోనే ఇందులో విశారదుడైనాడు. రాధాకృష్ణ పంచమాంకంలోనే కృష్ణుడు నారదుడ్ని "భక్తిగానవి-శారదుండు" అని శారదుడి ఎదుట అంటే, శారదుడు నా ముందర కూడ వి-శారదుడా కాదు స- శారదుడని అక్షరాల విరుపుతో సూచిస్తాడు. ఇదే ధర్మారావు నాటకంలో విశారదుని పాత్రసృష్టికి కారణభూతమైంది.

పానుగంటివారి చేటి పాత్రలు అక్కడక్కడ రాధ, సత్యలపైన అధికారం చూపుతూ అనవసరమైన చనువుతో అశ్లీలార్ధకాలైన సంభాషణలు చేస్తాయి. శారదుడు కృష్ణునితో తదితరులతో ప్రసంగించే సందర్భంలో కూడా నోటి దూకుడు కనిపిస్తూంటుంది. కానీ ధర్మారావు పాత్రలు చాలా హుందాగా మాట్లాడటం చూస్తాం. అభంగ-సభంగ శ్లేషలతో అందాలను బాగా సాధించారు. పదాల విరుపులతో రచన ఇలా సాగింది.

అర్జు : ఇపుడు నీకంతగా మూడనున్నదేమి

విశా : ఏమియు లేదు ప్రాణ మూడనున్నదని

అలాగే లతకూన పూవులు దెమ్మనటంలో లతకూనా-పూవులు అనివిరుపు.

పానుగంటివారి రచనలో ఉపమాలంకారాలు చాలా ఎక్కువ. ధర్మారావు రచనలోనూ అదే పద్ధతి. ధర్మారావు పద్యరచన చాలా అందాలను సంతరించుకుంది. వర్ణనలన్నీ ప్రాచీన కావ్యాలలోని శైలిలోనే సాగినాయి. అనేక రకాల ఛందస్సులను ధర్మారావు వాడారు. రాధాకృష్ణలోలాగా కొన్ని చోట్ల పాటలను కూడా రాశారు.

ఈ విలాసార్జునం ఆధారంగా ధర్మారావు నాడున్న గ్రాంథికభాష మీది తమ మమకారాన్ని వాడుకభాష మీది అసహ్యాన్ని వ్యక్తపరిచారు. ముఖ్యంగా అప్పుడే కన్యాశుల్క నాటక రచన ద్వారా లబ్ధప్రతిష్ఠులైన గురజాడవారిని ఈసడించారు.

మొదటి అంకం విష్కంభంలో పాత్రలు గుర్రిగాడు, జడ్డిగాడు, అప్పిగాడు. ఆ పాత్రలు పశుల కాపరులవి కనుక పాత్రోచితంగా వ్యావహారిక భాష రాశారు. విశారదుడు వాళ్ళమాటలూ, భాషా విని "ఓరీ గుర్రజడ్డప్పయ్య ప్రముఖులారా! మీ గ్రామ్యభాషా వ్యభిచారిణి మాయాంధ్రభాషా పతివ్రతకు జాల హానికరంబగుచున్నది" అని అంటాడు. వాడుక భాషను నాడందరూ గ్రామ్యమని తిట్టినట్లే వీరూ తిట్టారు.



5 జనవాణి దినపత్రిక సంపాదక వర్గం. 1936



6 మద్రాసులో ధర్మారావు నిర్వహించిన సంస్కరణ వివాహం. 1952

అయితే ఇక్కడొక చిన్న ఊహ. ఇది రచించింది 1906లో. అప్పటికి భాషోద్యమం పదుగురి ముందుకీ రాలేదు. గిడుగువారు ఉద్యమంలోకి దూకింది కూడా 1910లోనే. గ్రాంధిక భాషా, అగ్రాంధిక భాషా వాగ్వివాదాలుమాత్రం జనంలో నడుస్తున్నాయి. గ్రామ్యమంటూ వాడుక భాషను తిడుతున్నారు. వేదంవారు శుద్ధ గ్రాంథిక భాషను వ్యతిరేకులుగా ఉండేవారు. ధర్మారావు గ్రాంధిక భాషకే కొమ్ము కాశారు. విలాసార్జునం అచ్చేసే నాటికి అంటే 1914 నాటికి భాషా ఉద్యమం ముమ్మరంగా సాగుతోంది. పండితుల మధ్య గిరులు స్పష్టంగా కనిపించసాగాయి. కనుక ఈ భాగం ధర్మారావు అప్పుడు రాసి ఉండవచ్చు. గురజాడ ఉద్యమం కూడా 1914 నాటికి పరాకోటికందుకుంది

ఇదేవిధంగా చిన్నతనంనుండీ తనలో బ్రాహ్మణేతరాభిమానం ఉండ కనక ఈ విలాసార్జునంలో ఆయా వర్ణనల సందర్భంలో ఆ భావాన్నే వ్యక్తీక రించటం గమనించవచ్చు విశారదుడు ఒకచోట చెట్లనూ పిట్టలనూ చూసి వర్ణిస్తూ "అట్లయినను, జెడబలిసి కదలునంత మాత్రమున నుస్సురను బ్రాహ్మ ణులఁబీతినున్న ఈ చెట్లను, చెట్లయాకుల గడుపారదిని సంతర్పణకు బోయిన పారులగతి సమితముగ బ్రేలు బిట్టలును" అని అంటాడు[2]

మరో సందర్భంలో పశుల కాపరుల మధ్యకు ఊలాచి చెటి వస్తుంది. ఆమె పలకరిస్తే ఒక పశులకాపరి 'ఒడ్డి' 'ఓయి. వెందుకేటి' అని లంటాడు. అప్పుడు గుర్రిగాడు— ఓరెంతబాగా మాటాడ్రా. అచ్చ బాప్మడ్నాగే (పేజీ41) అని అంటాడు. బ్రాహ్మలు మాట్లాడేదే సరైన భాషనీ ఇతర్లది భాషే కాదనే ధర్మారావులో ఉంది. తాను బ్రాహ్మణులలాగా అన్నిటా ఆధిక్యాన్ని పొందా లంటే వాళ్ళ భాష గ్రాంథికం కనుక అలా లానూ ఆ వాదాన్నే సమర్థించా లనుకున్నారు కనుక గ్రాంధికం, బ్రాహ్మణ్యం అన్నవి రెండూ ఒకదానికొకటి ప్రతీకగా భావించటంవల్ల ఆ భావాన్నే ఈ పాత్రనోట పలికించారు. అలాగే విశా రదుడు ఆ కాపరులను మీలో బాగా ఎవరు మాట్లాడ్తారని అడిగితే గుర్రిగాడు:- అనాగయితే మాయిద్దర్నీకాం. మాజడ్డోడి మాటచ్చ బాప్మడిమాటనాగుంటాది అని అనిపిస్తాడు రచయిత. అదే విధంగా వేరొక సందర్భంగా వేటగాళ్ళ విశారదుడ్ని చూసి "అమ్మ బాపనయ్య ఎంత గటుకుడోస్సి" అని అనిపిస్తూం డటం గూడ తన చుట్టూవున్న నాటి బ్రాహ్మణుల మీద తన అభిప్రాయాన్ని ధర్మారావు చూపారనవచ్చు.

సంభాషణలను చిన్న చిన్న వాక్యాలతో నడిపించటం ద్వారా ప్రదర్శ నను దృష్టిలో ఉంచుకున్నారు. షేక్స్పియర్ నాటకాల ప్రభావం ఒక విధంగా ఇందులోని పాత్రల స్వగతాల మీద ఉంది. ఒక పాత్ర మానసిక భావాలను

వ్యక్తీకరించటానికి ఈ స్వగతాలు బాగా ఉపయోగపడ్డాయి. అంకాలను రంగాలుగా విభజించకపోవడంలో ధర్మారావు పానుగంటి వారిని అనుసరించారు. పద్యరచన నిర్దుష్టంగా పానుగంటివారి రచన కన్నా ఎన్నో విధాల మెరుగు. దీనికి కారణం ఇంతకు పూర్వమే పద్యరచనలు చేయి తిరిగేలా సాధన చేశారు. ప్రాచీన కావ్యాల శైలిని బాగా వంటబట్టించుకున్నట్టుగా ప్రతి పద్యం మనకు సాక్ష్యాన్నందిస్తుంది. అనేక అలంకారాలను పద్యాల్లో వాడారు. పద్యరచనకుదాహరణగా ఉషాబాలి అర్జునుడ్ని వర్ణించే సందర్భంలోది చూద్దాం-

"చంద్రుడన్నను మేనిలో గందులేదు - మారుడన్నను పీనికాకారమేమి?
మదనుబూదిసి సుధతోడ మెదపచేసె - నజుడు, కాకున్న నీమేని
యందమున్నె" (పేజీ 35)

అదే విధంగా గంగను వర్ణిస్తూ అర్జునుడన్న మాటలు -

చల్లనగునట్టి గంగామతల్లి తనదు
శిరమునందున దాల్చుట చేతగాక
విషము మ్రింగియు ప్రాణంబు వీడకుండ
నెట్లుమనగలవాడు మహేశ్వరుండు

ఇక అర్జునుడ్ని ఈసడిస్తూ బలరాముడు -

నిలువగనూరులేదు ధరణీపరులెల్లరు నవ్వునట్లుగా
గుడువగ గూడునున్న భటకోశములన్న హుళక్కి గౌరవం
బిలనెటుగన్న బూజ్యముగదే! మరి యైక్యము నాస్తిగ వారిలోపలన్
పలికెదు వందిరీతినతిభవ్యులటంచు నిదేమితమ్ముడా (పేజి 65)

అని కృష్ణునితో ధనం గొప్పతనాన్ని చెప్తాడు. అప్పుడు కృష్ణుడు -

సంపదలుచూడ దిరుగును జక్రముగతి
ఇప్పుడున్నస్థానమందెవ్వడుండు
నతడె క్షణమునకావల నవనిదాకు
గాన నన్నయ! యిందులకలదెపాడి (పేజి 66)

అని సంపదల చక్రభ్రమణాన్ని బలరాముడికి స్పష్టం చేస్తాడు. అప్పటికే ధర్మారావు జీవితం ఈ చక్రభ్రమణానికి గురయింది కనుకనే ఇంత సూటిగా ఆ భావాన్ని సందర్భోచితంగా అనిపించగలిగాడు.

ఇక మరో సందర్భంలో అభిజాత్యాన్ని గూర్చి రుక్మిణి నోటితో -

పెద్దవారిండ్లబుట్టియు నేరికైన
గుణముగల్గిన యాడువు కుప్పలగుట

పేదలయ్యును సుగుణుల బెక్కు-జనుల
గాంచుచున్నాముగాదటే కల్కి- మనము (పేజి 115)

అని ధర్మారావు తన అభిప్రాయాన్ని ప్రకటింప జేస్తాడు.

ధర్మారావు అనేక సామెతలను, నానుడులను సందర్భానుసారంగా వాడి వాటికి సార్థక్యం తెచ్చాడు గోరుచుట్టుపై రోకటిపోటు, ఎలుకకు ప్రాణ సంకటము - పిల్లికి చెరలాటము, తాదెచ్చుకొంది తాననుభవించకపీలా, చూడ చూడ అయ్యవారు కోతి అయినట్లుండటం, కాకికిష్టంబు కాదటే కాకిపిల్ల.... మహాగజావలాయంతే మశకానాంతుకాగతిః, అడగక అమ్మయినబెట్టదు, తాపల చింది రంభ, మౌనం అర్ధాంగీకారం, సిరిరా మోకాలడ్డువారెవరు- అగ్ని కాజ్యంబు చాడ్పున, అయ్యవారిని చెయ్యబోయి కోతిని చేతుసు - వంటివి అనేకం కనిపిస్తాయి.

చిన్న వయస్సులోనే చక్కని పాకానపడ్డ కవిత్వమూ, లోకాన్ని నిశితంగా పరిశీలించే శక్తి సంతరించుకుని విజయవిలాసంమీద తనకున్న సదభిప్రాయంతో ధర్మారావు ఈ 'విలాసార్జునం' నాటకం రాశాడు. తన హృదయోల్లాస వ్యాఖ్యకు రంగం సిద్ధపరుచుకున్నాడు.

## గ్రాంథిక భాషావాదం - పరామర్శ

ధర్మారావు పాతపాళీ అన్న పేరుతో కొన్ని ఖండికలను 1960 లో ఒక ప్రచురణగా తీసుకొచ్చారు. పేరునుబట్టే వారు పాత పద్ధతి - సంప్రదాయాల భావాలతో రాసిన రచనలని అర్థమవుతుంది. దీనికి పాతపాళీ అని పేరుంచటానికి కారణం వీరా తర్వాత కొత్త (పాళీ) సూత్రాలనీ కొన్నిటిని ఏర్పాటు చేసుకుని ఆ సూత్రాల ఆధారంతో కొత్తపాళీ వ్యాసాలను రాయటం. (1936) వీటిని ఒక గ్రంథంగా 1955 లో ప్రచురించారు.

తీరికగా కూర్చుని ఒక విషయాన్ని ఎంచుకుని ర[illegible] [illegible]ష్టం ధర్మారావుకు అలవాటు లేదని వారే పాతపాళీ పీఠికలో అ[illegible]. [illegible]న్ని

వేశమో, అనుభవ విశేషమో, ఉద్యమమో గట్టిగా ఊహలను కదిలించినప్పుడే కావ్యరచనకు వేడి కలగటం జరిగిందని వారన్నారు.

అలా ధర్మారావును విద్యార్థి దశలో బాగా కదిపిన ఉద్యమం భాషాపరమైంది. నిరంతరం ప్రాచీన కావ్యాలను చదవడం వల్లా, బ్రాహ్మణుల భాషగా లోకంలో చెలామణి అవుతున్న గ్రాంథిక భాషలో దాన్ని సమర్థించడంలో, దానిలో రచన చెయ్యడంలో, వీళ్ళందర్నీ మించిన పాండిత్యం, సామర్థ్యం సంపాదించి వాళ్ళను మించిపోవాలన్న లోలోపలి భావం వల్లా గ్రాంథిక భాషా ఉద్యమం వీరిని ఆకర్షించింది. దాన్ని మనసా వాచా సమర్థించటం కర్తవ్యమనుకున్నారు. ఆ కార్యక్రమంలో భాగంగ్గానే 1908-1909 ల మధ్య ఒక ఖండికను రాశారు. పేరు 'గ్రాంథిక భాషా వాదము'. ఇది చంపకమాలిక.

పర్లాకిమిడిలో ఎఫ్. ఎ చదువుకుంటున్న కాలంలో ధర్మారావు గిడుగు రామ్మూర్తి శిష్యులు. వారి వాదన బాగా ఎరిగున్నారు. గిడుగువారు భాషోద్యమాన్ని చేపట్టి తీవ్రతరం చేసింది 1910 తర్వాత. అంతకుముందు ఈ భాషా వివాదం కొద్దిగా నలుగుతూ నడుస్తూనే ఉంది ధర్మారావు రాసిన ఈ ఖండికను పరామర్శించేముందు ఆనాటి భాషోద్యమ స్వరూపస్వభావాలను కొంతైనా పరిశీలించటం ధర్మం ధర్మారావు దీన్ని రాయటానికి కారణం కొంత బోధపడుతుంది.

గ్రాంథిక భాషాభిమానుల్లో వ్యావహారిక భాష మీద ఒక దురభిప్రాయం ఉండేది. వ్యావహారికాన్ని గ్రామ్యమని నిరసించారు. గ్రామ్యంలో వ్యవస్థ ఉండదని, ఉదాత్త విషయాల నిరూపణకు సామర్థ్యం ఉండదనీ అందులోని పదాలు నిత్యజీవితంలో లోకవ్యవహారాన్ని నిర్వహించుకోటానికి మాత్రమే సరిపోయి ఉంటాయని, అది కావ్య భాష కానేరదని వాళ్ళ వాదన. రసావిష్కరణకు గ్రామ్యం అనుకూలించదని కూడా తెగేసి చెప్పారు గ్రామ్యం అంటే లక్షణ విరుద్ధమైందని తీర్మానించారు.

గ్రామ్యం అనేది పరిభాషకు చెందిన పదం. 'నీచపాత్ర' అన్నట్టు. సంస్కృత నాటకాల్లో విదూషకుడికి ప్రాకృతం ఉపయోగిస్తారు. అలాగే స్త్రీలకు కూడాను. ఈ పాత్రలకు ఉపయోగించే భాష సంస్కృతం కాకుండా కొన్ని చోట్ల మాగధి, శౌరసేని, పైశాచి, కొన్నిచోట్ల అపభ్రంశాలై ఉండటం గమనిస్తామనీ, ప్రాకృతము, ఈపైపీ సంస్కృత గ్రామ్యాలేనని అంటే ఆయా దేశ ప్రజలు ప్రయోగించినవన్న భావాన్ని విశదీకరిస్తూ ఎరగుడిపాటి వెంకటాచలం అముద్రిత గ్రంథ చింతామణి (12వ సంపుటం 4 వ సంచిక 1899 ఏప్రిల్, పుట 12, 13) లో చాలా చక్కగా చెప్పారు. నాటకాలలో గ్రామ్య

భాష ఉపయోగించవచ్చా? అని ఒక పెద్ద చర్చ పూండ్ల రామకృష్ణయ్య తమ అముద్రిత గ్రంథ చింతామణిలో 1897 - 1899ల మధ్య నిర్వహించారు. పండితులు తలపట్లు పట్టుకున్నారు. ధర్మారావు ఇవన్నీ అడపాదడపా చూసి ఉండొచ్చు విద్యార్థి దశలో.

ధర్మారావుకు అభిమానుల్లో ఒకరైన పానుగంటివారు గ్రామ్యవాదుల భాషాపవాదమన్న వ్యాసం తర్వాత రాసి గ్రామ్యాన్ని నిరసించడం (1913 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక) జరిగినా ఇదే అభిప్రాయం ధర్మారావులో ఇంతకుముందే పాదుకుని ఉంది.

నాడున్న ఈ గ్రాంధిక - గ్రామ్య భాషా వివాదాన్ని పరిశీలిస్తే ప్రాచీన శాసనాలన్నింటా గ్రామ్యమే ఉండేదని ఆ రూపాలే అధికంగా ఉండేవని నాటి శాసనాలను పరిశీలించి గిడుగు వివరించాడు. నన్నయ్య నుండి కఘవె వీరరాజు దాకా వచన రచన సహజమార్గం వదలి కష్టతరమైందని గొబ్బూరి వెంకటానంద రాఘవరావు తన ఆంధ్ర వచన రచనా పరిణామంలో అభిప్రాయపడ్డాడు. ఈ గ్రామ్యం అంటే వ్యావహారికం వచన రచనకే గానీ కావ్య రచనకు కాదని రామ్మూర్తి అనేక సందర్భాల్లోచెప్పాడు. అదీకాక తెలుగులో పద్యకావ్యంపుట్టిన సుమారు ఆరువందల సంవత్సరాల దాకా వచన కావ్యం పుట్టకపోవడంవల్ల వ్యావహారిక భాష కావ్య భాషగా ప్రాచుర్యం పొందలేక పోయి ఉండవచ్చు. కావ్యభాషలో వచనం పాలు నన్నయ నుండి చేమకూర వెంకటకవి దగ్గర కొచ్చేసరికి 4శాతం మాత్రమే ఉందని గొబ్బూరి అంచనా.

కఘవె వీరరాజు భారత వచనంలో అర సున్నల్లేవు. సంధులను సరిగా పాటించలేదు. నిండుసున్న వెనకక్షరం విధిగా ద్విత్వంగా ఉంటుంది. వలపల గిలకేగాని రేఫం వాడడు. ఆ కాలంలో వచ్చిన ఇతర వచన కావ్యాలన్నీ వ్యావహారికంలో ఉన్నాయి. గోవుచరిత్రమనే కావ్యంచూస్తే ఇంత చక్కని వ్యావహారికంలో రాశారా అనిపిస్తుంది. ఇలా అనేక ఉదాహరణలను గద్య చింతామణిలో రామ్మూర్తి వెలపరిచి పదిమందికీ చూపాడు.

చిన్నయసూరి నీతి చంద్రికను 1853లో రాసి, బాలవ్యాకరణాన్ని 1858లో ప్రకటించే వరకూ మనకున్న వచన వాచకాలూ, వ్యాకరణాలూ వ్యావహారిక భాషలోనే ఉండేవి పుదూరి సీతారామశాస్త్రి 1847లో పెద్దబాలశిక్ష రాశాడు. చిన్నయసూరికి ముందు రాజధానీ కళాశాల, మద్రాసులో వీరు పండితులు. వీరు 1834లో ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణం రాశారు. ఈ గ్రంథాన్నీ - పెద్దబాలశిక్షనూ వ్యావహారికంలోనే రాశారు. 1836లో రావిపాటి

గురుమూర్తి వ్యాకరణాన్ని, 1837లో గ్రంధకరణ సభవారు ముద్రించిన శేషయ్య వ్యాకరణాన్ని చూస్తే అవి వ్యావహారికంలోనే ఉన్నాయి.

ఎర్రమిల్లి మల్లికార్జునుడు 1856లో ప్రకటించిన చార్ దర్వేష్ కధలూ, సామినేని ముద్దు నరసింహులు 1862లో ప్రకటించిన 'హితసూచని' అన్న పుస్తకం వ్యావహారికంలోనే ఉన్నాయి.

దృశ్యకావ్యాల్లో పాత్రోచిత భాష అంటూ వ్యావహారిక భాషకూ - ఆనాటి గ్రామ్యానికి - ప్రవేశాన్ని పండితులు అంగీకరించారు. కాని శ్రవ్య కావ్యాల్లో వ్యాకర్తలు అంగీకరించలేదు. దీనికి కారణమేమంటే వ్యుత్పత్తి సాధకాలైన శ్రవ్యకావ్యాల్లో గ్రామ్యం ప్రవేశిస్తే భాషా సాంకర్యం ఏర్పడి సౌష్ఠవం చెడుతుందని వాళ్ళు భావించారు.

బహుశా ఈ గ్రామ్య గ్రాంధికవాదం 1870 ప్రాంతంలో తలెత్తి ఉండవచ్చునని అక్కిరాజు రమాపతిరావు తన వ్యావహారిక భాషా వికాసం చరిత్రలో భావించాడు.

చిన్నయసూరి నీతి చంద్రిక రావటం. కొక్కొండవారు ఆ శైలినే అనుకరిస్తూ విగ్రహ తంత్రాన్ని 1866లో (1872లో అచ్చయింది) రాయటం కొక్కొండవారే తమ నరకాసుర విజయ వ్యాయోగంలో అన్ని పాత్రలకు సలక్షణ భాషనే వాడుతూ 1871లో వెలువర్చటంతో గ్రాంధిక భాష ప్రాచుర్యం పొందటం ఆరంభించింది. వీరేశలింగంకూడా సంధి, విగ్రహాలను చిన్నయసూరిలాగానే ప్రౌఢంగా రాశాడు ఇవి పరీక్షకు పఠనీయ గ్రంధాలయాయి. బాల వ్యాకరణం-నీతిచంద్రికలు పండితులను ప్రభావితంచేశాయి. వాళ్ళను ఆకట్టుకున్నాయి.

కానీ, క్రమంగా వీరేశలింగం 1874 ప్రల్లా తమ వివేకవర్ధని పత్రికలో భాషా విషయపంగా సరళ గ్రాంధికానికి మారానని తెలుపుకున్నాడు. కొక్కొండవారు 1872 నుండీ ఆంధ్రభాషా సంజీవని నడుపుతూ గ్రాంధిక వాదాన్ని సమర్ధిస్తున్నారు. వచనరచన ద్వారా ఈ వాదాలు 1870 - 1880 మధ్య స్పష్టంగా గ్రామ్య గ్రాంధిక రూపంలో స్థిరపడ్డాయి. నాటి సాహిత్య పరిస్థితులను 1878వ సంవత్సరంలోని హిందూ పత్రిక వేసిన అంచనాని వీరేశలింగం తమ స్వీయ చరిత్రలో (పుట 148, 1915 వి. చ. గ్రం. పొందుపరిచారు. వీరేశలింగం నడిపిన పత్రికలూ, రాసిన ప్రహసనాలూ సరళ గ్రాంధికంలోనే ఉండేవి. కొక్కొండవారు తమ పత్రికలూ - రచనలూ గ్రాంధికంలో నడపటమే కాకుండా పత్రికా రచనలో కూడా గ్రామ్యం పనికి

రాదని పట్టుదలతో ఉన్నారు. జయంతి రామయ్య పంతులు వర్గం కూడా ఏది మతాన్నే ప్రచారం చేస్తూండేది.

ఈ విధంగా గ్రామ్య గ్రాంధికవాదాలు తెలుగు పండితులను కుదుపుతున్న దశలో గురజాడవారి కన్యాశుల్కం రావటం, వేదంలాంటి వారు పాత్రోచితభాషను బహుళంగా ప్రవేశపెట్టటం జరిగింది. ఇది గ్రామ్యవాదుల కొక ఊపునిచ్చిందనవచ్చు.

ఇక విశ్వవిద్యాలయాల్లో మాత్రం చిన్నయసూరి మార్గమే అనుసరణీయమైంది. దేశభాషలకు సగౌరవమైన స్థానం పాఠ్యప్రణాళికలో లేదు. ఆధునిక విజ్ఞానం దేశభాషల్లో విస్తరించలేదనీ దానికి కారణం ఆయా భాషల్లో పదజాలం పెరగటం లేదనీ ఒక నిపుణుల సంఘం 1905లో తమ నివేదికలో పేర్కొంది. ఈ సంఘాన్ని 1903లో గవర్నర్ జనరల్ కర్జన్ ఏర్పాటు చేసి దేశంలో విశ్వవిద్యాలయాలను స్థాపించింతర్వాత ఏమాత్రం అభివృద్ధి సాధించామో పరిశీలించమన్నాడు. ఈ నివేదికను చూస్తే మనకు నాడు గ్రాంథికవాదం చేసిన చెరుపు అర్థమవుతుంది. ఈ కమిటీ కొన్ని సూచనలు చేస్తూ వాటిని అమలుపరిస్తే పరిస్థితి మెరుగుపడవచ్చున్న ఆశాభావం వెల్లడించింది.

ఆ సూచనల పర్యవసానంగా కావచ్చు 1906లో జె.ఎ. ఏట్స్ తెలుగు జిల్లాలలో పాఠశాలాధికారిగా వచ్చాడు. అతడు గ్రంథరచనాశైలికీ వ్యావహారిక శైలికీ భేదాన్ని కనిపెట్టి విస్మయపడి విశాఖపట్నం కళాశాల ప్రధానాధ్యాపకుడు పి.టి. శ్రీనివాసయ్యంగారును కారణం అడిగాడు. వారు గురజాడ - గిడుగుల చిరునామాలిస్తూ వాళ్ళే ఇందుకు సమాధానం చెప్తారన్నాడు. ఏట్స్ గురజాడను విజయనగరంలోనూ, గిడుగును పర్లాకిమిడిలోనూ కలిశాడు. 1907వ సంవత్సరం వచ్చింది. గిడుగు అప్పుడప్పుడే తెలుగు కావ్యాలను సూక్ష్మదర్శినితో అధ్యయనం చేస్తున్నాడు. ఇదంతా చూసిన ఏట్స్ అధ్యాపకులకు 1907 నుండీ వార్షికోత్సవాలలో ఉపన్యాసాలిప్పిస్తూ భాష, శైలి విషయాల మీద వాళ్ళకొక అవగాహన కల్పించాలని కృషిచేస్తున్నాడు గిడుగువారు తామప్పటికి సేకరించిన సమాచారం ఆధారంగా, అప్పటివరకు తెలుగు పండితుల్లో చెలరేగుతున్న గ్రామ్య గ్రాంథిక భాషా వివాదం మీద విరుచుకుపడ్డారు.

సరిగ్గా ఈ దశలో ధర్మారావు తమ అభిప్రాయాన్ని గ్రాంధిక భాషా వాదం వైపు స్థిరీకరించుకున్నాడు. అప్పటికే అలాటి వాదనలో ముందున్న పానుగంటివారి ప్రభావానికి గురైై 'విలాసార్జునం' నాటకం గ్రాంథికంలోనే- అక్కడక్కడ పాత్రోచితభాషను పెట్టినా అదీ గ్రామ్యాన్ని నిరసించటానికే

వాడుకున్నాడు - రాశాడు. ఏట్స్, గురజాడ, గిడుగు, శ్రీనివాసయ్యంగార్, ఈ నలుగురి వాదం అయిన గ్రామ్యాన్ని ఎదుర్కొనాలని అనుకున్నాడు. ఈ నలుగుర్నీ ఆ రోజుల్లో 'దుష్టచతుష్టయం' అని ఎద్దేవా చేసేవారని గిడుగు సీతాపతి తన "హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్" అన్న పుస్తకంలో (పేజి 142, 1968) రాశాడు అప్పారావుకు సలక్షణమైన భాష రాయటం రాదనీ, రామ్మూర్తికి తెలుగు రాదనీ, ఏట్స్ ఆంగ్లేయుడనీ, శ్రీనివాసయ్యంగార్ తమిళుడనీ, వీళ్ళు తెలుగుభాషకు ద్రోహం చేస్తున్నారంటూ ఆందోళన లేవదీశారు గ్రాంధికవాదులు. అప్పటికి పాఠ్యగ్రంథంగా ఉన్న సెట్టి లక్ష్మీనరసింహం గారి గ్రీకు పురాణగాథలన్న పుస్తకాన్ని నిరసించారు. ఏట్స్ చొరవతో స్కూలు పైనలు విద్యార్థుల వ్యాసరచనలలోనూ అనువాదంలోనూ వ్యావహారికభాషను అంతకుముందు అనుమతించారు. ఆ తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలంటూ జయంతివారి నేతృత్వంలో పదివేల సంతకాలు చేయించి ప్రభుత్వానికి గ్రాంథిక భాషావాదులు మహజరు పంపారు.

ఈ విధంగా గ్రామ్య గ్రాందికవాదం బజారుకెక్కింది. ధర్మారావు మద్రాసులో బి.ఎ. చదువుతున్న కాలంలో ఈ వాగ్వివాదాలు తారామండల స్థాయికి చేరుకున్నాయి. ధర్మారావు సహజంగానే తనకున్న భూమిక ఆధారంగా గ్రాంథిక వాదాన్ని సమర్థిస్తూ చిన్న ఖండికను రాశాడు.

ఇదొక చంపకమాలిక ఆరోజుల్లో మాలికా రచన విస్తృతంగానే ఉంటూండేది. పెద్దనలాంటి వాళ్ళే పిల్లకు గురువులు. ఒకరు కవిత్వాన్ని గూర్చి రాస్తే ఒకరు భాష గురించి ప్రస్తావించారు.

సంక్షిప్తంగా ఈ మాలికలోని భావం ఇది. తెలుగుదేశంలో తెలుగు అనే స్త్రీ ఉంది. దాని కథ వింటే కళ్ళనీరు తిరుగుతుంది. రక్తమాగుతుంది చాలా జాలికలగుతుంది ఎందుకంటే ఈ పిల్లకు చిన్నతనం నుండీ అన్నీ గండాలే. వాటిని పారదోలి నన్నయ అనేక భావాలను సంస్కృతం మాటలతో కలిపి నేర్పించి రాజు దగ్గరుంచాడు. తరవాత తిక్కనా, అలాటి అనేకులూ ముద్దు ముద్దు మాటలు నేర్పి వెళ్ళారు. పెద్దన ప్రౌఢరీతిలో ఇంకా కొన్ని నేర్పి రాయల కప్పించాడు ఇతర భాషా పదాలనే అదవులను కాల్చి ఈ కన్నె దిక్కులన్నీ తనవిగా చేసుకుని విశేషసంపదతో ఉంది.

రాయల మరణంతో ఈ లలనకు పాట్లు వచ్చాయి. తురుష్కులు కొంత రూపుమాపారు. రాజ్యాలు నాశనం చేసి గ్రంథాలను కాల్చారు. అప్పుడు ఈ కాంత దేశమిట్లాగుంటే తన గతేమిటనుకుని భయపడి ఓ మూల దాగి ఉంది.

ఇంతలో ఆంగ్లేయులు వచ్చి అభయహస్తమిచ్చారీ అబలకు. నీకు స్వేచ్ఛ నిస్తున్నామన్నారు. దీని చెల్లెలు కన్నడ కాంత దీన్ని చూసి ఈ తెలుగు కాంత ఎందుకిలా నీరసపడి నేల చూస్తూందోనని విచారించింది. 'నీ మాటల్లో వస పోయింది. నీ అందము వాడిపోయిందేమి'టని అడిగితే తెలుగు కాంత వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టింది. ఇలా చెప్పటం ఆరంభించింది.

"గతంలో నాకొచ్చిన తురకల బాధ తగ్గిందనుకుంటే ఇప్పుడు మరింత బాధ ముంచుకొచ్చింది. నా కొడుకులే శపథం పట్టి నన్ను నాశనం చేస్తున్నారు. నా ఆకారం పోయింది. అలంకారాలు పోయాయి. శయ్యలు ఆకాశానికెగిరి పోయాయి. నన్ను నా పిల్లలే పిలవటం మానేశారు. ఇక నాకు నుయ్యో, గొయ్యోగతి. నన్నింక తలవటం మర్చిపో" అని కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

ఇంతవరకూ తెలుగుభాషపు గ్రామ్యవాదులవల్ల కలిగిన కష్టనష్టాలను ధర్మారావు తెలుగావిడ నోటే స్వీయచరిత్రగా పలికించారు. ఇక కవి ముందు కొచ్చి ఇలాగ అంటారు.

ఆమె మాటలు విన్నారు గదా. వివిధ భాషలు నేర్చిన మీరు ఈమెను రక్షించండి మొండిగా గ్రామ్యాన్ని బలపవద్దు ఈ మాటలంటున్నందుకు మరోలా అనుకోకండి. క్షమించండి. ఆంగ్లభాషలో కాని ఇతర విదేశ భాషల్లో గానీ కవులు రాసే భాషకూ, వాడుక భాషకూ భేదం ఉంది కదా.

షేక్స్పియర్ హామ్లెట్‌లో రాసిన భాషకూ బార్కుతో మాట్లాడిన భాషకూ భేదం లేదూ ? తమ కావ్యాలు కలకాలం ఉండేలా రాసిన మిల్టన్, వర్డ్స్‌వర్త్‌లు తాము రాసిన రీతిగా మాట్లాడి ఉంటారా ? టెన్నిసన్ మాట్లాడినట్టు రాసి ఉంటాడా ? డాంటే రచనా - మాటల్లో భేదం లేదా ? కనుక గ్రామ్యంలో రాస్తే వచ్చే తిప్పలు అన్నీ ఇన్నీ కావు. ఎందుకంటే గ్రామ్యం స్థలాన్ని బట్టి మారుతూంటుంది అది చంచలమైంది. కృష్ణాజిల్లా వారి పుస్తకాలు మాకు శ్రీకాకుళం వారికి అర్థంకావు. మా పక్కవాళ్ళు రాసినవి విశాఖజిల్లా వారికి గూడా బోధపడవు. అందుకని లోభి దగ్గర డబ్బు ఎవ్వరికీ ఎలా ఉపయోగపడదో దీని గతి అంతే. నాశనమవుతుంది. మరి నాలుగేళ్లయితే గ్రామ్యంలో అనేక మార్పులొస్తాయి. ఇంగ్లీషు ఎక్కువగా దూరుతుంది. అప్పుడు మన పెన్నిధి భారతమే మనకు తలబరువవుతుంది. ఎలాగంటే ఇంగ్లీషులో చాసర్ కావ్యంలాగా ఎవరికీ ఇదీ అంతుబట్టదు.

కనుక నే చెప్పినవాటిలో మంచి చెడ్డలను జాగ్రత్తగా పరిశీలించండి. శాశ్వతంగా ఉండే గ్రంథాల్లో పటుత్వం ఉండాలి. కాలాన్ని జయించగల శక్తి

ఉండాలి ప్రాంతాల నధిగమించగల దారుఢ్యం ఉండాలి. కనుక గ్రామ్యాన్ని కలపకుండా కంచెలు కట్టండి. సూత్రాలను మార్చకండి.

ఒకవేళ తెలుగును సంస్కరించాలనుకుంటే చాలా పద్ధతులున్నాయి. కొత్త భావాలు ప్రవేశపెట్టండి. శైలిని మార్చండి. అనేకవిధాలుగా ప్రకృతి వర్ణన చెయ్యండి. వాస్తవంగా ఉండే అంశాలను చేర్చండి. అంతేకాని నాశనం చేయకండి గ్రామ్యమనేది పాదరసం లాంటిది. చక్కని బంగారం లాంటి తెలుగును దానితో కలిపితే వన్నె తగ్గి విలువ తగ్గి నీరసమవుతుంది. ఇలా చేయకుండా మా భావాన్ని స్వీకరించండి. సుఖంతో ఉండండి చేతులొడ్డి నమస్కరిస్తాను. అయ్యా నా మాట వినండి. నా పేరు ధర్మారావు

ఇదీ క్లుప్తంగా దీని భావం. నాడు గ్రాంధిక భాషావాదులు చేసే వాదనల సారాంశమంతా దీనిలో రచయిత ఇమిడ్చారు. తెలుగుకాంత కథ చాలా మంది పండితుల అభిమానాన్ని సంపాదించుకుందని రచయితే దీని పీఠికలో రాశారు. ఈ వాదనను ఖండిస్తూ సెట్టి లక్ష్మీనరసింహం ఒక శార్దూల మాలికను ఆరోజుల్లో రాశారు.

అయితే ఈ చిన్న మాలికకొచ్చిన పండిత ప్రశంసలను ఊతగా తీసుకుని, తన వాదం మరింతగా జనంలోకి వెళ్ళాలనే తలంపుతో ధర్మారావు 'ఉషఃకాలము' అనే నవలనొకదాన్ని 1910 ప్రాంతంలో రాశాడు. ఇది తెలుగు వాఙ్మయ స్వీయచరిత్ర. మొదటినుండీ వీరేశలింగం వరకూ అందులో ఉంది. దీనికానాడు చాలా ప్రశస్తి వచ్చింది. దాన్ని వేగుచుక్క గ్రంథమాల ద్వారా 1911 లో మొదటిగ్రంథంగా ప్రచురించారు. తమ ఈ వాదాన్నే ఆంధ్ర పత్రికలో ఒక విన్నపమంటూ ఓ వ్యాస రూపంలో కూడా తర్వాత వెలువర్చారు. కనుక 'గ్రాంధిక భాషా వాదము' అనే ఈ చిన్న మాలిక ధర్మారావుగారి గ్రాంధిక భాషా ఉద్యమంలో ఒక బీజంగా ఏర్పడి అదే క్రమోన్మీలనం అయిందని చెప్పవచ్చు.

## విజయనగరాంజనేయం

ధర్మారావు మద్రాసులో బి. ఎ. పరీక్షకు చదువుతున్న కాలంలోనే చేసిన మరో రచన 'విజయనగరాంజనేయము' 1909. బుద్ధికి తట్టిన ప్రతి భావాన్ని

కవితలో పెట్టి సాధన చేస్తున్నాడు. ఆరోజుల్లో విశేషపరనంగా భారతదేశ చరిత్రగ్రంథాలుచదువుతుండేవాడు. అందులో ధర్మారావు చేతికి 'టాల్‌బాయి వీలర్' రాసిన ఇండియా చరిత్ర ఒకటి అందింది. ధర్మారావుకు మొదటి నుండీ భారతదేశ నాశనంలో అందులోనూ సాహితీ సంస్కృతులను నాశనం చేయ టంలో తురుష్కుల పాత్ర ఎక్కువన్న భావం ఉంది. అందుకే 'గ్రాంధిక భాషావాదము'లో కూడా తెలుంగనెడి కాంతకు 'దురుష్కుల బాధ' ఒకప్పుడు కలిగి తగ్గిందని వర్ణించడం మానలేదు. అలాగే ఈ ఖండికను కూడా ఒక చిన్నకథ - అదీ ఆ వీలర్ రాసిన గ్రంథంలో ప్రసక్తానుప్రసక్తంగా వచ్చిన దాన్ని - ఆధారంగా తీసుకుని గీతమాలికగా రాశాడు.

బహమనీ రాజుల పాలనలోని కథ ఇది. ముజాహిద్ షాహి ఒక బహమనీరాజు. ఇతడు విజయనగరరాజ్యంలో ఒక ఆంజనేయ విగ్రహాన్ని చూస్తాడు తన చేతిలోని గండ్రగొడ్డలితో దాన్ని నరకబోతాడు. ఆ ప్రాంతంలో సొమ్మసిల్లి ఉన్న ఒక ముసలి విప్రుడు షాహిని ఆపబోతాడు. రాజు ఆ ముదుసలిని ఒక్క వ్రేటుతో నరుకుతాడు. అతడు కడసారి ఊపిరి తీస్తూ "నీవు నీ ఊరికి చేరకుండానే చస్తా' వని తిడుతూ చనిపోతాడు. రాజు ఆంజనేయ విగ్రహం ధ్వంసం చేస్తాడు.

తెలుగు సైన్యం ధాటికి తట్టుకోలేక ముజాహిద్ పారిపోతూ దారిలో ఒక చోట గుడారాలేసుకుని విడిది చేస్తాడు అప్పుడు అతని బంధువు దావూదు రాజ్యం కోసం షాహిని హత్య చేస్తాడు బ్రాహ్మణుని తిట్టు నిజమైంది.

ఈ కథను ఆంజనేయుడే విజయనగర సామ్రాజ్య గత వైభవాన్ని చూడడానికొచ్చిన ఒక పథికుడికి చెప్తాడు. రచనంతా చిన్న చిన్న పదాలతో అందంగా సాగుతుంది. పథికుడు -

"ఆంధ్రుల భూరి విక్ర
మంబు నడుగంటగా లేదు - మహిత కీర్తి
గాంచినారలు మావారు గండుమగల
టంచు నింకను మరవరీ యాంధ్రు...." లంటూ "తెలుపు

మవలీల నెవ్వడా తెంపరీడా-" అని ఈ ఘోరకృత్యం చేసింది ఎవ్వరో చెప్ప మంటాడు. అప్పుడు అంజనీపుత్రుడు కథంతా చెప్తాడు. అంతావిన్న పథికు డిలో ధర్మారావు ప్రవేశించి చరిత్ర సంస్కృతులను రక్షించడంలో అనేకులు రాజపుత్రులు ప్రాణార్పణం చేశారంటాడు. ఇలాంటి నిజాలు తెలుసుకోవా లంటాడు. కవులు ఏదైనా రాస్తే

"కపుల వాక్యంబులన్నియు కల్లలన్న
కల్లరుల నోరు మూయింప గతియు లేదు" అని బాధపడుతూనే
"ఐననేమాయె ! నిజమెటు లగును-కల్ల'' - అంటూ తను చెప్పే
దాన్ని విశ్వసించమని అంటాడు.

చివరగా ముగిస్తూ వీరులకు రణరంగంలో శరీరాలంకారాలు ముఖ్యం కాదు 'కత్తిదెబ్బలే' వాళ్ళకలంకారాలని చాటి చెప్పవయ్యా అని హనుమంతుడ్ని ''ఆంధ్రులకెల్ల నాదర్శమైతివీవు'' అని పొగుడుతాడు.

ఇదీ ఒకరంగా స్వీయచరిత్రలాటిదే. సాధారణంగా చరిత్రలో దొరకని ఈ కథను తీసుకొన్నానని రచయితే చెప్పాడు. తెలుంగనెడి కాంత కథ జీవిత చరిత్రయితే ఇది స్వీయ చరిత్ర. ఇందులో వీరరసం అడుగడుగునా పొంగులు వారుతూంటుంది. అనవసర వర్ణనలు చేయటం సుతరామూ ఇష్టంలేని ధర్మారావు కథని సూటిగా చెప్పి తెలుగువాళ్ళను సాహితీ సంస్కృతుల పరిరక్షణలో సైనికులై -

''దేశ గౌరవంబేగిన దేహమేల
లెండు రండంచు" పిలుస్తూ వెన్నుతట్టి కర్తవ్య ప్రబోధం
చేస్తున్నాడు. ఇది పాతపాళీలో ప్రచురణ పొందిన ఖండకృతే.

## సల్లిపై కారుణ్యం

తెలుగులోకి వచ్చిన ఆధునిక ప్రక్రియల్లో 'ఎలిజీ' ఒకటి. పాశ్చాత్య సాహిత్యంలో ఆత్మాశ్రియ భావాలనుండి పుట్టిన ప్రక్రియగా దీన్ని భావించాలి.

"ది ఎలిజీ ఈజ్ ఎ లిరిక్ ఎక్స్‌ప్రెషన్ ఆఫ్ మెలంకలీ ఆర్ గ్రీఫ్ ఇన్ పర్టిక్యులర్ వెన్ కమ్మెమొరేషన్ ఆఫ్ డెడ్ ఫ్రెండ్" అంటూ ఎన్ సైక్లోపీడియా ఆఫ్ అమెరికానా (వా. 17, పేజీ 471) లో దీన్ని వివరించారు.

ఆ సాహిత్యంలో 17, 18 శతాబ్దాల్లో పూర్తిగా నైరాశ్యాన్ని వెల్లడించే కావ్యాలను ఎలిజీలన్నారు. విదేశీ సాహిత్యంలో ఈ ఎలిజీని హెక్సామీటర్, పెంటామీటర్‌లలో నిబంధిస్తూ దుఃఖపూరితంగా ఉండేలా రాస్తారు. అంటే దీనికో ఛందం ఉందన్నమాట.

తెలుగు సాహిత్యంలో ఈ ఎలిజీ లక్షణాలున్న భాగాలు మనకు కొన్ని కనిపిస్తాయి. క్రౌంచపక్షుల జంట వియోగభాగంగానీ, వాలి చనిపోయినప్పుడు తారావిలాపంగానీ, భాగవతంలో కృష్ణ నిర్యాణం తర్వాత ''మన సారథి, మన సచివుడు'' అంటూ సాగిన ఘట్టంకానీ, కుమారసంభవంలో రతీవిలాపం గానీ, భారతం ద్రోణపర్వంలో అభిమన్యుడితో తానూ పోలేదంటూ ధర్మరాజు 'వాని తోడిద లోకమై యేను బోవనైతిబో' (౨ెం. ఆ ప. 143) అన్న భాగాలన్నీ ఎలిజీలే ననవచ్చు.

ఈ ఎలిజీలు ఆంగ్లంలో థామస్ గ్రే (1716-1771) రాసిన 'ఎలిజీ రిటెన్ ఇన్ ఎ కంట్రీ చర్చియార్డ్', గోల్డ్ స్మిత్ (1728-1774) 'ఎలిజీ ఆన్ ఎ మాడ్ డాగ్' అన్నవి ప్రసిద్ధాలు. ఆధునిక లక్షణాలను అధ్యయనం చేస్తూ కాల్‌రిడ్జ్ ఎలిజీ అంటే ''ఆలోచనాపరమైన మనస్సుకు అనువైన కవితా ప్రక్రియ'' అని అంటాడు.

ఆంగ్లంలో రొమాంటిక్ కవిత్వ ప్రభావంతో వెలువడ్డ వాటిల్లో ప్రణయ కవిత్వం, ప్రకృతి కవిత్వం, స్మృతి కవిత్వాలున్నాయి. తెలుగులో అక్కడక్కడ దొరికిన చాటువుల్లాంటి వాటిని మినహాయిస్తే ఇలా స్మృతికవిత్వం రాసిన ఆధునిక కవుల్లో రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, దువ్వూరి రామిరెడ్డి, బసవరాజు లున్నారు.

అయితే అసలీ నూతన 'ఎలిజీ' అన్న ప్రక్రియకు తెలుగులో ఏ పేరుండాలన్న దాన్ని పరిశీలిస్తే ఈ అంశం మీద పరిశోధన చేసిన సి. రఘుపతి రెడ్డి అభిప్రాయం ఇలా ఉంది.

''తెలుగులో స్మృతికావ్యము, శోకగీతము, శోకకావ్యము, విషాదగీతిక, మృతివిషయక కావ్యము అని వాడటం జరిగింది. 1911లో ధర్మారావుగారు సల్లిపై ఒక ఎలిజీ వ్రాసి 'కారుణ్యము' అని పెట్టారు సాధారణంగా ఇవి గేయ, వచనగేయ, పద్యరూపాల్లో ఉండటం చేత సి. నారాయణరెడ్డి తమ పరిశోధన గ్రంథంలో (ఆధునిక కవిత్వం సంప్రదాయం-ప్రయోగం పేజీ 405) స్మృతికావ్యమన్నారు. "స్మృతిలోనే మృతి ధ్వనిస్తోంది".

పై అభిప్రాయాన్నిబట్టి ఈ ప్రక్రియకు ఆదిలో కారుణ్యమని ధర్మారావన్నా - నేటికది అన్ని ఆధునికాంగ్ల ఎలిజీ లక్షణాలనూ పుణికి పుచ్చుకుని 'స్మృతి కావ్యం'గా స్థిరపడటం గమనించవచ్చు. మరణాన్ని మహాసత్యమని చెప్పినా అసహ్యించుకోలేదు.

"డెత్ ఈజ్ లైఫ్స్ హై నీడ్
డెత్ ఈజ్ ది క్రౌన్ ఆఫ్ లైఫ్'' - అంటూ కీట్సు ఎన్ని

కీర్తించాడు.

ఉర్దూలో కూడా ఇలాటి గీతాలను 'మర్సియా' లంటారు. దీనికి ఓ ప్రత్యేక ఛందం వాడ్తూంటారు. ఇలాటి గీతాలను మొహర్రం సందర్భంలో ఎక్కువగా పాడ్తూంటారు.

తెలుగులో వడ్డాది సుబ్బారాయుడు ఇలాటివాటిని 1902 నుండీ రాశారు. దీనికి వారు సతీస్మృతి అంటూ పేరెట్టి వారి భార్యలు వెంకమాంబ, రత్నాంబ, విజయలక్ష్మి, సుబ్బలక్ష్మి, అన్నపూర్ణలు చనిపోయిన సందర్భంలో ఒక్కో చిన్న 'సతీస్మృతి' సంపుటం వెలువరిస్తూండేవారు ఈ ఘటనల మీద కృష్ణశాస్త్రి దనుకునే జోక్ ఒకటుంది. ఒక పర్యాయం వడ్డాదివారి భార్య చనిపోతే 'సతీస్మృతి' రాలేదట. ఇంకా రాలేదేమని మిత్రులెవరో కృష్ణశాస్త్రిని అడిగారట. వెంటనే ఆయన 'ఆ. మరేంలేదు, ఈ పర్యాయం రెండు కలిపి వేస్తారులే' అని అన్నారట. ఏమైనా వడ్డాదివారు తన చివరి భార్య చనిపోయి నప్పుడు వేసిన 'సతీస్మృతి'లో 'దారుణ విధిగ్రద్ద నిన్ను దన్నుకపోయెన్' - అంటూ తన గుండె చెరువు చేసుకుంటాడు.

దేశనాయకులు చనిపోయినప్పుడూ అనేకమంది స్మృతి కావ్యాలను రాశారు. రాస్తూంటారు. అలాటి రచనల్లో గోఖలే నిర్యాణానికి రాయప్రోలు వారు రాసింది చాలా ప్రసిద్ధమైంది.

అయితే కేవలం దుఃఖభాజనం కాక కర్తవ్యబోధ చేస్తూనూ, మరణిం చినవారి ఆశయసాధనకు కంకణం కట్టుకోమనంటూ ఉద్బోధిస్తూ అనేకమంది మృతవీరుల మీద ఆధునిక కాలంలో చాలా స్మృతి గీతాలు వస్తున్నాయి. వీరుడి మరణం నిరాశకూ - దుఃఖంతో కుంగిపోవడానికీ కారణం కాకూడదు. అతడి అనుచరులకు కర్తవ్య సాధనలో మార్గదర్శకంగా ఉంటూ ఉత్సాహం రెట్టింపు చేస్తూ త్యాగాన్ని గుర్తుకు తెస్తుంది. ప్రజా పోరాటాల్లోని మృతవీరుల మీద రాసిన కావ్యాలూ గీతాలూ ఈ దిశలో ఉంటూంటాయి.

ఇక తెలుగులో మానవేతరాల మీద రాసిందీ, అదీ హాస్యం కలగల్పి వ్యంగ్యంగా రాసింది ఈ ధర్మారావు రచన 'నల్లిపై కారుణ్యం'. వారే టుప్ టీకలో అన్నట్టు 1911 లో రాసి బొంబాయి నుండి నాడొస్తున్న ఆంధ్రపత్రిక వారపత్రికలో ప్రచురించారు. దీన్ని వారు బరంపురంలో ఉండగా రాశారు. దీన్ని పాతపాళీలో ప్రకటించారు.

ఇందులో కేవలం అయిదు పద్యాలున్నాయి. నల్లిని చంపుతున్నా అతడి మీద ఆ నల్లికి కోపం రాకపోవడం, చనిపోయిన తర్వాత దాని గత సుఖ మయ జీవితాన్ని తలపింపచేయడం రెండు పద్యాల్లో మనకు కనిపిస్తుంది.

ఇక వ్యంగ్యంగా నల్లులు కుట్టుండడం వల్ల ఎవరెవరికి ఏయే మేళ్ళు ఎలాఎలా జరుగుతూ ఉంటాయో చాలా హాస్యంగా చెప్పడం మరో పద్యంలో చూడ వచ్చు. నాలుగో పద్యంలో నల్లిని చంపినవాని కేమొచ్చింది లాభమంటూ అతణ్ణి దుయ్యబట్టారు. ఇక చివరిదాంట్లో ఈ నల్లిని చంపినందుకు - దాని జాతి - ఆ హంతకులమీద పగదీర్చుకోక మానుతుందా? అంటూ ముగిస్తాడు.

ఇందులో చాలా సరళమైన భాష వాడాడు. ఒక్కోదాంట్లో ఒక్కో రసం కరుణం, హాస్యం, రౌద్రంలాంటివి వాడుకున్నాడు. అంతస్సూత్రంగా హాస్యం - వ్యాజస్తుతి కనిపిస్తూంటుంది ఈ నల్లులుండడంవల్లే నిద్ర రాక పిల్లలు చదువుకుంటూంటారనీ, ముసలివాళ్ళకు నిద్ర పట్టక హరినామ స్మరణ చేస్తూంటారనీ, ఇళ్ళకు సున్నాలు కొడ్తూంటారనీ అంటూ దీని ఒతుకు 'పరోప కారార్థం ఇదం శరీరం' అని నల్లిని పొగుడ్తాడు. దీన్ని చంపినవాడిని శపిస్తూ 'మతి విహీనునకెందును మేలు కూడునా' అంటాడు. దీని చావు చూసి 'మాన్య సుఖవాసి పోతివా మమ్ము బాసి' అంటూ బాధపడ్తాడు. చివరకు చంపిన వాళ్ళ మీద "మీ పగ మాజాతి రీతిని దీర్చ నీదు సత్ సంతతి లేదె" అనంటూ 'నెత్రు దావదె' అని ముగిస్తాడు. పంటికి పన్ను కంటికి కన్ను అన్న నామె తలా "మా రక్తాన్ని తాగిన హంతకులమీద రానున్న సర్షితరం పగ తీర్చు కుంటుంది బాధపడకిందంటూ" భరోసా ఇస్తూ రెండు కన్నీటి చుక్కలు పెడుస్తాడు ధర్మారావు.

చదవడానికి హాస్యంగా కనిపిస్తున్నా పూర్తయిన తర్వాత గుండెల్లో ఏమూలో 'బలహీనులపై బలవంతుల దాష్టీకం' కలుక్కుమంటుంది మనసు. అతి సామాన్యాంశాన్ని అందుకొని ఎంతో నేర్పుగా స్మృతిగీతం రాయడంతో వరవడి పెట్టాడు ధర్మారావు. వీరి కవిత్వం మీద పరిశోధన చేసిన కుమారి రాగిణి ఇది ఎలిజీ అవునా కాదా అంటూ కొంత విచికిత్స చేస్తూ చివరకు 'వస్తువును బట్టి, రచనాధోరణినిబట్టి ఇది ఎలిజీ అనియే చెప్పవలెన'ని ఒప్పు కున్నారు. (పేజి 29. తాపీ ధర్మారావు కవిత్వము - ఒక పరిశీలనము 1980).

తర్వాతర్వాత ఇలా మానవేతరాల మీద చాలా వచ్చాయి. అందులో ప్రసిద్ధం పుష్పంగూర్చి 'పుష్పవిలాపం' అంటూ కరుణశ్రీ రచన, మెకెన్జీ స్మృతి అంటూ టి ఓ యం అయ్యవారు 1961 లో రాసింది మరొకటీనూ.

ఏమైనా గ్రే, గోల్డ్‌స్మిత్ మార్గాన్ని తెలుగులో స్మృతి కావ్యమార్గం ప్రవేశపెట్టింది ధర్మారావే.

## తొలినాళ్ల తొలిచాళ్లు - సూచికలు

1. ధర్మారావు రాలూ - రప్పలూ విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్ విజయ వాడ 1979 పేజి 17. ధర్మారావు 'ఒకప్పుడు మాదీ కార్మిక వంశ మన్న మాట జ్ఞాపకముంచుకొంటారు, ఒళ్ళు వంచి కష్టపడవలసి వచ్చి నప్పుడు అది ఒక చిన్నతనంగా భావించడానికి జంకుతారన్న భావంతో ఇంటి పేరును అలాగే కొనసాగించాన'ని అన్నారు.

2 పాదుషాకు అపభ్రంశ రూపం.

3. 'అస్టబల్' అంటే పార్సీలో అశ్వశాల అని అర్థం. అదే ఇంగ్లీషులో 'స్టేబుల్'గా మారింది. ఏనుగుశాలను 'పీల్ ఖానా' అంటారు. 'ఫీల్' అంటే పార్సీలో ఏనుగు. ఆరోజుల్లో ఈ రెండింటినీ ఏనుగులనూ, గుర్రాలనూ ఒకేచోట కట్టి ఉంచటంవల్ల అస్టబల్ అంటే ఏనుగు శాల అన్న పేరే వాడుకపడి ఉంటుంది.

4. ఆచార్య తూమాటి దొణప్ప, ఆంధ్ర సంస్థానాలు - సాహిత్య పోషణ 1969 పేజి 67-77. బుద్ధిరాజు ఈశ్వరప్ప ఉర్లాం అధిపతి కందుకూరి లక్ష్మీప్రసాదరావు ఆస్థానంలో ఉండేవాడు. ఉర్లాం - దేవారి అనే సంస్థానాల్లో దేవారిని 'దేవిడీ' అని అంటారు. ఈ దేవిడీ అధిపతి కందుకూరి బాల సూర్యప్రసాదరావు. ఉర్లాం - దేవారి సంస్థానాలు అన్నదమ్ములకు వెళ్ళాయి. ఈశ్వరప్ప(1880) కలియుగ మాహాత్మ్యం, గ్రామ నగర నివాస తారతమ్యం, లౌకిక - వైదిక సంవాదం అనే ప్రహసనాలు రాశాడు. ఇవన్నీ సంవాద రూపంలో ఉన్న గద్యాలు. వీటిని చమత్కార రత్నాకరంగా ప్రచురించారు.

5. దీని రచయిత రెంటాల వెంకట సుబ్బారావు మొదట ఇంగ్లీషులో రాసి (1902) తర్వాత తెలుగులోకి అనువదించి (1917) అచ్చేశాడు. ఉద్యోగరీత్యా విదేశాల్లో ఉన్న భర్తకు కమలామణి రాసిన లేఖలివి. ఇంగ్లీషు ప్రతులను ఆరోజుల్లో బ్రిటిష్ చక్రవర్తితో సహా చదివి ఆనందించారట. ఇందులో 21 లేఖలు ఉన్నాయి. వీటిలో సాంఘిక సమస్యలు, మూఢాచారాల నిరసనం, బాల్య వివాహాల ఖండన, దయ్యాల మీదున్న నమ్మకాన్ని దుయ్యబట్టటం, మతాచారాల్లో కల్మషాన్ని చూపటం ఉంది. భాష గ్రాంథికం

6. ఇందూలాల్ యాజ్ఞిక్ వ్యాసం. సంపాదకుడు యస్. పి. సేన్. డిక్షనరీ ఆఫ్ నేషనల్ బయాగ్రఫీ వాల్యూం 4 ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హిస్టారికల్ స్టడీస్, కలకత్తా 1974, పేజి 197 - 199. ఇతడు శ్యాంజీ కృష్ణ వర్మ. లండన్‌లో ఉండే ఇండియా హవుస్ (1905)లో సభ్యుడు. ఇందులో నౌరోజీ, హెన్రీ కాటన్, సర్ విలియం వెడ్డర్న్ ఒర్న్, రమేశ్‌చంద్రదత్, డబ్ల్యు.సి. బెనర్జీలు సభ్యులు. ఇండియా స్కాలర్‌షిప్ అనే పేరుతో సావర్కార్, వి.పి.యస్. అయ్యర్, మదన్‌లాల్ డింగ్రా ప్రభృతులకు ఈ వర్మ ఆశ్రయం ఇచ్చాడు. నా జీవితయాత్రలో టంగుటూరి ప్రకాశం, నవ్యాంధ్రంలో అయ్యదేవర కాళేశ్వరరావు, నేనూ నా దేశంలో దర్శి చెంచయ్య, ఈయనను ప్రశంసించారు. భారత స్వాతంత్ర్య పోరాటంలో ఇతడు తీవ్రవాది. విదేశాల్లో ఉంటూనే భారత విప్లవకారులకు రివాల్వర్లు పంపుతూండేవాడు.

7. డాక్టర్ పి.యస్.ఆర్. అప్పారావు తెలుగు నాటక వికాసం నాట్యమాలా ప్రచురణ, హైదరాబాదు 1967, పేజి 268.

8. డాక్టర్ పి.యస్.ఆర్. అప్పారావు తెలుగు నాటక వికాసం నాట్యమాలా ప్రచురణ హైదరాబాదు, 1967, పేజి 269.

9. ముదిగొండ వీరభద్రశాస్త్రి పానుగంటివారి సాహిత్య సృష్టి శతజయంతి ఉత్సవ స్మారక ప్రచురణ హైదరాబాదు 1968, పేజి 72 - 88.

10. ధర్మారావు రాలూ - రప్పలూ విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజయ వాడ, 1979, . పేజి 95.

# 3

# రాలూ - పూలూ

ధర్మారావు మద్రాసు పచ్చయ్యప్పాస్ కాలేజీలో బి. ఎ. చదవే కాలంలో అనేక విషయాలను నేర్చుకోవటానికి అవకాశం కలిగింది. అంతవరకూ ఏదో ఒక ప్రాంతంలో జరిగే ఘటనలను ప్రతిబింబించే వారి మనస్సు విశాలం కావటం ఆరంభించింది. ఒక రకంగా మానసిక పరిణతి జరిగిన ఈ కాలంలో అనేక ఉద్యమాలను దగ్గరుండి తెల్సుకోవటం, రాష్ట్రం మొత్తం ఏయే రంగాల్లో ఏ దిశలో ప్రయాణిస్తుందో చూడటానికి మద్రాసు నివాసం ఆస్కారం కలిగించింది.

ఒక జాతి సర్వతోముఖాభివృద్ధికి ఎన్ని రంగాల్లో కృషి చేయటానికి తనకు అవకాశం ఉందో గ్రహించ గలిగాడు. చెయ్యవలసిన కృషి ఎంత దీక్షతో. శ్రద్ధతో చెయ్యాలో కూడా అవగతమైంది. చదువుమీద ధర్మారావుకు ఎంత ఆసక్తి ఉన్నా అది నిరాటంకంగా కొనసాగటానికి చితికిపోతున్న ఇంటి పరిస్థితులూ. అన్న నరసింగరావు డాక్టర్ పరీక్ష పాస్ కావటానికి అప్పటికే నెమ్మది మీద అవుతూ, తండ్రి అప్పన్న వృద్ధాప్యంవల్ల వారి డాక్టర్ వృత్తి సరిగా నడవకపోవటం సమస్యలు అడ్డొస్తున్నాయి. బరంపురంలో తండ్రికొక మిత్రుడున్నాడు. వరదా కామేశ్వరరావు నాయుడు. వారు చాలా పేరున్న

వర్తకులు సంగీత సాహిత్యాల్లో అభిరుచి ఉన్నవారు. మద్రాసులో ధర్మారావు బి. ఎ చదివే కాలంలో కామేశ్వరావు నాయుడు భూకామందుల పక్షాన రాష్ట్ర శాసనసభ్యులుగా (1909) ఎన్నికై మద్రాసులో ఉంటుండేవారు.

ఆర్థికపరమైన ఎలాటి ఇబ్బందినీ ఎదుర్కోకుండా బి. ఎ. పూర్తి చెయ్యటానికి వీరి సాయం కారణమని ధర్మారావే ఒక చోట రాసుకున్నాడు. అన్న నరసింగరావు డాక్టరు పరీక్ష ముగించుకొని తల్లిని తీసుకుని వైద్య ఉద్యోగంలో చేరటానికి బర్మా వెళ్ళాడు. చదువు ముగించుకుని ఇల్లు చేరగానే కుటుంబభారం ధర్మారావు కోసం ఎదురు చూస్తున్నది

కళ్ళికోట కళాశాలలో బి ఎ. కు ముందు ధర్మారావు కొద్దికాలం చేసిన ఉద్యోగం పేరుప్రతిష్ఠలు సంపాదించి పెట్టింది. అప్పటి విద్యాశాఖాధికారుల్లో ప్రముఖుడైన యేట్స్‌కీ, పరిశీలకుడుగా ఉండే పాలిట్ దొరకూ ధర్మారావు ఒక మంచి అధ్యాపకుడు కాగలడన్న నమ్మకం ఏర్పడింది. ప్రిన్సిపాల్ గణపతయ్య- బి. ఎ పూర్తిచేసి ఇక్కడే అధ్యాపక బాధ్యతలు స్వీకరించాలని ఎంతో ఆప్యాయతతో ఆనాడు ధర్మారావుని బరంపురం పంపారు. మంచి సాహిత్యాభిరుచి ఉన్న కవిగా, సహృదయుడైన చక్కని మిత్రుడుగా తోటి అధ్యాపకుల్లో వీరిమీద సదభిప్రాయం ఉంది. వీటన్నిటినీ మించి బరంపురం అంటే ఒక రకమైన ఆత్మీయత ఉంది. ఇది చివరివరకూ ఉండేదని ఉప్పల లక్ష్మణరావు చెప్పాడు. 1940 ప్రాంతాల్లో విజయవాడలో ఒక సభలో ధర్మారావును కలుసుకున్నప్పుడు ఆ సమయంలో చాలాభాగం బరంపురం విశేషాలనే తనతో ముచ్చటించారని ఆయన అన్నాడు. అంతటి అభిమానాన్ని ధర్మారావు బరంపురంతో ముడేసుకున్నాడు

1909లో బి. ఎ. పూర్తిచేసుకుని బరంపురం తిరిగొచ్చాడు. అనేక కొత్త భావాలతో, ఉడుకురక్తంతో ఎంతో చదివిన అనుభవాన్ని భుజానేసుకొని కాలుపెట్టాడు. దేశభక్తి భావాలూ, జాతీయోద్యమం, గ్రంథాలయోద్యమం, సాహితీ సాంస్కృతికోద్యమాలు, అప్పుడప్పుడే విజృంభిస్తున్న భాషా వివాదాలు, తెలుగు జనాన్ని ఊపేస్తున్న కందుకూరి సాంఘిక సంస్కరణోద్యమాలు ఇవన్నీ ధర్మారావు ముందున్నాయి. అప్పటికే ఈ అన్ని ఉద్యమాలను అధ్యయనం చేసి తానెళ్ళాల్సిన మార్గాన్ని స్పష్టంగా నిర్ధారించుకున్నాడు. కళ్ళికోట కళాశాలలో లెక్కల అధ్యాపకుడుగా చేరాడు.

కానీ ఇంటి ఆర్థిక పరిస్థితులు ధర్మారావుని అనేకానేక ఉద్యోగాలు చేయించాయి. ఎన్నో ఊళ్ళు తిప్పించాయి. ఏపని చేస్తున్నా ఎక్కడున్నా అదెంతటి మారుమూల ప్రదేశమైనా, కానికాలమైనా సరే ధర్మారావు అన్ని

ఉద్యోగప్రయత్నాల్లో ఉంటూ వెళ్లొస్తున్నాడు. సాహిత్య కృషి సాగిస్తూనే ఉన్నాడు. ప్రధానంగా తన అభిమానగ్రంథం విజయవిలాసం మీద చూపు కేంద్రీకరించే ఉన్నాడు.

బరంపురంలో ఉండే రోజుల్లో వరదా కామేశ్వరరావు నాయుడు ఇంట్లో ట్యూషన్ చెప్తూండేవాడు కామేశ్వరరావు పెద్దకొడుకు రామారావు తర్వాత పెద్ద టెన్నిస్ ఆటగాడుగా ప్రసిద్ధి పొందాడు. అతనికి ఇంటికి వెళ్ళి ట్యూషన్ చెప్తూండేవాడు అలాగే బరంపురంలో న్యాయపతి రామానుజస్వామి అనే హైకోర్టు వకీలుండేవారు. వీరికి ఆంగ్ల, సంస్కృత భాషల్లో మంచి పాండిత్యం ఉండేది. సంగీతంలో అభిమానం వీరిని వీణ నేర్చుకునేలా చేసింది. వీరు ఆ తర్వాత 1911 వ సంవత్సరంలో జార్జి చక్రవర్తి పట్టాభిషేకానికి లండన్ వెళ్ళొచ్చి 'మై ట్రిప్ టు ఇంగ్లండ్' అన్న గ్రంథం కూడా రాశారు. వీరి కుమారులే తర్వాత ప్రసిద్ధ జర్నలిస్టుగా ఉన్న నారాయణమూర్తి, రేడియో అన్నయ్యగా ప్రఖ్యాతి కెక్కిన రాఘవరావూనూ. రాఘవరావు తాపీ ధర్మారావుతో తమ కుటుంబానికున్న పరిచయాన్ని వివరిస్తూ తమ ఇంటికి ధర్మారావు ఎప్పుడూ వస్తూ ఉండేవారనీ తమ అన్న నారాయణమూర్తికి ట్యూషన్ చెప్పేవారనీ అన్నాడు తనను బుచ్చిపంతులంటూ చెవిపుచ్చుకుని లాగేవారనీ, తమ ఇంటి మేడ మీద ఆనాడు ధర్మారావుతోపాటు భోగరాజు నారాయణమూర్తి, కళ్ళికోటలో అధ్యాపకులు ఉన్నం రామలింగం, డి.వి. కృష్ణారావు తదితరులెందరో సాహిత్యచర్చలు చేస్తుండేవారనీ ధర్మారావు తమ కుటుంబంలో సభ్యునిగానే ఉంటుండేవారని వివరించాడు

వరదా వారింటికి దగ్గర్లోనే ధర్మారావు నివాసం. ట్యూషన్లు చెప్పుకోవటానికి తోడు కొంతకాలం తమ తండ్రికి మేనేజర్‌గా కూడా ధర్మారావు పని చేస్తూ అనేక విషయాల మీద సలహాలిస్తుండేవారని కామేశ్వరరావు నాయుడి రెండో కుమారుడు నారాయణరావు ఇప్పటికీ ఆ విషయాలన్నీ తన కళ్లముందు జరుగుతున్నంత సంతోషంతో చెప్పుకొచ్చాడు.

ధర్మారావు కళ్ళికోట కళాశాలలో పనిచేసే రోజుల్లో వారిదగ్గరే మూడవ ఫారం చదువుకున్న కొచ్చెర్లకోట గుర్నాధం తనతోపాటు అప్పుడు ఇమ్మిడిసెట్టి రామ్మూర్తి, పాకనాటి నారాయణరావు కూడా చదువుకున్నారన్నాడు. ధర్మారావుతోపాటు ఆ కళాశాలలో గురుభాగవతుల ధర్మారావు, కందికొండ సూర్యనారాయణ, వేములకొండ కోనేటిరావు, పసుమర్తి కృష్ణమూర్తి, వద్దిపర్తి సత్యనారాయణ, బొమ్మిరెడ్డిపల్లి కామేశ్వరరావు, గొడవర్తి సీతారామయ్య, ఉపద్రష్ట సత్యనారాయణ, పరబ్రహ్మం అనే క్రిస్టియన్ అధ్యాపకులుగా ఉండేవాడు. ఆ విధంగా అందరి మెప్పూ పొందుతున్న ధర్మారావుకు మిత్రుల

ప్రయత్నం వల్ల సర్వేశాఖలో ఓ ఉద్యోగం వచ్చింది. ఎపి ఆ ప్రాంతంలోనే ఉన్న చీకటి సంస్థానంలో (1915).

చదువురానివారికి సర్వే ఉన్నదనే నానుడిలాగా గణిత శాస్త్రంలో పట్టభద్రులు ధర్మారావు ఈ పని చేయాల్సివచ్చింది. చీకటి సంస్థానంలో కృష్ణాపురం, కోటిలింగి, జయంతిపురం, తాతంపర, పాత్రపురం, బొడ్డొపలంక లుండేవి.

బంకుపల్లి మల్లయ్యశాస్త్రి ఈ సంస్థానాధీశులకు తమ రచనలందించి సన్మానాలందారు. 'పురాణ వాచస్పతి' అన్న బిరుదం కూడా ఆ సంస్థానాధిపతి గౌరచంద్రదేవు - మల్లయ్యశాస్త్రి కిచ్చి గౌరవించారు. పప్పు అప్పల నరసింహ శాస్త్రి ఈ సంస్థానం ఆస్థాన పండితులు. ఆ కాలంలోనే వీరి భూములను ధారా కోటవాళ్ళు ఆక్రమించుకున్నారు. ఈ వివాదం పరిష్కరించటానికి ఆ భూములు సర్వే చేసి కొలవాల్సిన బాధ్యత ధర్మారావుకు అప్పగించారు.

కొలతకు ఉపయోగించే యంత్రం సరిగా పనిచేయక పోవడంవల్ల చీకటి సంస్థానాధీశులు తమ భూమిని నష్టపోయారు. ధర్మారావు ఉద్యోగానికి ఎసరు పెట్టాలనుకున్నారు. అలాగే చేశారు. ఈ సందర్భంగా మరో కారణం ధర్మారావు కుమారుడు మోహనరావు వివరించాడు. ఆ సర్వే అధికారి ఇంగ్లీషు వాడు. అతని భార్యకు ధర్మారావు పేరు ప్రతిష్ఠల మీదా కార్యనిర్వహణా చాకచక్యం మీదా అభిమానం కలిగి క్రమంగా ధర్మారావు మీద అభిమానంగా మారిందనీ ఇది గమనించిన సర్వే అధికారి చీకటి భూముల సర్వేలో కావాలని మోసం చేసి ఉద్యోగానికి నీళ్ళుతోడేడనీ అన్నారు.[1] ఏది ఏమైనా సంవత్సరమైనా తిరక్కుండానే సర్వే శాఖకు ధర్మారావు సలాం కొట్టేశాడు.

తర్వాత ధర్మారావు మళ్ళీ ఉద్యోగం వేటలో పడ్డాడు. ఏ పనిచేస్తున్నా వారికి అధ్యాపకత్వంమీదున్న మమకారం మరో దానిమీద ఉన్నట్టు కనిపించదు. సర్వే శాఖలో ఉద్యోగం పోయిన తర్వాత విశాఖపట్నంలోని కెనెడియన్ బాప్టిస్ట్ మిషన్ హైస్కూలులో చేరాడు. (1916) గణిత శాస్త్ర అధ్యాపకత్వం పేరుకైనా అన్నీ చెప్తుండేవాడు. ఆ కాలంలోనే ధర్మారావు దగ్గర నిడుదవోలు వెంకట్రావు చదుపుకున్నాడు. వెంకట్రావు నాలుగో ఫారంలో ఉండేవాడు. వాళ్ళ తరగతికి అనువాదం వ్యాసం చెప్పటానికి ధర్మారావు వెళ్ళేవాడు. 'తెలుగులో పద్యాలిచ్చి ఇంగ్లీషులో భావార్థం రాయమనేవారు ఇటు ఇంగ్లీషు నుంచి తెలుగుకూ అనువాదాన్ని చాలా చిత్రంగా మా చేత చేయిస్తూ పద్య కావ్యాల మీద మాకు అభిమానం కలిగించింది ధర్మారావు మాష్టారే నని నిడుదవోలు వెంకట్రావు అన్నాడు.

ఈ సి. బి. ఎం హైస్కూలు చాలా ప్రాచీనమైంది. విశాఖపట్నంలో హిందూ రీడింగ్ రూమ్‌కి సమీపంలో ఉంది. ఆరోజుల్లో విశాఖపట్నంలో మారేపల్లి రామచంద్రకవి ప్రసిద్ధులు. ధర్మారావూ వారూ మంచి మిత్రులు. వెంకట్రావు కుటుంబానికి, తాపీ వారి కుటుంబానికీ మొదట్నుండీ పరిచయా లున్నాయి. వెంకట్రావు లెక్క ప్రకారం తాను తమ తల్లి కడుపులో ఉన్న ప్పటినుంచి తాపీవారితో చేయి కలిపారట. వీరున్న వీధికి పైవీధి - కటిక వీధిలో తాపీ అప్పన్న డాక్టరుగా ఉండేవారు. నిడుదవోలు సోమమ్మకు తీవ్ర అస్వస్థత కలిగింది. అప్పుడామె గర్భవతి. ఆమె భర్త సుందరం చాలా ఆందోళన చెందారు. అప్పన్నవి అమృత హస్తాలని ప్రతీతి. వారిని పిలిపిం చగా ఏదో మందిచ్చారు. సోమమ్మకు శాంతించింది. సుఖ ప్రసవమైంది. పుట్టింది వెంకట్రావు. అది 1903. అప్పటినుండి రెండు కుటుంబాలకు సన్ని హితత్వం మరింత వృద్ధి అయింది. ఈ వృత్తాంతం ధర్మారావుకు తెలుసు. అందుకే వారికి తనమీద చాలా మమకారం ఉండేదనీ సాయంకాలాలు రామ చంద్ర కవి ఇంటికి తనను తీసుకెళ్ళి అనేక ప్రాచీన కావ్యాలతోనూ కృతుల తోనూ పరిచయం కలిగించారనీ వెంకట్రావు అంటాడు. విజయ విలాసం గూర్చి, దాని అందచందాలను గూర్చి తొలిసారిగా ధర్మారావు దగ్గరే విన్నా నని అన్నాడు. రాయప్రోలు కృతులతో కూడా తనకు పరిచయం కలిగించింది వీరేనట. విశాఖపట్నంలో ఉన్న 'లోవతోట' మీద పద్యాలు రాయమని ప్రోత్సహించి, రాసిన తర్వాత సరిదిద్ది ఒకరకంగా ధర్మారావే కవిత్వంలో తొలిపాఠాలను వారికి నేర్పాడు. స్కూల్లో నిజానికప్పుడు తెలుగు చెప్పేది ఇచ్ఛాపురం యజ్ఞనారాయణ. కాని అందరూ ధర్మారావు చుట్టే తిరిగేవారు. స్కూలు ప్రిన్సిపాల్ లాజరస్‌కు ధర్మారావు అధ్యాపకం మీద చాలా మంచి అభిప్రాయం ఉండేది. వీరి పాండిత్యం, మేధాశక్తిని గురించి విద్యార్థులందరికీ లాజరస్ తరగతులకెళ్ళి చెప్పేవారు. పంచె, కోటు, తలపాగాలతో వస్తున్న ధర్మారావంటే స్కూల్లో ఉండే విద్యార్థులందరికీ భయం, భక్తి రెండూ ఉండేవి. తన తరగతికి చెందినా చెందకున్నా ధర్మారావు విద్యార్థులందరితో కలివిడిగా ఉండేవాడు. అప్పటికి దేశంలో జరుగుతున్న వివిధ విషయాల గురించి, ఉద్యమాల గురించి విద్యార్థుల్లో ఉత్సాహం, ఉద్రేకం కలిగేలా వివరి స్తుండేవాడని తన చిన్ననాటి ముచ్చట్లు దొంతర విప్పాడు నిడుదవోలు వెంక ట్రావు. ధర్మారావు రీడింగ్ రూం పక్క వీధిలో అద్దెకుంటూ విద్యార్థులకు ట్యూషన్ చెప్తూ కాలక్షేపం చేస్తూండేవాడు. ఆ సి. బి. ఎం. హైస్కూల్లో అప్పటి రికార్డులేవీ ఇప్పుడు లేవు. ధర్మారావు అక్కడ పనిచేశాడన్న గుర్తు వృద్ధులైన

కొందరు అధ్యాపకులకు మాత్రం ఉంది. ధర్మారావు ఒక్కడే మానేసి పది పదిహేను సంవత్సరాల తర్వాత ఉద్యోగంలో చేరి విశ్రాంతి ననుభవిస్తున్నా రిప్పుడందరూనూ.

హోం రూలు ఉద్యమం ప్రారంభమైన కాలం అది జాతీయ భావాలున్న ప్రతి వ్యక్తీ ఈ ఉద్యమంలో పాలు పంచుకుంటున్నాడు. ధర్మారావులో ఉండే జాతీయ, దేశభక్తి భావాలు వారినీ ఆ ఉద్యమం వైపు ఆకర్షించాయి. విశాఖపట్నంలో పనిచేస్తున్న కాలంలోనే విద్యార్థుల్లో ఈ భావాలను ప్రవేశపెట్టి అందుకోసం కృషిచేశాడు.

ఆ రోజుల్లో మద్రాసులో న్యూయింగ్‌టన్ కాలేజీ అని ఒకటి ఉండేది ప్రస్తుతం ఏ. జి. కార్యాలయాలున్నచోట ఉండేది. రాష్ట్రంలోని మైనర్ జమీందారుల కోసం ఇది పెట్టారు. తండ్రులు చనిపోతే జమీలను నిర్వహించే స్థోమత పిల్లలకొచ్చేవరకూ వాళ్లను ఈ కాలేజీలో ఉంచి చదివించేవారు. జమీ నిర్వహణకవసరమైన విద్య, జమీందారుల హోదాల కవసరమైన సమస్త కళలూ ఇక్కడ నేర్పుతుంటారు. ఆధిపత్యం, నిర్వహణ అంతా ఆంగ్లేయుల అభిరుచికి తగ్గట్టు వారే నడుపుతుంటారు. ఆయావిషయాల్లో మంచి పాండిత్యం, ఇంగ్లీషు భాషా పాటవం, బోధనా సామర్థ్యం ఉన్న వాళ్ళనే అధ్యాపకులుగా నియమిస్తారు ధర్మారావు అప్పటికే అధ్యాపకుడుగా విశాఖలో మంచి పేరు తెచ్చుకున్నాడు. దీనికితోడు అప్పటి రాష్ట్రశాసన సభలో వరదా కామేశ్వరరావు నాయుడుకు మంచి పలుకుబడి ఉండేది. విశాఖ కలెక్టర్ వెర్నాన్ సిఫారసువల్లా[2] వారి సహకారంవల్ల ధర్మారావుకు ఆ న్యూయింగ్‌టన్ కళాశాలలో గణిత శాస్త్ర అధ్యాపకులుగా ఉద్యోగం వచ్చింది (1917). ఈ కళాశాలను చాలా ఉన్నత వర్గం నిర్వహిస్తూండేది. అందులో విద్యార్థులు జమీందార్ల బిడ్డలు. దీని నిర్వహణ చాలా లోపభూయిష్టంగా ఉన్నదని 1900లో అన్ని పత్రికలు దుమ్మెత్తి పోశాయి. అప్పుడు గంజాం వెంకటరత్నం ఆ కళాశాల కెళ్ళి సమూలంగా పరిశీలించి దాని మంచి చెడ్డలపై 'హిందూ' లో ఒక పెద్ద వ్యాసం రాసి ప్రజలకు తెలియపర్చాడు. తర్వాత వారి సూచనలకు అనుగుణంగా నిర్వాహకులు కొన్ని మార్పులు చేశారు.[3]

అక్కడుండే జమీందారుల బిడ్డలకు అవసరమైన వేట, గుర్రపు స్వారి, తుపాకి కాల్చటం - ఇవన్నీకూడా ధర్మారావు నేర్చుకున్నాడు అప్పుడక్కడ చుండి మైనరు జమీందారూ[4] తేలప్రోలు జమీందారు[5] ఇంకా తెలుగు దేశంలో ఉండే ఇతర జమీందారుల బిడ్డలూ చదువుతుండేవారు. ఆ విధంగా జమీం

దారుల బిడ్డలతో, వారి తండ్రులతో, వాళ్ళవాళ్ళ వ్యవహారాలతో ధర్మారావుకు పరిచయాలేర్పడ్డాయి.

అప్పుడా న్యూయింగ్‌టన్ కాలేజీకి 'డీలాహే' అనే ఆంగ్లేయుడు ప్రిన్సిపాల్‌గా ఉండేవాడు. చాలా నిక్కచ్చి మనిషి. అదే కాలేజీలో రామ్‌నాడ్ రాజా కొడుకు చదువుకుంటున్నాడు. ఆ ప్రిన్సిపాల్ భార్యతో ఈ చిన్న జమీందారు అసభ్యంగా ప్రవర్తించాడు.[6] అది ప్రిన్సిపాల్ చెవికెళ్ళింది. మర్నాడు డీలాహే ఈ రామ్‌నాడ్ పిల్ల జమీందారును మందలించాడు. ఆరోజు రాత్రి ప్రిన్సిపాల్ తన ఇంట్లో మంచానికి దోమ తెర వేసుకొని నిద్రపోతున్నాడు. ఆ సమయంలో పిల్ల జమీందారు తుపాకితో కాల్చి ప్రిన్సిపాల్‌ను చంపాడు. 1916-17లలో ఈకేసు రాష్ట్రాన్ని కలిచేసింది. ప్రభుత్వం కలవరపడింది. ముద్దాయికి తేలిక శిక్ష పడింది.[7] ఈకోర్టుకేసు సందర్భంలో చుండి సంస్థానం మైనరు జమీందారు బొంబాయి వెళ్ళి సాక్ష్యం చెప్పివచ్చాడు.[8] ఈ అలజడితో ఆ కాలేజీని ప్రభుత్వం మూసేసింది. ధర్మారావే అక్కడుండే ఊర్కాడ్, చుండి, కడలూరు జమీందార్ల బిడ్డలను తీసుకెళ్ళి వాళ్ళ జమీలకప్పచెప్పి వచ్చాడు. తోటి అధ్యాపకులందరూ ధర్మారావును భయపెట్టారు. ఈ జమీందార్ల బిడ్డలు దారిలో మిమ్మల్నేమన్నా చేస్తారు దింపి రావద్దన్నారు. కాని భయపడకుండా వాళ్ళందర్నీ దింపేసి వచ్చాడు. జమీందార్ల పిల్లల కందరికీ ధర్మారావు ప్రతిభ మీద చాలా గురి ఉండేది. వీరు సూటూ బూటులో అచ్చు ఆంగ్లేయుడిలాగా ఉంటూ అన్ని విద్యలూ, కళలూ వాళ్ళకు ఆయా సంప్రదాయాలలో నేర్పుతుండేవాడు. మైనర్ కుర్రవాళ్ళందరూ వీరిని తండ్రిలాగా గౌరవిస్తుండేవారు. చక్కని క్రమశిక్షణ కలిగిన వ్యక్తిలా అందరి మన్ననలనూ పొందుతుండేవాడు కాలేజీ మూతపడటంతో ధర్మారావు మళ్ళీ ఉద్యోగం వెతుక్కోవాల్సి వచ్చింది.

అయితే ఈ కళాశాల విద్యార్థుల్లో ఒకరైన చుండి మైనర్ జమీందారుకు ధర్మారావంటే విపరీతమైన అభిమానం ఉండేది. ధర్మారావు కొన్నాళ్ళు మద్రాసులోనే గడిపి తిరిగి బరంపురం వచ్చాడు. అక్కడ మళ్ళీ ట్యూషన్లు, సాహిత్య కార్యకలాపాలూ అవీ చూసుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. ఇలా కొంతకాలం జరిగేసరికి చుండి జమీందారుకి ట్యూటర్, సంరక్షకుడుగా రమ్మని ఆహ్వానం వచ్చింది.

నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకాలో చుండి ముఖ్యమైన సంస్థానం. వీరి పాలకుల్లో మూలపురుషుడు కామినేని రామానాయుడు. శ్రీకృష్ణదేవ రాయలు వీరిని ఉదయగిరి తాలూకా పాలకుడుగా నియమించాడు. వీరిమనుమడు అయ్యప్పనాయుడు ఒకప్పుడు చుండి రెడ్డిరాజులు నాటి గోల్కొండ నవాబు

సికిందర్‌షాకు ఎదురుతిరిగారు. వారిని అణచడానికి ఈ అయ్యప్పనాయుడును నవాబు పంపాడు. విజయం చేజిక్కించుకున్నాడు. నాటి రెడ్డి ప్రభువుల్లో చివరి వాడు పుచ్చకట్ల రామిరెడ్డి. ఇతడు నిస్సంతుగా చనిపోయాడు. ప్రభుత్వం అయ్యప్పనాయుడునే ఆ ప్రాంతానికి అమలుదారుగా నియమించినట్టు నెల్లూరు జిల్లా రికార్డులో ఉంది.[9] ఈ జమీలో 43 గ్రామాలున్నాయి. ఇతని కొడుకు తాతయ్యనాయుడు 1487 నుండి చుండికి జమీందారయ్యాడు. 'బంగారు' అన్న బిరుదనామం కూడా సంపాదించాడు. ఈ వంశంవారిలో రాజా కామినేని బంగారు ముద్దరాజు 1870 వరకు ఉండి మరణించాడు. వీరి కొడుకులప్పుడు మైనర్లు. సంస్థానం కోర్ట్ ఆఫ్ వార్డ్స్ పాలనకింది కొచ్చింది. 1916 లో వీరి మరణానంతరం వీరి కుమారులు మైనర్లు. వీరే మద్రాసు న్యూయింగ్‌టన్ కాలేజీలో ఉండేవారు.[10] వీరి సంరక్షకుడి బాధ్యతలు నిర్వహించమనే ధర్మారావును నియమించారు (1921).

ధర్మారావు నెల్లూరులో నివాసం ఏర్పరచుకొని, చుండి వెళ్ళివస్తూండేవాడు. అప్పటికి ధర్మారావుకు ముగ్గురు కుమార్తెలూ, ఇద్దరు కుమారులూ. వారి పెద్దమ్మాయి పెళ్ళి నిశ్చయమైంది. దగ్గరపడుతూంది. ఈలోగా ఏదైనా యాత్ర చేసొద్దామని తమ నగానట్రా అంతా బాగా డబ్బున్న ఒక మిత్రుడి ఇంట్లో ఉంచి యాత్రల కెళ్ళారు. ఆ ఇల్లు సుంకు శ్రీరాములుగారిదని మరుపూరు కోదండరామిరెడ్డిగారి భోగట్టా. వారం రోజుల తర్వాత నెల్లూరు తిరిగొచ్చారు. రాత్రి ఏడుగంటలైంది. మర్నాడు పోయి పెట్టె తెచ్చుకుందామనుకున్నారు. ఆ రాత్రి లక్ష్మీనరసారెడ్డి హాలులో యడవల్లి సూర్యనారాయణ జట్టు నాటకం ఆడుతున్నారు. వెళ్ళి చూద్దామని మనసులో ఉన్నా ప్రయాణ బడలిక వల్ల పోలేదు.

అర్ధరాత్రి 12 గంటలకు ఒక నౌకరు ధర్మారావు ఇంటి తలుపులు తట్టి తాము నగలపెట్టె పెట్టిన మిత్రుడు వెంటనే రమ్మంటున్నాడని కబురు చెప్పాడు. ధర్మారావు అక్కడికి వెళ్ళేసరికి ఆ మిత్రుని కుటుంబం నాటకం చూడటాని కెళ్ళిందనీ ఇంట్లో దొంగలుపడి వీరి పెట్టె నొక్కదానినే ఎత్తుకెళ్ళారనీ చెప్పాడు. దొడ్లో ఖాళీపెట్టె మాత్రం దొరికింది. ఇది తెలిసి ధర్మారావు భార్య అన్నపూర్ణమ్మకు మతిభ్రమిస్తుందేమో నన్నంత కలతచెందారు. మిత్రుడి మీద అనుమానం ఉన్నట్టు ఫిర్యాదు చేస్తే కేసు నడుపుతామని పోలీసులు బలవంతపెట్టారు. కానీ "అతడి మీద నమ్మకం ఉండబట్టేకదా అక్కడ పెట్టెనుంచా" మంటూ ధర్మారావు ఫిర్యాదు చేయడానికి అంగీకరించలేదు. కలెక్టరూ, డిప్యూటీ కలెక్టరు, పోలీసు అధికారులు సుమారు 20 రోజులు

దర్యాప్తుచేసినా ఫలితం లేకపోయింది. అంతకాలం కొద్దోగొప్పో వెనకేసు కున్నవీ కూతురు పెళ్ళికి తెచ్చినవీ సమస్తం పోగొట్టుకున్నారు.[11] ఆరోజు నుండీ ఎప్పుడూ రివాల్వరు దగ్గర పెట్టుకుంటుండేవారు.[12] అక్కడున్న న్నాళ్ళూ అదే పద్ధతి.

ఇక్కడున్న కాలంలోనే వేదం వెంకటాచలయ్యతో ధర్మారావుకు పరిచయం అయింది. ఆయన అడ్వకేటు. రోజూ అనేక విషయాల మీద చర్చలు కొనసాగిస్తుండేవారు. పూర్వం వేదం వెంకటాచలయ్య మంచి చరిత్రోపన్యాసకులు. చిలకమర్తి వారు కూడా తమ స్వీయచరిత్రలో వీరిని గూర్చి ప్రశంసించారు. ఇంగ్లీషుభాషలో మంచి పాండిత్యం ఉండేది. ప్రతి విషయాన్నీ హేతువాదదృష్టితోనూ, తార్కికబుద్ధితోనూ చూడాలన్నది వీరి అభిప్రాయం. ధర్మారావుదీ స్వతహాగా అలాటి మనస్తత్వమే. ఆ రోజుల్లో బెంగుళూరులో "మిథిక్ సొసైటీ' అని ఒకటి ఉండేది. దేశంలోని మేధావు లందరి రచనలూ వారి పత్రికలో పడుతుండేవి. చరిత్ర, సంస్కృతి, సాహిత్యా లను తార్కికదృష్టితో అధ్యయనం చేయించడం, సంప్రదాయాలను కొత్త వెలుగులో దర్శింపచేయడం, వారి అభిప్రాయాలను తమ సంచికల్లో వ్యాసాల రూపంలో ప్రచురిస్తూండటం దీని ఆశయం. వేదం వెంకటాచలయ్య ఆ సంస్థలో సభ్యులు. ధర్మారావును కూడా అందులో చేర్పించారు. 1909 మే లో ఈ మిథిక్ సొసైటీ ఏర్పడింది. దీనికి పేట్రన్‌గా మైసూరు మహారాజా ఉండే వారు. బెంగళూరు కార్యస్థానం. గౌరవాధ్యక్షులుగా డాక్టర్ మారిస్ డబ్ల్యు. ట్రావర్స్, గౌరవ ప్రధాన కార్యదర్శిగా ఇ. డబ్ల్యు. ఐథరెల్ ఉండేవారు. వీరు త్రైమాసికను నడిపారు. సభ్యత్వం రెండు రూపాయలు. ధర్మారావుకు దానితో 1921 నుండీ సంబంధాలున్నాయి సభ్యత్వమున్నట్లు 1925 నుండీ దాఖలాలు ఆ సంచికల్లోనే కనిపించాయి.

చుండిలో ఉద్యోగం చేస్తున్న కాలంలోనే వేదం వెంకట్రాయశాస్త్రి విజయవిలాసం మీద రాసిన వ్యాఖ్యానం పై ధర్మారావు విమర్శలకు పూను కున్నాడు. నెల్లూరులో సాహిత్య సభల్లో పాల్గొంటూండేవాడు. అక్కడ తను ఇంట్లో దొంగతనం జరిగిన వెంటనే చుండి ఉద్యోగాన్ని వదిలేశాడు. 1913 వరకూ నెల్లూరులో ఉండేవాడు[13] అక్కడినుండి దక్షిణాదిలో 'ఎలియ నందల్' అనే గ్రామానికి అధికారిగా వెళ్ళాడు. అదో చిన్న జమీ లాంటిది. దాని అధిపతి రావెళ్ళ అప్పాస్వామి నాయుడు. ధర్మారావును చాలా అభిమా నించేవాడు. వారే 1924 లో ధర్మారావును అక్కడకు ఆహ్వానించారు.

కొంతకాలం అక్కడుండి ఆ పక్కనే సేలం జిల్లా 'బేరిక' కు వెళ్ళి వస్తూండేవాడు. ఇక్కడినుండి మిథిక్ సొసైటీ సభ్యత్వం పంపిన దాఖలా ఉంది (1925). కుదురైన ఉద్యోగం అంటూ ఏదీలేక ఇలా తిరిగి తిరిగి వేసారిపోతున్న కాలంలో 'ఊర్కాడు' సంస్థానం నుండి పిలుపొచ్చింది. తమిళదేశం దక్షిణభాగంలో తిరునల్వేలి జిల్లా అంబా సముద్రం దగ్గర ఈ ఊర్కాడు సంస్థానం ఉంది. 1925 మొదట్లోనే ఆ సంస్థానం జమీందార్లకు ట్యూటర్‌గా చేరి జమీందారు హోదాలో జీవిస్తూండేవారు. ధర్మారావు కుటుంబం మీద ఈ సంస్థానాధిపతులకు మంచి అభిమానం, గౌరవం ఉండేవి. దీనికితోడు జమీందారుకు సాహిత్యం మీద మంచి అభిరుచి ఉండేది. ప్రతి పండుగ, పబ్బానికీ సాహితీ సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేస్తూండేవారు. దేవి నవరాత్రుల సమయంలో (1926) శృంగేరి శారదా పీఠాధిపతులు ఇక్కడ పండిత గోష్ఠుల్లో పాల్గొన్నారు. ఒక సభలో ధర్మారావు 'అక్షర శారదా ప్రశంస' అన్న కవిత చదవగా విని ఆ జగద్గురు చంద్రశేఖర భారతీ శంకరాచార్యుల వారు వీరిని 'ఆంధ్ర విశారద' అని సంబోధించి పండిత శాలువాతో సత్కరించారు 14 ఆ శాలువను చాలా కాలం ధర్మారావు ఒక పూజా వస్తువుగా భద్రపరిచారు. కాని ఒకనాడు ఆ శాలువ దీపారాధన దీపానికి అంటుకుని కాలిపోయింది.15 ధర్మారావుకు తర్వాత అనేకమంది బిరుదులూ అవీ ఇచ్చి సత్కరించారు కానీ హేతువాదదృష్టితో రాసిన రచనను ఒక మత గురువు ఇలా గౌరవించారనటానికి గుర్తుగా ఈ 'ఆంధ్రవిశారద' బిరుదాన్నే ధర్మారావు చివరివరకూ వాడుకున్నాడు. ఈ సంగతి ధర్మారావే అనేకసార్లు మిత్రులతో అంటుండేవాడు.

సుమారు రెండు సంవత్సరాలు ఊర్కాడులో ఉన్నాడు. ఇక్కడ ఉంటుండగా ధర్మారావు భార్య అన్నపూర్ణమ్మతల్లి విజయనగరంలో చనిపోయారు. బంధువులందరూ ఎంతో దూరంలో తెలుగుదేశంలో ఉంటుంటే మనమీమూల అరవప్రాంతంలో ఉండటమెందుకని అన్నపూర్ణమ్మ ఎప్పుడూ అంటూండేవారు. ఈలోగా జరిగిన పై సంఘటనతో అందరూ విజయనగరానికొచ్చేశారు.16 ఉద్యోగం లేదు. సంస్థానాల్లో బాగా బతికినవారు. వెనకేసుకున్నది లేదు. ధర్మారావు తత్వమే అంత. నేడు చూడాలి కాని రేపటికి దాచుకోకూడదు. అందుకే ఆయన జీవితమంతా నేడు కోసమే కష్టపడటం కనిపిస్తుంది.

ఇలాటి స్థితిలో 1926వ సంవత్సరం చివరిలో విజయనగరం వచ్చాడు. ఏం చెయ్యాలి. చేతిలో ఉంది విద్య. కోడుగంటి వారి వీధిలో ఒక ట్యుటోరి

యల్ కాలేజి పెట్టాడు. అధ్యాపకుడుగా పనిచేసిన ఊళ్ళల్లో ఇంట్లో ట్యూషన్ చెప్పాడు. కొంత కాలం జమీందార్ల మైనర్ పిల్లలకు గార్డియన్‌గా ఉన్నాడు. ఇప్పుడు మరికొందరు మిత్రులను అధ్యాపకులుగా చేరదీసి ట్యుటోరియల్ కాలేజి పెట్టాడు. మేడూరి శ్రీరామమూర్తికూడా అందులో అధ్యాపకులుగా ఉండే వారు.[17] 1926 నుండి 1928 వరకూ దీన్ని కొనసాగించారు. రాత్రింబవళ్ళు విద్యార్థులకు 4వఫారం నుండి బి.ఎ. వరకూ ఇంగ్లీషు, లెక్కలు, తెలుగు చెప్తూ వుండేవారు. మహారాజాకళాశాలలో పనిచేసే అధ్యాపకులుకూడా ధర్మారావుమీద ఉండే గౌరవం కొద్దీ జీతం లేకుండావచ్చి కొందరికి ట్యూషన్ చెప్తూండేవారు. వీరి దగ్గర అప్పుడు చదువుకున్న వాళ్ళల్లో డాక్టర్ పి. జగన్నాథరాజు కుమారుడు పి. నరసింహరాజా అక్కడి మునిసిపాలిటీలో ఉద్యోగం చేసి రిటైరై విజయనగరంలోనే విశ్రాంతి తీసుకుంటున్నాడు. తన విద్యార్థి దశను గుర్తుకు తెచ్చుకుంటూ ధర్మారావు విద్యార్థులకు ఫొటోగ్రఫి కూడా నేర్పుతుండే వారనీ, ప్రకృతితత్వాన్ని సశాస్త్రీయంగా వివరిస్తుండేవారనీ అప్పుడు తన వయస్సు 13 సంవత్సరాలనీ చాలామంది విద్యార్థులు వీరి ట్యుటోరియల్ కాలేజిలో చదవాలని వస్తుండేవారనీ ఒకే గది కనుక బాగా కిక్కిరిసి ఉండే దనీ చెప్పాడు. తమ తండ్రీ, ధర్మారావూ ప్రాణ స్నేహితులవటం వలన తన మీద ధర్మారావు చాలా అభిమానం చూపేవారని నరసింహరాజన్నాడు. కోటూ, సూటూ, బూటు వేసి చిన్నపాటి తిరుచూర్ణం పొడుగుబొట్టు మధ్య పాపిడితో ధర్మారావు అంత ఎత్తున చాలా అందంగా ఉండేవారని వారి జ్ఞాపకాల సంచిని నాముందు బోర్లించారు.

అప్పుడు మహారాజా కళాశాలలో కొడవటిగంటి కుటుంబరావు, రోణంకి అప్పలస్వామి, మంత్రిప్రెగడ శేషగిరిరావు,[18] విశ్వనాధ నరసింహం[19] చదువుతుండేవారు. వీరందరికీ ఏదో ఒక రకంగా ధర్మారావు ట్యుటోరియల్ కాలేజీతో పరిచయం ఉండేది. ధర్మారావు తీరిక సమయాల్లో కళాశాలలో అనేక సాహిత్య విషయాలమీద ముఖ్యంగా విజయవిలాసం [20] మీదా ఉప న్యాసాలిస్తూండేవారు. కొడవటిగంటి కుటుంబరావు ధర్మారావును మొదటి సారి చూసింది అక్కడే.[21] ఈ ట్యుటోరియల్ కాలేజి విద్యార్థులు అప్పటికే ధర్మారావు చేసిన ఉద్యోగాలూ, తిరిగిన ఊళ్ళూ తెలుసుకుని, దీనికి కారణం అడిగితే ఒరియాలో ఒక సామెత (కన్‌కే) 'ఇవ్వాళొచ్చి రేపెళ్ళి'అనేది చెప్తూ ఉద్యోగ భద్రత ఈ దేశంలో ఎవరికీ లేదని చెప్తూండేవాడు.[22] రిప్పన్ స్కూలు మోటో 'లేబర్ ఆమ్నియా విన్సిట్' అంటే కష్టేఫలే. ఇదే నాడు తన తత్వం అని ధర్మారావు విద్యార్థులకు వివరించేవాడు.

ధర్మారావు ఎక్కడ ఏ ఉద్యోగం చేస్తున్నా మధ్యలో మద్రాసు వెళ్ళి స్థిరమైన ఉద్యోగాల కోసం మిత్రుల ద్వారా ప్రయత్నిస్తూనే ఉండేవాడు. ధర్మారావు న్యూయింగ్‌టన్ కళాశాలలో అధ్యాపకుడుగా ఉన్న కాలంలో వీరి పాండిత్యం, ప్రతిభ అనేకమంది సంస్థానాధీశులకూ, జమీందారులకూ తెలిసింది. వీరు న్యూయింగ్‌టన్ కళాశాలలో ఉండగా తేలప్రోలు రాజా కుమారులక్కడ చదివారు. ఈ విషయాలన్నీ అప్పటి బొబ్బిలి రాజా రావు శ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు విన్నారు. అప్పటికే ధర్మరావుకు బొబ్బిలితో సంబంధం ఉంది. తమ బిడ్డ సుగుణావతమ్మను బొబ్బిలి కిచ్చారు. తెలుగు దేశంలో సాహితీ సాంస్కృతిక రంగాలలో కూడా ధర్మారావు ప్రతిష్ఠను రాజా విన్నారు. చదువుకునే రోజుల్నుండీ ధర్మారావుకు బొబ్బిలి మిత్రులు చాలా మంది ఉండేవారు. అందులో పెమ్మరాజు సీతారామ్మూర్తి చాలా సన్నిహితుడు. బొబ్బిలిలో అటుతర్వాత చాలా కాలం అధ్యాపకులుగా పనిచేశారు. వీరి ద్వారానే బొబ్బిలి రాజా 1929 లో ధర్మారావును బొబ్బిలికి రప్పించారు.[23]

బొబ్బిలి రాజా తమ్ముడు రాజా జనార్దన కృష్ణ రంగారావు బహద్దూర్. వీరినే చిక్కవరం జమీందారని కూడా అంటారు.[24] వీరికి ట్యూటర్‌గా ధర్మారావును పిలిపించారు. వీరితో పాటు అప్పుడు కెప్టెన్ మన్రో, వాసిరెడ్డి శ్రీకృష్ణ, వలిమిరి రామలింగస్వామి కూడా అధ్యాపకులుగా ఉండేవారు. చిక్కవరం జమీందారును ఈ విషయాల గురించి ప్రశ్నిస్తే ధర్మారావు చాలా క్రమశిక్షణ గలవారనీ, అన్ని విషయాలూ చెప్తుండేవారనీ, చివరకు మెస్మరిజం గురించి కూడా తనకు వివరిస్తూ తమాషాలు కూడా చేసి చూపించేవారనీ అన్నారు. ఏ కవిని గురించి అడిగినా ధర్మారావు అతని కవిత్వం గూర్చి, అందులో వైశిష్ట్యాన్ని గూర్చి గంటల తరబడి చెప్పేవాడు.

ఇలా ఉంటుండగా కాశీ శాస్త్రి బొబ్బిలి సంస్థానం మేనేజరుగా పని చేసి పదవీ విరమణ చేశారు. అప్పుడాయనకు 70 ఏళ్ళు. కొంత కాలం తర్వాత ధర్మారావును మేనేజరుగా నియమించారు. బొబ్బిలిలో ప్రస్తుతం నటరాజ్ ఉంటున్న పెంకుటింట్లో అప్పుడు ధర్మారావు ఉంటుండేవారు. వీరు మేనేజరుగానే కాకుండా బొబ్బిలిరాజాకు అంతరంగిక కార్యదర్శిగా కూడా పనిచేశారు. ఆ కాలంలోనే వీరు రాజా వెంట ఊటీ మొదలైన ప్రదేశాలన్నీ వెళ్తుండేవారు. ఆ రోజుల్లోనే బొబ్బిలి రాజాకు ఆటోమోబైల్స్ మీద ధర్మారావే అభిరుచి కలిగించారు.[25] మోటార్ జనరల్ స్టోర్ అనే ఒక సహకార సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఆ సంస్థ అప్పుడు అన్నా రాణీ ఇంట్లో పెట్టారు. ఆ సంస్థ చాలా కాలం చక్కగా నడిచింది. నాడు ధర్మారావు ప్రోత్సాహంతో నెలకొల్పిన ఆ

సంస్థ 1934లో బొబ్బిలిలో విద్యుద్దీపాలను వేసే కాంట్రాక్టు తీసుకోగలిగినంత స్థాయికి ఎదిగింది.[26]

ధర్మారావు బొబ్బిలి రాజాకు ఆంతరంగిక కార్యదర్శిగా ఉన్న కాలంలోనే చెలికాని శేషగిరిరావు దివానుగా ఉండేవారు. ధర్మారావు ఎప్పుడూ తన పనిని నిర్వహించటంలో శాయశక్తులా కృషి చేస్తూండటమే కాని తనకు కాని పనిలో జోక్యం చేసుకునేవారు కాదు. ఒకరి కింద పనిచేయటం సుతరామూ ఇష్టం లేదు అలాటి పరిస్థితి రాబోతోందని పసిగట్టిన మరుక్షణంలో నమ్రతగా అక్కడినుండి తప్పుకునేవారు. ధర్మారావును దివానుగా ఉండమని రాజా మొదట్లో అడిగారు. అందుకు వీరు అంగీకరించారు. నిజానికి కొద్ది నెలలు పనిచేశారు కూడా. కానీ ఇంతలో పరిస్థితులు తన ఆశయాలకు వ్యతిరేకం కాబోతున్నట్లు తెలుసుకున్నారు. వెంటనే బొబ్బిలి సంస్థానంతో అన్ని రకాల సంబంధాలనూ వదిలేసుకుని ఇంతకన్నా హోదా, జీతం తక్కువ ఉన్న ఉద్యోగానికి వెళ్ళిపోయాడు. మొదటి నుండీ ధర్మారావుకు ఆత్మాభిమానం ముందూ - ఉదరపోషణ ఆ తర్వాతా.

అక్కడ ధర్మారావు పని వదిలేసిన తర్వాత వాసిరెడ్డి శ్రీకృష్ణ రాజాకు ఆంతరంగిక కార్యదర్శిగా వచ్చారు. దివానుగా సుబ్బారెడ్డి వచ్చారు.[27]

బొబ్బిలిలో పనిచేస్తుండగానే ధర్మారావుకు ఆర్థికపరమైన చిక్కులు కొన్ని ఎదురయ్యాయి. ఆ తర్వాత ఉద్యోగం వదిలేసినందువల్ల పరిస్థితి మరీ గడ్డుగా ఉండేది. ఇంతలో కృష్ణా మండలంలో ఉండే సౌత్ వల్లూరు జమీందారు బిడ్డలకు ట్యూటర్ గార్డియన్‌గా పనిచేసే అవకాశం ప్రభుత్వ నియామకంవల్ల వచ్చింది. చిన్న జమీందారీ. హోదా చిన్నది. జీతం తక్కువ. అయినా పరిస్థితులను బట్టి ధర్మారావు దానికంగీకరించారు.[28]

ఈ జమీందారీ కృష్ణా మండలంలో ఉన్న మచిలీపట్నం, బెజవాడ తాలూకాల్లోనూ, పశ్చిమ గోదావరి మండలంలోని ఏలూరు తాలూకాలోనూ విస్తరించి ఉంది. చాలా సారవంతమైన ప్రాంతం. కొంత కాలం ఇది నూజివీడు జమీందారీలో కొంత భాగమూ, చల్లపల్లి జమీందారీలో మరికొంత భాగంగా ఉండేది. 1900ల సంవత్సరంలో అన్నదమ్ముల మధ్య జరిగిన పంపకంలో రెండుగా చీలింది. పెద్దకోవవాళ్ళ వంతుకొచ్చినదాన్ని ఉత్తర వల్లూరనీ, చిన్న కోవవాళ్ళ పాలన కిందికొచ్చిందాన్ని దక్షిణ వల్లూరని అనటం పరిపాటైంది.

ఈ వల్లూరు జమీందార్లకు ఘనమైన చరిత్ర ఉంది. వీని స్థాపకుల్లో ఒకడైన నాగన్న నాయుడు టిప్పుసుల్తాన్‌కు వ్యతిరేకంగా కుంఫిణీ వాళ్ళతో

చేతులు కలిపి సాయం చేశాడు. శ్రీరంగపట్నం ముట్టడిలో ఈ బొమ్మదేవర నాగన్న సాయానికి రాజా బిరుదం కూడా దక్కింది.

తర్వాత వచ్చిన ఇమ్మడి నాగన్న సిపాయిల తిరుగుబాటు సందర్భంలో ప్రభుత్వానికి సాయం చేశాడు. కొంత కాలం సాగిన తర్వాత జమీ వ్యవహారాల్లో 1895 లో రాజా వెంకట నరసింహనాయుడు అతని తమ్ముడు భాష్యకార్ల నాయుళ్ళ మధ్య తగాదాలొచ్చి పంపిణీ దాకా వెళ్ళాయి. ఈ తగాదాలను లండన్ ప్రివీ కౌన్సిల్ తేల్చాల్సి వచ్చింది. వంగిడిగూడెం రాజధానిగా ఉత్తర వల్లూరూ, వల్లూరే రాజధానిగా దక్షిణ వల్లూరంటూ రెండుగా జమీ చీలింది. ఈ తగాదాలు మరీ పెరిగి 1917 లో దక్షిణ వల్లూరు మళ్ళీ రెండు భాగాలైంది. ఒకదానికి ఇనుగంటివారు హక్కుదారులైతే మరోదానికి బొమ్మదేవర వెంకట భాష్యకార్ల నాయుడు జమీందారు తర్వాత కొంత కాలానికి ఇది కోర్ట్ ఆఫ్ వార్డ్స్ కిందకొచ్చింది.[29] అప్పుడే కుక్కల జమీందారుగా పేరెన్నికగన్న సౌత్ వల్లూరు జమీందారు కొడుకుకు ట్యూటర్ గార్డియన్‌గా ప్రభుత్వం ధర్మారావు (1930) ను నియమించింది ఉండటం మద్రాసులో.

పనిలో ఉత్సాహం లేదు. అధికంగా ప్రోత్సాహం లేదు. కుటుంబం పెరుగుతూంది. చుండి ఘటనలో సమస్తమూ పోగొట్టుకున్న తర్వాతా, కుమార్తె పెళ్ళి ఖర్చువల్లా ఉన్నదేం లేదు. వెనకేసుకుంద అంతకన్నా లేదు. ఈ పరిస్థితుల్లో ధర్మారావు చెల్లెలూ వాళ్ళ కుటుంబం తాతానగర్‌లో ఉంటుంటే 1931 చివరిలో ఏదన్నా ఉద్యోగ ప్రయత్నం చేద్దామని అక్కడ కెళ్ళారు. కొన్నాళ్ళక్కడుండి ఎంత కృషి చేసినా ఉద్యోగం దొరకనందువల్ల తిరిగి తెలుగుదేశం వచ్చారు తాతానగర్‌లో ఉండగానే ధర్మారావుకు ఎస్. వి. రంగారావు పరిచయం అయ్యారు. తర్వాత ఈ రంగారావు ప్రసిద్ధ తెలుగు సినిమానటులయ్యారు. రంగారావుకు ధర్మారావంటే చాలా అభిమానం. ఒక సందర్భంలో రాజమహేంద్రవరంలో రంగారావుకు వారి మిత్రులు సన్మానం చెయ్యాలనుకుంటూ ఒక అభినందన సంచిక తేవాలని తలపెట్టారు (1960) దానిలో తనను గురించి ధర్మారావే ఒక వ్యాసం రాయాలని రంగారావే అర్థించాడు అప్పుడే నట జీవితానికి సార్థక్యం అని ఒక ఉత్తరం కూడా రాశాడు.

ధర్మారావు చేసే ఉద్యోగ ప్రయత్నాల్లో అంతకు పూర్వం వాహ్వా వీహ్వా ఇచ్చిన ఖరీదైన బహుమానాలకు కాళ్ళొచ్చాయి. ఒకప్పుడు బొబ్బిలి రాజా ఇచ్చిన వాచీని కూడా అమ్మెయ్యాల్సి వచ్చింది.

ఇలాటి పరిస్థితుల్లో మందసా జమీనుండి ధర్మారావుకు ఆహ్వానం వచ్చింది అక్కడి జమీందారీకూడా కోర్ట్ ఆఫ్ వార్డ్స్ కిందకొచ్చింది. మోహ

నారాయణ మద్రాసులో ఎస్. ఎస్. ఎల్. సి. చదువుతున్నాడు. సంవత్సరం మధ్యలో ధర్మారావు కుటుంబం మద్రాసునుండి బయలుదేరి విశాఖ వచ్చింది. మోహనారావును చదువుకోసం విశాఖపట్నంలో ఉంచాడు.

1930 - 34 నడుమ ధర్మారావు జీవితంలో ఇప్పటివరకు చెయ్యని ఒక ఉద్యోగం చేశారు. అప్పుడు జస్టిస్‌పార్టీ రాజకీయాలు మద్రాసు రాష్ట్రంలో ప్రబలంగా ఉండేవి. ఈ పార్టీ 1917 లో స్థాపితమైనప్పటినుండీ ఇంగ్లీషు, తెలుగు, అరవ భాషల్లో దీనికి పత్రికలుండేవి. తెలుగులో ఈ పార్టీ నడిపే పత్రిక పేరు సమదర్శిని. చాలామంది దీనికి సంపాదకులుగా ఉండేవారు. వారిలో గానాల రామ్మూర్తి, గూడవల్లి రామబ్రహ్మం, మరుపూరు కోదండ రామిరెడ్డి ముఖ్యులు. మరుపూరు కోదండరామిరెడ్డి తర్వాత ధర్మారావు సమదర్శిని సంపాదక బాధ్యతలు స్వీకరించారు (1930 జూన్).

ధర్మారావుతోబాటు అందులో ఎస్.జి. ఆచార్య, ఎమ్.జి. గోపాలనాయుడు, మరుపూరు కోదండ రామిరెడ్డి పనిచేశారు. తాపీ సంపాదకుడుగా ఉండగా దండి సత్యాగ్రహాన్ని చిత్రాలతో సహా బాగా సమదర్శినిలో ప్రచారం చేశారు. తర్వాత తాను బయటకెళ్ళిపోయానని మరుపూరి వారు అన్నారు. ఇది నెరవేరుస్తున్న కాలంలోనే మందసా రాకుమారులకు ట్యూటర్ గార్డియన్‌గా రమ్మని ఆహ్వానం వస్తే అక్కడికి వెళ్ళిపోయారు. (1934). ఈ నడుమ కొంతకాలం మద్రాసులో ఓ ట్యుటోరియల్ కాలేజిలో కూడా అధ్యాపకులుగా ధర్మారావు పనిచేశారు. (1932).

ఈ మందసా కళింగసీమలోది. పూర్వకాలంలో బుద్ధదంతమున్న ఒక మంజూషను ఈ ప్రాంతంలో భద్రపరిచారట. ఆ మంజూష అన్న పేరే కాలక్రమంగా మందసా అయిందని ఒక ఐతిహ్యం.[30] ఈ ఎస్టేటు జమీందారులు ఉత్తర దేశీయులట. ఇందులో 166 గ్రామాలుండేవి. అందులో కొన్ని దేవస్థానం వారివి. మరి కొన్ని ఇనాంవి. కొన్ని సవర గ్రామాలు కూడా ఉన్నాయి. వీళ్ళు శిస్తు చెల్లించకుండా జమీందార్లకు వెట్టి చేస్తూంటారు. కొద్దిపాటి శిస్తు ఏదన్నా ఉంటే గ్రామస్థులందరూ తలా ఇంతా పంచుకుంటారు.[31]

ఈ జమీందార్లలో ఒకరైన శ్రీనివాస రాజమణి రాజదేవు మరణించిన తర్వాత వారి భార్య రత్నమాలా రాణి కొంతకాలం రాజ్యం చేసింది. 1934 లో ఆమె చనిపోయింది. ఆమె కుమారులు మైనర్లు. అందుచేత ఆ జమీ అప్పటి నుండి కోర్ట్ ఆఫ్ వార్డ్స్ పరమైంది.[32] అప్పుడే దానికి ట్యూటర్ గార్డియన్‌గా ప్రభుత్వం ధర్మారావుని నియమించింది.

మళ్ళీ ధర్మారావు పాత ఉద్యోగంలో కొచ్చాడు. జమీందారు కొడుకులకు చదువు చెప్పటమే కాకుండా వారితోపాటు టెన్నిస్ లాంటి ఆటలుకూడా ఆడు తుండేవాడు. లింగం వీరభద్రయ్య చౌదరి ఆనాడు ఆదాయంపన్ను శాఖలో చాలా ఉన్నతపదవిలో ఉండేవారు. అదే కాలంలో వారు మందసా క్యాంపులో ఉన్నారు. ఈ చౌదరి మొదటిసారి ధర్మారావును ఆ రాజకుమారుడి (18 సంవత్సరాల వయస్సువాడు) తో టెన్నిస్ ఆడుతున్న సమయంలో చూశామని తమ జీవిత చరిత్రలో రాసుకున్నారు. తమకు ధర్మారావు అంటే చెప్పలేనంత అభిమానమనీ, 1934 వేసవిలో వీరిని మందసాలో కలవటంవల్లనే తన క్యాంపు సాఫల్యమైందనీ కూడా రాసుకున్నారు.[33] మందసా రాజు శ్రీనివాస రాజమణి రాజదేవు పెద్ద వేటగాడుగా ప్రసిద్ధి. ఆరోజుల్లో ఏ దొర ఆ ప్రాంతానికి వచ్చినా ఈ రాజుతో కలిసి పులివేటకు వెళ్ళడం గౌరవంగా భావించేవారు. భారత దేశంలో ప్రసిద్ధిచెందిన పులుల స్థావరాల్లో ఈ మందసా ఒకటి.

ధర్మారావు ఇక్కడ సుమారొక సంవత్సరన్నర పనిచేసి, తర్వాత మద్రాసు వెళ్ళిపోయాడు. ఇక్కడకొచ్చిన కాలంలో రాష్ట్ర ముఖ్యమంత్రిగా బొబ్బిలి రాజా ఉండేవారు. జస్టిస్ పార్టీ ప్రభుత్వం. తర్వాత రాష్ట్రాలలో ఎన్నికలు రానున్నాయి. కొన్ని రాజకీయపక్షాలు పత్రికలు పెట్టాలన్న తలంపుతో ఉన్నాయి. అప్పుడప్పుడే మద్రాసులో సినిమారంగం తొలి శ్వాస పీలుస్తూంది. మొదటినుండి ఎక్కడ ఏ ఉద్యోగం చేస్తున్నా ధర్మారావు ఒక కన్ను నాటి రాజకీయ, సాంస్కృతిక కేంద్రంగా పరిగణించే మద్రాసు మీద ఉంటుండేది. దీనికితోడు ధర్మారావుకు విద్యార్థి దశనుండి మద్రాసుతో సంబంధాలున్నాయి. అదీకాక తెలుగుదేశంలో మరో ఊళ్ళో తన సొంతం అన్నది ఎక్కడా లేదు. ఇవన్నీ కలిసి ధర్మారావును మద్రాసు తీసుకొచ్చేశాయి. స్థిరంగా అక్కడే నిలబెట్టేలా చేశాయి. 1935 లో మద్రాసు వెళ్ళేటంతవరకూ రాజయోగాలూ - రాజభోగాలూ అనుభవించాడు ధర్మారావు. అనేక రకాలైన ఆటుపోట్లకు గురయ్యాడు. ప్రధానంగా ఈ దశలోనే ధర్మారావు జీవితం అస్థిరత్వానికి గురైంది. చెయ్యని ఉద్యోగం లేదు. మారని ఊరు లేదు. ఆయన జీవితం కష్టాల కొలిమిలో నిగ్గుదేలింది కనకనే తర్వాతి జీవితంలో ధర్మారావు పట్టిన ప్రతిదీ బంగారమైంది. వేసిన ప్రతి అడుగూ ఎంతో ఆచి తూచి వేసినందువల్లే ఆయా రంగాల్లో తన ముద్రను బలంగా నెలకొల్పాడు. ప్రజా జీవితాన్ని, ప్యూడలిజాన్ని చాలా దగ్గరగా ఉండి క్షణక్షణం నిశితంగా పరిశీలించాడు కనకనే తానే ఉద్యమాలను చేపట్టాలో స్పష్టంగా ఎంచుకున్నాడు.

# గజ్జెకట్టిన రాజకీయాలూ...

1905లో బెంగాల్ విభజన తర్వాత దేశంలో విప్లవ కెరటాలు పరవళ్ళు తొక్కాయి. దేశభక్తులు లాలా లజపతిరాయ్, తిలక్ వంటి వాళ్ళు దీన్ని విప్లవం దిశగా దేశాన్ని నడిపించడానికి అవకాశంగా తీసుకున్నారు. ఆరోజుల్లో తెలుగుదేశంలో తిలక్ పటాలు ఇళ్ళలో ఉండటమే నేరం. రాజమహేంద్రవరంలో తిలక్ బొమ్మ ఉందంటూ ఎన్నో ఇళ్ళు సోదా చేశారని టంగుటూరి ప్రకాశం తమ స్వీయచరిత్రలో అన్నారు. తెలుగునాట గ్రామ గ్రామాన రాజకీయ సంరంభం, స్వాతంత్ర్య పిపాస దావానలంలా వ్యాపించాయి. ధర్మారావు పర్లాకిమిడిలో చదువుకుంటున్న కాలం అది. వారినీ ఈ గాలి ఊపేసింది. ఎలాగో అలా చదువు అయిందనిపించుకుని, చిరుద్యోగాలలో టెక్కలి, బరంపురాలలో ఉండగా వందేమాతరం ఉద్యమం ఊపు అందుకుంది. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలిస్తూ మద్రాసు రాష్ట్రమంతటా పర్యటించాడు. ఈ ఉపన్యాసాలను ధర్మారావు శ్రద్ధగా వింటూ తన భావాలెటో నిశ్చయించుకోబోతున్నాడు.

ధర్మారావులో తన విద్య ఎలాగైనా పూర్తికావాలనీ, తమ కుటుంబంలో ఒకడైనా బి.ఎ. అయినాడనిపించుకోవాలన్న తపన ఉంది. అందుకే మొదటి స్థానం చదువుకిచ్చాడు. తన కుటుంబభారం కూడా కొద్దిరోజుల్లో నెత్తినపడబోతోంది. ఇవన్నీ మనసులో ఉంచుకున్న ధర్మారావు బి. ఎ. చదువుకు మద్రాసు వెళ్ళాడు.

పాల్ రేపిన ఉద్రేకం, వందేమాతరం ఉద్యమం, కాళీపూజ ద్వారా అరవింద ఘోష్ బెంగాల్‌లో తెచ్చిన సమైక్య భావం, గణపతి ఉత్సవాలను ఆసరాగా తీసుకుని మహారాష్ట్రలో తిలక్ నడిపించిన హైందవ పునరుద్ధరణోద్యమం అన్నీ ఏకముఖంగా నడిచాయి. 1907లో జరిగిన సూరత్ కాంగ్రెస్, అప్పటివరకూ కాంగ్రెస్‌లో మితవాదులదే పైచెయ్యిగా ఉంటే దాన్ని కాదని అతివాదులు విజృంభించడానికి అవకాశం ఇచ్చింది. కాంగ్రెస్‌కు అప్పటి సారథి ఫిరోజ్‌షా మెహతా ఒక నియంతలాంటివాడు. కాంగ్రెస్‌కు సంబంధించిన ఏ విషయమైనా ఈయన ప్రతిపాదించాల్సిందే. ఎదురన్నది లేదు. రాస

బిహారీ ఘోష్‌ను సూరత్ కాంగ్రెస్‌కు అధ్యక్షునిగా చేశారు. తిలక్ నాయకత్వంలో అతివాదులు దీన్ని ధిక్కరించాలనుకున్నారు.

సమావేశం ఆరంభంలో ఘోష్ పేరు ప్రతిపాదనకు వస్తే తిలక్ లేచి లాలా లజపతిరాయ్ పేరు సూచించాడు. కాంగ్రెస్ చరిత్రలో ఇది కొత్త. మెహతా దిమ్మెరపోయాడు. మితవాదులు కాదన్నారు. అంతే. తిలక్ భావాన్ని బలపరిచేవారికీ, మెహతా అనుయాయులకూ ఆ సభల్లో కుర్చీలతో యుద్ధం జరిగింది. రక్తపాతమైంది. నాటి నుండి కాంగ్రెస్‌లో అతివాదులూ, మితవాదులూ అంటూ నిర్దిష్టంగా విభజన ఏర్పడింది. అప్పటికీ నాయకత్వం మితవాదుల చేతుల్లోకి పోయింది.

మరు సంవత్సరం (1908) కాంగ్రెస్ మద్రాసులో సమావేశమైంది. చాలా చప్పగా జరిగింది ప్రకాశం మాటల్లో చెప్పాలంటే అది కేవలం మితవాదుల మహాసభ. ఘోషే అధ్యక్షుడు. ఆంగ్లేయ ప్రభుత్వం మాట అలావుంచి జాతీయవాదులపైన తమ తీవ్ర వాగ్ధాటి అంతా వినియోగించాడు. వారి దృష్టి ఎంతసేపూ ఉద్యోగాలూ అవీ ఎలా సంపాదించడమనే ఉండేది. కాంగ్రెస్‌కు ఒక నిర్దిష్ట కార్యక్రమం కూడా లేదనవచ్చు. ఆ సభలు డిసెంబర్ నెలలో చివరి మూడు రోజులూ మౌంట్ రోడ్డులోని ఎల్ఫిన్‌స్టన్ గ్రౌండ్స్‌లో జరిగాయి. ప్రతినిధులు 628 మంది. అధ్యక్షుడు రాబోయే మింటో మార్లే (రిఫారమ్స్) సంస్కరణలకు సంతృప్తి, రాజభక్తి ప్రకటించే మొదటి తీర్మానాన్ని అంగీకరింపచేశాడు. మరోవైపున 1818 రెగ్యులేషన్ 111 కింద ద్వీపాంతరవాస శిక్షలను ఖండిస్తూ బలప్రయోగ చర్యలను ఖండిస్తున్నామనికూడా తీర్మానించారు.

ఇదంతా గురజాడ అప్పారావు చూశాడు కనుకనే ఈ వ్యవహారాన్ని ఎగతాళి చేశాడు. అప్పుడు ధర్మారావు పచ్చయ్యప్ప కళాశాలలో బి.ఎ. చదువుతున్నాడు. వీటన్నిటినీ శ్రద్ధగా పరిశీలించాడు. కాంగ్రెస్ వ్యవహారాన్ని చూశాడు. మహాసభల తిరునాళ్ళూ గమనించాడు. కానీ రాజకీయంగా ఎటూ తేల్చుకోలేక బి. ఎ. పరీక్ష రాసి బరంపురం వెళ్ళాడు.

ధర్మారావు అంతకు ముందు బరంపురంలో పనిచేస్తున్న కాలంలో అక్కడి సామాజిక కార్యక్రమాలన్నింటిలో పనిచేస్తూండేవాడు. ప్రకాశం 1905లో లండన్ నుండి తిరిగొచ్చి కొన్నాళ్ళకు బరంపురం వెళ్ళాడు. సంస్కరణవాదులకూ సనాతనవాదులకూ పెద్ద రభస జరిగింది. వరాహగిరి వెంకట జోగయ్య వీరికి ఆతిథ్యమిచ్చాడు. పూర్వాచార పరాయణులు ఆ కుటుంబాన్ని వెలివెయ్యాలని తలచారు. అక్కడి వకీళ్లలో కోవర్గాం రామ్మూర్తి, జయంతివారూ సంస్కరణవాదులే కావసంపన్న అంతమాని చెయ్యలేదు (1906).

కాని ఆరోజుల్లో ఇలాటి సందర్భాలపుడు బరంపురం యుద్ధరంగంగా ఉండే దని చిలకమర్తివారు కూడా పేర్కొన్నారు. ఈ తగాదాలలో ధర్మారావు సంస్కరణవాదుల పక్షాన్నే నిలబడ్డాడు. ఈ సంస్కరణభావాలను వీరేశలింగం అతి తీవ్రంగా ప్రచారం చేస్తున్న కాలంలో పర్లాకిమిడిలో గిడుగు రామ్మూర్తితో సహా చాలామంది ఈప్రభావానికి గురైనారని బుర్రా శేషగిరి రావు రాశాడు.

సహపంక్తి భోజనాల వ్యవహారం కూడా ఇంతే. 1904లో హేమచంద్ర సర్కార్ రాజమండ్రి వచ్చినప్పుడు ఆయన శూద్రుడు కనక కలిసి భోంచెయ్యడానికి దేశిరాజు పెదబాపయ్య ఊగిసలాడాడు. అలాగే బిపిన్‌చంద్రపాల్ వచ్చినప్పుడు కొండా వెంకటప్పయ్య జంకాడు. ఈ సంఘటనలను ధర్మారావు విజయనగరం నుండే గమనిస్తున్నాడు. అప్పటికే చర్చా సంఘాల ద్వారా సంస్కరణ గూర్చి, స్త్రీ పునర్వివాహాల గూర్చీ తీవ్రంగా చర్చిస్తూ సంస్కరణలవైపే మొగ్గేవాళ్ళమని ఆయనే 'రాలూ రప్పలూ'లో రాసుకున్నాడు.

1910లో బరంపురంలో జరిగిన అన్ని వర్ణాల విందులో అప్పారావు పాల్గొన్నాడు. ఇది ఒక్క బరంపురాన్నే కాదు కళింగాన్నంతా కుదిపేసింది. ఈ వ్యవహారాన్ని నడిపించినవారిలో అప్పుడే బి.ఎ. పూర్తి చేసుకు వచ్చిన ధర్మారావూ ఉన్నాడు. వీరి చదువుకు ప్రోత్సాహమిస్తుండే వరదా వారి కుటుంబం కూడా ఉంది. మొదట్నుంచీ సంస్కరణ భావాల వైపు పరుగు తీస్తున్న ధర్మారావుకు ఇలాటి సంఘటనలు మరింత ఉత్సాహం కలిగించేవి.

నాటి రాజకీయ పరిస్థితుల మధ్య సాహిత్య వ్యాసంగంలో మునిగిన గురజాడ వారే తనను "నేను అమితమైన మితవాదిని మితమైన తీవ్రవాదిని" అని అంచనా వేసుకున్నారు. ఈ పరిస్థితుల్లో జావకారిపోయే కాంగ్రెస్ మితవాదిత్వం, లాల్, పాల్, బాల్‌ల అతివాదిత్వంమధ్య యువకుడైన ధర్మారావు, రాజకీయాభిప్రాయాలకు రెండో స్థానం ఇచ్చాడు. సంస్కరణాభిప్రాయాల్లో అతివాదిగా ఉండాలనుకున్నాడు. కాంగ్రెస్ మీద పుట్టిన అసహ్యం సహజంగానే ఆ భావాలకు దూరంగా ఉండే జాతీయాభిమానిగా ధర్మారావుని నిలబెట్టింది.

ఈ పరిస్థితుల్లో ఆంగ్లభాషన్నా ఆంగ్లేయుల సంపర్కంతో భారతీయుల్లో ఏదో కొంత మేరకు సంస్కరణ భావాలొచ్చి సనాతన సంప్రదాయాలు పోతాయన్న ఆలోచనా ధర్మారావును ఆంగ్లేయులవైపు మొగ్గించాయి. తండ్రి డాక్టరీ చదివి ఇంటికి తెచ్చిన ఆంగ్లభావాలు దీనికి దోహదం చేశాయి. సందర్భోచితంగానే ఆరోజుల్లో ప్రకాశం మాటల్లో చెప్పాలంటే "జనం ఇంగ్లీషు చదువులకి తియ్యనీటికి చేపలెక్కినట్లు ఎక్కారు". గురజాడవంటి వాళ్ల

ఇంగ్లీషు చదువు ఏ కొందరికైనా "కన్ను కానని వస్తుతత్వము" విప్పి చెప్తుంచనుకున్నారు.

శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి "కళ్లకు వెలుగిచ్చి కొత్తబాటలు కనబర్చి దృక్పథమే మార్చేసింది ఇంగ్లీషు వాఙ్మయం మనకు. వైదిక విద్యలు నేరిచి ధర్మనిష్ఠులయి వుండిన వారిని కూడా తమ కుమాళ్లను ఇంగ్లీషు చదువులో ప్రవేశపెట్టేటట్టు చేసింది. ఉద్యోగ వ్యామోహం, వీరి కధికారం ఉంది. వీరికి లేదు అనకుండా అష్టాదశవర్ణాలవారికీ పఠనపాఠనావకాశాలను కల్పించింది రాజ్యాంగం"34 అంటూ ఆంగ్ల సాహిత్యాన్ని గూర్చి అభిప్రాయపడ్డారు.

ఈ రకమైన దృష్టి నాటి పెద్దల్లో ఉంటూండేది. కనకనే ధర్మారావు ఆ అభిప్రాయాల దారిలోకి వెళ్ళిపోయాడు. ఈ సందర్భంలోనే కె.వి. రమణా రెడ్డి నాటి ప్రజలనూ ఇంగ్లీషు చదువులనూ గురించి చేసింది చక్కని అంచనా. "ఇంగ్లీషు చదువు ప్రజలనుండి విద్యాధికులను వేరు చేసి, ఒకరి బతుకునకెన్ని చిక్కుముళ్ళు వేసిందో, మరొకరికన్ని నిక్కుటెక్కులూ తెచ్చిపెట్టింది. ఆంగ్ల విద్యాధికులందరూ నవభావాలను సమాదరించలేదు. అల్పసంఖ్యాకులలో అత్యల్ప సంఖ్యాకులు మాత్రమే ఆ సాహసం చేశారు. తతిమ్మా జనం సాదా జనాన్ని మించి ఆలోచించలేకపోయింది. ఆచారంతో రాజీకి తయారైంది".35 ధర్మారావు తాను సాదాజనంలో ఒకడుగా ఉండాలో విశిష్టవ్యక్తుల్లో చేరాలో ఇంకా స్పష్టంగా నిర్ణయించుకోలేదప్పటికి.

ఈ కాలానికి బ్రాహ్మణేతరుల్లో ఆంగ్ల విద్యాభ్యాసం చేసినవాళ్ళు కొద్ది కొద్దిగా పైకొస్తున్నారు. విద్యాభ్యాసం చేయటమన్నది ఉద్యోగాలకే తప్ప కేవలం జ్ఞానసముపార్జనకే అన్న భావం ఆనాడు ఎవరికీ లేదు. ముఖ్యంగా పై వర్గాల్లో ఉంటే ఉండవచ్చు కానీ మధ్యతరగతివాళ్ళలో మాత్రం ఉండేది కాదు. ధర్మారావు కుటుంబం నానా అవస్థలూ పడి ధర్మారావును తమ కుటుంబంలో బి.ఎ. అనిపించాలన్న భావం ఉన్నప్పుడు, వారు బి.ఎ. చదివేది కేవలం విజ్ఞానం పెంచుకోవటానికి కాక సర్కారీ నౌకరీ కోసం అన్నది విదితమవుతుంది. అప్పటికే వీరి తండ్రి డాక్టరు చేసి మిలట్రీలో కానీ ప్రయివేటుగా కాని ధనార్జన కోసమే పనిచేశాడు అలాగే నరసింగరావుకు డాక్టరీ చెప్పించి రంగూన్ పంపిందీ - తల్లీ చెల్లెళ్లతోసహా - కుటుంబపోషణకే.

అటువంటప్పుడు ధర్మారావుకు సర్కారు నౌకరీ రానందువల్ల ఎలా ఉండి ఉండేదో మనం ఊహించవచ్చు.

సరిగ్గా ఇలాటి పరిస్థితే నాటి మద్రాసు రాష్ట్రంలోని బ్రాహ్మణేతరులందరికీ, అర్థి విద్యావంతులందరికీ ఎదురైంది. బ్రాహ్మణేతరులందరూ తమకు

ఉద్యోగాలు రావాలన్న సహజమైన వాంఛను ప్రకటించారు. చరిత్రనంతా తవ్వి తామెలా గతంలో ఉద్యోగాల విషయంలో మోసపోయిందీ వివరించారు. ఈ మోసం వల్ల బ్రాహ్మణులకు ఎక్కువగా ఉద్యోగాలు వస్తున్నాయన్న అంశం తేలటంతో వారిపై ఒకరకంగా ఈర్ష్య, తామింతవరకూ సంఘటిత పడి అందుకు కృషి చేయలేదన్న బాధా బ్రాహ్మణేతరుల్లో కలిగింది. ఒక ఉద్యమంగా ముందుకు పోవాలనుకున్నారు తమ ఆశయాలకు భిన్నంగా వ్యవహరించినా లేదా ఆటంకపరిచినా అలాటి ప్రతివాణ్ణీ శత్రువుగా పరిగణించారు. ఏమాత్రం తమ ఆశయసాధనకు తోడ్పడ్డా అలాటి ప్రతిదాన్నీ నెత్తికెక్కించుకున్నారు.

ఆ బ్రాహ్మణేతర ఉద్యమం పూర్వాపరాలు కొంత పరిశీలించటం అవసరం. ఎందుకంటే- ఇందులోని సాంస్కృతిక సామాజిక అంశాలు కొన్ని ధర్మారావు అభిమానానికి పాత్రమయ్యాయి. ఇందులోనుండే సంస్కరణ సంఘాలు ఆవిర్భవించాయి. దీని తర్వాత వచ్చిన రాజకీయవేదికే జస్టిసు పార్టీ. వీటన్నిటితో ఏదో ఒకరకంగా సంబంధం ధర్మారావుకుండేది.

18వ శతాబ్దం చివరి దశాబ్దంలోనూ 19వ శతాబ్దంలోనూ బెంగాల్ తదితర ప్రదేశాల్లో రెవిన్యూ పద్ధతి అమల్లోకి వచ్చింది. పొలాలు సొంతంగా పొందినవాళ్ళు జమీందార్లు అయ్యారు. ఈ భూస్వాములే కొంత కాలానికి ప్రభుత్వానికి పన్ను కట్టలేనందువల్ల అవన్నీ వేలం వేశారు. కొందరు రైతులతో ఒప్పందాలు కుదుర్చుకున్నారు. రైత్వారీ పద్ధతి ఆ విధంగా మద్రాసు ప్రాంతంలో వచ్చింది. ఇది ఉత్తర మద్రాసు ప్రాంతాల పరిస్థితి. ఇక దక్షిణ ప్రదేశాల్లో పెద్ద రైతులే భూస్వాములు. వాళ్ళనే మిరాసిదార్లన్నారు, వాళ్ళు గ్రామాధికార్లు. 19వ శతాబ్దం మధ్యకు మిరాసిదారీ పద్ధతిని తోసేసి రైత్వారీ చాలా గ్రామాల్లో ప్రధానమైంది. భారతదేశంలో ఒక మూల ప్రాంతమైన ఇక్కడే రైత్వారీ పద్ధతి అమల్లో ఉండటం, భాష కూడా మిగిలిన వాళ్ళకన్నా వేరుగా ఉండటం ఇవన్నీ కారణాలుగా 'మద్రాసు తరహా' పాలన ఇక్కడ అమల్లోకి వచ్చిందని ఇర్‌షాక్ అభిప్రాయం.

1900 వ సంవత్సరంలో తిరునల్వేలి జిల్లాలో బ్రాహ్మణ - అబ్రాహ్మణ సంఘర్షణలు ఎక్కువగా ఉంటూండేవి. భూమిశిస్తు కట్టేవాళ్ళందరూ బ్రాహ్మణేతరులు. బ్రాహ్మణులు ఈ తెగలను అంటే కమ్మ, వెలమ, రెడ్డి, వెల్లాల మొదలైన వాళ్ళను శూద్రులనేవాళ్ళు. దాంతో ఘర్షణలు పెరిగాయి. 20వ శతాబ్దం ఆరంభానికి ఇలా బ్రాహ్మణులు తమను శూద్రులని పిలవటాన్ని బ్రాహ్మణేత

రులు నిరసించటం ఆరంభించారు. భూస్వాము లందరూ పైన పేర్కొన్న బ్రాహ్మణేతర వర్ణాలవారే.

పాల్ పర్యటన ఈ ప్రాంతంలోని యువకుల్లో ఉత్సాహాన్ని రేకెత్తించింది. ఆయన భావం కూడా పట్టణాలనూ, అక్కడి యువకులనూ ఆకర్షించాలనే. అప్పటి పత్రికలు ఆయన సంచారాన్ని "ఒక దురాక్రమణ" అని వర్ణించినట్టు డి. యస్. శర్మ తన గ్రంథంలో[36] సాక్ష్యం పలుకుతున్నాడు. విశ్వవిద్యాలయాల నుండి డిగ్రీలు తీసుకున్నవారిలో ఎక్కువశాతం బ్రాహ్మణులే ఉండటం, ప్రభుత్వోద్యోగాల్లో కూడా బ్రాహ్మణులే అధికశాతం ఉండటం బ్రాహ్మణేతరులు గమనించారు. అప్పటికున్న రాజకీయ సంస్థ కాంగ్రెస్‌లో కూడా బ్రాహ్మణాధిపత్యాన్నే వీరు చూశారు. దీనికి తోడు- బ్రాహ్మణులకు పోటీగా బ్రాహ్మణేతరులు సంఘటితం కావడానికి "ఇదీ ఒకందుకు తమకు మంచిదే" నన్న భావంతో ఇంగ్లీషు అధికారులూ సాయపడ్డారు. తంజావూరు కలెక్టరు ఏ. డువేర్ అనే ఆయన జేమ్స్ కైర్ట్ అనే కరువు సంఘ సభ్యునికి 8-7-1879 న ఒక లేఖ రాస్తూ "బ్రాహ్మణుల్లా శత్రువర్గం మరోటి ఇంగ్లీషు వాళ్ళ కుండదు" అంటూ ఆ వర్గం ఆలోచనలను చాలా నిశితంగా విమర్శించాడు.[37] ప్రభుత్వ ఉద్యోగాల్లో బ్రాహ్మణుల ఆధిపత్యం కొనసాగితే తమ భద్రతకే ముప్పు రావచ్చునీ భావించారు. కులాలవారీ సంఘాలను ప్రోత్సహించారు. ఆయా కులాలు కూడా బ్రాహ్మణ వర్ణానికి వ్యతిరేకంగా తమ తమ కులాల సభలు జరుపుకోవటం ఆరంభించాయి. ఇతర రాష్ట్రాలలో కూడా ఇలాటి సంఘాల ముందంజ ఇక్కడి బ్రాహ్మణేతర వర్ణాలు సంఘటితం కావడానికి తోడ్పడింది.

ఈ ఉద్యమం సంస్కరణ, జాతీయవాదం, ఉద్యోగావకాశాలు అన్న భావాలతో ముందుకు పోవడానికి మరికొన్ని సంఘటనలు కూడా తోడ్పడ్డాయి.

ఈ కాలంలోనే ఆంగ్లేయులకు పోటీగా ఎం. చిదంబరం పిళ్ళే అనే వెల్లాల వ్యక్తి స్వదేశీ స్టీమ్ నావిగేషన్ కంపెనీ పెట్టాడు. ఇతడు టెర్రరిస్టు ఉద్యమాలకు సాయపడ్తూండేవాడు (1907-1908). వారి కార్యక్రమాల్లో భాగంగా తిరునల్వేలి జిల్లా కలెక్టర్ యాష్‌ను రైల్వేస్టేషన్‌లో ఒక టెర్రరిస్టు కాల్చి చంపాడు. అందులో రెండో ముద్దాయి శంకర కృష్ణన్ తరఫున ప్రకాశం వాదించాడు. ఆయన పట్టిన మొదటి క్రిమినల్ కేసు ఇదే.[38] ఈకేసులో సుబ్రహ్మణ్యభారతి కూడా ఉన్నాడు. కానీ తప్పించుకుని పాండిచేరి వెళ్ళాడు. కార్యాచరణకు ఎదురుచూస్తున్న బ్రాహ్మణేతరులకు ఈ కాల్పుల ఘటన ఒక ఊపు నిచ్చింది.

అలాగే మరాఠీ మాట్లాడేవారైన కె. శ్రీనివాసరావు, ఆర్. రఘునాథ రావు బ్రాహ్మణులే. అయినా సంఘ సంస్కరణ కార్యక్రమా లారంభించారు. బ్రాహ్మణు లెవరూ ఈ ఉద్యమాన్ని బలపరచలేదు. అప్పుడే హిందూ సభ ఒకటి ఏర్పడి హిందూ పునరుజ్జీవన ఉద్యమం ఆరంభించింది. ఈఉద్యమాలన్నీ బ్రాహ్మణేతరుల్లో సాంఘిక, రాజకీయ చైతన్యాన్ని పెంపొందించాయి. తమిళ ప్రాంతంలో జరిగిన ఈ ఘటనలన్నీ రాజధాని అయిన మద్రాసులో ప్రతిబిం బిస్తూ ఉండేవి. విద్యార్థిగా ఉన్న ధర్మారావులో ఆలోచనలు రేకెత్తించాయి.

ఒక బ్రాహ్మణేతరుడు 'ఫెయిర్ ప్లే' అనే మారుపేరుతో రాస్తూ బ్రిటిష్ వాళ్ళు భారతదేశాన్ని పాలిస్తున్నా నిజంగా బ్రాహ్మణులే పాలిస్తున్నారనీ భారత జాతీయ కాంగ్రెస్ కూడా బ్రాహ్మణుల ప్రయోజనాలనే కాపాడ్తోందనీ వివరిం చాడు.[39]

మద్రాసులో 1912 నుండి ద్రవిడియన్ అసోసియేషన్ అనే సంస్థ పని చేస్తూండేది. అది సి. కరుణాకర మీనన్ రాసిన 'నాన్ బ్రాహ్మిన్ లెటర్స్' ను ప్రకటించింది. ఇవి డియర్ గోవిందరాజులు, డియర్ రామస్వామి అనే వారికి రెడ్డి, నాయుడు, మొదలియార్‌లు రాసినవి. బ్రాహ్మణేతర ఉద్యమం ఆవశ్యకత, విడివిడిగా కుల సంఘాల అవసరం, బ్రాహ్మణేతరుల్లో అనై క్యత ఎలా ఉందీ, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులను ఎలా అణగ దొక్కు తున్నదీ, తమ కోసం ఒక ద్రావిడ ఉద్యమం, ఒక కళాశాల ఎలా అవసరం అన్న విషయాలూ ఆ ఉత్తరాల్లో విశదీకరించారు.

ఇంతలో మొదటి ప్రపంచ సంగ్రామం వచ్చింది. ఆంగ్లేయ యంత్రాంగ మంతా దేశంలో నిరంకుశ విధానాన్ని అమలు పరచటం ఆరంభించింది. సైనికుల కోసం నానా పద్ధతులు అవలంబించింది. దేశీయుల్లో సంక్షోభం పెరి గింది. కాంగ్రెస్ కూడా దేశాన్ని రాజభక్తి పరాయణత్వంలో ముంచెత్తిన మితవాదుల చేతుల్లో ఉంది. సరిగ్గా అప్పుడే (1914) తిలక్ మాండలే జైలులో ఆరు సంవత్సరాల శిక్ష అనుభవించి తిరిగొచ్చాడు

అనిబిసెంటు సాంఘిక, మత విషయాల్లో కృషి చేస్తూ దేశంలో దివ్య జ్ఞాన సమాజాలను నడుపుతూండేది. ఆమెకు చక్కని వాగ్ధోరణీ, నిర్మాణ నైపుణ్యమూ, రాళ్లను కూడా ఉత్తేజంతో చలింపచేయగల శక్తి ఉండేది. ఈమె 1914 లో కాంగ్రెస్‌లో చేరింది.

అనిబిసెంట్ ఫేబియన్ సొసయిటీ సభ్యురాలు. 1915 ఫిబ్రవరి నుండి 'మద్రాసు పార్లమెంట్' పేరుతో సమావేశాలు జరుపుతూ అందులో ప్రధాని, ప్రభుత్వ పక్షం, ప్రతిపక్షం ఉండి చర్చలు కొనసాగించేవారు. వీటిద్వారా

మద్రాసులో రాజకీయాలంటే ఆసక్తి ఉన్నవాళ్ళకు పరిపాలనా పద్ధతులు తెలియచెయ్యాలని ఆమె కోరిక. చాలా మంది కళాశాల విద్యార్థులూ నగరం లోని మేధావులూ ఆకర్షితులౌతూండేవారు. స్వయం పరిపాలన ప్రవేశ పెట్టటం ఆమె ఉద్దేశం. 'న్యూ ఇండియా' అనే దిన వార పత్రికలు నడిపి హోంరూలు ఉద్యమం గురించి మొదటిసారిగా తన అభిప్రాయాలను ఆమె 1915 సెప్టెంబర్ 'న్యూ ఇండియా' లో రాసింది. సి. పి. రామస్వామి అయ్యర్, ఎ. రంగస్వామి అయ్యర్‌చేత మద్రాసు మహాజన సభ మందిరంలో ఉపన్యాసాలిప్పించింది. చివరకు తన హోంరూలు ఉద్యమంలోకి రావాల్సిందిగా దేశానికి పిలుపు ఇస్తూ 3-9-1916 న అఖిలభారత హోంరూలు సంస్థను ఏర్పాటు చేసింది. అంతకుముందే మహారాష్ట్రలో ఈ హోంరూలు ఉద్యమాన్ని ప్రజల్లోకి తీసుకెళ్ళటానికి తిలక్ కృషిచేశాడు. ఈ ఉద్యమం బాగా వ్యాప్తి చెందటానికి కారణాలు కాంగ్రెస్‌లో మితవాదుల నాయకుడు గోఖలే మరణిం చడం వల్ల ఆ వర్గంలో నిర్వీర్యత ప్రబలడం, కొన్ని రాజకీయ సంస్కరణల కోసం మాంటేగు భారత దేశం రానున్నాడన్న వార్త వ్యాపించటం. ఇవన్నీ భారతదేశం, ప్రధానంగా మద్రాసు రాజకీయ వాతావరణాన్ని వేడెక్కించాయి.

ఈ హోంరూలు ఉద్యమంలోనూ బ్రాహ్మణాధిక్యతే ఉందని బ్రాహ్మణేతరులు నిరసించారు. ఈ ఉద్యమ నాయకులు తమకేమైనా హోంరూలు ఉద్యమం లాభం కలిగిస్తుందా అని అనిబిసెంటును అడిగితే "ముందు హోంరూలు రానివ్వండి తర్వాత చూసుకుందాం" అని సమాధానం చెప్పింది. ఇది ఆమె ఉద్యమం మీద బ్రాహ్మణేతర ఉద్యమ నాయకులకు నిరసన కలగ డానికి కారణం. అయితే అప్పటికి విశాఖపట్నంలో సి. బి. ఎం. విద్యాలయంలో అధ్యాపకుడుగా పనిచేస్తున్న ధర్మారావుకు హోంరూలులో మంచే కనిపించింది. విద్యార్థులను కదిలించి పురప్రజలనుండి చందాలు వసూలు చేయించి అనిబిసెంటుకు పంపుతుండేవాడు. దక్షిణాది ప్రాంతంలో వచ్చిన బ్రాహ్మణేతర ఉద్యమం అంత ఉధృతి తెలుగు ప్రాంతాల్లో ఆదిలోనూ రాలేదు. దీనికి కారణం ఇక్కడున్న బ్రాహ్మణేతరుల భూసంబంధాలలో ఉన్న ప్రత్యేకతే కారణం కావచ్చు.

ఈ హోంరూలును కాంగ్రెస్ చేత ఆమోదింప చెయ్యటానికి అంతకు ముందు డిసెంబర్ 1915లో అనిబిసెంటు ప్రయత్నం చేసినప్పుడు మాలవ్యా ఈ సంస్థ అంత మంచిది కాదంటూ, కాంగ్రెస్ కార్యకర్తల పోరాటపటిమను ఇది చల్లారుస్తుందేమోనన్న అనుమానంతో దీనికి ఆయన అంగీకరించలేదు.

1913 నుండి 1916 నాటికి బ్రాహ్మణేతర ఉద్యమ భావాలు ప్రతి తాలూకాల్లోనూ బాగా పాదుకున్నట్టు నాడు హిందూ, మెయిల్ పత్రికల్లో వచ్చిన సంపాదకలేఖలు చూస్తే బోధపడుతుంది.

24-2-1916 న న్యూ ఇండియా పత్రికలో ఒక వార్త అచ్చయింది. అది మధురలో జరిగిన ఒక సంఘటన. ఒకరికి రావు బహదూర్ బిరుదు వచ్చిన సందర్భంలో క్లబ్బులో విందు ఏర్పాటు చేశారు. అందులో బ్రాహ్మణుల భోజనాల టేబుల్‌కు వంద గజాల దూరంలో బ్రాహ్మణేతరుల టేబుల్ ఉంచారు ఇది బ్రాహ్మణేతరుల్లో చాలా అలజడి సృష్టించింది.

## గడ్డిపోచ విలువెంత ?

మద్రాసులో 1916 జూన్‌లో సి. నటేశ మొదలియార్ అనే వైద్య విద్యార్థి బ్రాహ్మణేతరుల కొరకు ఒక హాస్టలు ఏర్పాటు చేశాడు. ఈ నటేశ మొదలియార్, అప్పటికే మద్రాసు పురపాలక సంఘ వ్యవహారాల్లో చురుకుగా కృషి చేస్తున్న డాక్టర్ టి. ఎం. నాయర్, పి. త్యాగరాయ చెట్టిని ముందుగా కూడగట్టాడు. ఈ నాయర్ చాలా సరసుడు. ట్రిప్లికేన్ డివిజనుకు కార్పొరేషన్ సభ్యుడు. ప్రజల ఆరోగ్యవ్యవహారాల్లో ఎక్కువ శ్రద్ధ చూపెట్టేవాడు. తిరువళిక్కేణి డివిజనులోని చెరువులో బట్టలుతికి అనారోగ్యం కలిగించడం చేత ఆ పనులు నిషేధిస్తూ ఆయన ఉత్తరువులు జారీ చేశాడు. దాంతో ట్రిప్లికేన్‌లోని అయ్యర్లు, అయ్యంగార్లు ఆయనమీద కక్ష కట్టి మరుసటి కార్పొరేషన్ ఎన్నికల్లో ఆయనను ఓడించారు.40

నాయర్‌వర్గం 20.11.1916న విక్టోరియా పబ్లిక్‌హాలులో మరో 30 మంది బ్రాహ్మణేతరుల్తో ఒక సమావేశం జరిపారు. సౌత్ ఇండియన్ పీపుల్స్ అసోసియేషన్ లిమిటెడ్ అనే సంస్థను జాయింట్ స్టాక్ కంపెనీగా స్థాపించారు. బ్రాహ్మణేతర ఉద్యమాన్ని నడపాలనీ అందుకు ప్రచారం కోసం ఇంగ్లీషు, తెలుగు, తమిళ భాషల్లో పత్రికలను తీసుకుని రావాలనీ ఆ సమావేశంలో తీర్మానించారు. ఇదే బ్రాహ్మణేతరుల ఉద్యమాన్ని పరోక్షంగా సృష్టించిందనవచ్చు.

తర్వాత 20.12.1916న న్యూ ఇండియా, హిందూ పత్రికల్లో 'బ్రాహ్మణేతర ఉద్యమ ప్రణాళిక'ను ప్రకటించారు. అహింసాసూత్రం ఆధారంగానూ, నాయకత్వం భూస్వాముల చేతుల్లో ఉండేలా ఈ సంఘం పని చేస్తుందన్నారు. దీనితో పాటు సౌత్ ఇండియన్ లిబరల్ ఫెడరేషన్ (ఎస్.ఐ.ఎల్.ఎఫ్.) కూడా ఏర్పడిందని నాయర్ ప్రకటించాడు. బ్రాహ్మణేతరులకు ప్రభుత్వోద్యోగాల్లో ఎక్కువశాతం ఉద్యోగాలు ఇవ్వాలన్నది తమ డిమాండనికూడా అన్నారు. శాసనసభల్లో బ్రాహ్మణేతరులకు తగినంత ప్రాతినిధ్యం కావాలన్నారు. విద్యారంగంలో తమకు జరుగుతున్న అన్యాయాలను విశదీకరించారు అన్ని రంగాల్లోనూ అప్పటికున్న బ్రాహ్మణ ఆధిక్యతను వివరాలతో ఎత్తిచూపారు. కాంగ్రెస్ కూడా బ్రాహ్మణేతరులకు అన్యాయం చేస్తోందన్నారు. ఒకే వర్ణం అధికారంలో ఉండటం సహించరాదనీ, వర్ణ ప్రసక్తిలేని ప్రభుత్వం ఉండాలనీ వెల్లడించారు. చివరకు బ్రాహ్మణేతరుల అభివృద్ధి వారి చేతుల్లోనే ఉందనీ విద్య, వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో ముందంజ వేస్తూ రాజకీయాధికారాన్ని చేపట్టాలని ఆ ప్రణాళికలో పిలుపిచ్చారు.

త్యాగరాయచెట్టి 'నాన్‌బ్రాహ్మిన్' అనే ఇంగ్లీషు వారపత్రిక నడిపేవాడు 26.2.1917న 'జస్టిస్' అన్న ఇంగ్లీషు దినపత్రిక డాక్టర్ టి. ఎం. నాయర్ సంపాదకత్వంలో వచ్చింది.

1885 నుండి నడుస్తున్న 'ఆంధ్ర ప్రకాశిక' అన్న తెలుగు పత్రికను ఎ.సి. పార్థసారథి నాయుడు సంపాదకుడుగా ఎస్ ఐ.ఎల్.ఎఫ్. తీసుకుంది. అది 1917 లోనే.

1917 మధ్యలో 'ద్రవిడియన్' అన్న తమిళ పత్రికను ఎన్. భక్త వత్సలం పిళ్ళే సంపాదకత్వంలో తీసుకొచ్చారు. ఇవన్నీ బ్రాహ్మణేతర ప్రణాళికా సూత్రాలకు అనుగుణంగా ఉద్యమాన్ని వ్యాపింపచేయటంలో కృషిచేశాయి.

14.3.1917న నాయర్[41] తమ ఉద్యమం రాజకీయాభిప్రాయాలను వెల్లడిస్తూ మద్రాసులో ఉపన్యసించాడు. ఆ వెలుగులోనే 'జస్టిస్' అనే రాజకీయ పక్షం ఆవిర్భావమైంది.

జస్టిస్ పార్టీ ఆవిర్భావం మద్రాసు రాష్ట్ర రాజకీయ రంగంలో ఒక మార్పు తెచ్చింది. మొదట్లో కేవలం బ్రాహ్మణేతరులకు జరుగుతున్న అన్యాయాన్ని వాళ్ళకు తెలియజెప్పి తమ అభివృద్ధికి తామే పాటుపడాలన్న ప్రబోధం చేస్తూ ఉద్యోగాల్లో బ్రాహ్మణేతరులు కూడా తగిన శాతంలో ఉండాలన్న కోరికతో ఆవిర్భవించింది. ఇందులో తర్వాతర్వాత వచ్చిన వారంతా కాంగ్రెస్ నుండే. క్రమంగా ఆంగ్లేయులు విభజించి పాలించమన్న సూత్రాన్ని

ఉపయోగించి వీరిని దగ్గరకు తీయటం, ఒకరిని మరొకరిపై రెచ్చగొట్టటం లాంటివాటివల్ల రానురాను జాతీయ వ్యతిరేక భావ వెల్లువలో ఇది కొట్టుకు పోయింది.

జస్టిస్ పార్టీ మొదటి మహాసభ 1917 అగస్టు 19-20 తేదీలలో కోయం బత్తూరులో పానగల్ రాజా అధ్యక్షతన జరిగింది. వెంటనే అదే సంవత్సరం ఈ ఉద్యమం అటు తమిళనాడుతోబాటు తెలుగు దేశమంతా పాకింది. వివిధ ప్రాంతాల్లో అనేక సభలు జరిగాయి. 27.10.1917న చిక్కవోలులో చల్లపల్లి రాజా అధ్యక్షతలోనూ 1917 నవంబర్ 3-4 తేదీల్లో పులివెందులలో కె. సుబ్బారావు అధ్యక్షతలోనూ, 1917 డిసెంబర్ 11-12 తేదీల్లో బెజవాడలో త్యాగరాయ చెట్టి అధ్యక్షతలోనూ జరిగాయి. అదే విధంగా తమిళప్రాంతం తిరునల్వేలిలో 30.11.1917 న తేల్రపోలు జమీందారు అధ్యక్షతనా, 8.12. 1917 న సేలంలో కె. ఎస్. దొరై రాజా (పుదుక్కోట రాజా) అధ్యక్షతనా జరిగాయి. చివరకు బ్రాహ్మణేతర సంఘటన మహాసభలు 28, 29 డిసెంబర్ 1917 న మద్రాసులో వెంకటగిరి రాజా అధ్యక్షతన జరిగాయి. ఈ కాలంలో ధర్మారావు మద్రాసులో న్యూయింగ్టన్ కళాశాల అధ్యాపకుడు గానూ - మద్రాసుకు వస్తూ పోతూనూ వీటన్నిటిలోనూ పాల్గొంటూండే వాడు. ఆనాడు ఈ బ్రాహ్మణేతర ఉద్యమంలో పచ్చయ్యప్ప కళాశాల చాలా ప్రముఖ పాత్ర వహించిందని మామిడిపూడి వెంకటరంగయ్య అభి ప్రాయం. ధర్మారావు ఆ కళాశాల పూర్వ విద్యార్థి. జాతీయ తీవ్రవాదభావాలు కలిగి ఉంటూ అనిబిసెంటు ఉద్యమంలో పాలుపంచుకొంటూ క్రమంగా చాలా మందిలాగా ఈ బ్రాహ్మణేతర ఉద్యమం వైపు ఆకర్షితులయ్యారు.

రాజకీయరంగంలో జస్టిస్ పార్టీ బొడ్డుకోసుకుని బయటకొచ్చిన నాడే అంటే 20.8.1917 న లండన్‌లో హౌస్ ఆఫ్ కామన్స్‌లో మాంటేగు ఒక ప్రకటన చేస్తూ "భారతదేశ పాలనలో భారతీయుల ప్రాతినిధ్యం ఎక్కువగా ఉండాలి" అన్నాడు. ఇది ఈ పార్టీకి ప్రాణం పోసినట్లయింది. మొదటి నుండీ బ్రాహ్మణేతరులకు ప్రభుత్వంలోనూ, ఉద్యోగాల్లోను తగిన ప్రాతినిధ్యం లేదం టున్న జస్టిస్ పక్షానికి ఇది ఊతాన్నిచ్చింది. వెంటనే అది బ్రాహ్మణేతరుల్లో ఉద్యమాన్ని ఉధృతం చేసింది.

అప్పటికి మద్రాసులో ఇంగ్లీషు వర్తకసంఘాలు బలంగా ఉండేవి. ఇవి తమ ఉనికి కోసం బ్రాహ్మణేతర ఉద్యమాన్ని బలపరచసాగాయి. బ్రాహ్మణేతర వర్గాలు ఇంగ్లీషు పాలనే ఉంటే బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని తమంతట తామే క్రమంగా తీసెయ్యగలమనుకుంటున్నారు. కాంగ్రెస్‌కి రాజకీయాధికారం

ఇప్పుడే వస్తే, దాని ఆధిపత్యం బ్రాహ్మణ వర్గానిదే కనక తిరిగి ప్రభుత్వం బ్రాహ్మణుల హస్తగతమవుతుందని ఇంగ్లీషు వర్తక వర్గాలను బలపరిచింది. బిసెంటు హోంరూలు ఆంగ్లేయులను వెళ్ళగొడుతుంది కనక పై ఉభయ సంఘాలూ ఆ ఉద్యమాన్ని నిరసించాయి. ఇంగ్లీషు వర్తక సంఘాలకు అప్పుడు మద్రాసు మెయిల్ సంపాదకుడు టి. ఎర్ల్ వెల్బీ నాయకుడుగా ఉండేవాడు. ఈ పత్రిక (మెయిల్) బ్రాహ్మణేతర ఉద్యమాన్ని తన స్వార్థంతో బలపరిచింది. ఈ విషయం 22.1.1916 నాటి సంపాదక లేఖలు గమనిస్తే స్పష్టమౌతుంది.

జస్టిస్ పార్టీ వేదికగా కాంగ్రెస్ వెలుపలున్న కాంగ్రెసులోని బ్రాహ్మణేతరవర్గాలు సమీకృతమవుతున్న సమయంలో కాంగ్రెస్‌లోకూడా దీని ప్రభావం పడింది. కాంగ్రెస్‌లోని బ్రాహ్మణేతరులొకరు 1917 సెప్టెంబర్ 7 న న్యూ ఇండియాలో ఒక వ్యాసం రాస్తూ బ్రాహ్మణేతరుల ప్రాతినిధ్యాన్ని, భావాలనూ కాంగ్రెస్‌లో ఉంటూనే ప్రకటించాలనీ, జస్టిస్ పార్టీని వ్యతిరేకించాలనీ అన్నాడు. కొద్దిరోజుల తర్వాత సర్ గురుస్వామి చెట్టి 140 మంది సంతకాలతో (అందులో అత్యధికులు బ్రాహ్మణేతరులు) కాంగ్రెస్ లీగు పథకం చట్టంలోనే తమ ఆశయాలు పూర్తి కాగలవన్న సారాంశంతో హిందూలో ఒక ప్రకటన చేశాడు. చివరకు కాంగ్రెస్‌లోని బ్రాహ్మణేతరులు 1917 సెప్టెంబర్ 15 న ఒక సభ జరిపారు. జస్టిస్ పార్టీ సభ్యులు కొందరు - అందులో ఓ. కందస్వామిచెట్టి వంటివారు కూడా - ఉన్నారు. సభలో గందరగోళం జరిగింది. సభాధ్యక్షుడు పి.కేశవపిళ్ళై చివరకు పోలీసులను పిలిపించాల్సి వచ్చింది. సభను జస్టిస్ పార్టీవారే చెడగొట్టారన్నారు.

1917 సెప్టెంబర్ 20 న తిరిగి కేశవపిళ్ళే కాంగ్రెస్‌లోని బ్రాహ్మణేతరుల సభ జరిపాడు. కాంగ్రెస్‌లోనూ ఇతర రంగాలలోనూ బ్రాహ్మణేతరులకు తగిన ప్రాతినిధ్యం కావాలని డిమాండ్ చేశాడు. అయితే జస్టిస్ పార్టీని దుమ్మెత్తి పోశాడు. వారందరూ మద్రాసు ప్రెసిడెన్సీ ఎసోసియేషన్ (ఎం. పి. ఎ.) అన్న బ్రాహ్మణేతర సంస్థను కాంగ్రెస్ ఆశయాలకు లోబడే స్థాపించామన్నారు. హిందూ పత్రిక (24-12 1917)దీని స్థాపనను బలపరచింది. ఇది చాలా వేగంగా అనేక శాఖలతో రాష్ట్రమంతటా వ్యాపించింది. జస్టిస్ పార్టీలో ఉన్నంతమంది జమీందారులు ఎం.పి.ఎ.లో లేరు. కాని తాత్త్విక స్వభావమంతా జస్టిస్ పార్టీ స్వభావం వంటిదేనన్న అభిప్రాయం జనంలో కలిగింది.

ఎం.పి.ఎ. 'దేశభక్తన్' అనే తమిళ దినపత్రికను 7-12-1917 నుండి పిల్యాణ సుందరం మొదలియార్ సంపాదకత్వాన వెలువర్చటం ఆరంభిం

చింది. నిధులకు కొరతలేదు. మద్రాసులోని ప్రముఖ నగల వ్యాపారి లాడ్ గోవిందదాస్ ఆర్థికంగా ఎక్కువ సాయపడ్తూండేవాడు.

కేశవపిళ్ళె, రామస్వామి నాయకర్, కల్యాణసుందరం మొదలియార్, పి. వరదరాజులునాయుడు చాలా శ్రమపడి కాంగ్రెస్‌చేత 'కమ్యూనల్' ప్రాతినిధ్యాన్ని అంగీకరింప చేశారు. పట్టాభి, సరోజినీనాయుడు కూడా దీన్ని సమర్థించారు. చక్రయ్యచెట్టి, వరదరాజులు నాయుడు- ఇది చాలా అవసరమని కాంగ్రెస్ దీన్ని అంగీకరించకపోతే తామందరం కాంగ్రెస్‌ను వదిలిపోవాల్సి వస్తుందన్న బాంబు విసరటంతో కాంగ్రెస్ దీన్ని అంగీకరించక తప్పలేదు. ఎం. పి. ఎ. ఆశయం కొంతమేరకు సాధించగలిగినామన్న తృప్తి కలిగింది వీళ్ళకు.

జస్టిస్ పార్టీ తన ప్రాబల్యాన్ని పంచముల్లో కూడా పెంచుకోవాలని కృషి చేసింది. మద్యనిషేధం, స్త్రీ విద్య, పంచములకు విద్య, కింది వర్ణాల మధ్య ఐక్యత, పరిశ్రమలకు ప్రభుత్వం సాయం కోరటం వంటి సాంఘిక విషయాల మీద దృష్టి కేంద్రీకరించి జన బాహుళ్యంలోకి పోవాలని నిశ్చయించుకుంది. ఆ మేరకు అనేక మహాసభల్లో తీర్మానాలుకూడా వెలువడ్డాయి. ప్రధానంగా ఈ లక్షణాలు, ఆశయాలే ధర్మారావుకి ఆ పక్షంలో అభిమానయోగ్యం అయ్యాయి.

సంస్కరణలను సూచించడానికి 14-12-1917 న మాంటేగ్ మద్రాసు వచ్చాడు. కాంగ్రెస్‌లోని ఎం. పి. ఎ. పక్షాన కేశవపిళ్ళె, జస్టిస్ పార్టీ నుండి డాక్టర్ నాయర్, కందస్వామిచెట్టి ఆ సంఘాన్ని కలిసి 'కమ్యూనల్' ప్రాతినిధ్యాన్ని కోరారు. జస్టిస్‌పార్టీ పత్రికలన్నీ దీన్ని ప్రతిబింబిస్తూచేసే ఉద్యమాన్ని ఉధృత పరిచాయి. దీనికితోడు భారతదేశంలో జరుగుతున్న అరాచకాలకు కారణాలేమిటో పరిశీలించమని రౌలట్ అనే జడ్జీని ప్రభుత్వం నియమించింది. ఆయన తన నివేదికలో (1917) బ్రాహ్మణులే కారణమనీ బ్రిటిష్ అధికారానికి వీళ్ళే ఆటంకంగా పరిణమించారని (పేజి 75) అన్నాడు. ఆంగ్లేయులు ఇక ప్రత్యక్షంగా బ్రాహ్మణేతర ఉద్యమాన్ని బలపరచడం ఆరంభించారు.

భారతదేశం ఆంగ్లేయులకే అన్న నినాదంతో ఇండో బ్రిటిష్ అసోసియేషన్, జస్టిస్ పార్టీలు రెండూ చేతులు కలిపాయి. మాంటేగ్ సంస్కరణలు వచ్చినప్పటినుండి కలిసి పనిచేయటం ఆరంభించాయి.

బ్రాహ్మణుల ఆధిపత్యం తిరస్కరిస్తూ 22-3-1920 న అటు ఎం. పి. ఎ. లోనూ[42] ఇటు జస్టిస్ పార్టీలోనూ బ్రాహ్మణులుండకూడదని రెండు సంఘాలూ తీర్మానించాయి. కేశవపిళ్ళె జస్టిస్ పార్టీలో చేరాడు. బ్రాహ్మణేతర

ఉద్యమం తెలుగుదేశంలో వేళ్ళూని బలపడుతున్న సమయంలోనూ, జస్టిస్ పార్టీ రాజకీయ వేదికగా నిలదొక్కుకుంటున్న తరుణంలోనూ వీటి పెరుగుదలను ధర్మారావు ప్రత్యక్షంగా దగ్గరుండి గమనించాడు. అయితేవీరు బ్రాహ్మణద్వేషిగా కనిపించలేదు. కానీ కాంగ్రెసువల్ల దేశానికి లాభం లేదన్న అభిప్రాయం మాత్రం కలిగిఉండేవారు. అంతేకాదు బ్రాహ్మణులేందోపిడి చేస్తున్నారు, భూములున్నాయా పుట్రలున్నాయా, వాళ్ళకున్నదొక్కటే విజ్ఞానం అంటూండేవారని బి.ఎ. సుబ్బారావు సాక్ష్యంచెప్తున్నాడు. మాంటేగ్ సంస్కరణల ప్రాతిపదిక ఆధారంగా, లార్డ్ మెస్టన్ సిఫార్సులు అమల్లోకొచ్చి శాసనసభలకు కుల, మతాల ననుసరించి సీట్ల కేటాయింపు వచ్చింది. అంతకు ముందే ప్రపంచ యుద్ధం ముగిసింది. ప్రభుత్వానికి కాస్త ఊపిరి పీల్చుకోటానికి అవకాశం ఏర్పడి ఎన్నికలు 1920లో జరిపించింది. కాంగ్రెసు బహిష్కరించింది. జస్టిస్ పార్టీ ఆహ్వానించింది. ప్రజలు ఎన్నుకోవాల్సిన 98 స్థానాలలో 63 జస్టిసు పార్టీ గెల్చుకుంది. ప్రభుత్వం నామినేటు చేసిన సభ్యులతోసహా 127లో జస్టిసు పార్టీకి 81 మంది సభ్యులున్నారు. 1921 జనవరి 10న జస్టిసు పార్టీ మంత్రివర్గం సుబ్బరాయలు ప్రధాన మంత్రిగా (అప్పుడు రాష్ట్ర మంత్రివర్గాధ్యక్షుణ్ణి ఇప్పటిలా ముఖ్యమంత్రి అనికాక ప్రధాని అనేవారు) పదవీ స్వీకారం చేసింది.43 పి. రామారాయణంగారు స్థానిక శాఖలు చూస్తూండేవారు. రెడ్డి నాయుడు, కె.వి. అభివృద్ధి శాఖను చూసేవారు. 1921లో సుబ్బరాయలు అనారోగ్య కారణాలవల్ల ప్రధాని పదవికి రాజీనామా చేస్తే పి. రామారాయణంగారే (1922లో వీరే పానగల్ రాజాగారైనారు) ప్రధాని బాధ్యతలను నిర్వర్తించారు.

కాంగ్రెసులో గాంధీ నాయకత్వం స్వీకరించి నడుపుతున్నాడు. అయితే మద్రాసు రాష్ట్ర రాజకీయాలకు సంబంధించినంత వరకూ ఇక్కడున్న బ్రాహ్మణ - బ్రాహ్మణేతర ఉద్యమ స్వభావాన్ని సరిగా అంచనా కట్టలేకపోయాడు. ఇక్కడ కాంగ్రెసు అధినేతలు కూడా బ్రాహ్మణులే కావటం బ్రాహ్మణేతర వర్గాలకు ఒక ఆయుధమైంది. గాంధీ - కాంగ్రెసులు బ్రాహ్మణాధిపత్యాన్నే సమర్థిస్తాయని జస్టిసు పార్టీ బాగా ప్రచారం చేసింది జస్టిసు పార్టీ అధికారంలో ఉండగా కేంద్ర ప్రభుత్వ నిధికి బెంగాల్ ప్రాంతం 6.5 శాతం చెల్లిస్తూండగా మద్రాసు వాటా 35.5 శాతం ఉంటే - దాన్ని శాసనసభలో పెట్టి తిరస్కరింపచేసింది. అన్ని పార్టీలూ ఈ అంశం మీద కలిశాయి, (అక్టోబరు 1921).

జస్టిసు పార్టీ మాంటేగు సంస్కరణలను మద్రాసు రాష్ట్రంలో బాగా అమలుపర్చటం వల్ల - దానికొక సామాజిక రాజకీయ స్థాయి ఏర్పడింది. తర్వాత 1923లో జరిగిన ఎన్నికల్లో కూడా గెలిచింది అయినా లోలోపల పెచ్చు పెరుగుతున్న లుకలుకలూ, జాతీయ కాంగ్రెసు సంతరించుకుంటున్న పలుకుబడీ ఇవన్నీ దీని పలుకుబడిని దిగజార్చటం కూడా మరోపంక జరుగుతోంది.

జస్టిసు పార్టీ జలియన్‌వాలా బాగ్ కాల్పుల్ని ఖండించలేదు. ఖాదీ ముసుగు కింద గాంధీ - ప్రజల్లో గందరగోళం సృష్టిస్తున్నాడని విమర్శించింది. సహాయ నిరాకరణోద్యమాన్ని అవహేళన చేసింది. మలబారులో జరిగిన మోప్లా తిరుగుబాటును ఖండిస్తూ గాంధీ - మన దేశానికి స్వరాజ్యం రాక ముందే దేశాన్ని మరుభూమిగా మారుస్తున్నాడనీ, హింస గాంధీవాదంలో ఒక భాగమనీ అంది. సహాయ నిరాకరణోద్యమంలో 'రౌడీలు - గూండాలూ' ఉన్నారని ఎద్దేవా చేసింది. త్యాగరాయ చెట్టి సహాయనిరాకరణోద్యమాన్ని 'వట్టిగాస్' అని వర్ణించాడు. 1922 జనవరి 13న యువరాజు రాక సందర్భంలో కాంగ్రెసు నడిపిన హర్తాళను జస్టిస్ పార్టీ నిరసించింది. 1922 ఫిబ్రవరి 4న జరిగిన 'చౌరీ చౌరా' సంఘటన దేశాన్ని కదిపితే జస్టిస్ పార్టీ తన కేమీ పట్టనట్టు ఊరుకుంది. కాంగ్రెసునూ - గాంధీని తిట్టే ఆవేశంలో ప్రజల పోరాటపటిమను చూడ నిరాకరించింది. ఈరకంగా ప్రజలకు దూరమయ్యే కార్యక్రమాలు సిద్ధాంతపరంగానూ - ఆచరణరీత్యానూ చేపట్టింది.

అయితే జస్టిస్ పార్టీ ప్రతిష్ఠను పెంచిందీ, బ్రాహ్మణేతర ఉద్యమానికి బలం చేకూర్చేదీ అయిన రెండో కమ్యూనల్ జి.ఓ. (1922)ను జస్టిస్ పార్టీ తీసుకొచ్చింది. దీనివల్ల బ్రాహ్మణేతరులకు అన్ని ప్రభుత్వోద్యోగాలలోనూ ప్రాముఖ్యం వచ్చింది.

ఈ ఉద్యోగాలలో కూడా తమిళులకు ప్రాధాన్యం ఇవ్వటం లేదన్న కోపం మొదటినుండీ జస్టిసు పార్టీ మీద ఉంది. దానికితోడు 1921 మంత్రివర్గంలో తమిళ ప్రాంతానికి ప్రాతినిధ్యం లేకపోవటం జరిగింది. జె. యన్. రామనాథన్ అనే మధుర జస్టిసు నాయకుడు 1923 లోగా ఈ తప్పులు సవరించకపోతే తమిళులం విడిపోతామని 1922 మేలో ఒక ప్రకటన చేశాడు.

ఈలోగా రానున్న ఎన్నికల్లో కాంగ్రెసు పాల్గొనాలా వద్దా అనే అంశం మీద తర్జనభర్జనలు రేగి, డిసెంబరు 1922న గయ కాంగ్రెసులో 1748-890 వోట్లతో పాల్గొనకూడదని తీర్మానించింది. మోతీలాల్ నాయకత్వంలో స్వరాజ్యపార్టీ ఆవిర్భవించింది. వీళ్ళనే ఛేంజర్స్ అన్నారు. ఎన్నికల్లో పాల్గొన

కూడదన్నవారిని నో చేంజర్స్ అన్నారు. మద్రాసులో రాజగోపాలాచారి వర్గం ఎం. పి. ఎ. లోని రామస్వామి నాయకర్, వరదరాజులునాయుడు, తిరు. వి. కల్యాణసుందరం మొదలియార్ ఎన్నికలను బహిష్కరించా లన్నారు. సత్యమూర్తి అనుయాయులు పాల్గొనాలన్నారు. ఈ సందర్భంలో చిత్తరంజన్ దాస్ మద్రాసు పర్యటిస్తుంటే జస్టిసుపార్టీ ఆయనను 'దేశబంధు కాడితడు బ్రాహ్మణ బంధు' అని జస్టిస్ (18-6-1923) పత్రికలో రాసింది.

స్వరాజ్య - కాంగ్రెసుల మధ్య ఎన్నికల విషయమైన తగాదాలను 1923 సెప్టెంబరులో ఢిల్లీలో జరిగిన ప్రత్యేక కాంగ్రెసు సమావేశం - ఎన్నికల్లో పాల్గొనాలని సూచిస్తూ - పరిష్కరించింది. (హిందూ 18 సెప్టెంబరు 1923)

ఈలోగా జస్టిసుపార్టీ వల్ల తమకు మేలు జరగడం లేదని ముస్లిములు 1923 నాటికి బయటికెళ్ళారు. పానగల్ రాజా నడవడిని అసహ్యించుకొంటూ పంచములు దూరమయ్యారు. కె. వి. రెడ్డి నాయుడు, పి. త్యాగరాయ చెట్టి కొక లేఖరాస్తూ జస్టిసుపార్టీ కెప్పుడూ ఒక సిద్ధాంతంకాని - ఆచరణకోసం ఒక కార్యక్రమం కానీ లేదన్నాడు. స్వరాజ్యం కావాలని కేవలం అనటం కాదు ఆచరణలో చూపలేకపోయిందనీ, దీనికి జాతీయదృష్టి లేనేలేదని అంటూ ఈ పై ఆశయాల సాధనకు తాను కాంగ్రెసులో చేరటానికి ఐనా సిద్ధమేనని నిర్ద్వంద్వంగా చెప్పాడు. జస్టిసుపార్టీ సభ్యుడైన కట్టమంచి రామలింగారెడ్డిగారే ఆ పార్టీ లక్షణాలు సరిపడక 28-11-1923న శాసనసభలో ప్రభుత్వం మీద అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టాడు. చచ్చిచెడీ చాయంగల విన్నపాలన్నట్లు ఈ తీర్మానం ఓడిపోయింది. పార్టీకి గండం గడిచి పిండం బయటపడింది.

1923 అక్టోబరులో జరిగిన ఎన్నికల్లో స్వరాజ్యపార్టీ 11 స్థానాలనూ, జస్టిసుపార్టీ 44 స్థానాలనూ సంపాదించింది. అయితే ప్రభుత్వం నామినేటు చెయ్యాల్సిన 17 స్థానాలకూ జస్టిసుపార్టీ సభ్యులనే నియమించటంతో బలం పుంజుకుంది. పానగల్ రాజా మంత్రివర్గం అవిశ్వాస తీర్మానాన్ని తోసిపుచ్చి నెట్టుకొచ్చింది.

రెండవ పర్యాయం అధికారంలో ఉన్న జస్టిసు పార్టీ కాలంలో 6-11-1925 న ఆంధ్ర విశ్వకళా పరిషత్తు బిల్లు అందరి సహకారంతో నెగ్గింది. 1926లో కట్టమంచి రామలింగారెడ్డి ఉపాధ్యక్షుడుగా విశ్వవిద్యాలయం ఏర్పడింది. దీన్ని మొదట శాసన సభలో కె.వి. రెడ్డి నాయుడు లేవనెత్తితే జస్టిసు పార్టీ సభ్యులు సి. నటేశ మొదలియార్ దీనివల్ల పార్టీలో చీలిక వస్తుందన్న అనుమానం వ్యక్తం చేశాడు. రెడ్డి నాయుడు 'ఆంధ్ర' బదులు ఆర్యన్ పదమిస్

దీనికి బదులు 'తెలుగు' ఉండాలన్న సవరణను ప్రతిపాదిస్తే శాసనసభ తోసిపుచ్చింది.

ధర్మారావు ఈపక్షపు రాజకీయపు ఎత్తులన్నిటినీ చుండి, ఊర్కాటు, మద్రాసులలో పని చేస్తూ అధ్యయనం చేస్తున్నాడు కానీ ఆ రాజకీయవేదిక మీద వీరెప్పుడూ ప్రసంగించిన దాఖలాలు కనిపించలేదు. అయితే బ్రాహ్మణేతర ఉద్యమంతో సన్నిహిత సంబంధం కలిగి ఉన్నాడు. ఈ ఉద్యమం తిరిగిన మలుపుల నన్నిటినీ శ్రద్ధగా పరిశీలించాడు. దీనిలోని సామాజిక సంస్కరణల అంశాలను పొదివి పుచ్చుకున్నాడు.

## స్వయంమర్యాద - స్వసంఘ పౌరోహిత్యం

ఇళ్ళలో జరిగే మతపరమైన వ్యవహారాల్లో బ్రాహ్మణుల ఆధిపత్యమే బ్రాహ్మణేతరులను మతపరంగా అణగదొక్కుతోందన్న భావం జస్టిసుపార్టీ సభ్యుల్లో కొందరికి వచ్చింది. 1923 లో జరిగిన జస్టిసు కాన్ఫెడరేషను సభల్లో బ్రాహ్మణేతరుల్లో విద్యావంతులైన కొందరు వివాహంలో పౌరోహిత్యం చేయించటానికి సిద్ధం కావాలనీ, బ్రాహ్మణేతరుల్లో ఉన్న వివిధ వర్ణాల మధ్య వివాహాలను ప్రోత్సహించాలనీ తీర్మానాలు చేశారు (హిందూ, 18 అగస్టు 1923).

ఇది చాలావరకు తెలుగు గ్రామాల్లో బాగా పాకింది. అనేకులు బ్రాహ్మణేతర పురోహితులేర్పడ్డారు. ఈరకమైన సంస్కరణ భావాలవైపు - సామాజికమైన అభ్యుదయకరమైన అంశాలవైపు విద్యావంతులైనవాళ్ళు, రాజకీయాభిప్రాయాలు ఏవైనప్పటికీ మొగ్గటం ఆరంభించారు. ఇది తమిళ ప్రాంతంలో చాలా ఉధృతంగా ఆరంభమవటమేకాదు, స్వాభిమాన ఉద్యమంగా పరవళ్ళు తొక్కింది ఈ ఉద్యమ ప్రభావం ఇప్పటి తమిళ ప్రాంతంలోని డి.యం.కె ఎ.డి.యం.కె పుట్టుకకు దారితీసింది. రామస్వామినాయకర్‌లాంటి పెరియార్‌ను తమిళనాడులో రెండవ దైవంగా ఆరాధించేటంత వరకు తీసుకెళ్ళింది. దీన్ని స్వయం మర్యాద ఉద్యమం అని కూడా అంటారు.

ధర్మారావులో విద్యార్థి దశనుండీ రూపం సంతరించుకుంటున్న సంస్కరణ భావాలు వారు బ్రాహ్మణేతర ఉద్యమంలో ఉన్న కాలంలోనూ, తమిళ ప్రాంతంలో బ్రాహ్మణేతర జమీందార్ల దగ్గర ఉద్యోగాలు నిర్వహిస్తున్న

కాలంలోనూ ప్రధానంగా స్వాభిమాన ఉద్యమం దక్షిణ ప్రాంతాన్ని ఊపేసిన కాలంలోనూ పటిష్ఠమయ్యాయి. రాజకీయాలకన్నా ధర్మారావుకి ఈ సామాజిక సంస్కరణాంశాలు మనసుకు బాగా నచ్చాయి. కనుకనే చివరి వరకూ ఈ సంస్కరణ భావాలను అవకాశమొచ్చిన సందర్భాల్లోనల్లా అసలు పరిచారు-ప్రచారం చేశారు. కనుక ఆ స్వాభిమాన ఉద్యమ స్వభావ స్వరూపాలను కొంతకు కొంత తెలుసుకోవటం అవసరం.

కాంగ్రెసులో బ్రాహ్మణేతరులు బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని ఎం.పి.ఎ. ద్వారా ఎం.పి.ఏను కాంగ్రెసు నిషేధించేవరకూ ఎదిరించారు. అడుగడుగునా సంస్థాగతమైన బ్రాహ్మణులు తమను అడ్డుకోవటం సహించలేకపోయారు. ఖద్దరు బోర్డు అధ్యక్షుడులాటి ఏ పదవికైనా బ్రాహ్మణులనే నియమించటం వంటి వాటిని బాహాటంగా విమర్శించారు.

కాంగ్రెసువాదిగా ఉంటూ తిరువాన్కూరు సంస్థానంలోని 'వైకాం' గ్రామంలో దేవాలయ వీధుల్లో అస్పృశ్యులు నడవరాదన్న ఆంక్షలను వ్యతిరేకించి 1924లో రెండు పర్యాయాలు జైలుకెళ్ళాడు ఇ. వి. రామస్వామి నాయకర్. 'వైకాం వీరర్' అన్న బిరుదూ సంపాదించాడు. కాంగ్రెసులోని బ్రాహ్మణేతర తీవ్రవాదుల్లో రామస్వామి నాయకర్ ఒకడుగా పేరు తెచ్చుకున్నాడు. వరదరాజులు నాయుడు, నాయకర్లు తిరునల్వేలిజిల్లా 'కలిదై కుర్చి' అనే గ్రామంలోని గురుకులంలో బ్రాహ్మణ-బ్రాహ్మణేతరులకు వేర్వేరు భోజనశాలలుండాలన్న దాన్ని వ్యతిరేకిస్తూ 1925లో తీవ్రంగా పోరాడారు. 1925 సంవత్సరాన్ని ఖద్దరు సంవత్సరంగా అసలు జరపాలని గాంధీ పిలుపిస్తే "బ్రాహ్మణేతర సంవత్సరం''గా నడపాలని వీరభిప్రాయపడ్డారు. రామస్వామి నాయకర్ అప్పటికే 'కుడి అరసు' అన్న తమిళపత్రికను నడుపుతున్నాడు. 1925 నవంబరులో తమిళనాడు కాంగ్రెసు కమిటీ సభలకు వెళుతున్న బ్రాహ్మణేతరులను 'బ్రాహ్మణుల మాయాజాలం'లో పడకండని హెచ్చరిస్తూ తన పత్రికలో రాశాడు.

కాంగ్రెసు కమ్యూనల్ ప్రాతినిధ్యాన్ని అంగీకరించాలని సభలో చాలా మంది బ్రాహ్మణేతరులు నాయకర్ తదితరుల నాయకత్వాన కృషిచేశారు. కాంగ్రెసు అంగీకరించలేదు. హాజరైన బ్రాహ్మణేతర సభ్యులందరూ 'వాకౌట్' చేసి ఒక గంట తర్వాత టి. ఎ. రామలింగ చెట్టి అధ్యక్షతన సమావేశమయ్యారు. బ్రాహ్మణేతర ఉద్యమానికనుకూలమైన అనేక తీర్మానాలుచేశారు. ఇదంతా 1926 నవంబరులో జరిగిన ఘటన. అప్పటి వరకూ కాంగ్రెసులో కొనసాగిన నాయకర్ తదితరులు దానితో తెగతెంపులు చేసుకున్నారు. ఇలా

జరుగబోతోందని రామస్వామి నాయకర్ 1925 నుండే ఊహించి కొత్త బ్రాహ్మణేతర సంస్థను స్థాపించడానికి కృషిచేస్తూనే ఉన్నాడు. అది 1926 చివరకు సాధ్యపడింది. రాజకీయంగా జస్టిసు పార్టీ ప్రాబల్యం తగ్గటం, సంస్కరణదిశగా బ్రాహ్మణేతరులనంతగా అది కదిలించకపోవటం రామస్వామి నాయకర్‌కు అనుకూల వాతావరణం కల్పించినట్లయింది. ఈ కాలంలో ధర్మారావు ఊర్కాడు సంస్థానంలో ఉంటూ ఈ ఉద్యమాల స్వభావాన్ని గమనిస్తున్నాడు.

1925 డిసెంబరులో కోయంబత్తూరులో జరిగిన జస్టిసుపార్టీ సభల్లో నాయకర్ పాల్గొని ప్రసంగిస్తూ ''దీనికి ప్రజల్లో పలుకుబడి పెరగకపోవడానికి కారణం అధిక సంఖ్యాకులైన వాళ్ళ ఆశయాలకు తగిన కార్యక్రమం రూపొందించకపోవడమేనని సాంఘిక సంస్కరణలను తగిన విధంగా చేపట్టాల్సిన అవసరం గురించి అనేక పర్యాయాలు చెప్పాననీ అయితే పెడచెవిని పెట్టారనీ''-ఖండితంగా చెప్పాడు (మెయిల్, 19 డిసెంబరు 1925)

నాయకర్ బ్రాహ్మణేతరుల సమస్యలను గురించి గాంధీని ఒప్పించటానికి చాలా కృషిచేశాడు. గాంధీ మద్రాసొచ్చి చేసిన ఉపన్యాసాల్లో కూడా బ్రాహ్మణవర్గాన్ని ప్రశంసించటం చూసి నాయకర్, వరదరాజులు తదితరులు చాలా విధాలుగా గాంధీని అసలు సామాజిక సమస్యలను అర్థంచేసుకొమ్మని విజ్ఞప్తిచేశారు. లాభం లేకపోయింది. నాయకర్ తన పత్రికలలో కాంగ్రెసునూ - హిందూ ధర్మాన్నీ - బ్రాహ్మణత్వాన్నీ నాశనం చెయ్యమని (28. 8. 1927) ప్రబోధించాడు. గాంధీ మద్రాసొచ్చి వెళ్ళిన తర్వాత (1927)స్వాభిమాన ఉద్యమం మరింత ఉచ్ఛదశకు వెళ్ళింది. దాన్ని అరవంలో 'స్వయం మర్యాద' ఉద్యమం అంటారు. దీన్ని జస్టిసుపార్టీ పత్రికలన్నీ బాగా ప్రచారం చేశాయి. స్వయం మర్యాద ఉద్యమ ఆశయాలను జస్టిసు పత్రిక జూన్ 21, 28 సంచికలూ, ఆగస్టు 31, 1928 సంచికా ఈ విధంగా ప్రకటించాయి పురాణాలలో మైథాలజీని తోసి రాజనాలి. సామాజిక మత విషయాలలో బ్రాహ్మణుల ఆధిక్యతను తగ్గించాలి. అన్ని తతంగాలనుండీ వాళ్ళను బహిష్కరించాలి ఈ సంఘ సభ్యులు నిర్వహించే వివాహాలల్లో బ్రాహ్మణ పౌరోహిత్యాన్ని అంగీకరించకూడదు.

నాయకర్ ఈ ఉద్యమం ద్వారా బ్రాహ్మణేతరులలో ఆత్మవిశ్వాసం పెంపొందించాలని ఆశించాడు.[44] ఇది సాంఘిక సంస్కరణగా ఆరంభమైంది. ''స్వయం పరిపాలనకు ముందు స్వయం మర్యాద'' రావటం అవసరమని నాయకర్ భావించాడు. ''ప్రస్తుత వ్యవస్థను

తల్లకిందులు చెయ్యాలనీ కులమతాలకు అతీతంగా ప్రజలను సంఘటిత పర్చాలనీ'' ఈ ఉద్యమం ఆశించింది. (రివోల్ట్ 23.7.1929) ఈ ఉద్యమంలో నాయకర్‌కు ఎస్. రామనాదన్ బాగా తోడ్పడ్డాడు. ఇద్దరూ మొదట కాంగ్రెసు వాదులే.

ధర్మారావులో ఈ స్వాభిమాన ఉద్యమలక్ష్యాలు ముందునుంచీ ఉన్నాయి. వీటిని సాహిత్యపరంగా అన్వయించటంలో నెల్లూరులో ఉండగా వేదం వెంకటాచలయ్య వీరికి బాగా తోడ్పడ్డాడు. శాస్త్రీయదృష్టితో ఇది పెంపొందటానికి బెంగుళూరులోని మిథిక్ సొసయిటీ సాయపడింది. అన్ని విషయాలనూ నిశితంగా పరిశీలించటం, హేతువాదంతో సరిపోల్చుకోటం మొదలైన వాటిలో ఈ సమాజమే ధర్మారావుకి తోడ్పడింది. ఈ లక్ష్యాలన్నీ ఒక ఉద్యమరూపంలో నిర్వహించాలన్న ఆకాంక్షను వీరికి స్వాభిమాన ఉద్యమం అందించింది. మద్రాసులో ఉండగా ధర్మారావు, నాయకర్ మంచి మిత్రులు.[45]

నాయకర్ అరవం-కన్నడం-తెలుగు భాషల్లో బాగా మాట్లాడగలడు. జస్టిసు పార్టీ జమీందార్లకు, భూస్వాములు, మధ్యతరగతి విద్యావంతులకే పరిమితమైతే; నాయకర్ తన ఉద్యమం సమాజంలోని అట్టడుగు వర్ణాలవారినీ, యువకులనూ స్త్రీలను ఆకట్టుకోటానికి అనేక కార్యక్రమాలను రూపొందించాడు. కాంగ్రెసు కూడా ఈ వర్గాలకంతగా ప్రాధాన్యం ఇవ్వలేదు. కనుకనే నాయకర్ ఉద్యమం అతి తక్కువ కాలంలో జనంలోకి చొచ్చుకొనిపోయింది. రివోల్ట్, విదుతలై (స్వేచ్ఛ), పకుతరివు (లోకజ్ఞానం), అనే పత్రికలను నడిపాడు. రామనాదన్, ఎస్. గురుస్వామి ఆంగ్ల విద్యావంతుల్లో ప్రచారం చెయ్యడానికి బాగా కృషిచేశారు.

మనుస్మృతులు వర్ణాశ్రమాలను నిర్ధారించాయి కనుక వాటిని తగులబెట్టటం; ద్రావిడుడన్న భావంతో రావణుణ్ణి పూజించటం; ఆర్యుడైన రాముణ్ని నీచుడుగా భావించడం ఆరంభమైంది. రామనాధన్ తదితరులను గుళ్ళలోకి రాకుండా బహిష్కరించారు. అనేక సాహిత్య రూపాల్లో ఈ ఉద్యమాన్ని ప్రశంసిస్తూ పుస్తకాలొచ్చాయి. దేవతలు చేసిన బూతు పనులను విచారించి తగిన విధంగా శిక్షించటం అంటూ 'విసిత్తిర తేవార్‌కల్ కోరట్టు' అన్న కరపత్రం 1929 లో విడుదలైంది. ఇలా ఉద్యమాన్ని అభివృద్ధి పరుచుకుంటూ 17-2-1929 న చెంగల్పట్టులో మొదటి మహాసభ జరుపుకుంది.

ధర్మారావులో ఇంత-తీవ్ర ద్రావిడవాదం కనిపించదు. కాని ఈ అంశాలన్నీ ఈ కాలంలో వీరి జీవితంలోనూ - రచనలలోనూ తర్వాత ప్రచురించిన

గ్రంథాలలోనూ చూడగలం. అయినా ఖచ్చితంగా ఇదే నా దారి అని స్వాభిమాన ఉద్యమకారులంత స్పష్టంగా పాతసాహిత్యంయెడల ధర్మారావు కలిగించుకోలేక పోయాడు. దీనికి కారణం బ్రాహ్మణ వ్యతిరేకత తెలుగునాటి బ్రాహ్మణేతరుల్లో అంతగా లేకపోవటం. తన చుట్టూ ఉన్న మిత్రులందరూ మొదటినుండీ బ్రాహ్మణులే కావటం. వారిలో కూడా తానాశించిన మేరకు సంస్కరణ భావాలు ఉండటం వంటివి కావచ్చు. తెలుగునాట సంస్కరణోద్యమాలకు బ్రాహ్మణులే నాయకత్వం వహించారు. వీరేశలింగం, గురజాడ, గిడుగు, పెండ్యాల సుబ్రమణ్యశాస్త్రి, బంకుపల్లి మల్లయ్యశాస్త్రి, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి మొదలైన వారంచరూ బ్రాహ్మణులే. తమిళనాడులో ఇలాంటి ఉద్యమాలలో ఏ ఒకరో తప్ప బ్రాహ్మణులెవరూ కనిపించరు. ఆంధ్ర ప్రాంతంలో స్వయం మర్యాద ఉద్యమం త్రిపురనేనివారి వల్ల పుట్టినా ఆది ఒకటి రెండు జిల్లాలను కూడా దాటిపోలేదు. అంతేకాదు ఒక కుల పరిధిని కూడా అధిగమించినట్టు అనిపించదు. బరంపురం ఛాపకూడు, అప్పటి తోక చుక్కలు సంస్కరణోద్యమ పతాకాలుగా గురజాడ చెప్పాడు. ఇవన్నీ గమనించిన ధర్మారావుకు తనలో స్వాభిమానం ఉన్నా అది బ్రాహ్మణద్వేషానికి కాక జిజ్ఞాసకు దారి తీయించింది. వీటన్నిటినీ మించి బ్రాహ్మణులను ద్వేషించటం కాదనీ - తత్వాన్ని ద్వేషించాలనీ అలాటివి సృష్టించిన వ్యవస్థను ద్వేషించాలనీ - దాన్ని మార్చటానికి కృషిచెయ్యాలన్న భావాలు ధర్మారావులో ఏమూలో దాక్కొని ఉండటం కూడా కావచ్చు.

స్వాభిమాన ఉద్యమాన్ని జనంలోకి తీసుకెళ్ళటానికి మరో కార్యక్రమంగా పేర్ల చివర కులాలను తెలిపే పేర్లను తీసెయ్యాలన్నారు. దేవాలయాల నిర్మాణాలకు చందాలివ్వకూడదన్నారు. వేదాలనూ - సంస్కృతాన్నీ హిందీని ప్రచారంచేసే సంస్థలను ఆదుకోరాదన్నారు. దీని మొదటి మహాసభను అప్పటి ముఖ్యమంత్రి పి. సుబ్బరాయన్ ప్రారంభిస్తూ "సమాజాన్ని మరింత ఉన్నతంగా తీర్చిదిద్దటమే ఈ స్వయం మర్యాద ఉద్యమ లక్ష్యం"46 అని అన్నాడు. (1929)

1930 లో కాంగ్రెసు సివిల్ డిసొబీడియన్సు ఉద్యమాన్ని ఒక వైపూ, నాయర్ అనుయాయులు స్వాభిమాన ఉద్యమాన్ని మరోవైపూ ప్రచారం చేస్తున్నారు. ఇవన్నీ తెలుగునాట కూడా బాగా సాగాయి. అన్ని కులాలలోనూ 'శాస్త్రులు' తయారయ్యారు. కమ్మకులంలో ఇది బాగా వ్యాపించింది వివాహాలన్నీ తమ తమ వర్ణాలకు చెందిన పురోహితులే సంస్కృతంలో కాక తెలుగు పద్యాల్లో నిర్వహిస్తూండటం ఆరంభమైంది. జస్టిసు

పార్టీ ప్రభుత్వం బొబ్బిలి రాజా ప్రధానిగా నడుస్తూంది. ధర్మారావు ఇంతకు ముందు కొంతకాలం ఈ రాజా జమీలోనే అంతరంగిక కార్యదర్శిగానూ, మేనేజరుగానూ, కొద్దిరోజులు దివానుగానూ పనిచేశాడు. బొబ్బిలి సంస్థానం లోని కొందరభిప్రాయాల ననుసరించి రాజావారికి రాజకీయాలలో అభిరుచిని కలిగించి జస్టిసు పక్షం వైపు మొగ్గించటంలో ధర్మారావు పాత్ర ఉందం టారు.47

ఈ స్వాభిమాన ఉద్యమం బాగా నడుస్తున్న సమయంలో రామస్వామి నాయకర్ 1931 లో ఐరోపా, రష్యా, జర్మనీ, ఇంగ్లండ్‌లు పర్యటించాడు. ఈ పర్యటన నాయకర్ దృష్టిని బాగా విశాలం చేసింది. రామనాథన్‌గారి కరుడుగట్టిన ద్రావిడ భావాలతో ఇమడలేకపోయాడు. తన దృష్టిని మరింతగా హేతువాద భౌతికవాదాల వెలుగులోకి మళ్ళించాడు. మార్క్స్ అంటే అభి మానం కలిగింది. రష్యాలో విప్లవం తెచ్చిన బ్రహ్మాండమైన పరిణామాలను కళ్ళారా చూశాడు. ఈ దశలో అన్నాదొరైతో పరిచయం కలిగింది. స్వయం మర్యాద ఉద్యమానికి కొత్త రూపురేఖలు ఇద్దరూ కలిసి ఇచ్చారు. ధర్మారావు మద్రాసెప్పుడొచ్చినా నాయకర్ అన్నాదొరైలు కలుసుకుని అనేక విషయాలను గూర్చి చర్చించుకునేవారు. ఈ అంశాన్ని కొసరాజు తదితరులు ధృవీకరించారు. ధర్మారావు అక్కడక్కడ జమీందార్ల దగ్గర ఉద్యోగాలు చేసి చివరకు జస్టిస్ పార్టీ తెలుగు పత్రిక 'సమదర్శిని' కి కొంతకాలం- 1930 నుండి సంపాద కులుగా ఉన్నాడు. ఇందులో పని చేస్తున్న కాలంలో నాయకర్ - అన్నాదొరై లతో సాన్నిహిత్యం మరింత పెరిగింది.

సెల్ఫ్ రెస్పెక్ట్ లీగ్ 1931 మేలో లాల్‌గుడిలో సభలు జరుపుకుంది. ఆ సభల్లో అధ్యక్షుడు రామనాధన్ 'గాంధీ—ఖద్దరు - హిందీ' లను దుయ్యబడ్తూ ఉపన్యసించాడు. జస్టిసు పత్రికలన్నీ దీన్ని బాగా ప్రచారం చేశాయి. తెలుగు దేశంలోని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి లాంటి వ్యక్తులుకూడా ఈ భావాన్ని ఆనాడు బాగా సమర్థిస్తూ సమదర్శినిలో వ్యాసాలు రాశారు. ధర్మారావులో మొదటినుండీ కాంగ్రెసు రాజకీయాల మీదున్న అపనమ్మకం, జస్టిసు పార్టీలో అప్పటికి బాగా పైకొచ్చిన స్వాభిమాన ఉద్యమాంశాలయెడ అభిమానం- ఇవన్నీ కలిసి సమదర్శిని సంపాదకత్వ బాధ్యతలు స్వీకరించేలా చేశాయి' సమాజంలో ఉన్న చెడును చెండాడే ధర్మారావు ప్రకృతి బరంపురం విశాఖల నుండి నడిపిన 'కొండెగాడు' పత్రిక ద్వారానే వెల్లడైంది. అదే బహుముఖంగా సమదర్శిని ద్వారా ధర్మారావు ప్రకటించాడు. 'కొండెగాడు'ను పెద్ద కర పత్రాలుగా ప్రకటించేవాడు.

ఊరకమైన రాజకీయ సంస్కరణ భావాలతో తెలుగుదేశం కళకళ పడుతున్న కాలంలోనే అటు మహాత్మా పూలే, కార్వే తదితరులు ఇలాటి ఉద్యమాలనే మహారాష్ట్రలో నడిపారు. బ్రాహ్మణేతర మహాసభలు ఏ. బీ. లాథే, ఏ. ఎన్. సుర్వేలు బొంబాయిలో అఖిలభారత స్థాయిలో నిర్వహించారు(1924). మరో అఖిల భారత బ్రాహ్మణేతర మహాసభ 1925 లో అమరావతి (నాగపూర్ దగ్గర) లో జరిగింది. అఖిలభారత ఉద్యమంగా రూపొందిన ఈ బ్రాహ్మణేతర ఉద్యమం తెలుగునాట సమసిపోయినా తమిళ ప్రాంతంలో జస్టిసు పార్టీయే - 1944 ఆగస్టు 27 న ద్రవిడ కజగంగానూ, తర్వాత 1949 సెప్టెంబరు 17న చీలిపోయి ద్రవిడ మున్నేట్ర కజగంగానూ రూపాంతరంతో ఆవిర్భవించింది. ఈ మధ్యలో ముప్పయి దశకంలో ఎన్నికలు రాష్ట్రాన్ని మరో దిక్కుకు మలిపాయి. ధర్మారావు ఆ దిశగా ప్రయాణించటం తర్వాత గమనించగలం. ఇంత భావ విప్లవాల పథంలో ధర్మారావు ప్రయాణం ఒక రకంగా వారిని సునిశిత విమర్శకుడిగా - ఆచరణశీలియైన సంస్కర్తగా తీర్చి దిద్దిందని చెప్పవచ్చు.

## మార్పునొసట 'వేగుజుక్క'

సాహిత్యరంగం వేయిముఖాలతో విస్తరిస్తున్న రోజులవి. భాషావిషయకంగానూ, భావం తీరులోనూ చర్చోపచర్చలతో నాడున్న పత్రికలు సాహితీ విప్లవాన్ని జనం దగ్గరికి మోసుకెళ్తున్న కాలమది. తెలుగు సాహిత్యం ఇతర దేశభాషా సాహిత్యాల నుండి అనేక రకాలైన సొగసులను సంతరించుకుని ముస్తాబవుతున్న సందర్భమది. రసచర్చలూ - పదచర్చలూ ఓపక్క పండితుల మధ్య నలుగుతున్నా, ప్రతిభా వ్యుత్పత్తులున్న సాహితీవేత్తలు పలువురు రంగంలో దిగి తమతమ సొంత గొంతులతోనో, అనుకరణ గొంతులతోనో ప్రత్యక్షమవుతున్నారు. ధార్వాడ నాటకం కంపెనీ తెలుగు దేశమంతా పర్యటించి ప్రదర్శనలిస్తూ ఏకాస్త కలం కదపగలిగిన రచయితనైనా దృశ్య ప్రక్రియను రాయించటానికి ప్రోత్సాహం కలిగించింది. నాటకరచనలో అప్పటికున్న ప్రసిద్ధులందరూ సాధారణంగా అటు పౌరాణికం కానీ - ఇటు చారిత్రకం కానీ వస్తువుగా స్వీకరించిన వారే. ఒకరూ అరా సామాజిక

సమస్యలను చేపట్టడం, అందులో ఆణిముత్యంలా 'కన్యాశుల్కం' నేటికీ మిగలడం గమనించవచ్చు.

ఆంగ్లసాహిత్య ప్రభావం వల్ల తెలుగు సాహిత్యంలో ప్రవేశించిన వ్యాసం-కథలాంటి వచన ప్రక్రియలతో బాటు కవితారచనలో కూడా కొత్త మార్గాలు పొడగట్టాయి. భావాలు సరేసరి. అప్పటికి దేశంలో పెల్లుబుకుతున్న దేశభక్తి భావాలూ, సామాజికరంగంలో రామమోహన్‌రాయ్ వంటివారి ప్రభావాల వల్ల నాటుకున్న సంస్కరణ భావాలూ, ఆయా సాహిత్య ప్రక్రియలలో విధిగా చోటు చేసుకుంటున్నాయి. ప్రపంచ పారిశ్రామిక రంగం మనకూ సంతరించిపెట్టిన కొత్త వర్గం బూర్జువా వర్గం, దాని భావాలు కూడా సాహిత్యంలో ప్రదర్శిత మవుతున్నాయి. కొత్తగా ఏవొచ్చినా మోకాలడ్డాలనుకునే ప్రవృత్తి కూడా సనాతన సాహితీవేత్తలలో వారి రచనలలో అదే కాలంలో కనిపిస్తూంది.

విద్య - అదీ ఆంగ్ల విద్య మనకందించిన అవకాశాల నాధారంగా చేసుకుని పాండిత్యాన్ని సుసంపన్నం చేసుకున్నవారు పలువురు ఇదేకాలంలో మనకు కనిపిస్తారు. కొందరు ఆ భావాలనాధారంగా చేసుకుని తిరుగుబాటు చేయాలనుకుంటారు. ఒక సంప్రదాయం మీద చేసే తిరుగుబాటును సి. నారాయణరెడ్డి తమ 'ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు' అనే సిద్ధాంత గ్రంథంలో 'లోవెస్' భావాలను పేర్కొంటూ "మృతప్రాయమైన సంప్రదాయములు వీధిలోపడి కీచుమన్నప్పుడు వాని నెదుర్కొనుటకు మూడు మార్గము లున్నవి. ఒకటి : కవులు తామే సంప్రదాయములను సృష్టించుకొనవచ్చును లేక మిన్నకుండవచ్చును. రెండవది : మృతస్థితిలోనున్న వట్టిగుల్లలపై తమ సృజనాత్మకశక్తితో మరియొక రూపు కట్టవచ్చును. మూడవది ప్రాత నాణెములు ఇక చెల్లనేరవని ఉద్ఘాటించి తిరగబడి కొత్త నాణెములు ముద్రింపవచ్చును" - అని చెప్పారు. (పేజి 30). ఈ కాలంలో - చెప్పిన పై వాటిలో మొదటి రెండు రకాలూ సాహితీరంగంలో అప్పటికే ఉన్నాయి. ఇక మూడవది రాబోయే సూచనలు మాత్రం కనిపిస్తున్నాయి.

ధర్మారావు సాహిత్యరంగంలో అప్పటికొక నాటకం విలాసార్జునం రాసి మిత్రుల ప్రశంసలు పొందినా ఇతరులకు తెలిసే తెలీదు. మద్రాసులో చదువుతున్న కాలంలో ఏదో కాస్త గిలికినా సాధనకోసం చేసినవిగానే ఉపకరించాయి. గిడుగుతో తలపడ్తూ చేసిన 'గ్రాంథిక భాషావాదం' రచన గ్రాంధిక భాషావాదుల ప్రశంసలను బాగా అందుకునేటంతగా వారి మధ్యకు పోలేదు. అయితే అప్పుడప్పుడే గ్రాంథిక వాదం మీద దుమారం లేపుతున్న గిడుగు వర్గం దీన్ని అంతటితో చూస్తూ ఊరుకోకూడదని సెట్టి మాస్టారు చేత ఖండన మాలికనూ

రాయించారు. అంటే ధర్మారావు గ్రాంధిక భాషావాదులలో ఉద్దండుల గుర్తింపుకు వెళ్ళకున్నా వ్యావహారిక భాషావాదుల గుర్తింపును పొందాడనే అనాలి.

చదివింది గణితమైనా ఆంగ్ల సాహిత్య పఠనం విశేషంగాచేసి సేకరించుకొచ్చిన అనేక నూత్న భావాలతో అప్పటికే పైన వివరించిన కొద్దిపాటి సాహితీవేత్తల గుర్తింపుతో మద్రాసునుండి బరంపురానికొచ్చాడు ధర్మారావు. నాటి సగటు ఆంగ్ల విద్యావంతుడికీ, ఆ స్త్రీ మధ్య తరగతికి చెందినవాడికీ ఉండే దేశభక్తి రాజకీయాలు మాత్రమే వీరికుండేవి. దేశానికి స్వాతంత్ర్యం వచ్చేటప్పటికి దేశీయులలో అప్పటివరకుండి పీల్చివేస్తున్న సాంఘిక దురాచారాలు అసమానతలు అంతం కావటం చాలా అవసరమన్న భావం మాత్రం వీరికుండేది. వీటన్నిటినీ కార్యరూపంలో చూపించటానికి బరంపురం అవకాశం కలిపించింది.[48]

బరంపురం పలువురు సాహితీ వేత్తలకు నిలయం. సాంఘికంగా కూడా పనిచేయటానికి అనువైన స్థలం. మహేంద్రగిరి, గోదావరి ఎల్లలుగా ఉంటున్న మధ్యదేశమంతా కళింగమనే ఎప్పుడూ ప్రసక్తమవుతూ వస్తోంది. పది నుండి పదహారో శతాబ్దం వరకూ తెలుగు రాజులేలిన ప్రాంతం. గజపతుల శాసనాలన్నీ తెలుగులో ఉన్నాయి. సర్కార్ లాంటి చారిత్రక వేత్తల అభిప్రాయం ప్రకారం గాంగరాజులు తెలుగువాళ్లే. ఇది చరిత్ర.

ఇక అర్వాచీనకాలంలో ఇక్కడి తెలుగువారి చరిత్రలను ఏనుగుల వీరాస్వామి 'కాశీయాత్రా చరిత్ర' బాగా తెలియచేస్తుంది. మండపాక పార్వతీశ్వరశాస్త్రి 'యాత్రా చరిత్రం' (1897)లో కూడా వివరాలు బాగా చెప్పాడు బరంపురంలోని వివిధ రంగాలూ ఏఏ వ్యక్తుల కృషి ఆధారంగా పరిపుష్టమయ్యాయో మరువాడ సీతారామస్వామి రాసిన 'ఉత్కళ రాష్ట్రంలోని విశిష్టాంధ్రుల'న్న పుస్తకం అద్దం పట్టినట్లు చూపుతుంది

ధర్మారావు బరంపురం వచ్చేటప్పటికి అన్నదాన సమాజం పేరుతో ఒక సంఘసంస్కరణ సమాజం పని చేస్తూంది. ఉన్నం రామలింగం ఇంకా కొందరు స్థానికులు ఇంటింటికి తిరిగి బియ్యం పోగుచేసి బీదలకు అన్నదానం చేయటం దీని ఆశయం. సాంఘిక సేవ చేయాలన్న తలంపున్న యువకులందర్నీ ఇది బాగా ఆకట్టుకుంది. కొంతకాలానికి న్యాపతి రంగనాథం, దేవరాజు కృష్ణారావు, బచ్చు జగన్నాధదాసు, మొదలైనవారూ ధర్మారావూ కలిసి ఈ అన్నదాన సమాజ స్వరూపమే మార్చేశారు.

ఆరోజుల్లో జాతీయోద్యమంలో భాగంగా గ్రంథాలయోద్యమం బాగా ప్రచారంలో ఉంది. సమరశీల రాజకీయాలకి గ్రంథాలయోద్యమం బాగా

సాయపడింది. సమాజంలో విద్యావంతుల శాతం పెరగటానికి విద్యాలయాలే కాకుండా గ్రంథాలయాలు కూడా ఎంతగానో తోడ్పడ్డాయి. నలుగురూ ఒక చోట కలుసుకోటానికీ, దేశరాజకీయాలనూ, బాగోగులను గూర్చి ఊసులాడు కోటానికీ ఇవి కేంద్రాలుగా ఉండేవి. భావ విప్లవ బీజాలు నాటటానికి గ్రంథాలయాలు ఉపకరించినంతగా మరేవీ ఉపకరించి ఉండవు. ఉత్తమ సారస్వతాభిరుచులు కలిగించాలంటే వీటి అవసరం ఎంతైనా ఉంది. ఇవన్నీ గమనించే ఆయువకులూ, మరికొందరు స్థానిక యువకులతో కలిసి దీన్నే ఒక గ్రంథాలయంగా మార్చారు. అదే 'ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం'. బరంపురంలోని తెలుగు వారందరికీ ఇది ఉపయోగపడే కూడలిస్థలం. 1-1-1909న దీని స్థాపన జరిగింది.

ధర్మారావూ తదితరులు ఇంటింటికీ తిరిగి గ్రంథాలు సేకరించారు బచ్చు జగన్నాథదాసు మొట్టమొదట చాలా గ్రంథాలు బహూకరించి ఆరంభం చేశారు. ఈ గ్రంథాలయంలో సాహిత్యగోష్ఠులూ చర్చావేదికలూ నిర్వహించే బాధ్యత తాపీ ధర్మారావు, దేవరాజు వెంకట కృష్ణారావుల భుజస్కంధాలమీద పడింది. గ్రంథాలయానికి కార్యదర్శిగా మొట్టమొదట దేవరాజు వెంకట కృష్ణారావు ఉండేవాడు సాహిత్య గోష్ఠులలో ఆగిభట్ల తరణయ్య సిద్ధాంతి, సుసర్ల సత్యనారాయణమూర్తి, దేశరాజు కృష్ణమూర్తి, మణికొండ సుబ్బారావు తదితరులు తరుచు పాల్గొంటూండేవారు. దీనిపక్షాన నిర్వహింపబడ్తూండే చర్చల్లో ధర్మారావు తన విలాసార్జునం నాటక విశేషాలను చెప్పటం, విజయవిలాసంలో పద్యాలుచదవటం లాంటివి చేస్తూండేవాడు. భోగరాజు నారాయణమూర్తి, భాగవతుల నృసింహశర్మ ఈ కార్యక్రమాలలో కలుస్తూండే వారు. నాటికి ఈ సమాజం బరంపురంలోని సాహితీ సాంస్కృతిక కేంద్రంగా అతి తక్కువ కాలంలో యువకులందరి కృషివల్ల వృద్ధి పొందింది.

అప్పుడప్పుడే గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదాలు బజారున పడుతున్నాయి. పండితులందరూ అధికంగా గ్రాంథికభాషవైపూ, అతి కొద్దిమంది వ్యావహారిక భాషవైపూ మొగ్గారు. గిడుగు రామ్మూర్తి పర్లాకిమిడి కళాశాల అధ్యాపకత్వాన్ని వదిలేసి భాషా వివాదాన్ని చేపట్టారు. ధర్మారావులో అందరూ ఔనన్నది కాదనాలన్న అంశ ఒకటుండేది. దీనికి తోడు ఈ గ్రాంథికభాషను ఆనాడు బలపరుస్తున్నవారందరూ బ్రాహ్మణులు కావటం, ధర్మారావు మనస్సులో ఏదోమూల ఎప్పుడూ తాను బ్రాహ్మణులకన్నా తక్కువ కాదన్న అభిమానం గూడుకట్టుకోనుండటం తెలిసిందే. దీనితో తానూ ఆ భాషావివాదంలో గ్రాంథిక భాషనే సమర్థిస్తూ వారి పక్కనే ఉండి వారిని మించవచ్చన్న

అభిప్రాయం కూడా ఉండి ఉంటుంది. వీటన్నింటికన్నా బలమైంది ఇంగ్లీషు భాషా సాహచర్యం కలిగిన తర్వాత ఆ సాహిత్యాన్ని అప్పుడప్పుడే రుచి చూసిన దశలో అక్కడా గ్రాంధిక - వ్యావహారికాల విషయం చూసి తాను చూసిందే నిజమైన గ్రాంథికమన్న భ్రమతో ఈ గ్రాంథిక వాదాన్ని సమర్థించాడు. ఇంతకు పూర్వమే ఈవాదాన్ని ప్రకటిస్తూ మాలిక రాశాడు. ఈవాదాన్నే వివరిస్తూ 'ఆంధ్రుల కొక విన్నపము' అని ఒక వ్యాసం రాశాడు. ఇది 1911 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో అచ్చయింది. భాష గ్రాంథికం.

"లోకంబున బ్రాకట దశం బొంది ఎర్రవీగుచున్న భాషా సమితి చూచి మన యాంధ్రంబునందు గానమి నమిత విషాదమును బొంది పొందికగా నమర్చు శక్తి లేకుండుటం జేసి చేయునది లేక శోకంబు ద్విగుణితంబు గా నెంత వంత వందుఋ వారలనేకులుంట మీ రెరుంగనిదియా ?" అని ఆరంభమవుతుంది.

తెలుగు భాష నన్నయ నుండి నాటి వరకూ పలువురు పెంచి పోషిస్తే అందంగా తయారైందనీ, కానీ భాషా సౌష్ఠవం ఎరగని కొందరి చేతుల్లో పడి అది నాశనమవుతూందనీ, బాధపడ్డాడు. ఇంగ్లీషు భాషా వ్యామోహపరులు తెలుగును అలక్ష్యం చేస్తున్నారంటాడు.

ఈ సందర్భంలో "కొందరు భాషాసంస్కరణ కుతూహల ప్లవమాన మానసులు లేచి, భాషాసంరక్షణంబునకుం గంకణంబు గట్టుకొని శ్రీహరీ, దాని రూపుమాప గ్రామ్యంబునుం దెచ్చిరి"- అని గ్రామ్యవాదాన్ని ఈసడించాడు. "గ్రామ్యపద భూయిష్ఠంబులగు గారడి పొత్తంబు లెన్ని యల్లినన్ సరే, నా యూహకంబున జూడ వ్యాకరణయుక్తమే మేటి యని తోచెడిని" -తానెంత వ్యాకరణవాదో ధర్మారావు ప్రకటించుకున్నాడు. మాండలికాలు కూడా పనికి రావన్నాడు.

ఆంగ్లసాహిత్యం నుండి ఏవన్నా ఎరవు తెచ్చుకోవాలన్నప్పుడు "యుపన్యాసంబులను వృద్ధిసేయుటయు, భాషాంతరీకరణంబుల బురికొల్పుటయు" చేస్తే "ఆంధ్ర వాఙ్మయంబును వృద్ధిచేయజాలిన వారమగుదుము"-అని కోరుకున్నాడు. కవులూ - రచయితలూ "జనసామాన్యాంశము (యూనివర్సల్ ఎలిమెంట్) నయ్యది దేశకాల భేదంబులకు నెడమియ్యక, జాతి విరోధంబులకు లొంగక, వర్ణభేదంబులకు బట్టువడద" నీ అట్టి రచనలు సాగించాలనీ వారికి విజ్ఞప్తి చేశాడు చివరకు ముగిస్తూ ముక్తాయింపుగా "గ్రామ్యమును దూరంబునననుపుడు . ...అట్లుచేసి మా వందనము లందుడు" అని అన్నాడు.

ఇందులోని వాదనలన్నీ అప్పటి వరకూ గ్రాంథిక భాషావాదులందరూ చేస్తున్నవే. కాకపోతే ధర్మారావు-ఇంగ్లీషు బాగా అభ్యసించినా తెలుగు భాషను మరువకండనీ ఇతర సాహితీప్రక్రియలనూ ఇందులోకి తీసుకొనిరండనీ అంటాడు.

ఆ రోజుల్లో ఆంధ్రుల కొక విన్నపమన్న ధర్మారావు ఈ వ్యాసం గ్రాంధిక భాషావాదులకు బాగా ఊతనిచ్చి ఉండవచ్చు గిడుగు శిష్యుడే ఆయన మీద తిరగబడటాన్ని చూసి కొందరన్నా సంతోషించి ఉండవచ్చు. అయితే ఇందులోనే ధర్మారావు తానిక ముందు చేయనున్న భాషాసేవ ఎలాంటిదో ప్రస్తావించాడు. తా వాంగ్ల సాహిత్యాన్ని అధ్యయనం చేసినందువల్ల తెలుగు వాఙ్మయానికి ఎలాటి లాభాన్ని సంతరించి పెట్టాలనుకున్నాడో స్థూలంగా ఈ విన్నపం చివరను ఒక పథకాన్ని చూపాడు. అదే వేగుచుక్క గ్రంథమాల స్థాపనగా రూపాన్ని దిద్దుకొంది. 1911 వ సంవత్సరం అది. వీరికి దేవరాజు వెంకట కృష్ణారావు తోడు ఉండనే ఉంది.

ధర్మారావుకీ గ్రంధమాల పెట్టాలన్న యోచన మద్రాసులో చదువుకునే కాలంలోనే కలగటానికి అవకాశాలున్నాయి పర్లాకిమిడితో ఉంటున్న సమయంలో కొమర్రాజు లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని గురించి వీరు విని ఉంటాడు. దాని ఆశయాలు ధర్మారావు చదివే ఉంటారు.

1905 లో స్వదేశంలో తయారైన వస్తువులను మాత్రమే వాడాలన్న భావాన్ని ప్రచారం చెయ్యడానికి మద్రాసులో విద్యార్థులొక సభ నిర్వహించారు. ఈ సభ సెప్టెంబరులో జరిగింది దీనికి కాస్త ముందు వెనకలుగా కచ్చాలేశ్వరాగ్రహారంలో అయ్యదేవర కాళేశ్వరరావు ఇంట్లో ఒక సమావేశం జరిగింది. అందులో కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, కాళేశ్వరరావులు తామొక నిర్మాణాత్మకమైన కార్యక్రమం చేపట్టాలనుకున్నారు. ప్రపంచాన్ని మరామత్తు చేసే పనేదైనా చెయ్యాలని ముగ్గురూ ఆలోచించారు. ఆ ఊహల్లోంచే 'విజ్ఞాన చంద్రికా గ్రంధమండలి' భావం వచ్చింది. 1905 లోనే దీని ఆశయాలను వెల్లడిస్తూ అరరావు సైజు కాగితం విజ్ఞప్తి తెలుగుదేశం మీదికి విసిరారు. ఈలోగా మునగాల రాజా, రావిచెట్టు రంగారావుల సాయం కూడా సంపాదించారు. చివరకు 1906 లో మద్రాసులోని మునగాల రాజా ఒంగశాలో కాళేశ్వరరావు, హరిసర్వోత్తమరావు, లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, మునగాల రాజా, నాయని వెంకటరంగారావులు సమావేశమై ఈ మండలికి స్థిరమైన ప్రాతిపదిక వేశారు

సంవత్సరానికి నాలుగు పుస్తకాలు ప్రచురించాలి. లక్ష్మణరావు సంపాదకులుగా ఉండాలి. నూరు పేజీలు నాలుగణాల చొప్పున ధర పెట్టాలి కాపీ

స్థానంలో రావిచెట్టు రంగారావుకి ఆదిరాజు వీరభద్రరావు సహాయకులుగా ఉండాలి. ఇవీ నాటి నిర్ణయాలు.

గ్రంథమండలి తొలి ప్రచురణగా హరి సర్వోత్తమరావు "అబ్రహాం లింకన్ జీవిత చరిత్ర" ప్రకటించారు. దాని విడుదల సందర్భంలో కార్యవర్గ సభ్యులందరి సంతకాలతో ఒక విజ్ఞాపన పత్రాన్ని పంచారు. "ప్రకృతి శాస్త్రాది వివిధ విద్యలు జనులకు బోధించుటకు ఆ భాషలలో అన్ని విషయ ములను గురించిన గ్రంథములను నిర్మింపవలసియున్నది . జ్ఞాన విషయ ములసంఖ్యములు. ఏ విషయమును గురించి విచారించినను మన భాషలో తగిన గ్రంథములు లేవు. ఇట్లు తలచి "యుడుత భక్తి'' చందంబున మాయల్ప శక్తి కొలది యాంధ్రమాతృభాషాసేవ చేయ ప్రయత్నింపవలయుననెడి ఇచ్ఛ గలవారమై విజ్ఞాన చంద్రికామండలి యను పేరిట నొక భాషాభివృద్ధి సంఘము నేర్పరచినారము '' "దేశచరిత్ర, మహాపురుషుల జీవితములు, ప్రకృతి లేక భౌతిక శాస్త్రములు, రాజకీయ అర్థిక శాస్త్రములు ఇంగ్లీషులోని సర్వోపయోగ కరంబులైన గ్రంథములు యొక్క భాషాంతరీకరణములను మాత్రమే ప్రచురించదలచినారము ...'' "మిత్రుల సూచన ననుసరించి చరిత్రానుసార మగు కల్పిత కథలను (చరిత్రాత్మక నవలలను) ప్రచురించుటకు కూడ నీయ కొంటిమి."

ఇవీ వారి గ్రంథమండలి ఎల్లలు. 1911 నాటికి 15 గ్రంథాలు ప్రచురించారు. అందులో భోగరాజు నారాయణమూర్తి 'విమలాదేవి', కేతవరపు వెంకటశాస్త్రి, దుగ్గిరాల రాఘవచంద్రయ్య, ఎ వి నరసింహం రాసిన రాయచూరు యుద్ధం, విజయనగర సామ్రాజ్యం, పాతాళభైరవిలాటివి మాత్రం చరిత్రాత్మక నవలలు. 15 వ ప్రచురణగా 1911 లో కందుకూరి స్వీయ చరిత్రం మొదటి భాగం తీసికొచ్చారు. మిగిలిన గ్రంథాలన్నీ ఆయా శాస్త్రాలపై వచ్చినవే.49

ఇది 1907 - 1908 నుండి మద్రాసు కార్యస్థానంగా కృషి కొనసాగించింది మద్రాసులో ఉన్నకాలంలో ధర్మారావు పచ్చయ్యప్ప విద్యార్థిగా దీని పెరుగుదలను చూశాడు. అంతకు పూర్వం బెర్హం పురంలో అధ్యాపకుడుగా ఉండగా వీరి ప్రచురణ 'విమలాదేవి'ని తరగతిలో బోధించాడు. ఈ మండలి ప్రచురణల విశేషాలను ఆకళింపు చేసుకున్నాడు.

అలాగే అప్పటికి తెలుగు దేశంలో 'ఆంధ్ర భాషాభివర్ధని గ్రంథమాల' 19.. లో స్థాపితమై బందరు నుండి పనిచేస్తోంది. 'వివేకానంద జీవితం'లాంటి నాలుగు పుస్తకాలను ప్రచురించారు. అయితే బందరు రాజకీయ కార్యకలాపా

లకు ఆటపట్టయినందువల్ల స్థానికంగా ఉండేవారు, రాసేవారూ, చదివేవారూ రాజకీయంగా ఉద్రేకపూరితులైనందువల్ల ఇది ఎక్కువ కాలం సాగక మూత పడింది.[50]

ఇదే విధంగా 'ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల' ఆరంభంలో తణుకులో అయ్యగారి నారాయణమూర్తి సంపాదకత్వంలో మొదలైంది. తర్వాత నిడుదవోలులో సారస్వతప్రియుడు కొవ్వూరు చంద్రారెడ్డి దీని ఆధిపత్యాన్ని స్వీకరించాడు. వీరికి వెంకట పార్వతీశ్వర కవులు తోడైనారు. మంచి ఓపికా, పట్టుదలా ఉన్నవారు. వసుమతీవసంతం, దుర్గేశనందిని, చతురచంద్రహాసం వంటి అనేక గ్రంథాలూ చాలా నవలలూ ప్రచురించారు. 'లక్షరూపాయలు' వంటి చిన్న అనుబంధాలను కూడా నవలలుగా తీసికొచ్చారు. నవలావాఙ్మయాన్ని ఈ గ్రంథమాలవారు బాగా ప్రచారంచేశారు. కొమర్రాజు లక్ష్మణరావు అంచనా ప్రకారం "ఈ గ్రంథమాల ప్రచురణలో చాలా భాగం అనువాదాలు కానీ అనుసరణలు కానీ, అవీ బెంగాలీ, కన్నడ వాఙ్మయాల నుండి. కొన్ని స్వతంత్రాలు కూడా ఉన్నాయని" మాతృమందిరానికి రాసిన పీఠికలో అన్నారు లే మిజరబుల్స్, ఫాస్ట్ వంటి వాటని కూడా అనువదించి ప్రచురించింది గ్రంథమాల. జాతీయ భావాలూ, ప్రకృతి వర్ణనలూ, శృంగార రస ఉద్దీపనలతో మధ్య తరగతి వాళ్లనూ, కొద్దిపాటి చదువూ సంస్కారం ఉన్న ఆడవాళ్లనూ ఆరోజుల్లో ఇవి బాగా ఆకట్టుకున్నాయి. కొన్నాళ్ళకు చంద్రారెడ్డి మరణించటంతో రాజమండ్రిలోని అద్దేపల్లి లక్ష్మణస్వామి చేతిలోకి వచ్చింది. ఆపైన కాకినాడ కార్యస్థానంగా మరికొన్ని ప్రచురణలను తెచ్చి మరుగున పడిపోయింది తెలుగు రచయితలను నవలల వైపు మళ్లించడంలో ఈ గ్రంథమాల ప్రభావం చాలా ఉందనే అనాలి. అతి తక్కువ ధరకు ఎనిమిదణాల పుస్తకాన్ని అణాకిచ్చి వెళ్ళేవారు. దీనివల్ల ఒక రకంగా నవలలంటే తేలికైన అభిప్రాయం కూడా జనంలో కలిగిందని కురుగంటి సీతారామ భట్టాచార్యులవారి వాదం.[51]

పిఠాపురం దగ్గర చిత్రాడలో చెలికాని లచ్చారావు గొప్ప సారస్వత పోషకుడు. వీరి ఆస్థానకవి వంగూరు సుబ్బారావుగారు. వీరిద్దరూ కలిసి రామవిలాస గ్రంథమాలనూ ఆరోజుల్లోనే నడిపారు. ప్రభాతం వంటి గ్రంథాలను అచ్చేశారు. నవలల్లో (ప్రచురించాలని) దృష్టి మొదట్లో ఉంచుకున్నా ఈ గ్రంథమాలవారు తర్వాతర్వాత వాఙ్మయచరిత్ర, కవికోకిలల చరిత్ర వేమన యోగి గ్రంథాలనూ ప్రచురించారు

ధర్మారావు, కృష్ణారావు కలిసి 1911లో వేగుచుక్క గ్రంధమాల పెట్టేనాటికి వీరి మనసులో విజ్ఞాన చంద్రికా గ్రంధమండలి రూపురేఖలే ఉన్నాయి. విజ్ఞాన చంద్రికకు ముందు 'కళాభిలాషక కావ్యమాలిక' అనే గ్రంథమాలను 1904 నుండి మారేపల్లి రామచంద్రకవిగారు విశాఖ కేంద్రంగా నడిపించారు.[52]

ఇందులో కవిగారి స్వీయ రచనలే ప్రచురించేవారు. ఇది అంతగా ప్రచారాన్ని పొందినట్లు లేదు. ఐతే ధర్మారావుకీ విశాఖపట్నానికీ ఉన్న సంబంధం అప్పటికి (1911) కొద్దిపాటిదే అయినా ఈ గ్రంధమాలిక విషయం వారికి తెలిసే ఉండాలి.

దేవరాజు వెంకట కృష్ణారావు తమ విద్యాభ్యాసాన్ని బొబ్బిలి, మద్రాసుల్లో కొనసాగించి బరంపురం చేరుకున్నారు. పరవస్తు రంగాచార్యులు, వేదం వెంకట్రాయశాస్త్రిగార్ల శిష్యులు వీరు. మంచి పండిత కుటుంబం. 1886లో శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం దగ్గర మృత్యుంజయ నగరంలో జన్మించారు. ధర్మారావు కన్నా వీరు ఒక సంవత్సరం పెద్ద. యువకరక్తం, జాతీయభావం, కార్యదీక్షా, సంస్కారభావాలూ ఉన్న వీరిద్దరూ బరంపురాన్ని సాహిత్యరంగంలో పైకెత్తారనే చెప్పాలి.

1911లో వీరిద్దరూ స్థాపించిన వేగుచుక్క గ్రందమాలకు న్యాపతి రామానుజస్వామిగారధ్యక్షులు. వెంకటకృష్ణారావు కార్యదర్శి. తాపీ ధర్మారావు సంపాదకులు.[53] విజ్ఞాన చంద్రిక వాళ్ల ప్రచురణల పరిధిలోకి రాని ప్రక్రియలను చేపడ్డామని భావించారు. సాహిత్యంలోకి అప్పుడప్పుడే ప్రవేశిస్తున్న నవలను ప్రచారం చెయ్యాలనుకున్నారు. ఈ గ్రంథమాల ముఖ్యోద్దేశాన్ని సంపాదకుడు ఈవిధంగా వివరించాడు.

ఆంధ్రులారా,

ఆంగ్లేయ భాషా సంపర్కంబున ననేక మార్పులు మన భాషయం దావిర్భవించుచుండుట యెల్లలెరింగిన విషయమేకదా. అందున నీదినంబులలో సంస్కరణాభిలాష, యధికమగుచు బలుతెరంగుల దనుదా వెడలుచున్నది. ఇట్టి సంస్కరణైక కాలంబున హూణభాషా పరిచయంబుగల మేమెల్లరము నీ గ్రంధమాలను స్థాపించుటలో మా ముఖ్యోద్దేశ మాంగ్లేయ భాషా సహాయమున బ్రకృతివర్ణనలు, స్వభావనిర్మాణోన్మీలనాదులు, జనసామాన్యాంశములు లోను గాగల విషయంబులజొన్పి, శ్రేయోజనకంబులును, లాభకరంబులునగు మార్పుల గూర్చుటయేకాని వేరుకాదు. అట్టి మా యుద్దేశము గొనసాగంజేయ



9 ధర్మారావు - అన్నపూర్ణ - వారి కుటుబం. 1952



10 ధర్మారావు కుటుంబం. 1954



11 ఆదిమకాలంలో సౌభాగ్యదేవత రూపం - ఆస్ట్రియా.



12 ఆదిమకాలంలో వివిధ దేశాల్లో సౌభాగ్య దేవతల రూపాలు.

దోడ్పడుచున్నవారల భాషానురాగంబునకును, మాయందలి యభిమానంబున కును గృతజ్ఞులమై యుందుము".54

దీనిలో వెల్లడైన 'స్వభావ నిర్మాణోన్మీలనాదులు, జనసామాన్యాంశము' లన్న లక్షణాలను తెలుగు రచనల్లో ప్రవేశపెట్టాలన్న ఆకాంక్ష ఇంతకు ముందు ధర్మారావు ప్రచురించిన 'విన్నపమ'న్న వచన రచనలో కనిపిస్తుంది (1911). ఆ ఆశయాలకు కార్యరూపమే వేగుచుక్క గ్రంథమాల.

# ఘంటాన్యాయము

ఒక చరిత్రను గీతమాలికలో బంధించి కథాసూత్రాన్ని ఏర్పాటు చేసుకుని పిల్లలకోసం ధర్మారావు చేసిన రచన 'ఘంటాన్యాయము'. దీన్ని రాయడానికి రచయిత మనసులో బీజాలు 1913లో పడ్డాయి. రచనగా వెలువడింది మాత్రం 1917 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో. తర్వాత దీన్ని 'పాత పాళీ' ఖండకావ్య సంపుటిలో (1962) చేర్చారు.

ధర్మారావు బి.ఎ.లో కృతార్థులై బరంపురం కళ్ళికోట కాలేజీలో గణితం అధ్యాపకుడుగా చేరారు. తెలుగుకూడా బోధించేవారు. 1913లో తెలుగు రెండో పేపరు స్కూలు ఫైనల్ విద్యార్థులకి ఇవ్వవలసిన పరిస్థితి ధర్మారావుకేర్పడింది వ్యాస రచన కోసం ఇంగ్లీషులో 'స్టోరీ పోయమ్స్' ఉన్నట్టు తెలుగులో కనిపించలేదు. ప్రాచీన కావ్యాలు వెతికారు. విద్యార్థుల స్థాయికి తగిన పద్యకథలున్నట్లు వారికి అనిపించలేదు. చరిత్రలోని చిన్న కథలను తీసికొని ధర్మారావు, వారి సహాధ్యాయులూ, మిత్రులూ కొందరు కలిసి పద్యకథలుగా మలిచి విద్యార్థులకు అభ్యాసం కోసం ఇస్తూండేవారు. ఆంగ్లంలో అయితే బ్లాంక్ వర్స్, చిన్నచిన్న అయాంబిక్, ట్రొకేయిక్ ఛందాలు పనికొస్తాయి. తెలుగుకు ఆటవెలది - తేటగీతులు సరిపడ్తాయని ధర్మారావనుకొన్నారు. అలాగే రెంటిని ఉపయోగించి కొన్ని రాసి మిత్రుల ముందు పెట్టారు. అందరూ సెబాసన్నారు.

ఆ దశలో ధర్మారావు జ్ఞాపకాల దొంతరలో ఎప్పుడో 'బెల్ ఆవ్ అత్రి' అన్న ఆంగ్లకథ బయటకొచ్చింది. దీనికి సమాంతరంగా మన చరిత్రలో

అనంగపాలుడి కథ బుద్ధికి తట్టింది. అతడి దృష్టిలో న్యాయం మనుషులకూ - తిర్యగ్జంతుజాలానికి సమానంగా ఉండాలని ఇదే భావాన్ని కాల్‌రిడ్జ్

హీ ప్రేయత్ బెస్ట్ హూ లవెత్ బెస్ట్
బోత్ మాన్ అండ్ బర్డ్ అండ్ బీస్ట్.

(ఏన్షియంట్ మెరినర్)

కూడా వ్యక్తం చేశాడు. సీన్నాధారంగా చేసుకునే ఈ 'ఘంటాన్యాయము' చలచ్చిత్రాత్మక చిత్రగీత మాలికగా ధర్మారావు రాశాడు విద్యార్థులకోసం ఆరంభమైన దీని పరిధిని విశాలంచేసి పూర్తిచేశారు.

సూక్ష్మంగా కథ ఇది.

భారత దేశాన్ని తురుష్కులు పాలించకముందు ఢిల్లీని అనంగపాలుడు పాలిస్తున్నాడు. ప్రజలకెప్పుడూ సుఖశాంతులు కలిగించాలన్న ఆశ. కానీ తన ఆశకు తల్లకిందులుగా దొరికారు అధికారులు. ప్రజలకు వాళ్ళనుండి న్యాయం లభించటం లేదు తనకు వాళ్ళనుండి దేశాన్ని గురించిన నిజం తెలియటం లేదు. ఏం చెయ్యాలి? ఆలోచించాడు.

మంచి శిల్పులచేత రెండు సింహాలను తయారు చేయించి అవి నోటితో పట్టుకున్నట్టుగా ఉండేలా ఒక గంట ఏర్పాటుచేయించాడు. ఆ గంట తాడును న్యాయం కావాల్సినవాళ్ళు లాగితే రాజుతోసహా ఊరంతా అక్కడికి వస్తుంది. వారికి న్యాయం లభిస్తుంది. ఇదీ ఉపాయం. చాలాకాలం ఇలాగే జరిగింది

అది ఎండాకాలం మధ్యాహ్నం. మనుషులు ఇళ్ళుదాటి వెళ్లటంలేదు. పిట్టలు నెలపులు వదలటంలేదు. ఇంతలో గంటమోగింది. ఊరూ నాడూ రాజుతో సహా అందరూ చేరారు అక్కడకు. చూస్తే కాకి. జనానికి విసుగు పుట్టింది. తమ కాలం వృధా చేసింది కాకని అనుకున్నారు.

కాని రాజు బుద్ధిలో ఆలోచన పుట్టింది. ఇంతకాలంగా ఇలా జరగంది ఇప్పుడెట్లా జరిగింది ? కాకి గంట ఎలా కొట్టింది ? సమాధానం తట్టింది - సింహాలున్నచోట మాంసం ఉండటంసహజం. అటూ ఇటూ చూసిందా ఊహతో కాకి. ఏమీ కనిపించలేదు. గంట మధ్య పిడి అందరికీ కనిపించాలని దానికి ఎర్రరంగు పూశారు. దాన్నే మాంస ఖండం అనుకుని తినటానికి రెండు మూడు పర్యాయాలు ముక్కుతో పొడిచి చూపి ఉంటుంది ఘటనకూ - రాజు ఊహకూ లంకె కుదిరింది.

పక్షికైనా న్యాయం సమంగా అందాలన్న భావం కలవాడు - అనంగపాలుడు. మాంసం దొరుకుతుందనుకొన్న కాకి మోసపోయింది. దానికి

ఇంకా ఇలాటి వాటికి అక్కడ మోసం జరగకూడదని ప్రతిదినం అక్కడ మణుగు మణుగు మాంసం ముక్కలు వేయించడం ఆరంభించాడు. ఈ విధంగా ఘంట - న్యాయం చేకూర్చింది.

ఇందులో ధర్మారావు సందర్భాన్ననుసరించి కొన్ని చోట్ల ఆటవెలది పాదాలను - కొన్నిచోట్ల తేటగీతి పాదాలనూ మార్చిరాస్తూ ఒక కొత్త ప్రయోగమే చేశారనవచ్చు. అందుకే దీన్ని చిత్రగీత మాలిక అన్నాడు.

సందర్భాన్ననుసరించి రాజుకుండాల్సిన లక్షణాలను "....న్యాయమందెంత పేదయయిన ధనికునితో సముడంచునెంచు అట్టి రాజు" అని చెప్పాడు. రాజుకు గూఢచారులూ - అధికారులే కళ్ళూ చెవులూ అన్న భావాన్ని ఇలా అంటాడు ". అధిపునకుద్యోగి గణమె కాదె చెవియు గన్నునంద్రు". వీటిని సమర్ధవంతంగా ఏర్పాటు చేసుకోవాలనీ "ప్రజకు సేవసేయంగ దైవంబు పనిచెనంచు జింతించు" - లక్షణం రాజుకుండాలనీ రచయిత అంటాడు.

తాను గతంలో చూసిన బాధలకు కారణాన్ని, పరోక్షంగా ప్రస్తావిస్తూ గుర్తుకు తెచ్చుకుంటూ "అటనట పెనుముండ్లకంపలట్లు రాజు చుట్టును నుద్యోగరాజి యుండునే గదా. " అని చింతిస్తాడు.

నాడున్న ఆంగ్ల ప్రభుత్వం దేశ ప్రజల బాధలనంతగా పట్టించుకోకపోవటాన్ని, దాన్ని ఆశ్రయించుకుని ఉద్యోగాల్లో బతికేవాళ్ళ జనాన్ని దోచుకోవటాన్ని చూసిన ధర్మారావులో మంటలు చెలరేగాయి. చదువుకు విలువా గుర్తింపూ లేకపోవటం కూడా ఎదుర్కొన్నారు. ఇవి స్ఫురించేలా "నిరపరాధకగును పరమబాధ", "అర్హవిద్య బ్రదుక యాచనకే పూను", "పంటకాపు చింతపాలబడును" - అని అంటాడు. ఇక ధరణి పతులను "పేరే న్యాయమునకు దూరులై వర్తింప" ఇక జరిగేది - "పేదవారు మరియు బేదలై వర్తింత్రు" "ధనికునింటె ధనము గుణితమందు" - అనే చుట్టూరా ఉన్న సమాజంలో అప్పుడప్పుడే వస్తూన్న పెట్టుబడిదారీ పోకడలనూ రచయిత పసిగట్టి విమర్శించాడు.

భారతీయ శిల్ప వైభవాన్ని మెచ్చుకుంటూ నేటి పాలనలో "దేశి శిల్పుల బోషించు దిక్కులేక ఏమనగవచ్చు మన హైన్యము" - అని విచారిస్తాడు. స్వాతంత్ర్యం వచ్చిననాడే "న్యాయమునిస నార్కనరుల కొరకెగాదు చిన్న జీవులకును జెందవలయు" అన్న ఆశతో బడుగు జీవులకూ న్యాయం లభిస్తుందని ఆశపడ్డాడు.

కాకి గంట వాయిస్తే చేరిన జనం కాకిని చూసి వ్యక్తపర్చే పరుసుపు చక్కని సంభాషణాత్మక శైలిలో —

"ఓసి పాడు కాకి యూరకే యిందఱ
నిచటికీడ్చి తెచ్చె నెంతపేసె"
"నాదు నిదురపోయె, నాదు కార్యముపోయె"
"యెంగిలి తిని క్రొవ్వి యేమి చేయగలేక"

"బాగు చేసెనమ్మ పాడుకాకి" అంటూ మగా ఆడా తమ తమ స్వభావసిద్ధమైన మాటలతో ఈసడించే దృశ్యాన్ని కళ్లముందు చిత్రకారుడిలా నిలిపాడు. నిజంగా చిన్నతనంలో చిత్రకారుడుకూడా కదా.

ఇందులో పాలకుల లక్షణాలనూ, చుట్టూ చేరే వందిమాగధుల పాటలనూ, ప్రజల సాధక బాధకాలనూ, భారతీయ శిల్ప నైపుణ్యాన్నీ, దేశభక్తి పురికొల్పే విద్యావిధానం కావాలన్న భావాన్నీ తాను స్వయంగా అనుభవించిన కష్టనిష్ఠూరాలనూ వ్యంగ్యంగా చిత్రించి కృతకృత్యులు కాగలిగారు ధర్మారావు. అవసరమైన చోట్ల స్పష్టతకోసం అర్థాంతరన్యాసాలంకారాలు మణుల్లా పొదిగారు. భాషా - భావం చాలా సరళంగా చెట్టాపట్టాలేసుకుని చివరి వరకూ నడిచాయి.

## శుక విలాపము

మరో కవిత "శుక విలాపము". ఇది 1917 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురణైంది. అప్పుడు ఈ కవితకు ధర్మారావు పెట్టిన శీర్షిక 'ఒకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల?' పేరు మార్చి దీన్ని 1972 లో గ్రంథరూపంలో వచ్చిన 'మబ్బు తెరలు' అన్న ఖండకావ్య సంపుటలో చేర్చాడు. దానికి 'నా మాట' గా రచయిత "ఈ మబ్బు తెరలు ఖండకావ్య సంపుటిలో నా వ్యక్తిగత విశేషాలకు ప్రాధాన్యమిచ్చానని"- అన్నాడు. అందువలన ఈ ఖండిక రచయిత అనుతాపాన్ని ప్రకటించేదే నన్నది స్పష్టం. దీన్ని 'విషయాంతర గర్భిత గీత మాలిక' గా పేర్కొన్నాడు. దీన్ని బట్టి ఇందులో ఏదో స్వ విషయాన్ని కూడా పాఠకులు అందుకోటానికి ప్రయత్నించమని సూచించారు.

రచయితకు ఏడుస్తున్న చిలుక ఒకటి కనిపిస్తుంది. ఎందుకేడుస్తున్నావని ప్రశ్నిస్తాడు. సమాధానం రాదు. అందమైన ప్రకృతిని చూసి దాన్ని

నిర్మించిన మహాకవిని మించిన జగపతీశుని గొప్పతనానికి ఆశ్చర్య పడా ల్సింది పోయి ఏడుస్తున్నావా? అంటాడు.

దుఃఖం మరవటానికి ఈ లోకంలో అనేకం నీ చుట్టూ ఉండగా ఎందు కలా దుఃఖిస్తావంటాడు. ఈలోగా పక్షుల ప్రసక్తి తెచ్చి ఉదయం నుండి సాయంకాలమైనట్టు కవి సూచిస్తూ ఇంకా విచారించటానికి కారణం అడుగు తాడు. చీకటి పడిందంటూ ఏడవటం మానమంటాడు. నీ దుఃఖాన్ని పంచు కుంటాను నాకు చెప్పి కొంత దిగులు బరువు వదిలించుకోవచ్చునంటాడు. తల్లి దండ్రులు వదిలేశారా? పిల్లలు నిన్ను విడిచి పెట్టి వెళ్ళారా? బంధువులకు రోగం రొష్ఠూ వచ్చి బాధపడ్తున్నారా? స్నేహితుడు నట్టేట్లో ముంచాడా? - అని తన ఊహకొచ్చినవన్నీ చెప్పినా పలకదా శుకం "వ్యర్థమై పొయెనా యూహ లన్ని యిచట "- అని బాధపడ్తాడు. చివరకు "ఆ, మరచితిని నీపతి యేమి యైన, బాధలను గూర్చుచున్నాడె? పల్కు శుకమ?" అని అన్న వెంటనే - "అదిగో జలజల బాష్పంబు లక్షియుగము వెడలుచున్నవి .... నీవంత విధము దెలిసె" — అని అసలు కారణం తెలిసిందని ఆ శుకాన్ని తనకున్న జీవితాను భవంతో ఓదార్చటానికి యత్నిస్తాడు రచయిత.

ఈ లోకాన్ని గూర్చిన వేదాంతాన్ని బోధిస్తూ
"నిరపరాధత నీవుండ బరమపాపు
లైన పెరవారు సెప్పినయట్టి పల్కు
లాలకించుచు యజమాని జాలి మాలి
చాల కుందించుచున్నాడె" - అని యజమానుల దయకు దూరమై

నావా? అన్న సానుభూతిని ప్రకటిస్తాడు చెప్పుడు మాటలు వినే గుణం యజ మానులకుండే సహజలక్షణం అని బాధపడవద్దంటాడు.

శుకం గతజీవితాన్ని గుర్తుకు తెస్తూ "భవ్య భవదీయ జీవనం బవ్యయం మని, యందఱరుదంద లోకవిఖ్యాతి గాంచి నేడిటుల నుండవలసెనే? పాడు కాల" మని తిడ్తాడు. కాలచక్రంలో ఎగుడు దిగుళ్ళుంటాయని ఓదారుస్తాడు. అసలు తప్పు నీలో కూడా ఉంది. ఎందుకంటే "అట్టి యుత్కృష్ట రీతి నిన్న రయుచుండు, పదము విడనాడి యీతని పాలికరిగి" ఉండటం తప్పుకాదా? ఇతని దగ్గర ఏ మంచి గుణాన్ని ప్రోత్సహించే లక్షణముందని చేరావు.

"పూట పనిచేయకుండిన బువ్వబెట్ట
డితని జేరుట నీ బుద్ధిహీనత గదె" రెక్కాడందే డొక్కాడని స్థితికి ఈ యజమాని నిన్ను నెట్టాడు. సరే నువ్వే ఇలా ఏడుస్తూంటే "....నీ జోడు చిలుతలెల్ల, నేమిరీతిని తమ్ము పోషించుకొనుచు, వారి వీరింట దుఃఖాన బరగు వారొ?" - కనుక వాళ్ళను చూసైనా విచారించటం మాను. "ధైర్య మూనుము - తొలుము దైన్యమవల" అంతేకాదు ఈ లోకం ఈ యజమానితోనే గొడ్డుపోయిందా? నీ నైపుణ్యానికి విలువ తగ్గిందా? 'విద్య గారవించెడు వారు పృథ్వి గలరు' - కష్టాలు రాగానే కృంగి పోతే ఎలా? చంద్రుడిని చూసైనా ధైర్యం తెచ్చుకో. మిత్రులం చాలా మందిమి ఉన్నాం. నిన్ను "గురు విధం బున గాంతు మేకొంటతలేక", "మానసంబందు ధైర్యంబునూనకుండ నొకతెవై యేడ్వగానేల శుకమ చూడ" అని వెన్ను తట్టూ రచన ముగిస్తాడు కవి.

ఇది చదువుతుంటే దీని వెనుక కవి జీవితం - అతడికొచ్చిన కష్టాలు వాటికి తానెంత మాత్రం కారణం కాకున్నా పెరవారి మాటలు విన్న యజమాని చర్యే దీనికి దారి తీసిందనీ ఉద్యోగం పోయిందనీ అర్థమవుతుంది.

ఈ ఖండికను ధర్మారావు తన సర్వే ఉద్యోగం పోయిన వెంటనే రాసి ఉంటాడు. విశాఖపట్నంలో అధ్యాపక వృత్తిలో ప్రవేశించటానికి పూర్వం అంటే 1916 కు పూర్వం బరంపురంలో ఉంటూ అనేక సాహిత్య సామాజిక కార్యక్రమాలతో, సంస్థాపరమైన పనులతో మిత్రులందరి తలలో నాలుకగా ఉంటూ జీవితం సుఖంగా కొనసాగిస్తున్న కాలానికి తర్వాత దీన్ని రాసి ఉంటాడు. అంటే 1914 తర్వాత. ఈ కాలంలోనే చీకటి సంస్థానం తగాదాల పర్యవసానంగా కానీ, సర్వే అధికారి భార్య ఉదంతంలో ఆ అధికారి చెవులు కొరికిన వారి మాటలు వినిన కారణంగా గాని ప్రథమోద్యోగం ధర్మా రావుకు పోయింది. ఈ బాధ ఉపశమనాన్ని కవి కనుక శుకాన్ని ఆశ్రయించి చెప్పుకున్నాడు. తన వీపు తానే చరుచుకున్నాడు. ధైర్యంతో మరో ఉద్యోగ ప్రయత్నంలో విజయం పొందాడు. అప్పటివరకూ తన జీవితంలో ఎగుడు తప్ప దిగుడు చూడని ధర్మారావుకి సంఘటన మొదటిసారిగా తీవ్ర మనోవేదన కలిగించి ఉంటుంది. భార్యనూ - పిల్లలనూ అక్కడక్కడ ఉంచి తాను తిరుగుతూండేవాడు. ఇవన్నీ అన్యాపదేశంగా ఈ శుక విలాపంలో చోటు చేసు కున్నాయి. చిన్నచిన్న పదాలతో చక్కని ఊహలతో గీతాన్ని ఆశ్రయించు కుందీ రచన.

# రాగి డబ్బు

ధర్మారావు సర్వే ఉద్యోగం ముగించేసుకుని విశాఖపట్నం కెనేడియన్ బాప్టిస్టు మిషన్ స్కూలులో అధ్యాపకుడుగా చేరాడు. అవి హోంరూలు ఉద్యమం ఆరంభమైన రోజులు. ధర్మారావు దృష్టిలో అనిబిసెంటూ ఆమె హోంరూలు ఉద్యమమూ ఆ కాలానికి చాలా అవసరం. జాతిని తమ దేశాన్ని తామే పరిపాలించుకోవాలన్న దిశగా చేస్తున్న తరిఫీదుకి ఉద్యమం ఉపయోగ పడ్తుందని నమ్మాడు. బ్రాహ్మణేతర ఉద్యమకారులు దీన్ని కూడా బ్రాహ్మ ణాధిక్యత కోసం అనిబిసెంటు ఎత్తిన మరో ఎత్తు అని విమర్శించారు. ఆంగ్లే యులూ ఈ భావాన్ని పరోక్షంగా సమర్థిస్తూ అనిబిసెంటునూ ఆమె సహచరు లనూ నిర్బంధించారు. కాంగ్రెసులో ఉన్న అతివాదులకు ఈ ఉద్యమం కొంత ఉత్సాహాన్ని కలిగించింది. ధర్మారావుకు ఏ రాజకీయభావాలు లేకపోయినా తటస్థుడుగా ఈ ఉద్యమాన్ని బలపర్చాడు.

అందుకు చందాలను పోగుచేయటానికి తన విద్యార్థులను పురికొల్పాడు. సాయంకాలం విశాఖలోని హిందూ రీడింగు రూంలో ధర్మారావు ఉండగా ఆ విద్యార్థులే వచ్చి నలుగురి మధ్యా తన ముందు విరాళానికి డబ్బా పట్టారు. చుట్టలకుంచుకున్న పైసలు తప్పించి అదనంగా వెయ్యటానికేం లేవు. అదే అంటే మరో మిత్రుడు అక్కడ చదువుకుంటూ "అంతకంటే మంచి పనికే వినియోగం అవుతూ ఉంది సంతోషించ" మన్నాడు. దాంతో పరువు బజారు కెక్కకుండా ఉన్న ఆ 'అర్థణా' డబ్బాలో వేసేశాడు.

ఒక నాణెం ఎన్ని విధాల ఉపయోగానికి వస్తోందో అన్న ఆలోచనలు ధర్మారావు బుర్రలో కదలాడాయి. అంతకుముందు ఎడిసన్ రాసిన ఎడ్వెం చర్స్ ఆఫ్ ఎ షిల్లింగ్ మనసులో మెదిలింది. ఎడిసన్ అన్నా అతని రచన లన్నా ధర్మారావుకు అభిమానం ఉందని 'కొండెగాడు' పత్రికలే తెలియ చెప్పాయి.

ఈ నాణెం స్వీయచరిత్రను రాయాలని మొదలెట్టారు. 1916 దీపావళి రోజులవి. అదే 'రాగి డబ్బు' ఒక చిన్న ఖండిక. మధ్య మధ్యలో స్వల్పంగా వచనం కూడా సాగి చంపువులా ఉంటుంది.

ఇది ద్వ్యర్థి రచన. రాగి గనిజం గని నుండి వచ్చింది మొదలు నాణెంగా మారి ఎందరెందరి చేతుల్లో ఏయే పరిస్థితుల్లో ఏయే పనులకుపయోగ పడ్తూ ప్రయాణించిందో చెప్తుంది. అదే విధంగా ఒక అనాధ శరణాలయం నుండి వచ్చిన పిల్లవాడు తన జీవికకు ఏయే మార్గాలు అనుసరించాడో కూడా చెప్తాడు. రెండర్థాలూ సాగుతూ కథను నడుపుతూంటాయి. అభంగ - సభంగ శ్లేషలను రెంటినీ వాడుకున్నారు. పదాలకున్న రెండర్థాలనూ ఉపయోగించు కున్నారు రచయిత.

ఒక పెద్దరాగిముక్కనుండి కత్తిరించినదానిని తీసికెళ్ళి టంకశాలలో నాలుగక్షరాలు ముద్రించి బయటపడేశాడు. ముందు ఒక బ్రాహ్మణుడు దాన్ని తీసికెళ్ళాడు. అతడు పరమలోభి. పొట్ట కట్టుకుని జీవిస్తాడు. చచ్చేనాడు కూడా దాన్ని దాచే చచ్చాడు. కొడుకుల చేజిక్కింది. అందులో ఒకడు వెలయాలికి ఆ నాణెం ఇచ్చాడు. ఆమె కల్లుకోసం దాన్ని అక్కడకు చేర్చింది. అక్కడ కొన్నాళ్ళు, వస్తువుల దుకాణంలో కొన్నాళ్ళు, నూనె అంగడిలో కొద్ది రోజులు ఉంటూనా్న మధ్య మధ్యలో ధనికుల జేబుల్లో పడి సుఖంగానే ఉంది.

ఒక పర్యాయం ఒక తాగుబోతు రొంటినుండి జారి రోడ్డుమీద పడింది. దారిలో పిల్లలకు దొరికింది. ఆ పిల్లలు పండ్లవాడి దగ్గరకు చేర్చారు. అక్కడ్నించి సిగరెట్లు, పొడుము, విడెము, చెడ్డ వస్తువులకు, చిరుదిండి కోసం ఒక్కక్షణం కూడా ఒకచోట ఉండకుండా తిప్పాడు. చివరకొక స్త్రీ చేతికి చిక్కింది. భారతదేశ దాస్యాన్ని విడిపించటానికి ఆ ఊరిలోని యువకులు విరాళాలు వసూలు చేస్తూంటే ఆ డబ్బాలో ఆమె వేసింది. అప్పుడా రాగి డబ్బు తన మనసులో ఎంతో ఆనందాన్ననుభవించింది. వెంటనే దేశ ప్రజలకు తమను దేశసేవచెయ్యటానికే వినియోగించమని ప్రబోధిస్తూ తన కధను రాగి డబ్బు ముగిస్తుంది.

రెండో అర్థంలో అనాధబాలుడు - అతనికి చదువు చెప్పించి లోకంలోకి విడిచారు. పొట్టపోసుకోవటానికి అయిన పనులూ కాని పనులూ చేశాడు. చివరకు తమలాంటి యువకులను దేశసేవకోసమే వినియోగించమంటూ నాటి భారతదేశ స్వాతంత్ర్య కాంక్షను వివరిస్తాడు.

అడుగడుగునా అర్థాంతరన్యాసాలంకారాలు - ''పితృహీనుల దిదేమి జన్మమో, లోభి సమస్త భాగ్యములు లోకుల పాలనుటిద్దియే సుమా, దర్వి యెఱుగునె రుచులచందంబులిలను'' - కొల్లలుగా ఉన్నాయి. రచన చాలా సరళంగా ఉంది. తన స్వాతంత్ర్య భావన వ్యక్తీకరిస్తూ "స్వాతంత్ర్య హీన నరుని బ్రదుకు మాన హాని'' అని అంటాడు.

కథ మధ్యలో కవి కల్పించుకుని చదువరి సావధానము - అని అంటూ నాటి దేశ రాజకీయ పరిస్థితులూ, త్యాగబుద్ధి అలవర్చుకోవాల్సిన ఆవశ్యకతనూ వెల్లడిస్తాడు. చివరకు —

భారతీయులార - వేరండు, వేరండు
మాతృసేవకిదియె మంచి సమయ - ము అని అంటూ
రెండు దేహంబులందున్న కండబలిమి
వశమునందున్న ద్రవ్యంబు భరత మాతృ
దివ్యసేవకై యర్పింప దెగువ గలిగి
కంకణము గట్టుడింక నే శంక వలదు - అని ప్రబోధిస్తాడు.

స్వార్థాన్ని వదులుకోమని "స్వీయ చింతల దేశంబు వృద్ధియగునె" - అని హెచ్చరిస్తాడు.

చివరకు ధర్మారావు అభిప్రాయంగానే ఒక స్వరం వినిపించినట్లు రాగి డబ్బు చేత అనిపిస్తాడు.

ఉండదు నీచసేవ యిక నుండదు దుర్భరపాలనా భయం
బుండదు దోషవర్తనము నుండదికే వ్యసనంబు నింతయే
నుండదు సత్యవృత్తికదురుండదు చిత్తమునందు వ్యాకులం
బుండ దికెట్టి పాపమునోహో - యిక జన్మము ధన్యమే కదా

ఇక దేశానికి స్వాతంత్ర్య వాయువులు రానున్నాయనీ, నీచులైన ఆంగ్లేయుల కింద దాస్యం చెయ్యాల్సిన అవసరం ఇక ఉండదనీ అంటూ ఆశాభావం వ్యక్తపరుస్తాడు. స్వదేశవృత్తులను పోషించాలనీ ఆ విధంగా మన దేశాన్ని మనమే సంపద్వంతం చెయ్యాలనీ కవి ఉద్బోధిస్తాడు. ద్వ్యర్థి ప్రక్రియను జాతీయ భావాలకనుగుణంగా మార్చి రాసిన ఖండిక ఇది. భావాన్ని మాత్రమే గ్రహించి ఇంగ్లీషులోని స్వీయచరిత్రను గ్రహించి నూతన భావాలను చొప్పించాడు. స్వీయ చరిత్ర ప్రక్రియ మీద మొదటినుండీ ధర్మారావుకున్న అభిమానానికి ఇదొక ఉదాహరణగా నిల్చింది. ఇలాంటి భావాలతో హిందీలో కూడా 'ఏక్ పైసే పైసేకి కహానీ' అంటూ కర్ణవీర నాగేశ్వరరావు వచనంలో ఓ కథ రాశాడు. అలాగే 'సిక్కేకా ఆత్మకథా' అంటూ ఓ కవిత కూడా హిందీలో కనిపిస్తుంది. అయితే ఇవన్నీ కాలానుక్రమంలో ధర్మారావు రచన తర్వాతివే.

## కావ్యరచన

విద్య చేతబట్టుకుని దేశమంతా తిరుగుతూ తగిన ఉద్యోగం వేటలో వేసారుతున్నాడు ధర్మారావు. మద్రాసులో న్యూయింగ్‌టన్ కళాశాల మూసేసినందుకు అక్కడ లెక్చరరు పదవి పరిసమాప్తి చెందింది. అయితే అక్కడే పరిచయమైన చుండి రాకుమారుడు మైనర్ అయినందువల్ల అతడికి గార్డియన్ ట్యూటర్‌గా ఉండటానికి ప్రభుత్వం నియమిస్తే అంగీకరించాడు. నెల్లూరు దగ్గర ఉంది చుండి. కాపురం నెల్లూరులో ఉండి చుండి వెళ్ళొస్తూ తన బాధ్యతలు నిర్వర్తిస్తున్నాడు. ఇంకా కొద్దికాలంలో పెద్దకుమార్తె పెండ్లి జరగాల్సి ఉండగా ధర్మారావు కుటుంబం యాత్రలకెళ్ళిరావటం, ఆ వచ్చిన రోజే వీరిడబ్బూ దస్కం, నగా నట్రా ఉంచిన పెట్టె మిత్రుడింట్లో పెడ్తే అది దొంగలపాలవడం జరిగింది.

భార్య ఈ పరిస్థితుల్ని తట్టుకోగలదా? మతిభ్రమణం రాదుగదా? ఇక పెళ్ళి చేయుటం (కూతురి) ఇప్పట్లో సాధ్యపడ్తుందా? అసలే స్థిరమైన ఉద్యోగమూ - ఆదాయమూ లేనందువల్ల దాచుకున్నది ఏం లేదు. ఏకాస్త ఉన్నా అదంతా ఇప్పుడు ఊడ్చుకు పోయింది. అసలే కరువు కాలం అందులో అధిక మాసం. పోనీ తానున్న జమీ ఏదన్నా భారీదన్నా అయితే కొంత వరకూ జమీందారు ఆదుకోవచ్చనుకోవచ్చు. కానీ అది గుడ్డికన్ను. తెరిచినా మూసినా ఒకటే.

ఇలాటి స్థితిలో సతమతమవుతూంటే కాశీనాథుని నాగేశ్వరరావు "ఈ సంవత్సరం గూడా తమ రచనతో ఆంధ్రపత్రిక ఉగాది సంచిక నలంకరించమని" స్వయానా ఓ లేఖ రాశాడు. సామాన్యంగా ధర్మారావు రచనలు ఉగాది సంచికల నలరిస్తూనే ఉంటాయి. దీన్ని కాదనగల మనస్సు ఆ కాలంలో ఏ రచయితకూ ఉండి ఉండదు. నాగేశ్వరరావు చనువూ - అధికారమూ అటు రాజకీయరంగంలోనూ, ఇటు సాహిత్యరంగంలోనూ బాగా చలామణీ అవుతున్న కాలం అది. దానికితోడు బాగా ప్రచారమున్న పత్రికలూ చాలాకాలం భద్రపరచుకొనే విలువైన వ్యాసాలతో వచ్చే సంచికల్లూ ఆనాడు

ఎక్కువ ఉండేవికావు. అందులోనూ సాహిత్యపరంగా ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు తలమానికాల వంటివి.

ధర్మారావు ఎలాగైనా రాద్దామనే నిశ్చయించుకున్నాడు. మనస్సులో ఇంటి, దేశ పరిస్థితులు బాగా పరిశీలించిన మీదట పెద్దనకో నమస్కారం పడేసి ఈ 'కావ్యరచన' అనే ఖండికను పూర్తిచేసి పత్రికకు పంపాడు.

అల్లసాని పెద్దన చాలా గడుసైనవాడు. రాయలనే నిలదీసి కొన్ని వస్తువుల జాబితా ఇచ్చి 'ఇవి పట్రా. అప్పుడు కవిత్వం మాటెత్త' మన్నాడు. కవికీ - పోషకుడికీ ఉన్న సంబంధం అలాటిది కనుకనే ''నిరుపహతి స్థలం బన్న" పద్యం చెప్పగలిగాడు పెద్దన. ఈనాడు ఎందరు అలాటి స్థితిగతులను కోరుకొనేవారు ? అధవా ఆశించినా లభిస్తాయనుకోటం శశవిషాణమే అవుతుంది. కానీ కవితారచనకు ''మానవ జీవితంలోని కొన్ని సంఘటనలు పురికొల్పుతాయన్న"ది ధర్మారావు నమ్మకం. దాంతోనే ఈ రచన చేశాడు.

పెద్దన కోరికలను కోరాడంటే దేశ గౌరవం, వైభవం అంతలా ఉచ్ఛ దశలో ఉంది కనుకనే సాధ్యమైంది. అందరికీ - నేడు మనదేశమున్న బానిస బతుకుల్లో - అది సాధ్యం కాగలదా? కానప్పుడు కవుల కవితకు ప్రేరణలూ- కావ్యాలూ కానరావా? ''ఏ వెరవున లాతి సత్కవులు వెల్వడ గాంతురుదార భావముల్ ?'' కనుక మనకున్న పరిధిలోనే మనం రాయాలి అన్నాడు. భవభూతి మాటను ఔదల దాల్చి

''ధరణి విశాల, కాలము తుదంగ ...ట్టిది, భావసామ్యమొ
క్కరుడును గల్గడే? కృతినిగాంచి ముదంబును బొంద? నేటి వా
రరుసము నందకున్న జనె?''
అన్న నమ్మకంతో రచన సాగించాలన్నాడు.

సమకాలమువారలు మెచ్చుటమన్నది ఎచ్చటా లేదు పొమ్మన్నాడు. అంతేకాక నా రచన బాగుంటుందా లేదా ? విశేషాలేమైనా చెప్పగల్గేనా లేదా ? అన్న అనుమానం రచయితకుంటే పదం సాగదని హెచ్చరించాడు.

పూర్వకవులు మనల్ని చూసి నోరు తెరవచ్చు - అందమైన ప్రకృతి చుట్టూరా లేనిదే ఎలా కవిత చెప్తారూ అని. కనీసం కవితా ప్రేరకాలుగా గాలి తెమ్మెరలు, సెలయేళ్ళు, పికశుక శారికాల రవాలు, చెరువులు, పద్మాలు వెన్నెల వగైరా ఏమీ లేకుండా ఈ ఆధునిక కవులు కావ్యరచన ఎలా చెయ్యగలరని ''తొంటి కవీశులు సాటగూడదె ?" అని వ్యంగ్యంగా ధర్మారావు ఎత్తిపొడుస్తాడు.

ఇంతలో తన ఇంటి పరిస్థితి మనసులో మెదుల్తుంది.

"సిరి చిఱునవ్వులున్, వలపు సేతలు, వన్నెలు....
విరవిర నిట్టె మాయమయి విన్నదనంబును గూర్పనింట సుం
దరియు సుతాదులుం దమ మనంబులనున్న ఘనార్తి మింగి"

జీవిస్తున్నారు: "లేమిడి నేటినుండి" - అయినా బతకాలి. బతుకుతున్నారు. "ఓర్పుతోడ దరహాసము సేయుచు" - కష్టాలను దిగమింగి ఏడ్వలేక నవ్వుతున్నారు.

"అకటంబొరలు పుత్రుల బాష్ప నిరుద్ధ దృష్టులం
బరపుచు నెత్తి యూఱడిల బల్కెడి సాధ్వని" - చూస్తే

వెంటనే మనస్సులో భారతదేశం తళుక్కున మెరిసింది. శతాబ్దాలుగా సంతరించుకున్న సంపదను ఆంగ్లేయులెలా దోచుకుని ఆమెను

"విలూన భూషయు విదూషిత తేజయు నై క్షుధార్తితో
బరిభవమంది కుందునొక భాగ్యవిహీన" - గా ఎలా చేశారో

గుర్తుకు వచ్చింది. వెంటనే గుండె చెరువై "........నయనంబుల బాష్పము లూటలూరగా" - విధి చెయిదాలను తలచుకొని కవి ఆశ్చర్యపోయాడు. ఈ విషయాలన్నీ కవితకు ప్రేరకాలు ఎలా కాకుండా ఉంటాయి ? అని నిలదీసి ధర్మారావు ప్రశ్నిస్తాడు.

కవి మనస్సులో భావాలు తెరలుతెరలుగా వస్తున్నాయి. పైభావన పూర్తి అయీ అవకముందే తన ఇంటి దుస్థితి కళ్ళముందు కదలాడి తన దశను ఇలా చెప్పించింది.

"కరువలి వాసకుం జడిసి కట్టెదుటన్ బొడచూపునొక్క ని
బ్బరమగు నమ్మకమ్ముగల పట్టున దా దలదాచి, యద్దిరా,
శరణమునిచ్చె నీశుడని సంతసమందుచునుండ, ని
ష్ఠురముగ నచ్చటే, శ్రుతి కఠోర విధంబున బెద్ద పిడ్గు చె
చ్చెరబడి వానినొక్కనినె చిత్రవధంబొనరించి, యంతి కే
తర విషయంబు లింతయిన దాకకయుంచుట గాంచి - వాస
నబ్బురమున వ్రేలు పెట్టె".

తన విషయంలో జరిగిందింతే కదా. తాను పెట్టిన పెట్టెనే దొంగలెత్తుకెళ్ళారు గానీ ఆ మిత్రుడింటనున్న మరే వస్తువునూ అంటలేదా చోరులు.

కనుక మనిషికి సంభవించే ప్రతి ఘటనా కవిత్వాన్ని రేకెత్తిస్తుంది. చెప్పగల చావే ఉండాలిగానీ సంఘటనలకేం కొదువ. పెద్దన పద్యము ఎల్లకాలాలకూ నప్పదు.

ఈ చిన్న ఖండికలో విధివిలాసం ఎలాంటిదో క్షణంలో ఓడలను బండ్లనూ, బండ్లను ఓడలుగా ఎలా మారుస్తుందో ధర్మారావు సుందరంగా వృత్తాలనాధారం చేసుకుని చెప్పాడు. దీనికి సాధారణీకరణం అబ్బేలా చూడ టానికి నాటి దేశ స్థితిగతులను జోడించాడు. కవులకు ఎలాంటి సన్నివేశా న్నైనా, ఎలాటి పరిస్థితుల్లోనైనా రాయగల శక్తి ఉంటుందని లోకానికి ప్రబో ధిస్తున్నట్టు కల్పిస్తూ 'కావ్యరచన' చేశాడు.

## ఆంధ్రితేజము వందనంబందికొనుమ

దాసుడి తప్పులు దండంతో సరి. చేసిన పాపం చెప్తే పోతుంది. దీన్ని తూ. చా. అనుసరించాడు ధర్మారావు. తోటివాళ్ళ గొప్పతనం గమనించే లక్ష ణం చాలా తక్కువగా ఉంటుంది లోకంలో. ఇతరులు చేసేపని మంచిదని పిస్తుంది. మనవాళ్ళు అలా చేయలేరనిపిస్తుంది. పొరుగింటి పుల్లకూర రుచి.

ధర్మారావు ఉద్యోగరీత్యా తమిళ ప్రాంతాలూ అవీ చూస్తున్నాడు. అక్కడి వారు తమ సాహిత్యాన్నీ సంస్కృతినీ ఉద్ధరించటానికి చేస్తున్న కృషిని గమనించాడు. జాతీయ ఉద్యమం, పునరుజ్జీవన ఉద్యమం వంగ దేశీయుల కార్య వ్యగ్రతనూ, ఆలోచనా పద్ధతినీ దేశానికి తెలిపాయి. దేశాన్ని ఊపేసిన అన్ని ఉద్యమాల్లోనూ బెంగాలీల పాత్ర అందరికీ తెలిసిందే. తెలుగువాళ్ళు మాత్రం అవసరమైన విషయాలమీద కూడా శ్రద్ధ కనబరచ రనీ, మహాసభల్లో చేసే తీర్మానాలన్నీ ఆ మర్నాడే మరిచిపోతారనీ ధర్మారావు బాధ. ఇదంతా గతంలో 'విజయనగరాంజనేయము' రాస్తున్నప్పటి కథ. అందుకే అందులో ఆంజనేయుడి చేత "ఆంధ్ర తేజంబుగలదె యీ యవని నింక ?, సందియంబయ్యె" - అని అనిపించాడు. ఇది నిజంగా ఆనాటి దేశ స్థితిని చూసిన ధర్మారావు మనసులో కలిగిన సందేహమే. కాలం మారింది. దేశ జాతీయ జీవనంలో అనేక ఉద్యమాలొచ్చాయి. సమస్త రంగాల్లోనూ ఎవ రికీ తీసిపోని అగ్రశ్రేణిలో ఆంధ్రప్రజలుండటం గమనించాడు. వీటన్ని టిని మించి ధర్మారావులో ప్రతి ఉద్యమాన్నీ తులనాత్మకంగా పరిశీలించటం, ప్రజల పాత్ర నాయకత్వ లక్షణాలనూ ఆ ఉద్యమాలు తెచ్చిన అభ్యుదయాన్ని, [illegible] అంచనా [illegible]

సందేహాస్పదంగా ఆంధ్రుల తేజాన్ని గురించి చెప్పిన భావాలు తప్పని అనిపించాయి. దిద్దుకోవాలనుకున్నాడు. ఈ ''క్షమార్పణ రచన'' చేశాడు.

బ్రాహ్మణేతర ఉద్యమం తొలి దశలో గాంధీని మహాత్ముడని వారు అంగీకరించ లేదు ఒక మహాసభలో మహాత్ముడని అనాలా వద్దా అన్న మీమాంస కూడా చెలరేగింది. కొన్నాళ్ళకు ఆ జస్టిసు పార్టీ తమ వేదికల మీదే గాంధీ చిత్రాన్ని ఉంచటం అరంభించింది. అయితే ఇంతకు ముందే ధర్మారావు ఈ రచన చేశాడు. ఆ ఉద్యమ భావాలున్నా జాతీయరంగం స్వాతంత్ర్య సమరం-వీటి వరకూ ధర్మారావులో మిగిలిన వారి కన్నా భిన్న భావాలుండేవి. మొదట్నుండీ ఆంధ్ర రాష్ట్రం - ఆంధ్రాభిమానం, ఇవీ వీరిని ముందుకు నెట్టుతూండేవి. 1913 లో ఆంధ్రరాష్ట్ర వాంఛ ఆరంభమైనప్పటినుండీ ధర్మారావు రచనల్లో ఏదోరూపంలో ఆభావంకూడా ద్యోతకమవుతూవచ్చింది. అందుకే 1909 ప్రాంతాల రచనలో ఆంధ్రతేజాన్ని గురించి అనుమానం-బాధ పడ్డ వీరే 1923 కల్లా రొమ్ము చరుచుకుంటూ "ఆంధ్ర తేజమ వందనంబందికొనుమ" అని అన్నారు. ఇది 1923 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురితమైంది.

తొలినాటి రచనలో వచ్చింది కేవలం అనుమానమేననీ, అదీ విషయాలన్నీ తెలియనందువల్ల కలిగిందనీ ''దోసమూనెను మది ; కిదె దోసిలిడెద'' నని ఆరంభించాడు.

చరిత్రను చంద్రగుప్తుడి కాలం నుండీ తవ్వుకొచ్చాడు. ''యవనబలముల గవనునకవలనునిచి, దండితారాతి వీరప్రకాండుడగుచు, పాలనము' నాడు జరిగిందని పొంగిపోయాడు. అలాగే అశోకుడి కాలంలో శాంతి కాము' కులం మనమనీ అయినా ఆయుధపాణులమేననీ, అదీ ''.... బగఱకొరకె, యాయుధాంకితపాణుల నలరినారమిన్నినాపలు" - అని శాంతి వీరత్వం చాటి చెప్పిన ఘట్టాన్ని తలచాడు.

దాని తర్వాత భారతదేశం సమస్త కళలలోనూ పరాకాష్ఠ సందుకొన్నదనీ, మనజాతిని శాశ్వతం చేయగల అనేక చిహ్నాలు ఇంకా సజీవంగా నిలిచేలా నాటి మన ప్రజలు శ్రమించారనీ గుర్తు చేసుకున్నాడు.

అక్కడినుండి తెలుగు సాహిత్యం స్థానాన్ని ప్రశంసిస్తూ నన్నయాదుల కాలం నాటి సాహితీ వైభవాన్ని, భండనాపర రుద్రులైన కాకతీయుల కాలం నాటి శౌర్యాన్ని, మహమ్మదీయుల నెదుర్కొన్న గుండె ధైర్యాన్ని ప్రస్ఫుటం చేస్తూ నాడు వెలసిన సారస్వత పరిశ్రమనూ గణన చేశాడు. ఇక మిగిలింది రాయల యుగం. 'నవ్య భవ్య కావ్య పీయూష పానం' చేసిన సమాజం ఆనాటిదనీ ''యెందు చూచిన దనవారె ముందుగాగ'' సర్వతోముఖాభ్యున్నతి నాడు

జరిగిందనీ స్మరించాడు. అయితే ఇవన్నీ అంత ఉన్నతదశలోనూ వేర్వేరు రూపాలలో ఇప్పుడూ ఉన్నాయనీ, గమనించక పోవడం తన తప్పేననీ ఒప్పుకుంటాడు రచయిత. 'గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్' అన్న నిరాశావాదంలో ఎవరూ ఉండకూడదనీ, అలా ఉన్నవాడు నిజంగా 'కించిజ్ఞతన్ మించ' నెంచటం కాగలదనీ అంటాడు.

ఇక తనకాలం నాటి ఆంధ్ర రాజకీయ రంగమే కాకుండా ఇతర రంగాలు చూసినా అంతటి తెలుగువారి శౌర్యమూ కనబడగలదని వివరిస్తాడు.

"అన్ని దిశలను మన్ననలంది యవని, నల్లుచున్న నీ భుజబలంబైన గాని" - అని కోడి రామ్మూర్తిని స్మరిస్తాడు.

"అద్వితీయ పరాక్రమమరులు మెచ్చ, సాహవక్షోణి బోరు ధైర్యంబు గాని, శీతనగమంటి దీప్తి రాజిల్లుచున్న ప్రాభవం" గణిస్తూ అల్లూరి సీతారామరాజుకు దోసిలొగ్గుతాడు.

రాష్ట్ర పాలనలో ఉన్నవారినీ, 'న్యాయశాలలనున్న యగ్రాసనముల' నున్నవారినీ తలుచుకుంటాడు.

"కార్య సాఫల్యమునకు గంకణముగట్టి యెట్టి యిక్కట్టులలమిర నీసడించి, ముందె నడచెడి నీదగు పూన్కి" ని మెచ్చుకోలేక ఉండలేనని ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశానికి చేయెత్తి జోహారంటాడు.

నాటి పురా ప్రాభవం నేడు కూడా ఇతర రూపాలలో ఇతర వ్యక్తుల కార్యాలలో ఉండనే ఉంది.

"చూడజాలక జేలనై గోలుమంటి
శోకపుంబొర కప్పె నాలోకనముల
సందియం బంధకారమై క్రందుకొనియె
బాగునోగు నెఱుంగని పాడువంత" - లో తాను ఇదివరకటి

రచన చేశాననీ, క్షమించమనీ అంటాడు. పరోక్షంగా ఎవరైనా 'భళిభళీ మా తాత' అంటూ నేతుల కదలను చెప్తూ నిరాశాపథంలో ఉంటారేమోనని, అలా కాదు ఇప్పుడు ఆ శౌర్యం అడుగంటలేదనీ అంటాడు. చక్కని శైలిలో తేలిక పదాలలో జనం కళ్ళ పొరల తెరలు చించాడు ధర్మారావు.

## నా జన్మభూమి

తొణికిసలాడే దేశభక్తితో భారత ప్రజానీకం దాస్యవిమోచనం కోసం ఉద్యమిస్తోంది. ఆంగ్ల పరిపాలనను అంతం చేయటానికి జాతీయోద్యమం పరవళ్ళు తొక్కుతోంది. ఆసేతుశీతనగం త్యాగంతో ఉరకలెత్తుతోంది. ఆంగ్ల ప్రభుత్వం చేసే ఏ కొద్ది పాటి సంస్కరణలూ ఆ పాలకుల మీద సద్భావం కలిగించలేవనీ, జాతీయ భావాన్ని అడ్డుకోలేవనీ ప్రతి సందర్భం రుజువు పరుస్తోంది. హోంరూలు ఉద్యమం కానీ, కాంగ్రెసు నడిపే సత్యాగ్రహోద్యమాలు గానీ అన్నీ అంతర్లీనంగా జాతీయభావం, దేశభక్తి ఏదో మేరకు కలిగి ఉన్నాయి. దాస్య శృంఖలాలను తెగతెంచేందుకు తమతమ పరిధుల్లో నడుంకట్టాయి.

విద్యార్థుల్లో దేశభక్తిని పెంపొందించటం చాలా అవసరం. రేపు రానున్నతరం వీరు. భవిష్యత్తుకు అధినేతలు వీరు. వీరిలో జన్మభూమిని గౌరవించాలన్న భావాన్ని ప్రోదిచేయకుంటే భవిష్యత్తు అయోమయం అయ్యే ప్రమాదం ఉంది. అప్పటికే వందేమాతరం ఉద్యమం దేశానికి కొత్త రక్తాన్నెక్కించింది. గురజాడ దేశభక్తి గేయం తెలుగువాడి గుండెల్లో మంత్రంగా మోగుతోంది. తెలుగునేలలో కవి అనిపించుకున్నవాడల్లా దేశభక్తి పూరితమైన కవితను రాసి తన వంతు కర్తవ్యాన్ని నిర్వహించాననుకుంటున్నాడు. రాయప్రోలు వంటివారు తెలుగు జాతి చరిత్రలో ఆణిముత్యాలనేర్చి అంతటి గత చరిత్ర మనదని పురావైభవాన్ని పొగడమని తెలుగువాడి వెన్ను తడుతున్నారు.

భారతదేశంలో ఏ ప్రాంతీయునికైనా ఉండాల్సింది దేశభక్తి. కనుక తన జన్మభూమి ఏ ప్రాంతమైనా తన దేశ కీర్తనమే కావాలని ఆశించి ధర్మారావు ఈ చిన్న కవిత 'నా జన్మభూమి' రాశాడు. ఇది 1924, భారతి నవంబరు సంచికలో అచ్చయింది.

మొక్కలుగా ఉన్నప్పుడే వంచాలన్న నానుడిగా ఈ భావాన్ని విద్యార్థి దశనుండే వారికి కలిగించాలి. పిల్లలకూ - తల్లికీ ఉన్న సంబంధం ఎరిగిన వారు కనుక దేశభక్తి భావన పంటబడుతుందని నమ్మకం. తల్లి పిల్లలకు అన్నం

పెట్టీ, తొలి గురువుగా మాటలు నేర్పీ, తనకు ఉన్నా లేకున్నా మంచిగా తీర్చి దిద్దే లక్షణం పిల్లలను మాతృభక్తి కలిగి ఉండేవారిలా మారుస్తుంది. దీన్ని ఆధారంగా చేసుకునే ధర్మారావు

"ఆకలిగాకుండ నన్నంబు పెట్టి
వలసినట్టుల గట్ట వస్త్రంబులిచ్చి
చదువు సాముల నేర్పి సత్కీర్తినిచ్చి
నన్ను బెంచిన తల్లి నా జన్మభూమి"

అని మొదలెట్టాడు. ఆపదలు రాకుండా రక్షిస్తుందనీ, చక్కని ప్రకృతితో సుందరనందనంగా ఉంటోందనీ, కావలసినంత ఖనిజ సంపదనందిస్తోందనీ వర్ణిస్తాడు జన్మభూమిని.

ప్రధానంగా శాంతి, క్షమలతో కూడిన కార్యవాదిగా ఉండాలన్న భారతీయ తాత్విక చింతనకు బుద్ధుడు - కృష్ణులను ఉదాహరణగా తెస్తాడు.

ఇక చివరకు, ఆత్మాభిమానం చాలా ఆవశ్యకం. ఎవరికి దాస్యం చెయ్యకూడదనీ - ఐకమత్యం ప్రధానమనీ, ఈ రెండు సూత్రాలనూ కలిగి ఉండాలంటూ

"పరులను యాచింపవలదు సుమ్మనుచు
నీ గౌరవమ్మును నిల్పుకొమ్మనుచు
బిడ్డలు సఖ్యంబు విడకుండుడనుచు
నాకు జెప్పెడి తల్లి నా జన్మభూమి" అని ప్రస్తుతిస్తాడు.

తన శరీరంలో అణువణువూ తన ఊపిరులూది జీవాన్ని నింపిన తల్లిని

"నీ పూజయే నాకు నిఖిల ధర్మములు
నమ్మి నిన్ సేవింతు నా జన్మభూమి"

అని ముగిస్తాడు.

"జన్మ భూమిని పెంచిన తల్లి, నమ్మకపుకోట,
ఆటలకు తోట, ధనంబుల పెట్టె, కొటారము,
పాఠశాల, ఉపాధ్యాయురాలు"- అని వివిధ రూపాలలో

అందగా ఉంటుందని చెప్తాడు. ప్రధానంగా దేశాన్ని సంపద్వంతం చెయ్యటంలో ఐకమత్యం అవసరమని అంటూ అప్పుడు కాంగ్రెసులోని కుమ్ములాటలూ, జస్టిస్ పార్టీలోని భేదాభిప్రాయాలూ, బ్రాహ్మణేతర ఉద్యమం పోయే (జాతీయ సమగ్రతకు విఘాతం కల్గించే) పోకడలను మనస్సులో ఉంచుకుని ఈ రచన ధర్మారావు చేసి ఉంటాడు.

విద్యాలయాల్లో బాలురు చేసే దైవప్రార్థన దేవుడ్ని వదిలేస్తే పిల్లలకు కూడా అర్థం కాదనీ - కనుక తేలిక పదాలతో చిన్నచిన్న భావాలు వారి

కర్థమయ్యేలాగ ప్రార్థన రూపంలో ఉండాలన్న అభిప్రాయాన్ని దీని చిన్న పీఠికలో చెప్పాడు. అందుకే రాశాననీ అన్నాడు

## తిక్కన పట్టాభిషేకము

అధ్యాపకత్వం ధర్మారావు చేత చాలా ప్రయోగాలు చేయించింది. విద్యార్థులను దృష్టిలో పెట్టుకుని రచనలో సారళ్యం సాధించాడు. దేశచరిత్ర, సాహిత్య చరిత్ర, దేశభక్తి, సరస్వతీ పూజ, కవి పూజల వంటి అనేక విషయాలను ఎలా బోధిస్తే విద్యార్థులను భావిపౌరులుగా తీర్చిదిద్దటానికి, అందుకు అన్ని విధాలుగా సన్నద్ధం చెయ్యటానికీ వీలుంటుందో ఆలోచించాడు. తన కవిత్వశక్తిని ఆధారంగా తీసికొని ఆచరించి చూపాడు.

ఇతర దేశాల్లో రాజకీయ, మత నాయకులకున్నంత గౌరవం సాహితీ వేత్తలకూ ఉంటుందని ఆయాదేశాల చరిత్రలు చూస్తే తెలుస్తుంది ఈనాటికీ అలాటి పరిస్థితే అక్కడ కొనసాగుతోంది. దేశం సాహితీ సాంస్కృతిక రంగాల్లో వెనుకబడ్డనాడు మరేరంగంలోనూ ముందుకడుగెయ్యలేదు. తన వారసత్వబలాన్ని తెలుసుకోకుండా, దాని మహత్వాన్ని గుర్తించకుండా అందుకు వేలాది కార్యకర్తలు ఎప్పటినుండో పడ్డ శ్రమను అర్థంచేసుకోకుండా మానవుడెప్పుడూ నిటారుగా తలెత్తి నిలబడలేడు. ఈ దిశగా విద్యార్థులనుండే కృషి ఆరంభం కావాలి. చక్కని వాతావరణంలో, ఆరోగ్యవంతమైన చారిత్రక అవగాహనతో వారికి కొత్తగాలులను పరిచయం చెయ్యాలి. శుభ్రమైన రక్తాన్ని ఎక్కించాలి. అందుకు గతంలోని మేలిమిని చారిత్రక దృష్టితో పరిచయం చెయ్యటం చాలా అవసరం.

ఇది బాగా తెలిసినవాడు గనుకనే తన కుమారుణ్ణ ఆలంబనంగా తీసికొని పిల్లలకు అర్థమయ్యే పదజాలంతో, తేలికగా గుర్తుంచుకోవటానికి వీలైన ఛందంలో అదీ పాడుకోటానికి వీలుగా సాహిత్యచరిత్రలో తిక్కన కథను తీర్చాడు. ఈ రచనకు ఆరంభం ఏ 1922-1923 అయినా అచ్చుకావటం 1932 సమదర్శిని ఉగాది సంచికలోనే. పత్రికలో అచ్చువడ్డనాటి దీని శీర్షిక "అపూర్వ పట్టాభిషేకము' అయితే అది పాత పాళీలో ముద్రణ కాలాసిక

'తిక్కన పట్టాభిషేకము'గా పరిణమించింది. దీనిని నెల్లూరులో జరిగిన తిక్కన జయంతిలో చదివాడు.

"ఆంధ్రులు రండు మా యన్నలు రండు
తెలుగుతల్లిగ నెంచు ధీరులు రండు
వాడవాడల తెల్గువారెల్ల రండ"ని పిలుస్తూ ఆరంభమైన ఈ

ఖండకృతిలో కవుల గొప్పతనం, వారిలో తిక్కన ప్రాశస్త్యం, ఆయనకు జరిగే పట్టాభిషేకం కోసం నిర్మించిన భవనాన్ని వర్ణిస్తాడు. అందులో తిక్కన కూర్చొనవలసిన సింహాసనం, అందరికీ పంపిన ఆహ్వానం, తిక్కన భారత రథం మీద సభకు రావటం, ఆరథంలో తిక్కన కూర్చొన్న వైభవం, ఆయన గుణకీర్తనం, పట్టాభిషేక మహోత్సవం, శారద వచ్చి ఇచ్చిన ఆశీర్వాద దృశ్యం, ఈ సందర్భంగా ఆంధ్ర సోదరులు తీసుకోవాల్సిన దృఢ ప్రతిజ్ఞ తదితరాలు వర్ణించడం జరిగింది.

కవి గొప్పతనాన్ని వివరిస్తూ-

''ఏ యుపాయము మదినెఱుగని వేళ
చెవిలోన మార్గంబు సెప్పగా వచ్చు
... .... .... .... .... .... ....
నీతుల మరి మరి నేర్పుచునుండు''

కష్టాల సమయంలో ఆదుకొనేవాడంటాడు. కవికి చావు లేదంటూ-

''కలకాలముండు నిక్కవిరాజు ధరను
మృతి నెన్నడెఱుగని బ్రతుకుగలట్టి''

వాడని, దివిజసమానుడని ప్రస్తుతిస్తాడు. రాజభక్తి, దేశభక్తిలాగా కవిభక్తిని ప్రదర్శించటం ప్రతి వ్యక్తికీ చాలా ఆవశ్యకమని చాటుతాడు.

భవన నిర్మాణమంటే సాహితీ సౌధం. అందులో శబ్దాలకున్న శ్లేష నుపయోగించుకుంటూ- గుణగౌరవాలు, నీరస భావం, అనర్ఘపదార్థాలు, భావం, కవనం, వృత్తాలు, చక్కని శైలి, శిల్పచాతుర్యం, కల్పనలు, నాతి గూఢాలైన నవ్య భావాలు, పాకాలు, రీతులు, వివిధ రసాలు, అలంకారాలు, నడకలు, శయ్యలు అనే సాహితీ ద్రవ్యాల నుపయోగించి చాలా అందంగా భవన నిర్మాణం సాగిస్తాడు ధర్మారావు. భవనాన్ని సంస్కరించాలంటూ

''చాలిన మట్టుకు సంస్కృతంబగుచు
ముద్దులొల్కగ నిండు మురిపెముల్ సూపి''

సర్వాంగశోభితంగా, సలక్షణ పూర్వకంగా పట్టాభిషేక సౌధ నిర్మాణం పూర్తి చెయ్యాలని అంటాడు.

భారత రథాశీనుడై తిక్కన రావటాన్ని అతి విపులంగా వర్ణించాడు. భారతంలో ఉండే లక్షణాలన్నీ రథం పరంగా అన్వయించాడు. ఈ రథం-

"కాంతి పొలివోకుండ, ఘనత పోకుండ
వన్నె తగ్గకయుండ వమ్ముగాకుండ
వేలు లక్షల యేండ్లు వెలయగాదగిన
ఘన పదార్థముతో గట్టిరిద్దాని"

అని దాని సార్వకాలీనతను, సార్వజనీనతనూ చెప్తూ

"భారతంబను పేర బ్రస్తుతిగాంచు
ధీరులౌ కవుల మనోరథంబిదియె"

అని ముగిస్తాడు. ఈ సందర్భంలో భారతంలోని వివిధ రసాలూ ఎంత సమయోచితంగా, సమర్ధవంతంగా నిర్వహించినట్లు కనిపిస్తాయో చెప్తూ-

"హాస్యరసంబటు నలరు వర్ణముల
నినుపబొమ్మలను నవ్వించెడు రీతి"

అంటూ చక్కని ఉదాహరణలిస్తూ పోతాడు.

ఇక తిక్కన రూపురేఖావిలాసాలనూ, గుణవిశేషాలనూ కొంత వర్ణించి చివరకు

"విసుగెఱుంగని సద్వివేకి బుధుండు
నతని వర్ణింప భారతమగుంగాదె" అని తన అసమర్థతను వ్యంగ్యంగా వ్యక్తపరుస్తూ ముగిస్తాడు.

ఈ ఉత్సవాన్ని ఆశీర్వదించి కిరీట ధారణం చేయించటానికి సాక్షాత్తూ శారదాదేవే వస్తుంది. ఆమెకి ఉంటాయనుకున్న నాలుగు చేతులకూ ఒకేసారి పని గల్గటం బహుశా ఆనాడే కావచ్చు.

"దేవి
కరముల రెంట సుందర కిరీటంబు
కవిరాజ సన్మస్తక ప్రశస్తంబు
దివిజ నిర్మితము, సందీప్యమానంబు
నొకదాని దిక్కన యుత్తమాంగమున
నుంచె జూచినవార లుబ్బి త్రుళ్ళంగ
మఱిరెండు కరముల గుఱియుచునుండె
కల్పక సుమము లక్షయములై మీద"

ఈ విధంగా భారతి తన కార్యక్రమాన్ని ముగిస్తుంది.

ఇంతటి గొప్ప సాహితీ బంధువుకు, కవిరాజుకు జరిగిన సన్మాన సందర్భంగా-

''ఆంధ్ర సోదరులార అందఱు మీరు
.... . .. .... . . ... .. .
తిక్కన వాక్కులు తృష దీఱ నెపుడు
పారాయణము సేయ బాస చేయుండు
.... ... .... . .. .... ....
తనయందు భక్తియే మన గౌరవముగ
బరికింప సుస్థిర భావంబు గనుడు''

అంటూ శపథం చేయమంటాడు ధర్మారావు. ప్రాచీన సాహిత్యాధ్యయనం నేరం కాదనీ, అందులోని వివిధాంశాలు తెలుసుకోవటం అవసరమనీ, ఆవిధంగా ఉన్నప్పుడే మన సాహిత్య పునాది దృఢంగా ఉంటుందనీ ధర్మారావు నమ్మాడు. అదే బాలురకు బోధించటం అవసరమని ఇలా రాశాడు.

# దోయ్యానము

చరిత్రను చరిత్రగా చదవటంవల్ల కొంత విసుగే కలగవచ్చు. చెప్పే తీరులో చెప్తే అందరికీ నచ్చుతుంది. అందులోనూ కథల్లే చెప్పటం, దాన్ని కవిత్వం పంచదారపూతతో నింపటం వల్ల ఇక పాఠకులను చదివించకేం చేస్తుంది. ఆ కిటుకు తెలిసిన ధర్మారావు దీనిని ఉపయోగించాడు. చరిత్రమీద వీరికి అభిమానం కలిగించింది గిడుగు రామ్మూర్తి. పర్లాకిమిడిలో ఎఫ్. ఎ. చదువుకుంటున్న కాలంలో ధర్మారావు చేత చరిత్రలో అధికారికంగా వచ్చిన గ్రంథాలన్నీ చదివించాడు. ఆ రిత్రను తేదీలూ, దండయాత్రల చాబితాగా కాకుండా ఏ విధంగా చెప్తే శ్రోతల గుండెలకు హత్తుకొంటుందో గిడుగు వారి పాఠం చెప్పే పద్ధతి నుండే ధర్మారావు నేర్చుకుని ఉంటాడు. ఒక పుస్తకాన్ని ఎలా చదవాలో గిడుగువారు సొంత గ్రంథాలయంనుండి పుస్తకాలిచ్చి ధర్మా రావు చేత చదివించినప్పుడే, గీతల్లేని పంక్తి కనబడక పోవటం ద్వారానే తెలిసుంటుంది. ఆ అనుభవాన్ని పది మందికీ పంచాలి. ఎలా ? ఇప్పటికే దేశ చరిత్రనూ సాహిత్య చరిత్రనూ కవిత్వపరంగా చెప్పటంలో ధర్మారావు

కొంత సాధన చేశాడు. ఈ ప్రక్రియ బాగా ఉపయోగపడుతుందనుకున్నాడు. 'ద్యోయానం' రాశాడు.

ఊర్కాడు సంస్థానం తమిళ ప్రాంతంలో ఉంది. అక్కడ ధర్మారావు పనిచేస్తున్న కాలంలో సాగిన రచన ఇది. అంటే 1925 కావచ్చు. అప్పటికి జస్టిస్ పార్టీతో సహా దేశం యావత్తూ గాంధీని మహాత్ముడు అంటున్నది. సత్యాగ్రహోద్యమంలో దేశం మొత్తం నిమగ్నమయ్యేలా చేశాడు గాంధీ. అతని బోధలను జాగ్రత్తగా అధ్యయనం చేస్తున్నప్పుడూ దేశ దారిద్ర్యాన్ని గురించిన ఆయన ఉపన్యాసాలను మననం చేసుకుంటున్నప్పుడూ ఈ రచన చేయాలనిపించిందని ధర్మారావు దీనికిచ్చిన టిప్పణికలో రాశాడు.

ఆర్యులు మన దేశానికి రాకముందు నుండి, ఆంగ్లేయులు మన దేశాన్ని దోచుకుంటున్న కాలం దాకానూ, గాంధీ భావాలూ - రాట్నమూ దేశానికి స్వరాజ్యమిప్పిస్తాయని దేశ ప్రజలు నమ్ముతున్న దశవరకూ ఘట్టాల వారీగా ఇందులో వర్ణించాడు. ఆయా ఘట్టాలను ఆవిష్కరించడానికి ఆకాశయానంలో పూవు జారటం వెలుగు రావటం ఆ వెలుగులో ఆ ఘట్టం కనరావటం అనే 'టెక్నిక్' ఉపయోగించుకున్నాడు. తాను చూసింది వర్ణించి నిజమైన కవి అనిపించుకున్నాడు. ఎందుకంటే లాటిన్ భాషలో వేట్స్ అంటే కవి. అంటే చూసేవాడు. కవి చెయ్యాల్సింది మూలంలో కల్పన చేయకుండా దాన్ని చెప్ప టంలో సౌందర్యం కోసం కల్పన చెయ్యొచ్చు.

"ఉన్నది కన్నటు వ్రాయుట
కన్న గవికి మేలు లేదుగద"

అని అంటాడు ధర్మారావు. అనవసరాలంకారాలు బరువులౌతాయనీ అంటాడు. గాంధీ భావాన్ని స్మరిస్తూ తృప్తితో కళ్ళు మూసుకుంటే వచ్చిన కలలో కని పించిన దృశ్యాలను చెప్పాడు. విమానాన్ని గూర్చి వర్ణిస్తూ చాలా సరళంగా పూర్వ కవి రచనను స్ఫురించేలా -

"సారథి సున్న, చక్రముల సంగతి శూన్యము తెక్కలుండునా
దారియుగాదు, ధూమపు విధానముగూడ హుళిక్కి విద్యు దా
ధారము లేదు కీళులును దంత్రులు నారయ బూజ్యమైన సం
చారము జేయ బైకెగసె జయ్యన నద్ది వియత్తలంబునన్"-

అని చెప్పారు. ఒక్కొక్క పువ్వును రాలుస్తుంటే - వేదాల్లో వర్ణించిన రూపాల్లో దస్యుల చర్యలనూ, ఆర్యులు తమ వస్తువాహనాదులూ సంప్రదాయాలతో భారతదేశం రావటం, క్రీ.పూ. 486 ప్రాంతపు పారసీక చక్రవర్తి డెరయస్ చరిత్ర.సూ.-క్రీ.పూ. 326లో అలెగ్జాండరు దండయాత్రా, పురుషోత్తముని ఎదురు

దాడీ,చంద్రగుప్త అశోకుల కాలమూ, పిశాచ పుత్రులని గిబ్బన్ తన 'రోము నాశం'లో వర్ణించిన హూణుల అనుపానులూ, క్రీ. శ. 11వ శతాబ్ది గజనీ దండయాత్ర సంపద కొల్లగొట్టటం, 12వ శతాబ్ది మహమ్మదు గోరీ కృత్యాలూ తైమూరు ధన సంపాదనాసరళి, మొగలాయీల ఐశ్వర్యమూ, 18వ శతాబ్ది నాదర్‌షా ప్రజా పీడనా కాలం, భారతదేశాన్ని 'వరాల తీగ'గా భావించి బుడతకీచులు, హూళిందులు ఆంగ్లేయులు, పరాసులు, వర్తక సంఘాల రూపంలో వచ్చి చేసిన దోపిడీ, అన్నిటినీ ఒక డాక్యుమెంటరీగా ఈ ద్యోయానంలో వర్ణించాడు.

ఇంతటి దోపిడీకి భారతదేశం గురైనా భారతీయులు మిగిలిన దాన్నే పంచుకుంటున్నారని

''చిటిపోటి బరువుల జీమలు
కుటిలగతిం గొంచుబోవు గుణలేశము'' లంటాడు.

భారత దేశ గత వైభవాన్ని వర్ణిస్తూ

''ఆకొను నెల్లలోకముల కన్నమవారిగ బెట్టి నాకముం
దాకు ననేక శాఖల సనాతన సత్కళలుట్టగా దివిం
బ్రాకుచు బూర్ణ శోభ దనివాటెడు గట్టి వరాలచెట్టు'' — అని

పొంగిపోతాడు రచయిత. ఈ విధంగా నేటి దేశస్థితిని -

"పొలమునెపుడొ దిష్టిబొమ్మకు గట్టిన
చింకి పాతయైన జిక్కనునుచు
దొంగిలించి మానముంగాచుకొనునట్టి
కటికి లేమి గాంచగలనె నేను'' - అని వర్ణిస్తాడు. ఇంతటి

దుర్భర దారిద్ర్యాన్ని కళ్లకు కట్టినట్టు వర్ణించడం ధర్మారావుకే చెల్లింది. ఎందుకంటే సంపదకున్న రెండంచులూ చూసిన వ్యక్తి ఆయన. మరికొన్ని దుర్భర దృశ్యాలను వర్ణిస్తూ ఇవన్నీ నిజమైన దేశభక్తుడికి "దేశభక్త నయనాళి నిపీడిన కంటకాకృతిన్" ఉన్నాయన్నాడు ఇక నీ దారిద్ర్యం చూడలేక పువ్వులన్నీ ఎత్తేయబోతే చేతిలో పుస్తకం, తానూ, చెరిగిన కలా నిలిచిందిట. అయితే మరి ఈ దారిద్ర్యాన్ని నాశనం చేయగల ఉపాయమేదైనా ఉందా అంటే -

"చటుల దరిద్రతా సమ విషాదము నాశమునంద మందు నా
కటిపెనుచిచ్చు లారగ దిగంబర దుస్సహ దైన్య వృత్తి యొ
క్కట మటుమాయమై చన జగంబు విడంబనలేని శాంతి దో
గుట గన జక్రరక్ష సమకూర్చుత'' - అని ఆశాభావం వ్యక్త

పరుస్తాడు. వీటన్నిటికీ 'చక్రం అడ్డేయా'లని దాని భావం. అంటే రాట్నమే ఈ దారిద్ర్య నిర్మూలనకు సాధనమని ధర్మారావు ఉద్దేశం.

ఈ రచన చేసిన కాలంలో జస్టిసుపార్టీ అభిప్రాయాలు క్రమక్రమంగా ధర్మారావులో తొలగిపోవటం ఆరంభించాయి. గాంధీ భావాలు స్మరణీయాలనీ, రాట్నం సంపదుత్పత్తికి ఆధారమవుతుందనీ ఒక ప్రజాస్వామికవాదిగా ధర్మారావు మనసులో ఏమూలో ఉంది. దేశప్రజానీకమంతా ఈయన సత్యాగ్రహమార్గంలో పోతుంటే జస్టిసుపార్టీ దాన్ని కాదనటం సబబేనా అన్న ఆలోచన కూడా వీరిలో అప్పుడప్పుడూ కలుగుతూండవచ్చు. లేకపోతే గాంధీ - హిందీ - ఖద్దరు టోపీలను అసహ్యించుకునే శిబిరంలో ఇలాటి భావాలు రావటం అంటే మార్పుకు గురౌతున్నకాలం అది. అయితే ఈ 'చక్రరక్ష' అంటే చర్ఖా అనీ, 'దివ్యగంధి' అంటే గాంధీ అన్న అధోజ్ఞాపికలను రచయిత ఈ 'ద్వ్యాయానము' తొలిసారిగా 1925 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురణ అయిన సందర్భంగా పేర్కొనకపోవటం గమనార్హం.

అతి సుందరమైన రచనగా సాగిన ఈ చరిత్రాత్మక ద్వ్యాయానికి ఇలియట్, ఎల్ఫిన్స్టన్, ఫెరిస్టా, పీలర్, గిబ్బన్‌ల రచనలూ మరికొన్నీ ఆధారాలని ధర్మారావు రాశాడు. చరిత్రను కవిత్వంలో పెట్టే పద్ధతిలో మార్గంవేసినవాళ్ళ పంక్తిలో వీరికో పెద్దపీట వెయ్యాలి.

## అక్షరశారదా ప్రశంస

ఒక సందర్భంలో రావుబహదూర్ బిరుదాన్నిస్తామంటే వద్దన్నట్లు తిరుమల రామచంద్ర కిచ్చిన ఇంటర్వ్యూలో ధర్మారావు అన్నాడు. (1972, ఆంధ్రప్రభ). ఆ రోజుల్లో ఇలాంటి బిరుదాలు చాలా మందికి ఇళ్ళపేర్లలా చెలామణీ అవుతూండేవి. తర్వాత వాళ్ళూ వీళ్ళూ సన్మానాలు చేసి ఏవేవో బిరుదుల్లాటివి ధర్మారావుకి తగిలించారు. కానీ అన్నీకాదని ఒక్క బిరుదాన్ని మాత్రమే తన రచనలమీద వాడుకున్నాడు ధర్మారావు. అదే 'ఆంధ్రవిశారద' అన్నది. ఈ బిరుదును అట్టేపెట్టుకోటానికి ఓ కథ ఉంది.

1926లో ధర్మారావు ఊర్కొడు జమీందారు దగ్గర పనిచేస్తున్నాడు. ఆ జమీందారు తెలుగు-అరవం అన్న భేదం లేకుండా దేవీ నవరాత్రుల

సమయంలో పండిత గోష్ఠులూ, ఉపన్యాసాలూ ఏర్పాటు చేసి అందర్ని సన్మా నిస్తుండేవారు. ఆ సంవత్సరం శృంగేరీ పీఠాధిపతులు జగద్గురు చంద్రశేఖర భారతీ శంకరాచార్యులు ఆ ఉత్సవాలలో పాల్గొన్నారు.

ధర్మారావు అప్పటికి కొద్దికాలం నుండి తెలుగులో 'ఓనమాలు' ఎలా వచ్చి ఉంటాయి, అక్షరాల ఆకారము, ఉచ్చారణ వంటి వాటిని గురించి శాస్త్రీయంగా పరిశోధిస్తూ కొంత సమాచారం సేకరించి ఉంచుకున్నాడు. సమయం సందర్భం రాక దాన్ని ఒక రూపంలో పెట్టి ప్రచురించలేదు. చిత్రలిపినుండి నేడున్న సుందరాక్షరాల వరకూ ఆయాకాలాల్లో వచ్చిన మార్పులతో పరిణామాన్ని వివరణలతో వ్యాసంగా రాయదగిందే కాని మరో ప్రక్రియలో ఇముడదు ఇది. అయినా కష్టతమమైనా పద్యాల్లో సరస్వతీ స్తోత్రరూపంలో ప్రయత్నించి రాస్తే ఎలాగుంటుందో చూద్దామనుకున్నాడు. మన పూర్వీకులు అనేక శాస్త్రాలను సైతం పద్యాలలో బంధించిన విషయాలు మనకేం కొత్తకావుగదా! అని సాహసించి ఈ ఉత్సవాలప్రేరణతో 'అక్షరశారదా ప్రశంస'ను రాశాడు. పండితుల, శృంగేరీ పీఠాధిపతుల సమక్షంలో చదివి వినిపించాడు. సర్వులూ శాబాసన్నారు. జగద్గురు చంద్రశేఖర భారతీ శంకరాచార్యులవారు పట్టలేని ఆనందంతో ఒక పట్టుశాలువా కప్పి 'ఆంధ్ర విశారదా' అని సంబోధిస్తూ ధర్మారావును ఇతోధికమైన కీర్తి ఆర్జించమని వెన్నుతట్టారు.

ధర్మారావు తర్వాతర్వాత ''ఒక వర్గానికి చెందిన మఠాధిపతుల కోటలో పాగా వేశామన్న దానికి గుర్తుగా దీన్నే ఉంచేసుకున్నా'' నని మిత్రులతో అంటూండేవాడు.

లిపిశాస్త్రం చాలా గట్టిది. దీన్ని పరిశోధించేవారికి అనేక అనుబంధ విషయాలు తెలియటం అవసరం. అయినా పారాన్నందుకోలేరు. హరప్పా, మొహంజొదారోలలో దొరికిన బిళ్ళలపైని లిపిని ఈనాటికీ చదవటానికి శాస్త్రవేత్తలు సతమతమవుతూ తీవ్రంగా కృషి చేస్తున్నారంటే దీనిలో ఉన్న శ్రమ అర్థమవుతుంది. ఈ పరిశోధనలో ధర్మారావు అప్పటికి తన కందుబాటులో ఉన్న గ్రంథాల నవలోకించిన పరిజ్ఞానంతో దీన్ని రాశాడు.

ఇందులో కొన్నిటికి కొత్త అర్థాలిస్తూ అన్వయం చేశాడు. 'వీణాపాణి' అంటాముగానీ 'పుస్తకపాణి' అని మొదట ప్రార్థనలో అనం. కనుక ఆదిలో అక్షరం శబ్దమయమనీ అందుకే వీణను సంకేతంగానూ, ఆ తర్వాతే అక్షరం అనీ అన్నాము- అంటే ఆకారం వచ్చిందనీ ధర్మారావు వివరణ ముఖేముఖే సరస్వతి అన్న దశ తొలిది అనీ ఆకారంగా రెండో దశ ఆవిర్భవించిందనీ

భావం. ఈ శ్రవణంలో మూడు రకాలైన లోపాలున్నాయనీ వాటిని సవరించిన తర్వాతే అక్షరం ఆవశ్యకమైందనీ అంటూ -

1. వక్తృ శ్రోత లొకేయడం గలియు నావశ్యంబునున్

2. శేముషీయుక్త స్ఫూర్తికి దత్ ప్రచారమున గాలోదగ్రవిచ్ఛిత్తి

3. యార్షోత్తంబుల్ బహుజిహ్వాలంగను నసత్యోద్రేకమున్-అని వివరణ లిస్తాడు.

మతానికి సంబంధించిన తాంత్రిక వ్యవహారాలలో అనేక మార్పులనూ ఈ అక్షరాలు పొందాయి. మొదట ఈ పరిణామాన్ని అక్షర రూపం ఎలా సంతరించుకుందో వివరిస్తూ పినిషియా భాషలో 'బెత్' అంటే గోడలున్న యిల్లు. బిత్, బెత్, బి గా, బె గా మారింది. అదే బి అనే ధ్వని. దీన్ని తెల్పే రూపం బిత్, బీటా గా అయింది. అలాగా ఆల్ఫా, బీటాలని చెప్తూ అస్సీరియాలో అక్షరం చెక్కడాన్ని 'లిఖున్' అంటారనీ దాని నుండి లిఖ్, లేఖిని వంటివి వచ్చాయనీ చెప్తాడు.

పేపర్ అని ఎలా వచ్చిందో, వర్ణమని అన్నదెందుకో చెబుతూ లిపి అన్నది ప్రాచీన భాషల్లో తొలి అక్షరాన్ని ఆలిఫ్ అనటం ద్వారా వచ్చిందనీ పుస్తకమన్నది 'పొస్త్' అంటే 'తోలు' అనీ ఆదిలో తోలుపట్టాలపై రాసి కుట్టి భద్రపరచటం వల్లనే ఆ పదం వాడుకలోకొచ్చిందని వివరించాడు.

బొమ్మల లిపి (హిరోగ్లిపిక్స్), కోణం, బాణం, శూలాల చిహ్నాలతో రాసిన లిపి (క్యూనిఫారం) ని చక్కని శైలిలో వర్ణించాడు. పాణిని అచ్, హల్ అని అన్నదాన్ని అందంగా

''పాణిని తానతో బడిగడుసుదనంపు బోకలనాడు దోబూచులాట'' - అని వర్ణించాడు. ఇలా పరిణామం చెందుతూ ''యౌవనంబిట్లమర లీల నచ్చుపడుట'' - అని ఇందులో అమరన్ లీలన్ అచ్చుపడుట - ముద్రణము : అమరలీలన్ - దేవతల వలె స్పష్టమగుట అనీ అచ్చుపడుట వలన నాశనం కాకుండా అమరత్వం పొందిందనీ అక్షరశారదను ''శాశ్వతాకార రేఖల జగతి మనెదు సార్ధనామంబ'' అని ప్రకీర్తిస్తాడు రచయిత.

ఒక సంఘం గొప్పతనాన్ని కానీ నాగరికతను కానీ అంచనా వెయ్యాలంటే ''సంఘముల సభ్యత లెన్న ప్రమాణమీవు'' అని అక్షరశారదను అంటూ -

''కత్తి కన్న మిన్న కలమ యనెడి మాట
నీదు సేవ మనుట గాదె కల్గె

కత్తి వలదు మాకు'' - అక్షరాలే కావాలి. సాహిత్యమే కావాలి. అనీ 'కలమ్' ను లాటిన్ భాషలో 'కలమస్' అంటారనీ దీనర్థం రెల్లు అనీ దాని పుల్లలతో రాసేవారనీ వివరిస్తాడు. రాత తప్పును లాప్సూ కాలమీ అని లాటిన్ భాషలో అంటారు. అంటే కలం చేసిన పొరపాటని అర్థం.

ఈ విధంగా ఎవరూ ఊహించని రీతిలో అక్షరాల పుట్టుపూర్వోత్తరాలను ఈ ప్రశంసలో తెలియచెప్పాడు. ఇదొక సర్కస్ ఫీటనచ్చు. ఐనా పాఠకుల మనస్సులకు వివరణలతో ఎక్కుతుంది. ధర్మారావు దీనికి సంబంధించిన సమాచారాన్ని 'ఓనమాలు' గా సేకరించాడు. అవి అచ్చుకాలేదు. అసంపూర్తిగా మిగిలి ఉంది.

శబ్దాలు అపౌరుషేయాలనేవాళ్ళ శిబిరంలోకెళ్ళి సశాస్త్రీయంగా ఇవన్నీ తరతరాల మానవ శ్రమకు సంకేతాలనీ ప్రతి పదం వెనకా తెలుసుకోదగ్గ చరిత్ర ఉందనీ అంటూ వాళ్ళకో అధునాతన శాస్త్రాన్ని అందించి ఔనని తల లూపించిన ధర్మారావును ఇతరులేకాదు శంకరాచార్యులు 'ఆంధ్రవిశారదా' అనటంలో ఆశ్చర్యం లేదు. దీన్ని ఆనాడు 1926 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో చదివిన పాఠకులూ ముక్కుమీద వేలేసుకుని ఉంటా రనటంలో అబ్బురం లేదు.

ఈ బహూకరణ సమయంలో శంకరాచార్యులను సంబోధిస్తూ 'గురువుల కర్తవ్యము' అన్న ఖండికను రాశాడు. ఇది మరికొన్ని పద్యాలతో 'మబ్బు తెరలు' సంపుటిలో కనిపిస్తుంది. లోకంలో ఆనాడు బౌద్ధం తదితర అవైదిక మతాలు ప్రాచుర్యం వహిస్తున్నప్పుడు శంకరాచార్యులు వైదికమత ప్రతిష్ఠాపనకూ, తదితర అవైదికాల ఖండనకూ కృషిచేశాడు. ఈనాడు కూడా మీరు 'మేలె గణించి లోకము సమీహిత మార్గమునందు ద్రిప్పగన్" - కృషి చేయవలసిందని విజ్ఞప్తి చేశాడు. లోకంలో శాంతి స్థాపనకు కంకణం కట్టుకొమ్మంటాడు. అదే నేటి గురువులు చెయ్యాల్సిన కర్తవ్యమన్నాడు. తనకు చిన్నతనం నుండే కవిత్వం రాస్తూ శారదామాత సేవ చేసే అలవాటుందనీ, అందుకు జీతం కానీ, ధనం కానీ, సుఖాలు కానీ, కోరలేదనీ తనకు చాలా సమాజాలు సన్మానాలు చేసినా మీ ప్రోత్సాహాన్నే కోరుకుంటున్నాననీ అంటాడు.

వారిచేత పట్టుశాలువా బహూకరణ పొందింతర్వాత

"నా భాగ్యంబున నేడిటు
లో భవ్యగుణాఢ్యులార యున్నతపదవీ
లాభం బందితి దమకృప
నీ భవము కృతార్థమయ్యె నౌ ధన్యుండన్.

వాంఛనీయంబు పండిత ప్రదిమ మెపుడు
నా కృతజ్ఞత మనసార మీకొసగెద
నిట్టు సత్కృపమునగ దీవింపుడనుచు
శరణు వేడెద వందన శతములిడుచు'' (ఇంతవరకూ ప్రకటితం కాలేదు). అని అందరికీ తమ కృతజ్ఞతలను రచయిత తెల్పుకున్నాడు.

## భిక్షా పాత్రము

ధర్మారావు జీవితంలో మబ్బుతెరలు పలు పర్యాయాలు కమ్మాయి అయితే తెరలున్నప్పుడు కుంగటం, అవి పోగాన్నే పొంగటం వారి లక్షణం కాదు. రచయితకు ఆస్తి రచనలు. అవి ముద్రణ భాగ్యానికి నోచుకోనప్పుడు పడే బాధ అనంతం. అలాటి సంఘటనలు వీరి జీవితంలోనూ చాలాసార్లు వచ్చాయని భిక్షాపాత్రం చెప్తుంది.

విజయనగరంలో ట్యుటోరియల్ కళాశాల నడుపుతూ రాత్రింబవళ్లు శ్రమిస్తూ కుటుంబాన్ని నడుపుకుంటూన్నాడు ధర్మారావు. అప్పటికే పలు జమీల్లో ఉద్యోగాలు చేసి పిల్ల జమీందారులా కాలం గడిపాడు. కనుసన్నల్లో సేవకుల చేత పనులు చేయించుకున్నాడు. అప్పట్లో వీరి మాటే చాలు జమీందార్ల దగ్గర సాహిత్యకారుల పంట పండటానికి.

ఆ స్థితినుండి ప్రస్తుత పరిస్థితిని ఆత్మావలోకనంగా ధర్మారావు చూసుకున్నాడు. దైన్యం - పేదరికం రెండూ ఇరువైపులా చేరి నవ్వుతున్నాయి. కుటుంబం పెరుగుతోంది. పిల్లలు చదువులకొస్తున్నారు. ఆ దశలో పేదరికానికి చిహ్నంగా 'భిక్షాపాత్రం' అన్న ఒక కవిత రాశాడు. 1927 లో అయి ఉంటుంది. 1929 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో అచ్చయింది.

చుక్కలాగా వచ్చి క్రమంగా పెరిగి అదే భిక్షాపాత్ర ఆకారాన్ని పొందింది. ఎప్పుడూ - ''తొలి యర్థములెల్ల యదృశ్యమై చనన్''. ఇక ఎటు చూసినా అదే ప్రత్యక్షం కావటం ఆరంభించింది. ఏ రచన చేద్దామన్నా అందు కనుకూలమైన సాంధ్యరాగం కానీ, కోకిల రావం కానీ, మలయ సమీరంకానీ, సుమపరిమళం కానీ, స్వాదుభోజనం కానీ ఏది మనసుకు తట్టినా వాటి పక్కనే భిక్షాపాత్ర కూడా కనిపిస్తూంది కవికి. ఆ పాత్రకే రూపం వచ్చి నోరు తెరిచి

కవి చుట్టూ ఉన్న ఉపద్రవాన్ని వేలెత్తి చూపి పరిహాసం చేస్తోంది. తానే ఇక కవికి దిక్కని హెచ్చరిస్తోంది. మొదట్లో ఈ చింతకు లొంగినా ధైర్యంగా ఎదుర్కొని, కనిపించని దయామయుడైన లోకబాంధవుడుంటే నా చేతికి చిప్పెందుకు పోపొమ్మని తరిమేస్తాడు.

ఈ దశ సాధారణంగా కవులందరికీ ఎప్పుడో ఒకప్పుడు సంభవించేదే. కవులకుండే దారిద్ర్యాన్ని వర్ణించడంలో ధర్మారావు చాలా సొగసులు చూపాడు. రచయిత రాసిన రచనలు అచ్చుకెళ్ళటానికి డబ్బులేనందుకు సిరా కూడా తెల్లబడటాన్ని, మంచి భావాలను రాయడానికి కాగితాలు కలం సంపాదించలేక పోవడాన్నీ చూపుతూ అంతకు ముందే ''అపహ్నుతమగు విత్తమత్త కుండగ జూపి'' నవ్వటాన్నీ, ఇంటికొచ్చి పోయే బంధువులను పోషించటానికి ఆర్జించే కాస్తా ఖర్చయిపోవడాన్నీ భిక్షాపాత్రం చూపి గేలిచేస్తోందిట. ఇందులో చుండిలో ఉండగా ధర్మారావు పోగొట్టుకున్న ధనం ప్రస్తావన కూడా తెస్తాడు విద్వాన్ విశ్వంతో అంటూండేవాడట ''బ్రదర్, మనిల్లు ఎప్పుడూ హౌరా స్టేషన్'' అని. రణగొణ ధ్వని - వచ్చేపోయే వారి రద్దీ. దీన్ని ఇందులోనూ "సజ్జనాప్త సంపోషణ సక్రమ వ్యయాధరీకృత కష్టసమార్జితాల వేతనము'' అని సుదీర్ఘ సమాసం వేసి ఆబాధ లెంత దీర్ఘతమాలో చెప్పాడు విడదీయరాక కుటుంబంతో ఎలా సమసి ఉంటాయో సూచించాడు.

ఈ భయంకర భిక్షాపాత్ర, "తర్జనభర్జన భీకరాకృతి'' ని చూసి రచయిత లొంగిపోక గుండె దిటవు చేసుకుంటాడు. మెల్లిగా తిరగబడే యత్నంలో తన వాదనను దానికిలా వినిపిస్తాడు.

"శిక్షాబుద్ధులు లేరె యెయ్యెడల ? వాసింగాంచు సత్పాత్రతా
రక్షాదీక్షులు లేరె ? సత్కవి దరిద్రక్లేశ నిర్మూలనా
దక్షుల్ లేరె వదాన్యశేఖర పవిత్రంబైన యాంధ్రావనిన్ ?
భిక్షాపాత్రమ యేల నాపయి నిటుల్ బీభత్సముంజూపెదో''-అని

అంటూ తెలుగుదేశంలోని సాహితీపోషకుల మీదా విద్యావంతుల మీదా తనకున్న విశ్వాసాన్ని వెల్లడిస్తాడు.

తను గుడ్డివాడైనాడా ? శరీరం వణుకుతోందా? బుద్ధి మందగించిందా ? ఎందుకు ఈ చిప్పను పట్టుకుని యాచించాలని అంటూ 'ఆంధ్రజననీ సేవాస్థ' తనలో తగ్గనంత కాలం తన్ను లోకం పోషిస్తుందని దేశసేవకులకూ - బుద్ధిజీవులకూ దారిద్ర్యం అంటదని కాలు నిలదొక్కుకొని చెప్తాడు.

భావాలు, దానికి తగిన పదాలు ఇవి కలగలిపి అల్లగల్గిన కవిత్వం

క్షీరాబ్ధి లా దగ్గరున్నంత వరకూ నీ దయ నాకక్కర్లేదని భిక్షాపాత్ర మీద రచయిత తిరస్కారం.

తన్ను చేరిన బంధువులకోసమో సారస్వతాన్ని రక్షించటం కోసమో కానీ "లక్షింపంజూమనిన్ను లేఖిని కరాలగ్నంబుగానున్నచో భిక్షాపాత్రమ"- అని ధిక్కరిస్తాడు. ఏశ్రమాలేకుండా కొద్దో గొప్పో నేర్చిన విద్యజూపి తన పొట్టపట్టుకుని దేవుళ్ళాడువారి లాగా "నేనుంబోయి యాచింతునే" - అని ఆత్మగౌరవాన్ని నిలబెడ్తాడు. ఈలోకంలో

"దాన కలావిశారదులు సత్య ప్రాభవోదారు, లాం
ధ్రక్షాత్రోచిత బుద్ధి గొందఱిలనుండన్ నన్ను తాడింతువే?"

అంటూ క్షత్రియులైన రాజపోషకులుండగా నీవంటే నాకేం భయం లేదని ధైర్యంగా "నిష్పక్షాత్ముండ - దయామయుండు నను గావన్ కల్గ నిన్నెంతునే" అని ఛీత్కారం చేస్తాడు.

దరిద్రంతో జరిపిన పోరాటంలో అడుగడుగునా ఓడిపోవాల్సిన ఘట్టాలలో ఏ విధంగా ధైర్యాన్ని - స్థయిర్యాన్నీ చిక్కబట్టుకోవాలో తన పరంగా కవిలోకానికి ధర్మారావు ఈ భిక్షాపాత్ర ఖండికలో ఒక సూచన చేశాడు. చివరికి కవే జయిస్తాడన్న ఆశాదీపాన్ని వెలిగిస్తాడు.

## నిరశ్రు రోదనము

ఏడ్పును గురించి లోకంలో - అదీ సాహితీలోకంలో - బాగా పేరుపడ్డ వాడు "నన్ను మనసారగా నేడ్వనీరు మీర"న్న వాడు గతంలో కావ్యాల్లో పాత్రలు పలువిధాలుగా ఏడవటాలను చదివాం. అయితే ఇప్పుడు "ఏడవజాలనందులకె నేడ్చెద"నన్న వాణ్ణి ధర్మారావు ఒక్కడినే చూడచ్చు.

మనసులో పేరుకున్న దుఃఖం అలాగే అణుచుకోవటం చాలా ప్రమాదకరం. దాన్ని బయటకు చెప్పుకోవటం ద్వారానో ఏడ్వటం మూలానో వెళ్ళగక్కితే మనస్సు తేలికపుతుంది. మానసిక శాస్త్రవేత్తలుకూడా ఈ అభిప్రాయాన్నే కల్గి ఉన్నారు. ఆయా అనుభూతులకు తగిన స్పందన వెలిగక్కకొని రావటం సహజం. గుక్కపట్టినవాణ్ణయినా కదిపి, కుదిపి ఏడ్చేలా చేస్తారంటే ఏరాలా బిగువులొదిలి స్వాస్థ్యం కలుగుతుందనే.

ఆ రోదనం స్వాభావికంగా కన్నీటి సాహచర్యంతో వెలికొస్తుంది. అలా కానప్పుడది నిరశ్రురోదనమే. గుండె బరువు తగ్గటంలో అశ్రువులు రాలటం సాయం చేస్తుంది. హఠాత్తుగా ఊహించని సంఘటన కళ్ళముందు జరిగినప్పుడుగానీ, ఊహించిందే అనుకోని సమయంలో విన్నప్పుడుగానీ ఇంద్రియాలు మొద్దుబారి వాటి పనులు మానేస్తాయి. మరో కారణం కష్టాల్లో మునిగి ఏడ్చి ఏడ్చి ఎర్రబారినవాడి కళ్ళల్లో ఇక నీళ్ళు ఉండవు. గుండె బండబారుతుంది. గుడ్లల్లో నీరావిరౌతుంది.

ధర్మారావు 'నిరశ్రురోదనం' అలాటి కష్టాల కొలిమిలో కాలి కాలి ఎర్రబారిన సమయంలోనిది. తనకు మద్రాసులో 70వ జన్మదినం సాహితీ వేత్తలు జరిపిన సందర్భంగా మాట్లాడ్తూ ఇదే అంటాడు ధర్మారావు. నా జీవితంలో కన్నీళ్ళకు సైతం ఏడ్చిన రోజులున్నాయని - అంతగా మొద్దుబారింది నా హృదయం అని

'నిరశ్రురోదనం' వృత్తాల్లో నాగిన అందమైన రచన. 1929 భారతి మాఘం సంచికలో వచ్చింది. ఈ కాలానికి వీరు బొబ్బిలి రాజా ఆంతరంగిక కార్యదర్శిగా, వారి సోదరులు చిక్కవరం జమీందార్‌గారికి ట్యూటర్‌గా, బొబ్బిలి సంస్థానానికి మేనేజర్- దివానుగా ఉన్నారు. ఆనందడోలికల్లో ఊగులాడుతున్నా దీని రచనాకాలం మాత్రం అంతకు ముందు విజయనగరావాసం కావచ్చు (1927). అప్పుడు దరిద్ర నారాయణుడితో చెలిమి.

తన దుఃఖం ఇతరులకు కూడా దుస్సహంగా నాడు పరిణమించిందని

''ఈ, యొడలు గుటుంబమున్ కులము
నూరును దేశము - నింతయేల- యీ
పుడమి సమస్తమున్ వెతల
ముంపగ జాలిన నాదు ఖేదము'' - అని అంటాడు. తన జీవితంలో పడిన అవమానాలకూ బాధలకూ ఒక్కొక్క చుక్క చొప్పున వచ్చినా పైకి పొర్లేటన్ని కన్నీళ్ళురావచ్చని కవిఊహ. ప్రస్తుతం తాను కూడూ-గూడూ కోసం ఏడవటం లేదనీ, ''బాష్పములకున్ కొఱగల్గుట యేమి లేమియో'' ఈ దారిద్ర్యంకోసం ఏడుస్తున్నానంటారు. దరిద్రం పెరగదంటారు కొందరు. ఇది వట్టి అబద్ధమని నేనున్నాను చాటటానికి. కానీ కొద్దిగా కన్నీరొస్తే ఆ పని చేస్తాను. కానీ అవి పైకి రావటంలేదు. బహుశా నా కష్టాల వేడిలో ''నీరస రూపమై చనెనొ నిశ్వసనానిల ఘాత ధూతమై'' అని వాపోతాడు. కన్నీటి మహోత్కృష్టి చెప్తూ చివరకు ''అనూన మనఃపరితాపమార్చగా

జిత్తడి జల్లులచ్చుప్పులు'' - అంటాడు. ఆ విధమైన జల్లులు కూడా తన జీవితంలో కొరవడి మానసికానందాన్ని కాటేస్తున్నాయంటాడు రచయిత.

ధనం లేనందుకేడ్వననీ, తాను చేపట్టిన ఉద్యమాలు అర్ధాంతరంగా నాశనమైతే ఏడవననీ, తన భార్యా బిడ్డలు దరిద్రంలో కొట్టుమిట్టాడుతున్నా ఏడవననీ, చివరకు 'గైతకున్ గాడితడు' అని అన్నా దుఃఖించననీ అంటూ "కంటికి మంటికి నేకధారగా నేడువజాలనందులకె యేడ్చెద దోడ్పడరారె యశ్రువుల్" అని సాయం అపేక్షిస్తాడు ధర్మారావు.

దొరకాలనుకున్న వస్తువు అతి ప్రయాస మీద, చాలా కాలానికి లభిస్తే ఎవరయినా ఏం చేస్తారో ధర్మారావు ఈ పద్యంలో వివరిస్తాడు.

''. . ఒక్కసారి నయ
నోష్ణజలంబుల భాగ్యమిమ్ము; చాల్
త్రావుదు బూనికొందు దిశలం బడజిమ్ముదు భూమి జల్లుదు
న్నావెత లెల్ల చెల్లెనని నమ్ముదు నందుల నీదులాడుదున్" —
ఇంతకన్న పరాకాష్ట మరోటుండదు.

తనకున్న కన్నీటి భాగ్యం లేనందుకు వగచి, ఆ భాగ్యశాలురనూ, వారు చేసుకున్న పుణ్యాన్నీ పొగడటం ఆరంభిస్తాడు. "పారము ముట్ట నేడ్వ గల వారలదెంత తపంబొనర్చిరో" - ఏడ్చే పద్ధతులనూ దృశ్యాన్నీ కళ్ళ ముందు కట్టినట్టు మరో రెండు పద్యాల్లో వర్ణించి తనకూ కన్నీళ్ళొచ్చాయన్న తృప్తితో శ్వాస పీలుస్తాడు.

తన కన్నీరు కష్టాలనుండి జనించింది కనుక అది

''. జగంబులను, గల్గిన వస్తుల దేని మీద నేన్
తటుకునబడ్డ, నద్ది శతధా తుమురై దరికొంచు సర్వమున్
జటిలత గాల్చు నంచు నాకొ, నల్వ - యొసంగవు నాకు
నశ్రువుల్."

బ్రహ్మను తిడ్తూ కష్టాల సామ్రాజ్యాధిపతికి కన్నీళ్లేమిటి ? అని విధాత తనకివ్వలేదంటూ ఒక పెద్ద సమాసాన్ని నడిపి కన్నీళ్లన్నవి "స్వల్పమగు నార్తికర్షమౌ నశ్రుకణము" - కనుక తానా సీమ దాటాననీ అందుకే కన్నీళ్ళింకాయనీ తనను తాను బుజ్జగించుకుంటాడు రచయిత.

ఇలాటి విషయం సాధారణంగా ఎవరూ ఊహించరు. కన్నీళ్ళు రాకపోతే ఇంతేడుపా - అని అనిపించేంతగానూ, కన్నీళ్ల అవసరం ఇంతన్నమాట అని ఆశ్చర్యం కలిగేటంతగానూ చాలా ప్రసన్నంగా సాగింది ఈ రచన. ఇది

ఒకరకంగా మానసిక శాస్త్రాన్ని విడమర్చి చెప్పే అసాధారణమైన శాస్త్రీయ కవితా రూపం అనచ్చు.

## దాంపత్యము - శృంగారము

పెళ్ళితో ప్రేమకూ - శృంగారానికీ స్వస్తి అన్న భావం కొందరిలో ఉంది. చలంకూడా తన రచనల్లో ఇలాంటి అభిప్రాయం కలిగేలా రాస్తూంటాడు. వీటన్నిటికీ తోడు మన కావ్యాలేవి పట్టుకున్నా పెళ్ళికి ముందూ — తర్వాతా విప్రలంభంలోనూ తప్ప శృంగారం లేదన్నంతగా వర్ణనలు సాక్ష్యాలు పలుకుతుంటాయి. అయితే నిజంగా దాంపత్య జీవితంలో శృంగారానికి చోటుండదా ? సంసారానికీ శృంగారానికీ సవతిపోరా ? ఇది చర్చించాల్సిన విషయమే.

ధర్మారావు ఊర్కాడునుండి తిరిగొచ్చింతర్వాత సారస్వత యాత్రలు చేస్తూండేవాడు. విజయనగరంలో ట్యుటోరియల్ కాలేజీ నడిపే కాలం, 1927 - 1928 విజయనగరం కళాశాలలోనూ, ఇతర ప్రాంతాల కళాశాలల్లోనూ, సంస్థల్లోనూ జరిగే సాహిత్య సమావేశాలకు హాజరవుతూ విజయవిలాసాన్ని అతిరుచ్యంగా జనానికి నివేదిస్తూండేవాడు. కొడవటిగంటి కుటుంబరావు ధర్మారావును తొలిసారి కన్నదీ, విన్నదీ ఇలాటి సాహిత్యసభ విజయనగరంలో జరిగినప్పుడే. అలాగే దేవులపల్లి కృష్ణశాస్త్రికి ధర్మారావుతో పరిచయం ఇలాటి ఓ సభలోనే కలిగింది. అప్పటికే ధర్మారావు లబ్ధప్రతిష్టులు. అనేక ఉద్యోగాలు చేస్తూకూడా సాహిత్యరంగంలో తనకో పీట వేయించుకున్నవాడు. అంతకుముందు భాషావిషయకంగా గ్రాంథిక భాషావాదుల గుర్తింపు పొందితే, ఇప్పుడు విజయవిలాస చర్చలద్వారా సాహిత్యకారుల - పండిత ప్రకాండుల గుర్తింపు పొందుతున్నాడు. అలాటి యాత్రల్లో ఒక సందర్భంలో ధర్మారావుకూ మిత్రులకూ మధ్య "సంసారంలో శృంగారముండదు - పడకలతోనూ కొడుకులతోనే సరిపోతుంది" అన్నది ఎంతవరకూ నిజమన్న మీమాంస తలెత్తింది.

ఆ చర్చే 'దాంపత్యమూ - శృంగారము' అన్న రచనగా ఆకారం పొంది 1928 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురతైంది.

దీనికి ఘట్టాలను స్వీయజీవితం నుండే రచయిత తీసుకున్నాడు. సంభాషణాత్మక రూపంలో ఇమిడ్చాడు. భార్యాభర్తల సంభాషణలో దీన్ని చర్చకు పెట్టి తమ సంసారంలో ఎదురైన శృంగార రస ఘట్టాలను ఉదాహరిస్తూ ఇలాటివి అందరి జీవితాలలోనూ ఉండటం చాలా సహజమనీ కనుక దాంపత్యం ఆరంభమైన చోట శృంగారం అంతమవుతుందన్న వాదన తప్పని రుజువు చేస్తాడు.

కావ్యాల్లో చెప్పిన శృంగారం దురభిప్రాయాన్ని ఎందుకు కలిగిస్తుందని ప్రశ్నించుకొని భర్త జవాబిస్తూ -

''పెండిలి నాటినుండియు బవిత్ర గృహస్థ విశేషధర్మ బ
ద్ధుండయి పూనగా వలె జతుర్విధ సత్పురుషార్థ దీక్ష నెవండు''

అని చెప్పటానికే రాశానంటాడు.

సంసారంలో శృంగారం లేకపోవటానికి కారణం కనిపించిందంటూ శృంగార రసావిష్కృతికి కారణాలైన -

''సుధాంశు కాంతిగల యింపులయించునా
సాంధ్యరాగపున్ లీలలు మాయమౌనా
రమణీయ వసంతమురాదొ
యౌవనోష్ణ రుధిరంబు శరీరములందు బర్వదో?''

ఇవన్నీ లేకుండా ఎక్కడికి పోతాయి. ఇవన్నీ ఉండేమాట నిజం కనుక శృంగారం ఉండటంకూడా సత్యమేనని నిర్ధారిస్తుంది భార్య.

- భర్త ఉన్నతి చూసి ఆనందించే భార్య చూపుల్లోనూ,

- భార్యకు ఏపంత బాధ కలిగితే దగ్గరున్న భర్త చూసే చూపుల్లోనూ, శృంగారం కాక మరేవిటంటూ రచయిత నిలదీస్తాడు.

సంభాషణాత్మకంగా ఒక పద్యంలో -

''ముక్కు మొగంబు మీవె మనముద్దులపట్టికి
దేహకాంతులివ్వెక్కడ గల్గె
మీరెఱుగరెప్పుడు నాయెద బాయకుండ మీ
యక్కమనీయ కాంతి సముదగ్రత నుండు''-

అంటూ ఒక ఉత్పలంలో అందంగా అంటాడు ధర్మారావు.

భర్త భార్యతో అద్దమైన బొమ్మకల్లా మొక్కావు, కనబడ్డ దేవుడికల్లా సాష్టాంగ పడ్డావు,

''ఏ కోర్కెతో నారీ నీవన.'' ''నేమొ పొందను''
''విధానంబందు గాన్పించు శృంగారార్థంబు''

అని ఉభయులూ తీర్పిస్తారు. భార్యాభర్తలిద్దరూ కలిసి తమ పిల్లలు ఒకళ్ళను మించి మరొకళ్ళకు అందంగా కనిపించినప్పుడు ఆ దంపతుల ముఖాలపై తేలియాడే

''లేనగు తేట చాలదే
వెడగు ప్రబంధ వర్ణనల
వేయిని చీయని తూలనాడగన్''

అని రచయిత దాంపత్యం, శృంగారం జంటగా ఇంట వర్తిస్తాయంటాడు. మిత్రులకందరికీ తన తీర్పు పత్రికాముఖంగా కావ్యరూపంలో చెప్పేశాడు ధర్మారావు.

## స్వర్ణఖండము

గోరుచుట్టుమీద రోకటిపోటులాగా కష్టాల దొంతరలో పడ్డ రచయిత బాధను వ్యక్తంచేసే చిన్న ఖండిక. కేవలం రెండే వృత్తాలు. పేరు 'స్వర్ణ ఖండము'. భారతి 1929 జులై సంచికలో ప్రచురితమైంది.

ఐతే ఇందులో దుఃఖాన్ని పారదోలటం అవసరమన్న నీతిని ధర్మారావు ప్రతిపాదిస్తూ బంగారాన్ని ఉదాహరణంగా స్వీకరిస్తాడు. ఖనిజం విలువ కష్టాల కొలిమిలో రంగు తేలుతుందే కానీ తగ్గదనీ, ఈ క్రమమంతా పూర్తయిన తర్వాతనే అలంకార రూపం సాధించుకొంటుందనీ - మానవుల శిరోభూషణంగా అలరారుతుందనీ అంటూ తాత్కాలిక కష్టాలనుండి పారిపోవద్దనీ జడిసి కుంగద్దనీ ఊరట చెప్పుకుంటాడు రచయిత.

మనిషి బాధలు చెప్పుకుంటే వినే నాధుడు లేనప్పుడూ, చెప్పుకుంటే కొన్ని సందర్భాల్లో పదిమంది మధ్యా తేలిక కావచ్చుని భావించుకున్నప్పుడూ ఈ రకంగా స్వయంగా తన వీపు తానే చరుచుకుంటూ గుండెనిటవు చేసుకోవటం అవసరం.

ఈ స్వర్ణ ఖండంలో ధర్మారావు చేసిందదే. బంగారమ్మునక్క నద్దం పెట్టుకుని అన్యాపదేశంగా-

''అకారణ మట్టుల గ్రౌర్యమూన దుర్భరమగునెంచరు''

అని తన భావాన్నే వెల్లడిస్తాడు. ఏదో ఒక చిన్న దోషం - నేరస్థునిలో

ఉన్నందుకే ఇలా నిప్పులో ఊదారనీ, మంచి కాలం సమీపించబోతోందనీ

"నీవు విభూషణార్హమవు నిక్కమె"

అని అంటూ

"నీ గుణ మహీనముగా నుతిగాంచు గాంచుమా
భూవలయాధినాధ పరిపూజిత సుస్థిరగౌరవోన్నతుల్".

- అని బాధ పడే వ్యక్తిని సముదాయించి భవిష్యద్దర్శనం చేయిస్తాడు కవి.

రెండే పద్యాలైనా ఒకటి కవిబాధ - రెండోది దానికి సమాధానం. అందంగా సరళంగా వచ్చిన చిన్న 'బంగారమ్మొక్క' ఇది. బొబ్బిలిలో ఉద్యోగం ముగిసి, సమదర్శిని సంపాదకత్వ బాధ్యతలు స్వీకరించే మధ్య నిరుద్యోగ కాలంలో (1929) దీన్ని రాసి ఉంటారు.

## విచారణ దినము

భావకవిత్వం పంట తెలుగుదేశంలో పండుతున్న కాలంలో సాంప్రదాయిక సాహితీవేత్తల్లో కలవరపాటు సహజం. రాయప్రోలు వారన్నట్టు –

"క్రొత్త నీరు తొల్కరి ఏళ్ళ గ్రుమ్మిపార
ప్రాత నీరు కలంగు టబ్బమ్మొకాదె"

నిజమే. కానీ ఆ భావకవిత్వాన్ని ఈసడించుకున్న వారి కారణాలు కూడా అర్థం చేసుకోవటం అవసరం. కేవలం 'కొత్తొకవింత పాతొకరోత' అని సమర్థించగూడదు. లోకానికి ఆ కొత్త దాని గుణావగుణాలు తెలియటం చాలా అవసరం. అలా కాకుండా తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళంటూ సమర్థించటం అసమంజసం.

సరే - దీన్ని ఎలా తేల్చాలి? ధర్మారావు అప్పటికి సాంప్రదాయిక వాదులు. ప్రబంధకవితా సంప్రదాయాన్ని ముందుకు తీసుకెళ్ళాలన్న తలంపున్నవాడు. పరవళ్ళతో వస్తోంది భావకవిత్వ ఝరి. దాన్ని ఎలాగైనా ఆపాలన్నది నాటి వారి తపన. మోకాళ్లడ్డం వేస్తున్నారు. అయితే ధర్మారావు తర్వాత తమ పొరపాటును తెలుసుకున్నాడు. అభిప్రాయాన్ని మార్చుకున్నాడు.

ప్రబంధ కవిత్వ సంప్రదాయాన్నే మేలైందిగా నిరూపించాలి. దీనికో ధృశ్యాన్ని తయారుచేశాడు. 'ప్రజా కోర్టు'ను ఏర్పాటుచేశాడు. కవిత్వమంటే

ఏమో ఎరిగిన ప్రజలు సభాసదులు. అధ్యక్షత వహించిన న్యాయాధిపతి సరస్వతి.

పూర్వ కవి - ఆధునిక భావకవులిద్దరూ తమతమ వాదోపవాదాలు వినిపించాలి. సభాసదుల సమక్షంలో న్యాయాధిపతీ, సభాసదులూ కల్సి తీర్పు ఇస్తారు. బోనులో భావకవిని నిల్పాడు. నేరారోపణ ఆరంభమైంది.

తరాలనుండీ వచ్చిన సాహిత్య సంపదలో నీకెంత లభించింది? దానిలో ఎంత భాగానికి నీ శక్తి యుక్తులను జోడించావు? ఆ సంపదను వృద్ధి చేశావో నాశనం చేశావో చెప్పు - అన్నది నేరారోపణ - అడిగిన వివరణ.

తర్వాత మరొకటి - కవి అంటూ పదాల గారడీతో నేటి యువకులను తప్పుదారి పట్టిస్తున్నావు. ఔనా, నిజం చెప్పు.

''స్వదత్త మహాభిదాన గౌరవమును నిల్పుకో కవి తిరమ్ముగ
నమ్మిక బుట్టబల్కుచున్'' -

ఇదీ న్యాయస్థానం వారి హెచ్చరిక.

నీ కవిత్వంలో ఏదో రసం ఉంది వెతుక్కోమనీ, వ్యంగ్యం ఉంది అర్థంచేసుకోమనీ అంటూ ఊహాలోకాల్లో తేల్తుండే ఓ భావకవీ ప్రాచీన సాహిత్యం నుండి "వచియింపు కవీ, నిజమేమి నేర్చితో'' - అని ప్రశ్నిస్తాడు.

పదం, దాని అర్థం, కూర్పు, అర్థవిశేషాలూ మీకు ఏవీ తెలియవని సభాజనులందరూ అంటున్నారు - జవాబు చెప్పమని నిగ్గదీస్తాడు.

ఈపాటి తెలివికే నీవు సాంప్రదాయిక రచయితలను

"నీ పద్యంబులలోని యర్థమునుగానీ, మేలిభావంబుగా
నీ పాటించు నరుండు వేల్పుల్మడువనున్ లేడంచు చీయందు వో
రా - పల్మారులు'' - అని భావకవులు వారి మీద పెట్టే నెపాలనూ

ఎంచే దోషాలనూ రచయిత చెప్పిస్తాడు.

భావకవులు ఆంధ్రేతర భాషాసాహిత్యం నుండి భావాలనూ - సంప్రదాయలనూ ఎరువు తెచ్చుకుంటారని దెప్పుతూ -

''పలువు రెఱుంగనట్టి పెరబాస కవీశులు వ్రాయు శేముషీ
విలసిత భవ్యనూతన వివేక విరాజిత కల్పనోత్కరం
బుల నిజకల్పితంబులను బోలె రచించి నటించితంచు పీ
రలు నిను దూఱువారు"- కనుక వారికి నీ స మా ధా నం,

దమ్ముంటే చెప్పుకోమంటారు.

భావకవిత్వానుయాయులైన వారు ఒకరు వేరొకరి రచనలను పొగడటం చూస్తూంటాము. అలా చేయకుంటే తప్పేంలేదు. కానీ ప్రాచీన కవులు రాసిం

దేమిటి ? అంటూ "ఏటికి ప్రేలెదవౌ వచింప కవీ చదువుప్స సుంతలేక" అని అంటారు. చదువుసంస్కారమున్న వాడు ఇతర సాహిత్యంలోని మంచిని చూడాలిగానీకేవలం చెడేచూడటమన్నది కుసంస్కారమనిధర్మారావు అంటాడు.

ప్రాచీన కవిత్వాన్ని విమర్శించేవారి నెపం మరొకటి వర్ణనందరి కవితల్లో ఒకేరకంగా ఉంటాయనేది. దీన్ని కూడా వివరిస్తూ, సరే నీ కవిత్వాన్ని ఎవరమూ నిందించం. కానీ పదేపదే 'కోమలమూ - మోహనమూ' అన్న పదాల పునరావృత్తి తప్ప మరొకటేదైనా అందులో ఉందేమో వివరించమంటాడు.

కొద్దోగొప్పో, నేర్చిన నాలుగు గీతలూ గీసి ఆకాశమంటేలా కవిగా నాట్యం చేస్తూ మీరందరూ లోకాన్ని మోసం చేస్తున్నారు. నేనడిగిన అన్ని ప్రశ్నలకూ సమాధానం చెప్పలేక నీళ్ళు నమిలావా... "పండితమ్మన్యుడ నైతి నంచు నొకమాటిక చెంపలు వేసుకో కవీ'' - అని నేరారోపణ పూర్తిచేస్తాడు.

ఇదో కొత్త హేళన పూర్వకమైన ఖండకృతి. ఇంగ్లీషులో భాషా - సాహిత్యాల పరంగా 'బేటిల్ ఆఫ్ ది బుక్స్' అన్న రచన ఉంది. ఈ భావం మీదే ధర్మారావు ఒక న్యాయస్థానం ఊహించి భావకవిని బోనెక్కించాడు.

కృష్ణశాస్త్రి ఒక సందర్భంలో అన్నాడు. తాను విజయనగరంలో ధర్మారావును ఒక సభలో చూశాననీ భావకవిత్వాన్ని అందులో వారు నిరసించారనీ కానీ తన కవిత్వం మీద సదభిప్రాయం ఉన్నట్టే అనిపించిందనీను. ఇది కూడా 1929 లో జరిగిన సంఘటనే. కానీ కాలానుసారంగా తర్వాత ధర్మారావు అభిప్రాయాల్లో మార్పు వచ్చిందని వారే చెప్పుకున్నారు ఈ భావ కవిత్వం మీద వారికంతగా ఏహ్యభావం ఉండి ఉండకపోవచ్చు. కానీ వారే పీఠికలో అన్నట్టు "ప్రబంధ కవులను అవహాస్యం చేస్తూ భావకవులు చేసిన ఉపన్యాసాలు'' వారిని రెచ్చకొట్టాయి. మొత్తానికి ధర్మారావుచేత ఒక వినూత్న ప్రయోగం చేయించాయి. భావకవుల్లో లోపాలను చాలా ఉదాత్తంగా ఎత్తి చూపి వాటిని పరిహరించుకోవటం ఆ ఉద్యమానికి ఎంతో మేలు కలిగిస్తుందని ఈ 'విచారణ దినం' (1929 ఆగష్టు భారతి) లో చెప్పక చెప్పాడు: కవిత్వం బాగోగులు నిర్ణయించాల్సిన వారు రాజులూ - వారి సంస్థానాలూ కాక ప్రజలే నన్న సత్యాన్ని ఇందులో ధర్మారావు విడమర్చాడు. ఇదే భావాన్ని ఒకనాడు వీరు 'అచ్చు తప్పు' అన్న మరో వ్యాసంలో కూడా ఇమిడ్చి సమదర్శినిలో ప్రచురించటం ఇక ముందు చూడగలం.

# విషాద జలదము

తాననుభవిస్తున్న అనుభూతిని ఇతరులు అనుభవిస్తున్నట్టుగా భావించి వారి చర్యలలో తనను చూసుకోవటం కవిత్వరచనలో ఒక లక్షణం. చెలం అన్నట్టు కృష్ణశాస్త్రి బాధ ప్రపంచం బాధ. ఇలాటి లక్షణం భావకవిత్వ యుగంలో చాలా ప్రాచుర్యంలోకి వచ్చింది. ఏ సాహిత్య తత్వ లక్షణాలున్న కవులకైనా తమ కాలంలో ఉండే సాహిత్య తత్వం అబ్బకుండా ఉండదు. అదీ, కాలాన్ని సమాజాన్ని నిరంతరం పరిశీలిస్తూ అధ్యయనం చేసే కవికి అసలు తప్పదు.

ధర్మారావు నిత్యం తన చుట్టూ ఉండే సమాజంలో వస్తూన్న మార్పులను, ప్రధానంగా సాహితీ లోకంలో వీస్తున్న గాలులను, త్వరగా పసిగట్టగలిగాడు. మొదటిదశలో భావకవిత్వాన్ని ఎదుర్కొన్నా దానిలోని సుగుణాలను గుర్తించాడు. ఒకరకంగా ఇది ప్రాచీన పద్ధతుల మీద తిరుగుబాటని గమనించాడు. మంచి పునాదితో తిరుగుబాటు ఎప్పుడొచ్చినా - ఎక్కడొచ్చినా సమర్థించే గుణం ధర్మారావుది. భావ కవిత్వ లక్షణాల్లో ఆత్మాశ్రయత్వం ఒకటి. ధర్మారావు కవిత్వంలో - వీరు సంప్రదాయ కవిత్వ తత్వాన్ని పుడిసిలించే కాలంలో కూడా ఆత్మాశ్రయ లక్షణం తొంగిచూస్తూనే ఉండేది. కొన్నికొన్ని సందర్భాల్లో ప్రధానమే అయింది.

బొబ్బిలి సంస్థానంలో రాజమర్యాదలనుభవించే కాలాన్ని తామే చేజేతులా వద్దని బయటకొచ్చాడు. ఆత్మాభిమానం దెబ్బతింటోందని అనిపించినప్పుడు ధర్మారావు, తన జీవితాన్ని 'గాలిలో తెగిన గాలిపటం'లా ఉంచటానికైనా అంగీకరించేవాడు గానీ సర్దుకుపోవడమన్నది ఏకోశానా లేదు. మరో చిన్న జమీ సౌత్ వల్లూరు మైనర్ జమీందారుకు ట్యూటర్ గార్డియన్‌గా కొద్దికాలం మద్రాసు కేంద్రంగా పెట్టుకుని పనిచేశాడు. నచ్చలేదు. ఉద్యోగం వదిలేశాడు. చేసేదిలేక జీవితం నడిచే మార్గమూ లేక 1931 చివరలో 'తాతానగర్'లోని బంధువులింటికి అతిథిగా వెళ్ళాడు. అక్కడా ఉద్యోగాలవేట మానలేదు. అంటే జీవితంలో సగభాగం పూర్తయినా స్థిరమైన ఉద్యోగం - నిలకడైన జీవితం ఇంకా ధర్మారావుకు చిక్కలేదు. కుటుంబం అక్కడా

ఇక్కడా ఉంటూ కాలం గడుపుతోంది. రాష్ట్ర రాజకీయాలు మరీ కులం వాసన గొడ్తున్నాయి. గతంలో బ్రాహ్మణేతర ఉద్యమం మీదా, జస్టిసు పార్టీ మీదా ఉన్న భ్రమల పొరలు విచ్చుకుంటున్నాయి. స్పష్టత ఏర్పడలేదు. అశేష ప్రజానీకం కాంగ్రెసు సత్యాగ్రహ కార్యక్రమాల్లో పాల్గొంటోంది. అయితే అంతకు పూర్వం తన సహచరులుగానూ, మిత్రులుగానూ ఉన్న కొందరు కాంగ్రెసు భావాలవైపు ఆకర్షితులవుతున్నారు. జస్టిసు పార్టీ కూడా గాంధీని మహాత్ముడని కొనియాడటమే కాదు, వారి వేదికలపై గాంధీ చిత్రాన్ని కూడా ఉంచటం ఆరంభించింది

ఇలాంటి రాజకీయ దశలో - ఎటూ తేల్చుకోలేని కాలంలో ఉద్యోగాన్వేషణకు పరరాష్ట్రం వెళ్ళాడు. భావకవిత్వ లక్షణాలమీద ఈసడింపు కొద్దిగా తగ్గుతోంది. విశాఖ కవితా సమితిలో సంబంధాలూ మరింత పెరిగాయి. అప్పుడు రాసిందే ఈ 'విషాదజలదము'. ఇది 1932 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో వచ్చింది.

మబ్బును చూస్తూ తన జీవితాన్ని స్మరిస్తూ రెంటికీ ఉన్న సామాన్య లక్షణాలను పరస్పరం అన్వయిస్తాడు రచయిత. నిండుగా నీళ్లతో నిండిన జలదాన్ని బాధలో ఉంటూ కరిగి ఏ క్షణాన్నయినా ఏడ్వటానికి సిద్ధంగా ఉన్న బాధాసర్పదష్టుడైన మానవునితో సరిపోలుస్తాడు. అంటే తానప్పుడనుభవిస్తున్న బాధల గాధలను వెళ్లగక్కుతాడు ధర్మారావు. జలదంతో తానూ మమేకమవుతాడు.

దుఃఖంలో ఉన్నవాడికి పరిసరాల అందాలేవి కనిపించవు. తన బాధేమో తానేమో, అదేవిధంగా జలదాన్ని చూసి ''కలవిహగారవంబుల వికాసము నొందవు" - అని అంటూ "నీకు నావలె విషాదము గల్గినదేమొ పల్కవే" అని సంబోధిస్తాడు.

ఆంధ్ర విశారద బిరుదుతోపాటు నాడిచ్చిన దుశ్శాలువను కప్పుకోవటం, కీర్తి కిరీటాన్ని పెట్టుకోవటం తల్చుకొని నేడవి కూడూగుడ్డా పెట్టటం లేదన్న భావాన్ని - అదే ఆకారాన్ని - జలదంలో

''వెలి జలతారు పాగ దలబెట్టి కడాని మెఱుంగు వ్రాత దు
వ్వలువను పల్లెవాటునిడి పైడి చెఱంగుల లేత మబ్బు వ
న్నెల జిలుగున్ బిగించి''

ఉన్నా నీకూ దుఃఖం ఉన్నట్టే ఉంది. జలదం కదా మరి అని అంటాడు.

కంఠంలో హాలాహలం ముఖంలో అమృతం కలిగి ఉండే లక్షణం ''ఓ జలదమూ నా మాదిరిగా నీకూ ఉందనిపిస్తోంది. నీ మెరుపుల నవ్వులూ -

ఆవెన్క రాలే చిన్కులూ చూస్తే - అని వర్ణిస్తాడు. మబ్బుకురిసే వానను వర్ణిస్తూ —

"అల హృదయాంతరాళమున నాక్షతి యెట్టులగల్గె ? రక్తధా
రలెయవి, మిన్నుమన్ను రుధిరంబున ముంచుచు నెత్తుచున్న; వా
వలనదియేమి ? తాపభరభగ్న హృదామిష ఖండమేమొ ?"-

గుండె పగిలి ఏడ్చేస్తున్నావనీ - ఆ పగిలిన గుండెలు పిడుగుల్లా పడేస్తున్నావనీ పోలికను తన బాధతో ముడేసుకుంటాడు.

నీలాగే నేనూ ఉన్నాను. కనుకనే ఈ సహానుభూతితో "నీ హృదయంబులోని బాధల గ్రహియింప జాలిన విధంబొక యించుక తోచుచున్నది"- అని అంటాడు.

తానంతవరకూ అడిగినవాడికి లేదనకుండా ఇచ్చి ప్రస్తుతం నిర్ధనుడైతే ఎవరూ పట్టించుకోవడం లేదని అంటూ, ఇదే భావాన్ని జలదానికంటకడ్తూ

"కలిగిన వేళ జీవన మఖండగతిన్ సుజనాళికిచ్చి ని
చ్చలు ఘనవృత్తి సర్వబుధ సంస్తుతి గాంచి, యనర్థకాల సం
కలన సహాయునింగనక గాసిలి చిక్కెదు, వెల్లబోయెదు"

అని అంటాడు. ఇందులో జీవనానికి - ఘనానికి ఉన్న శ్లేషార్థాలతో చక్కగా చాకిరీ చేయించుకుని కవి ప్రస్తుతానికి బాగా అన్వయించుకున్నాడు. నల్ల మబ్బులు వర్షం కురిసిం తర్వాత తెల్లబడటాన్ని అందంగా 'వెల్లబోయి' అని వర్ణించాడు.

మేఘం తేలికగా ఉంటుంది. ఏపాటి గాలికైనా కదలాడ్తూంటుంది. అలా ఉంటూనే చిచ్చర పిడుగులను కడుపులో దాచుకుంటుంది. దీన్నే వారు ఆపదలను మింగుతూ - సాటివారిలో ఎంత చులకనైనా కోపాన్ని చూపకుండా ఉండటంతో జతకట్టిస్తారు. దీన్నే వారు "ఆపదల సఖ్యమె కోరినయట్లు మ్రింగెదుజ్జ్వల దతి భీషణాగ్ని కణ సంహతులన్ వెలివేయవేమియున్" అని ప్రశంసార్థ వాక్యాన్ని పలుకుతాడు.

వర్షం కురిసిపోయింతర్వాత బాధలను దిగమింగిన తర్వాత ఎవరూ ఆదుకోని సమయంలో తమ ప్రాచీన వైభవాన్నీ గొప్పతనాన్నీ ఇతరులను పోషించే గుణాన్నీ తిరిగి ఎలా సంపాదించటం ? మనసులో బాధ ఎలా సమసిపోవటం - "బూర్వపు రీతిని జీవసంబుతో మెలగుట యెట్టులో" అని తమ గతజీవన సరళిని తలుచుకుని విచారిస్తాడు.

ఏమైనా కవి.

పది తప్తమయోమయ కందుకంబు గుండెలు దిగమ్రింగి కిమ్మనని; నేర్పు -
తనకే ఉందని పేలవనంతో నేటి దారిద్ర్యానికి తలవంచననీ అంటారు.

అయినా అనుమానమే. తన ఓపికను పరీక్షించే విధంగా కష్టాల పరంపరలొస్తాయేమో ? తన ధీమా - స్థయిర్యం నిలబడగలదా ? అని, కానీ అప్పుడు కూడా

''బలమగు తాపముల్ హృదయ ఖాండము వ్రయ్యలు సేయదానిలో
పలి యనురాగ పూరము గుబాలున జింది''

ఒక ప్రవాహంలాగా లోకాన్ని ముంచుతాను కానీ సిరు కారిపోను. జావకారిపోను. కష్టాలనుండే - కడగండ్ల నుండే అమృతాన్ని ప్రజలకు పంచుతానని అంటాడు కవి.

ఇంగ్లీషులో ప్రొజెక్షన్ ఆఫ్ పర్సనాలిటీ అన్నట్టు తన భావాన్ని ఎదుటివారిలో చూస్తూ తన బాధల లాంటివి ఇతరులకూ ఉన్నాయనీ - వాళ్ళూ నిర్భయంగా జీవిస్తూ జీవన సమరం సాగిస్తున్నారనీ, జీవితధ్యేయం సాధిస్తారన్న నీతి ధర్మారావు ఈ ఖండకృతిలో వివరించాడు. చిన్నచిన్న పదాలతో, శ్లేషనాశ్రయించుకొని ద్వ్యర్థా అనిపించేలా సాగిన రచన ఇది. ప్రసన్నతా గుణానికి ఇది మచ్చుతునక.

## ఉషఃకాలము

ఒక రచయిత ఒక కాలంలో ఎప్పుడూ ఒకే ప్రక్రియను చేపట్టడు. అందులోనూ సాహిత్యరంగంలో అప్పుడప్పుడే కాలుపెట్టే వ్యక్తి అన్నిటా తన శక్తిని చూపాలనుకుంటాడు. ధర్మారావు కూడా వచన రచనతోనూ పద్యరచనతోనూ ముందుకెళ్ళాలనుకున్నాడు వచనం ఏ చదువరుల కోసమో, పద్యం ఎవరికెళ్ళాలో ఇంకా నిర్దిష్టంగా అంచనా వేసుకోగలిగిన అనుభవం కానీ అవకాశంకానీ వీరికి రాలేదు. రెంటినీ చేపట్టాడు. తన సత్తా ఎందులోనో ? ..అదీ ఏపాటిదో ? తేలాలి. పండితుల మధ్య తానెవరో తెలియాలి. అదీ తపన.

ఆ దశలో సాగిన వచన రచనలనూ ఖండకృతులనూ అవకాశమున్నంతవరకూ కాలక్రమానుసారంగా పరిశీలిస్తే కాలగమనం, కవి పరిణామం తెల్సుకోవటం సులభసాధ్యమవుతుంది. ఆయా ఉద్యమాల ప్రభావాలూ

అవి ఈ రచయిత రచనల్లో ప్రతిబింబించిన తీరుతెన్నులూ గమనంలోకి వస్తాయి. ఏయే కొత్త ప్రక్రియలు ఏ కాలంలో ఎందుకు చేపట్టాడో కూడా తెలుస్తుంది.

ఈ ప్రకరణంలో ముందుగా ఖండ కృతులను పరిశీలించిన తర్వాత వచనరచనలను పరామర్శించటం జరిగింది. అయితే ఈ రచనల్లో కొన్ని చోట్ల కాలక్రమాన్ని పాటించలేదు. కారణం ఏ రచయితా ఒక కాలంలో ఒకే ప్రక్రియపై దృష్టి ఉంచటం సాధ్యంకాదు కనుక. ఈ రచయిత పట్ల అదే వర్తించింది. వచన రచనల్లో

— ఉషఃకాలము - సాహిత్య చరిత్ర
— కొండెగాడు - పత్రికా రచన
— క్రొవ్వుటాళ్ళు - నవలా రచన
— లేకి పేర - వ్యాసాలు
— జొన్నకర్ర ప్రశ్న - వ్యాసాలు
— సాహిత్య వ్యాసాలు -

వేగుజుక్క గ్రంథమాల ఆవిర్భవించి పుస్తక ప్రచురణ కార్యక్రమం చేపట్టేసరికి ఏ గ్రంథం అచ్చు వేయాలన్న ఆలోచన వచ్చింది. ధర్మారావుమీద ఆ బాధ్యత పడటం, అమలుజరగటం బహుశా రోజులమీద జరిగి ఉండచ్చు. మూడు రోజుల్లో విలాసార్జునం - అదీ విద్యార్థి దశ దాటకముందు రాసిన 'వాడి' చేతికీ, మెదడుకూ ఈ కొత్త రచన భారమవుతుందా. రచన తయారైంది. వేగుచుక్క గ్రంధమాల ప్రచురణకు నాంది పలికింది.

ఈ గ్రంధమాల ప్రచురణలను మరీచికలన్నారు. మొదటి మరీచికగా ధర్మారావు రచన 'ఉషఃకాలము' 1911 లో వెలువరించారు.

దీనికి 'తాపీ ధర్మరాయని యుపోద్ఘాతము' రాస్తూ "అయ్యా, భాషా విషయమగు జ్ఞానంబునెల్ల జరిత్రవలెగాక, రమ్యమగు కథారూపమున గూర్చి, యింత మనోహరముగ రచించుట నెందును గానము గదా. భాషా విషయం బునకు దోడుగ నాయాదేశ కాలములలోని యాంధ్రుల చరిత్రయు, సంస్కృత భాషాంశములును గడుంగడు హృదయరంజకంబుగ బొందుపఱుచుట నిక్క ముగ చమత్కారమే యగు. ఇంక కవుల లక్షణంబుల గఱపుచు, నానాటి కొడగూడిన మార్పుల నుగ్గడించుచు నెంతయో జ్ఞానదాయకముగనున్న, ఈ గ్రంథము తెలుగుల పెన్నిధానమయి మనవారల నావరించి యున్న యంధ

కారమును బోగొట్టు నుషఃకాలమైయున్న యది'' - అని చదివి వినిపిస్తే కొందరన్నారనీ అందుకే దీన్ని ప్రచురిస్తున్నామనీ అన్నాడు.

భాష విషయంలో ధర్మారావు అభిప్రాయాలను 'గ్రాంథిక భాషావాదం' వెల్లడిస్తుంది. దాన్నే వచనంగా 'విన్నపం'లో చెప్పాడు. ఆ ఆశయాన్నే ఇప్పుడు ఈ ఉషఃకాలమనే కలభాషిణి స్వీయచరిత్రలో ప్రతిపాదించాడు.

సాహిత్య చరిత్రను స్వీయపాత్ర ప్రక్రియగా తీసుకొని రావటం ఇదే ప్రథమం. సంస్కృతాన్ని భారతిగానూ, తెలుగును కలభాషిణిగానూ చిత్రించాడు. నన్నయ నుండి వీరేశలింగం వరకూ వచ్చిన సాహిత్యాన్నంతా కలభాషిణికి ఆయా కాలాల్లో ఆయా కవులూ రచయితలూ వచ్చి బోధిస్తూన్నట్టు కథ అల్లాడు. చివరకు సంస్కరణం దగ్గరికొచ్చేసరికి - అదీ భాష గురించే - ఆమె "అక్కటా కొందఱు సంస్కరణాభిలాషనో యేమో మార్పుల జేయబూని శ్రీహరీ, నారూపు మాపుచున్నారలే. యింకెక్కడి సంతసంబు. వీరల యూహననుసరించిన, నావారలే నను గుర్తింపనేరరుకదా ........ ఇట్టిదియా సంస్కరణము'' అని గగ్గోలెత్తిపోతుంది. ఇదీ ధర్మారావు ఆవేదనే.

పద్నాలుగు ప్రకరణాలుగా సాగిన ఈ చరిత్ర "ఇంత కాలంబునకుగదా వేగుజుక్క పొడమినది? ఇదిగో చూడుడుషఃకాలంబు వచ్చెనోయుడుతలారా, రండు. దీనింగాంచి యానందింపుడని" తమ గ్రంథమాల పేరూ వెంటనే వచ్చిన మొదటి గ్రంథం ''ఉషఃకాలం'' కావటాన్ని పాఠకులకు నివేదించాడు.

కవుల జీవితరచనను వదిలేస్తే వాఙ్మయ చరిత్రగా ఈ ఉషఃకాలమే మొదటిది. వంగూరి వారిది తర్వాత వచ్చింది. ఆ పైన అనేకమంది సాహిత్య చరిత్రలను రాశారు. మధ్య మధ్యలో పాఠకులను తట్టి లేపుతూ - గ్రాంథిక భాషలో సాగినా - అనేక చారిత్రకాంశాలను ఆంగ్ల చరిత్రకారుల రాతలతో సాక్ష్యాలనిస్తూ రచన సాగుతుంది.

వేగుచుక్క గ్రంథమాలలో శాశ్వత చందాదారులూ, చందాదారులూ, పోషకులూ ఉండేవారు. ప్రవేశరుసుం ఒక రూపాయి. సంవత్సరానికి విజ్ఞాన చంద్రికవారిలాగే నాలుగు గ్రంథాలు ప్రచురించాలన్న ఆశయం. సభ్యులకు తక్కువ ధరలకూ, చందాదారులకు కాస్త ఎక్కువకూ అందిచ్చేవారు. ఈ ఉషఃకాలము సభ్యులకు రు. 0-14-0 అణాలకూ, ఇతరులకు రు. 1-8-0కూ ఇచ్చారు. 232 పేజీలుంది. ఈ పుస్తకానికి 'కంఠమాల'గా ధర్మారావు అదివరకు రచించిన 'కలభాషిణి' అనే చంపకమాలికను ముందు సమకూర్చాడు. ఈ సూచన తిరుపతి వెంకటకవులిచ్చినట్టుగా పాతపాళీలో ధర్మారావే రాసుకున్నాడు. ఈ పుస్తకాన్ని గూర్చి మండపాక పార్వతీశ్వరశాస్త్రి55

కలభాషిణి యనుపేరున
నల యాంధ్ర కవిత్వకాంత ఆత్మచరిత్రం
బలఘు ప్రక్రియ తనకొౌమ
రులకుం దెలియంగ జేసె ప్రోన్నతకరుణన్.

నవలారూపముగా, మనోహరముగా, నానారసోల్లాసిగా
నవ లావణ్యయుతంబుగా నెసగ నాంధ్రంబందు సంస్తూయ మా
నవచః ప్రౌఢిమ జేయగాబడిన గ్రంథంబిదియే యంచు మా
నవనాధుల్ కవినాధులుం దెలిపిరానందంబు సూచింపుచున్.

- అని ప్రశంసించారు. మొత్తానికి గ్రంధం అటు గ్రంథమాలకు ఇటు ధర్మారావుకూ ఉషోదయం కలిగించింది ధర్మారావు రచనల్లో పుస్తక రూపంలోవెలువడిన తొలిగ్రంధం ఇది. అదీ వచన రచన. భాషావిషయంగా తన భావాలను నిర్మొహమాటంగా అందిన ప్రతి ప్రక్రియలోనూ చాటి చెప్తూ ఒక ప్రచారకుడుగా బయల్దేరాడానాడు ధర్మారావు. సాహితీ సమర సైని కుడుగా రంగంలోకి దూకాడు. దీన్ని జయంతి రామయ్యపంతులు గ్రాంధిక భాషను సమర్థించే ఒక సభలో ప్రశంసించారని ధర్మారావు ఒక ఇంటర్వ్యూలో తెలిపారు (తెలుగు ఆకాడమీ 1969).

బరంపురంలోని వ న్యుల సహకారంతోనూ, భాషాభిమానుల చేదో డుతోనూ ఈ గ్రంథమాల వేగుజుక్క ముద్రణాలయాన్ని కూడా ఏర్పాటు చేసుకుంది. దీనికి ప్రధానంగా దేవరాజు వారి కార్యదీక్షే కారణం.[56]

## కొండెగాడు

ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం ద్వారా గ్రంథాలయ నిర్వహణ, బరంపురంలో సంస్కరణ భావాల ప్రచారం, జాతీయ భావాలకు వేదికగా సమాజాన్ని తీర్చి దిద్దటం, సాహితీ ప్రముఖులను ఆహ్వానిస్తూ గోష్ఠులునిర్వహించటం, ఇవి నాడు ధర్మారావుకు ఊపిరి పీల్చుకోటానికి కూడా వీలు కలిగించనంతటి కార్య భారాలు. ఆది నుండి సంస్కరణలవైపు ధర్మారావు దృష్టి ఉండేది.

వీరి చిన్నతనంలో ఒకసారి వీరి వైష్ణవమతగురువులు వచ్చి చక్రాంకితాలను వేయించుకోమని బోధించారు. ఇంట్లోవారంతా బలవంతం చేశారు.

ధర్మారావు ఆ మత గురువును ధిక్కరించాడు. కాల్చి వేసుకోటం అనాగరిక మన్నాడు. ఇలా వేసుకున్నందువల్ల మతంలో విశ్వాసం కలుగుతుందన్నది కల్ల అన్నాడు. చివరకు తల్లి కన్నీళ్ళకు లొంగి చందనంతో చక్రాంకితా లద్దించుకున్నాడు. చాలాకాలం ముఖాన తిరుచూర్ణం పెట్టుకోవటం తప్పించి దైవపూజలు చేయటం కాని, మతగురువులను పిలిపించి భిక్షలివ్వటం గానీ చెయ్యలేదు. ఈ భావాలే క్రమేపీ వారిలో పాదుకొని మతాలపేరిట జరిగే సామాజిక దురన్యాయాలను వెతికిబైటపెట్టాలన్న ఆలోచనకు దారితీశాయి. విద్యార్థిగా ఉన్నరోజుల్లో వ్యక్తిశీలం - సద్గుణాలూ అంటే అభిమానం కలిగించే రచనలు చదివారు. వారి దృష్టికి ఎడిసన్, స్టీల్ రచనలు వచ్చి ఉంటాయి. స్పెక్టేటరూ దాని సంఘమూ, ఆ సభ్యుల నడవడీ-ఆ సంఘం తన రోజువారీ చర్చలో సమాజంలోని చెడును ఎలా బయటపెట్టిందీ, ధర్మారావు మనసును ఆకర్షించి ఉంటాయి.

ఇదే విధంగా తానూ ఒక పత్రిక పెట్టాలనుకున్నాడు. 'కొండెగాడు' అనే పేరు స్థిరపరచుకున్నాడు. ఈ పత్రిక పై భాగంలో "పత్రార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః" అనే సూక్తి ఉండేది. కొండెగాడు అంటే కొండేలు చెప్పేవాడు. అయితే ఆ అర్థం అయి ఉండదనీ కొండెము అంటే మన శాసనాల్లో కనిపించిన 'కుణ్డినకాళ్ళు' అనే పదం కావచ్చనీ అదే క్రమంగా ఇలా మారిందనీ కొందరభిప్రాయం. అదే అయితే దానర్థం 'హితవు చెప్పేవాడ'ని అవుతుంది.[57] కాని ధర్మారావు అభిప్రాయం మాత్రం 'నేరములు చెప్పేవాడ'నే ఉన్నట్టు కొండెగాడు నెం. 1 లో తెలుస్తుంది.

'వేగుచుక్క' గ్రంథమాల, ప్రచురణాలయాలు స్థాపించి బరంపురం నుండి సాంఘిక సాహిత్య రంగంలో కృషి చేస్తున్నా మధ్య మధ్య విశాఖ పట్నంతో సంబంధాలూ రాకపోకలూ మానలేదు ధర్మారావుకు ఈ పత్రిక పెట్టాలన్న తలంపు 1912లో వచ్చి ఉండచ్చు. డికెన్స్ 'పిక్‌విక్‌పేపర్సూ', ఎడిసన్ 'స్పెక్టేటరూ' చదివిన జ్ఞాపకాలున్నాయి. సరిగా అదే విధంగా ఈ కొండెగాడును కూడా నిర్వహిద్దామనుకున్నాడు.

ఇలాగే ఎడిసన్ ప్రేరణతో ఈనాడు తెలుగుదేశంలో చాలా ప్రఖ్యాతి పొందిన 'సాక్షి' వ్యాసాల సంపుటాలున్నాయి. పానుగంటివారు వీటిని మొదట 1913 నుండి 'సువర్ణలేఖ' అనే పత్రికలో రాశారు. సాక్షిలోని ఆధారాల నుండే ఇది 6 3.19.3 న ఆరంభమై మార్చి 11 వ తేదీ 'సువర్ణలేఖ' సంచికలో వచ్చి ఉంటాయి. "సాక్షియను పేరిట కొన్ని వ్యాసములు నేను 1913వ సంవత్సరమున గొన్ని మాసములు సువర్ణలేఖా పత్రికలోన వ్రాసితిని. ఆ

పత్రికాధిపతి నన్నత్యంతము ప్రోత్సాహపరచి వ్రాయించుటచే వ్రాసితిని"-అని మొదటి సంపుటం పీఠికలో పానుగంటి రాశాడు. ఈ పత్రికాధిపతి ఎవరోకాదు వారి అల్లుడు, ద్రోణంరాజు వెంకటరమణారావే. 1914 ఏప్రిల్ చివరివరకూ సుమారు ఇరవై ఎనిమిది వ్యాసాలు రాశాడు. తిరిగి దీనిని 1920 సెప్టెంబరు 4 నుండి ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో వారానికి ఒకటీ రెండూ చొప్పున 2.9.1922 వరకూ రాశాడు. ఆంధ్రపత్రికలోనే మళ్ళీ సెప్టెంబరు నుండీ అడపాదడపా రాస్తూ 24.3.1928 వరకూ ఈ వ్యాసరచన నిర్వహించాడు. తిరిగి సాక్షి సంఘ పునరుద్ధరణ 25.3.1933 లో జరిగింది. ఒక క్రమ పద్ధతిలో వ్యాసాలు రాలేదు. కొద్దికాలం వచ్చి ఆగిపోయాయి.58

ఇంగ్లీషు సాహిత్యం, అందులోనూ వచన రచనలో ఎడిసన్ (1672-1719), రిచర్డ్ స్టీల్ (1672-1729) కలిసి రూపొందించిన 'స్పెక్టేటర్' వ్యాసాలు చాలా ప్రఖ్యాతిని సంపాదించాయి నాడు వచన రచనకూ వ్యంగ్యానికీ ఒరవడి పెట్టాయి కూడా ఇది ఓ సంఘం. కల్పితమైంది. ఇందులో ప్రధాన వ్యక్తి స్పెక్టేటర్. సంఘ సభ్యులుగాగానీ, సహాయకులుగాగానీ ఉన్న మిగిలిన సభ్యులు సర్ రోజర్ డి కవర్లీ, సర్ ఆండ్రూ ఫ్రీ పోర్ట్, కెప్టెన్ సెంట్రీ, విల్‌హనీకూంబ్, 'ఇన్నర్ టెంపుల్, సభ్యుడొకడూ వీరందరూ సమాజంలో ప్రధానమైన వివిధ వృత్తుల్లో జీవిస్తూ వాటి లోతుపాతులను బాగా ఆకళించుకొన్నవారు వీరందరూ కలిసి చర్చించి మరునాటి పత్రికలో ఏ విషయాలు రాయాలో తీర్మానించి స్పెక్టేటర్‌కు సలహాలిస్తారు. ఈ పత్రిక దిన పత్రిక.

దీని ఆశయాలను తన పదవ సంచిక (12-3-1711)లో వివరిస్తూ చివరకు "గ్రేటు బ్రిటన్ పొలిమేరల నుండి దురాచారమును, అజ్ఞానమును తరిమివేయుటయే ఈ రచనల ఏకైక చరమ లక్ష్యము"అని అంటారు. ఈవ్యాసాల్లో మూఢనమ్మకాలు, ఫ్యాషన్లు మొదలైన వాటిమీద నిరసనం, సాహిత్యం మీద అభిరుచి కలిగించటం, స్త్రీలోకాన్ని గురించి, ఈర్ష్య - స్నేహం మొదలైన భావాలను గూర్చి, సంఘానికి ఆమోదయోగ్యంకాని దురభ్యాసాలను గూర్చి విమర్శన లున్నాయి. స్పష్టీకరణ లున్నాయి. విషయ వైవిధ్యం చాలా ఉంది. ఒక వ్యాసంలో "మేము నేరముల వెల్లడింతుము. వాని స్వభావముల విశదపరతుము. వానివల్ల సంఘమునకు గల్గు హానిని స్పష్టపరుతుము. వానియందు జనుల కసహ్యము కలుగునట్లు చేయుటకై ప్రయత్నింతుము. నేరములనే మేము నిందింతుము కాని ఇట్టి నేరములకు లోనైనవారిని నిందింపము. వారిని

దలపెట్టము. మాకు వారితో లేశమైన పనిలేదు.'' - అన్న సాక్షి భావాలు స్పెక్టేటర్‌లోనుండే గ్రహించారనవచ్చు.

పానుగంటివారు సువర్ణలేఖలో ప్రచురించిన వ్యాసాలవరకూ స్పెక్టేటర్‌ను చాలా వరకూ ఆదర్శంగా పెట్టుకున్నా, తర్వాతతరువాత వచ్చిన రచనలలో వచనా శిల్పానికి, ప్రణాళికకు బాగా మెరుగులు దిద్దుకుని స్వతంత్రతను వ్యక్త పరిచారు. సాక్షిలో సభ్యులు సాక్షి, జంఘాల శాస్త్రి, కాలాచార్యులు, వాణీ దాసుడు, బొర్రయ్యసెట్టి. చివరలో సి. బాలనాగమ్మ అనే ఆమెకూడా సభ్యుల తర్జనభర్జనల తర్వాత సభ్యత్వం ఇవ్వటం జరిగింది.

ఈ సాక్షి సమాచారమంతా 1913 నాటిది. ధర్మారావు ప్రకటించే కొండెగాడును పరిశీలించటానికి ఈ పై వృత్తాంతం చాలా అవసరం.

'కొండెగాడు' పత్రికలను అచ్చేసి ఒకకానీ వెలకు అమ్మేవాడు. క్రమంగా దిన, వారపత్రికగా కూడా వచ్చేదికాదు. వీరిదగ్గర డబ్బు సమకూడినప్పుడూ రాయదగ్గ విషయం ఉన్నదనిపించినప్పుడూ ఇది వచ్చేది. బరంపురం, విశాఖ పట్నాల నుండే ప్రకటించేవాడు. వారెక్కడ తిరుగుతున్నా ఈ ప్రతులను తీసుకెళ్ళి పంచటం ఆచారంగా పెట్టుకున్నారు. పత్రికలమీద వరస సంఖ్య వేసేవారు. మొదటి సంఖ్య ఉన్న పత్రికలో 'స్వీయచరిత్ర'అని 'కొండెగాడు' తనను గురించి రాసుకున్నాడు. తన స్వభావాన్ని అంటే పత్రికలో తాను రాయబోయేవాటిని గూర్చి చెప్పుకున్నాడు. 'తాను చూసిందీ-విన్నదీ అంతా మీకందరకూ చెప్పటమే' తన విధానమన్నాడు. చెప్పదగినది - చెప్పరానిది అనేది లేకుండా సవివరంగా చెప్తానన్నాడు. ఒక వృత్తాంత నివేదకుడుగా తనను పరిచయం చేసుకున్నాడు. ప్రచారాన్ని ఆశించడట. పేరు పైకి రాకూడదట. ''కనిన దానిని తెలిసికొనుటయు, తెలిసిన విషయంబును దెలుపుటయు........ నను నీ రెండును నేనింక మానలేను'' అని తన స్వభావం వెల్లడిస్తాడు.

ఇక రెండవ సంచికలో తన సామాజికులను గూర్చి వివరిస్తాడు. ఇందులో గోపాలశర్మ, భాస్కరభట్టు, తిరుమలయ్య, విశ్వంభరరావు సభ్యులు. వీరందరి స్వభావాలూ ఇందులో సూచించాడు.

స్పెక్టేటరే ఎడిసన్ - స్టీలు. కొండెగాడే ధర్మారావు. సాక్షిలో సాక్షే పానుగంటివారు. తనను గురించి సాక్షిలో అంతగా చెప్పకోకుండా ''నాసంగతి మీరు ముందు నా వ్రాతను బట్టియే కనిపెట్టగలరని''ఊరుకుంటే, స్పెక్టేటర్‌లో తొలి వ్యాసంలోనేతనను గురించి చెప్పుకుంటూ ''తాను అన్ని పనులూ చేస్తూ జీవించాననీ - ఇన్ షార్ట్ ఐ హావ్ ఆక్టెడ్ ఇన్ ఆల్ ది పార్ట్స్ ఆఫ్ మై లైఫ్ య్యాజ్ ఎ లుకర్ ఆన్, విచ్ ఈజ్ ది కారెక్టర్ ఐ ఇంటెండ్ టు ప్రిసర్వ్ ఇన్



13 మృతులపై కట్టడం - ఆదిమ దేవాలయ భావం.



14 ఆదిమ దేవాలయ భావం - మరో రూపం - ఆఫ్రికా.



16. యోని పూజకు ఉపయోగించిన రాతిలో స్త్రీ జననాంగ రూపం - మొహెంజొదారో




15 లింగపూజకు ఉపయోగించిన పురుషాంగ రూపం - మొహెంజొదారో.

దిస్ 'పేపర్'' అని చెప్పుకుంటాడు. కొండెగాడు కూడా ''తన దారిని దా బోక యందఱ విషయంబును వీనికే కావలయునగునుగదా .. వీనినోట నువ్వు గింజదాగదు ..చూచినదానిని దెలిసికొనుట జ్ఞానమార్గంబని మీరెఱుంగుదురు గదా. తెలిసికొనిన దానినితరుల కెఱుక సేయుట సంఘ విధానమని నుడువ వలయునా?" అని అంటూ తను 'కనువినికి' గుణమున్నవాడనంటాడు. సమయం వచ్చినప్పుడు ముఖస్థవిష (య) ము నతి దారుణంబుగ బ్రయోగించుటయు తనకు పాము (కనువినికి) నకున్న సమాన ధర్మములట. అయినా దానికివలె ''ద్విజిహ్వత్వమును, వక్రగమనమును, సల్పప్రాణినిపీడనంబును, లోనుగాగల గుణంబులు మందునకైన లేవ''ంటూ కొడ్తే ఏనుగు కుంభస్థలం కొట్టటమే కొండెగాడి పని అంటాడు.

ఈ లక్షణాన్ని బట్టి తనను గురించి చెప్పుకోటంలో ధర్మారావు స్పెక్టేటరునే అనుసరించాడు. ఇద్దరికున్న లక్షణాలల్లో సమానధర్మాలుఎక్కువ.

ఇక సభ్యులను పరిశీలిస్తే స్పెక్టేటర్, కొండెగాడు, సాక్షి- లలో అయిదుగురే స్థిరమయిన వ్యక్తులు. అన్నిట్లోనూ వివిధ ప్రవృత్తులు కలిగిన వాళ్ళున్నారు. ధర్మారావు తమ సభ్యుల చిత్తవృత్తులను చాలా విశదంగా, స్పష్టంగా లలితమైన హాస్యంతో పరిచయం చేస్తాడు.

గోపాలశర్మ నల్లనివాడు. కళానిధి. అనేకవృత్తి విద్యలు తెలుసంటాడు. ఉపన్యాసాలివ్వటం అంటే సరదా. వాక్చాతుర్యంతో అందరినీ ఆకర్షిస్తూంటాడు. అవునన్నవాడ్ని కవి శిఖామణిగాను కాదన్న వాణ్ని ఖాన్ బహదూర్‌గానూ చేయగల సామర్థ్యం ఉన్నవాడు

భాస్కరభట్టు రెండవ సభ్యుడు. వయసులో కాస్త వృద్ధుడైనా 'వాంఛల బాలుడు'గా ఉంటాడు. కలుపుగోలుతనం ఉన్నవాడు. ''తెప్పపాటు కాలమున బలిమితీగనేచెట్టునకైనను నెగబ్రాకింపగలడు''. శాస్త్రం తెలిసినవాడు. ఆచరించి బాగోగులు నిర్ణయిస్తుంటాడు. స్థూలకాయుడు. చురుకుదనం పాలెక్కువ. అనుమానం పాలెక్కువ. కనుక పక్కచూపులు చూడటం లక్షణం.

మూడవ సభ్యుడు తిరుమలయ్య. వైశ్యుడు. చదువుకున్నవాడు. చాల భాషలు వచ్చినవాడు. అన్నిటినీ మించి 'సంజ్ఞల' భాష బాగా వచ్చు. దానిని స్త్రీల నుద్ధరించటానికే ఎక్కువగా వాడ్తూంటాడు. కాస్త రూపవంతుడు.

విశ్వంభరరావు నాలుగవ సభ్యుడు. చదివింది తక్కువే అయినా లోకజ్ఞానం ఎక్కువ. ఇతణ్ని తమ కార్యాలయానికి లేఖకుడుగా అడుగుదామనుకుంటున్నారు. ఇతనితో మాట్లాడితే చాలా జ్ఞానం సంపాదించిన వ్యక్తిలా

ఉంటాడు. విశ్వాన్నంతా భరిస్తున్నట్టు పనిచేస్తాడు. కృత్రిమాలంకారాలతో అందాన్ని పెంచుకోటానికి శ్రమపడ్తాడు.

సాక్షిలో సన్నివేశాలెక్కువ. స్పెక్టేటరులో అన్ని లేవు. కొండెగాడు రచనలు నాకు లభించినవి రెండే. అవీ 1914 లో పునర్ముద్రణలుగా వేగుజుక్క కథావళిలో అచ్చయినవి. కనుక పూర్తిగా అధ్యయనం చెయ్యటానికి అవకాశం లేదు. ధర్మారావు హాస్యాన్ని బాగా ఆశ్రయించి ఉంటాడనవచ్చు. విశ్వంభరరావును గూర్చి చెప్తూ "అతడు చిన్నలలోనెల్ల జిన్నపెద్ద; పెద్దలలోనెల్ల పెద్దచిన్న," అంటాడు. అలాగే తిరుమలయ్యకున్న స్త్రీలోలత్వాన్ని వ్యంగ్యంగా వివరిస్తూ "మన భరత వర్షమున స్త్రీలన్నివిధముల గొఱతవడి యుండుటనవలోకించి వారికి దగిన యుద్ధరణ మొసంగవలయునని యతడహోరాత్రములర్ధనారీశ్వరుని ప్రార్థించుచుండును". "ప్రతి సందులోను నేమూలనో నిలబడి సంజ్ఞలభాష జూపింపుమన్న నించుకయేని దడయక చూపించును. స్త్రీలబలలగుట వారియందతనికి గరుణ మెండు" - అని అంటాడు. అదే విధంగా అతని కొచ్చిన భాషలను చమత్కారంగా వివరిస్తూ "పరులాతనికి వచ్చునని చెప్పు భాషలొక పదియున్నవి. అతడు పరులతో వచ్చునని చెప్పునవి యొక పది. నిజముగా అతనికి వచ్చినవి మరియొక పది". మాటలు మెలికలేస్తాడు. అతడెంత వాక్చాతుర్యం ఉన్నవాడంటే "సత్యమో యపసత్యమో, తన విషయమునే గ్రహించి యితరులకర్థముగాకుండునట్టు మాట్లాడగలడు. అప్పుడప్పుడతనికి గూడ నర్థము కాకుండ భాషింపగలడు. ఈ గూఢ భాష యొకటి'' - అని ఆనాటి ఉపన్యాసకులను బహుశా ఎద్దేవా చేయాలని చేసి ఉంటాడు.

కొండెగాడు నడపటం ఆరంభించిన తర్వాత మొదటి దండయాత్ర వ్యావహారిక భాషా వాదం మీదా, అందులోనూ పి. టి. శ్రీనివాసయ్యంగారి మీద చేశాడు. అదే విధంగా ఆదినుండీ శత్రు శిబిరంలో ఉండే సెట్టి లక్ష్మీనరసింహం రచన 'వసంతసేన' కూడా ఈ కొండెగాడి కఠిన విమర్శకు గురైంది.[59] ఇవన్నీ ఆ రోజుల్లో ధర్మారావును గ్రాంథిక భాషా వాద ప్రచారకుడుగా నిలబెట్టాయి.

కొండెగాడు పత్రికలు నాకు లభించినవి - ధర్మారావు, దేవరాజు వెంకటకృష్ణారావు 1914 నుండీ నడిపిన వేగుచుక్క కథావళి అనే పత్రికల్లోవి. కనుక ప్రథమంగా కొండెగాడు రచన 1914 కు ముందు అవాలి. మద్రాసు నుంచి వచ్చి బరంపురం కళాశాలలో అధ్యాపకుడుగా ఉంటూ గ్రంథమాలను భాషాభివర్ధనీ సమాజాన్ని నిర్వహిస్తున్న కాలంలోనే ధర్మారావు వీటిని ప్రక

టించి ఉండాలి. అంటే 1911 - 1914 మధ్య. ముద్రణాలయం 1912 లో పెట్టారు. అందులోనే ముద్రించేవారని బరంపురంలోని వ్యక్తుల భోగట్టా. కనుక 1912 - 1914 ల మధ్య కావాలి. అప్పటికే వ్యావహారిక భాషావాదం దుమారంగా వీస్తోంది. తన దాడిని దాని మీదే ఆరంభించాడు. సాక్షి 1913 నుండీ ఆరంభం. దాన్ని ప్రచురించిన సువర్ణలేఖ పత్రికకు అంత ప్రాచుర్యం లేదు. వీరి కొండెగాడు బరంపురం - విశాఖల మధ్యే నడిచి ఉండాలి. మిత్రులకు పంపి ఉండవచ్చు. స్పెక్టేటర్‌నే అన్ని విధాల అనుకరించినట్టు కొండెగాడు తెలియచేస్తుంది. ఇలాంటి లక్షణం తొలిసారిగా అనుకరించిన వాడికి తప్పదు. సాక్షి వ్యాసాలు ధర్మారావు చూసే ఉంటే ఇంతకన్నా అందంగా వ్యంగ్యంగా హాస్యంగా చెప్పగలిగి ఉండేవాడు. కనుక చూసి ఉండడు. పానుగంటివారు ఈ కొండెగాడు పత్రికలను చూసినా, వారప్పటికే చేయి తిరిగిన నాటక రచయిత. ఒకరకంగా వచనంలో సిద్ధహస్తులు. ధర్మారావుది ఆరంభదశ. కనుకనే స్పెక్టేటర్‌కు అనుకరణ ఎక్కువ అనిపిస్తుంది. వీటన్నిటిని బట్టి బహుశా సాక్షి వ్యాసాలకు కొంత ముందో వెనుకో ఈ కొండెగాడు పత్రికను తీసుకుని వచ్చి ఉండవచ్చు. ఖచ్చితంగా ఏది ముందో చెప్పడానికి ఆధారాలు లేవు.

1936 లో 'ఆంధ్రవిశారదుని భాషాసేవ' అంటూ కె. అ. స్వామి ప్రజామిత్ర ఏప్రిల్ 12వ తేదీ సంచికలో ఓ పెద్ద వ్యాసం ధర్మారావును గురించి రాశాడు. అందులో "ఇంగ్లీషునవల స్పెక్టేటరును జూచి యట్టిదాంధ్రమున నుండిన బాగుగదాయని ఇంకను పానుగంటివారి సాక్షి రాకముందే కొండెగాడు అని చిన్న పత్రికలను ప్రచురించుచుండిరి" - అని రాశాడు. దీన్నిబట్టి సాక్షికన్నా కొండెగాడు పత్రికలే ముందు వచ్చి ఉంటాయనవచ్చు. అవి 1912 - 1913 మధ్య కాలంలో ఆరంభమై వచ్చాయని మాత్రం ఊహించవచ్చు. ఏదిఏమైనా అప్పుడప్పుడే రూపాన్ని సంతరించుకుంటున్న కొత్త సమాజంలోని (పెట్టుబడిదారీ) వ్యక్తుల్లో ఉండే వ్యక్తిత్వాల వైరుధ్యాలను ఈ కొండెగాడు సమాజ సభ్యులు ప్రతిబింబిస్తారు. గురజాడ 'గిరీశం' లక్షణాలనూ ధర్మారావు కొందరు సభ్యుల్లో చిలకరించాడు. అన్ని సంచికలూ లభ్యమైననాడు గానీ ఈ వ్యాసాల రూపురేఖా విలాసాలూ, విమర్శనా పద్ధతులూ మనకు స్పష్టంగా అర్థంకావు.

## క్రౌవ్వరాళ్ళు

ఇతర భాషా సాహిత్యాలలో ఉన్న అందాలను తెలుగులోకి తెచ్చి, తెలుగు వారికందించడం వేగుచుక్క గ్రంథమాల ఆశయాలలో ఒకటి. కొత్త సాహిత్య ప్రక్రియలను తెలుగులోకి తీసుకుని రావటం మరొకటి. ఈ ఆశయాలను సాధిస్తూ సంవత్సరానికి నాలుగు గ్రంథాలను ప్రచురిస్తూ 1917 లో ధర్మారావు 'క్రౌవ్వ రాళ్ళు' నవలను వెలువర్చారు. ఇప్పటివరకూ గ్రంథమాల ఉషఃకాలము, వాడేవీడు, ప్రేమము, సుహృల్లత, పద్మినీ, పరిణయం, విలాసార్జునం, సగుణ మూడు భాగాలు ప్రచురించి పదవ మరీచికగా ఈ క్రౌవ్యరాళ్ళను తీసుకొచ్చారు. వీరు తమ ప్రచురణలను "పిల్లల కొరకు, బాలుర కొరకు, బాలికల కొరకు, పండితుల కొరకు, పామరుల కొరకు, వర్తకుల కొరకు, సేద్యగాండ్రకొరకు, సకల జనోపయోగము కొరకని యెంచి" తీసుకొస్తున్నామని ప్రకటించుకున్నారు. "ఒకె విషయము గల ఒకే గ్రంథము, ఒకే గ్రంథకర్త వ్రాసినది అన్ని తరగతుల చదువరులకును రుచించక పోవచ్చునని యెంచి యెల్లరకునుపయోగింపబడు రీతిని వివిధ కర్తలచే వివిధ విషయముల గూర్చి వ్రాయింపించుచున్నాము" - అని గ్రంథ ప్రచురణ ప్రణాళికను వివరించారు.

ఈ గ్రంథమాలలో తొలి మరీచిక ఉషఃకాలము, ఆరవ మరీచిక విలాసార్జునము, పదవది ఈ క్రౌవ్వరాళ్ళు. ఈ మూడూ ధర్మారావు రచనలు. ఈ గ్రంథాలను చూస్తే అవి రాసిన రచయిత ఎవరో తెలియదు. ఉషఃకాలము మీద - 'కలభాషిణి' అనీ, విలాసార్జునము మీద - 'నేను' అనీ, ఈ క్రౌవ్వ రాళ్ళు మీద - "ఉపాధ్యాయుడు" అనీ ఉంటుంది. అయితే అక్కడక్కడ ధర్మారావు తమ ఇతర రచనల సందర్భాల్లో వీటిని తానే రాసుకున్నట్టు చెప్పుకోవటమే మనమీగ్రంథాల అసలు రచయిత ధర్మారావని అనటానికి ఆస్కారం కలిగిస్తుంది. దీనికి సాక్ష్యంగా దేవరాజు వెంకటకృష్ణారావు 8 - 9 - 1960 న బరంపురం నుండి హైద్రాబాద్‌లో ఉన్న ధర్మారావు పేర ఒక పెద్ద ఉత్తరం రాశాడు. అందులో అనేక స్వవిషయాలను పేర్కొంటూ తన సంసార కష్టాలను వివరిస్తూ కాపీరైట్ ఇతరులకు విక్రయించని వేగుచుక్క ప్రచురణల

జాబితాలో "మీ ఉషఃకాలము (ఆటోబయోగ్రఫీ) మీ విలాసార్జునము" (నాటకం) అని రాశాడు. ఇక క్రొవ్వురాళ్ళ ప్రస్తావన చేస్తూ మరికొన్ని ఇతర ప్రచురణలతో దీన్ని కుడా 1955 లో కొండపల్లి వీర వెంకయ్యా పబ్లికేషన్స్ (రాజమండ్రి) వారికి గ్రంధానికి నూరు రూపాయలు చొప్పున అమ్మేశాననీ - తన సంసారపు బాధలే దానికి కారణమనీ కృష్ణారావు బాధపడ్డాడు.

ఈ ఉత్తరం కృష్ణారావు రాయటానికి ముందు 5-9-1960 న ధర్మారావు వారికి ఒక ఉత్తరం రాస్తూ తన గ్రంధాలన్నీ మళ్ళీ ముద్రించుకుంటున్నాననీ తన దగ్గర విలాసార్జునం - క్రొవ్వురాళ్ళు లేవనీ పంపమనీ రాశాడు. దానికి సమాధానమే పై ఉత్తరం. ఇక కృష్ణారావు "క్రొవ్వురాళ్ళను ఇతః పూర్వమే 1955 లో నేనే దాని కాపీరైట్ విక్రయించుట జరిగియుండుట ఇప్పుడు నాకు ఆ 1955 నాటి చర్య - తమ యిప్పటి ప్రయత్నమునకు ఒక టెక్నికల్ ఇబ్బందిగా మారినందుకు నేనెంతేని దుఃఖించుచున్నాను. ఏమి చేయవలెనో తెలియకున్నది. మీరే సలహా చెప్పండి. జరిగినది హృదయ విదారకమైనదే .... నా వలననే మీకు మనో వైకల్యము కలిగి పోయినదే - అనే దుఃఖమమితముగా పొందుచున్నాను ...." అంటూ ఉత్తరాన్ని ముగిస్తూ మళ్ళీ "క్రొవ్వురాళ్ళ గూర్చి నేను శిక్షా పాత్రుడనే - అని అనుకుంటూ ఉన్నాను" అని ఎర్ర సిరాతో రాశాడు. ఈ సాక్ష్యాలూ గ్రంధరచనా విధానం మాత్రమే ఈ పుస్తకాల రచయిత ధర్మారావని లోకానికి తెలియజేస్తాయి. గ్రంధమాల ప్రచురించిన కొన్ని ఇతర గ్రంధాల మీద కూడా రచయితల ప్రచ్ఛన్న నామాలుంటాయి. వేగుజుక్క గ్రంధమాల అనీ గ్రంథ మండలి అనీ రెండూ వాడ్తూందేవారు.60

ఈ క్రొవ్వురాళ్ల నవల తొలి ప్రచురణ జరిగిన కాలంలో దీనికి బాగా పేరు ప్రఖ్యాతులొచ్చాయి. తెలుగు దేశంలో చాలా మారుమూల గ్రామాలకు సైతం ఈ గ్రంధమాల ప్రచురణలైన 'వాడేవీడు', 'సగుణ', మొదలైనవి అందాయి. దేవులపల్లి రామానుజరావు తనకు ధర్మారావుతో పరోక్ష పరిచయం ఈ క్రొవ్వురాళ్ల నవల ద్వారానేనని అన్నాడు. దీని రచయితను తెలుసుకోవడానికి అనేక మంది ఉత్తరాలు రాసి సమాధానాలు పొందేవారట. అప్పటికి ఆంధ్ర ప్రచారిణీ గ్రంధమాల కొన్ని అనువాద అపరాధపరిశోధక నవలలను ప్రచురించింది. వేగుజుక్క కూడా ప్రచురించింది. తీరుబాటుగా ఇళ్లలో ఉండే జనానికి ఈ పుస్తకాలు - చదువే అభ్యాసాన్నీ, అభిరుచినీ కలిగించాయని అనేకమంది అభిప్రాయం.

క్రొవ్విరాళ్లు నాకు లభించిన మొదటి ప్రచురణ ప్రతిలో కేవలం నవలా భాగం ఉందే కాని ముందు వెనుకల ప్రచురణకర్తల మాటలుండే భాగాలులేవు. దీనికి సూచనగా దీని ప్రాశస్త్యాన్ని వివరిస్తూ సంపాదకులు రాసే ఉంటారు. అయితే 1955లో దీన్నే 'కళాప్రచారక సమితి' ప్రచురణగా దేవరాజు వెంకట కృష్ణారావు ప్రచురించాడు. అంటే రెండోప్రచురణ. దీని తర్వాతనే ప్రచురణ హక్కులను ఇతరులకు అమ్మటం జరిగింది. రెండో ప్రచురణకు చివరచేర్చిన ఉపోద్ఘాతంలో ఈ నవల రచనా విధానంలో

— స్వభావ పరిశోధన (రిసర్చ్ ఇన్ ది నేచర్ ఆఫ్ మాన్)
— స్వభావోన్మీలన (డెవలప్మెంట్ ఆఫ్ కారెక్టర్)
— స్వభావ నిరూపణ (కారెక్టరైజేషన్)
— స్వభావ పరిణామము (ఛేంజెస్ ఇన్ కారెక్టర్)
— చారిత్రక విశేషములు (హిస్టారికల్ బ్యూటీస్)
— నూతన భావములు (న్యూ ఐడియాస్)

అనేవి ప్రధానంగా ఉన్నాయని ప్రచారక సమితి కార్యదర్శి అన్నాడు. ఇది ఈ సమితి ప్రచురణల్లో ఆరవది.

క్రొవ్విరాళ్ళు అపరాధపరిశోధక నవలకాదు. మనిషి డబ్బుకు ఎంత గడ్డి తింటాడో ధనవంతుడైనా సరే పరిస్థితులను బట్టి ఎలా దిగజారతాడో చెప్పే నవల. క్రొవ్విరాళ్లంటే సానబెట్టని ముడిరత్నాలు.

వెంకటేశం - శ్రీనివాసరావులు మంచిమిత్రులు. వెంకటేశం చనిపోతూ తన దగ్గరున్న క్రొవ్విరాళ్లను శ్రీనివాసానికిచ్చి అత్తగారింట్లో బాలవిధవగా ఉన్న తన కూతురు మహాలక్ష్మి పెద్దది కాగానే వీటిని అప్పగించమంటాడు. శ్రీనివాసాన్నీ ఒక రాయి తీసుకోమంటాడు. వెంకటేశం కొడుకు రంగూన్‌లో ఉంటూ చనిపోయాడని అందరూ అనుకుంటుండేవారు. అందుకే ఈ ఏర్పాటు.

శ్రీనివాసం మహాలక్ష్మిని తన యింటికి తెచ్చి తన అన్న కూతురు సరస్వతికి తోడుగా ఉంచి పెంచుతుంటాడు. ఈ రాళ్ళ విషయం ఎవరికీ చెప్పడు. శ్రీనివాసరావంటే మంచి గౌరవప్రతిష్ఠలున్న వ్యక్తి. నిస్సంతు. గొప్ప వ్యాపారస్థుడు.

మొదట్లో ఈ రాళ్ళు అంత విలువలేనివిగా భావించిన శ్రీనివాసానికి వీటిల్లో ఒక రాయి విలువే 50 వేలు చేస్తుందని తెలిసినప్పుడు ఆశపుడుతుంది. వీటన్నింటినీ కాజేయాలన్న తలంపు కలుగుతుంది. తన ఊహలెవరూ పసిగట్ట కుండా జాగ్రత్తపడ్తూనే రాళ్ళను దాచేసి ఇంట్లో దొంగలుపడి ఎత్తుకెళ్ళారన్న వదంతి లేవదీస్తాడు. అడుగడుగునా మానసికంగా తను చేసిన మిత్రద్రోహం

కట్టికుడుపుతుంటే మతిభ్రమణం పొంది ఆ రాళ్ళు విసిరేస్తూ జారి పడి అవే గుచ్చుకుని చనిపోతాడు.

కథ ఎన్నో మలుపులు తిరుగుతుంది. వెంకటేశం కొడుకు కృష్ణమూర్తి వచ్చి ఈ రాళ్లవ్యాపారం ఆరా తీసి శ్రీనివాసాన్ని అడగటంతో కథ వేగం పుంజుకుంటుంది. రహస్యంగా చేసే ఈ రాళ్ళ వ్యాపారంలో శ్రీనివాసంతో చేతులు కలిపిన సీతారాం అన్న పాత దొంగ కృష్ణమూర్తి మిత్రుడు కావటం అన్నది శ్రీనివాసం ద్రోహం వేగంగా పండటానికి కారణమవుతుంది.

శ్రీనివాసాన్ని దేవుడుగా నమ్మిన గుమాస్తా నరసింహారావు, అన్నకూతురు సరస్వతి, వెంకటేశం కుమార్తె మహాలక్ష్మిలకు చివరి వరకూ శ్రీనివాసం ముసుగుమనిషన్న భావం రానేరాదు. వచ్చిన తర్వాత అతని శవం తప్ప మరేం మిగలదు.

కథారంగం రెండు మూడు స్థలాలు మారుతుంది. తాగుబోతూ తిరుగుబోతూ అనుకున్న కృష్ణమూర్తి మారటం, కళ్లముందరి దైవంలా లోకంలో చెలామణీ అవుతూ ప్రతిష్ఠా, గౌరవాలనే తింటూ జీవిస్తున్న శ్రీనివాసం ఆశా మోహంతో పచ్చిదొంగగా పరిణామం చెందటం ఈ క్రొవ్వురాళ్లలో చూస్తాం.

క్రొవ్వురాళ్ళలో అసలు దాగున్న రత్నాన్ని పసిగట్టి వెల గట్టాలంటే దాని చుట్టూ ఉన్న కొవ్వును కొయ్యాలి. సానబెట్టాలి. అప్పుడే నిజమైన దాని రంగు బయటపడుతుంది. ఈ అర్థాన్ని రచయిత తన నవలలో శ్లేషార్థంలో చాలా చక్కగా ప్రధాన పాత్రలెలా ముసుగులో లోకాన్ని భ్రమింప జేశాయో చెప్తాడు.

కథ నడుస్తున్నంత కాలమూ రచయిత మనల్ని నడిపించుకెళ్తూంటాడు. నవలలో పాత్రలతో మాట్లాడ్తాడు. పాత్రల చేష్టలకు మనల్ని కుదిపి వ్యాఖ్యానం చేసి చెప్తూంటాడు. అంతేకాదు ఏ పాత్ర అన్నా తన కార్యక్రమంలో మునిగిపోయి ఉంటే దాన్ని కదిలించి తర్వాత చెయ్యాల్సిన పనిని గుర్తుచేస్తూ పదమంటూంటాడు. పాత్రలు అవాక్కయి ఆలోచిస్తూంటే రచయిత ఎక్స్‌రే కళ్లతో వాటి మెదళ్లను చూసి చదువరుల కళ్ల ముందు అసలు రూపం నిలబెడ్తుంటాడు.

నవల రెండు భాగాలు. మొదటి భాగంలో తొమ్మిది ప్రకరణాలు. రెండవ భాగంలో ఎనిమిది ప్రకరణాలు. శ్రీనివాసానికి క్రొవ్వురాళ్ళు దక్కటం నుండి, వెంకటేశం కొడుకు కృష్ణమూర్తి ఆ రాళ్ళ నగగటానికి శ్రీనివాసం ఇంటికి రావటం వరకూ మొదటి భాగం; కృష్ణమూర్తి, సీతారామూ, శ్రీనివాసమూ ఈ రాళ్ళను తామే దక్కించుకోవాలని వేసి ఎత్తుల పై

ఎత్తులతో రెండవ భాగం ఆరంభమై శ్రీనివాసం మరణంతో రాళ్ళను కృష్ణ మూర్తి వస్తే ఇవ్వమనటంతో ఆఖరవుతుంది. ప్రకరణాల చివర 'సింహావలోకనం' అంటూ ఆ ప్రకరణంలో జరిగిన విషయం అందులోని పాత్రల మీద గానీ, చదువరులలోగానీ ఎలాంటి ప్రభావం చూపిందో వివరించటమన్నా లేక పోతే రానున్న ప్రకరణానికి అతకటానికి వీలైన సంక్షిప్త కథా భావ సూచన నన్నా చేస్తుంటాడు రచయిత.

మనిషి స్వతహాగా మంచివాడే కాని ఎదురయ్యే పరిస్థితులు అటు దుర్మార్గుడుగానో సన్మార్గుడుగానో చేస్తుంటాయని సుబ్రహ్మణ్యం కృష్ణమూర్తి పాత్ర ద్వారా రచయిత చెప్పాడు.

మనిషిలో చోటు చేసుకున్న ఒక ఆలోచన క్రమంగా ఏ విధంగా పరాకాష్ఠకు చేరుకుని అదే - దురాశైతే, నాశనం చూసి కానీ వదలదో అనేక ఘట్టాలను సృష్టిస్తూ శ్రీనివాసం పాత్ర ద్వారా రచయిత వెల్లడిస్తాడు.

పాత్రలు బలంగా ఉండాలంటే మొదటినుండీ వాటి చిత్రణ స్వభావ సిద్ధంగా ఉండాలి. ఏయే పరిస్థితుల్లో ఆయా పాత్రలు నిజజీవితాల్లో ఎలా వ్యవహరిస్తాయో అదేవిధంగా నవలలో కూడా నడుచుకోవటానికి రచయిత చాలా శ్రమించాడు. శ్రీనివాసాన్ని దొంగగా అన్న కూతురు సరస్వతి కూడా నమ్మాలంటే ఖచ్చితమైన నిదర్శనం ఉండాలి. అందుకే ఛాయాగ్రాహక లక్షణం ఆమెకు ఇచ్చి ఫోటోలపై వేలిముద్రలు పసిగట్టిన సందర్భాన్ని ఏర్పాటుచేసి చిన్న పాత్ర సరస్వతికి కూడా వెన్నెముకను ఏర్పాటుచేశాడు రచయిత.

దొంగలను పసిగట్టటం - వజ్రాలను వెలగట్టడం, కొత్తతరహా దొంగతనాలకు రూపునివ్వడం దొంగల మధ్య పంపిణీ తగాదాలు - బ్యాంకింగ్ పద్ధతులూ - ఛాయాగ్రాహకాభ్యాసం, టెలిఫోను వంటి అనేక కొత్తకొత్త అంశాలకు నవలలో చోటిచ్చి నూతనత్వాన్ని సంతరించి పెట్టాడు.

పఠితలకు మరింత ఉత్సాహం కలగటానికి నరసింహారావు సరస్వతుల ప్రణయాన్ని అంతర్నదంగా నడిపించాడు.

నవలలో కొన్నిచోట్ల చైతన్యస్రవంతి ఛాయలూ, కొన్నిచోట్ల అధివాస్తవికతా ధోరణులూ, మానసిక విశ్లేషణ సందర్భాలూ ఎదురవుతూంటాయి. మన దేశంలోకి అప్పుడప్పుడే వస్తున్న ఫ్రెంచి సాహిత్య ధోరణులను బీజప్రాయంగా ఈ నవలలో చూడగలం. నవలలో ధనం మీదా, ధనికుల మీదా చురకలు వేస్తూంటాడు రచయిత.

ధనికుడికి ప్రతినిధి శ్రీనివాసం. అతని అత్యాశను చెప్తూ "శ్రీనివాసము ముఖము కూడ నొక క్రొవ్వురాయిగా పరిణమించెను..... .. ఇది గొప్పవారల మారు మొగము".

''హా ధనికులారా మీ పేటికల మురుగుచుండు నాణెముల మీద గప్పు చుండు త్రుప్పునకు మీ మోములు పారముల జెప్పజాలునుసుడీ. మీకడనుండు సువర్ణరత్నముల మూయుచుండు గల్లని ఇనుప పేటికలకు మీ ముఖములు అక్షరాభ్యాసంబు జేయింప సమర్థంబులు సుడీ"- అని వ్యంగ్యంగా లోకంలోని ధనవంతుల ముసుగుమొహాలను తన కలంతో చీలుస్తాడు.

ఈ క్రొవ్వురాళ్ళ రచన గ్రాంథికంలో సాగింది (1917). పాత్రోచిత భాష కూడా లేదు. అయినా చిన్నచిన్న తెలుగు వాక్యాలతో గ్రాంథికం పట్టివ్వ కుండా సాగుతుంది.

ధర్మారావు వచన రచనా పరిణామంలో విలాసార్జునం - విన్నపం- ఉషఃకాలము తర్వాత ఇది సారళ్యాన్ని సంతరించుకున్నట్టే. గ్రంథమాల ఆశయాలకు అంటే ప్రజల భాషలో గ్రంథాలు రాయాలన్నదానికి కొంత సమీపానికొచ్చినట్లే.

## 'శ్రేకి' రచనలు

కొత్తకెప్పుడూ వాకిళ్ళు తెరిచే స్వభావం ధర్మారావుది. తాను కృషి చేస్తున్న సాహిత్యరంగానికి సంబంధించినదైతే మరింత ఉత్సాహం చూపే వారు. అందుకని కొత్తకెప్పుడూ పరుగులెట్టేవారనీ - పాతను మర్చిపోయే వారనీ కాదు. గురజాడ పలుకుబడి పాతకొత్తల మేలు కలయిక అన్నది సాహిత్యరంగంలో నానుడిగా మారుతున్న కాలంలోనే ధర్మారావు కలం అందుకున్నాడు. కనుక ఈ సమన్వయ లక్షణం తమకు తెలియకుండానే వారిలో ప్రవేశించింది. క్రమంగా తనభావం అదేనని ఖండకృతుల రచనా సమయంలోనూ, వేగుచుక్క గ్రంథమాల గ్రంథాల ప్రచురణ సందర్భంలోనూ అనేకసార్లు తెలియచెప్పాడు. కనుక ఆనాటి నూతన ప్రక్రియల్లో ఒకటైన వ్యాసం విషయంలో ధర్మారావు అభిప్రాయం వారి ఆచరణ పరిశీలించటం అవసరం. ఎందుకంటే వ్యాసం, నవల వచన రచనా రూపాలు కనుక.

19 వ శతాబ్దం చివరి వరకూ వ్యాసానికి తెలుగులో ఒక రూపం రాలేదు. పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్లే వ్యాసం భారతీయ భాషల్లో వచ్చినట్లే తెలుగులోనూ ప్రవేశించింది. అదీ 19 వ శతాబ్దం పూర్వార్థం అనవచ్చు.

మనకు తెలిసినంతవరకూ 1840 - 1850 లలో సామినేని ముద్దు నరసింహం నాయని రాసిన 'హితసూచని' వ్యాసాల సంపుటమే మొదటిది. అయితే ఇది 1862 లో అచ్చయింది. ఇందులో వ్యాసాలను 'ప్రమేయాలు' అన్నాడు రచయిత. ఇక పరవస్తు వెంకట రంగాచార్యులు (1822 - 1900) తమ వ్యాసాలను 'సంగ్రహం' అని అంటే, కందుకూరి వీరేశలింగం (1848 - 1919) 'ఉపన్యాసము' అన్నాడు. 1852 లో బ్రౌను తన నిఘంటువులో ''వ్యాసము వ్రాసేవాడు గ్రంథకర్త" అని అన్నాడు. అంటే అప్పటికే వ్యాసం అన్న పేరు లోకానికి పరిచితమైందన్న మాట.

వీరేశలింగం పూర్వులూ, సమకాలికులూ ఈ వ్యాసాన్ని పరిపుష్టం చేశారు. దీన్ని నాటి పత్రికలు ప్రధానంగా అముద్రిత గ్రంథ చింతామణి, గ్రంథాలయ సర్వస్వము, తెలుగు, ఇంకా నాటి పండితులు నడిపించిన అనేక పత్రికలూ పెంచి పోషించాయి. సాధారణంగా వ్యాసం సారస్వత విషయాలనే ఆనాడు వస్తువుగా కలిగి ఉండేది.

'గద్యం కవీనాం నికషం వదంతి' - అని సంస్కృత సూక్తి అయితే 'కవికి గీటురాయి గద్యమైతే గద్యకి గీటురాయి వ్యాసం' - అన్నది హిందీలో రామచంద్ర శుక్ల సూక్తి. వ్యాసం చిన్న రచన. సుదీర్ఘమైందీ, జటిలమైందీ, దుర్బోధ్యమైందీ కాకూడదు. వ్యాసం గొప్పతనం శైలి మీద ఆధారపడి ఉంటుంది. ఇంగ్లీషులో పోప్ లాంటి వారు వ్యాసం పద్యంలో రాసినా అది వికసించలేదు. అందుకే తర్వాత వ్యాసం వచనంలోనే ఉండాలి అన్న నిబంధన తనకు తానుగా రూపొందింది. ''ఒక విషయాన్ని విరివిగా రాయటమనీ, ఒక చరిత్రాంశమును రాయటమనీ, విషయగ్రహణం చేసి దాన్ని అంశ విభజనంతో వివరించటమనీ," మన నిఘంటువులు అనేకరకాలైన వివరణలిచ్చాయి. ఈనాటి వ్యాసం చూస్తే ఇవన్నీ కొద్దోగొప్పో అందులో కనిపిస్తూనే ఉంటాయి.

వ్యాసాలను ధర్మారావు తననాటి పండితులు ఏ సాహిత్యవిషయకంగా (విన్నపాలను రాస్తూ) ఉపయోగించారో, వీరూ మొదట అదే విధంగా 'విన్నపం'ద్వారా రాస్తూఅడుగెట్టారు. విశేషంగా ఇతర దేశాలకు సంబంధించిన గ్రంథాలను చదివే అవకాశాలొస్తున్న కాలంలో అందులోని విశేషాలను తెలుగు వాళ్ళకూ చెప్పాలన్న కుతూహలం ధర్మారావులో పెరిగింది. తాను ఆయా సందర్భాల్లో వివిధాంశాలను గురించి సేకరించుకున్న సమాచారాన్ని 'లేక్తి'

అన్న పేరుతో 'పుష్కరిణి' లాంటి పత్రికల్లో చిన్న వ్యాసాలుగా రాశాడు. 'లేకి' అంటే 'ఏరుకొనే వాడు' అని అర్థం. ధర్మారావే ఒకచోట 'లేకి,' 'తా.ధ'- నానా భాషా వాఙ్మయ కేదారంబుల నేఱికొనిన కామ్యజ్ఞాన విశేషంబులని రాసుకున్నాడు. అది సాహిత్యం కానీ - చరిత్ర కానీ ఆ విషయాన్ని ఒక చిన్న వ్యాసంలో చెప్పటం వీరి అభిమతం. దానికి తగ్గ పేరూ పెట్టుకున్నాడు.

'త్రివేణి' అనే వ్యాసంలో[61] జగన్నాథ పండితుని ధారణాశక్తిని ప్రదర్శించే కథను చెప్పాడు. త్రివేణీ స్థల మాహాత్మ్యం ప్లినీ, టాలమీలు వర్ణించటాన్ని చెప్తూ, విలియం జోన్స్ సంస్కృతోపాధ్యాయుడు జగన్నాథ తర్కపంచానన మహాపండితులనీ వారి జన్మస్థలం త్రివేణనీ అంటూ వ్యాసాన్ని రెండున్నర పుటలలో ముగించాడు.

ఇదే విధంగా అల్లావుద్దీన్ దండయాత్రలో తాను సేకరించిన ధనరాసులనూ, దేవాలయ దోపిడీ ధనాన్నీ 'దక్షిణాపథమున 14 వ శతాబ్దమునగల యైశ్వర్యమన్న' - చిన్న వ్యాసంలో విపులంగా రాశాడు.

అలాగే 'వజ్రముల' గురించి తాను అనేక గ్రంథాల్లో సేకరించిన విషయాలనొక చిన్న వ్యాసంగానూ, ఫెర్నాండ్ న్యూనిజ్ రాతల ఆధారంగా ఒక చిన్న 'గుజరాతు చరిత్ర' రచనచేశాడు ధర్మారావు.

ఈ చిన్న వ్యాసాల్లోని భాషలో కొద్ది మార్పును గమనించగలం. అరసున్నలు పోయాయి. బండిఱాలు అంతగా కనిపించవు. వాక్యాలు పెద్దవైనా కఠినమైన శబ్దాలూ, దీర్ఘసమాసాలూ దొర్లవు.

'త్రివేణి' లో

.... ....

"న్యాయాధిపా, నేనానాడు వీరు కలహించుచుండుట చూచితిని."

'దక్షిణాపథమున 14 వ శ. గల యైశ్వర్యము' లో

.... .... .... .... .... .... .... . .. .... ..

"దేవాలయంబులందలి ధనమును దీనిబట్టి కడుంగడు విశేషమని నిర్ధారణ చేయనగును."

'వజ్రములు' లో

... ....

"రాయల గుఱ్ఱమునకు మస్తకాభరణంబున నాయకమణిగ నమర్పబడిన వజ్రము కోడిగ్రుడ్డంత యుండెననియు నద్దానిని విజయనగర పతనమున" - అని ఇంకా సాగుతుంది.

ఈ వ్యాసాలన్నీ 1920 కి పూర్వం రాసినవి. - వచనం రాయటంలో

అభ్యాసానికి, సారళ్యసాధనకూ ధర్మారావుకు ఉపయోగపడి ఉంటాయి. చెప్పే విషయాలు కొత్తవి అయినా, సూటిగా చెప్పాలన్న కాంక్ష ఉన్నా, శబ్దా ప్రయోగం - వాక్య నిర్మాణం మాత్రం ధర్మారావును వెనక్కే లాగుతోందని తోస్తుంది.

## 'జొన్నకల్లి' ప్రశ్నలు

ధర్మారావు ఆ తర్వాత రాసినవి 'జొన్నకల్లి ప్రశ్న' వ్యాసాలు. ఇవి అయిదు లభించాయి. కొన్ని భారతిలో ప్రచురితమయ్యాయి.

ధర్మారావు మొదట్లో ఈ వ్యాసాలనాధారంగా చేసికొని తన స్వీయ చరిత్ర రాద్దామని అనుకొని ఉండచ్చు. ఎందుకంటే ఈ జొన్నకల్లి వ్యాసాలు 1, 2, 3 లలో కేవలం వారి చిన్నతనం విశేషాలున్నాయి.

జొన్నకల్లి ప్రశ్న అనేది ఎలా వచ్చిందో విడమర్చి చెప్తూ తను వేసే ప్రశ్నలకూ, ఇతర్లు వేసిన ప్రశ్నలకు తానిచ్చిన సమాధానాలకూ తమ తల్లి 'వీడు వట్టి జొన్నకల్లి' అన్నారన్నాడు. ఈ జొన్నకల్లి ప్రశ్న సంకర సమాసం ఎలా అయిందా అని ఊహలను కలబోస్తూ చివరకు తెలుగువాడు తెలుగులో అడుక్కోలేడని వ్యంగ్యంగా అన్నాడు. ప్రశ్నకు తెలుగు మాట తట్టిదంటూ మధ్యలో అటూ ఇటూ పదాల అందాలూ, అర్థాలమీద చమత్కారాలు రచయిత చేస్తాడు. చివరికి బుద్ధే తనకు మేలు చేసిందంటూ "చదువు సాముల సహాయము చేసెను. ఉద్యోగమునకుత్సాహమిచ్చెను. చరిత్రకు చేయూతనొసగెను. మతములో మంచి చెడ్డల నెఱిగించెను. సంఘ జ్ఞానము చక్కబరచెను. దేశ విశేషములు తేట చేసెను. ఇంకనెన్నియో భంగుల లాభకారియాయెను" - అని జొన్నకల్లికు కృతజ్ఞత చెప్పుకుంటాడు.

రెండవ వ్యాసంలో లెక్కలు చేస్తున్న తనను తల్లి స్నానానికి రమ్మన్న దాన్ని కేంద్రంగా చేసుకుని ఊహాపోహలతో అల్లిక చేసుకుంటూ తన జీవితంలో ఈ ఎడదెడ్డ మంటే పెడదెడ్డమనే తత్వం చేసిన మేలును వివరించాడు.

ఔనన్నది కాదనే గుణమే తనను తల్లి "నీవు చేసిన లెక్కలు తప్పేమో నాన్నగారికి చూపించుకో" మంటే, 'తప్పుకాదేమో' - అని అనిపిస్తూ తర్క బుద్ధిని మాపెట్టిందని అంటాడు. ఇదే తనకు జీవితంలో మంచి చెడులకు

ఆధారమౌతూ "స్వయంకృషికి మార్గదర్శకమూ ఆడంబరం మానుకొనుట కాది సూత్రము" అయిందని ముగిస్తాడు.

మూడవ ప్రశ్నలో ధర్మారావు తన ఏకసంతాగ్రాహిత్వాన్ని చెప్తూ తల్లి తనను ఏదైనా 'నేర్చుకొనగానే సరియా జ్ఞాపకముంచుకొనుటెంత కష్టము' అని అంటే "మఱచిపోవుట మఱింత కష్టము" అని అన్న విష యాన్ని విశదపరుస్తాడు. చదివేటప్పుడు నేర్చేటప్పుడు కుదురుగా మనసు పెట్టి నేర్వటం ప్రతి విద్యార్థికుండవలసిన లక్షణంగా ఇక్కడ అన్యాపదేశంగా చెప్తాడు. విద్యార్థికి ఆత్మవిశ్వాసం ఉండటం అవసరమనీ అదే ఈ మాట అని పించగలదన్న భావాన్ని కుండబద్దలుకొట్టినట్టు చెప్తాడు. ఈ జ్ఞాపక శక్తే ధర్మారావును వివిధ విషయాలను భిన్నభిన్న సందర్భాల్లో వాటిని ఉపయో గించుకొని పైకి రావటానికి తోడ్పడింది. భవిష్యత్తులో పత్రికా రచయితగా రూపం సంతరించుకోటానికి ఆలంబనమైంది.

నాలుగవ వ్యాసం "రాముడికి సీత యేమగును?". మొదటి మూడూ పూర్తిగా ధర్మారావు జీవిత విశేషాలనూ వారికబ్బిన ప్రశ్నించే గుణాన్నీ ప్రద ర్శించాయి. ఇక దీంట్లో తనకున్న పై గుణంతో ముందు సాహిత్యం, అదీ ఆదికావ్యంలో విషయాన్ని ప్రశ్నించటానికి ధర్మారావు తలపడ్డాడు.

రామాయణమంతా విని రాముడికి సీతేమౌతుందన్న సామెతను తీసు కున్నాడు. ఈ ప్రశ్నలో ఉండే సందర్భాన్నీ, ఔచిత్యాన్నీ విడమర్చి చెప్పాడు. పరిశోధించాలి, అప్పుడే అడిగినవాడు పరమ మూర్ఖుడో విద్వాంసుడో తేలు తుందని అంటూ ఆరంభిస్తాడు.

భారతదేశంలో అప్పటికున్న విభిన్న ప్రాంతాల రామకథలనూ వివిధ పురాణాల్లో ప్రసక్తాలైన రామ వృత్తాంతాలనూ, ప్రపంచ వ్యాప్తంగా బౌద్ధ జాతక కథల్లోని రామకథా సందర్భాలనూ తనకు సాక్ష్యాలుగా తెచ్చుకున్నాడు. వీటన్నిటినీ క్లుప్తంగా చెప్తూ ఇవన్నీ విన్న తర్వాత రాముడి - సీతల బాంధవ్యం మీద ఎవరికైనా అనుమానం రాదా ? అంటాడు. ఆయా దేశాలలో అమల్లో ఉన్న ఆచారాల ననుసరించి వీరి బంధుత్వాన్ని చెప్పారు కానీ ప్రపంచమంతా రామకథ వాల్మీకి రచన మాదిరే లేదన్నదాన్ని ధర్మారావు నిరూపించాడు. వ్యాసం ముగిస్తూ 'కుశాగ్రబుద్ధులగు పాఠకులు పరిశోధనల గావించి పక్షపాత పిశాచంబు వాతబడక లోకంబుల నుండదగు సత్యమును వెలువరింతురుగాక యని ప్రార్థింతును' అని విజ్ఞప్తి చేశాడు రచయిత.

ధర్మారావు ఆశ ఫలించిందనవచ్చు. 1924 వ సంవత్సరంలో భారతి ముఖంగా చేసిన విజ్ఞప్తి చాలాకాలం తర్వాత ఆరుద్ర పరిశోధనా గ్రంథంగా

రాముడికి సీతఏమౌతుంది ? అన్నదాన్ని 1978 లో బయటకు తెచ్చాడు. చక్కని పరిశోధనాధారాల మీద నిర్మించిందీ గ్రంథం. నిజాన్ని లోకానికి చాటటం అవసరమన్న భావం దీని వెనక ఉంది. సురవరం ప్రతాపరెడ్డి కూడా రామకథలు ఇతర మత గ్రంథాలలో ఉంటే అవి మతాన్ని గేలిచెయ్యటానికి రాసిన రాతలనీ, ఆ మతంవారు నాస్తికులూ - వేద విరుద్ధులూ-వేదబాహ్యులూ అని ఉపేక్ష చెయ్యరాదని అంటాడు. ఇంతవరకూ చేసిందదేనని మనలో ఉన్న ఉపేక్షాభావానికి బాధపడ్డాడు.62 తర్వాత్తర్వాత రామాయణం మీద సామాజిక దృష్టితో నిజాన్ని వెలువర్చాలన్న కోరికతో నార్ల చాలా పరిశోధన చేసి జాబాలి, సీత జోస్యం లాంటి కొన్ని గ్రంథాలు రాశాడు. రామాయణ విష వృక్షం వంటి రచనలూ వెలుగులోకి వచ్చాయి. రామాయణం రంకు భారతం బొంకు అన్నదాన్ని నాటి సామాజికాచార వ్యవహారాల వెలుగులో పరిశీలిస్తే అసలర్థం విశదమవుతుంది.

జొన్నకఱ్ఱి వ్యాసాల్లో లభించిన వాటిలో ఆరవదీ చివరిదీ 'ఓనమాలు' అన్న రచన. "రాముడికి సీత ఏమౌతుంది?" - అన్నదానిలాగే ఇదీ చాలా పరిశోధనాత్మకంగా రాసిన రచన. అక్షరశారదా ప్రశంసలో పరిశోధించి ఇంతకు పూర్వం చెప్పిన అంశాలకు, మరికొన్ని చేర్చి 'ఓనమాలు' రాశాడు. అయితే ఇందులో ఇతర భాషల్లోని తొలి అక్షరాలతో తులనాత్మకంగా పరిశీలిస్తూ విమర్శ కొనసాగించాడు. లిపి పరిణామాన్ని రుచి చూపించాడు. కొన్ని పదాలకర్థాలనూ - ఉత్పత్తులనూ అవి ఏ ఇతర భాషాపదాల నుండి వచ్చాయో తెలిపాడు. అక్షరశబ్దం వచ్చిన తీరును చెపుతూ కొమర్రాజువారు చెప్పినపద్ధతి ''ఊహకు సంతోషింపవలెనేకాని ఉత్పత్తిని మాత్ర మొప్పుకొనరాదని'' ఖండితంగా అన్నాడు. 'వర్షము' అనేదాని ఉత్పత్తిని చెబుతూ సంగీతానికీ - దీనికీ ఉన్న సంబంధాన్ని తలలూపించేలా విశదీకరించాడు.

ఈ ఓనమాల సంగతి ధర్మారావును మొదట్నుండీ పట్టుకొన్నట్టుంటి. వివరాలను ఒకసారి పద్యాల్లోనూ, మరోసారి వ్యాసరూపంగానూ చెప్పి అంతటితో వదల్లేదు. 1942లో చల్లపల్లి రాజా కుమారుడు అక్షరాభ్యాస సందర్భంలో ధర్మారావు ఒక పెద్ద రగడే చేశాడు; ఈ ఓనమాల విషయం లేవదీసి. ఈ విషయం తర్వాత వివరంగా పరిశీలనకొస్తుంది.

ఈ జొన్నకఱ్ఱి వ్యాసాలు 1920 - 1926 ల మధ్య రాసినవి. అచ్చయిన కొన్నీ ఆకాలంలోనే. మొదట్లో ఈ పేరుమీదే జీవితచరిత్ర రాసుకుంటూ ఈ ప్రశ్నావళి ద్వారా అనేక విషయాల మీద తాము చేసిన పరిశోధనాంశాలను వెల్లడించాలనుకొని ఉంటాడు. కొన్నే వివరించగలిగాడు. భాషలో గమనించ

దగినంత సారళ్యం చూడగలం. చెప్పే తీరులో సూటిదనం ఉంది. ప్రతి రచయిత తను చేసే రచనకు ముందు ఈ రచన ఎలాటి పాఠకుల నుద్దేశించి అని ఆలోచిస్తాడు. ధర్మారావు దృష్టి క్రమంగా పండితప్రకాండుల లక్ష్యం నుండి కింది జనం వైపు మళ్ళుతోంది. అయినా తన భావాలనూ, పాండిత్యాన్నీ విడిచిపెట్టలేదు. పండితుల లక్ష్యంగా సాగే ధర్మారావు పాత ప్రబంధాల వ్యాఖ్యానం, శబ్దార్థచర్చలూ, మరోవైపు సారంగధర, విజయవిలాసాల నాధారంగా చేసుకుని సాగిస్తూనే ఉన్నాడు. వేటూరి ప్రభాకరశాస్త్రి, వేదం వెంకట్రాయశాస్త్రి ప్రభృతులతో సిగపట్లు పడ్తూనే ఉన్నాడు. కానీ ఈ వ్యాసాల్లో కూడా వెనకటి చూపూ, రచనా పద్ధతీ కొద్దిగా మారటం కనిపిస్తుంది. లోకజ్ఞానమే తన 'పదార్థాలను పసిగట్టటానికి' - వ్యాఖ్యానం చెయ్యటానికి తోడ్పడిందని పదేపదే చెప్పుకుంటున్న ధర్మారావులో మార్పు తన్నుకొస్తోంది.

ఈ మార్పు 'విషయం' లోనూ 'రూపం' లోనూ వస్తోంది. రూపం విషయంలో వచనం చేపట్టటానికి ఈ వ్యాసాలన్నీ రంగాన్ని సిద్ధం చేశాయి. విషయం తీసికొంటే దాన్ని పరిశీలించాల్సిన పద్ధతిలో మార్పుకు ప్రముఖ చరిత్ర పరిశోధకులు వేదం వెంకటాచలయ్యగారి మిత్రత్వమే కారణం అనుకోవచ్చు. రాముడుకి సీత .... ఓనమాల వ్యాసాలకు తప్పకుండా వీరి బుద్ధే ధర్మారావు వెన్నుతట్టి ముందుకు తోసింది. జొన్నకల్లు ప్రశ్నలనే ఇతర ప్రాంతాల్లో బహుశా చొప్పదంటు ప్రశ్నలంటారు.

## అచ్చు తప్పు

శుక్లనామ సంవత్సరంలో సమదర్శిని ఉగాది ప్రత్యేక సంచికను తెచ్చింది. అందులో ఓ 'అచ్చుతప్పు'. అంత పెద్దపుస్తకంలో ఓ అచ్చు తప్పు కాదు - వందలూ వేలూ .... ఉండచ్చనుకోవచ్చు. కానీ అక్షరాలా ఒకటే. అది ఆపేరుతో వచ్చిన ఒక వ్యాసం. చిన్నది. రాసింది 'కొండెగాడు'. మారుపేర్లతో పరకాయప్రవేశం చెయ్యటం ధర్మారావుకి తొలి రచనలనుండీ ఉన్న విషయమని వేగుచుక్క గ్రంధమాల పుస్తకాలే నిదర్శనాలు. అదీకాక ధర్మారావు పెట్టిన తొలిపత్రిక కొండెగాడు. దాన్నే ప్రచ్ఛన్న నామంగా ఇక్కడ వాడుకున్నాడు.

రచయిత అత్యంతాధునిక భావాలతో ఓ మూడు ముత్యాల సరాలు కూర్చి 'మురళీ మోహన' మని పేరెట్టాడు. అందిన శ్రోతలకు వినిపిస్తే బాగుందన్నారు. దీన్నే ఖండకావ్యంగా చిన్న పుస్తకంగా అచ్చేసి 'నలుగురికిస్తే' - అమ్మటంకాదు - సంతోషిస్తారని ఆశించాడు. అచ్చేశాడు ఎవరి కాళ్ళో పట్టుకుని. తీరా అచ్చు కాపీ చూస్తే "రెండవ పద్యం మూడవ పాదంలో ప్రణయమని ఉండటానికి బదులు ప్రళయమని అచ్చుపడ్డాది." రచయిత కొంప మునిగింది. భావమంతా గంగలో కలిసిందని బాధపడ్డాడు. ఆలోచించాడు. చివరకు 'ళ' ఉండటమే ఆ చిన్ని పొత్తానికి - కావ్య భావానికి నప్పుతుందని తర్కించి తర్కించి మనసు సరిపెట్టేసుకున్నాడు. ఇదీ కథ.

ఇందులో ఏమీ లేదు. కానీ ఉన్నదంతా రచయిత ఆలోచిస్తూ చేసిన విమర్శలే. నిజంగా ధర్మారావు విమర్శలే. ఆ దూకుడంతా భావ కవిత్వం పైనే.

భావ కవిత్వం ఖండికలుగా వస్తున్నది కనుక ఏ రెండు మూడు పద్యాలు రాసినా అతడు మహాకవి అన్నదో విమర్శ. భావకవిత్వం నిండా ప్రణయం తప్ప మరోటుండదనీ "ప్రతి పుస్తకంలోనూ ప్రణయమే. ప్రతి పాటలోనూ ప్రణయమే. చిన్న కథల్లోనూ, నవలల్లోనూ, గీతాల్లోనూ, నాటకాల్లోనూ, అన్నిటిలోనూ ప్రణయమే. ప్రణయ హత్యలు, ప్రణయ రోదనాలు, ప్రణయ క్రాపింగులు, ప్రణయ హోటళ్ళూ అన్నీ ప్రణయ వస్తువులే. అంతా ప్రణయమే. ప్రణయం ప్రకోపించి పోయిందంటారా, లేదంటారా?" - అని ప్రణయ విమర్శ చేసేశాడు రచయిత. ఇది నాటి భావకవిత్వంలోని వస్తువూ, పదజాలం; చివరకు అది రాసే కవుల కట్టూ బొట్టూ, తీరూ తెన్నూ అన్నిటి మీదా చేసిన విమర్శ. భావకవిత్వమంటే ధర్మారావుకున్న అభిప్రాయం ఈ వచన రచనలోనే కాదు 'విచారణ దినం' అన్న పద్య రచనలో కూడా వ్యక్తీకరించాడు.

సందర్భం వస్తే వదులుకోటం ఎరగని ధర్మారావు "పాపం, వేటూరి ప్రభాకరశాస్త్రి గారి లాటివారెవరో 'ణ' కు 'ళ' వంటి గురుతుంటే బాగుంటుందని లిపిసంస్కారము చేశారేమోననీ" మొదట ఈ కొండెగాడనుకొన్నాడని అన్నారు. ఆ కాలంలో విజయవిలాసం వ్యాఖ్యానం మీద వీరికి వేటూరి వారికి పత్రికాముఖంగా వాగ్వివాదాలు సాగుతున్నాయి. దాన్నే చొప్పించేశారిందులో.

ఇక ... ఆనాటి తెలుగు పుస్తకాల్లో ఉండే తప్పొప్పుల పట్టిక ఆనవాయితీని క-చిన్న వ్యాసంలో 'తప్పు లేకుండా అచ్చు వేస్తే తప్పు గాబోలు

ఈ తెలుగు వాళ్ళకి'. తెలుగచ్చులో తప్పు లేకపోతే దేవతలు శపిస్తారో. కాబట్టే అశుద్ధ పత్రికలాంధ్రంలో అలవాటయిపోయినాయి' - అన్నారు. 'అశుద్ధ పత్రిక' అన్న పదాలు వాడి భావకవిత్వాన్ని అచ్చేస్తూ ప్రోత్సహిస్తున్న పత్రికలమీద ఎంత ఘాటు విమర్శ చేయచ్చో అంతా చేశారు.

'శ' ను సరిపెట్టుకుంటూ "కొండెగాడు' వాడిన వాక్యాలు "పద్యంలో రుధిర పాత్ర, రక్తసీదువు, నీలాభ్రపంక్తులు, హృదయ విదారణాలు" ఇవన్నీ ప్రళయ కాలాన్ని వర్ణించటానికే సరిపోతాయంటూ నాటి భావకవుల పదజాలానికి రెండోవైపు తిప్పి చూపిస్తూ విమర్శించాడు.

చివరకు వ్యాసం ముగిస్తూ తన రాతే 'ణ' ను 'శ' కన్పించేలా చేసిందంటూ అది "ప్రణయ భావాల్లోని ప్రణయ తొందరవల్ల కలిగిన ప్రణయ పొరపాటని పోల్చుకొన్నానని" అంటాడు. వెనుకటికెవరో తిరుపుక్కాను తిరు దుడ్డుతో కొడితే తిరుకుయ్యో తిరుకుయ్యో అంటూ తిరు పరుగెత్తిందంటూ ఓ వైష్ణవ బాలుడు వివరించాడట.

ఆ నాడు ధర్మారావు భావకవిత్వం మీద - వారి పరిమిత పదజాలం మీద - ప్రాచీన కావ్యాలవల్ల వారికుండే అలసత్వం మీద ఎంత కసి ఉండేదో ఇదే చక్కని ఉదాహరణ. అయితే ఈ రచనలో ధర్మారావులో గొప్ప మార్పును చూడగలం. వ్యావహారిక భాషను చాలా చక్కగా వాడుకున్నాడు. విషయమంతా రచయిత ఎదుట ఉండి వివరిస్తున్నాడా - అన్నంత సాఫీగా సరళంగా ఉచ్చారణకు అతి సన్నిహితమైన భాషతో రచన సాగుతుంది. తనకున్న వ్యంగ్య స్వభావాన్ని చక్కగా ఉపయోగించుకున్నాడు. వచన రచనను ఎంత అందంగా సులువుగా రాయగలడో ధర్మారావు ఈ వ్యాసం ద్వారా నిరూపించుకున్నాడు.

## తప్తాశ్రుకణం

ఏడవటమే ఒక భాగ్యంగా భావించిన రోజుల్లో కన్నీళ్లకే కరువొచ్చిన కాలంలో ధర్మారావు 'నిరశ్రు రోదనం' రాశాడు. (1929 భారతి మాఘంలో అచ్చయింది). జీవితం ఎడా పెడా వాయిస్తోంది. తట్టుకుని నిలబడి మనగలగటమే ఘనకార్యంగా ఉండేది. అనేక సంఘటనలు జీవితంమీద వారికి విరక్తి

కలిగించేలా చేశాయి. మందసా ఉద్యోగానికి ముందరిలాటి పరిస్థితే మళ్ళీ వీరికి దాపురించింది. తాతానగర్ వెళ్ళి తన భాగ్యాన్ని వెతుక్కో దలిచారు. అక్కడా అభాగ్యమే ఎదురైంది. తనకన్నా ముందే తాను వెళ్ళిన చోటికి దారిద్ర్యం వెళ్ళి స్వాగతం పల్కటంచూశారు. ఆ పరిస్థితుల్లో బహుశా 'అభాగ్య కోదండం' అన్న నాటకాన్ని రాద్దామని అనుకొని ఉంటారు ధర్మారావు. పూర్తినాటకంగా రాలేదుకానీ ఒకటి రెండు నాటికల రూపంలో వెలువడ్డాయి. అందులో ఒకటి 'తప్తాశ్రుకణం'.

అతి దరిద్రస్థితిలో ఉన్న కోదండరాయలు దగ్గరకు ఒక స్వచ్ఛంద సేవకుడు డబ్బా ఊపుకుంటూ గాలివాన బాధితులకు విరాళమివ్వమని వస్తాడు. ఇల్లంతా వెతగ్గా ఆ యింటావిడ బొడ్లో దాచుకున్న రెండు కాసులు కనబడ్తాయి. అవి వేస్తూ తన పరువు పోతుందని బాధపడ్తాడు. ఇంతకన్నా సాయం చెయ్యలేక పోతున్నానని మనస్సులో మధనపడ్తాడు. ఆబాధ బయటకు రెండు కన్నీటి చుక్కలుగా-అవీ వేడిగా వచ్చి ఆ డబ్బామీద పడతాయి. ఇంతలో ఆ సేవకుడికి ఒక టెలిగ్రాం వస్తుంది. అందులో 'ఇక విరాళాల వసూళ్లు ఆపమనీ ఎవరో ధనవంతుడు గాలివాన బాధితులకయ్యే ఖర్చంతా విరాళంగా ఇవ్వబోతున్నాడనీ' -ఉంటుంది. ''బాధపడేవాడే బాధితులనాదుకోడం జరిగిన ఈ నిజమైన సానుభూతే సర్వోత్కృష్టమైందని'' ఈ ఘటన నిరూపించిందని కోదండరాయలూ-స్వచ్ఛంద సేవకుడూ అనుకోవటంతో నాటిక ముగుస్తుంది.

తక్కువ పాత్రలున్న చిన్న నాటిక ఇది. ఇందులో ఇంట్లో దరిద్రాన్ని చాలా చక్కగా రెండు మూడు దృశ్యాలనాధారంగా చిత్రించాడు. భార్య ఉమాంబ, చిన్న పిల్లలు వాణీకుమారి - మధుర కుమారులు. డబ్బుకు లక్ష్యం చెయ్యకుండా కోర్టులో ప్రతివాదిని ఓడించాలనే ధోరణిలో ధనవంతుల తెంపరి తనం - ధనమంటే వాళ్లకుండే అలక్ష్యాన్ని ఒకరిలో రచయిత చూపాడు. అలాగే అతి సామాన్య పౌరులు తాము సంపాదించిన దాంట్లో కొద్దిగా విలాస జీవితం రుచి చూడాలంటూ నాటకంకోసం డబ్బు ఖర్చు పెడ్తూ మాట్లాడుకుంటున్న వారి ధోరణిని ఒక దృశ్యంలో చూపాడు. ఈ మధ్యలో-ఆకలయ్యే ఇద్దరు బిడ్డలు ఇంట్లో అమ్మ తుంచి పెట్టిన రొట్టెముక్కను ఎంతో ప్రేమతో తృప్తిగా తింటున్న వారి - మరో దృశ్యాన్ని పెట్టారు. దీంతో ధనం ఖర్చుచేసే వాళ్లకూ-కనీసావసరమైన తిండికి కూడా డబ్బుదొరకని తమ ఇంటికీ మధ్య వ్యత్యాసాన్ని తులనాత్మకంగా గుండెకు హత్తుకొనేలా చూపాడు డబ్బు ఆడించే నాటకం వివరించాడు. ఇంతలో విరాళాల సేవకుని రాక, కోదండ రాయల మానసిక ఆవేదన, ఉన్నదే వెయ్యాలన్న తలంపూ. "ఆ నిర్భాగ్యుల

కన్నీ నిప్పుడుగదా మన మభాగ్యుల మైత్రిమి'' అనే ఊహ. ''లేమికిదియే మహదైశ్వర్యము'' అని అంటూ ఆ రెండు కాసులూ - డబ్బామీద కన్నీళ్ళూ విడవటంతో నాటకం ముగుస్తుంది.

ఒక చక్కని నాటకీయతా లక్షణంలాగా కోదండరాయలు కాసులు వేసిన వెంటనే తంతిని స్వచ్ఛంద సేవకుడు ''ఆర్తజన రక్షణమున కొక్క ధనాధికుడు పూనుకొనెను''అని చదువుతాడు. సూచ్యార్థ సూచకంగా-ఈ రెండు కాసులు వేసిన నిజమైన సానుభూతి హృదయమున్న వాడే ధనికుడు గానీ డబ్బుండి విచ్చలవిడిగా ఖర్చు పెట్టేవాడు కానేకాడన్న అర్థం స్ఫురింపచేశాడు. ఇదే నిజంగా ధర్మారావు భావం.

ఇది శుక్లనామ సంవత్సరం ఉగాది సమదర్శిని సంచికలోనే ''ఆంధ్ర విశారద తాపీ ధర్మారావునాయుడు గారు, బి.ఏ., యం. ఆర్. ఏ. ఎస్.'' అంటూ అచ్చయింది కావాలనే ఈ బిరుదులన్నీ రాసి ఉంటారు రచయిత. ఇన్ని ఉన్నా జీవితంలో తిండి పెట్టటానికెందుకూ ఇవి కొరగావని పరోక్షంగా చెప్పటానికి వ్యంగ్యాన్ని తన మీదే ప్రయోగించుకుని నవ్వుకుందామనీ రచయిత భావించి ఉంటారు. ఇందులో గడ్డు గ్రాంథిక భాష ఉపయోగించారు. దీన్ని అవన్నీ నీ కళ్ళేనా అన్ననాటికల సంపుటిలో చేర్చి ప్రచురించారు. (1965). అందులో పూర్తి వ్యావహారికంగా మార్చి దీన్ని రాశారు. పాత్రలపేర్లుకూడా ఉమాంబ, ఉమగానూ; మధురకుమారుడు, మధురంగానూ; బిచ్చిక భటుడు, వాలంటీరుగానూ మారిపోయారు. భాష ఎలామార్చారో ఉదాహరణకు చూద్దాం.

మధురకుమారుడు: జనకా, మన్నింప వలయును, చెల్లెలికా రొట్టెముక్క చాలదని ఏడ్చుచున్నది. నా ముక్క నిచ్చెదనంటిని. అమ్మ వలదనుచున్నది. (కనులు దుడిచికొనుచు) అమ్మ కన్నీరిదిగో, ఇచ్చట పడినది. ఇంకను మండుచున్నది.

(సమదర్శిని, శుక్ల ఉగాది).

మధురం : ఏమీ లేదు నాన్నా, చెల్లికారొట్టెముక్క చాలదని ఏడుస్తూంది. నా ముక్క ఇస్తానన్నాను నాన్నా. అమ్మ వద్దంటూ ఉంది. (కళ్లు తుడుచుకుంటూ) అమ్మ కన్నీటి చుక్క ఇదిగో ఇక్కడ పడ్డది. (అని చేతిమీద తల్లి కన్నీటి చుక్క చూపి) ఇంకా మండుతూ ఉంది. (అవన్నీ నీకళ్ళేనా? నాటికల సంపుటి)

తప్తాశ్రుకణం రచనను పరిశీలిస్తే విలాసార్జునం తర్వాత మళ్ళీ ధర్మారావు నాటికను రాయడం ఇదే అనిపిస్తుంది. దృశ్యాలను అతి చిన్నవిగా చేసి

అత్యంత భావస్ఫోరకాలైన వాక్యాలతో అనుకున్న భావ ప్రకటన తీసుకుని రావటంలో కూడా ధర్మారావు ప్రయత్నం ఇందులో కనిపిస్తుంది.

## అవన్నియు నీ కనులేనా?

అలాగే మరో చిన్న నాటకం కూడా ధర్మారావు రాసి ఆంధ్రపత్రిక ధాతనామ సంవత్సరం ఉగాది సంచికలో ప్రచురించారు. (1936) దీని పేరు అవన్నియు నీ కనులేనా ?.

ఇందులో కోదండరాయలు సాహితీవేత్త. ఇంట్లో ఈగలమోత. బయట పల్లకీలమోత. ఇంట్లో గర్భదరిద్రం తాండవిస్తూంది. రాత్రికి ఎవరో వచ్చి - ప్పిస్తారు దాంతో ఇంత వండి పిల్లలకు పెట్టమని భార్య ఉమకు చెప్పి తాను సాహిత్య సభకు వెళ్తాడు. సభ బాగా జరుగుతుంది. అందరూ కోదండరాయలును ప్రశంసిస్తూ పోతూంటారు. చీకటిపడి ఇంటికెళ్తే అప్పు రాలేదు. వంట కాలేదు. సొమ్మసిల్లి పిల్లలు నిద్ర పోతుంటారు. అప్పిస్తానన్న వారింటికి కోదండరాయలు వెళ్ళి అడిగితే "ఆనాడు దీపాలు పెట్టారు కనుక డబ్బివ్వటం పడదనీ, రేపు మార్గశిరలక్ష్మీవారం కనుక ఇవ్వరాదనీ ఎల్లుండి రమ్మని" అంటూ ఆయన దోసెడు సానుభూతి మాత్రం ఇచ్చి పంపిస్తాడు. ఇంటికొస్తూ తనమీదా తన దారిద్ర్యం మీదా విధి మీదా విసుక్కుంటాడు. తన చదువూ, పట్టా పరువూ నిష్ప్రయోజనమనుకుంటాడు. అసలు దేవుడన్న వాడున్నాడా ? అంటూ వాడికే ఎసరు పెడ్తాడు. చదువుకోటం కన్నా అడుక్కు తినటం నేర్చుకుని ఉంటే బాగుపడి ఉండేవాడినని తన్ను తాను తిట్టుకుంటాడు. కష్ఫుతూలి నట్టుంటే గోడకానుకుంటాడు. చీకటి. పైన నక్షత్రాలు. ఏమయ్యా దేవుడూ అవన్నీ నీకళ్ళేనా ? అంటూ నాటిక ముగిస్తాడు.

ఇందులో ఆనాడు ధరార్మావు సభలకు జనంలో ఉండే అభిమానం తెలుస్తుంది. విజయవిలాసం మీదా ఇతర సాహిత్య విషయాల మీదా చర్చలు సాగిస్తూ ఊరూరా తిరిగి జరిగే సభల్లో పాల్గొన్న నాటి విషయాలను ప్రస్తావించాడు. కళాశాల సాహిత్య సభల్లో పాల్గొన్న జ్ఞాపకాలను వివరిస్తాడు. పాత్రల పేర్లు అంతగా మార్చలేదు. భాష మార్చాడు. దీన్ని అవన్నీ నీ

కళ్ళేనా అన్న నాటికల సంపుటిలో చేర్చి వెలువర్చాడు. (1965) మార్చిన భాషకు నిదర్శనం ఇది.

ఉమ : ఆహా, నిద్ర అని ఒకటి ఉండబట్టి బ్రదుకుచున్నాముగాని, లేకున్న ఈ దారిద్ర్యబాధకు అంతముండునా? ఆకటిచిచ్చుల హతమయి పోవలసినదేకదా. అయ్యో ... బిడ్డలు -

(ఆంధ్ర పత్రిక ధాత ఉగాది)

ఉమ : ఆహా, నిద్ర అంటూ ఒకటి ఉండబట్టి బతుకుతున్నాముకాని, లేకపోతే ఈ దారిద్ర్యం బాధకు అంతముందా? ఆకలి మంట లతో హతమై పోవలసిందేకదా ... అయ్యో బిడ్డలు.

(అవన్నీ నీకళ్ళేనా? సంపుటి 1965)

ఇందులో రచయిత కుండే దారిద్ర్యం తనమీద ఆరోపించుకుని చూపెడ్తాడు. తన ఆలోచనలో ఒకచోట "కష్టపడగలను. కష్టపడుటకు ఇష్టమున్నది. కాని బ్రతుకుటకు మార్గము కనబడదు. ఆలుబిడ్డలను అంతులేని దుఃఖములో ముంచి వేయుచున్నాను. ఎక్కడున్నదీ లోపము" - అంటూ స్వగతం చెప్పుకుంటాడు.

సమాజం కూడా, ఒక సాహితీవేత్త సాహిత్యాన్ని మెచ్చుకోవటం వరకే గానీ వాడి కుటుంబం - జీవనాధారం పట్టించుకోదేమన్న బాధ ఇందులో కనిపిస్తుంది. అవసరంలో ఉన్న వాళ్ళకివ్వటానికి దీపాలూ - వారాలూ అడ్డొస్తాయికానీ ఇంటిల్లిపాదీ సినిమాకోసం దుబారాగా ఖర్చు చేయడానికి ఏ ఆటంకం పట్టింపులూ రాని ధనికవర్గమంటే ఒకలాటి అసహ్యభావం రచయిత కనబరుస్తాడు. నాటికను ముగిస్తూ మనుషులు పగ కావచ్చు, జంతువులు పగ కావచ్చు కానీ చంచలమైన కాలం - విధీ కూడా తన మీద పగబట్టాయని అనుకుంటాడు. ఈ నిస్పృహ రచయితను చివరకు "పాండిత్యమా చచ్చిపొమ్ము. బి. ఏ. పట్టమా మంటిలో కలిసిపొమ్ము. సరస్వతీ సేవ చేయుటకు మారు - భిక్షాటనము నేర్చుకొనుట మేలు - చాకలి పని నేర్చుకొనుట శ్రేయము" అని అనేంతవరకూ పడదోస్తుంది.

"నక్షత్రాలున్నందువల్లే దేవుడున్నాడనచ్చన్న" నెపోలియన్ సూక్తిని తలుస్తూ ఇవన్నీ నిజంగా నీ కళ్ళేనా? చూస్తూ ఏం చేస్తున్నావన్న ప్రశ్నను దేవుడి మొఖానికేసి కొట్టి ముగిస్తాడు.

ఈ రెండు నాటికలు ప్రచురణ కాలంలో భేదమున్నా రచనాకాలం కొద్దిగా అటూ ఇటూ తేడాతో ఒకే దశ అయి ఉండవచ్చు. బహుశా మొదటిది 1927 కాలంలో అయితే, రెండోది సౌత్ వల్లూరుఉద్యోగం పోయి బతుకుతెరువు

వెతుక్కుంటున్న కాలంలో రాసి ఉండవచ్చు. కోదండం అంటే ధర్మం అని అంటే తానేననీ చెప్పకుండా రచయిత చెప్పుకున్నాడు (సంపుటిలో మాత్రం సూచించాడు.) భార్య అన్నపూర్ణే ఉమ, ఆమె సహాసం అడుగడుగునా కని పిస్తుంది. ఈ కోదండరాయలు పాత్రతో రాద్దామనుకున్న 'అభాగ్య కోదండం' రాలేదుకానీ జనవాణి పత్రికలో కోదండరాయలుతో కొన్ని నిమిషాలన్న శీర్షి కతో తిరిగి ఈ పాత్రకు జీవం పోశారు. ఈ రెండు నాటికలనూ కాగడాలో మళ్ళీ ప్రచురించారు.

తప్తాశ్రుకణంలో కన్నా ఇందులోని భాష చాలా సారళ్యం సంపాదించు కుంది. పేర్ల దగ్గరనుండీ మార్పు కనిపిస్తుంది. అందులో పిల్లలు, సేవకులు కూడా గొడ్డు గ్రాంధికాన్ని నోటబత్తే, ఇందులో కోదండ రాయలే (ధర్మ రాయలు. గ్రాంధిక భాషా వివాదమన్న మాలికను ధర్మరాయడన్ అని ముగి స్తారు) శిష్ట వ్యావహారికానికి దగ్గరగా "అదిగో కంటనీరు పెట్టుకొనుచున్నావు. తప్పు తప్పు.'' అన్న రీతిలో మాట్లాడ్తాడు. పాత్రోచిత భాషను చాలా సహ జంగా ఉపయోగించాడు. విలాసార్జునంలో అత్యంత సహజంగా దీన్ని రాసిన వాడు మధ్యలో ఎందుకో మానేశాడు. మళ్ళీ ఆ ధోరణి పట్టుకున్నాడు. ఇదొక పరిణామం. భాషలో సారళ్యం- చిన్న వాక్యాలూ మరొక మార్పు. ధర్మారావుకి 1932 ఒక రకంగా మార్పుకు దోహదం చేసింది. ఇంత వరకూ అటు ఖండ కృతులూ ఇటు వచన రచనలూ చేస్తూనే ఉన్నాడు. కానీ వచనంలో భాషా పరంగా - శైలి పరంగా పెద్ద పరిణామం ఈ దశలో మనకు కనిపిస్తుంది. ఇక ముందు అటు వచనం ఇటు పద్యం రెంటి మధ్యా తన చెయ్యి ఎటు సాగుతుందో తేల్చుకునే యత్నంలో ధర్మారావుగారున్నాడు.

## మరో రెండు రేడియో నాటికలు

సమాజం డబ్బు ఇరుసు మీద నడుస్తోంది. మానవుల్లో మానవత్వం కానీ దానవత్వం కానీ, ఈ డబ్బు ననుసరించే ఈ రోజుల్లో కొలవటం జరుగుతోంది. సామాజిక శక్తిగా సంపదగా ఉండాల్సిన ఈ ధనం వ్యక్తిగత ఆస్తిగా మార డంతో మానవుల మధ్య సంబంధాలు అనురాగం - ఆప్యాయతల స్థానే ధనం ఆధారం మీద నిలబడ్తున్నాయి. ఈ విషయం సామాజిక సంబంధాలను అధ్య

యనం చేసిన వాళ్ళకు సశాస్త్రీయంగానూ; ఈ ఇరుసులో పడి నలిగిన వాళ్లకూ, బతికి చెడ్డవాళ్ళకూ స్థూలంగానూ అర్థం అవుతుంది. ధర్మారావు ఈ రెంటికీ చెందాడు కనుక మానవ మనుగడలో ధనం చేస్తున్న దుర్వ్యాపారాన్నీ, సున్నిత మైన బంధాలు తెంపేసిన ప్రమాదాన్నీ స్పష్టంగా గుర్తించాడు. తన రచనల్లో అవకాశం కలిగినప్పుడల్లా దీన్నే నొక్కి చెప్పాడు.

అవన్నీ నీ కళ్లేనా? - అన్న నాటికల సంపుటిలో నాలుగు నాటికలుంటే అందులో తప్తాశ్రుకణం, అవన్నీ నీ కళ్ళేనా అన్నవి రెండు పర్యాయాలు ఈ సంపుటికి పూర్వమే అచ్చయినాయి. మిగిలినవి 'ధర్మప్రభువు' 'వెండి మువ్వలు' రేడియోలో ప్రసారమయ్యాయి.

ఈ నాలుగు నాటికల్లోనూ అంతస్సూత్రం ధనం, పలుకుబడీ ఉన్న వాళ్ళు చేసే అన్యాయం; పేదరికాన్ని - సొంత మిత్రులు కానీ అతి మంచిగా కనిపించే యజమానులుగానీ ఎలా ఎద్దేవా చేస్తూ నిర్లిప్తతగా ఉంటారో విడమర్చే గుణం కనిపిస్తూంటుంది. మొదటి రెండు నాటికలూ 1936 ముందూ చివరి రెండు నాటికలూ 1936 తర్వాతా రాసినవి. ధర్మారావు మౌన దశలో చేసిన అధ్యయనం తర్వాతి రచనలు ఈ ధర్మప్రభువు, వెండిమువ్వలు ఒకరకంగా వీటిలో పేదరికం ధర్మారావు పేదరికం దశను చాటేవే. కావ్యరచన అన్న ఖండికను వారు నెల్లూరులో ఉంటూ చుండి జమీందారు దగ్గర సంరక్షకోపాధ్యా యుడిగా పనిచేస్తున్నప్పుడు రాసింది. ఆ సమయంలో వారింటి సొత్తంతా దొంగల పాలైంది. ఇల్లు కటిక దరిద్రంలో మునిగింది. ఈ ఖండిక పాత పాళీలో అచ్చయింది. (1960). ఇదే కవిత 'చోరహృతార్థము' అన్న శీర్షికతో 'మబ్బు తెరలు' అన్న వారి రెండో ఖండకావ్య సంపుటిలో కూడా అచ్చయింది (1972). సరిగా చూడనందువల్లో, అందులో (పాత పాళీ) అచ్చయిందన్న విషయం గుర్తు లేనందువల్లో ఈ పొరపాటు జరిగి ఉండచ్చు. ఆ ఖండికలో ఉన్న భావమే ఈ నాటికల సంపుటిలో మూడు నాటికల్లో పరుచుకుంది. కాగడా, జనవాణి, వార పత్రికల్లో వీరు రాసిన 'అడుక్కు తినేవాళ్ళ' వ్యాసాల్లోనూ ఈ భావమే సాగుతుంది. కొన్ని పద్యాలను ఆ వ్యాసాల్లో పేర్కొనటం కూడా జరిగింది.

ఏది ఏమైనా ఈ నాటికల్లో ధర్మారావు స్వీయ చరిత్ర ఉంది. ఈ విషయం రచయితే "నా స్వీయానుభవ విషయాలు చూడవచ్చును - ఓపి కుంటే"63 అని అన్నాడు. చివరి రెండు నాటికలూ ఇవి.

చేసిన చాకిరికి ఇవ్వాల్సిన డబ్బు కూడా ఇవ్వకుండా 'రేపురా-మాపురా' గాళ్ల మాదిరిగా సకాలంలో ఆదుకోనందుకు గుమాస్తా కామరాజు కుటుంబాస

జరిగిన అన్యాయం వివరించాడు ధర్మప్రభువన్న నాటికలో. అదే సమయంలో ఆ ఇవ్వవలసినదాన్ని అవసరం తీరింతర్వాత ఇస్తూ ధర్మప్రభువులనిపించుకునే రాక్షసత్వాన్ని కూడా తెలియచెప్పాడు.

శేషగిరి డబ్బున్నవాడు. అతడి భార్య పార్వతమ్మ. గుమాస్తా కామరాజు. చాలా పేద కుటుంబం. వీరమ్మ కామరాజు భార్య. కామరాజు కొడుకు సత్యం చావు బతుకుల మీదుంటే జీతం రాళ్ళివ్వాల్సిన శేషగిరి "ఆ డాక్టర్లు చెప్పిన ఇంజెక్షన్లూ మందులూ అన్నీ కొంటుంటే ఎనిమిదేమి, ఎనభై రూపాయలు గూడా అవుతాయి. పిచ్చివాడా. అవన్నీ కొనుక్కుంటూ కూర్చుంటావా"64 అని కామరాజుకు తొంటి చెయ్యి చూపించాడు. అయినా కామరాజు దృష్టిలో అతడు ధర్మప్రభువే. సమయానికి మందులకు డబ్బులేక కామరాజు కొడుకు చనిపోతాడు. శేషగిరి తన కాళ్ళు బట్టే భాండారిని పిల్చి "ఈ పది రూపాయలూ తీసికెళ్ళి మెల్లిగా కామరాజు చేతిలో పెట్టేసిరా. కర్చులకు కావలసొస్తుంది"65 అని పంపేటప్పుడు ఆ భాండారికి కూడా శేషగిరి "ధర్మ ప్రభువు" లే. ఈ పది రూకలూ- చేసిన చాకిరికి కామరాజుకు హక్కుగా రీత్యా రావలసింది.

దీని వెనక ఉన్న శేషగిరి తత్వం అర్థం చేసుకోవాలి. భార్య పార్వతమ్మ "పదిమార్లడిగించుకోడానికి కాకపోతే" దీని రహస్యం ఏమిటంటూ మనలానే అడిగింది. శేషగిరి అభయహస్తం ఉపదేశం ముద్రలో పెట్టి "పదిమార్లూ ఏదో అవసరాలకు అడుగుతారు. పదిమార్లూ కొద్దో గొప్పో ఇస్తాము. పదిమార్లు ఆపదలో అడ్డుపడ్డువాళ్ళమని అనిపించుకుందాం. జీతమంతా ఒక్కసారే ఇచ్చేస్తే పేరా, ప్రతిష్ఠా? ఏముంది చెప్పు. ఏమంటావు. అలాగడ్డుపడుతూంటాం కాబట్టేగా, మనం ధర్మప్రభువులమయ్యాం''66 - అని వివరిస్తాడు. వారాలను అడ్డుపెట్టుకొని లేదు పొమ్మంటాడు. అంతేకాదు పిల్లికి చెలగాటం ఎలుక్కు ప్రాణసంకటంలా "రేపా కుర్రాడి కేమయినా అయిందనుకో మళ్ళీ కామరాజు పైకం కోసం మనదగ్గరకు రావలసిందేనా? అప్పుడు లేదనిచెప్పి పొమ్మనమంటావా? చెప్పు" అంటూ తన దాతృత్వాన్ని శవాలమీద పెట్టుబడిగా పెడ్తాడు.

శేషగిరి పెట్టుబడిదారీ భావాలకు ప్రతినిధి. ఇతర్ల మాన ప్రాణాల ద్వారా దాతృత్వం కొనుక్కోవాలనుకునే వ్యక్తి. తాము తయారుచేసే వస్తువులకు ముడిసరుకందించిన దేశాలకే-ఆ వస్తువులమ్ముతుంటే దేశానికి-ఆ భావానికి ఇతడు ప్రతినిధి. నిత్యం తమమీద సాయానికి ఆధారపడేలా చూస్తూ అప్పుడప్పుడు సాయం పేరిట కొంత విదిలిస్తూ క్రమంగా ఆ దేశాన్ని అస్థి

రత్వంలోకీ, అగాధంలోకీ నెట్టే దారుణ తత్వం కల దేశాలకు ప్రతీక శేషగిరి. ధర్మారావు దీన్ని రాసే కాలానికి సాధారణ ప్రజాస్వామ్యవాది దశ నుండి ప్రపంచంలోని రెండు దారుల్లో (దీన్ని విడమరుస్తూ జనవాణిలో ఓ వ్యాసం కూడా రాశాడు) సోషలిస్టు పంథాను అనుసరించే దశకు చేరుకున్నాడు. కనుకనే శేషగిరి పాత్రద్వారా అతిహేయమూ, నికృష్టమూ అయిన దోపిడీ తత్వాన్ని బట్టబయలు చేశాడు. నేడున్న ధర్మప్రభువులందరూ ఇలాటివారే నన్న దృష్టినీ వివరించాడు.

మరోనాటిక 'వెండి మువ్వలు'. యాచించటానికి ఒక వ్యక్తి పడ్డ బాధను గమనించని వాళ్ళు - "అతడికి దొంగతనం తప్ప మరో గత్యంతరం ఉండదన్న" నిర్ణయానికి రావటం ఎంత తప్పో విశదీకరించాడు. పేదరికం తప్పనిసరిగా దొంగతనం చేయించక మానదన్న నిశ్చయం ఎంత పొరపాటో తెలియచెప్పాడు.

భూస్వామి పరమేశం. అతడి కొడుకు విశ్వం వెండి మువ్వల్తో ఆడు కుంటూంటాడు. పరమేశం కూతురు పట్నం వెళ్ళే ప్రయత్నంలో ఉంది. వెంకడు నౌకరు. విశ్వాన్ని ఆడిస్తూంటాడు. కూతురు ఊరెళ్ళిపోతుంది. అంతకుముందు వెంకడికి ఇంట్లో అవసరానికి కొంతడబ్బు కావలసి పరమేశాన్ని అడుగుతాడు. అతడు లేదంటాడు. కొంతసేపటికి వెంకడెళ్ళినతర్వాత ఇంట్లో మువ్వలు కనిపించవు. వెంకడే తీశాడన్న అనుమానంతో పిలిపించి కొడ్తాడు. వాడికి మతిపోయి పిచ్చెక్కుతుంది. కొద్దిరోజుల తర్వాత కామేశ్వరి, అంటే పరమేశం కూతురు ఊర్నించి వస్తుంది. మువ్వలు ఆమె పెట్టెలోనే ఉంటాయి. స్థూలంగా ఇదీ ఇతివృత్తం.

ఇందులో పరమేశం ధనవంతుడు. డబ్బు అవసరం వెంకడిలాంటి వాళ్ళకూ్కడా ఉంటుదన్న ఇంగితజ్ఞానం అతడికి ఉండదు. "మీ యింట్లో రూపాయలకు రూపాయలే కొరుక్కు తింటారేమిట్రా"67 అంటూ రెండు రూపాయలడిగిన వెంకణ్ణి కసురుకుంటాడు. వెంకణ్ణి అపూట పస్తులుండ కుండా అడుక్కునే మరోగుడ్డి రామిగాడు ఆదుకుంటాడు. ఇది విని నమ్మే గుణంలేని పరమేశం "అడుక్కుతినే వెధవ గుడ్డిరామిగాడు వీడికి పావులా ఇచ్చాట్ట. ఎవరైనా నమ్మేమాటేనా ఇది?" - అంటాడు. తన నీచత్వాన్ని కప్పెట్టుకునే సందర్భంలో పరాయివాడి ఔన్నత్యాన్ని గుర్తించలేడు. పేదవాళ్లను పేదవాళ్ళే అవసరాలకు ఆదుకుంటారనీ, వాళ్ల బాధలకు సాను భూతి వాళ్ళకే ఉంటుందనీ డబ్బుమదంతో కళ్ళుపొరలు కమ్మిన వాళ్లకిది కనిపించదన్న భావం ధర్మారావు ఈ ఘటనలో చూపించాడు.

వెంకణ్ని కొట్టించాడు పరమేశం. వాడికి పిచ్చెత్తి కుటుంబం అధోగతి పాలైంది. ఆ సమయంలో మువ్వలు దొరకటం వెంకడి నిర్దోషిత్వం వెల్లడి కావటం జరిగింది. అయినా పరువూ అహంకారం పరమేశం నోట "జరిగిందేదో జరిగిపోయింది. వాడికి పిచ్చెత్తింది. ఇప్పుడు నువ్వాపిచ్చి కుదర్చలేవు. అంచేత ఇక నీ జీవితం సంగతీ, నీ యింటి గౌరవం సంగతీ చూచుకో" అనిపిస్తాయి. తప్పుచేశానన్న భావం కానీ, ఇన్నాళ్ళబట్టీ సేవచేసిన వ్యక్తి అన్యాయానికి గురైనాడన్న పశ్చాత్తాపం కానీ, పరమేశానికి ఏకోశానా లేదు. తామేం చేసినా చెల్లుతుందనీ, లోకం తమ వెంటా తమ ధనం వెంటా ఉంటుందన్న అహంభావం మూర్తీభవించిన ధనవంతుల ప్రతినిధే ఈ పరమేశం.

సందర్భాన్ననుసరించి ధర్మారావు ఈ నాటికలో ఒకచోట "మొన్నటి పరీక్షలో ఆ సుబ్బారావు కొడుకేంచేశాడో తెలుసునా ? శమంతకమణి గురించి నీకేమి తెలుసునని అడిగితే, శకుంతలను గురించి ధాటీగా అయిదు నిమిషాలు లెక్చర్ కొట్టాడు. యస్. రైట్ అని వాడిని ప్యాస్ చేశా"రని[68] అంటాడు. ఇలా నేడు జరుగుతున్న ఇంటర్వ్యూహాల్లో ఉండే బండారాన్ని సున్నితంగా బయట పెట్టాడు. అలాగే పదాల్లో స్వల్ప అర్థభేదాన్ని తీసుకుని 'పాస్' చేసి ఇంటికి పొమ్మంటారంటూ చమత్కరించాడు. ప్యాస్ అంటే కృతార్థుణ్ణి చెయ్యటం. పాస్ అతణ్ణి పంపి మరొకణ్ని రమ్మనటం. డబ్బు మనిషిని ఎలా దానవుడుగా చేస్తుందో సౌమ్మొకచోట అనుమాన మొకచోటా ఎలా ఉంటుందో ఈ నాటికలో రచయిత వివరించాడు.

ఈ సంపుటిలోని మొదటి రెండు నాటికలనూ మళ్ళీ ప్రచురించటంలో ధర్మారావు ఒకటి ఆశించి ఉండవచ్చు. దారిద్ర్యంవల్ల జనం ఎలా బాధపడ్తారో ప్రజలకు మరోసారి చెప్పాలన్నదే అది. అంతకన్నా వేరేకారణం ఏదీ కనిపించదు.

ఈ నాటికలన్నిటిలోనూ ధర్మారావు భార్య అన్నపూర్ణమ్మ కనిపిస్తుంది. తప్పొప్రశకణంలో ఉమగానూ, ధర్మప్రభువులో భర్తనైచ్యాన్ని బయటపెట్టే అమాయకురాలైన పార్వతమ్మగానూ, అవన్నీ నీకన్నీళ్ళే నాలో సాక్షాత్తూ సహనశీలయైన ఉమగానూ, వెండిమువ్వలులో తండ్రి దురహంకారాన్ని ఎదిరించే ప్రయత్నం చేసిన కూతురు కామేశ్వరిగానూ ఆమే ప్రత్యక్షమవుతుంది. నాటికల్లోని స్త్రీపాత్రలన్నీ సౌమ్యమూర్తులు. నిరాడంబరులు. మోసం తెలియని అమాయకురాళ్ళు. ధర్మారావుకు నిజంగా స్త్రీజాతిమీద ఉండే అభిమానానికి ఈపాత్రలు మచ్చుతునకలు.

చెప్పదల్చుకున్న విషయాన్ని ఈ నాటికల్లో సూటిగా చెప్పాడు. తక్కువ పాత్రలతో పని సాధించాడు. తమ భావ ప్రదర్శనకు రచయిత దృశ్యాలను కొద్దిగానూ - చిన్నవిగానూ ఉండేలా జాగ్రత్తపడ్డాడు. పాత్రల మనోగత భావాలను వెలికితీయించటంలో ధర్మారావు నేర్పు బాగా కనిపిస్తుంది సరళమైన భాషలో - సంభాషణాచాతుర్యం క్లుప్తతా బాగా పదును తేలిందని అనిపిస్తాయి.

## పారిజాతాపహరణం - భావప్రకాశిక

సాహిత్యం విషయంలో ముఖ్యంగా గతంతో పూర్తిగా తెగతెంపులు చేసుకోవటం అసాధ్యం. అనుచితం కూడానూ. ఇది ధర్మారావు అభిప్రాయం.

విజయవిలాస వ్యాఖ్యానం రాస్తున్నప్పుడు వారు ప్రాచీన సాహిత్యాన్నంతా క్షుణ్ణంగా చదివారు. ఈ తరం వాళ్ళకు ప్రాచీన సాహిత్యంతో ఉండవలసినంత పరిచయం ఉండదు. అందువల్ల సాహిత్యంలో వచ్చిన క్రమ పరిణామాన్ని కూడా వాళ్ళు గుర్తించటం కష్టమౌతుంది. అదీగాక సాహిత్యం తరతరాల మానవ మేధోజనితమైన అక్షరనిధి. కాబట్టి ఆ కూర్పులూ నేర్పులను కూడా పరిశీలించాల్సి ఉంటుంది. మానవ స్వభావ చిత్రణకు సంబంధించినంత వరకూ ప్రతిభావంతులైన కవులు పోయిన పోకడలను కూడా తెలుసుకోవాల్సి ఉంటుంది. ఏ సాహిత్యమైనా ఆనాటి సామాజిక చిత్తవృత్తులను పూర్తిగా అధిగమించలేదు. అందువల్ల చారిత్రక అవగాహనకు కూడా సాహిత్య అధ్యయనం తప్పదు. ఈ దృష్టితో ప్రాచీన కావ్యసాహిత్యాన్ని ఈ తరం పాఠకులకు పరిచయం చేస్తే బావుంటుందని ధర్మారావు భావించాడు. అయితే ఈతరం వారి అభిరుచులనూ, అవకాశాలనూ, సమకాలిక అవసరాలనూ గుర్తించి ఏ కొన్ని ఘట్టాలనో తీసికొని ప్రాచీనకవుల ప్రతిభను ఆవిష్కరించాలని భావించి నట్లుంది. సాహిత్య మొర్మరాలలో సంకలితమైన వ్యాసాలన్నీ ఈ దృష్టితో రాసినవే. ఈ సంకలనంలోని మొదటి వ్యాసం శ్రీకృష్ణుని శిరసును సత్యభామ తన్నిందా ? అనేది. దీన్నిబట్టి పారిజాతాపహరణంలో కొన్ని సన్నివేశాలను మానసిక దశావిపర్యయాలనూ వ్యాఖ్యానించాలని ధర్మారావు అభిలాషలా కనిపిస్తుంది. విజయవిలాసం ఆకర్షించినట్టే పారిజాతాపహరణం కూడా ఆయన

అభిమానానికి పాత్రమై ఉంటుంది. జాతి వార్తా చమత్కారాదులు, రసపుష్టి మొదలైన వాటిలో కాకున్నా పదలాలిత్యం, శైలీసౌలభ్యం, రూపకోచిత పాత్రచిత్రణ మొదలైన విశేషాలు తెలుగు సాహిత్యాభిమాను లందర్నీ ఆకర్షించేవే. శ్రీకృష్ణనాయకుణ్ణేకాక శ్రీకృష్ణదేవరాయల అంతఃపుర జీవితానికి సంబంధించి, ఆయన శృంగార రసికత్వాన్ని తెలియజెప్పే విషయాలతో ఈ ప్రబంధం ముడిపడిందన్న జనశ్రుతి ఉంది. అందుకే తెలుగు పాఠకులకు ఇది మరింత ప్రీతిపాత్రం అయిఉండచ్చు. ధర్మారావు దృష్టిలో ప్రబంధకవుల్లో తిమ్మనకే అగ్రస్థానం. తన ఈ అభిప్రాయాల మేరకు యువతకు లఘువ్యాఖ్యానంతో వచనంగా దీన్ని అందిద్దామని రచయిత భావించాడు.

ధర్మారావు ఈ రచన చేసేనాటికి ఇంచుమించుగా వచనరచన ఆరంభమై మూడువందల సంవత్సరాలు మాత్రమే అయింది. కేవల వచనకావ్యాలుకూడా నాయకరాజుల యుగంలోనే వచ్చాయి. అయితే పురాణ వాఙ్మయం, రామాయణ భారత భాగవతాల్లో కథలను తీసికొని రాసిన వచన కృతులే అవి. అంతకు పూర్వం కానీ ఆకాలంలో కానీ - పద్యకావ్యాలు ద్విపదలుగానూ, ద్విపదలు పద్యకావ్యాలుగానూ, యక్షగాన ప్రక్రియలుగానూ వెలువడ్డాయే తప్ప పద్యకావ్యాలు వచనకావ్యాల రూపం మాత్రం సంతరించుకోలేదు. వ్యాఖ్యానాలు వెలయించినప్పుడు కూడా సంస్కృత రామాయణ, భారత భాగవతాలకూ తెలుగులో సుప్రసిద్ధకావ్యాలు మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యదలకు ప్రతిపదార్థ టీకాతాత్పర్య సహితంగా వివరణలూ వెలువడ్డాయే తప్ప వచనరూపంలో భావ ప్రకాశనం జరగలేదు. 19వ శతాబ్దంలో బ్రౌన్ సాధించిన మహత్తర కృషిలో భాగంగా తాళపత్ర గ్రంథ సేకరణ, పరిష్కరణ నిర్వహిస్తున్న దశలో వచన రచన కొంత వికాసాన్ని పొందింది. దేశభాషలు నేర్చుకునే పాశ్చాత్యులైన ప్రభుత్వోద్యోగులకోసం, పాఠశాలల్లో చిన్న తరగతులు చదువుకునే విద్యార్థులకూ ఆకర్షకమైన వచన రచనలు వెలువడ్డాయి. ఈవిధంగా వెలువడ్డవే రావిపాటి గురుమూర్తి శాస్త్రి పంచతంత్రం కథలూ, పాటూరి రామస్వామి శాస్త్రులు శుకసప్తతి కథలూనూ. అంతకు ముందే విజయవిలాసాన్ని రామస్వామి శాస్త్రులవారి అన్న రంగశాస్త్రులు వచనంగా రాశాడు.[19] కాబట్టి ఒక ప్రసిద్ధమైన ప్రబంధాన్ని సంక్షిప్త భావానువాదంగా వచనంలో వెలువర్చటం భావప్రకాశిక ద్వారా మొదటిసారేమో అనుకోవచ్చు. ఇది 1932 సమదర్శినిలో ధారావాహికంగా వెలువడింది.

పారిజాతాపహరణం అయిదు ఆశ్వాసాల కావ్యం. రాయల యుగంలో వచ్చిన ప్రబంధం ఇది. మనుచరిత్ర, పారిజాతాపహరణాల్లోని ఆశ్వాసాంత

వర్ణనల ద్వారానూ, కృత్యవతారికల వల్లనూ ఇది మొదటిదని తెలుస్తుంది. కృష్ణదేవరాయలకు సంబంధించిన కొన్ని క్షేత్ర యాత్రల ఘట్టాలను బట్టి మనుచరిత్రకన్నా ప్రాధమ్యం పారిజాతాపహరణానికే అని కవిపండితులు నిర్ధారించారు. ఆంధ్ర కవితా పితామహ బిరుదం మనుచరిత్ర ప్రథమ ప్రబంధం అయినందువల్లగాక వారి వయస్సుని బట్టిన పెద్దరికం వల్లనేనని దూసి రామ్మూర్తి అభిప్రాయంతో ధర్మారావు ఏకీభవిస్తున్నారు.70 (చూ. సాహిత్య మోర్మరాలు).

కృష్ణచరిత్రకు సంబంధించిన ఇతివృత్తాలున్న ప్రబంధాలన్నింటికీ మూలం సంస్కృత హరివంశమన్నది అందరికీ తెల్సిందే, పారిజాతాపహరణ కథను తిమ్మన హరివంశం నుండే గ్రహించాడని పలువురి భావం.71 భాగవత దశమస్కంధంలోని 59వ అధ్యాయంలో కేవలం మూడు శ్లోకాల్లో మాత్రమే ప్రస్తావితమైన కథను అయిదు ఆశ్వాసాలుగా అయిదు వందల పద్యాలకు మించిన చంపూ కావ్యంగా తిమ్మన పెంచి రాశాడు.72 హరివంశంలోని విష్ణు పర్వంలో 18 అధ్యాయాలుగా ఈ కథ వుంది. తిమ్మన దీన్ని కూడా ఆధారం చేసుకొని ఉంటాడు కానీ ఇటీవల పుట్టపర్తి నారాయణాచార్యులు కన్నడంలో సుప్రసిద్ధ కావ్యమైన ''జగన్నాధ విజయానికి'' పారిజాతాపహరణం కేవలం ప్రతికృతికాకున్నా, అనుకృతి అన్న భావాన్ని వ్యక్తంచేశారు. కొన్ని ఘట్టాలు జగన్నాధ విజయంలోని పద్యాలకు ప్రతికృతులు ఇందులో ఉన్నాయన్నారు. 73 రాయల అష్టదిగ్గజాల్లో వాడు కాబట్టి తిమ్మనకు కన్నడం పరిచయమై ఉండచ్చు. తిమ్మన ఈ పై గ్రంధాలన్నీ తన రచనకు ముందు చూసి ఉంటాడని పి. యశోదారెడ్డి అభిప్రాయం.

ప్రబంధయుగంలో వెలసినా ప్రబంధకవులు అనివార్యం అని భావించిన అష్టాదశ వర్ణనల జోలికి ఈ తిమ్మన పోలేదు. వర్ణనల కోసం వర్ణనలు చేయలేదు. కధాగమనానికి తోడ్పడే ఘట్టాల్లోనే అవసరమైన మేరకే వర్ణనలు అనుసంధానం చేయడం ఈ కావ్యంలోని విశిష్టత. ఈ ఐదాశ్వాసాల కావ్యంలోనూ ప్రధమాశ్వాసంతోటే ముప్పాతిక మువ్వీసం కావ్యప్రణాళిక సిద్ధిస్తూంది. పరంపరగా టినేదాకావినిపిస్తున్న ప్రధనుచూసినప్పటికీ రాయలకుచేసే నీతిబోధ ప్రథమ ఆశ్వాసంతోనే ముగిస్తోంది. కావ్యప్రణాళిక దృష్టితో చూస్తే తర్వాత నాలుగు ఆశ్వాసాలకూ అవసరం అంతగా కనిపించదు. తర్వాతర్వాత కధాగమనంకుంటటం, అనవసర వర్ణనలూ ఈపై ఊహనే బలపరుస్తున్నాయి. మరీచివరి ఆశ్వాసంలో ప్రతిభావంతుడైన కవి చిత్రకవిత్వాన్ని ఆశ్రయించడం కధావస్తువునుసాగదీయ

డాన్నే సూచిస్తుంది. సత్యభామా గర్వభంగం అనే ఈ ప్రబంధానికున్న సుప్రసిద్ధమైన నామాంతరం కూడా ప్రథమాశ్వాసాంతంతోనే సిద్ధిస్తుంది. ఏది ఏమైనా పారిజాతాపహరణం, రచనలో మృదుత్వం లాలిత్యం అభిమానించేవారికి ఆకర్షణీయంగా ఉంటుంది.

దీన్ని ధర్మారావు సమదర్శినికోసమే రాసి ఉండడు. 1932కు పూర్వమే రాసి ఉంచుకుని ఉంటాడు. సాహిత్యంలో అభిరుచి కలిగి, వచన రచన చేయాలన్న ఉబలాటం కలిగిన ప్రాథమిక దశలో ఇది రాసి ఉంటారని అనుకోవచ్చు. ఇందులోని వాక్య నిర్మాణం, శబ్దాడంబరం మీది లౌల్యం, అర్ధానుస్వార శకటరేఫాదుల మీది మోజు, అన్వయ కాఠిన్యం, పాండిత్య ప్రకర్షా చూస్తే గిడుగువారు అనేక సందర్భాల్లో అన్నట్టు 'కృతక గ్రాంథికం' అనిపిస్తుంది. శ్రీకృష్ణుడు సత్యభామను అనునయించే ఘట్టంలో వ్యాఖ్యాన సహితంగా ఇది ఇలా సాగింది.

"ఎఱుగని యజ్ఞు లేమియో యనుకొని యేవి చెప్పినను చెప్పుదురుగాక - సుస్థిరంబగు ననురాగము నీయంద బరమమై యుంటయు నీ పనిచిన దాని చేయుటయ మహదైశ్వర్యమని నేనుండుటయు నీవెఱుంగవా. ఇతరులేమి యన్ననేమి ? ఇంకనైన నన్ను దయజూడుమిని యాచెప్పిన మాటల పూర్వపక్షము సేయుచు సత్యనీ, సాక్షిగనూ న్యాయాధ్యక్షగనూ జూడగోరెను. ఈ మాటలతో చిరసాంగత్య గౌరవంబునందియున్న దగుటచేత సత్య తాను రుక్మిణికి జూపిన గౌరవము మెఱమెచ్చులకై జూపియుండునేమో యను సందేహము నందుట కవకాశమున్నది." (1932 మే 11 సమదర్శిని సంచిక.)

ధర్మారావు ఈ భావ ప్రకాశికలో మొత్తం పారిజాతాపహరణానికి యథా ప్రకారంగా వ్యాఖ్యానం రాయాలని భావించినట్టు లేదు. ఆయా ఘట్టాల్లోని పాత్రల మానసిక విశ్లేషణలను ప్రధానంగా చూపాలని ఆశించినట్టు కనిపిస్తుంది. ఈ ఘట్టాలను కథా సూత్రంతో బంధించటానికి అవసరమైనంత మేరకే పద్యాలను తీసికొని వ్యాఖ్యానం చేశాడు. అందుకే ప్రతి సంచికలోనూ ఏదో ఇటువంటి ఒక ఘట్టాన్ని తీసికొని అంతకు పూర్వం కొన్ని పద్యాలనూ, తర్వాత కొన్ని పద్యాలనూ వ్యాఖ్యాన రూపంలో అందించాడు.

నారదుడు ఇచ్చిన పారిజాత పుష్పాన్ని స్వీకరించిన శ్రీకృష్ణుని మనః స్థితినీ కవి ఈ సందర్భంలో ప్రదర్శించిన ప్రతిభనూ వ్యాఖ్యానిస్తూ —

"కవి వర్ణ్యలాడినది యల్పమైనను దాన మనము జూడదగినది మిక్కుటముగ నుండును. కవి హృదయమును గ్రహింపవలయునని పరిశీలనమెంతయోని వలయు. ఒక్క పద్యమును వ్రాసి పెద్ద విషయమును ప్రదర్శింపక.

కపులు చెప్పి పాఠకులకు దెలియజేయునది గొంతా; చప్పకయే దెలియబరచునది యింతకు నూఱు మడుంగులు. అందు ముక్కు తిమ్మనార్యుని వంటి మహాకవిని గూర్చి వేఱుగనుడువ వలయునా ? ఒక్క దృష్టాంతము -

"పారిజాతంపు గొఱ్ఱిన్నను ............... బోదివి యిచ్చిన"
"వినయంబు విస్మయంబును ............ సత్యభామ తలపున నిలువన్"
"ఇది భోజాత్మజ ........ . ... లీలన్ రుక్మిణీ కాంతకున్."

ఈ ఘట్టానికి భావప్రకాశిక ఇలా సాగింది.

"ఇట్టి యమోఘంబగు పుష్పంబును నారదుండొసంగ మహాప్రసాదంబని యందికొనిన శ్రీకృష్ణుని మానసంబున్న తెఱంగు మిగుల జిత్రము.

శ్రీకృష్ణుండు సభ్యంబులగు మర్యాదల నెఱుంగును. పారిజాత ప్రసవము నందలి మాహాత్మ్యము నెఱుంగును. నారదుని నైసర్గిక స్వభావమును నెఱుంగును. దక్షిణ నాయకుండయి తానలరించుచున్న భార్యల తారతమ్యంబు నెఱుంగును." (1932 ఏప్రిల్ 23 సమదర్శిని)

ఈ విధంగా పాత్రగతమైన మనోగత భావవాహినిని ధర్మారావు విశ్లేషించటానికి యత్నించాడు. ఈ వ్యాఖ్యానంలో ఇంకొక విశేషమేమంటే పాఠకులకాసక్తికరంగా ఉండటానికి కథాకథనం వ్యాఖ్యాన రూపంలోనే కాక సంభాషణాత్మకమైన శైలిని కూడా ప్రవేశపెట్టాడు.

తనను అనునయిస్తున్న కృష్ణుణ్ణి సత్యభామ ఎత్తిపొడిచే ఘట్టం.

కృష్ణుడు . కాదు ప్రాణ ప్రియా. నా మాటలు గల్లలు కావు. అని చెప్పుచుండ
సత్య : కల్లలెట్లగును. కొంటెతనంబులు మాయలు బొంకులు లోనగు గుణపుంజములన్నియు నీవు పుట్టిన వెనుకనే పుట్టెను గదా.

తొలినాటి నవలల్లో కూడా ఇలాంటి శైలే ఉండేది. పాత్రల మధ్యలో రచయిత దూరి పాఠకుడితో నేరుగా వ్యాఖ్యానం చెప్తాడు. అలాటిదే ఇందులో 'అని చెప్పుచుండ'. ఈ ధోరణి వేగుచుక్క గ్రంథమాల ప్రచురణగా వచ్చిన ధర్మారావు నవల క్రొవ్వూరాళ్ళలో కూడా కనిపిస్తుంది.

ఈ రచనలో శబ్దాలను రచయిత ప్రకరణోచితంగా వాడినట్టు కనిపించదు. సత్యభామ తన వామపాదంతో కృష్ణుడి తలను తొలగతోసినప్పుడు నొచ్చుకోకుండా ప్రియురాలిని అనునయించడం ఈ విధంగా వ్యాఖ్యానించాడు.

"అటు లింకను నుపశమన కార్య వ్యాపారుడగుటకు దన నిరుపమాన మనోవైపుల్యము కారణము", ఇక్కడ కృష్ణుని విశాల హృదయాన్నో పెద్ద మనసునో చెప్పడాన్ని ధర్మారావు "మనోవైపుల్యం" అనడం అసంగతమని

పిస్తుంది. ఇదే విధంగా మరోచోట 'తాళవృంతం' అని ఉంటే దానికి వ్యాఖ్యాత 'చామరం' అని రెండు మూడు సందర్భాల్లో వివరించాడు. ఇది అసవధానత వల్లే జరిగి ఉంటుందనడం స్పష్టం. ఇదే విధంగా ఎడమ కాలితో తొలగ దోయటాన్ని "సవ్యచరణంబున దాచిన విషయం" అని తాపీ వారు అనడం నిఘంటు పాండిత్యం తప్ప మరోటి కాదు.

అయితే ధర్మారావు ఆదునిక కాలం దృష్ట్యా తాను అనౌచిత్యాలనుకున్న 'అలినీలాలక' పద్యాలకుండే భావాలను చాలా మృదువుగా చెప్పాడు. రహస్య క్రీడ ప్రస్తావ నొదిలేసి 'ఏపనిలోనైనా ఉత్సాహాన్నిస్తుందని' దాటేశాడు.

కృష్ణుని నిరాదరణ భావాన్ని సూచించే అపశకునాలు సత్యకు తోచి నప్పటి సందర్భంలో కవి వాడిన కుడి కన్ను, కుడి భుజము, కుడి పయోధ రాల చలన ప్రసక్తిని ధర్మారావు చాలా నేర్పుగా వ్యాఖ్యానంలో కుడికన్ను, కుడి భుజం అంటూ పరిష్కరించాడు.

ఈవిధంగా ఔచిత్యదృష్టిని ప్రదర్శించి ఆదునికతా ముద్రను వేసి ప్రాచీన సాహిత్యం అందచందాలను పాఠకులకు అందించాలని అభిలషించాడు రచయిత. పాత్రల చిత్తవృత్తులు, కథాగమనంలో వాటి పొందిక, మానసిక విశ్లేషణం మొదలైనవాటి దృష్ట్యా సాహిత్యంలోని మెరుగులను ప్రకటించడం ఆదునిక విమర్శ, వ్యాఖ్యానాల పద్ధతి. ఈ శతాబ్దపు తొలిరోజుల్లో దీన్ని ఆరంభించినవాడు కట్టమంచి రామలింగారెడ్డి. ఇక పారిజాతాపహరణానికి భావప్రకాశికను తీర్చడంలో తాపీవారు ఆపంచిన ప్రయోజనం అంతగా నెరవేరి నట్టు తోచదు. ఇందులో కొన్ని గుణాలున్నప్పటికీ వీటిని కప్పేసే లోపాలు కొన్ని కనిపిస్తాయి.

భావప్రకాశిక 1932 సమదర్శిని పత్రికలో ప్రచురితమైంది. అది జస్టిస్ పార్టీవారి పత్రిక. జస్టిస్ పార్టీ నాయకులు పానగల్ రాజా, పిఠాపురం రాజా, వెంకటగిరి, బొబ్బిలి రాజాలు. వీరందరూ గ్రాంథికభాషావాదులూ, సంప్ర దాయ వాదులూనూ. ఆంధ్రసాహిత్యపరిషత్తు పిఠాపురంరాజావారి నేతృత్వంలో జయంతి రామయ్యపంతులుగారి సారథ్యంలో వ్యావహారిక భాష మీద ధ్వజం ఎత్తి గ్రాంథికభాషకు కొమ్ముకాస్తోంది. ఆ పక్షానికి చెందినవారి పత్రికకు సంపాదకుడుగా ధర్మారావు అలాటి భాషనే ఉపయోగించాలని భావించి ఉంటాడు. అదీకాక వీరు అప్పటికి గ్రాంథికభాషావాదులే వీరిలో మార్పు ఆ తర్వాత వచ్చింది. దీనికున్న ప్రబలమైన సాక్ష్యాధారాల్లో ఒకటి గిడుగు సీతా పతి అభిభాషణ. ధర్మారావు 1936లో గిడుగుకు ఓ ఉత్తరం రాస్తూ తాను పూర్తిగా వ్యావహారిక భాషావాదిగా మారాననన్నాచని సీతాపతి చెప్పారు. (ధర్మా

రావు 70వ జన్మ దినోత్సవ సభ, మద్రాసు). కనుక ఈ రచన తాపీవారిలో మార్పురాని కాలానికి చెందింది. తాపీవారు 1927 నుండే సకృత్తుగా భారతి లాంటి పత్రికల్లో విజయవిలాస వ్యాఖ్యాన సందర్భాల్లో వచన రచన చేస్తూండేవారు. ఆ భాష పేరుకు గ్రాంథికం అయినా సారళ్యంలోనూ వైశద్య స్ఫూర్తిలోనూ భావవ్యక్తీకరణంలోనూ వాడుకభాషకు చేరువలోనే ఉంటూం డేది. వీటికి పూర్వమే రాసిన క్రొవ్వురాళ్లు నవలలోని భాష కూడా ఈ భావ ప్రకాశిక భాషకన్నా చాలా సరళంగా ఉండటం ఇంతకు ముందే గమనించాం.

అప్పటికే చలం నవలలూ, సుప్రసిద్ధ కథకులైన వేలూరి శివరామశాస్త్రి, శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రి, కొడవటిగంటి కుటుంబ రావుల చక్కని వ్యావహారికంలోని కథలూ తెలుగుదేశంలో బాగా వ్యాప్తిలో ఉన్నాయి. వీరందరినీ కాదన్నా సుసంప్రదాయవాదిగా ఉండే విశ్వనాథ సత్య నారాయణ కూడా తన జయంతి పత్రిక (1923) ద్వారా వ్యావహారికం కాకున్నా సరళ గ్రాంథికంలోనే రచనలు చేస్తున్నారు. అయితే చివర్లో వీరు పూర్తిగా గ్రాంథిక వాదిగా మారటం అన్నది మరో అంశం. ఇందరి ప్రభా వాలనూ తట్టుకుని ధర్మారావు కృతక గ్రాంథికంలో ఆనాడు ఈ భావ ప్రకాశిక వెలువర్చటం ఆశ్చర్యాన్నే కలిగిస్తుంది. అప్పటికొచ్చిన ప్రబుద్ధాంధ్ర,శారద, భారతి,సఖి, సాహితి వంటి సాహిత్య పత్రికల్లో భాషచూసినా రాజకీయపత్రికలో వచ్చిన ఈ సాహిత్య వ్యాఖ్యానం కన్నా చాలా సరళంగా ఉందని అనిపిస్తుంది. దీన్నంతా ఆధారంగా చేసుకుని ఆలోచిస్తే ధర్మారావు ఈ భావ ప్రకాశికను చాలా సంవత్సరాల ముందే రాసి ఉంటాడు. దినపత్రికలో అచ్చేసే తొందరలో కనీసం ఓ మారు చూసుకోటానికైనా అవకాశం ఉండి ఉండదు. అదే ఉంటే భాషను తప్పక మార్చి ఉండేవారనటానికి ఇంతకు ముందు నాటికల ఉదంతాన్ని గమనించవచ్చు.

ధర్మారావు 1933 లో బరంపురంలో జరిగిన అభినవాంధ్ర కవిపండిత సభలకు హాజరయ్యాడు. బహుశా వ్యావహారిక వాదులప్పటికి వీరిని స్వజనం లోకి తీసుకుని ఉండరు. కొత్త పాళీ పీఠికలో ధర్మారావే అన్నట్టు 1933-1936 వరకూ ఏమీ రాయక చాలా కాలం బాగా చదవటానికే తన శక్తిని వినియోగించానని అన్నాడు. ఈ దశలోనే వీరిలో భాషాపరంగానూ, భావాల పరంగానూ మార్పు వచ్చింది. 1936 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు పీఠానికి గిడుగును అధ్యక్షుడుగా ఎంపిక చెయ్యాలని ప్రజామిత్రలో ఓ విజ్ఞప్తి మీద సంతకం కూడా పెట్టాడు. వీటన్నిటినీ బట్టి ఆలోచిస్తే ఈ రచన 193?కు చాలా పాతది అనిపిస్తుంది. ఈ వ్యాఖ్య మీద వీరికి అంత మక్కువ ఉన్నట్టు

కనిపించదు. ఉంటే దీన్ని పుస్తక రూపంలో తెచ్చే ఆలోచన చేసి ఉండేవాడు ఈపాటికే. అంతేకాదు భాషను పూర్తి వ్యావహారికంలోకి మార్చి తిరగరాసి ఉండేవాడుకూడా. ఈ అభిప్రాయాన్ని 1972 లో ఓ పత్రికా ప్రతినిధికి ఇచ్చిన ఇంటర్వ్యూలో కూడా వెల్లడించాడు.

ఏదిఏమైనా విజయవిలాసంతోపాటు పారిజాతాపహరణం కూడా ధర్మారావుకు ప్రీతిపాత్రమైంది. ఈ విషయం మనకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు పారిజాతాపహరణాన్ని పరిష్కరించమని ధర్మారావుకే ఇవ్వడం వల్ల తెలుస్తుంది. దాన్ని సుందరంగా పరిష్కరించి ఓ చక్కని పీఠికను కూడా రాశాడు.[74] అందులో వీరు ఇది ''మానానికి అవమానానికి కలిగిన సంఘర్షణే అయినా కవి అడుగడుగునా సత్యాకృష్ణుల శృంగార రస జీవిత విశేషాలను'' కనబర్చాడంటూ ఇది శృంగార ప్రబంధం అవుతుందా అన్న వాదం లేవనెత్తారు. వారి మాటల్లోనే ''చక్కని ఆంధ్ర కావ్యాలలో మిగుల చక్కనిది ఈ పారిజాతాపహరణ మహా ప్రబంధము''. ఇలాంటి దానికి ధర్మారావు విజయవిలాసం ఫక్కీలో వ్యాఖ్యానం ఇలా వచనరూపంలోనైనా రాసి ఉంటే హృదయోల్లాసం ఒంటరిగా కాక భావప్రకాశికతో జంటగా తెలుగు సాహిత్యంలో చక్కని వ్యాఖ్యానాల్లో మిగుల చక్కని వ్యాఖ్యానంగా కలకాలం నిలిచి ఉండేది.

## వచనం కోటలో పాగా

ధర్మారావు ఈ కాలంలో (1912-1930) చాలా ఖండకృతులను రాశాడు. అడపాదడపా వచనం రాసినా ఆయా సందర్భాల ననుసరించి కవితలే ఎక్కువగా వచ్చాయి. ఈ ఖండకృతులను పరిశీలిస్తే ఆత్మాశ్రయం-పరాశ్రయాలని రెండు భాగాలు చెయ్యచ్చు.

తన జీవితం నడిచిన విధానం - ఎదురైన కష్టాలూ - తట్టుకున్న పద్ధతీ ఇవన్నీ ప్రతిబింబించే వాటిని ఆత్మాశ్రయాలనుకుంటే -

భిక్షాపాత్రము
స్వర్ణ ఖండము
నిరశ్రురోదనము
విషాద జలదము

ఒక కాలం నాటి ధర్మారావు జీవనంలోని గడ్డు కాలాన్ని వివరించేవైతే; 'శుకవిలాపము' అంతకు పూర్వంది అని అనొచ్చు. తన వ్యక్తిగత విషయాలకు ప్రాధాన్యం ఉన్న రచనలను ఒక సంపుటిలో ప్రచురించానని ధర్మారావే అన్నట్టు - ఇవన్నీ 'మబ్బుతెరలు'లో చోటుచేసుకున్నాయి. (1972లో ప్రచురితమైంది.) ఇందులో క్షణక్షణం ఆశ - నిరాశల మధ్య జరిగిన పోరాటం, ప్రతి దశలోనూ కవే ఓటమి పాలవుతాడేమోనన్నంత దాకా తీసికొచ్చి ఏ పక్కనుండో ఆశాలేశం వెన్నుదట్టి నిలబెట్టడం చూడగలం. ధర్మారావు మనస్తత్వం కూడా అదే. చింతా పరాజయమే కోరుకున్నాడు. తాను హాలాహలం మింగి బయటకు అమృతం చిలికిన వ్యక్తి ధర్మారావు. మానసిక వ్యథను చిలుక మీదనో, మబ్బు మీదనో పెట్టి కవిత రాసి గుండె బరువు దించుకోవటం కనిపిస్తుంది. సాధారణంగా తమ రచనలను ముద్రించుకోడానికి రచయిత పడే పాట్లు కూడా 'భిక్షాపాత్రం' వెల్లడిస్తుంది.

ఇక పరాశ్రయాలని గానీ - తదితరాలని గానీ చెప్పదగినవి ఎక్కువ భాగం 'పాతపాళీ'లోని (1960) రచనలు. ఇందులోని ఖండికలు వివిధ ఉద్యమాలను తెల్పేవి, కొన్ని చారిత్రకాధారాలను చక్కగా కవితా పరంగా విడమర్చి చెప్పేవి. రాజకీయ జీవనం మనిషి మనుగడలో భాగం అయినప్పుడు నాటి జాతీయ ఉద్యమాల ప్రభావం కవి మీద పడి కవితల్లో ప్రతిఫలించక పోదు. అలాగే కవిత్వ ఉద్యమాలు కూడానూ. కవిత్వంలో వస్తున్న మార్పునూ, భాషలో వస్తున్న మార్పునూ ధర్మారావు ఖచ్చితంగా ఎదురొడ్డిన దశ ఇది. అయినా ఆంగ్ల సాహిత్యవాసనా ప్రభావితాలైన రచనలూ చేశాడు. కొన్ని కొన్ని నూతన ప్రక్రియలకు ఆహ్వానమూ పల్కాడు. కవిత్వపరంగా కొన్ని ప్రయోగాలనూ చేశాడు.

కానీ కాలం తెచ్చే మార్పును ఎంతకాలం అడ్డుకోగలరు ? ప్రయత్నించారు. భావ కవిత్వాన్ని, ఆ ఉద్యమంలోని వ్యక్తుల అహంభావాన్ని ధర్మారావు వ్యంగ్యంగా కవితాపరంగా హేళన చేశాడు. అయినా వీరి రచనల్లోని భాగాలూ పద్ధతులూ నాతి దీర్ఘఖండికలనూ చూస్తే భావకవిత్వంలోని కొన్ని లక్షణాలను తప్పించుకోలేకపోయిన స్థితిని గమనించచ్చు.

చరిత్ర వస్తువుగానూ, శాస్త్రం వస్తువుగానూ స్వీకరించి కవితల్ని మెప్పించడం కష్టమే. ఈ కష్టాన్ని ధర్మారావు ఎదుర్కొని అధోజ్ఞాపికల ద్వారా పాఠకులకు విషయాన్ని సులభగ్రాహ్యమయ్యేలా కృషిచేశాడు. తన ఊహలకు రూపం కల్పించుకున్నాడు. ధర్మారావు కవిత్వం మీద పరిశోధన చేసిన కుమారి రాగిణి వీరి 'పాతపాళి' - 'మబ్బుతెరల'ను బాగా విశ్లేషించాడు.

వాటిని భాషా, పరిశోధనాత్మక, చరిత్రాత్మక, సాహిత్య, ద్వ్యర్థి, ప్రయోగాత్మక. హేళన, కవిప్రశంస, వ్యాజస్తుతి, క్షమార్పణ విషయకాలంటూ ధర్మారావు వివరణలనే అంగీకరించినా వాటిలో అందచందాలనూ - అలంకారాలనూ - వివరించారు. కవిత్వ తత్వాన్ని చెప్పడానికి కృషిచేశారు. (పేజీ 30 'తాపీ ధర్మారావు కవిత్వము ఒక పరిశీలన, ఎం. ఫిల్ కోసం మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించింది. 1980) అక్షర శారదా ప్రశంస రచన నిజంగా కత్తిమీద సాములాంటిదే. ధర్మారావు విశేష పఠనా భ్యాసాన్ని వివరిస్తుంది. ముఖ్యంగా 'ద్యోయానం'లో 'ఈ దేశంబు వరాల తీవ' అన్న పద్యంలో ధర్మారావుకున్న వలస దోపిడీ వ్యతిరేక భావం, సామ్రాజ్యవాద వ్యతిరేక ధోరణీ బాగా స్ఫురిస్తోంది. ఒక జాతీయవాదిలో ఈ భావాలప్పుడప్పుడే అంకురిస్తున్న ఛాయలను ఇందులో గమనించవచ్చు.

ఆయా విషయాలను తరచి తరచి ఎంత లోతుగా మూలమట్టం వరకూ పోయి శోధించాలో విద్యార్థులకు వరవడి చూపిస్తుంది. ఇదే వారిని 'విజయ విలాసం' హృదయోల్లాస వ్యాఖ్యాన రచనకు అర్హతను సంపాదించిపెట్టింది. ఈ సందర్భంలోనే ధర్మారావెప్పుడో ఓనమాల గురించి ఆంగ్లంలో ఒకవ్యాసం రాశారనీ దాన్ని పురస్కరించుకునే, బొంబాయిని స్థావరంగా చేసుకున్న రాయల్ ఏషియాటిక్ సొసైటీ వీరికి సభ్యత్వం ఇచ్చిందనీ వీరి కుమారుడు మోహనరావు అన్నాడు. ఆ సభ్యత్వ వివరంగానీ ఆ వ్యాసం కానీ లభ్యం కాలేదు. కానీ ఎం. ఆర్. ఏ. ఎస్. అన్న 'టైటిల్'తో సహా ధర్మారావు అచ్చువడ్డ రచనలు మాత్రం దొరికాయి. ఈ బిరుదు వీరి పరిశోధనా కృషికి గుర్తింపుగా భావించవచ్చు.

వీరి ఖండకృతులు చాలా బహుళంగా ఈ దశలోనే వచ్చాయి. తర్వాతి కాలంలో అప్పుడప్పుడు ఒకటీ అరా రాశారు. కానీ ఇంతగా రాసిన దాఖలాలు కనిపించవు. క్రమంగా వచనంవైపు మొగ్గడం గమనించచ్చు. వేగుచుక్క గ్రంథమాలద్వారా ప్రచురించిన క్రొవ్వురాళ్ళు - అప్పుడప్పుడు రాసిన లేకి, జొన్నకర్ర ప్రశ్నల వ్యాసాలూ; అచ్చుతప్పు వ్యాసం, తప్పాత్రకణం, అవన్నీ నికళ్ళేనా అన్న నాటికలూ - ప్రధానంగా విజయవిలాసం మీద వ్యాఖ్యాన సందర్భంలోవి - గమనిస్తే వచనం దిశగా సాగడం చూడగలం ఆ వ్యాఖ్యానానికి అవసరమైన పాండిత్యంపునాదులను ఈ కాలంలోనే పటిష్టం చేసుకున్నారు. కవిత్వాన్ని ఎలా అర్థం చేసుకుంటే సరైన వ్యాఖ్యానం ఇవ్వవచ్చో సాధనగా ఈ కాలం ధర్మారావుకి పనికొచ్చింది. కొత్తకు ఆహ్వానాన్ని పలకాలన్న లక్షణం వీరిలో ఇప్పుడే మొలకెత్తింది. తన స్థానం

సాహిత్యరంగంలో తప్ప మరో రంగంకాదన్న తెలివిడి ధర్మారావుకీసమయం లోనే అయింది. ముందు ముందెన్ని కష్టాలొచ్చినా తనబాటనే తాను సాగి పోవాలన్న కృతనిశ్చయం ధర్మారావుకి దశలోనే కలిగింది. ఇతర భాషా సాహిత్యాలనుండి తామరతంపరగా వచ్చి పడ్తున్న నూత్న భావాలకు వ్యాసమే తగిందన్న నిర్ణయానికిప్పుడే వచ్చాడు. వచనం కోటలోపాగా వేశాడు.

## రాలూ పూలూ - సూచికలు

1. ధర్మారావు కుమారుడు మోహనరావు జ్ఞాపకాల మేరకు ఆ రోజుల్లో ధర్మారావు 'అక్షరాల ఉత్పత్తి' మీద ఒక వ్యాసం రాసి లండన్ ఏసియాటిక్ సొసయిటీకి పంపారనీ దాని వైశిష్ట్యాన్ని గమనించి వారు ధర్మారావుకు ఎం.ఆర్.ఏ.ఎస్. సభ్యత్వమిచ్చారనీ అన్నాడు. ఆ సర్వే అధికారి భార్యకు ఇది తెలిసి మీ డిపార్ట్‌మెంట్‌లో ఒక ఎం. ఆర్. ఏ.ఎస్. ఉన్నాడట, అతణ్ని చూపమందట. ధర్మారావును ఆమె చూసిందనీ ఆమె వారిపట్ల చూపించిన అభిమానం ఆమె భర్తకు కంటగింపై ధర్మారావును ఏదో నెపంతో ఉద్యోగంనుండి తొలగించారనీ అంటాడు. కానీ నేను పరిశీలించినంతవరకూ, వీరికి ఎం.ఆర్.ఏ.ఎస్. బిరుదున్నట్టు కనబడలేదు. బొంబాయి, కలకత్తా, మద్రాసులనుండి ఆ కాలంలో ఈ సొసయిటీ నడుస్తూండేది. దీని జర్నల్స్‌లో వెతికినా అలాటి వ్యాసంకూడా కన్పించలేదు. కానీ సమదర్శిని 1929 - 1930 ఉగాది సంచికలో వీరి వ్యాసాలున్నాయి. అందులో ఈ బిరుదుంది.
2. శ్రీ తిరుమల రామచంద్ర, మరపురాని మనిషి, యువభారతి ప్రచురణ, హైదరాబాదు 1975 పేజి 75.
3. ఆంధ్ర భారతి పత్రిక సంపుటం 6 ఆషాఢం 1910 పేజి 281.
4. శ్రీ నిడుదవోలు వెంకట్రావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
5. బొబ్బిలి రాజా తమ్ముడు శ్రీ చిక్కవరం జమీందారుతో ఇంటర్వ్యూ - బొబ్బిలి.
6. శ్రీ తాపీ మోహనరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
7. శ్రీ ఉప్పల లక్ష్మణరావుతో ఇంటర్వ్యూ - బరంపురం.
   రామ్‌నాడ్ రాజా కొడుకు కాదనీ కదంబూర్ జమీందారు కొడుకనీ మోహనరావు అభిప్రాయం.
8. సం. నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి, విక్రమసింహపురి మండల సర్వస్వం శోభకృత్ నెల్లూరు 1963 పేజి 79-80.
9. జిల్లా రికార్డులు వాల్యూం 3112 పేజి 143-145.

10. సం. నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి, విక్రమసింహపురీ మండల సర్వస్వం శోభకృత్ నెల్లూరు 1963 పేజి 79-80.
11. ధర్మారావు కావ్యరచన ఖండిక తాతాజీ రచనలు హైదరాబాదు 1960 పీఠిక పేజి 49.
12. శ్రీ తాపీ మోహనరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
13. తర్వాత కొన్నాళ్ళకు ధర్మారావు పెద్ద కూతురు సుగుణావతమ్మను వారి బంధువులు అప్పలనరసమ్మ కుమారుడు సత్యనారాయణకిచ్చి పెళ్ళి చేశారు. (ఈ అప్పలనరసమ్మ ఇప్పటికీ సజీవులే. వయస్సు 104 సంవత్సరాలు. బొబ్బిలిలో ఉంటారు. వారిని ఇంటర్వ్యూ చేయడం జరిగింది.) కొద్దిరోజులు విజయనగరంలో ఉన్నారు. ధర్మా రావు అన్న నరసింగరావు బాగా పేరు సంపాదించిన డాక్టరుగా అక్కడే ఉండేవాడు.
14. ధర్మారావు - అక్షర శారదా ప్రశంస తాతాజీ రచనలు 1960 పీఠిక పేజి 20.
15. శ్రీ తాపీ మోహనరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
16. శ్రీ తాపీ మోహనరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
17. ప్రొఫెసర్ రోణంకి అప్పలస్వామి లేఖ ఆధారంగా.
18. శ్రీ మంత్రిప్రగడ శేషగిరిరావుతో ఇంటర్వ్యూ - టెక్కలి.
19. శ్రీ విశ్వనాధ నరసింహంతో ఇంటర్వ్యూ - విశాఖపట్నం.
20. అక్కడ ధర్మారావు ఉద్యోగం మానేసిన తర్వాత కొన్నాళ్ళకు కృష్ణ మూర్తిగారు ఆ సి. బి. యం. స్కూల్లో చేరి తెలుగు టీచర్‌గా 30 సంవత్సరాలు పనిచేసి ప్రస్తుతం రిటైరై విశాఖలో ఉన్నారు-ఇంటర్వ్యూ.
21. శ్రీ కొడవటిగంటి కుటుంబరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
22. శ్రీ ఉదయగిరి సీతారామస్వామితో ఇంటర్వ్యూ - విజయనగరం. వీరు షరాఫ్‌ఖానా వెంకటకృష్ణారావు మేనల్లుడు. ప్రస్తుతం సీతారామస్వామి గారు కృష్ణారావుగారింట్లోనే ఉంటున్నారు.
23. ధర్మారావు వియ్యపురాలు శ్రీమతి అప్పల నరసమ్మతో ఇంటర్వ్యూ- బొబ్బిలి.
24. బొబ్బిలిరాజా వెంకట శ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు (1862-1926) రెండో భార్యకి సంతానమైన రాజా వెంకట రామకృష్ణ రంగా రావు రెండో కుమారులు ఈ చిక్కవరం జమీందారు. కృష్ణామండ లంలో గన్నవరం దగ్గరున్న అజ్జంపూడి, గరికపర్రు, బుద్ధవరం,

పెద్దపూరిపాక మొదలైన పదకొండు గ్రామాలను కలిపి ఈ చిక్క-వరం సంస్థానం చేశారు. వీరి పెద్ద కుమారులే నేటి సినీసంగీత విమర్శకులు వి. ఎ. కె. రంగారావు.
ఆచార్య తూమాటి దొణప్ప ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణ 1969 పేజి 536.

25. బొబ్బిలి సంస్థాన ఉద్యోగి శ్రీ జోగారావుతో ఇంటర్వ్యూ - బొబ్బిలి.
26. శ్రీ చెలికాని రంగనాయకులతో ఇంటర్వ్యూ - బొబ్బిలి.
27. శ్రీ చిక్క-వరం జమీందారుతో ఇంటర్వ్యూ - బొబ్బిలి.
28. శ్రీ చిక్క-వరం జమీందారుతో ఇంటర్వ్యూ - బొబ్బిలి.
29. ఆచార్య తూమాటి దొణప్ప ఆంధ్ర సంస్థానములు - సాహిత్యపోషణ 1969 వల్లూరు.
30. ఆచార్య తూమాటి దొణప్ప ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణ 1969 పేజి 579.
31. జమీందారీ కమిటీ రిపోర్టు. దీన్నే ప్రకాశం కమిటీ రిపోర్టు అని అంటారు. 1937 పేజి 164-65.
32. జమీందారీ కమిటీ రిపోర్టు 1937 పేజి 164-165.
33. శ్రీ లింగం వీరభద్రయ్య చౌదరి స్వవిషయం 2 వ భాగం 1974 పేజి 474-475.
34. శ్రీ శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి అనుభవాలూ - జ్ఞాపకాలూనూ 2 వ సంపుటం కళాభివర్ధనీ పరిషత్తు రాజమండ్రి 1958 పేజి 260-261.
35. శ్రీ కె. వి. రమణారెడ్డి మహోదయం విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ 1969 పేజి 58.
36. 'సాహిత్యం నుండి మతం వరకు' భారతీయ విద్యాభవన్ బొంబాయి 1964 పేజి 58.
37. హోం. మిస్‌లేనియస్ సీరీస్ పేజి 796.
38. శ్రీ టంగుటూరి ప్రకాశం నా జీవిత యాత్ర 1972 పేజి 117-118.
39. ఈ విషయాన్ని ఇర్‌షాక్ తన పుస్తకంలో బాగా వివరించాడు.
40. శ్రీ టంగుటూరి ప్రకాశం నా జీవిత యాత్ర 1972 పేజి 153.
41. ఈ నాయర్ 1907 లోనే మిల్లు కార్మికులకు తక్కువ పని గంటలు చేసినట్లు "రిపోర్ట్ అఫ్ ఇండియన్ ఫాక్టరీ కమిషన్ 1908" మినిట్ ఆఫ్ డిసెంట్ బై డాక్టర్ నాయర్. పేజి 81 114 వల్ల తెలుస్తూంది.

42. 1920 లో యం. పి. ఏ. ను కాంగ్రెసు రద్దు చేసింది. అయినా 24 జూన్ 1920 న మద్రాసులో జరిగిన కాంగ్రెసు సభల్లో వి. వా. చిదంబరంపిళ్ళె - అన్ని స్థాయిల్లోనూ కాంగ్రెసులో బ్రాహ్మణ బ్రాహ్మణేతరులకు దామాషా ప్రాతినిధ్యం కల్పించాలని - తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. కానీ, దాన్ని అనేక సవరణలతో సభ ఆమోదించింది.

43. శ్రీ గొత్తిపాటి వెంకటసుబ్బయ్య సి. ఆర్. రెడ్డి జీవితం 1972 పేజి 115.

44. 'కుడి అరసు' పత్రిక. 1929 జూలై 7.

45. డాక్టర్ గంధం అప్పారావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.

46. జస్టిస్ ఇయర్‌బుక్ సెక్షన్ 4.1929 పేజి 110.

47. బొబ్బిలిలో ఇంటర్వ్యూ.

48. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, తరతరాల బరంపురం-అఖిలభారత తెలుగు రచయితల సమ్మేళనం ప్రత్యేక సంచిక బరంపురం 1979 జనవరి.

49. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు జీవితచరిత్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్ విజయవాడ 1978.

50. ఆచార్య కురుగంటి సీతారామ భట్టాచార్యులు, పిల్లలమర్రి వెంకట హనుమంతరావు, నవ్యాంధ్ర సాహిత్య వీధులు ప్రథమ భాగం 1949 పేజి 141 - 142.

51. ఆచార్య కురుగంటి సీతారామ భట్టాచార్యులు, పిల్లలమర్రి వెంకట హనుమంతరావు; నవ్యాంధ్ర సాహిత్య వీధులు ప్రథమ భాగం 1949 పేజి 144.

52. శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు, పురుషసింహులు 1964.

53. శ్రీ భాగవతుల లక్ష్మీనరసింహ శర్మ కూడా ఈ వేగుచుక్క గ్రంథమాల స్థాపక సభ్యుల్లో ఒకరు. వీరి గ్రంథాలను తర్వాత ఆ గ్రంథమాల ప్రచురించింది. ఈయన గాంధీవాది.
అఖిల భారత తెలుగురచయితల సమ్మేళనం ప్రత్యేక సంచిక బరంపురం 1979 జనవరి.

54. గ్రంథమాల మొదటి మరీచిక 'ఉషఃకాలము' సంపాదకుని ఉపోద్ఘాతము బరంపురం వేగుచుక్క గ్రంథమాల 1911.

55. ధర్మారావు పాతపాళీ తాతాజీ రచనలు 1960 పేజి 10.

56. వేమకోటి సీతారామశాస్త్రి 'మహాత్మా గాంధీ మెచ్చిన తెలుగు రచయిత' వ్యాసం ఆంధ్రపత్రిక 1979 డిసెంబరు 30.
57. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంతో ఇంటర్వ్యూ – హైదరాబాదు.
58. డాక్టర్ ముదిగొండ వీరభద్ర శాస్త్రి పానుగంటివారి సాహిత్యసృష్టి శతజయంతి ఉత్సవ సంఘం హైదరాబాదు 1968.
59. ఆ పత్రికల విషయం ధర్మారావు ఇంటర్వ్యూలో రామచంద్రకు చెప్పారు. పత్రికలు అలభ్యాలు. శ్రీ తిరుమల రామచంద్ర మరపురాని మనీషి యువభారతి ప్రచురణ హైదరాబాదు 1975 పేజి 72.
60. విలాసార్జునం నాటకం పీఠిక, క్రొవ్వురాళ్ళు 1955లో ప్రచురణకూ ఉన్న 'పరిచయం'.
61. క్రోధన సంవత్సరంలో ప్రచురితమైంది.
62. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి రామాయణ విశేషాలు 1952.
63. ధర్మారావు అవన్నీ నీ కళ్లేనా వివరణ తాపీవారి ప్రచురణలు విజయవాడ 1965.
64. ధర్మారావు అవన్నీ నీ కళ్లేనా తాపీవారి ప్రచురణలు విజయవాడ 1965 పేజి 38.
65. ధర్మారావు అవన్నీ నీకళ్ళేనా తాపీవారి ప్రచురణలు విజయవాడ 1965 పేజి 44.
66. ధర్మారావు అవన్నీ నీ కళ్లేనా తాపీవారి ప్రచురణలు విజయవాడ 1965 పేజి 40.
67. ధర్మారావు అవన్నీ నీ కళ్లేనా తాపీవారి ప్రచురణలు విజయవాడ 1965 పేజి 69.
68. ధర్మారావు అవన్నీ నీ కళ్లేనా తాపీవారి ప్రచురణలు విజయవాడ 1965 పేజి. 71.
69. ఈ విషయాన్ని రామస్వామి శాస్త్రులు సి. పి. బ్రౌన్‌కు 1846 సెప్టెంబరు 19న రాసిన లేఖలో తెలియచేశారు.
బంగోరె బ్రౌన్ జాబులు 1977 పేజి 26.
70. శ్రీ దూసి రామమూర్తి పారిజాతాపహరణం - సురభి వ్యాఖ్యానం వావిళ్లవారి ప్రచురణ 1968.
71. రుద్రభట్టు జగన్నాధ విజయం మూలం కాదనీ, కన్నడాంధ్రాలు రెంటికీ సంస్కృత హరివంశమే మూలమంటూ యశోదారెడ్డిగారు సోపపత్తికంగా నిరూపించారు.

డాక్టర్ యస్. వి. రామారావు తెలుగులో సాహిత్య విమర్శ పసిడి ప్రచురణలు హైద్రాబాదు 1974 పేజి 178.

72. చోదితో భార్యయోత్పాట్య పారిజాతం గరుత్మతి, ఆరోప్య సేంద్రాన్ విబుధాన్నిర్జిత్యోపాన యత్పురమ్ స్థాపితం సత్యభామాయా గృహోద్యానోప శోభనః అన్వగుర్భ్రమరాస్వర్గాద్యద్గంధా సవలంపటాః యయాచ ఆనమ్య కిరీట కోటిభిః పాదౌ స్పృశన్నచ్యుత మర్థసాధనం సిద్ధార్థ ఏతేన విగృహ్యతే మహా నహోసురాణాంచ తమోధి గార్యతామ్. భాగవతం దశమ స్కంధం అధ్యాయం 59.

73. విజ్ఞాన సర్వస్వం వాల్యూం 3 తెలుగు భాషా సమితి 1959 పేజి 815 - 820.

74. ధర్మారావు పారిజాతాపహరణం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1966 పీఠిక.

# 4

# ఉద్యమాల ఊపిరితో ఎర్రకేక

తెలుగునాడు ఉద్యమాల ఉయ్యాల లూగుతున్న కాలం. ప్రపంచమే అనేక కుదుపులకు లోనౌతున్న సమయం అది. అన్ని రంగాలలోనూ ఇది 1930 తర్వాత స్పష్టంగా కనిపిస్తోంది. భారతదేశంలో కూడా ఆ ప్రభావం కనిపించక తప్పలేదు.

ధర్మారావు అనేక వృత్తుల్లో అనుభవం సంపాదించి చివరకు మద్రాసు చేరాడు. మందసాతో జమీందార్ల దగ్గర కొలువుకు సలాంకొట్టాడు. ఏ గ్రంధరచనా సాగించలేదు. కొత్తపాళీ పీఠికలో తాను కొన్నివేల పేజీల గ్రంథాలను అధ్యయనం చేసి బయటకొచ్చానన్న కాలం ఇదే. 1936 కల్లా కొత్త జవం జీవంతో పత్రికా రచనతో సాహితీరంగంలో కాలుబెట్టాడు.

అప్పటికి దేశ రాజకీయరంగంలో కాంగ్రెసు, జస్టిసు పార్టీ, పీపుల్స్ పార్టీ, ప్రజామిత్ర పక్షాలు దక్షిణాన రాజకీయ కురుక్షేత్రంలో ఉన్నాయి. కాంగ్రెసు 1930 నుండీ సత్యాగ్రహ సమరాలూ అవీ సాగించుకుంటూ జనంలో పలుకుబడి పెంపొందించుకుంది. మితవాద ఛాయలను క్రమంగా తొలగించుకొని అతివాదపక్షంగా జనంమధ్య గుర్తింపు పొందటానికి కృషి చేస్తోంది.

జస్టిసు పార్టీ స్వతహాగా తనలోనే ఉన్న వైరుధ్యాలతో పతనం చెందుతోంది. ఎంత బ్రాహ్మణేతరుల సిద్ధాంతం మీద కొట్టుకొద్దామనుకొన్నా ఆ

వర్గాల్లో ఐక్యతను సాధించలేకపోయింది. ఇందులోనూ జాతీయ భావాలున్న వ్యక్తుల ప్రాబల్యం పెరగటంతో గాంధీ గొప్పతనాన్ని గుర్తించక తప్పటం లేదు. ధర్మారావులాంటి వ్యక్తులు మొదటి నుండీ సాంస్కృతికంగా ఆ ఉద్దేశాలను బలపర్చినవారేగాని, రాజకీయంగా ఎప్పుడూ దాని ఆశయాలను ఆమోదించినవాళ్లు గాదు. 'సమదర్శిని' సంపాదకులుగా ఉన్నా జాతీయ ఉద్యమాలను, సత్యాగ్రహాలను అందులో బాగా ప్రతిబింబించేలా తాపీ రచనలు చేశాడు. క్రమంగా పింజల సుబ్రమణ్యాచెట్టినీ జాతీయవాదిగా తాపీ మలచటం-అందుకు జమీందార్లు పింజలవారిని తిట్టూండటం జరుగుతూండేది.[1] ఈ పార్టీని గురించి వివరాలు ధర్మారావు పత్రికారచనను వివరించే సందర్భంలో ఇవ్వటం జరుగుతుంది.

పీపుల్స్ పార్టీ ఆవిర్భవించటం కేవలం ఎన్నికలకోసం. అందులో మట్టికరవగానే అంతరించటం జరిగింది. అయితే అది నడిపిన 'జనవాణి' దినపత్రిక పత్రికారంగంలో కొత్త పోకడలు సాధించింది. సమర్థులైన సంపాదకులను సృష్టించింది. నేటి పత్రికలకు ఒకరకంగా ఓనమాలు నేర్పింది. ఇదంతా నాడు ధర్మారావూ వారి చుట్టూ అందులో ఉన్న సంపాదకవర్గ సహచరుల కృషేననాలి. ఆనాడు విమర్శకులు కొందరు ఆ పత్రికను - కాలిస్తే ఏదైనా బూడిద ఇస్తుందన్న భావంతో - వ్యంగ్యంగా 'విభూతి' పత్రిక అనే వాళ్ళు.[2] అయినా దేశానికీనాడు అది విభూతి (సంపద) నిచ్చిందనే అనాలి.

ఆకాలం నాటి ప్రజామిత్ర పక్షం కృష్ణా జిల్లాబోర్డు రాజకీయాలకే పరిమితంగా జమీందార్లూ, భూస్వాముల అహమహమికల మధ్య ఏర్పడ్డా, రామబ్రహ్మం నాయకత్వంలో అనేకమంది రచయితలను తయారుచేసింది. జర్నలిజాన్ని, సినీ జర్నలిజాన్ని, చిత్రరంగాన్ని అభివృద్ధి పరచటంలో ఎనలేని కృషిచేసింది. ధర్మారావు విరాట్ స్వరూపాన్ని తెలుగునాటికందించిన ఘనత ఆ పత్రికదనవచ్చు.

ఇలా రచనలు సాగిస్తూనే ధర్మారావు మోహినీరుక్మాంగదతో సినీరంగ ప్రవేశం చేశాడు (1937). మొదటి తరం స్క్రిప్టు రచయితల్లో అగ్రగణ్యులయ్యాడు. అటు పత్రికల్లోనూ, ఇటు సినిమాల్లోనూ వ్యావహారిక భాషను ప్రవేశపెట్టిన వ్యక్తిగా పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నారు. సాంఘిక వస్తువుతో సినిమారచనచేసి దానికి ఆదరాన్ని పెంపొందించిపెట్టిన మొదటి ఇద్దరు, ముగ్గురిలో ఒకరయ్యారు.

కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడటంతో ఈ చిల్లరమల్లర పార్టీలన్నీ తుడుచుకుపోయాయి. ఎన్నికలకంటూ పెట్టిన పత్రికలు అలానే అంతరిం

చడం జరిగింది. అప్పటికి ధర్మారావు ఇటు సాహిత్య రంగంలో వ్యావహారిక వాదిగా, సినిమా రచయితల్లో ఆద్యులుగా నిలదొక్కుకుంటున్నారు.

భారతదేశంలో సుమారు 1926లో ఆరంభమైన కమ్యూనిస్టు ఉద్యమం బలం పుంజుకుంటోంది. దాని ప్రభావం ఇక్కడా పడింది. యువకులు ఆహ్వానం పలికారు. దాంతో అప్పుడప్పుడే తెలుగునాట రాజకీయ రంగంలోకూడా కొత్తగాలులు వీచటం ఆరంభించాయి. వామపక్షభావాలున్న యువకులు అప్పటివరకూ కాంగ్రెస్‌లో ఉన్నవారు వేరై కార్మిక కర్షకులను సమైక్యపర్చి వారి సమస్యలమీద పోరాటాలు నిర్వహించటానికి కుదుళ్లు కుదుళ్లుగా సంఘటితమవుతున్నారు.

ప్రపంచంలో సోషలిజం అన్నది ఒక స్థిరమైన వ్యవస్థగా నిలదొక్కుకుంటోంది. పెట్టుబడిదారీ వ్యవస్థను అన్నిటా సవాలు చేస్తూ సోషలిజం సిద్ధాంతం పునాదిగా సోవియట్ యూనియన్ బలపడ్తోంది. ఈ భావాలన్నీ భారత దేశ రాజకీయ రంగంలో కూడా తగినంత ప్రభావాన్ని కలిగించాయి. కాంగ్రెసు నుండి బలమైన వర్గం, ప్రధానంగా యువకులు సోషలిజం స్థాపన అన్న నినాదం మీద విడివడ్డారు.

ధర్మారావు ఈ పరిణామాలను గమనిస్తూండగానే వారి కుమారులు మోహనరావు, చాణక్యలు ఆ కమ్యూనిస్టు రాజకీయాలవైపు ఆకర్షితులయ్యారు. మోహనరావు ధర్మారావు ఇంట్లోనే ఉండేవారు. రహస్యంగా వచ్చే సిద్ధాంత సాహిత్యాన్ని మోహనరావు తెస్తూండేవాడు. ధర్మారావుకూడా ఆ సాహిత్యాన్ని ఓ చూపు చూస్తూండేవారు. రైతు, కూలీ ఉద్యమాలూ, మహిళా ఉద్యమాలను ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ నడుపుతూండేది. ముఖ్యంగా విద్యార్థి, యువజన సంఘాలను పెట్టటం, గ్రంథాలయ ఉద్యమాన్ని నిర్వహించటం, వర్ణాలూ, మతాలకతీతంగా వివాహాలు జరుపుతూ ఆ భావాలను ప్రజల్లో ప్రచారం చేస్తూండటం నాడు కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం. ఇవే, ధర్మారావుకు ప్రధానంగా ఈ పార్టీ అంటే సానుభూతి ఉండేలా చేశాయి. ఇంట్లో తరచుగా ఈ పార్టీ రాజకీయ సిద్ధాంతాలూ, ఆచరణల మీద తండ్రీ కొడుకుల మధ్య చర్చలు జరుగుతూండేవి. ఆ చర్చలు కొన్ని సందర్భాల్లో చాలా తీవ్రస్థాయికి చేరుకున్నప్పుడు ధర్మారావు భార్య అటు భర్తనూ ఇటు కుమారులనూ నాలుగు మాటలని అప్పటికి ఆగిపోయేలా చేస్తుండేది. ధర్మారావు కొడుకులను మిత్రులుగా చూస్తుండేవారు.[5] అన్నపూర్ణమ్మగారి మాట ఆ యింట్లో అందరికీ శిరోధార్యం. ఈ చర్చలు అన్నీ ధర్మారావు ఒక స్పష్టమైన రాజకీయాభిప్రాయాన్ని ఏర్పరచుకోడానికి సాయపడ్డాయి.

ఇంతలో 1939 సెప్టెంబరు 3న రెండో ప్రపంచయుద్ధం ఆరంభ మైంది. కమ్యూనిస్టు పార్టీ అంతకుముందు 1937లో 'నవశక్తి' తెలుగు పత్రి కను ఆరంభించి నడుపుతూండేది. యుద్ధం రావడంతో 1939 సెప్టెంబరులో దాన్ని ఆపక తప్పలేదు.

ప్రపంచ రాజకీయరంగంలో ఉన్న పెట్టుబడిదారీ - సోషలిస్టు వ్యవస్థలు రెంటిలో ఏది మంచిదో; ఏది సామాన్యులకు అవసరమవుతుందో తేల్చు కోవటం ఎటూ చెందని వారికి కొంత కష్టమనిపిస్తూండేది. ఈ రెండో ప్రపంచయుద్ధం వచ్చి వాళ్ళ కళ్లు కొంతవరకూ తెరిపించింది. జాతీయదురహం కారాన్ని ఆర్యరక్త ప్రభావోన్మాదాన్నీ జనానికి ఎక్కించాడు హిట్లర్. యుద్ధోన్మాదంతో జర్మనీని పిచ్చిపట్టిన దేశంలా తయారుచేశాడు. వందనోళ్ళూ వేయి చేతులూ పెట్టుకొని ప్రపంచాన్నే కబళిద్దామని పరుగులుపెట్టాడు. నాజీజాన్ని ప్రపంచం మొత్తం మీద రుద్దాలని తాపత్రయపడ్డాడు. సరిగ్గా అప్పుడే ఇటలీలో ముస్సోలినీ ఫాసిజం ప్రచారం చెస్తూ హిట్లరుకు సాయ పడటం ఆరంభించాడు. దాంతో కమూనిస్టు వ్యతిరేక ఉన్మాదం ప్రబలటం, సోవియట్ యూనియన్ మీద జర్మనీ దాడికి సన్నద్ధం కావటం జరిగింది.

ఆలోచనాపరులైన ధర్మారావుకు ఈ పరిణామాలు సోషలిజం మీదున్న అనేక అనుమానాలను పటాపంచలు చేశాయి. యుద్ధం జరుగుతున్న కాలం లోనే 1940 లో కాగడా వార పత్రికను ఆరంభించి 1942 దాకా నడిపారు.

ఈ లోపున అంటే 1936 నుండి 1940 దాకా (జనవాణి దినపత్రికా 1939 వరకూ వచ్చింది) ఇటు సినిమా రచన సాగిస్తూనే తెలుగుదేశంలో సాహిత్య సభలు జరుపుతూ పర్యటనలు చేస్తూండేవాడు. జంషెడ్‌పూరు ఆంధ్ర నాటక సాహిత్య సంఘ భవనంలో శ్రీకృష్ణదేవరాయల చిత్రాన్ని ధర్మారావు ఆవిష్కరించాడు. అధ్యక్షత వహిస్తూ భారతదేశంలో వీరపూజ అనాదిగా ఉన్న ఆచారమంటూ ఉపన్యసించాడు.4 (1936 జనవరి 14, ప్రజామిత్ర.)

విజయనగరం కళాశాలలో ఒక సభ జరిపి కృష్ణశాస్త్రి కావ్యపఠనం ఏర్పాటు చేయించాడు. భావకవిత్వమంటే ధర్మారావుకు పడేదికాదు కానీ కృష్ణ శాస్త్రి అంటే సదభిప్రాయమే ఉండేదని కృష్ణశాస్త్రి అంటారు.5

1940 జనవరి చివరిలో ధర్మారావు కాకినాడ కళాశాల ఆంధ్రాభ్యుద యోత్సవాలలో పాల్గొన్నాడు. నాడు తెలుగుదేశంలో ఉన్న ప్రముఖ రచ యితలూ కవులూ ఆ సభలకు హాజరయ్యారు.6 మంచి ఉత్తేజకరమైన ఉప న్యాసం ధర్మారావిచ్చాడు. తెలుగువారికి ఇంగ్లీషు దిన పత్రిక ఉండటం చాలా ఆవశ్యకమన్నాడు. తెలుగు సాహిత్యాభివృద్ధిని ఆకాంక్షించాడు.7 ఈ సభలకు

ధర్మారావును ఆహ్వానించటంలో కృష్ణశాస్త్రి హస్తం ఉంది. శాస్త్రి ధర్మారావును ఎప్పుడూ 'అన్నగారూ' అని పిలుస్తూండేవాడు. ధర్మారావు విశాఖ కవితాసమితిలో ఆది నుండి (1926) సభ్యులుగా ఉంటూ దాని సమావేశాలకు తప్పక హాజరవుతూండేవాడు. ఆ సమితి రవీంద్రనాథ టాగూర్‌కు సన్మానం చేసిన విశాఖ సభల్లో ధర్మారావు పాల్గొన్నాడు. జనవాణి పత్రికా సంపాదకులుగా, కాగడా సంపాదకులుగా, కొత్తపాళీ, దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు వ్యాసాల రచయితగా, విజయవిలాస వ్యాఖ్యాతగా తెలుగు దేశమంతా తిరిగాడు.

1940 లో కాగడా వారపత్రిక నెలకొల్పటంతో మద్రాసులోనే ఉండి పోవాల్సి వచ్చింది. అప్పటికి రెండో ప్రపంచ యుద్ధ మేఘాలు తెలుగునాడు మీదా కమ్ముకున్నాయి. ధర్మారావు ఖచ్చితంగా కమ్యూనిస్టు రాజకీయాలను, సోషలిస్టు రాజకీయాలను ప్రతిబింబించటం ఆరంభించాడు. నవంబరు 7 గురించిన (నవంబరు 5 సంచిక కాగడా, 1940) వ్యాసం, సోషలిస్టు రాజ్యాల గురించిన వివరాలు, రెడ్ ఆర్మీని కీర్తిస్తూ వ్యాసాలూ (సెప్టెంబరు 24 సంచిక, కాగడా 1941) హిట్లర్ నాశనం కాంక్షిస్తూ చరిత్రలో రక్తముద్ర (సెప్టెంబరు 3 సంచిక, కాగడా 1941) అన్న వ్యాసాలతో ధర్మారావు తన పత్రిక ధోరణి బయటపెట్టాడు.

మద్రాసులో బాంబులు పడటంతో పత్రికను ఆపేసి చల్లపల్లి వెళ్ళాడు. మద్రాసు రాష్ట్రయుద్ధ సంఘం అంటూ గవర్నరు అధ్యక్షులుగా, ఆర్కాటు రాజా ఉపాధ్యక్షులుగా 3 ఉప సంఘాలకు సలహాదారులనూ ఛైర్‌మన్‌లనూ ప్రభుత్వం ప్రకటించింది.[8] అప్పుడే ధర్మారావును ఆ సంఘాలలో ఒక ప్రాంతీయ సంఘానికి రిక్రూటింగ్ ఆఫీసర్‌గా, ప్రాంతీయ ప్రచారకులుగా నియమిస్తే అంగీకరించలేదు. తర్వాత దాన్ని అంగీకరించాడు. కుటుంబాన్ని విజయవాడలో ఉంచి తాను పర్యటిస్తూండేవాడు.

1941 ఫిబ్రవరిలో గుంటూరులో రైతు మహాసభలు చాలా బ్రహ్మాండంగా జరిగాయి. ఆ సీమ రైతులందరూ తమ తమ సమస్యలమీద చర్చించుకొని కార్యాచరణను రూపొందించుకోవటానికి ఏర్పాటు చేసుకున్న సభలవి. యుద్ధం ముమ్మరంగా నడుస్తున్న కాలం. ఆహారధాన్యాలూ తదితర జీవితావసర వస్తువుల కొరతతో భారత ప్రజలు విపరీతంగా బాధపడుతున్న రోజులవి. దేశానికి తిండి పెట్టే రైతులు ప్రజలకు ఆహారాన్ని అందించేందుకుగాను పూడిపోయిన చెరువులనూ, కాలువలనూ మరామత్తు చేయటం, బంజర్లను సాగు చేయటం, శాస్త్రీయ పద్ధతుల ద్వారా అధికోత్పత్తిని సాధించటం, తమ దేశభక్తియుత కర్తవ్యంగా భావించారు. ఈ ఆశయ సాధనకు పెద్ద యెత్తున




17. అదిమ కాలంలో స్త్రీ జననాంగ పూజా శిల్పాలు - ఐర్లెండ్.




[Face page 104.]

SYMBOLS ILLUSTRATING PHALLIC WORSHIP IN ANCIENT EGYPT.
From Davenport, *Aphrodisiacs* (1869).

18 ఈజిప్టులో అతి ప్రాచీనకాలంలోని స్వలింగపూజ



SACRIFICE TO PRIAPUS.
From Raponi, *Recueil de Pierres Antiques Gravées* (Rome, 1786).

19 . రోములో లింగరూపి ప్రియాపస్‌ను స్త్రీలు నగ్నంగా పూజించడం.



20 . 'బచ్చూస్'ను స్త్రీలు పూజించడం.

తెలుగుదేశ రైతాంగాన్ని సమీకరించటానికి ఏర్పాటు చేసిన సభలే అవి. వాటిని తాపీ ధర్మారావే ప్రారంభించాడు. దేశాభ్యున్నతిలో రైతుల ప్రాధాన్యాన్ని వివరిస్తూ మధ్య దళారీల చేతుల్లో వారెట్లా దోపిడీకి గురవుతున్నారో విశదీకరించాడు.[9]

పత్రికారచన ఓ గౌరవప్రదమైన వృత్తిగానూ బాధ్యతగల సేవగానూ పరిగణనలోకొస్తున్న కాలం అది. అందుకని పత్రికా సంపాదకులందర్నీ ఓ తాటిమీద నడిపించి వారికో సంఘం ఏర్పాటు చెయ్యటానికి ధర్మారావు తీవ్రంగా కృషిచేశాడు. 1940 నుండీ రాష్ట్రమంతా తిరిగి తిరిగి చివరకు 1941 మార్చి 29, 30 తేదీల్లో విజయవాడలో మొదటి మహాసభలు నిర్వహించాడు. అధ్యక్షులుగా వీరే ఉన్నారు. న్యాపతి నారాయణమూర్తి ఈ సభలను ప్రారంభం చేశారు.[10] తర్వాత రెండో మహాసభలను చిత్తూరులో జరపాలని తలపెట్టారు. దాని నిర్వహణ బాధ్యత కూడా ధర్మారావు నెత్తినే పడింది. కానీ ఆ మహాసభలేమయ్యాయో వివరాలు దొరకలేదు.

ధర్మారావు చల్లపల్లిలో ఉంటూన్నకాలంలోనే చల్లపల్లి రాజా కుమారుడు మల్లికార్జున ప్రసాద్ అక్షరాభ్యాసం జరిగింది. తెలుగు దేశంలో కవులూ, పండితులూ అందరూ వచ్చారు. అక్షరాభ్యాసం 'ఓంనమశ్శివాయ' అని ఆరంభం కాబోతుంటే తాపీవారడ్డుకున్నారు. అదంతా తప్పు అ, ఆలు రాయించటంతో ఆరంభం చెయ్యమన్నాడు. పండితులు తికమకపడ్డారు.[11] రాజావారికి తాపీవారి మీద భక్తి ఎక్కువ. దాంతో చివరకు అ, ఆలే రాయించారు. సాయంకాలం విశ్వనాథ సత్యనారాయణ తదితరులెందరో ఉండే కవి పండితుల సభలో ధర్మారావు 'ఓనమాలు'గా మారిన 'ఓంనమశ్శివాయ' తో అక్షరాభ్యాసం ఆరంభం కావటంలో అర్థంలేదనంటూ వాదనలేవదీశాడు. ఇది గుణింతం అనీ - పలకటమే రాని వాడికి మొదలే ఇది నేర్పటం అసహజమంటూ అందర్నీ నిలవేశాడు. ఇలా అక్షరాభ్యాసాలు జరగటం అంటే మోసం చెయ్యటం తప్ప మరేమీ కాదన్నాడు. 'పండితులెవరికన్నా సత్తా ఉంటే వాదించండి' అని సవాలు విసిరాడు. సభ గుసగుసలు పోయింది. ఆ ఉపన్యాస భాగాలనే "చెప్పేదంతా తప్పుడు చదువేనా? తెలుగు వారి అక్షరాభ్యాసంలో అవకతవకి" లంటూ ఓ చక్కని వ్యాసం తర్వాత రాసి ప్రచురించాడు.[12]

ప్రతిదాన్నీ ప్రశ్నించడంలో ధర్మారావుకు సమఉజ్జీ కవిరాజు త్రిపురనేని. వీరిద్దరూ మంచి మిత్రులు. కవిరాజుకు 1942 లో గుడివాడలో బ్రహ్మాండమైన సన్మానం జరిగింది. అది వారి 55 వ జన్మదినోత్సవం కూడానూ. బెజవాడ రామచంద్రారెడ్డి అధ్యక్షులు. ఆ సభలను ప్రారంభించింది ధర్మారావే.

చాలా చక్కని ఉపన్యాసమిచ్చారని పత్రికలు ప్రశంసించాయి. కవిరాజు జీవితాన్నీ, హేతువాద ప్రచారంలో వారి సాహిత్యకృషినీ తాపీ సోదాహరణంగా వివరించాడు.[13]

సరిగ్గా ఇక్కడుంటున్న కాలంలోనే అభ్యుదయ రచయితల ఉద్యమం ఆవిర్భవించటానికి కృషి జరగడం-దాని నిర్మాణంలో పునాది రాళ్ళను వేసిన ఖ్యాతి ధర్మారావుదే కావడం గమనార్హం. దాని ఆవిర్భావ వికాసాలనూ ఈ సందర్భంలో పరిశీలించటం కూడా అవసరమే.

## అభ్యుదయ రచయితల ఉద్యమం

రెండో ప్రపంచ యుద్ధానికి ముందు ప్రపంచంలో, అందులోనూ సామ్రాజ్యవాద దేశాల్లో ఆర్థికంగా చాలా వత్తిడులూ, కుదుపులూ కలిగాయి. వాటి దుష్పరిణామాలు, ప్రభావాలు సాహిత్య కళారంగాల మీద కూడా ప్రసరించాయి. పలాయనవాదం, ఫాసిజాలు, శుద్ధకళావాదాలు, నైరూప్య సిద్ధాంతాలూ ప్రచారంలో ఉండేవి. ఇవి ప్రజల మానసిక ఆరోగ్యానికి చాలా ప్రమాదకరాలుగా గుర్తించిన రచయితలు, కళాకారులు వీటినుండి విముక్తి కావటానికి ప్రయత్నించాలని భావించారు. అందుకు ఒక ఉద్యమం అవసరమన్న అంశాన్ని కూడా గుర్తించారు.

సరిగ్గా ఇదే కాలంలో అంటే 1935 లో సంస్కృతీ రంగంలో కమ్యూనిస్టుల పోరాటం అన్న వ్యాసం బయటికొచ్చింది. దీని రచయిత జార్జ్ డిమిట్రావ్. బ్రిటిష కార్మికవర్గం ఆర్థిక సంక్షోభ వ్యతిరేక పోరాటాల్లో పాల్గొంటూనే దాన్ని ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమంగా మార్చి ఐక్య సంఘటనగా ముందుకెళ్ళాలని భావించింది. ఇదే భావాలు ప్రపంచంలో వలస రాజ్యాల్లోనూ, సామ్రాజ్యవాద దేశాల్లోనూ ఉండే అభ్యుదయ కాముకుల్లో ఉండేవి. అలాటి సాహితీవేత్తల సమావేశం 1935 లో లండన్‌లోని ఓ చైనా వారి హోటల్‌లో జరిగింది. ఆ సమావేశంలో రాల్ఫ్ ఫాక్సు లాంటి ప్రముఖ రచయితలతోబాటు భారతీయ రచయితలు సజ్జాద్ జహీర్, ముల్క్‌రాజ్ ఆనంద్, ఫెయిజ్ అహమ్మద్ ఫెయిజ్ కూడా హాజరయ్యారు.

సిరంటిడూ ఆ సంవత్సరం ఒక చిన్న ప్రణాళికను తయారుచేశారు. ఇంగ్లీషులో దాన్ని ప్రపంచవ్యాప్తంగా విడుదలచేశారు.

సమాజపరిస్థితులను నిరాకరించే పలాయనవాద సాహిత్యానికీ, సామ్రాజ్యవాదానికీ, ఫాసిజానికీ వ్యతిరేకంగా నిలబడే సాహిత్య సృష్టిచేయడం, భారతదేశంలో సామ్రాజ్యవాద పాలనకు వ్యతిరేకంగా రచయితలను సమీకరించడం, సాహిత్యంలో వాస్తవికతకు పునాదులు వెయ్యడం ఈ ప్రణాళిక లక్ష్యాలు.14

ఈ లక్ష్యాలను చర్చించి ఒక సంఘానికి నిర్మాణ రూపం ఇచ్చేందుకు 1936 లో ఫ్రాన్సులో సమావేశమవుతున్న రచయితల సభలకు వెళ్ళాలనుకున్న ముల్క్‌రాజ్ ఆనంద్, సజ్జాద్ జహీర్‌లకు ప్రభుత్వం అనుమతి నిరాకరించి పి. ఇ. ఎన్. (పొయెట్స్, ఎస్సేయిస్ట్స్ అండ్ నావలిస్ట్స్) సభ్యులకు మాత్రమే అనుమతి ఇచ్చింది. ఈ సంఘంలో సభ్యులు ఒకరకంగా మితవాదులు.

ఈ పరిస్థితుల్లో లక్నోలో 1936 లో మున్షీ ప్రేంచంద్ అధ్యక్షతన అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరీ, నాజీ - ఫాసిస్టు వ్యతిరేక వైఖరీ ఉంటూ దేశ స్వాతంత్ర్య పోరాట భావాలతో జనాన్ని కదిలించాలి అన్న భావాలున్న అనేకమంది రచయితలు ఈ సభల కెళ్ళారు. ఆంధ్ర ప్రాంతం నుండి అబ్బూరి రామకృష్ణారావు, సోమంచి యజ్ఞన్నశాస్త్రి తదితరులు ఆ సభల్లో పాల్గొని వచ్చారు. మున్షీ ప్రేంచంద్ రచయితలు, దేశాన్ని సౌభాగ్యవంతంగా తీర్చిదిద్దటంలోనూ-బానిస సంకెళ్లను తెంచటంలోనూ వీళ్ళ కర్తవ్యాలను తన అధ్యక్షోపన్యాసంలో చక్కగా వివరించాడు.

అప్పటికే తెలుగుదేశంలో కమ్యూనిస్టు భావాలు ప్రచారంలో ఉన్నాయి. అబ్బూరి తదితరులు మొదట ఏర్పడ్డ కమ్యూనిస్టు సంఘాలలో సభ్యులుగా ఉండేవాళ్లు. సాహిత్యపరంగా భావకవిత్వం ఉచ్చదశలో ఉంది. నవ్యసాహిత్య పరిషత్తు ఆరంభమైంది. కొత్తగాలులు వీస్తున్నాయి. 'ప్రతిభ' మొదలైంది. భాషాపరంగా గిడుగువారి ఉద్యమం చాలా తీవ్రదశకెళ్ళింది. అంతవరకూ ఈ భావాలవైపు చూడని ధర్మారావు సరిగ్గా ఇదే కాలంలో సరికొత్తవాణీ, బాణితో సాహిత్యరంగంలో ప్రవేశించాడు. చలనచిత్రాలు ఆవిర్భవించాయి. రాజకీయంగా ఫ్యూడలిజం భావాలున్న పక్షాలు జాతీయ వ్యతిరేక వైఖరితో నగ్నంగా తెలుగు జనం ముందు నిలబడ్డాయి. దినపత్రికా రచనలో మార్పు మొదలైంది. ఇటు రంగంలో కొత్త తాత్విక చింతన, సమసమాజ భావాలు,

తెలుగునాట మొలకెత్తాయి. లక్నో సభలకెళ్ళొచ్చిన వ్యక్తులు తమ అనుభవాన్ని, చైతన్యాన్ని ఇక్కడ సాహితీ రంగంలో పంచటం ఆరంభించారు.

1938-1939 లలో సరోజినీ నాయుడు కాంగ్రెసు సభలకొచ్చిన రచయితలనుద్దేశించి ప్రసంగించింది. దేశవ్యాప్తంగా అభ్యుదయ రచయితల సంఘ నిర్మాణానికి రాష్ట్రాలకు బాధ్యులను ఆ సభ నిర్ణయించింది. అందులో క్రొవ్విడి లింగరాజు, తుమ్మల వెంకటరామయ్యలకు ఆంధ్ర ప్రాంతం కేటాయించటం జరిగింది. వీళ్లు తెలుగుదేశంలో తిరిగి రచయితలను, అభ్యుదయ రచయితల సంఘ నిర్మాణానికి సుముఖులుగా చేయటం ఆరంభించారు. అప్పటికి ధర్మారావు కాగడా పత్రిక నడుపుతూనూ, సినిమా రచన సాగిస్తూనూ మద్రాసులో ఉన్నాడు. రెండవ ప్రపంచ యుద్ధం రావటం, నాజీ భావాలను తిరస్కరించాలన్న భావానికి దృఢత్వం కలగటంతోపాటు; సోషలిజం రావాలన్న ఆశయం కూడా రచయితల్లో వేళ్ళూనింది. దేశ స్వాతంత్ర్యం అన్న అంశం మీద భావకవిత్వం రాసేవారూ, వామపక్షభావాలున్న రచయితలూ అందరూ సమైక్యమయ్యారు. 1942 డిసెంబరులో అభ్యుదయ రచయితల మహాసభలకు ఆహ్వానసంఘం ఏర్పడి ప్రచారం ఆరంభించింది. కవితా సమితి లోని వాళ్ళూ, నవ్యసాహితీ పరిషత్తులోని వాళ్ళూ, అప్పటివరకూ ఏ సంఘం లోనూ సభ్యులుగా లేని వాళ్ళూ, కమ్యూనిస్టు భావాలున్న రచయితలూ కవులూ ఈ సంఘస్థాపనలో కలిసొచ్చారు.

1943 లో తెనాలిలో ఫిబ్రవరి 13, 14 తేదీలలో మొదటి మహాసభలు జరిగాయి. తాపీ ధర్మారావు అధ్యక్షత వహించాడు. 61 మంది సభ్యులుగానూ, 34 మంది ప్రతినిధులుగానూ హాజరయ్యారు. రాయిస్టులుగా ఉండే గోపీచంద్, బైరాగి ప్రభృతులు సభలో గొడవచెయ్యాలని చూశారు. సభలకు వ్యతిరేకంగా కరపత్రాలు పంచారు. కానీ స్థానికులు రావి అమ్మయ్య తదితరులు, వాళ్ళ ఆటల్ని సాగనివ్వలేదు. నిరాటంకంగా సభలు జరిగాయి. ధర్మారావు చక్కని సుదీర్ఘమైన ఉపన్యాసం చేస్తూ అనేక విషయాలను ప్రస్తావించాడు.[15]

"ఇది అమోఘమైన సమయం. ప్రపంచంలో ఎటుచూసినా సంఘర్షణ కనిపిస్తూంది. భిన్న భిన్నశక్తుల పోరాటం పొడగడుతూంది. పరస్పర విరుద్ధంగా ఉండే భావాలు, బలాబలాలు చూసుకుంటున్నాయి. ఎక్కడ చూసినా మార్పు. ఇంత, అంత అనరాని మార్పు" అని అంటూ మార్పులు క్షణాల మీద జరుగుతున్నాయనీ అన్ని రంగాలవాళ్ళూ జాగ్రత్తపడుతున్నారనీ కనుకనే మనం కూడా ఈ సమావేశం ద్వారా జాగ్రత్తకు నాందిపలుకుతున్నామన్నాడు.

గత సాహిత్య రచనను గూర్చి ప్రస్తావిస్తూ -

"ఆ కథావస్తువులు, ప్రణయ విహారాలు, ఆ అలంకారాలు,

ఆ పదజాలాలు, ఆశయ్యాలు.... ...అన్నీ భోగులవే.... ఆ లక్షణాలున్న

వాళ్ళనే పెంచి పెద్దచేసి గ్రంథాలల్లారు."

దేవుడు, ప్రణయవిహారం, కర్మ - ఇవి సంఘానికి వేరుపురుగులన్నాడు. సత్యం ఎగరటానికీ, వ్యత్యాసాలు పెరగటానికీ, ప్రపంచం దుఃఖభాజనం కావటానికీ - ఇవే కారణాలన్నాడు.

ఈ తరం రచయితలు, రచనలను గురించి వారి ఆకాంక్షను ఇలా వ్యక్తపరిచాడు.

"జన సామాన్యుల పురోభివృద్ధికోసం కంకణం కట్టి ఉన్నాడు . ... ప్రజల జీవన సమస్యలతో నిండిన గ్రంథాలు వేనవేలు త్వరలో వెల్వడుతాయి. దేశంలోని అకారణ వ్యత్యాసాలు అంతరించి సుఖప్రదమయిన . .... అని సంపూర్ణంగా నమ్ముతున్నాను."16

నాటి సభల్లో చర్చకొచ్చిన ప్రధానాంశాలు బ్రిటిషు వాళ్ళనెదిర్చి స్వాతంత్ర్యం సంపాదించాలి. ఇతర ప్రపంచ సాహిత్యాలలోని మంచిని తీసుకుంటూ మూఢాచారాలకు వ్యతిరేకంగా పోరాడాలి. కార్మిక కర్షక ఐక్యత ఉండాలి. ఈ సభలకు శ్రీశ్రీ హాజరు కాలేదు.

1943 వేసవిలో బొంబాయిలో అఖిలభారత అభ్యుదయ రచయితల సభలూ, ప్రజా నాట్యమండలి సభలూ జరిగాయి. అక్కడున్న కౌయాజీ జహంగీరు హాలులో జరిగిన ఈ సభలకు ఆంధ్ర దేశంనుండి పెద్ద ప్రతినిధి వర్గమే వెళ్ళింది. సెట్టి ఈశ్వరరావు, కె. ఎస్. ప్రకాశరావు, చదలవాడ పిచ్చయ్య, అక్కడే ఉన్న కొడవటిగంటి, తుమ్మల వెంకటరామయ్య తదితరులెందరో ఆ ప్రతినిధివర్గంలో ఉన్నారు. ధర్మారావు అధ్యక్ష వర్గానికి ఎన్నికయ్యాడు. అఖిలభారతంగా ఉండే ప్రముఖ రచయితలందరూ వచ్చారు

అప్పటినుండీ క్రమంగా అభ్యుదయ రచయితల ఉద్యమం ఆంధ్రలో బాగా వేళ్ళూనింది. 1944లో రెండవ మహాసభల్లో చిలకమర్తివా. స్వీయ చరిత్రను ప్రకటించి వారికి బహూకరించింది. తెలికచర్ల వెంకటరత్నం, అడవి బాపిరాజు వంటి వాళ్ళంతా - మొత్తం నవ్యసాహిత్య పరిషత్తు అంతా - ఇందులో కలవటంతో రాష్ట్రవ్యాప్తంగా ప్రతిపత్తి పెరిగింది. 'తెలుగు తల్లి' పత్రికను తీసికొని నడిపారు. 1946లో పెదపూడిలో సాహిత్య పాఠశాల నిర్వహించారు. దాన్ని 'ప్రజా విశ్వవిద్యాలయం'గా నాడు రచయితలు ప్రశంసించారు. సాహితీరంగంలో ప్రసిద్ధులందరూ పాల్గొన్నారు.

1946లో దేవులపల్లి కృష్ణశాస్త్రి అధ్యక్షతన శ్రీశ్రీ ప్రారంభకులుగా రాజమండ్రిలో మూడవ మహాసభలు జరిగాయి. జలసూత్రంవంటి వ్యక్తులు ఖాకీ నిక్కరు తొడుక్కుని వలంటీర్లుగా ఆసభల్లో పనిచేశారు. 1946నుండే సంఘం 'అభ్యుదయ' పత్రికను నిర్వహించటం ఆరంభించింది. 1947 లో నాలుగవ మహాసభలు మద్రాసులో జరిగాయి. రాజమన్నారులాంటి వ్యక్తులు ఉద్యమంలోకి వచ్చారు. ఈనాడు ప్రముఖులైన సాహిత్యకారులందరూ నాడీ అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధాలున్నవారే. వల్లైకోనలో 1947 లోనే సాహిత్య పాఠశాల జరిగింది.

1955లో సంఘం ఐదవ మహాసభలు విజయవాడలో జులై 30, 31 తేదీల్లో జరిగాయి. ఉప్పల లక్ష్మణరావు ఆహ్వాన సంఘాధ్యక్షులు. సభలకు శ్రీశ్రీ అధ్యక్షత వహించారు. తెలుగు దేశంలో రచయితలూ, కవులూ, కళా కారులందరూ వచ్చారు.

అనేక తీర్మానాల్లో వ్యావహారిక భాషావ్యాప్తికి ఒక సంఘాన్ని వేసి విశ్వవిద్యాలయాల్లో దానికోసం పోరాడాలన్నది ఒక తీర్మానం. ఆ ఉప సంఘంలో తాపీ ధర్మారావు, గిడుగు సీతాపతి, తెలికచర్ల వెంకటరత్నం, కొడవటిగంటి సభ్యులు. కన్వీనర్ శ్రీశ్రీ.

ధర్మారావు అభ్యుదయ రచయితల సంఘం ఆరంభం నుండీ దాని అభ్యుదయాన్ని కాంక్షిస్తూ తన శాయశక్తులా దాని ఆశయాదర్శాల ప్రచారంలో కృషిచేశాడు. అనేక సభలూ సమావేశాల్లో పాల్గొన్నాడు.

ఈవిధంగా ధర్మారావు 1949 వరకూ - అంటే 'జనవాణి' వారపత్రి కను ఆరంభించేవరకూ చల్లపల్లి, విజయవాడ, మద్రాసుల మధ్య తిరుగుతూండే వాడు.

1946 ఫిబ్రవరి 19న ధర్మారావు పెద్దకొడుకు మోహనరావుకు, రాజమ్మకూ వర్ణాంతర వివాహం విజయవాడలో ధర్మారావే కమ్యూనిస్టు పార్టీ నేతృత్వంలో జరిపించాడు. మరో రెండు మూడు నెలలకు చాణక్య వివాహం కూడా తన మనుమరాలు సరోజనితో సంస్కరణ పద్ధతిలో ధర్మారావే జరిపారు. అదీ విజయవాడలోనే. ఈ కాలంలో వీరు యుద్ధప్రచారక శాఖలో పనిచేస్తూండేవారు.

యుద్ధం హిట్లర్ అంతంతో, జర్మనీ పతనంతో 1945 మే 9న పూర్త యింది. సోవియట్ యూనియన్ లక్షలాది దేశభక్తుల జీవితాలను పణం పెట్టి

హిట్లరుకు గోరీ కట్టింది. అయినా అమెరికా బ్రిటన్‌లు సోవియట్ యూనియన్ మీద కత్తి కట్టే ఉన్నాయి. 1941 జూన్ 21న రష్యా మీద హిట్లర్ దాడి చేసి తన చావు తాను కోరితెచ్చుకున్నాడు. రష్యా పలుకుబడి, కమ్యూనిజం ఖ్యాతీ, సోషలిజం ప్రాధాన్యం ప్రపంచ ప్రజలు గుర్తించారు. దాంతో అమెరికా - బ్రిటన్‌లకు గంగవెర్రులెత్తాయి.

కమ్యూనిజాన్ని ఆపాలని 1946లో అమెరికా వెళ్ళి - చర్చిల్ పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు. అప్పటికి అతడు ప్రధాని కానేకాడు. ఈ ఊపుతో 1946 - 1948ల మధ్య అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు తమ వలసల్లో పెల్లుబుకుతున్న స్వాతంత్ర్య పోరాటాలను అణచాలని భావించాయి. ఐరోపాలో కమ్యూనిజం వ్యాప్తిని అడ్డుకోవాలని వాళ్ళు కోరుకున్నారు. వారంతా కలిసి మూడవ ప్రపంచ యుద్ధం కావాలన్న ఆకాంక్షను వెలిబుచ్చారు. అయితే వారి ఆశలు అడియాసలయ్యాయి. సామ్రాజ్యవాదం శిబిరంలో బలమైన శక్తిగా ఉన్న ఫాసిజం నడుం విరిగింది. దీంతో ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాదం బలహీనపడింది. దీనికితోడు అప్పటివరకూ సామ్రాజ్యవాద వలయంలో ఉంటూన్న మరికొన్ని దేశాలు సోషలిజం శిబిరంలో చేరడంతో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఏర్పడింది. సామ్రాజ్యవాద సంక్షోభం తీవ్రతరమైంది. అనేక వలస, అర్ధవలస దేశాల్లో జాతీయ విముక్తి ఉద్యమాలు విజృంభించాయి. సామ్రాజ్యవాదం ఈ పరిణామాలను అడ్డుకోగల శక్తి కోల్పోయింది.

ఈ పరిస్థితుల్లో భారత దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వక బ్రిటీషు వారికి తప్పలేదు. యుద్ధం పూర్తిగా అంతమైంది. ప్రపంచ వ్యాప్తంగా యుద్ధం అంటే ఎంత వినాశనకరమైందో తెలిసింది. బెర్లిన్ పతనంతో యుద్ధం ఆగినా అమెరికావాళ్ళు 1945 ఆగస్టు 6న హిరోషిమా మీదా, 9న నాగసాకి మీదా అణుబాంబులు విసిరారు. దాంతో తరతరాల మానవత మీదా, మానవ నాగరికత మీదా బాంబుదాడి జరిపినట్లయింది. ఇవన్నీ గమనిస్తున్న ప్రపంచంలోని మేధావులు యుద్ధంమీద యుద్ధం ప్రకటించారు. 1948లో పోలండులోని ఓస్లావ్ నగరంలో ఆగస్టు మాసంలో 45 దేశాల మేధావులు సమావేశమై తమ తీవ్ర నిరసన ప్రకటించారు. భారతదేశంనుండి ముల్క్‌రాజ్ ఆనంద్ ఆ సభలకు హాజరయ్యాడు. శాంతి కావాలంటూ ఆ సభల ముగింపులో ఓ ప్రకటన విడుదల చేశాడు.

# శాంతి ఉద్యమం

1949 ఏప్రిల్‌లో పారిస్‌లో ప్రథమ శాంతి మహాసభ జరిగింది. అందరికి వీసాలు ఇవ్వనందున కొందరు జెకొస్లొవేకియాలోని ప్రాగ్ నగరంలో సరిగ్గా అదే సమయంలో సమావేశమయ్యారు. యుద్ధాన్ని ప్రతిఘటించాలని పునరుద్ఘాటించారు. 1950 మార్చిలో పైన జరిగిన శాంతి సమావేశాల స్థాయీ సంఘం స్టాక్‌హోంలో సమావేశమైంది. ఆటంబాంబులను నిషేధించాలన్న తీర్మానంతో ఓ ప్రకటన విడుదలచేసింది. ఆ తర్వాత ఈ సంఘం నవంబర్ 1950లో తన మహాసభ వార్సాలో జరుపుకొని ఒక నిర్మాణ రూపాన్ని సంతరించుకొంది. ప్రపంచ శాంతి సమితిగా ఏర్పడింది. మొదటి అధ్యక్షుడు క్యూరీ. ప్రపంచమంతటా యుద్ధ ప్రమాదాన్ని వివరిస్తూనూ, అణుబాంబు నిషేధాన్ని కోరుతూనూ శాంతి ఉద్యమం బలపడటం ఆరంభించింది.

ధర్మారావు 1949లో 'జనవాణి' వారపత్రికను మద్రాసునుండి ఆరంభించాడు. విజయవాడ నుండి మద్రాసు తరలివచ్చాడు. మోహనరావు, సెట్టి ఈశ్వరరావు తదితరుల సహకారంతో ఆ పత్రిక వెలువడటం ఆరంభించింది. ఈ శాంతి ఉద్యమాన్ని చాలా ప్రముఖంగా 'జనవాణి' వారపత్రిక ప్రతిబింబించింది. తెలుగుదేశంలో మేధావులూ - రచయితలూ అందరూ ఆ స్టాక్‌హోం ప్రకటనమీద సంతకాలు చేయటం, చేయించటం ఆరంభించారు. ఆవార్తలన్నీ ధర్మారావు పత్రిక ప్రచురించేది. కమ్యూనిస్టు పార్టీ 1942లో ప్రారంభించిన 'ప్రజాశక్తి' వారపత్రిక 1945లో దినపత్రికగా మారి 1948 వరకూ నడిచి ఆగిపోవాల్సి వచ్చింది. ప్రభుత్వదమనకాండ అన్ని ప్రజాసంఘాల మీదా అధికం కావటంతో అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్య మండలి, అన్నీ పని చేయలేక పోయాయి. ధర్మారావు అభిమానిస్తున్న అన్ని సంఘాలూ ఆరోజుల్లో ఈ శాంతి ఉద్యమంలో పనిచేయటం ఆరంభించాయి. అందువల్ల వారిపత్రికతో సహా ధర్మారావు కూడా శాంతి ఉద్యమాన్ని ప్రతిబింబించటం ఆరంభించాడు.

ధర్మారావు శాంతి సంఘంలో ప్రముఖులుగా ఉండేవారు. ఈ ఉద్యమాలయాలు ప్రకటించే నాటికలు, నాటకాలు, నృత్యనాటికలు, కవితలను

'జనవాణి' ప్రచురించింది. ఈ ఉద్యమ వార్తలులేని 'జనవాణి' సంచిక లేదంటే ఆశ్చర్యం కాదు. ఇంత సేవచేసిన ధర్మారావును ఆంధ్ర శాంతి సంఘం 1952లో పెకింగ్ శాంతి సభలకు ఎన్నికచేసింది. శ్రీశ్రీ కూడా ఆ ప్రతినిధివర్గంలో ఉన్నాడు. కానీ మన ప్రభుత్వం వీరిద్దరికీ పాస్‌పోర్టు లివ్వ లేదు. ఆ సందర్భంలో ధర్మారావు "తాపీవారి క్షమాపణ'' అంటూ ఓ ప్రకటన చేశాడు. " ... .. పెకింగ్‌లో ఈ నెల సెప్టెంబరు 7న జరుగబోయే ఆసియా పసిఫిక్ శాంతి సాంస్కృతిక మహాసభలకు నన్నొక ప్రతినిధిగా పంపుటకు నిశ్చయించినందుకు మీకందరకూ కృతజ్ఞతాపూర్వక వందనాలు ... .. కల్లోలితంగా ఉన్న మనప్రాంతాలలో శాంతి స్థాపనకు నాచేతనయినంత సేవ చెయ్యాలని ఉవ్విళ్ళూరాను. కాని అంతటి గొప్ప మహాసభకు వెళ్ళదగిన యోగ్యత నాకులేదనో, నాలాంటివాడు పెకింగ్ శాంతి మహాసభకు వెళ్ళినట్లయితే మన దేశానికనర్థకమనో . ...... ప్రభుత్వమువారు నాకు పాస్‌పోర్టు నిరాకరించారు ... ..." అంటూ చాలా వ్యంగ్యంగా ప్రభుత్వచర్యను గర్హించాడు.[17]

ఏలూరులో ఆగస్టు 29, 30 లలో జరిగిన రాష్ట్ర శాంతి మహాసభల్లో ధర్మారావును పెకింగ్‌కు పంపాలని నిర్ణయించారు.

ఈ శాంతి ఉద్యమ చిహ్నం పావురాయిని ప్రఖ్యాత చిత్రకారుడు పికాసో చిత్రించాడు. బైబిలు కథ ఆధారంగా దీన్ని శాంతి సంకేతంగా ఉపయోగించటం ఆనవాయితీ అయింది. పాల్ రాబ్సన్, జ్యూలియస్ ఫ్యూచిక్ భార్య గుస్తీనా ఫ్యూచిక్, ఇల్యా ఎహ్రెన్‌బర్గ్, నెరూడా, డి. యస్. ప్రిట్, హోవర్డ్ ఫాస్ట్, డా॥ కిచ్లూ, కిషన్ చందర్, కె. ఎ. అబ్బాస్ ముల్క్‌రాజ్ ఆనంద్, శ్రీశ్రీ, తాపీ, మరెందరో ఈ ఉద్యమంతో ముడిపడి ఉండేవారు. ఈ ఉద్యమాలంటేనే ఆనాడు పత్రికలు భయపడే దశలో ధర్మారావు జనవాణి ఆ వార్తలను, ఉద్యమాల వ్యాసాలనూ ప్రచురించేది.[18] తెలుగు ప్రముఖులూ, అప్పటికి ఇతర దేశాల్లో ఉంటున్న వారూ కొండేపూడి శ్రీనివాసరావు, కాట్రగడ్డ గంగయ్య, కొండపనేని రంగారావుగార్లు సేకరించి పంపే ప్రపంచవ్యాప్త శాంతి ఉద్యమ వార్తలను ఈ పత్రిక ప్రచురించేది.

దీనికితోడు ధర్మారావు ఆంధ్ర రాష్ట్ర విశాలాంధ్ర ఉద్యమాలను బల పర్చటం - కాగడా, జనవాణి పత్రికల - ఆదర్శంగా లక్ష్యంగా నిర్ణయిం చాడు. భాషాప్రయుక్త రాష్ట్రాల స్థాపనకు తీవ్రంగా కృషిచేశాడు.

# ఆంధ్ర రాష్ట్రోద్యమం

ప్రభుత్వాలు ప్రజలు మాట్లాడే భాషలో నడుస్తూంటే ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్య దృఢమైన సత్సంబంధాలేర్పడతాయి. తమ దేశాన్ని తామే పరిపాలించుకోవాలన్న భావనలోనుండే తమ ప్రాంతాన్ని తామే పరిపాలించుకోవాలన్నది వచ్చింది. మరి ప్రాంతాల విభజన ఎలా జరగాలి అన్నప్పుడు ప్రజలు మాట్లాడే భాషా పరంగా అన్నది ఆచరణ యోగ్యం. ఆంగ్లేయుల పాలనా కాలంలో భారతదేశాన్ని తమ పాలనా సౌకర్యాన్ననుసరించీ, విభజించి పాలించాలన్న కుటిలనీతికి అనుగుణంగానూ, ఒకే భాష మాట్లాడే ఒకే జాతిప్రజలను ముక్కచెక్కలుగా చీల్చి వివిధ ప్రాంతాలుగా విభజించారు.

ప్రజల్లో స్వాతంత్ర్య కాంక్ష పెరుగుతున్నకొద్దీ భాషాప్రయుక్త రాష్ట్రాల ఆవిర్భావాన్ని కూడా ఆశించటం ఆరంభమైంది. 1907లో సూరత్‌లో జరిగిన కాంగ్రెసులో స్వరాజ్య సాధనే రాజకీయ పరమావధిగా ఉండాలని దాదాభాయి నౌరోజీ అన్నాడు. సూరత్ సభలకు కాంగ్రెసు చరిత్రలో ప్రధానస్థానం ఉంది. మితవాద వర్గాలు పిరోజ్‌షా మెహతా, సురేంద్రనాధ్ బెనర్జీ, గోఖలేల నాయకత్వాన ఉంటూండేవి. మహారాష్ట్రలో తిలక్, పంజాబ్‌లో లాలాలజపతిరాయ్, బెంగాల్‌లో బిపిన్‌చంద్రపాల్‌తో పాటు వీరులనేకులు అతివాదులుగా స్వరాజ్య నినాదంతో చెదురు మదురుగా ఉంటూండేవారు. తిలక్ నాయకత్వాన సూరత్‌లో కాంగ్రెస్‌లో అతివాదులు సమీకృతులయ్యారు. మితవాదులు సూరత్ కాంగ్రెసు అధ్యక్షుడుగా రాస్‌విహారీ ఘోష్ పేరును ప్రతిపాదిస్తే, వెంటనే తిలక్‌లేచి లజపతిరాయ్ పేరును ప్రత్యామ్నాయంగా సూచించాడు. అప్పటివరకూ కాంగ్రెసే మెహతా - మెహతాయే కాంగ్రెస్ అన్న భావన ఉండేది. అది బద్దలైంది. ఈ సభలకు మద్రాసు ప్రాంతం నుండి ప్రకాశం, వి. కృష్ణస్వామయ్యర్, నటేశన్, దొరస్వామయ్యర్, చక్రయ్యచెట్టి తదితరులు అనేకులు వెళ్ళారు. ఎప్పుడైతే ప్రత్యామ్నాయ సూచన తిలక్ చేశాడో సభలో గంద్రగోళం - అలజడి చెలరేగింది. సభ్యులు బాహాబాహీ, కచాకచీ తలపడ్డారు. కుర్చీలు విసురుకున్నారు. తలలు పగిలాయి. మితవాదులు కంగుతిన్నారు. అతివాదులు పుంజుకున్నారు. అయినా ఈ పరిస్థితి ఇలాగే కొన

సాగుతూ మితవాదుల కొద్దిపాటి ప్రభావం కిందే తరువాత లక్నో కాంగ్రెసు దాకా కొనసాగింది.

బీహారు, బెంగాలు విభజన; అటు దేశ స్వాతంత్ర్య ఉద్యమాన్నీ ఇటు లోలోపల రగుల్కొంటున్న తెలుగువారిలోని స్వరాష్ట్ర భావాలనూ జ్వాలామానం చేసిందని చెప్పవచ్చు. అప్పటివరకూ కాంగ్రెసులోని వర్గాలు స్వల్ప సంస్కరణలకోసం అంటే నిర్బంధోచిత ప్రారంభ విద్య, న్యాయశాఖా కార్య నిర్వాహక శాఖల విభజన, దేశీయులకు ఉన్నతోద్యోగాలివ్వమని ప్రాధేయ పడటం; శాసనసభల్లో సభ్యుల సంఖ్య పెంచమని అర్థించటం; ఐ.సి.ఎస్. పరీక్షలను ఇండియాలో కూడా జరిపించమని మహజర్లు పెట్టటంలాంటి పనులతోనే సరిపుచ్చుకునేది.[19] క్రమంగా తిలక్, దాదాభాయి నౌరోజీల చొరవతో కొంత అతివాదంవైపు మొగ్గింది. ఐతే అది 1917 దాకా స్థిరరూపం దాల్చ లేదు. కాంగ్రెసులో ఉంటున్న తెలుగు వ్యక్తుల్లో స్వరాష్ట్ర కాంక్ష ఈ నడిమి కాలంలోనే నారుబోసుకొంటోంది. అదే 1917 లో ఆంధ్ర ప్రాంతాలకు ప్రత్యేకంగా రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పాటుకు దారి తీసింది. ఈ నడుమ జరిగిన సంఘటనలను తెలుసుకోవటం చాలా అవసరం.

బెంగాల్ విభజన ఆ రాష్ట్రవాసుల్లో ఉద్విగ్నతను రేపింది. ఆంగ్లేయులు బుద్ధిపూర్వకంగా దేశీయులను చీల్చి సమైక్యతను నాశనం చేయడం చూసిన బిపిన్ చంద్రపాల్ దేశపర్యటనకు బయల్దేరాడు. జాతి జనుల్లో సంఘటిత శక్తి, పోరాటపటిమా పెంచటం; విదేశీయుల దురన్యాయాలను ప్రజల దృష్టికి తేవడం ఆయన పర్యటనలో ఉద్దేశం. ఈ పూర్వరంగంలో ఆంధ్రప్రజల్లో భాషా రాష్ట్రాల యెడ సుహృద్భావం అంకురించింది. అప్పటికే తెలుగునాట ఉన్న కొన్ని పత్రికలు ఆంధ్రకేసరి, కృష్ణా పత్రికలవంటివి స్వరాష్ట్ర వాంఛను వ్యాసాల రూపంలో వెల్లడించ నారంభించాయి. న్యాపతి నారాయణరావు భాషాప్రాతిపదికపై ఆంధ్రరాష్ట్రం ఏర్పరచాలని మేల్ పత్రికలో ఒక లేఖ రాశాడు. కొండా వెంకటప్పయ్యగారి ఆధ్వర్యంలో కొమర్రాజు లక్ష్మణరావు, మాడపాటి హనుమంతరావుగార్లు కలిసి హైదరాబాదులో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపించారు. భాషాపరమైన రాష్ట్రాల గురించీ, జాతియోద్యమాన్ని గూర్చీ సభలూ, సమావేశాలూ, చర్చలూ సాగిస్తూండేవారు, వారి కార్యక్రమంలో భాగంగా 1910 లో 'ఆంధ్రుల చరిత్ర' ప్రకటించారు. తర్వాత గుంటూరు ఆంధ్ర యువజన సాహిత్య సంఘం వారు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకతను నొక్కి చెప్తూ ఒక తీర్మానం చేశారు.

1911 - ఆ మధ్యకాలంలో గుంటూరు, నెల్లూరు మెట్టభూములు వర్షాలు లేక పండలేదు. క్షామబాధ అధికమైంది. గుంటూరుజిల్లాలో తేలుకుట్ల దగ్గర కృష్ణకు ఆనకట్టకట్టి, అక్కడనుండి కాలువలు తవ్వి పినాకినితో కలిపితే ఈ రెండు జిల్లాల మధ్య భాగము ఎప్పటికీ క్షామానికి గురి కాదని ప్రజలు భావించారు. దీన్ని 'కృష్ణా రిజర్వాయర్ ప్రాజెక్ట్' అని పేరుపెట్టి ప్రభుత్వంతో చర్చలు జరిపారు. అనేక చర్యలు - విమర్శల తర్వాత 7 కోట్లు ప్రభుత్వం దీనికి కేటాయించింది. ప్లానులు - అంచనాలు సిద్ధమై పనులు ఆరంభానికి రంగమంతా ఏర్పడింది. ఆ సమయంలో మెట్టూరు దగ్గర ఒక ఆనకట్ట నాలుగుకోట్లతో కట్టటం ఆవశ్యకమని చెప్తూ దాన్ని కొనసాగించాలని మద్రాసు శాసన సభ తీర్మానించింది. తెలుగు శాసనసభ్యులుకూడా తలవంచారు. దీంతో ప్రజల్లో క్రోధావేశాలు పెల్లుబికాయి.

ఆ సమయంలోనే నిడదవోలులో కొన్ని ఆంధ్ర మహాసభలు జరిగాయి. అప్పటికి గుంటూరు, కృష్ణా గోదావరి మండలాలన్నిటికీ కలిపి ఒకే కాంగ్రెసు సంఘం ఉండేది. ఆ కాంగ్రెసు సభ, సంఘ సంస్కరణ సభ, ఆంధ్ర ఆస్తిక సభలు జరపటానికి నిడదవోలు తయారైంది.

ఆ కాంగ్రెసు సభలకెళ్ళినవాళ్ళు గుంటూరు జిల్లాకొక ప్రత్యేక సంఘం ఉండాలని పట్టుబట్టారు. సభ అంగీకరించింది. అప్పుడే ఆంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకతను గూర్చి ఒక తీర్మానం వచ్చింది. అధ్యక్షులుగా ఉన్న వేమవరపు రామదాసు పంతులు ఇది విషయ నిర్ణయ సభ ద్వారా రాలేదు గనుక చర్చించ రాదని తోసేశారు.

అక్కడి సభలకొచ్చిన గుంటూరు సభ్యులు కొందరు - ప్రధానంగా చట్టి నరసింహారావు "ఈ సందర్భంగా ఆంధ్రులంచరూ ఒకచోట చేరడం - పరిచయాలేర్పడటం జరిగింది కదా. ప్రతి సంవత్సరం ఆంధ్ర జిల్లాల వారం దరం కలిస్తే బావుంటుందన్న" సూచన చేశారు. అందరూ అంగీకరించారు. తర్వాత కొండా వెంకటప్పయ్య, జొన్నపిత్తుల గుర్నాథం సహాయంతో 'ఆంధ్రోద్యమము' అనే ఒక చిన్న పుస్తకాన్ని ఇంగ్లీషు తెలుగుల్లో రాశారు. తెలుగు దేశంలో ప్రజలను స్వరాష్ట్ర వాంఛకు అనుకూలంగా తయారు చేయటానికి కొండా వెంకటప్పయ్య పర్యటన చేశాడు.

పర్యావసానంగా బాపట్లలో 1913 ఎండాకాలంలో ప్రధమాంధ్ర మహాసభగా అవతరించింది. 800 మంది ప్రతినిధులొచ్చారు. ఈ సభలకు బయ్యా నరసింహేశ్వర శర్మ అధ్యక్షత వహించారు. తర్వాత ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గూర్చి వేమవరపు రామదాసు తీర్మానాన్ని ప్రవేశపెట్టారు సభలో

చాలా కలకలం పుట్టింది. న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, గుత్తి కేశవ పిళ్ళె వంటివారు ప్రతికూలంగా ప్రసంగించారు.

పై ముగ్గురూ వ్యతిరేకిస్తే ఈ ఉద్యమం ముందుకెళ్ళదని సభ అభిప్రాయ పడింది. ప్రజల్లో కూడా దీన్ని గురించి మరింత విస్తృతంగా ప్రచారం జరగాలని ఆ తర్వాత ఇలాటి తీర్మానం చేస్తే ఉద్యమం బాగా వేళ్ళూనుతుందనీ అందరూ అనడంతో దాన్నే తీర్మాన రూపంలో అంగీకరించటం జరిగింది.

దీని ప్రచారకులు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, వల్లూరి సూర్యనారాయణరావు, కొండా వెంకటప్పయ్యలు. వీరు 1913 డిసెంబరులో తెలుగు దేశమంతా పర్యటించారు.

1914 ఎండాకాలంలో బెజవాడలో రెండో ఆంధ్ర మహాసభ జరిగింది. పెద్దిభొట్ల వీరయ్య, అయ్యదేవర కాళేశ్వర్రావ్, అయ్యంకి వెంకటరమణయ్య తదితరులు దీనికి నడుంకట్టారు. హఠాత్తుగా వచ్చిన గాలివానతో బ్రహ్మాండమైన సభాస్థలి రెండు సార్లు నేలకూలింది. అయినా చివరకు సభలు ఉత్సాహపూరిత వాతావరణంలో న్యాపతి సుబ్బారావు అధ్యక్షతన జరిగాయి. వేలకొలది ప్రతినిధులొచ్చారు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని గూర్చి, కొన్ని కాలేజీలను స్థాపించాలనీ, ఉద్యోగాలలో ఆంధ్రులకు ఎక్కువ అవకాశాలివ్వాలనీ తెలిపే అనేక తీర్మానాలను సభ ఆమోదించింది. జోరున కురుస్తున్న వానను సైతం లెక్కచేయకుండా ప్రతినిధులు గొడుగులేసుకుని ఈ తీర్మానాల అంగీకారం వరకూ ఉండి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం యెడల తమ దీక్షను ప్రకటించటం ఈ సభల ప్రత్యేకత. రాష్ట్ర ఉద్యమ పథంలో ఇదో మైలురాయి. (ఈ సభల సరైన తేదీలు దేశభక్తుని స్వీయచరిత్రలోనూ, ఆంధ్రజ్యోతి అమరజీవి అన్న పుస్తకాలలో పరస్పర విరుద్ధంగా ఉన్నాయి.)

ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకత ఒక ఉద్యమంగా జనంలో పాకుతోంది. రాజమండ్రిలో జరిగిన ఒక సభలో టంగుటూరి శ్రీరాములు, మరికొంత మంది ఈ ఉద్యమం తమిళులతో కలిసి ఉండటంవల్ల కలిగే మంచిని గమనించక లేవదీసిందంటూ ప్రసంగించారు. దాంతో సభలో ఉన్న చిలకమర్తి లక్ష్మీనరసింహం చాలా ఉద్వేగంతో వారి వాదాన్ని ఖండిస్తూ ఆంధ్ర జనాభ్యుదయానికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అత్యవసరమని మేఘగర్జన చేశాడు. దాంతో ఆ సభాసదు లందరూ అంగీకరించక తప్పింది కాదు. తర్వాత మూడవ ఆంధ్ర మహాసభ జరగాల్సిన కాలం ఆసన్నమైంది.

1914 వేసవిలో విశాఖపట్నంలో మూడవ ఆంధ్రమహాసభ అప్పటికి కేంద్ర శాసనసభలో సభ్యులైన పానుగంటి రామారాయణింగారి అధ్యక్షతన

జరిగింది. ఈ సభ ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మాణం చెయ్యాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించింది. ఈ ఆంధ్ర మహాసభ మోచర్ల రామచంద్రరావు, వరాహగిరి జోగయ్య, పట్టాభిసీతారామయ్య సభ్యులుగా ; కొండా వెంకటప్పయ్య కార్యదర్శిగా ఒక స్థాయీ సంఘాన్ని ఏర్పాటుచేసింది.

1915లో కాకినాడలో నాలుగో ఆంధ్రమహాసభలు జరిగాయి. మోచర్ల రామచంద్రరావు అధ్యక్షత వహించారు. విశాఖపట్నం సభలవరకూ వీరు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉద్యమ విషయంలో అనుమానాలు వ్యక్త పరుస్తున్నా, కాకినాడ సభలనాటికి పూర్తిగా ఉద్యమాన్ని బలపర్చేవారుగా మారారు. సభలు అత్యంత ఉత్సాహపూరిత వాతావరణంలో జరిగాయి

1916 లో నెల్లూరు పట్టణంలో 5 వ ఆంధ్రరాష్ట్ర మహాసభలు జరిగాయి. ఈ సభలకు కొండా వెంకటప్పయ్య అధ్యక్షత వహించాడు. వంగోలు వెంకటరంగయ్యగారు పూనికతో సభలను నిర్వహించారు. సభలో ఆంధ్ర రాష్ట్రానికి ప్రతికూలురుగూడా ఉన్నారు. అత్యధిక మెజారిటీతో మాత్రమే ఆంధ్ర రాష్ట్రనిర్మాణ తీర్మానం నెగ్గింది. కోడి రామ్మూర్తి, బయ్యా నరసింహేశ్వర శర్మ తదితరులు చాలా కృషిచేసి తీర్మానాన్ని నెగ్గించారు.

1917 లో ఆరో ఆంధ్ర రాష్ట్ర మహాసభ కడపలో జరిగింది. దీనికి పూర్వం దేశంలో అనేక ఉద్యమాలు వచ్చాయి. ఘటనలు జరిగాయి గోఖలే చనిపోయాడు. తిలక్ ఆధిపత్యంలో అతివాద జాతీయవాదులు సమీకృతమవుతున్నారు. జలియన్‌వాలాబాగ్ దురంతాలకు దేశం అట్టుడికినట్టుడికింది. వామపక్ష భావాలు జాతీయోద్యమంలో ప్రవేశించాయి. ఆంగ్ల ప్రభుత్వం అప్పటికే ప్రపంచయుద్ధంలో మునిగి ఉంది. జాతీయోద్యమాల వెల్లువ భారతదేశాన్ని ముంచెత్తుతోంది.

ఈ దశలో మాంటేగు - చెమ్స్ఫర్డులు భారతదేశంలో పర్యటించి కొన్ని సంస్కరణలకు భారతీయులనుండి సూచనలర్థించారు. బాధ్యతాయుత ప్రభుత్వం ఇవ్వటానికే ఇదంతా అన్నాడు. దక్షిణాన ఉవ్వెత్తున అని బిసెంటు నేతృత్వంలో హోంరూలు ఉద్యమం సాగుతోంది. ఇలాంటి స్థితిలో మాంటేగుకు ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను వివరిస్తూనూ, మొత్తం దేశాన్ని భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా విభజించటం అవసరమనీనూ అంటూ ఆంధ్రరాష్ట్ర స్థాయీ సంఘం పక్షాన న్యాపతి సుబ్బారావు, కొండా వెంకటప్పయ్యలు ఒక నివేదికను సమర్పించారు. రాష్ట్రోద్యమం నానాటికి విస్తృతమవుతోంది.

కడప సభలకు నెమిలి పట్టాభిరామారావు అధ్యక్షత వహించారు చాలా జయప్రదంగానే సభలు ముగిశాయి.

1935 లో ఆంగ్లేయులు సింధ్, ఒరిస్సాలను ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పాటు చేసేటంతవరకూ ఇక్కడి ఆంధ్రరాష్ట్ర ఉద్యమంలో స్తబ్దత వచ్చింది. జాతీయోద్యమం సాగుతున్నా ఇది అంతగా ప్రస్ఫుటం కాకపోవడం గమనించాల్సిన విషయం.

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా అనే బిల్లు 2-8-1935 న ఇంగ్లీషు పార్లమెంటులో చట్టంగా రూపొందింది. దాన్ననుసరించి రాష్ట్రాలకు చెందిన విషయాలలో ఆ రాష్ట్ర సభలకు స్వాతంత్ర్యం ఇవ్వడం జరిగింది. దాన్నే రాష్ట్రీయ స్వపరిపాలన అన్నారు. దాన్ననుసరించి 1937 ఫిబ్రవరిలో జనరల్ ఎన్నికలు జరిగాయి. జస్టిసు పార్టీ ఓడిపోయింది. అప్పటివరకూ 1927-1930 ; 1934-1937 వరకూ కాంగ్రెసు ప్రతిపక్షంగా ఉండేది ఈ 1937 ఎన్నికల్లో జస్టిసుపార్టీకి చల్లపల్లి జమీందారు సీటూ, నరసాపురంలోని జస్టిసు నాయుడుగారి సీటూ మాత్రమే దక్కాయి. ముస్లింలకు వారికి కేటాయించిన స్థానాలన్నీ దక్కాయి. శాసనసభలోని 215 స్థానాల్లో 160 కాంగ్రెసుకు లభించాయి.

ఆంధ్రప్రాంతం నుండి ఎన్నికైన శాసనసభ్యులందరూ ప్రత్యేక రాష్ట్ర నిర్మాణం జరగాలని ఒత్తిడి చేశారు. అప్పటి ముఖ్యమంత్రి రాజగోపాలాచారికి ఇది ఇష్టంలేదు ఎప్పటికప్పుడు ఏవేవో సాకులు చెప్తూ ఉద్యమ భావాలపై నీళ్ళుచల్లటం ఆరంభించాడు.

1937లో శాసనసభ స్పీకరుగా ఉన్న బులుసు సాంబమూర్తి ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు విషయంలో ఆంగ్లేయ పాలకులకు వివరించటానికి లండన్ వెళ్ళాలనుకున్నాడు. అంతా సిద్ధమైంది అయితే రాజాజీ మంత్రాంగంతో కాంగ్రెసు అధిష్టానవర్గం అసమ్మతి తెలిపింది. ఆ ప్రయాణం ఆగిపోయింది. ఇది ఆంధ్ర ప్రాంత శాసనసభ్యుల్లో ఆగ్రహావేశాలను కలిగించింది. సమయం కోసం కాచుకూర్చున్నారు.

ఇంతలో రెండవ ప్రపంచ యుద్ధం ఆరంభమైంది. 3.9.1939న బ్రిటీషు రాజప్రతినిధి, భారత దేశం ఈ యుద్ధంలో ఇంగ్లండు పక్షాన చేరినట్టు ప్రకటించాడు. అంతకు ముందు మన దేశానికేమాత్రం సంబంధంలేని ఈ ఐరోపా సంగ్రామంలో భారతదేశాన్ని దించగూడదని కాంగ్రెసు వర్కింగు కమిటీ తీర్మానించింది. అందులో భాగంగానే ఆంగ్లేయులకు భారతదేశపాలనలో సాయంచేయకూడదనీ కాంగ్రెసు మంత్రి వర్గాలన్నీ రాజీనామా చేయాలనీ 22.10.1939 న కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సమావేశమై తీర్మానించింది. దాని ప్రకారం 26.10.1939 న చెన్నరాష్ట్ర శాసనసభ కాంగ్రెసు మంత్రివర్గ

రాజీనామాను ఆమోదించింది. 29 వ తేదీన రాజాజీ మంత్రివర్గం తన రాజీనామాను గవర్నరుకందజేసింది. అంతటితో అప్పటికి ఆంధ్రరాష్ట్ర వాంఛకు తాత్కాలిక సమాధి కట్టినట్టయింది.

యుద్ధం అంతం కావటం, జాతీయ ఉద్యమం ఉధృతంగా వెల్లుబకటం, సామ్రాజ్యవాద శిబిరంలో సంక్షోభం కారణంగా 1947 లో దేశానికి స్వాతంత్ర్యం రావటం జరిగింది. ఈ దశాబ్దం అంతా స్వాతంత్ర్య పోరాటంలో భాగంగానే ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని తెలుగు ప్రజలు నిర్వహించారు.

తెలుగుదేశంలో ప్రత్యేక రాష్ట్ర వాంఛ ఇన్ని అంచెలలో సాగుతుండగా తెలంగాణా ప్రాంతంలో ఈ ఉద్యమం ఎలా ఉండేదో చూడటం చాలా అవసరం.

నైజాం పరిపాలన సాగుతున్నకాలం అది. ఇంటాబయటా ఉర్దూ భాషకూ - ముస్లిం సంస్కృతికీ నివాళులిస్తున్న దశ అది తెలుగు మాట్లాడాలన్నా, సభలు జరుపుకోవాలన్నా జనం వణికే దేశం అది. తెలుగు సంస్కృతిపై ముస్లిం మతం అధికారం చెలాయించే రాజ్యం అది. కనుక ఇక్కడి తెలుగు వారికి స్వరాష్ట్రం కావాలన్న వాంఛ చాలా బలీయంగా ఉండటం సహజం. ఇక్కడ ఈ ఉద్యమం విజ్ఞానోద్యమంగా ఆరంభమై కాలక్రమేణా రాజకీయ ఉద్యమంగా పరిణమించింది. నైజాం ప్రాంతం తెలుగు - కన్నడ - మరాఠీ భాషల ప్రజలకు సంగమం. కనుక స్వరాష్ట్రాభిమానం ఉద్యమరూపంగా ఏకకాలంలో ఈ అన్ని భాషల వారికీ కలిగింది. అయితే ముస్లిం సంస్కృతి తమ సంస్కృతులను అణిచేస్తున్న కారణంగా ఈ భావం తమ సంస్కృతీ వికాసానికి చెందిన ఉద్యమంగానే బయల్పడింది.

ప్రధానంగా కొమర్రాజు లక్ష్మణరావు, మునగాల రాజాల కృషితో తెలుగు గ్రంథాలయోద్యమం ఇక్కడ ఆరంభమైంది.

అదే క్రమంగా ఆంధ్రమహాసభల రూపాన్ని పొందటం, నిజాం కబంధ హస్తాల నుండి తెలుగు సంస్కృతిని కాపాడుకోటానికీ, ఫ్యూడలిజం అవశేషాలైన వెట్టిచాకిరీ నుండి విముక్తి పొందటానికీ, భూస్వాముల, జమీందార్ల, జాగీర్దార్ల దోపిడీ నుండి తమను తాము రక్షించుకుంటూ ముక్కోటి తెలుగులు ఒక్కటిగా ఏర్పడే విశాలాంధ్ర ఉద్యమంగా మారటానికి కారణమైంది. వాటి వివరాలు కూడా తెలుసుకోవడం అవసరం.

# తెలంగాణా ప్రాంతంలో స్వరాష్ట్ర ఉద్యమం

1901 లో హైదరాబాద్ నగరంలో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం ఏర్పడింది. కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, మునగాల రాజా నాయని వెంకటరంగారావులు దీన్ని తెలుగు గ్రంధాలయంగా స్థాపించారు. దీని తర్వాత వరసగా తెలంగాణా ప్రాంతమంతటా గ్రంధాలయాలు ఆవిర్భవించాయి. ఇవి నాడు కేవలం పఠనాలయాలుగా మాత్రమే కాకుండా పాఠశాలలు, వయోజన విద్యా నిలయాలు, సాంస్కృతిక, రాజకీయాభిప్రాయాల చర్చావేదికలుగా కూడా ఉపయోగపడ్తూండేవి.

సరిగ్గా అదే కాలంలో ఇక్కడ యాదవ, ముదిరాజ, మున్నూరు, పద్మశాలి, గౌడ తదితర వర్ణాలవారి సభలూ జరగడం ఆరంభమయ్యాయి. సంఘ సంస్కరణ, జీవ రక్షా ప్రచారాలు కూడా ముమ్మరం కాజొచ్చాయి. హిందూ సంఘ సంస్కార సభ, ఆది హిందూ సేవాసమితుల లాంటి సంస్థల ఆవిర్భావం జరిగింది. నాడిక్కడున్న పత్రికలు చాలా తక్కువ నీలగిరి, గోలకొండ, తెనుగు ప్రతిభ, సుజాత వంటివే ఉండేవి. ఉర్దూలో అనేక పత్రికలుండేవి

తెలంగాణా ప్రాంతం ఉన్న చారిత్రక పరిస్థితి ననుసరించి విభిన్న భాషలవారూ ఉన్నారు. ఇక్కడి తెలుగువారికి కన్నడిగులు, మహారాష్ట్రిలు, ఉత్తర హిందూస్థానీయులు, మహమ్మదీయులవంటి ఆంధ్రేతర భాషీయులతో సత్సంబంధాలుంటూండేవి.

1921లో ఒక సంఘటన జరిగింది. నవంబరులో హైదరాబాద్ లోని వివేకవర్ధనీ థియేటరులో హిందూ సంస్కార సభలు జరిగాయి. ఆ సభలకు శ్రీమతి సరళాదేవి చౌధరాణీ అధ్యక్షత వహించారు. అనేకమంది వక్తలు హిందీ, ఉర్దూ, మరాఠీ, ఇంగ్లీషు భాషల్లో మాట్లాడారు అల్లంపల్లి వెంకట్రామారావు అనే న్యాయవాది తెలుగులో మాట్లాడటం ఆరంభించగానే సభలోని ఆంధ్రేతరులు అల్లరిచేయడం ఆరంభించారు. సభలో కలలు-కేకలు. సభాధ్యక్షురాలు కూడా వక్తను ఆపడానికి ప్రయత్నించింది. వెంకట్రామారావు తమ ఉపన్యాసం ఆపక తప్పిందికాదు. తెలుగువాళ్ళలో ఈ సంఘటన ఆవేశానికి దారి

తీసింది. తర్వాత కొద్దిరోజులకు హైదరాబాద్‌లోని ట్రూప్‌బజారులో ఉన్న టేక్‌మాల్ రంగారావు ఇంట్లో తెలుగువాళ్ళు సమావేశమై 'ఆంధ్రజన సంఘం' అనే పేరుతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేశారు. శ్రీ మాడపాటి హనుమంత రావును కార్యదర్శిగా ఎన్నుకున్నారు. హైదరాబాద్ సంస్థానంలో ఆంధ్రోద్యమంగా పైకిరావడానికి అది నాంది అనవచ్చు.

ప్రతి జిల్లా, తాలూకాలలో దీనికి శాఖలేర్పడ్డాయి. దీనితో గ్రంథాలయోద్యమాన్ని కూడా జోడించారు. తెలంగాణా అంతటా ఉన్న వివిధ ప్రజా సంఘాల సమన్వయభారం మాడపాటివారు వహిస్తూండేవారు. చివరకు 1923 మార్చి నెలలో హనుమకొండలో ఒక సభ జరిగింది. తెలంగాణా అంతటినుండీ ఈ 'జన సంఘ' ప్రతినిధులు హాజరయ్యారు. ఇందులోనే 'నిజాం రాష్ట్ర ఆంధ్ర జన కేంద్ర సంఘం' ఆవిర్భవించింది.

ఈ సంఘం సభలు 1924 మార్చిలో నల్లగొండలోనూ (రెండవది); 1925 ఫిబ్రవరిలో మధిరలోనూ (మూడవది) జరిగాయి. నిజాం ప్రభుత్వం అనుమతి ఇవ్వని కారణంగా 1928 మే లో సూర్యాపేటలో జరిగే సభవరకూ నడిమికాలంలో సభలు జరగలేదు. అంటే నాలుగవ మహాసభ 1926లో జరగాల్సింది 1928 లో జరిగింది. సాధారణంగా ఈ ఆంధ్రజన కేంద్ర సంఘం సభలతో గ్రంథాలయ సభలూ, యువజన, వైశ్యయువజన, సంఘ సంస్కరణ, మహిళాసభలు కూడా జరుగుతూండేవి. ప్రజల్లో సాంస్కృతిక చైతన్యం కలిగించే అనేక గ్రంథాలను కూడా ప్రచురించేవారు. వర్తక స్వాతంత్ర్యం, వెట్టిచాకిరీ, జాగీరులూ వంటివి అలా ప్రచురించినవాటిలో కొన్ని.

గ్రంథాలయాలు, పఠనాలయాలు, నాటికున్న తెలుగు పత్రికలు తెలంగాణాలోని తెలుగు ప్రజల్లో సాంస్కృతిక చైతన్యానికి విశేషంగా దోహదం చేశాయి. తెలుగు చరిత్రలో పరిశోధన చేసి కృషిచేయడం; తెలుగు ప్రజలకు తమ భాషలో, సంస్కృతిలో ఆసక్తికలిగించడమే కాకుండా దాన్ని రక్షించుకోవాలన్న ధైర్యస్థయిర్యాలను కలిగించడం ఈ అన్నిసంఘాల ఆశయం. దాని కానాడు ఉన్నవ వెంకట్రామయ్యను పూర్తికాలపు ప్రచారకునిగా ఈ సంఘం నియమించింది. ఈ సంఘం ఆశయాలను ఊరూ వాడా ప్రచారం చేసేవారాయన. ఈ కృషి క్రమంగా సమన్వయంచెంది 1930లో జోగిపేటలో జరిగిన నిజాం రాష్ట్ర ప్రథమ ఆంధ్ర మహాసభగా రూపుచెందింది. సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షులు. 1931 భోనగిరిలో బూర్గులవారి అధ్యక్షతన రెండవ మహాసభ, 1934 ఖమ్మంలో పులిజాల వెంకటరంగారావు అధ్యక్షతన మూడవ మహాసభ, 1935లో సిరిసిల్లలో మాడపాటి హనుమంతరావు అధ్యక్ష

తన నాలుగవ మహాసభలు జరిగాయి. 1936లో కొండా వెంకట రంగారెడ్డి, 1937 లో ముందుముల నరసింగరావు (నిజామాబాద్) అధ్యక్షతన సభలు జరిగాయి.[20] నిజామాబాదు సభల్లో సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వస్థాపన అవసరాన్ని ఒక తీర్మానం ద్వారా స్పష్టపర్చారు. ఇదే భావం క్రమంగా రాజకీయ రూపాన్ని సంతరించుకుంది. అప్పటికే ఈ ప్రాంతాల్లో కూడా కమ్యూనిస్టు సిద్ధాంతాలు యువకుల్లో నాటుకొని ప్రభావం కలిగిస్తున్నాయి. 1937 నుండి 1944 సభల వరకూ జరిగిన అన్ని ఆంధ్ర మహా సభల్లోనూ రావి నారాయణరెడ్డి నాయకత్వం కింద అతివాద భావాలు వెలువడడం ఆరంభమయ్యాయి. కార్యక్రమంలో చురుకుదనం రావాలనీ కేవలం స్వాతంత్ర్య కాంక్షను నైజాం ప్రభువుకు విన్నవిస్తే సరిపోదన్న భావం ఈ యువకుల్లో ఉండేది. బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల సోదరులు ఇంకా అనేకులు ఈ వర్గంలో ఉండేవారు.

పెల్లుబుకుతున్న ఈ స్వాతంత్ర్య కాంక్ష తన గద్దెను కదిలిస్తుందేమోనన్న భయం నైజాముకు పట్టింది. దాంతో 1942 లో కొన్ని రాజకీయ సంస్కరణలు చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. కానీ అదే సంవత్సరం ధర్మవరంలో మాదిరాజు రామకోటేశ్వరరావు అధ్యక్షత కింద జరిగిన తొమ్మిదవ ఆంధ్ర మహాసభల్లో ఈ ప్రతిపాదనను తిరస్కరిస్తూ ప్రజాసామాన్యం ఎన్నుకున్న సభ్యులతో శాసనసభ ఏర్పడాలని మహాసభ నిర్ణయించింది.

ఈ ఆంధ్రోద్యమ సభలు "ముఖ్యంగా భాష, విద్య, విజ్ఞానము, నీతి, సంస్కృతి అభివృద్ధికి పాటుపడగలవని" మాడపాటివారు అనేక వ్యాసాల్లో ఉపన్యాసాల్లో ప్రకటించారు. అయినా రావి నారాయణరెడ్డి అన్నట్టు "నాయకులే ఉద్యమానికి రాజకీయాలతో సంబంధం లేదని ఎంత ప్రకటించినప్పటికీ, ఉద్యమాన్ని చట్టబద్ధంగా నడపడానికి ఎంత కృషిచేసినప్పటికీ, ఆంధ్రోద్యమానికి ఉండే రాజకీయ ప్రాముఖ్యతను ఎవరూ విస్మరింపజాలరు. నలుదిశల అంధకారం వ్యాపించి ఉన్న ఆరోజులలో ఎంత చిన్నదైనప్పటికి ఆంధ్రోద్యమం ఒక జ్యోతిగా వెలిగి ఇక్కడి ప్రజానీకానికి మార్గం చూపించిందనే విషయంలో సందేహం ఏమాత్రం లేదు. అటు పిమ్మట అభివృద్ధిచెందిన విశాల ప్రజా ఉద్యమానికి ఈదశాబ్దంలో జరిగిన కృషి పునాదిగా నిలిచింది."

1939 నుండీ తెలంగాణా ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ పనిచేయడం ఆరంభించింది. ఇది కూడా గ్రంథాలయ ఉద్యమం, నిజాం వ్యతిరేక పోరాటం, తెలుగు సంస్కృతి పరిరక్షణ పోరాటాలు [illegible] పనిచేస్తుంది [illegible]

పరిస్థితులను ధర్మారావు కాగడా వారపత్రికలో వ్యాసాల ద్వారా ప్రకటిస్తూండే వారు.

గ్రామాల్లో జనాన్ని చైతన్యవంతులను చేయడం, నిజాం వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక పోరాట దిశగా వాళ్ళను మళ్ళించడంలో కమ్యూనిస్టుపార్టీ బాగా కృషిచేస్తూండేది. విశాలాంధ్ర వాంఛనూ వాళ్ళలో రగుల్కొల్పడంలో కూడా శాయశక్తులా శ్రమించింది.

మునగాల రాజా ప్రజలపై చేసే నిర్బంధాలను వ్యతిరేకిస్తూ పెద్దప్రజా ప్రతిఘటనను నిర్మించింది. జాగిర్దార్ల కూడా ఆయా ప్రాంతాల్లో విధించిన అధికపన్నులకు వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీ ప్రజాసమీకరణ సాగించింది.

అప్పటికే రెండవ ప్రపంచయుద్ధం - సామ్రాజ్యవాదం యుద్ధం దశ నుండి ప్రజాయుద్ధం దశకు మళ్ళింది. ఫాసిజం, నాజీజంలను ఎదుర్కోవటం ఎంతటిదో, తెలంగాణాలో నిజాంను ఎదిరించగం కూడా అంతటిదేనన్న పట్టుదలతో సిద్ధాంత చర్చలతో ప్రజా ప్రతిఘటనలు సాగేవి. ఆంధ్ర ప్రాంతంలో ప్రపంచ రాజకీయాల యెడ ఎలాటి అభిప్రాయాలుండేవో ఇక్కడున్న కమ్యూనిస్టులకూ అవే అభిప్రాయా లుండేవి అదేవిధంగా 'విశాలాంధ్రలో ప్రజా రాజ్యం' అన్న నినాదం ఇక్కడా కార్చిచ్చులా వ్యాపించింది. స్థానిక నాజీ రూప నిజాం పాలకులను, వారి తాబేదార్లను దించడం తక్షణ సమస్యగా ఇక్కడి వామపక్షభా ల యువకులు భావిస్తూండేవారు.

1944 భువనగిరి సభల నుండి అతివాద భావాలకు తెలంగాణాలో గౌరవం పెరిగింది. 1945 ఖమ్మం సభలు మహాసభల చైతన్యాన్ని ప్రజల మధ్యకు తీసికెళ్ళాయి. అంతవరకూ 'బాంచను దొరా' అన్న నోళ్లు గ్రామాల్లో భూస్వాములను నిలేసి ప్రశ్నించడల ఆరంభించాయి. జనం అక్రమ వసూళ్ళు, వెట్టిచాకిరి, దౌర్జన్యాలను అడ్డుకోవడం ఆరంభించారు. అది 1946 జూలై 4. తెలంగాణా ప్రాంతంలో ఓ భూస్వామి విసునూరి రామచంద్రారెడ్డి. అతడు కర్కోటకుడు. పెల్లుబుకుతున్న కసితో కదివెండి ప్రజలు భూస్వాములకు వ్యతిరేకంగా దొడ్డి కొమరయ్య నాయకత్వాన ఓ ఊరేగింపు తీశారు. రామచంద్రారెడ్డి ఆ ఊరేగింపుమీద కాల్పులు సాగించాడు. అందులోనే కొమరయ్య నేలకొరిగాడు.

అదే దావానలంగా గ్రామాల్లో వ్యాపించి భూస్వాముల గడీలను పడగొట్టింది అందన ఆయుధాన్ని పట్టి ప్రజలు తమను తాము రక్షించుకోవడంతో భూస్వాములు రజాకార్ల గూండాలమీద తిరగబడ్డారు. 1946 నవంబరులో నైజాం ప్రభుత్వం; ప్రజలు తమను కంటిపాపలా కాపాడుతున్నదనుకొనే

'సంగాన్ని' నిషేధించింది ఇంతలో 1947 లో సంస్థానాలు మినహా దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. సంస్థానాల విలీనీకరణకు నైజాం ఎదురుతిరిగాడు. దాంతో సంస్థానంలోని కమ్యూనిస్టు పార్టీ, కాంగ్రెసు పార్టీ, ఆంధ్ర మహాసభ, సామాన్య ప్రజానీకం నైజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నారు. తెలుగు ప్రజల సమైక్యత అన్న నినాదానికి బాగా బలం వచ్చింది. విశాలాంధ్ర నినాదంతో కమ్యూనిస్టు పార్టీ నైజాంతో పోరాటానికి సిద్ధపడింది. స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహ ఉద్యమాన్ని ఆరంభించింది. నైజాం తొత్తులుగా ఇత్తెహాదుల్ ముసల్మీన్, రజాకార్లు ఈ ప్రజాపోరాటాన్ని అణచటానికి దౌర్జన్య చర్యలు సాగించడం మొదలుపెట్టారు. అంతటితో అన్ని నినాదాలు మాటుపడి తెలుగు జాతి సమైక్యత-నైజాంను గద్దె దింపడంలోనే ఉందన్న భావం ఒక్కటే విజృంభించింది.

1947 జనవరి నుండి ఇది సాయుధ పోరాటాన్ని అందుకుంది. గెరిల్లా పోరాటం మొదలైంది. ఇది రాజకీయ రూపాన్ని సంతరించుకుని దుష్కర నైజాం పాలన నుండి విముక్తికోసం జరిగే సాయుధ పోరాటంగా మారింది. అప్పటికే తెలంగాణా ప్రాంతంలో ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీలను నిజాం నిషేధించాడు. మద్రాసు ప్రభుత్వం కూడా ఆ ప్రాంతంలో కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. (ఆంధ్ర ప్రాంతం).

ఈ ప్రజాప్రతిఘటనోద్యమాలు 1948 సెప్టెంబరు వరకూ తీవ్రరూపం దాల్చాయి. 1948 సెప్టెంబరు 13న యూనియన్ సైన్యాలు సంస్థానం మీద మిలిటరీ చర్యను ఆరంభించాయి. దీని వెనక ప్రధానంగా మూడు కారణాలున్నాయి. ఒకటి - నిజాం రాష్ట్రాన్ని భారతదేశంలో కలపడం; రెండు-ఫ్యూడల్ శక్తుల ప్రాబల్యం కొంత తగ్గించడం; మూడు- కమ్యూనిస్టు పార్టీని అణచడం. ఇందులో మూడో ఆశయ సాధనను 1951 వరకూ యూనియన్ ప్రభుత్వం కొనసాగించింది. సాయుధపోరాటం 1951లో కమ్యూనిస్టు పార్టీ ఆపింది. 1952 ఎన్నికల్లో పాల్గొంది.

ఈ మధ్యలో జరిగిన అన్ని ఘటనలనూ ధర్మారావు తన జనవాణిలో రాశారు. సాయుధ పోరాటాన్ని బలపర్చారు. పోలీసుల దౌర్జన్యా చర్యలను ఖండించారు. ఎలమర్రు, కాటూరి ఘటనల మీద మేధావుల సంతకాలతో పత్రికలో బాగా ప్రచారం చేశారు. డిటెన్యూలపై కాల్పులను 'జెయిళ్ళలో కాల్పులంటూ' సంపాదకీయంలో గర్హించారు(17-8-1948). ఉరిశిక్షపడ్డ తెలంగాణా యువకులకు 'ప్రాణభిక్ష' పెట్టండని సంపాదకీయం రాశారు (28-3-1951).

ప్రాణభిక్ష పెట్టిం తర్వాత 'సుఖీభవ' అంటూ మరో సంపాదకీయంలో ఆశీర్వదించారు (9-5-1951).

ఆంధ్రరాష్ట్ర సమస్య యుద్ధం ముగిసేదాకా మొదట వెనకబడ్డది. తర్వాత స్వాతంత్ర్యం వచ్చేదాకా మరుగునపడ్డది. 1948లో మద్రాసు రాష్ట్రం రెండు శాసన సభల్లో ఆంధ్ర, తమిళ, కర్ణాటక, కేరళ రాష్ట్రాలను ఏర్పాటు చెయ్యాలని డా॥ సుబ్బరాయన్ (అప్పటి న్యాయ శాఖ మంత్రి) తీర్మానం చేయించాడు. ఆ సంవత్సరం ఢిల్లీ పార్లమెంటులో నెహ్రూ, రంగా ప్రశ్నకు సమాధానం చెప్తూ ఆంధ్ర రాష్ట్రం త్వరగా ఏర్పాటు చేస్తామన్నారు. భాషా ప్రయుక్త రాష్ట్ర సమ్మేళనం ఢిల్లీలో ఆ సంవత్సరం డా॥ పట్టాభి అధ్యక్షతన జరిగింది.

1948 లోనే ధార్ కమిటీని ఆంధ్ర రాష్ట్ర విషయం పరిశీలించడానికి కేంద్ర ప్రభుత్వం వేసింది. అది రాజధాని విషయం తగాదాను తేల్చలేక పోయింది. 1949లో జె. వి. పి. కమిటీ ఏర్పడింది. జవహర్లాల్, వల్లభ్ భాయ్, పట్టాభి ఇందులో సభ్యులు. రాష్ట్రాన్ని స్థాపించాలనీ మద్రాసు మాత్రం రాజధాని కారాదనీ ఈ కమిటీ సిఫార్సు చేసింది. ఈ ఘటనలను ధర్మారావు పొల్లు నెల్లులోనూ, అనేక సంపాదకీయాల్లోనూ బాగా విమర్శించాడు. రాష్ట్ర విభజనలు' ఆత్రమా - అనర్థకమా, జై ఆంధ్రా, ఆంధ్రులకానందం, ద్రోహులున్నారు జాగ్రత్త' అంటూ చాలా సంపాదకీయాలలోనూ, నాయకుల మోసాలను ఎప్పటి కప్పుడు తమ రచనల్లోనూ ధర్మారావు ఎండగట్టాడు.

1950 నాటికి రాష్ట్ర సమస్య ఎక్కడ వేసిన గొంగడి అక్కడే ఉన్న చందంగా ఉంది. స్వామీ సీతారాం సత్యాగ్రహమంటూ మొదలెట్టాడు. తెలంగాణాలో పోలీసుల దురంతాలు, కమ్యూనిస్టులపై చిత్రహింసలు అధికమయ్యాయి. ఈ కాలంలో జనవాణిలో 'భలోక్తా? ఖలోక్తా?' అనీ, 'అభాగ్య ఆంధ్ర' అనీ, 'అవశ్యకర్తవ్యం' అనీ, 'మళ్ళీ ఆంధ్ర రాష్ట్రం' అనీ, 'సిటిలో నిప్పు' అనీ, 'ఆంధ్రులకు మరొక పట్టీ' అనీ అనేక సంపాదకీయాలు రాష్ట్ర ప్రజల కార్యాచరణను గుర్తు చేస్తూ వ్యంగ్యంగానూ, సూటిగానూ రాశాడు.

1952 అక్టోబరు 18న పొట్టి శ్రీరాములు రాష్ట్ర సాధనకు ఆమరణ నిరాహార దీక్ష చేపట్టాడు. నాయకులకు చీమకుట్టినట్టయినా లేదు. నాటి ముఖ్య మంత్రి రాజగోపాలాచారి దీన్ని పట్టించుకోలేదు. చివరకు 1952 డిసెంబరు 15 న శ్రీరాములు చనిపోయారు తెలుగు దేశం అట్టుడికినట్టుడికింది. తెలుగు నాడు మంటల్లో మునిగింది. డిసెంబరు 19 న పార్లమెంటులో నెహ్రూ 1953 అక్టోబరు 1 లోపున ఆంధ్ర రాష్ట్రం స్థాపిస్తామంటూ ప్రకటించారు. దేశం

శాంతించింది. ధర్మారావు 'శ్రీరాములు నిర్యాణం' అంటూ ఒక సంపాదకీయం రాశాడు. కాంగ్రెసు వారి అలసత్వానికీ, స్వాతంత్ర్యం వచ్చింతర్వాత వేసిన కమిటీల రిపోర్టులను పాతేసిన ప్రభుత్వ సాచివేత విధానాలకూ, ప్రభుత్వ నిరాదరణకూ కాంగ్రెసు నాయకుల్లో ప్రాంతీయ దురభిమానాలకూ, వ్యక్తి దురహంకారాలకే శ్రీరాములు ఆహుతయ్యారని ఖండితంగా రాశారు. (17-12-1952)

రెచ్చిపోతున్న ప్రజలను ప్రశాంతంగా ఉండాలంటూ శ్రీశ్రీ, కొ.కు, తుమ్మల, డా॥ రాజారావు, సుంకర, వాసిరెడ్డి, మా. గోఖలే, ఆరుద్ర, అనిసెట్టి ఒక విజ్ఞప్తిని తెలుగు ప్రజలకు అందించారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉద్యమాన్ని ప్రతి సంచికలోనూ ప్రతిబింబిస్తూ జనవాణి ద్వారా తానూ ఉద్యమ నిర్వాహకుడుగా ధర్మారావు బాగా కృషి చేశాడు. ఈ ఉద్యమంలో అలసత్వం వచ్చిన ప్రతి సందర్భంలోనూ తన రచనల ద్వారా ప్రజల్లో చైతన్యం రెచ్చగొట్టాడు. నాయకుల ముసుగులను చీల్చి వారి నిజరూపాలు బయటపెట్టి రాష్ట్ర నిర్మాణంలో ఒక బాధ్యత గల పత్రికా రచయితగా ధర్మారావు చక్కని కృషి చేశాడు.

ధర్మారావు మద్రాసులో ఉంటూ అక్కడా, ఇతర చోట్లా సాహిత్య కార్యక్రమాలకు హాజరు కావటానికి తెలుగునాడులో పర్యటిస్తూండేవాడు. 1951 డిసెంబరు 22, 23 తేదీల్లో మద్రాసు రాజాజీహాల్లో తెలుగు సంస్కృతీ సభలు జరిగాయి. అనేక అంశాల మీద నార్ల, కాటూరి, మల్లంపల్లి తదితరులు ఉపన్యాసాలిచ్చారు. 23న సభలకు తాపీ ధర్మారావు అధ్యక్షత వహిస్తూ సంస్కృతిని గురించి ఇలా ఉపన్యాసించాడు.

"సంస్కృతి అంటే మానవుడు స్వయంకృషి వల్ల అలవరచుకునే ప్రతిదీ అని అర్థం. స్వయంగుణాలు, ఇన్‌స్టింక్టులు, ఆ తర్వాత మనిషి సంపాదించుకొనే విజ్ఞానం సంస్కృతి. ఆంధ్రుల ప్రత్యేక సంస్కృతి సంస్కృతానువాదాలలో పడిపోయి వెతికితే కాని కనిపించని స్థితికి వచ్చింది. మనం ఇతరులను అనువదించుకోవడమే కాదు. ఇతరులూ మనవి అనువదించుకొనేలా చేయాలి. పత్రికలపై నిర్బంధాలను తొలగించాలి. పత్రికా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనరికట్టే ప్రభుత్వ దృష్టిని ఖండించాల''నీ అన్నాడు.[21]

ఆంధ్ర విజ్ఞాన సమితి అంటూ మద్రాసులో ఉండే 50 కళాశాలల్లో చదివే తెలుగు విద్యార్థులందరూ కలిసి ఓ సంఘం 1951లో ఏర్పాటు చేసుకున్నారు. దీని నిర్వహణ పరుచూరి హనుమంతరావుది. 1952లో ఈ సంఘం ధర్మారావును చాలా ఘనంగా సన్మానించింది. ఆ సభలో ధర్మారావు, విదా

ర్థులు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సందర్భంగా ఎంతటి దీక్షను పూనాలో వివరిం చాడు. వారి సమస్యలమీద ఏకరం కండని పిలుపిచ్చారు. (పరుచూరి హనుమంత రావుతో ఇంటర్వ్యూ).

1952 మార్చి 22న మద్రాసులోనే సోవియట్ సాంస్కృతిక ప్రతినిధు లకు స్వాగత సత్కారాలు జరిగాయి. ఆ ప్రతినిధి వర్గానికి ప్రసిద్ధ అజర్ బైజాన్ రచయిత, స్టాలిన్ పతక గ్రహీత నికొలాయ్ టికొనాప్ నాయకత్వం వహించారు. ఈ సభ ప్రకాశ్ స్టూడియోలో ధర్మారావు అధ్యక్షతన జరిగింది. ప్రజానాట్యమండలి సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. ధర్మారావు "ఈ రెండు దేశాల మధ్య స్నేహసంబంధాలు దృఢం కావాలనీ అందుకు సాంస్కృ తిక రంగమే సాయపడుతుందనీ" అన్నారు.[22]

మద్రాసులో ఉంటూండగానే 1953-54 ల మధ్య ధర్మారావు గడ్డం మీద చిన్నచిన్న కురుపులు లేచాయి. డాక్టర్లు బహుశా చర్మవ్యాధి కావచ్చ న్నారు. మంగలి కత్తి కారణం అయి ఉండవచ్చని భావించారు. గడ్డం గియ్యటం మానమని సలహా ఇచ్చారు. తెల్లగా పెరిగిన గడ్డం చూసి మిత్రులు రవీంద్రనాధ టాగూర్‌లా ఉన్నారనీ అలాగే పెంచమనీ అన్నారు. దాంతో అలాగే మిత్రుల మాట పాటించారు. అప్పటి నుండీ సాహిత్య లోకానికి ధర్మా రావుగారి రూపం పండుగడ్డంతో ఆంధ్రా టాగూర్‌లా అనిపించడం ఆరంభ మైంది.[23]

1956 ఫిబ్రవరి 2న ప్రఖ్యాత సోవియట్ రచయిత ఇల్యా ఎహ్రెన్ బర్గ్ మద్రాసువచ్చిన సందర్భంగా ఉడ్‌లాండ్స్ హోటల్లో గొప్ప సభ జరిగింది. ఆసన్మాన సభకు ధర్మారావు అధ్యక్షత వహించారు. "మన గ్రంథాలను రష్యన్ భాషలోకి అనువదించాలని సూచించారు". ఆ సభలో ఆరుద్ర, అనిసెట్టి తది తర అభ్యుదయ రచయితలెందరో ప్రసంగించారు. దాదాపు 80 మంది ప్రముఖ తెలుగు రచయితలు సభకు హాజరయ్యారు.[24]

1956 ఆగస్టు 24, 25, 26, తేదీల్లో విజయవాడలో రాష్ట్ర అరసం కార్యవర్గ సమావేశానికి తాతాజీ హాజరయ్యారు.[25] 1956 సెప్టెంబరు 19న మద్రాసులో చలన చిత్ర పరిశ్రమ, అభ్యుదయ రచయితల సంఘం, మిత్రులూ కల్సి చాలా పెద్ద ఎత్తున ధర్మారావు 70వ జన్మదినోత్సవం జరిపారు. అనేక రంగాల్లోని పలువురు ప్రముఖులుపన్యసించారు. ధర్మారావు తానుఎలా సాహిత్య సేవ చేసిందీ వివరించారు ఈ సందర్భంలో, వారి గౌరవార్థం తిరుపతి వేంక

టేశ్వర విశ్వవిద్యాలయానికి రేలంగి వెంకట్రామయ్య పదిహేను వేలు విరాళం ఇచ్చారు. ఈ సభల వివరాలు మరోచోట ఇవ్వడం జరిగింది.

ఎక్కడున్నా సంస్కరణ వివాహాలను జరిపిస్తూండటం ధర్మారావుకు ఆనవాయితీ అయింది. మద్రాసులో ఉంటూండగా అప్పుడు అక్కడుండే విశాలాంధ్ర విలేకరి వి హనుమంతరావు సరళల వివాహం దక్షిణ భారత హిందీ ప్రచార సభ హాలులో జరిపించారు. (12.6.1954). జయప్రద, సి.కె. నారాయణరెడ్డిల వివాహం కూడా ధర్మారావే నిర్వహించారు. (12-2-1956)

1957 జనవరి 16న భారత ఫిలిం జర్నలిస్టుల సంఘం, చలనచిత్ర పరిశ్రమ రజతోత్సవాల సందర్భంగా ధర్మారావును ఇంకా కొందరినీ ఘనంగా మద్రాసులో సన్మానించింది. ఆ సభలో తనకు జరిగిన సన్మానానికి సమాధానం చెప్తూ కళలు - ప్రజా కళల స్వభావాలను వివరించారు. ప్రజా కళల వ్యాప్తికి చిత్రరంగం కృషి చెయ్యాలనీ ఆ దిశగా ఫిలిం జర్నలిజం మరింత దోహదం చెయ్యాలనీ ఆకాంక్షించారు.

సుమారు 22 సంవత్సరాలు మద్రాసులో గడిపి అన్ని రంగాల్లోనూ తనకంటూ ఓ ప్రత్యేక స్థానం ఉండేలా కృషి చేసి 1958 జులైలో హైద్రాబాదు వచ్చారు. అప్పుడప్పుడు, మిగిలిన సినిమా పనికోసం కానీ, సొంత ఇల్లు బాగుకోసం కానీ మద్రాసెళ్ళి వస్తూన్నా స్థిరనివాసం హైద్రాబాద్‌లో కాచిగూడ స్టేషన్ దగ్గర 'చిత్రకూట్' లోనే ఉండేది. ధర్మారావు కార్యరంగం మద్రాసు నుండి హైద్రాబాద్‌కు మారింది. ఎంతో కాలంగా ఆశించిన తెలుగుల రాజధాని భాగ్యనగరానికి చాలా ఉత్సాహంతో ధర్మారావొచ్చారు.

o o o o

ఈ భాగంలో వచ్చిన ఆంధ్ర రాష్ట్ర, తెలంగాణా స్వరాష్ట్ర ఉద్యమాలకు సంబంధించిన వివరాలను ఈ కింది పుస్తకాలనుండి సేకరించాను.

- కొండా వెంకటప్పయ్య 'స్వీయచరిత్ర'.
- రావి నారాయణరెడ్డి 'వీర తెలంగాణ'.
- అయ్యదేవర కాళేశ్వరరావు 'నా జీవితకథ నవ్యాంధ్ర'.
- ఎం. ఎల్. నరసింహారావు 'తెలంగాణా వైతాళికులు'.
- టంగుటూరి ప్రకాశం 'నా జీవిత యాత్ర'.
- ఆరుట్ల రామచంద్రారెడ్డి 'తెలంగాణా పోరాట స్మృతులు'.

## జనం నుండి జనంలోకి కాగడా

"Newspaper is the bible of Democracy. It is the book out of which a people determines its behaviour. It is the only serious book most people read" 26 -అన్న ప్రఖ్యాత జర్నలిస్టు వాల్టర్ లిప్‌మన్ మాటలు వార్తాపత్రికల ప్రాధాన్యాన్ని చెప్తాయి. ప్రభుత్వాలు సాధారణంగా పత్రికలను తమ గుప్పిట్లో ఉంచుకోడానికి ప్రయత్నించడం చూస్తూనే ఉన్నాం. అది సాధ్యం కానప్పుడు పరోక్షంగానైనా, వాటి మీద తమ ప్రభావం ఉండేలా చూసుకొంటాయి. దీనికి కారణం అందరికీ తెలిసిందే. ప్రజలకు తమ భావ ప్రచారాన్ని అందించడానికి వీటిని మించిన ప్రచార సాధనం మరోటి లేదు. సాంకేతికంగా బాగా అభివృద్ధిని సాధించిన దేశాల్లో సైతం అనేక రకాల ప్రచార సాధనాలున్న సందర్భంలో కూడా వార్తాపత్రికల పాత్ర ఎక్కడా తగ్గలేదు. మారుమూల ప్రాంతాల జనానికి కూడా తమ భావాలనందించడానికి అనువైన సాధనం ఇది. స్వాతంత్ర్యానికి ముందూ - ఆ తర్వాత కూడా భారత దేశంలోని పాలక వర్గాలు పత్రికలతో తమకున్న సంబంధాలను ఎంత జాగ్రత్తగానూ, అప్రమత్తతతోనూ ఉంచుకున్నాయో పరిశీలిస్తే- పత్రికలంటే వాటికున్న గుండె దడను గమనిస్తే- పత్రికలకు ప్రజల్లో ఉన్న అభిమానం, ప్రజలపై ఉన్న ప్రభావం అర్థమవుతుంది. సంఘటనల ఆధారంగా ప్రజల్లో భావ చైతన్యాన్ని రేకెత్తించే శక్తి పత్రికలకుంది. దేశం రూపురేఖలే మార్చగల శక్తిమంతాలు ఈ పత్రికలు. కనుకనే రష్యాలో విప్లవం వచ్చిన తర్వాత లెనిన్ అనేకసార్లు పత్రికల ప్రాధాన్యాన్ని వివరించాడు. పత్రిక విప్లవకారుడి చేతిలో ఆయుధం అన్నాడు.

ఇలాంటి ఆయుధం ధర్మారావు చేపట్టాడు. నిత్యం ఇతర దేశ సాహిత్య పఠనంతో అనేక సరికొత్త భావాలను ప్రజలకందించాలన్న ఆవేశం ఉరకలెత్తే దశలో ఈ ఆయుధం వారి చేతికొచ్చింది. అంతవరకూ తాను తిరుగాడిన భావాల పరిధిని ఛేదించుకుని రెక్కలల్లారుస్తున్న సమయంలో పత్రికలో పనిచేయాల్సి వచ్చింది.

ధర్మారావుకు బ్రాహ్మణేతర ఉద్యమంతో సంబంధాలుండేవని ఇప్పటికే తెలిసింది. తన కవసంతోషం, హేతువాదంతో కలిసిన తార్కిక ఉపన్యాసాల తోనూ ఆయా సభల్లో జనరంజకోపన్యాసకుడుగానే పేరు సంపాదించాడు. నెల్లూరులో అలాంటి సభలో చదివిన ప్రార్థన పద్యం కూడా ఒకటి దొరికింది. బ్రాహ్మణేతరులైన వివిధ కులాలు విడివిడిగా సభలు జరుపుకోవడం - సంఘటిత పడడం, బ్రాహ్మణేతర ఉద్యమంలో ఏకీకృతం కావడం ఇవన్నీ 1917 నుండీ తెలుగునాట కూడా ముమ్మరంగా కొనసాగాయి. కమ్మ మహా సభలూ, రెడ్డి జనసంఘాలు, ఆదియాంధ్ర సభలూ, ఆది వెలమ సభలూ అన్నీ చేసే తీర్మానాల్లో ప్రధానంగా ఉద్యోగావకాశాలూ, విద్యా సాంస్కృతిక రంగా లలో అభివృద్ధిని సాధించాలనీ కోరుకోవడం కనిపిస్తుంది. ఆత్మ విశ్వాసం పెంచుకోవడం అవసరమన్నది వీటన్నిటికీ వెన్నెముక లాటి ఆశయం.

## సమదర్శిని సాహచర్యం

ఈ ఆశయాల ప్రచారానికి బ్రాహ్మణేతర ఉద్యమం రాజకీయ అంగం జస్టిస్ పార్టీ- 'సమదర్శిని' పత్రికను తెలుగులో ఆరంభించింది. పింజల సుబ్రమణ్యశెట్టి ప్రచురణకర్తగా, సంపాదకుడుగా, ఉండేవాడు. వీరు వేటపాలెం నుండి తమిళ ప్రాంతానికి వెళ్ళి స్థిరపడ్డ తెలుగువారు. అలాగే ఈ పత్రికకు నిజమైన సంపాదకుడుగా గానాల రామ్మూర్తి ఉండేవారు.[27] వీరు గుంటూరు ప్రాంతం వారు. ఈ జస్టిసు పార్టీ వారి పత్రికల్లో గూడవల్లి రామ బ్రహ్మం, దువ్వూరి రామిరెడ్డి సంపాదకవర్గంలో ఉండి పనిచేశారు.[28] సమదర్శిని కొంతకాలం దినపత్రికగానూ, ద్వైవార పత్రికగా మరికొంత కాలమూ వచ్చేది. ఉగాది సంచికలను వివిధాంశాలతో ప్రముఖ పండితుల వ్యాసాలతో ఉన్నత ప్రమాణాలతో ప్రచురించేవారు. ఇరవయ్యోశతాబ్దం పూర్వార్థంలో ప్రసిద్ధి చెందిన రచయితలందరూ ఇందులో రాసేవారు.[29] అప్పట్లో బ్రాహ్మణేతర ఉద్యమంలోని మంచివైపు శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి ఆకర్షితులై 'ఈ ఉద్యమాన్ని మనమెందుకు సమర్థించకూడద'ని వ్యాసాలు రాశారు.

ధర్మారావు అనేక జమీలలో ఉద్యోగాలు చేసి ఒక దశలో నిరుద్యోగిగా ఉన్నాడు. బిహారులో కూడా తన రాతను పరీక్ష చేసుకుందామని వెళ్ళి నిరాశతో తిరిగొచ్చాడు. ఆ కాలంలో ఇక్కడ మద్రాసు రాజకీయాలలో జస్టిస్ పార్టీ ప్రభావం తిరోగమన దశలో ఉంది. అంతకుముందు వచ్చిన అన్ని ప్రభుత్వాలనూ- తమకున్న సంఖ్యాబలం వల్లనైతేనేమి, కాంగ్రెస్ - ప్రభుత్వం ఏర్పాటుకు తిరస్కరించడం వల్లనైతేనేమి, జస్టిస్ పార్టీయే పాలన సాగించింది.[30] తాను అదినుండి ఏ ఉద్యోగావకాశాల కోసం పోరాడిందో దానికి సంబంధించిన కమ్యూనల్ జీ. వో. ను తెచ్చింది దీని తర్వాత జస్టిస్ పార్టీలో ముసలం ఆరంభమైంది. సి. ఆర్. రెడ్డి, రెడ్డినాయుడు మొదటి నుండీ ఈ పార్టీలోని ప్రతిపక్షంలో ఉండేవారు. జమీందార్ల మధ్య కుమ్ములాటలు అధికమయ్యాయి. నాయకుల నిరంకుశ ధోరణులను సామాన్య సభ్యులు ఎదిరించడం ఆరంభించారు. అనేక మంది కాంగ్రెసులో చేరారు.[31] జస్టిస్ పార్టీ ఉద్యోగాల కోసం ఏర్పడ్డది తప్ప; దీనికొక ఆర్థిక, రాజకీయ కార్యక్రమం లేదనీ, ప్రజా పునాది అసలే లేదనీ సభ్యుల్లో నిరాశ ప్రబలింది. ఈ తగాదాల కాలంలో బ్రాహ్మణేతరుల్లో అటు పాండిత్యంలోను, ఇటు ప్రతిభలోనూ - బ్రాహ్మణులతో సమాన ఉజ్జీ ఎవరని వెతికితే ఆ నాయకులకు ధర్మారావు కనిపించాడు. అప్పటికే జమీందార్లతో సన్నిహిత సంబంధాలుండడం, సాహిత్య వాదోపవాదాలలో తనదంటూ ఓ ప్రత్యేక ముద్రను ఏర్పాటు చేసుకోవడం, ఇతర దేశ భాషా సాహిత్యాలే కాకుండా ఇతర విషయాల్లో కూడా అశేష పరిజ్ఞానం కలిగి ఉండడం, అన్నిటినీ మించి అంతకు పూర్వం బొబ్బిలి రాజాకు అంతరంగిక కార్యదర్శిగానూ, మేనేజరుగానూ పనిచేయడం అన్నీ కల్సి 'సమదర్శిని' సంపాదకత్వ బాధ్యతను ధర్మారావు భుజస్కంధాల మీద జస్టిస్ పార్టీ పెట్టింది. ఉప సంపాదకులుగా రామబ్రహ్మం చేరారు.[32]

కమ్మ చరిత్ర రాయమని గూడవల్లి రామబ్రహ్మం, కొసరాజు రాఘవయ్య, సముద్రాల రాఘవాచార్యులను ఒల్లపల్లి సంపిణీశు అని సాగక కొంత కాలం రామబ్రహ్మం 'సమదర్శిని'లో పనిచేశారు. ముందు ఉప సంపాదకులూ ఆ తర్వాత సంపాదకులుగా. అప్పుడు అది ద్వైవార పత్రిక.[34] ఆంధ్ర పత్రికను ప్రభుత్వం కొంత కాలం నిషేధించింది. ఆ కాలంలో ధర్మారావు 'సమదర్శిని'కి సంపాదకులుగా పనిచేశారు. అప్పుడు దీన్ని కొద్దికాలం దిన పత్రికగా మార్చి నడిపారు. సమదర్శిని జైళ్లలో ఉండే కాంగ్రెసు వాళ్ళకు సత్యాగ్రహ వార్తలను అందించే ఏకైక పత్రికైంది. ఇందువల్లే డా॥ పట్టాభి జైలు నుండి విడుదలై రాగానే ధర్మారావును అభినందించారు. అందులో

ఉండగా తన వచన రచనలను, కథలను కొన్నిటిని ప్రచురించారు పారిజాతాపహరణానికి భావ ప్రకాశిక వ్యాఖ్య ఇందులోనే రాశారు. ఈ సంచికలు పూర్తిగా నాకు దొరకలేదు. ధర్మారావు రచనలున్నా బాగా లున్నాయి. వాటిని పరిశీలిస్తే భాష సరళ గ్రాంథికం. జస్టిస్ పార్టీ రాజకీయ ప్రచార వేదికగా ఇది ఉన్నా సాహిత్య పరంగా చూస్తే మౌలిక రచనలెన్నో అందులో అచ్చవుతుండేవని గొర్రెపాటి వెంకట సుబ్బయ్య దాఖలాగా చెప్తున్నారు. చలం రాసిన 'రెడ్డిరంగమ్మ', ముద్దుకృష్ణ రచనలనేకం, పురిపండా, మంగిపూడి వారి కవిత్వాలూ, ఉన్నవవారి వ్యాసాలు వస్తుండేవి. అనేక విషయాలకు సంబంధించిన ఛాయా చిత్రాలు కూడా అచ్చేసేవారు. అప్పటికి జనంలో ప్రచారమున్న పత్రికలు ఆంధ్రపత్రిక, సమదర్శని.[35]

జస్టిస్ పార్టీలో ముఠా తగాదాలు బజారున పడడం ఆరంభించాయి. చల్లపల్లి రాజా, మీర్జాపురం రాజాలు కృష్ణా జిల్లా బోర్డుల ఆధిపత్యానికి పట్టే కుస్తీపట్లు 1926 నుండే ఉండేవి. ఇది ప్రధానంగా కమ్మ - వెలమల రణ రంగం. అప్పటినుండీ ఇది చిలికి చిలికి గాలివానగా మారి 1932 నాటికి చీలికగా బయటికొచ్చింది. చల్లపల్లి రాజా ప్రజామిత్ర పక్షాన్ని పెట్టాడు. అప్పటివరకు జస్టిస్ పార్టీలో ప్రధానంగా ఉన్న బడా భూస్వామి అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య పార్టీనుండి బయటికొచ్చాడు. కాంగ్రెసులో చేరాలంటే రానివ్వరు. చల్లపల్లి రాజాతో కలిశాడు. ఈ ప్రజామిత్ర పక్షానికి ఓ పత్రిక ఉండడం అవసరమని భావించి ఆ పేరుతోనే 'ప్రజామిత్ర' పత్రికను నెల కొల్పారు. కొంతకాలం అవటపల్లి నారాయణరావు సంపాదకత్వంలో బెజవాడ నుండి వచ్చి తర్వాత మద్రాసుకు మారింది. జాగర్లమూడి కుప్పుస్వామి ఆలోచన మేరకు గూడవల్లి రామబ్రహ్మంను సంపాదకుడుగా నియమించారు. కుప్పుస్వామితో ఉన్న పరిచయంవల్లనే రామబ్రహ్మం మొదట జస్టిస్ పార్టీలో ఉంటూ సమదర్శినికి సంపాదకత్వాన్ని వహించాడు. ఆ కాలంలోనే నాటి[36] అనే పత్రికలో కూడా రచనలు చేస్తూండేవాడు. అప్పటికే ఒకరకంగా కమ్మ చరిత్ర అనతగ్గ 'గండికోట పతనం' నాటకం రాసి తెలుగు పాఠకుల్లో మంచి రచయితగా పేరు పొందాడు రామబ్రహ్మం

## ప్రజామిత్ర సంబంధం

రామబ్రహ్మం సంపాదకత్వంలో 1932 నుండి ప్రజామిత్ర మద్రాసు నుండి రావడం ఆరంభమైంది. ధర్మారావు, రామబ్రహ్మం సమదర్శినిలో ఉన్నప్పటినుండీ వారెక్కడుంటే అక్కడొక సాహిత్య వేదికను తయారు చేసుకుంటూండేవారు. ఇప్పుడు రంగం మారింది. అంతే. ప్రజామిత్ర కార్యాలయం మొదట్లో మిడ్‌లాండ్ థియేటర్ దగ్గర ఉడ్స్‌రోడ్‌లోనూ, తర్వాత ఆచారప్పన్ వీధిలో బి. ఎన్. కె. ప్రెస్ మేడమీదా ఉండేది. ఇక్కడ తాపీ, సముద్రాల రాఘవాచార్య, కపిల కాశీపతి, నార్లవెంకటేశ్వరరావు, గోపీచంద్, కొసరాజు రాఘవయ్య, ఎస్. వి. ఎస్. రామారావు, బి. యన్. రెడ్డి, శ్రీనివాస శిరోమణి లాంటి ప్రముఖులందరూ కలవడం, వివిధ విషయాల మీద చర్చలు సాగించడం చేస్తూండేవారు. వాటిని వ్యాసాలుగా పత్రికలో అచ్చేస్తూండేవారు. రామబ్రహ్మం, ధర్మారావుని గురూజీ అని బ్రదర్ అనీ చాలా గౌరవంగా సంబోధిస్తూండేవాడు. ఉత్తరాల్లోకూడా గురూజీ అని రాసేవాడు. ఒక రకంగా అప్పటికి అపారమైన జీవితానుభవంతో, ధర్మారావుగారే ఒక సందర్భంలో కొత్త పాళీలో అన్నట్టు 'తలబరువు'తో (అనేక విషయాలను బుర్రకెక్కించుకున్నందుకే ఈ బరువు) వాళ్ళందరికీ ధర్మారావు గురుస్థానంలోనే ఉండేవాడు. సింహ తలాటాలూ, గండ పెండేరాలవాళ్ళతో అప్పటికే సాహిత్యపరంగా ఢీకొన్నాడు గూడానూ.

ఈ ప్రజామిత్రలో నార్ల, ఆంధ్ర శేషగిరిరావు, ముద్దా విశ్వనాథం, బోయి భీమన్న, ఎ. వి. సీతారామయ్య, కుర్రా సుబ్బారావులే కాకుండా పైన సాహితీ చర్చల్లో పాల్గొనే వారంతా ఒకరకంగా పనిచేసే వారనే అనవచ్చు. ధర్మారావుకప్పుడు కుదురైన ఉద్యోగం లేకపోవడం, మధ్యలో మందసా నౌకరీ చేసినా మద్రాసు సంబంధం వదులుకోకపోవడంతో 'ప్రజా మిత్ర'కూ ధర్మారావుకూ విడదీయరాని సంబంధం ఉండేది. పత్రికలో రచనలను వేయడానికి తయారు చేసుకునే ప్రణాళికలో గూడా ధర్మారావు చెయ్యి ఉంటూండేది.

భాషాపరంగా ధర్మారావు మారుతూన్న కాలం ఇది. భావాల విషయం శ్లోకూ అంతే. రాజకీయాభిప్రాయాలకంతగా ప్రాధాన్యం ఇవ్వకున్నా జస్టిసు

పార్టీ మీద మోజు పోయింది. బ్రాహ్మణేతర ఉద్యమంలోని సంస్కరణ, సాంస్కృతిక పరమైన భావాలు మరింత స్ఫుటం అవుతున్నాయి. లోకజ్ఞానం, హేతువాదం; వీటికి ఊతమిచ్చిన వేదం వెంకటాచలయ్య స్నేహం ధర్మారావు మార్పుకు బాగా తోడ్పడ్డాయి. ధర్మారావు సాహచర్యం - అప్పటికే సాహిత్య రంగంలో చలంలాంటి వచన రచయితలు లేపిన దుమారం, ప్రజల్లో అలాటి సరళమైన వచనానికున్న ఆదరం, అన్నీకలగల్సి రామబ్రహ్మంగారినీ మార్చేశాయి. ప్రజామిత్ర అందుకు దర్పణం పట్టింది. మారిన ధర్మారావుగారని తెలుగుదేశానికి పరిచయం చేసిన ఖ్యాతి ప్రజామిత్రదీ దాని సంపాదకుడు రామబ్రహ్మనిదీనూ.

ధర్మారావు కొత్త పాళీ వ్యాసాలనూ (1936), దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకన్న వ్యాసాలనూ (1936) ప్రజామిత్ర ప్రచురించింది. రచయిత పేరు చివరిదాకా తెలియచెయ్యకుండా వీటిపై విమర్శలను ఆహ్వానించి, వాటినీ ప్రచురిస్తూ ధర్మారావులో భావ పరివర్తనకు స్పష్టత వచ్చేలా చేసింది. పత్రికా విమర్శనారంగంలో కొత్త వరవడిని పెట్టింది. ఆ రోజుల్లో ఈ పత్రికకు ప్రజల్లో ఉన్న ప్రాచుర్యాన్ని అర్థం చేసుకోడానికి రచయితా చిత్రకారుడూ అయిన సంజీవదేవ్ వాక్యాలు సహకరిస్తాయి. "ఎందరెందరో సాహితీరథులు, మహారథులు అందులో రాస్తూండేవారు. వారిలో తాపీ ధర్మారావు రచనలు మాకెంతో ఆకర్షకంగా ఉంటూండేవి .....ప్రజామిత్రలో కేవలం సాహితీ రచనలు మాత్రమే కాక సనాతనులకూ, సాంప్రదాయికులకూ, అంధ విశ్వాసకులకూ దెబ్బ తగిలించే ఎన్నో భావ విప్లవానికి సంబంధించిన రచనలు వెలువడుతూండేవి."

విశ్వనాథ సత్యనారాయణను ఎత్తి పొడుస్తూ 'వారి ముచ్చిలి గుంటలో మూడో కన్నుంద'ని ఒక వ్యాసంలో డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు విమర్శించారు. అలాగే మద్రాసులో స్థానం వారో నాటక ప్రదర్శన ఇచ్చారు. అందులో జరిగిన వ్యవహారాలను వెల్లడిస్తూ 'స్థానంవారి కుంభకోణం' అనే శీర్షికతో ఒక వ్యాసం రాశారు. ఇలాంటి గుండె బెదురులేని ప్రచురణలతో ప్రజామిత్ర నాటి సంచలన పత్రికగా ఉండేది. అలాటిదే మరో వ్యాసం "ధనవంతులకే ధర్మానుపత్రులు" అన్నది.

మద్రాసుకు ఆరోజుల్లో కవులూ-కళాకారులూ - రాజకీయ వేత్తలూ ఎవరొచ్చినా ప్రజామిత్ర కార్యాలయంలో సభ ఉండాల్సిందే 1940 జనవరి 15న గిడుగువారు ఇక్కడ జరిగిన సభలోనే తెలుగు ప్రజలకు 'తుది విన్నపం' చేశారు. ఎం. ఎన్. రాయ్ 1941 ఆరంభంలో మద్రాసొచ్చినప్పుడు ఈ కార్యా

లయంలోనే ఒక సభ ఏర్పాటు చెశారు. అందులో "హిట్లరు సోవియట్ మీద విరుచుకు పడ్తాడని రాయ్ అంటే' ఖాసా సుబ్బారావు తదితరులు అలా జరగ దని వాదించారు. అతి కొద్దికాలంలోనే అది జరిగింది. ఈ కార్యాలయంలో రాయిష్టులు తరుచూ కలుసుకుంటూండేవారు. రాజకీయ, సామాజిక అంశాల మీద చర్చిస్తూ ఉండేవారు. ఈ కార్యాలయింలో నిత్యం కలిసే సాహితీ వర్గంలో తాపీ ధర్మారావు, గిడుగు సీతాపతి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, గోపీచంద్, కొడవటిగంటి, మల్లాది వెంకట విశ్వనాధ శర్మ ఉండేవారు. పత్రిక కోసమే పెట్టారన్నట్టు బి. ఎన్. రెడ్డి - బి.ఎన్.కె. ప్రెస్ స్థాపించాడు. బి.ఎన్. రెడ్డి ఇంట్లో ధర్మారావు అద్దెకుంటూండేవాడు. ఈ పత్రిక ఇంతటి సాహిత్య - రాజకీయ చైతన్యంతో సుమారు పది సంవత్సరాలు నడిచింది. రామబ్రహ్మం - ధర్మారావుల పరిచయం క్రమంగా ఆ తర్వాత ఇద్దర్నీ సినిమా రంగానికి బదిలీ చేసింది. సాంఘిక సమస్యలతో మాలపిల్ల, రైతు బిడ్డలను వీరిచేత తీయించి చిత్రసీమలో విప్ల వాన్ని రేకెత్తించింది.

జస్టిసు పార్టీలో తలెత్తిన కులాల తగాదాలు, కృష్ణాజిల్లా బోర్డు ఎన్ని కల్లో బయటపడి మీర్జాపురం రాజా - చల్లపల్లి రాజాల తలపట్టుగా మార టంతో, ప్రజామిత్ర పక్షం 'ప్రజామిత్ర' పత్రిక నెలకొల్పడం జరిగింది. ప్రతి శుక్రవారం వెలువడేది. దీనికి చల్లపల్లి రాజా ఆశీర్వాదమూ, బోడపాటి రామలింగం సంపాదకత్వంలో అప్పుడే వచ్చిన 'దేశసేవ'కు మీర్జాపురం రాజా అండదండలుండడం పత్రికాలోకానికి తెలిసిందే.

ఇది ఇలా ఉండగా రాష్ట్రంలో ఎన్నికలు వచ్చాయి. జస్టిసు పార్టీ అధికారంలో ఉంది. బొబ్బిలి రాజా ముఖ్యమంత్రి. వీరికి అపర చాణక్యుడన్న పేరు ఉండేది. నిరంకుశుడు. వీరితో అభిప్రాయ భేదాలున్న పిఠాపురం రాజా ఈ ఎన్నికల తరుణంలో జస్టిసు పార్టీ నుండి విడిపోయి పీపుల్స్ పార్టీని స్థాపించాడు. కొన్ని సంస్కరణలతో 1935లో వచ్చిన చట్టాన్ని ఆధారంగా చేసుకుని ఈ ఎన్నికలు 1937లో జరిగాయి తమ పార్టీకి ఎన్నికల ప్రచారం కోసం పత్రికలను నడుపుదామని ఆశించారు పిఠాపురం రాజావారు. ఇంగ్లీషు, తమిళం, తెలుగుల్లో ఆరంభించారు.

పత్రిక పేరు 'జనవాణి' అనే పెట్టారు 37 జస్టిసు పార్టీలో ఉన్న బ్రాహ్మణేతరుల్లో కూడా - అవకాశ మొచ్చినప్పుడల్లా అధికారం చేజిక్కించు కున్న కులం మిగిలిన బ్రాహ్మణేతర కులాలను హీనంగా చూస్తూండేది.

ఆనాడు రాష్ట్ర రాజధానిలో చెప్పుకోతగ్గ పార్టీలు కాంగ్రెసు, జస్టిసు పార్టీలే. మొన్న మొన్నటిదాకా జస్టిసు పార్టీలో బ్రాహ్మణులకు తావుండేది కాదు. ఇది అన్నిజాతులకూ, వర్ణాలకూ, కులాలకూ ప్రాతినిధ్యం వహిస్తూందంటూ - మనోవాక్కాయకర్మలా - అన్నా ఇందులో కూడా బ్రాహ్మణేతరుల్లో కూడా ఏ కులానికి అవకాశం చిక్కినప్పుడు ఆ కులమే ఆధిపత్యం నెరపాలనుకుంటోంది. నాయకుల్లో ఈ స్వభావం ఉంది. జస్టిసు పార్టీ వ్యాప్తి ఇలా అయితే జరగదు." అన్న ప్రజామిత్ర 'నా డైరీ' లో విషయాలు మరింత విపులంగా వివరిస్తాయి.[38] ఇలాంటి పరిస్థితుల్లో తెచ్చి పెట్టుకున్న జాతీయ ఉద్యమ భావాలెన్ని రకాల రంగులు వేసి పూసుకున్నా జస్టిసు పార్టీ పోకడ లెక్కడకు పోతాయి? జమీందార్లు - భూస్వాముల మధ్య ఉండే వైరుధ్యాలు క్రమంగా ఉపరితలానికి రావడం ఆరంభించాయి. కమ్మ - వెలమలకు కుమ్ములాటలు తారాస్థాయి నందుకున్నాయి. కేవలం అధికార ప్రాబల్యం కోసమే పాకులాడడం వల్ల ప్రజల్లో త్యాగదీక్షను పురికొల్పే నాయకత్వం లేనందువల్లా జస్టిసు పార్టీ చీలికలు వాలికలైంది.[39] ఆ చీలికల్లో పేలికే ఈ పీపుల్స్ పార్టీ. దీనికి గొప్ప ఆదర్శాల దుస్తులే వేశారు. రైతులకూ జమీందారులకూ మధ్య ఉన్న వైషమ్యాలను తగ్గించి రైతులకూ జన సామాన్యానికీ మైత్రి సమకూర్చడం, బ్రాహ్మణేతర ఉద్యమాన్ని బలపర్చడం, కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ప్రతిఘటించకుండా క్రమంగా స్వరాజ్యం కోసం కృషిచేయడం- అని. సామాన్య జనాన్ని ఈ ముసలి పులి ఎంత ఆపుతోలు కప్పుకున్నా మోసగించలేక పోయింది. అప్పటికే వామపక్ష పార్టీలు, రైతులూ యువజనులను వాళ్ళ సమస్యల మీద సంఘటిత పరుస్తూ జమీందార్లకూ - రాజాలకూ ఎదురు నిలబెడ్తున్నాయి. కాంగ్రెసు కూడా 1930 ఉద్యమాలనుండి జనంలో తీవ్రంగా ప్రభావం చూపిస్తూ సామాన్యుల్లో మధ్య తరగతి ప్రజల్లో దేశ స్వాతంత్ర్యానికి కాంగ్రెసు తప్ప మరో గత్యంతరం లేదన్న అభిప్రాయాన్ని కల్గించింది, జస్టిసు పాలనలో సామాన్యుల్లో కులాలకు ఎదురుగా కులాలను పోటీ పెట్టి రాజాలు వింత చూస్తున్న చేదు అనుభవం ఉంది. ఇన్నిటితో 1937 ఎన్నికల్లో మద్రాసు సభలో ఉన్న 215 స్థానాల్లో 159 కాంగ్రెసు గెల్చుకుంది. జస్టిసు పార్టీ, పీపుల్స్‌పార్టీ ఘోరంగా ఓడిపోయాయి. కృష్ణా జిల్లా బోర్డు రాజకీయాల పరిధికే అంకితమైన ప్రజామిత్ర పక్షం గతీ అంతే అయింది. నాయకులైన జమీందార్లే కొద్ది స్థానాలను డబ్బూ, దర్పంతో గెల్చుకున్నారు. పుఖలో పుట్టి పుబ్బలో మాడినట్టుగా పీపుల్స్ పార్టీ తెరమరుగైంది.

అయితే ఎన్నికల రణరంగం కోసమే 'జనవాణి' దిన పత్రికగా ఆ కొద్దికాలం నడిచింది. అప్పటికి ధర్మారావు మందసా ఉద్యోగం వదిలేసి మద్రాసొచ్చేశారు. ప్రజామిత్ర రచయితల గ్రూపులో ఉంటూ ఒక రకంగా నాయకుడు గౌరవం పొందుతూండేవారు. జనవాణికి సంపాదకుడెవరుండాలన్న సమస్య నిర్వాహకులకు ఎదురైనప్పుడు తాపీవారి పేరే దాని నాయకులకు తట్టింది. జర్నలిస్టుగా అనుభవం, సాహిత్య లోకంలో గౌరవం, కొత్తపాళీ, దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకన్న వ్యాసాల ద్వారా కలిగించిన సంచలనం, అనేక విషయాల్లో కూలంకషమైన పరిచయం ఉండడం[40] అన్నిటికీతోడు ఏ ఉద్యోగం లేక ఖాళీగా ఉండడంతో జనవాణికి సంపాదకుడుగా ధర్మారావును నియమించారు. అప్పటికి తెలుగులో దినపత్రికగా ఆంధ్ర పత్రిక మాత్రమే బాగా పేరు సంపాదించింది. ధర్మారావు చేతికి 'జనవాణి' రావడంతో వారిలో అంతవరకూ దాగి ఉన్న నిజమైన పత్రికారచయిత ఊపిరి పీల్చుకున్నాడు. తన భావాలను జనవాణి ద్వారా ప్రచారం చెయ్యడానికి చక్కని అవకాశం దొరికిందనుకున్నాడు. తన ఆశయాలకు అనుగుణంగా ఈ పత్రికను తీర్చిదిద్దాలనీ, పత్రికారంగంలో మైలురాయిగా నెలకొల్పాలనీ నడుంకట్టాడు. కృతకృత్యుడయ్యాడు. ముఖ్యంగా దినపత్రికలో వ్యావహారిక భాషను ప్రవేశపెట్టి ఒక ప్రత్యేకతను సంతరించిపెట్టాడు అదేమిటి ఎలాగని తెలుసుకోవాలన్నా, ఏ స్థాయిలో ఆ ప్రత్యేకత ఉందని అర్థం చేసుకోవాలన్నా అంతకు పూర్వం నుండీ వచ్చిన పత్రికలనూ, వాటి పుట్టుపూర్వోత్తరాలనూ, తీరుతెన్నులనూ -శాఖాచంక్రమణం అనిపించినా-స్థూలంగానైనా పరిశీలించడం అవసరం.

## పత్రికలూ - పుట్టుపూర్వోత్తరాలు

విద్యావ్యాప్తి అవుతున్న తొలిరోజుల్లో - అదీ అచ్చు యంత్రాల ఆవిర్భావంతో[41] - తెలుగు జనంలో పుస్తకపఠనాసక్తి పెరిగింది. దీంతో సంప్రదాయ వాదుల్లో ప్రాచీన కావ్యాలమీద అభిరుచి ఎక్కువైంది. ఇక సామాన్యుల్లో కూడా చదువుకోడానికి ఏదో ఒకటి కావాలన్న తపన ఆరంభమైంది. దీనితో 'పుస్తకాల గుజిలీ' ఒకటి ఏర్పడింది. గుజిలీ అంటే మార్కెట్టు. ఇది 'గంజ్' నుండి వచ్చింది. అంటే మార్కెట్టు. పన్ను కట్టి

మార్కెట్టులో విడుదల చేసే సరుకును గుజిలీ అంటారు. కనుక కొత్తగా అచ్చు యంత్రాలు పెట్టిన వాళ్ళు గుజలీ గ్రంథాల ప్రచురణ ఆరంభించారు. గుజిలీకి గిరాకీ పెరగడం సహజ లక్షణం. దానికి ఆదిలో భారత, రామాయణాది కావ్యాలను వచనంలో అనువదించి గుజిలీ కందించడం మొదలైంది. (గుజరీ, గుజిరీ, గుజిలీ అని వాడుకలో ఉన్నాయి.) అందుకే నాటి వచన గ్రంథాలు నాటి వ్యావహారిక భాషలోనే ఉన్నాయని గిడుగువారన్నది. గుజిలీ అన్నప్పుడు దానికి మూలమైన ఐరోపా మార్కెట్టు లక్షణాలన్నీ సహజంగానే మనకూ వస్తాయి. కనుకనే కొత్త ప్రక్రియల ఆవిర్భావం గుజిలీకి అవసరమైంది. ఆదశలో వచ్చినవే కథలు. చార్‌దర్వేష లాటివి. కొంత కాలం తర్వాత కల్పనా చమత్కృతి ఉన్న పెద్ద కథలు - క్రమంగా నవలా రూపంలోనూ; వ్యాసాలుగానూ, ప్రపంచపు వింతలూ- విడ్డూరాల ప్రతిబింబాలుగా అవతరించి గుజిలీ కొచ్చాయి. ఈ దశలో తెలుగులో గ్రంథమాలలొచ్చాయి. ధర్మారావు తన శక్తిని ఈ గ్రంథమాల ప్రచురణల ద్వారా వచనంలో పరీక్షించుకున్నాడన్నది తెలిసిందే.

వీటితోపాటే పత్రికారంగం కూడా ఆరంభమైంది. జర్నల్ అంటాము. 'జోర్' అంటే 'డెయిలీ అకౌంటు' అని అర్థం. పూర్వకాలంలో రోజువారీ వృత్తాంతాలు తెలిపేదాన్ని 'జర్నల్' అని అనేవారు. అదే నేడు రూఢైంది. రాజరికం ఆవిర్భావంతో వార్తా లేఖలూ (బులెటిన్స్) వచ్చాయి. పరిపాలనా సౌలభ్యం కోసం ఏయే వృత్తి పతనాభ్యుదయాలెలా ఉన్నాయో తెలిసికోవడం పాలకులకవసరం. అయితే వృత్తులు పాలకుల చెరనుండి విడివడినప్పుడు వృత్తి వృత్తాంతం తెలుసుకోవాలన్న ఆసక్తి ప్రజలకూ కలిగింది. అంటే యూరపులో రాజరిక వ్యవస్థకు పరిమితులేర్పడి, పారిశ్రామిక నాగరికతా ప్రజాస్వామ్య భావాలకు పునాదులు పడినప్పుడు పత్రికలావిర్భవించాయి. పత్రికలకు ఇతర భాషల్లో ఎలాంటి నిర్వచనాలున్నా తెలుగు పేరు మాత్రం సర్వసమగ్రమైన నిర్వచనమిస్తుంది. వార్త అంటే వృత్తికి సంబంధించిన సమాచారం.

"వార్త యందు జగము వర్తిలుచున్నది  
యదియు లేనినాడు యఖిల జనులు  
అంధకార మగ్నులగుదురు గావున  
వార్త నిర్వహింప వలయు బతికి'' -- భారతం.

జనాభ్యుదయానికి వృత్తులు మూలాధారాలైనపుడు ఆ వృత్తుల సమాచారం తెలుసుకోడానికి అటు పాలకులూ - ఇటు పౌరులూ తమ తమ కారణాలతో ఆసక్తి చూపడం సహజం.

ఈ సమాచార వ్యాప్తికి రెండు ప్రధాన సాధనాలున్నాయి. ఒకటి అచ్చు యంత్రం. రెండు వార్తల సేకరణకూ, పంపిణీకీ ఆవశ్యకమైన రవాణా సౌకర్యాల పెంపు. ఇవి పుట్టినప్పుడే పత్రికలూ పుట్టాయి. ఏ దేశమైనా అప్పుడే పత్రికలను చూసింది. మన దేశం కూడా అంతే.

పత్రికకు ప్రధాన లక్షణం వృత్తి సమాచార ప్రసారమన్న భావాన్ని పత్రికాధిపతులు క్రమక్రమంగా గుర్తిస్తూ వచ్చారు. దీని ననుసరించే నాటినుండీ నేటివరకూ పత్రికల పరిణామాన్ని మూడు ఘట్టాలుగా విభజించవచ్చు.

1. ఆంగ్ల ప్రభుత్వం - తొలినాళ్లు
2. విద్యావ్యాప్తి కాలం
3. జాతీయోద్యమ దశ.

మొదటి దశను తీసుకున్నప్పుడు నాటి పత్రికల ఉద్దేశం ప్రభుత్వం చేసే పనులు ప్రజలకు వివరించడం - ప్రజల కార్యక్రమాలనూ కోరికలనూ ప్రభుత్వం గమనించడం అన్న రెండే ప్రధానాశయాలుగా ఉండేవి. 1838 లో మద్రాసు ప్రభుత్వం తెలుగు అనువాదకుడికి జారీ చేసిన ఈ ఉత్తర్వు చూస్తే మన నమ్మకం దృఢమవుతుంది.

"Newspaper Teloogoo "the 'virittanthy' to be supplied to Teloogoo translator who is to report to Government any important information contained in it.

Resolution No. 1921 - resolved that instructions be issued for the supply of the Teloogoo newspaper called 'Virittanthy' to the Teloogoo translator to government who will communicate by memorandum to the Chief Secretary any important information which it may from time to time be found to contain"[42]

ఈ 'వృత్తాంతిని' పత్రిక 1838 లో మండిగల వెంకట్రాయశాస్త్రి సంపాదకత్వంలో రాబోతోందంటే ప్రభుత్వం ముందునుండే పై రూపంలో నిఘా వేసింది.

ఆయా పత్రికల్లో గవర్నరు, వైస్రాయిల నిర్ణయాలనూ సీమ వార్తలనూ అనువాదకుల చేత అనువాదం చేయించి అచ్చేసేవారు. అటువంటి హామీని కూడా పత్రిక స్థాపనకు పూర్వం తమ ప్రాస్పెక్టస్‌లో పత్రికాధిపతి ఇచ్చేవాడు.

తెలుగులో మొదటి పత్రిక 'మద్రాసు క్రానికల్' ను స్థాపిస్తామంటూ ఏ. వాదిశైవ, టి విశాఖ పరుకలయ్యవార్లు, టి. శామన్న పెరుమాళ్లయ్య,[43] కాన్‌స్టెంటైన్ శాంపి అనే నలుగురు 1832 అక్టోబరు 21న గవర్నరుకు విజ్ఞప్తి

చేసుకుంటూ అనుమతి కోసం రాశారు. అందులో - "Skilful translators will be employed to translate the most interesting articles from European Journals ..." అనికూడా రాసి హామీ ఇచ్చారు. దీన్ని గురించే కావచ్చు రెవరెండ్ జె. లాంగ్ 1859 లో బెంగాల్ ప్రభుత్వానికొక నివేదిక రాస్తూ, తెలుగులో మొదటి వార్తాపత్రిక 1833 లో వచ్చిందని పేర్కొన్నాడు.44 దీని పేరు మాత్రం రాయలేదు.

ఆరోజుల్లో పాలకుల దృష్టిలో ప్రధాన వృత్తి పరిపాలన. కనుక ఆ వృత్తే వార్తగా చలామణీ కావడం - ప్రచారానికి రావడం జరుగుతూండేది. 'నేటివ్' ల విశేషాలూ ఉంటూండేవి. ఇవన్నీ ప్రజలకు తెలియపర్చడమే వాటి ఆశయం. కనుక ఎలాంటి భాషలో పత్రికలుండాలన్న పట్టుదలా ఉండేది కాదు. ప్రజలకు అర్థమయ్యే వాడుక భాషనే పత్రికలుపయోగించేవి.

చరిత్రకు తెలిసిన రెండో తెలుగు పత్రిక 'వృత్తాంతిని.' ఇది 1838 నుండి 1842 వరకూ వచ్చి ఆగిపోయింది. దీనిలోని భాషకు సాక్ష్యంగా బ్రౌను సేకరించి పెట్టిన జాబును (బంగోరె తన పుస్తకంలో ఇచ్చారు.) చూడవచ్చు. 1841 ఫిబ్రవరి 4న 'వృత్తాంతిని' చందాదారుడు వార్తను సంపాదకుడికి లేఖ రూపంలో రాశాడు. రాజమండ్రిలో జరిగిన పెండ్లిళ్ళలో అయ్యే దుబారా ఖర్చును గురించింది ఈ లేఖ.

"మహారాజశ్రీ వృత్తాంతి యిడీటరు గారి సముఖానకు -

అయ్యా,

ఈ తైనెల పుట్టిన వెనక మన వారిలో పెద్ద మనుష్యులుగా వుండేవారి యిండ్లలో పెండ్లిండ్లు జరిగినవి. వాటిలో రెండు మూడు ఇండ్లకు నేను వెళ్ళి యుంటిని. ....... .. కచేరీ పందిలి నాట్యం పీటిని నిలిపితే - యిందుకు గాను వృధా శలవయ్యే మొత్తాన్ని దానధర్మముల కింద అగత్యంగా శలవు చేతురనేదానికి నేను సందేహించలేదు". ఇక కచ్చేరీ గురించి రాస్తూ "రాత్రులలో నిండాప్రొద్దు పొయ్యేవరకు మేలుకుని యుండడము చేత యింటి యజమానుడికిన్ని కచ్చేరికి వచ్చేవారికిన్ని నిద్రాభంగమై శరీర సౌఖ్యం తప్పిపోతున్నది........ ." "ముఖ్యమైన కీడు ఏమంటే కచ్చేరి చేస్తూ యుండేటప్పుడు యిదివరకు స్త్రీల ముఖం చూడని పిల్లకాయలు కొందరు వచ్చి కూర్చుంటారు. వారు యీవరకున్ను విద్యార్థులై చదువుకొంటున్ను, యీ లోక వ్యాపారాలు యేదిన్ని తెలియనటువంటివారుగానున్ను వుండి వున్నారు. యీ కచ్చేరికి వచ్చిన వెనక యిక్కడ నర్తనం చేస్తూ యుండే దాసీ కన్యను

చూచిన్ని నటిస్తూ యుండేటప్పుడు దాని నానా విధ వ్యాపారాలనున్ను చూచి అది పాడే శృంగార పదాలనున్ను వినగా యితనికి యీవరకున్ను తెలిసి యుండని కొన్ని వ్యాపారాలనున్ను చేష్టలను నేర్చుకొంటారు . ...... .."

"గనక యికమీదను పెండ్లిండ్లు చేసేవారు కచ్చేరి పందిలి వేసి అక్కడికి దాసీలను రప్పించి నాట్యము చేయించేది మాని45" - అని ఉంది.

వృత్తాంతిని ఆగిపోయిన వెంటనే 1842 జూన్ 8న 'వర్తమాన తరంగిణి' పువ్వాడ వెంకటరావు ఎడిటర్‌గా వచ్చింది. దీనిలో భాషకూడా వాడుకభాషే. 1842 ఆగస్టులో ఎడిటర్‌కు మండిగల వెంకట్రాయశాస్త్రి రాసిన వార్తా లేక కడపలో జరిగిన అగ్ని ప్రమాదం గూర్చిన వార్త, - మశిడి వ్యాధి వచ్చిందన్న వార్త - ఇలా ఉంది.

"ఇందువల్లనున్ను కర్నూలు మొదలయిన ప్రాంత్యములలో సంభవించి యుండే ప్రకారం యీ జిల్లాతోచేరిన ప్రొద్దుటూరులోనున్న వుపగ్రామాలలో నున్ను మశిడి వ్యాధి సంభవించి అనేక మంది నష్టమయినట్లు వినబడడము వల్ల బహుమంది విచారపడుతూ వున్నారు..........." "ఇక్కడ జరిగే ఇంక కొన్ని సంగతులున్ను తమ యెడిటోరియా గురించిన్ని వెంబడి వ్రాసు కొంటున్నాను."

కడప తమ యిష్టుడయిన
1842 ఆగస్టు తేది ( - ) మం॥ వెం॥ శా.

పత్రికల్లో ఎక్కువభాగం అనువాదాలేనంటూ 'దేరీజ్ నాట్ జనరలీ మచ్ ఒరిజినల్ మాటర్' అని 1856లో తెలుగు అనువాదకుడు జి. డి. సిమ్ పంపిన రిపోర్టువల్ల తెలుస్తుంది.46 ఈ పత్రిక ఒకదశాబ్దం దాకా వచ్చి ఆగిపోయింది. ఈ పత్రికల కాలానికి సంపాదకుడన్న వ్యవహారం లేదు.

రెండో దశ విద్యావ్యాప్తి ఘట్టం. ఈ కాలంలో స్కూళ్ళు, కళాశాలలు, విశ్వ విద్యాలయాలు వెలిశాయి. దేశీయ, విదేశీయ విద్యలు రెండూ ప్రచారంలోకొచ్చాయి. అప్పుడు చదువుకున్న వారి దృష్టిలో విద్యార్జన, విద్యాబోధన అనేవి ప్రధాన వృత్తులుగా ఉండేవి. అప్పటి పత్రికలు ఈ వృత్తిని మాత్రమే ప్రతిబింబిస్తూండేవి. కనుకనే ప్రాచీన కావ్యాలను వెలికి తీసి అచ్చు వేయడం ప్రారంభమైంది. 1853లో ఆలూరి యేకామ్ర జోస్యులు 'వర్తమాన తరంగిణి' పువ్వాడ వెంకట్రావు మొదలైన వారు భారతం ఆది పంచకం అచ్చొత్తించారు 47 దీని సభాపర్వం చివరనున్న రాక్షసనామ సంవత్సరంతో సరి చూస్తే ఇది 1856వ సంవత్సరానికి తేల్తుంది. (ఒంగోరె)48

అదే విధంగా విద్యాలయాలలో చదువుకు పుస్తకాలలో ఎలాటి భాష ఉండాలన్న విషయంలో గూడా చిన్నయసూరి మాటే నిలిచింది. 1842 - 1843 లో పచ్చయ్యప్ప స్కూల్లోనూ, 1846 - 1847 లలో విశ్వవిద్యాలయం స్కూల్లోనూ పనిచేసి 1847 - 1848 లో మద్రాసు యూనివర్సిటీ బోర్డు హైస్కూలు తెలుగు సూపరింటెండెంటుగా చిన్నయసూరి వచ్చాడు. 1857లో మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగుకి ఈ చిన్నయసూరే ప్రధానుడు కావడంతో గ్రాంధిక భాషకు స్థానం వచ్చింది. 1835 లో రావిపాటి గురుమూర్తి శాస్త్రి చాలా సులభ శైలిలో రాసిన 'పంచతంత్ర' కథను పాఠంగా చెప్పిన ఈ చిన్నయసూరే కసితో అప్పుడప్పుడే తలెత్తుతున్న పండిత భాష వంటబట్టిన తలబిరుసుతో 1853 లో నీతిచంద్రిక రాశాడు.

దీనితో ఆ దశలో వచ్చిన ఎక్కువ భాగం పత్రికలలో గ్రాంధిక భాష చాపకింద నీరులా పాకింది. వ్యావహారిక భాష మరుగైంది. ఈ పత్రికల్లో వచ్చిన భాషాపండితుల చర్చలు చూస్తే అసలెప్పుడూ వ్యావహారికంలో పత్రికలు వచ్చి ఉండవన్న నమ్మకం కలిగేలా ఉండేవి. కనుకనే నిడుదవోలు వెంకట్రావు లాంటివారు కూడా వృత్తాంతిసిలో గ్రాంధిక భాషే ఉందని భ్రమ పడడానికి ఆస్కారం కలిగింది. ఈ దశలోనే భాషోద్యమం - సంఘసంస్కరణ అన్నవి ప్రధానాంశాలుగా పెల్లుబికాయి. వీరేశలింగం వరకూ వీటి ప్రచారానికి పత్రికలూ, పత్రికల్లో ప్రచారాలూ కొనసాగాయి. భాష క్రమంగా కఠిన గ్రాంధికం నుండి, సరళ గ్రాంధికం వరకూ కన్పిస్తూండేది. భాష ఇదే విధంగా ఉండడానికి మరో కారణం ఈ పత్రికల్లో చర్చించే సమస్యలు కేవలం విద్యాధిక వృత్తికి చెందినవే అవడం కూడానూ. అందుకే ధర్మారావు రచనల్లో ఈ దశలో వచ్చిన వాటిని పరిశీలిస్తే ఈ ప్రభావమే కనిపిస్తుంది. తాను నడిపిన 'కొండెగాడు'లో సంస్కరణ - భాష వంటి సమస్యలను తీసుకున్నా గ్రాంధికంలోనే రాశాడు. అయితే శైలి మాత్రం అప్పుడప్పుడే ప్రచారానికొస్తున్న వచనం - నాటకాల ఫక్కీలో ఉంది.

మూడో దశ జాతీయోద్యమ దశ. ఇప్పటికి రాజకీయాధికారంలేంది ఏ వృత్తులూ వర్ధిల్లవన్న దావం విద్యాధికుల్లో కలిగింది. అధికారంలో భాగస్వామ్యం నుండి పూర్తి స్వరాజ్యందాకా బిన్నభిన్న రాజకీయ అభిప్రాయాలు స్థిరపడడం ఆరంభించాయి. ఈ లక్ష్యసాధనకోసం దేశీయ వృత్తుల ప్రోత్సాహం, విదేశీ వృత్తుల నిరసనం ఏక కాలంలో ఉద్యమ రూపం దాల్చాయి. ఇప్పుడు వార్త నిర్వచనానికి విస్తృతార్థర వచ్చింది. దాంతో పత్రికల స్వరూపం కూడా మారింది. రాజకీయ వృత్తి నుండి గ్రామీణ వృత్తుల వరకూ సకల

సమాచారం వార్తకు ఆలంబనమైంది. వృత్తి సమాచారమంతా జనసామాన్యానికి అందించడం అవసరం కావడంతోనూ, వ్యావహారిక భాషోద్యమం బాగా వేళ్ళు తన్ని పాదుకోవడంతోనూ వీటిలో ఉపయోగించే భాష విస్తృత ప్రజానీకం ఉపయోగించే భాషగా రూపాంతరం చెందాల్సిన అవసరం ఏర్పడింది. అప్పటివరకూ పత్రికల్లో పాఠ్యగ్రంథాల్లో ఏకఛత్రాధిపత్యం వహిస్తూన్న గ్రాంథికం సరళ రూపం దాల్చక తప్పలేదు. ఆ ఘట్టంలో వచ్చిన తెలుగు దినపత్రిక 'ఆంధ్రపత్రిక'

ఈ కాలంలో జాతీయోద్యమ ప్రభావం వల్ల పుట్టిన అనేక భావాలలో విద్య, ఉద్యోగాల్లో సమానావకాశాలు అందరికీ ఉండాలన్న కోరిక ఒకటి. బ్రిటిషు విద్యా విధానం వల్ల సాంప్రదాయికంగా విద్య ఉద్యోగాలకు అలవాటు పడిన వర్గమే ఎక్కువ లాభం పొందడం, ఉద్యోగాల్లో వారి ప్రాజాపత్యమే ఉండడం గమనించిన కొందరికి వెంటనే స్వాతంత్ర్యం వస్తే అప్పటివరకూ అధికారంగల వర్గం చేతిలోనే రాజకీయాధికారం కూడా కేంద్రీకృతమై మిగిలిన వర్గాలవారికి ఆ అవకాశాలుండవేమోనన్న భయం అంకురించింది. ఆ భావాలున్న జస్టిస్ పార్టీ వారే 'సమదర్శిని' పెట్టారు. సాంఘిక అంశాలన్నీ ధర్మారావుకు ఆమోదయోగ్యమైనవే. అలాంటి అభిప్రాయాలను అప్పటివరకూ అడుగు వర్ణాలుగా ఉండి విద్య నేర్చుకుని అప్పుడప్పుడే పైకొస్తున్న జనానికి తెలియచెప్పాలి కనుక భాష కొంతవరకైనా ఆ జనం భాషగా ఉండాలి. అయినా పత్రిక విద్యావంతుల కోసమే ఉద్దేశించింది. కనుక భాషలో ఇంకా పూర్తిగా మార్పు కనిపించదు. సాహిత్యవ్యాసాల్లో గ్రాంథికంవాసనే. కానీ ఇది ధర్మారావు వచనానికీ, పత్రికారచనకూ ఆకృతి నివ్వడానికి దోహదపడింది.

## వ్యావహారికానికి పట్టం గట్టిన జనవాణి (దిన)పత్రిక

ధర్మారావు పత్రికారచయితగా అనుభవం సంపాదించిన తర్వాతనే పీపుల్స్‌పార్టీవారి 'జనవాణి' ని చేతపట్టారు. పత్రికలో లంక సత్యం, నార్ల వెంకటేశ్వరరావు, పండితారాధ్యుల నాగేశ్వరరావు, కప్పగంతుల సత్యనారాయణ, జి. వి. శేషయ్య, పి. శ్రీరాములు, రమాకాంతరావు, బోయి భీమన్న

ఉపసంపాదకులుగా పనిచేశారు. ఈ పార్టీవారికే ఉండే ఆంగ్ల దినపత్రిక 'పీపుల్స్ వాయిస్'కు కుందుర్తి ఈశ్వరదత్ సంపాదకులుగా, ఎం. చలపతి రావ్ సహాయకులుగా ఉండేవారు. తమిళంలో 'జననాయగం' అనే పత్రికా ఉండేది.

ఎన్నికల వాతావరణం కనుక-రాజకీయాల ప్రసక్తి హెచ్చు మోతాదులోనే ఉంటున్నా అనేక సాంఘిక, సారస్వత విషయాలను 'జనవాణి' తెస్తూండేది. ధర్మారావుకు సంపాదకుడుగా మొదట్లో రూ. 250, నార్లకు రూ. 60 ఇచ్చేవారు. ధర్మారావు దగ్గరకు నిత్యం ఏదో పనిమీద ప్రసిద్ధులైన సాహితీవేత్తలు వస్తూ చర్చిస్తూండేవారు. సైను పంచ, కోటు, కాలర్‌ఖచ్చు షర్టు, తెల్లటి ఉత్తరీయంతో ధర్మారావు ఇతర పత్రికాసంపాదకులకు దీటుగా, హుందాగా సమాన స్థాయిలో ఉండేవారు. నార్ల వెంకటేశ్వరరావు, ధర్మారావు పని విధానం చూసి చాలా నేర్చుకున్నట్టు చెప్పారు. అందర్నీ బ్రదర్ అని పిలుస్తూ ఉత్సాహపర్చే గుణం ధర్మారావుది. చిన్నచిన్న అక్షరాలతో దగ్గరగా రాసేవారు. అందరితో మాట్లాడుతూనే హుషారిస్తూనే సంపాదకీయాలుగానీ, ఇతర జిల్లాల వార్తలకు 'రైటప్' ఇవ్వడంగానీ చేస్తూండేవారు. ప్రతివిషయాన్ని తక్కువ కాలంలో అవగాహన చేసుకుని పూర్వాపరాలను వివరిస్తూ త్వరితంగా చక్కని భాషలో రాసే శక్తి ధర్మారావుకుండేది. పెత్తనానికి లొంగడంకానీ, పెత్తనం చెయ్యడం కానీ ధర్మారావు ప్రవృత్తి కాదు. సంపాదకీయాలెప్పుడూ ధర్మారావే రాసేవారు. 'ఆయన రాసింది చూసి నేర్చుకున్నా'నని నార్ల అంటూ ధర్మారావు తమకెంతో స్వేచ్ఛ ఇచ్చేవారనీ, పేజి మేకప్‌లో తానూ, నాగేశ్వరరావ్ పోటీ పడ్తూండేవారమనీ గుర్తు చేసుకున్నారు. పత్రిక స్థాయి, రూపం బాగా పెంచడానికి ఇతర దేశాల పత్రికలను తరచు జనవాణి బృందం పరిశీలిస్తూండేది. ఆరోజుల్లో భారతదేశానికొచ్చే పడవలు సముద్రంలో ఊగిసలాడకుండా అడుగున ఆయా దేశాల నిరుపయోగమైన పత్రికల కట్టలను 'డెడ్ వెయిట్'గా వేసేవారు. నార్ల, తదితర జనవాణి బృందం ఈ పత్రికలన్నీ తూకానికి కొని కొత్తదనం కోసం వాటిలో అన్వేషిస్తూండేవారు.

ఆరోజుల్లో 'జనవాణి'తో తన సంబంధాన్ని వివరిస్తూ డాక్టర్ బోయి భీమన్న రూ. 25/- లకు గుమాస్తాగా చేరానన్నారు. ఒకనాడు ధర్మారావు-తన చేతిలో ఉన్న పుస్తకంలో రాసుకున్న కవితలను చూసి ప్రశంసిస్తూ 'రేపొచ్చేటప్పుడు హరిజన సమస్యలను గురించి ఓ వ్యాసం రాసి తెమ్మన్నారు', మర్నాడు ఆయనే వచ్చి 'రాశావా బ్రదర్' అని అవి తీసికెళ్ళి చదివారు. తర్వాత 'నీవీ ఫిష్ మార్కెట్‌లో ఉండలేవు. నాదగ్గరకొచ్చెయ్' అని ఆయన

గదికి తీసికెళ్ళారు. ఇదే తన జీవితంలో తొలి మలుపని భీమన్న అభిప్రాయం. 'పీపుల్స్ వాయిస్' గ్యాలీలను అనువాదం చెయ్యడం వీరి పని. క్రమంగా పల్లెటూరి లేఖలు రాయమని తన పేరు 'జానపదుడ'ని ధర్మారావే పెట్టారనీ, ఆరోజుల్లో ఈ జానపదుల జాబులకు మంచి గుర్తింపు వచ్చిందనీ ఇదంతా ధర్మారావు ప్రోత్సాహమేననీ అంటారు భీమన్న. ధర్మారావుకే కాదు అనాడా పత్రికలో పనిచేసిన ఎవరికీ ఆ పత్రిక యాజమాన్యానికుండే రాజకీయాభిప్రాయా, లుండేవి కావు. అందరూ జాతీయవాదులమేనని భీమన్న సాక్ష్యం. వార్తలు మాత్రం వేసేవాళ్ళు. సాహిత్యపరమైన వ్యాసాల్లో సమీక్షల్లో అందరికీ స్వేచ్ఛ ఇచ్చేవారు ధర్మారావుకూ దువ్వూరి రామిరెడ్డికీ మంచి స్నేహం. వారి రచనలను నార్లను సమీక్షించమన్నారు ధర్మారావు. అదో నాటకం. నాటక రచయితగా రామిరెడ్డి - ఈ పుస్తకం చాలా తక్కువ స్థాయివంటూ సమీక్షించారు నార్ల. ఇది చదివి రామిరెడ్డి ధర్మారావుగారిని జనవాణి కార్యాలయంలో కలిశారు. ఈ విషయం చెప్పారు. ధర్మారావు వచ్చి అలా రాశావేం బ్రదర్ అని ఓమాట అని వెళ్ళారు. బాధపడ్డట్టు కన్పించారనీ మరెప్పుడూ దాని ప్రసక్తే తేలేదనీ అంతటి సహృదయులనీ నార్ల ఈ ఉదంతం చెప్పారు. 'బాబూ అంటూ తిరిగే ధర్మారావు కలుపుగోలుతనం ప్రెస్ కార్మికులచేత చాలా ఉత్సాహంగా పనిచేయిస్తూండేది. అందరూ ఓ కుటుంబం సభ్యుల్లా అరమరికలు లేకుండా పనిచేస్తూండేవారు.

జనవాణికి రాజమహేంద్రవరం నుండి పందిరి మల్లికార్జునరావు విలేకరిగా ఉండేవారు. తన అనుభవాలను వివరిస్తూ జనంలో మంచి పత్రిక అన్న పేరుండేదనీ దీన్నందరూ 'కాసీ' పత్రికనేవాళ్ళనీ అన్ని విధాల నాటి ఆంధ్ర పత్రిక కన్నా చాలా బాగా ఉండేదనీ చెప్పారు.

ధర్మారావు, పత్రికారచనను చాలా సీరియస్‌గా భావిస్తూ తన చుట్టూ ఉన్న తోటి రచయితలను కూడా అలా భావించేలా చేసేవారు. సమిష్టి కృషి ఫలితంగా పత్రికను నడిపారు. భాష, భావంలో మార్పు తెచ్చారు.

ఆదిలో ప్రతి రచనా సాముదాయకమే అయినా మధ్యకాలంలో అది వ్యక్తిగతమైంది. అయినా రచనకవసరమైన భాషనూ భావాలనూ జనం నుండే గ్రహించక తప్పదు. అందువల్ల వ్యక్తిద్వారా వెలువడిన సాముదాయిక రచనలే ఉత్తమంగా ఉంటవి. పటిలోనేకాక 'నిర్మాణం' లో కూడా ఈ సాముదాయకత పత్రికల్లో ఉంది. అందువల్ల పత్రికల్లో భావాలూ, భాషా ప్రజలకు ఎంత సన్నిహితంగా ఉంటే అందులో సాముదాయికత అంత ఎక్కువగా

ఉందని భావించవచ్చు. అయితే మాతృభాషలో మాట్లాడేటప్పుడు తప్పులు కానీ భాషా దోషాలుండడం గానీ జరగదు. భాషా సహజ సూత్రాల్ని ఎవ్వరూ ఉల్లంఘించరు. కానీ రచనా సమయంలో అలా కాదు. తప్పులు కుప్పలు. అందుకే దిగ్గంతులలాంటి పండితుల రచనలో కూడా గిడుగు తప్పులు చూపించ గలిగారు. ఉద్దేశించిన అర్థాన్ని ఎదుటివారికి ప్రసారం చేయడమే భాష పర మోద్దేశం. సంభాషణా సమయంలో ఎదుటి వ్యక్తికి తన భాష అర్థం కావడం లేదనుకున్నప్పుడు వెంటనే సవరించుకుంటాడు. తన భావ ప్రకటనలోనూ, ప్రసారంలోనూ భాషావిషయంలో జాగ్రత్తపడ్తాడు. రాసేటప్పుడు ఉద్దిష్ట పాఠకులూ - వారి స్థాయీ రచయిత ఎదుట ఉండదు. దానితో ఆబ్జెక్టివిటీ కొరవడి సబ్జెక్టివిటీ పెరుగుతుంది. అందువల్ల ఉద్దిష్టార్థం ఏకారణం వల్లనైనా పాఠకుడు అందుకోలేకపోతే చదువు కొరవడిందనీ - స్థాయి లేదనీ అంటూ అతడి నెత్తినే నెపాలు రుద్దుతారు.

విజ్ఞానం ఏ భాష ద్వారా నేర్చుకుంటామో ఆ భాష మీద గౌరవం పెరగడం సహజం. అయితే నేర్చిన విజ్ఞానాన్ని సాకల్యంగా జీర్ణం చేసుకున్న తర్వాతనే దాన్ని మన భాషలో చెప్పగలం. అలా జీర్ణం కాని దశలో ఆ విషయాల రచనలో నట్లు పడ్తాయి. ఆవిధంగా మాతృభాష ఒకరకమైన కృతక భాషగా తయారవుతుంది. పాలకుల వేషభాషలు, ఆచార వ్యవహారాలు గొప్ప అని సాధారణంగా భావిస్తారు. అలాగే విజ్ఞానసముపార్జనకు మూలమైన సంప్రదాయాలనూ, నియమ నిబంధనలనూ తమ భాషకు కూడా అన్వయించుకోవడం 'గొప్ప' అనే భావం పుడ్తుంది. దానివల్ల 'అనువాద భాష' ఆవిర్భవిస్తుంది. ఒకప్పుడు సంస్కృతం ద్వారానే విజ్ఞానం దించుకున్నాం, నేర్చుకున్నాం. ఆ విజ్ఞానం తెలుగులో చెప్పాలనుకున్నప్పుడు సంస్కృత భాషా మర్యాదానుసరణమే ఉత్తమమని భావించారు. కనుకనే శబ్దబాహుళ్యాన్ని స్వీకరించడమే కాకుండా తెలుగు భాషకు వ్యాకరణాన్ని కూడా సంస్కృతానిదే అన్వయించుకోవడం జరిగింది. ఆవిధంగా మనకు సంస్కృత అనువాద భాషగా ఉండే తెలుగు తయారైంది.

ఇక ఇప్పుడు సకల విజ్ఞానం ఆంగ్ల భాష ద్వారా సంక్రమిస్తోంది. అలాంటప్పుడు ఆ విశేషాలు తెలుగులో చెప్పుకోడానికి ఆంగ్లభాషా మర్యాదలు, పలుకుబళ్ళు ఉపయోగించుకోవడం అనివార్యమైంది. కనుకనే వీరేశలింగం తదితరులు ఇంగ్లీషు వ్యాకరణ పద్ధతుల్లో తెలుగు వ్యాకరణం తయారుచేశారు.

ఇలాంటి పరిస్థితి పట్టింది మన తెలుగుకే కాదు. ప్రపంచంలో చాలా భాషలను పరిశీలిస్తే అవీ ఇలాటి దశను ఎప్పుడో అప్పుడు అనుభవించడం

చూస్తాం. మధ్య యుగాల్లో యూరపులో ఫ్రెంచి భాష చాలా ప్రాముఖ్యాన్ని సంపాదించింది. యూరప్‌కవులందరికీ ఉత్తేజాన్నిచ్చిన సహిత్యం ఆ భాషలో పుట్టింది. చదువుకున్న వారికీ - నాగరికులకూ ఆ భాష మీద మోజు పెరిగింది. తమ మాతృ భాష ఏదైనా ఫ్రెంచి మాట్లాడడం, ఆ సంప్రదాయాలను అనుసరించడం నాగరిక లక్షణమనుకున్నారు. అందువల్లనే ఫ్రెంచి భాషకు ఉమ్మడి భాష (లింగ్వా ఫ్రాంకా) అన్న అర్థం రూఢైందనవచ్చు.

రష్యాలాంటి దేశంలో కొందరు రచయితలు ఫ్రెంచి రాయడమే గొప్పనుకునేవారు. తమ మాతృభాషను అనాగరికమని కూడా తలచేవారు. అలాంటి దశలో కొందరు అభ్యుదయవాదులు మాతృ భాషకు కూడా సాహిత్య ప్రతిపత్తి కల్పించాలని సంకల్పించారు. ఫ్రెంచి వ్యాకరణానుసారం తమ భాషను సంస్కరించుకుని, ఆ శబ్ద జాలాన్ని తమ భాషలో చేర్చుకుని ఫ్రెంచి అనువాద భాషగా రష్యన్ కావ్యభాషను రూపొందించారు. తుర్గెనేవ్ లాంటి మహారచయిత కూడా ఈ ఫ్రెంచి అనువాద భాషలోనే రచనలు చేశాడు. పుష్కిన్ మహాకవి ఈ అనువాదభాషకు రష్యన్ పలుకుబళ్ళు ఎక్కువగా చేర్చి దాన్నే ప్రజలకు కొంత చేరువగా తెచ్చాడు. ఈ క్రమాన్ని మన భాషా మర్యాదల ప్రకారం చెప్పుకోవాలంటే తుర్గెనివ్ సంస్కృతానువాదమైన తెలుగులోనూ (గ్రాంధికం), పుష్కిన్ సరళ గ్రాంధికంలోనూ రచనలు చేశారనవచ్చు. తర్వాత వచ్చిన గోర్కీ ప్రభృతులు రష్యన్ భాషకున్న అనువాద శృంఖలాలను ఛేదించి వాడుక రష్యన్‌కు కావ్య భాషా ప్రతిపత్తి కలిగించారు.

తెలుగులో కొన్ని స్వతంత్ర రచనలే ఇప్పటికీ ఇంగ్లీషు అనువాద భాషలో సాగుతున్నాయి. అటువంటిది పత్రికారంగంలో ఇంగ్లీషు అనువాద భాష ఉండడంలో ఆశ్చర్యంలేదు. వారికొచ్చే వార్తలన్నీ ఇంగ్లీషులోనే వస్తాయి. అప్పటికప్పుడు వాటిని తెలుగు చెయ్యాలి. తెలుగు సేతలో ఇంగ్లీషు అనువాద భాషా శృంఖలాలను ఛేదించుకోవడం చాలా కష్టం. అయినా అలాంటి కష్టసాధ్యమైన కార్యాన్ని సాధించిన ఘనత ధర్మారావుకి దక్కింది. వీరు పత్రికారంగంలో అనువాద భాషకు మారుగా తేటతెలుగు భాషను ప్రవేశపెట్టి ఒక కొత్త వరవడిని దిద్దారు. అనువాదం కాకుండా అనుసృష్టి చెయ్యాలన్నది వీరి మతం. వీరు సహజంగా కవీ, రచయితా కనుక తన బాణీ అంటూ ఒకటుండేది. దీనికితోడు నార్లవారన్నట్టు కుశాగ్ర బుద్ధి కావడంతో విషయ గ్రహణం చేసుకోవడం, పూర్తిగా అవగాహన చేసుకోవడం అనే ఈ క్రమం త్వరితగతిని జరిగేది. తర్వాత పై రెంటినీ కలగలిపి తాను గ్రహించిన

విషయాన్ని తానే రచన చేశాడా అన్నంత సహజంగా ఉండే రచనగా దాన్ని వెలువర్చగల్గేవారు. దీనితో పత్రికా రంగంలో - మధ్యలో వచ్చి ఏకు మేకై కూర్చున్న గ్రాంధిక యుగం అంతరించి - వ్యావహారిక యుగం అవతరించింది.

అయితే పత్రికారంగంలో తొలి పత్రికగా అనుకుంటున్న మద్రాసు క్రానికల్ లో అర్జీదారులు అనువాదకులుగా సమర్థులను పెట్టుకుంటామంటూ 1832 లో చేసిన విజ్ఞప్తి కాలాన్నుండి ఇప్పటికీ ఈ ఇంగ్లీషు అనువాదాలూ, ఆ భాషాస్థితీ మారలేదు. 1842 లో వర్తమాన తరంగిణిలో బళ్ళారి చందు అనే ఊరి నుండి పాఠకుడొకడు ఇలాటి భాషను గురించి ఎడిటరుకు ఓ లేఖ రాశాడు. అందులో -

''అన్య దేశములలో నడిచే యుద్ధ ప్రసంగము మొదలయిన సంగతులు అందరికిన్నీ సులభంగా తెలిశేటట్టు హస్సలుకలం చెప్పడానికి బదులుగా యింగ్రేజి పత్రికలలో వుండే వాటిని అలాగే తర్జుమా చేసి వేశేటట్టు తెలుస్తున్నది - యీలాగున చేయడం వలన మీ పత్రిక చదివేవారికి వేసటయున్ను అరుచిన్ని పుట్టడానకు హేతువ అయి వుంటున్నది" - అని చాలా నిర్మొహమాటంగా రాశాడు.

దీనికి ఎడిటరు పత్రికా ముఖాన 1842 సెప్టెంబరు 8 న సమాధానం ప్రకటిస్తూ -

''ఇంగిలీషు కాకితములలోనుంచి తర్జుమా చేసి వ్రాసే విషయంలో కొందరి తాత్పర్యం హస్సలుగా వ్రాయవలెననిన్ని, కొందరి తాత్పర్యం ఇంగిలీషులోనున్నది - యావత్తు వ్రాయవలెనని వున్నందున కొన్ని సంగతులు ఇంగిలీషులో వుండేటట్లుగానున్ను - కొన్ని హస్సలుకలంగానున్ను వ్రాస్తున్నామే కాని అన్నిన్ని వకటే తరహాగా వ్రాయడంలేదు. అయితే పోయినసారి మా పత్రికలో వ్రాసిన రాణిగారి విషయం వంటి విషయాలు మాత్రం యధాస్థితిగా వ్రాయక విధిలేదు - తతిమ్మా వాటిని హస్సలుకలంగా వ్రాయడానకు సిద్ధంగానున్నాము'' అని నమ్రతగా అంగీకరించాడు.

ఇటువంటి అనువాదాల్లో కొన్ని సందర్భాల్లో చాలా తప్పులు వస్తున్నాయంటూ 1856 జులై నుండి వచ్చిన 'దినవర్తమాని' అనే తెలుగు పత్రిక మీద 1859 జూన్ 25 సంచికను గురించి నంద్యాల సివిల్ జడ్జి ఎల్. సి. ఇన్నిస్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి టి. పైక్రాఫ్టుకు రిపోర్టుచేశాడు. ఇలాంటి తప్పులిక దొర్లకుండా జాగ్రత్త పడ్తాసంటూ ప్రభుత్వానికి ఎడిటర్ తెలియపర్చాడు కూడాను.[49]

ధర్మారావు సరిగ్గా ఇలాటి అనువాద భాషను మెడబట్టిగెంటి 'హస్సలు కలం' రాయడానికి చేసిన ప్రయత్నమే 'జనవాణి' లో కనిపిస్తుంది. ఇలా ఇతర్లనూ చేయమంటూ ప్రోత్సహించాడు. ధర్మారావు నాటికి పత్రికల వార్తా పరిధి 1832 లంగా గానీ 1856 లాగా గానీ లేదు. బాగా విస్తరించింది. పాఠకుల పరిధీ విస్తరించింది. వాటికనుగుణంగా ధర్మారావు భాషాపరిధిని విస్తరించాడు. అంతేకాదు వీటన్నిటికనువుగా పత్రిక రూపంలో కూడా ధర్మారావూ వారి సహచరులూ కలిసి పెద్ద మార్పు తెచ్చారు. ఆ మార్పును పరిశీలిద్దాం.

ఆంధ్ర పత్రిక హిందూను ఆదర్శంగా పెట్టుకుని వస్తూండేది.[50] పత్రిక రూపం కూడా అలాగే మూసపోసి తీసినట్టుండేది.[51] అంతవరకూ పత్రికలన్నీ ఒక 'కాలమ్' శీర్షికలనే ఇస్తూ వార్తలు ప్రచురించేవి. ఆ శీర్షికలు కూడా విషయ సూచికలుగానే ఉండేవి. మొదటి పేజిలో ప్రకటనలుంటూండేవి.[52] దిన పత్రిక కాని కృష్ణాపత్రిక (1902) కూడా తొలినాటి సంచికలనుండి చాలా సంవత్సరాల వరకూ ఈ పద్ధతిలోనే నడిచేది. ధర్మారావు బృందం వీటన్నిటినీ మార్చింది. పత్రికల్లో శీర్షికలు, పొడవూ వాటికి వాడే అచ్చు ప్రమాణం వాటిని అమర్చే తీరూ వంటివే పత్రికకు ఆకర్షణ, దర్శనీయతా కల్పిస్తాయని ధర్మారావు నమ్మాడు.[53] నార్లవంటి మిత్రుల సాయంతో ప్రత్యక్షంగా నిరూపించాడు. శీర్షికలు కేవలం విషయ సూచికలుగా కాకుండా వార్తపరనం పట్ల ఉత్సుకత రేకెత్తించేవిగా ఉండాలని ఆయన మతం. బానర్‌లైను వార్త పెట్టడం, మొదటి పేజీ వార్తలకే కేటాయించడం, రెండు కాలమ్‌ల శీర్షికలు పెట్టడం ఇవన్నీ 'జనవాణి' తెచ్చిన మార్పులే. ధర్మారావు నేతృత్వంలోనే.[54]

అప్పటినుండి పత్రికలన్నీ ఆ మార్గాన్నే అనుసరించాయి. పత్రికా రచనకు ప్రాణం క్లుప్తత. ఉపోద్ఘాతం ఏదీ లేకుండా నేరుగా విషయాన్ని ప్రస్తావించడం మరో లక్షణం. ఈ రెండూ ధర్మారావు ఇతర సామాన్య రచనల్లో కూడా కనిపిస్తాయి. వార్తలో ఎవరు? ఏమిటి? ఎప్పుడు? ఎక్కడ? ఎందుకు? ఎలాగా? అనే ఆరు ప్రశ్నలకు సమాధానం ఉండాలి. అయితే అన్ని ప్రశ్నలకు సమాధానాలుండకపోవచ్చు. నేరాలకు చెందిన వార్తల్లో ఎందుకు? ఎలాగ? అన్న వాటికి జవాబులు కోర్టుల్లోనే తేల్తాయి. ప్రధానమైన ప్రశ్నలకు క్లుప్తమైన సమాధానం వార్త ప్రారంభంలోనే ఉండాలి. దీనికే వార్తా ముఖం అనీ, 'లీడ్' అనీ పేరు. పత్రికారచన సంగతి తెలీకపోయినా గొప్ప రచయితలందరూ ఈ పద్ధతినే తమ రచనల్లో అనుసరించారు. మొదటి పద్యంలోనే

కావ్యబీజముండాలన్న మన ఆలంకారికుల మతం ఇలాటిదే. "పత్రికారచనలో అనుభవం రచయితకు మంచి కండ పుష్టినిస్తుంది" - అంటాడు టాల్‌స్టాయి. "యువ రచయితలకు - ముందు పత్రికల్లో శిక్షణనిప్పించడం చాలాప్రయోజన కారి" - అని సోవియట్ నవలాకారుడు ఫెడిన్ అభిప్రాయం. చెహోవ్ -గోర్కీ లందరి మతమూ ఇదే. పత్రికలు వార్తలకు ఇతర పత్రికల మీద ఆధార పడ్తూండడం సాధారణంగా కనిపిస్తూంటుంది. దీన్ని నిరసిస్తూ చెహోవ్ వ్యంగ్యంగా ఇలా అంటాడు. ఒక పత్రిక హఠాత్తుగా ఓ దివసం సంచికను తీసుకుని రాలేదు. పత్రికాఫీసు ముందొక జనం గుమి గూడారు. కారణాలు విచారిస్తున్నారు. ఇంతలో వాళ్లకక్కడ అంటించిన ఓ ప్రకటన కళ్లబడింది. అందులో ఇలా ఉంది. "రాత్రి మా పత్రికా కార్యాలయంలో దొంగలు పడ్డారు. సంపాదకుల కత్తెర్లను ఎత్తుకెళ్ళారు. ఆ కారణంగా ఈనాటి పత్రిక వెలువడ లేదు. క్షమించండి." ఇలాటివాటిని పరిహరించాలన్న ఆశయం ధర్మారావు కుండేది. ఆరోజుల్లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సి. ఆర్. రెడ్డి మీద కొన్ని ఆరోపణలొస్తే వాటిని విచారించి అసలైన నిజాన్ని ప్రకటించాలని నార్లనూ, నాగేశ్వరరావునూ అక్కడకు పంపి వారి సమీక్షనే పత్రికలో వేశారు.

వ్యావహారిక భాషను దినపత్రికల్లోనూ, సంపాదకీయాల్లోనూ ప్రవేశ పెట్టింది ధర్మారావే. వ్యావహారికభాషను ఎలా ప్రవేశపెట్టారో చూద్దాం. దీన్ని గురించి ధర్మారావే ఓ సందర్భంలో ఇలా అన్నారు.

"తక్కువ పదాలతో వాక్యాలు రాసేవాణ్ని. సుమారు మూడె పదాలుం టాయి వాక్యంలో. అందువల్ల వ్యావహారికమనిపిస్తుంది. క్రియాపదాలు వ్యావ హారికం చెయ్యడమే వ్యావహారికం కాదు. అదో టెక్నిక్ కనిపెట్టాను. గ్రాంథిక భాషావాదులుకూడా ఆరోజుల్లో దాన్నికాదనగల ధైర్యం ఉండేదికాదు. మా శత్రువర్గంవాళ్ళ పత్రికకు(ఆంధ్రప్రభ)సంపాదకుడుగా న్యాపతి నారాయణ రావు ఉండేవాడు. అతడొచ్చి నా టెక్నిక్‌ను బాగా ప్రశంసించేవాడు." (తెలుగు అకాడమీకిచ్చిన ఇంటర్వ్యూ టేపు -1969). అలా క్రమంగా వ్యావహా రిక భాషను సంపాదకీయాల్లోనూ, వార్తల్లోనూ ధర్మారావు ప్రవేశపెట్టాడు. నేటి పత్రికల భాష అందరికీ అర్థం అవుతున్నది. ఈ మార్పు తెచ్చినందుకు వారికి ధన్యవాదాలు అంటూ నార్ల అనేక సందర్భాల్లో అన్నారు.55 సి. ఆర్. రెడ్డి నార్లతో జనవాణిని గూర్చి మాట్లాడ్తూ తాపీ ధర్మారావు పసగల మంచి భాష వాడ్తున్నారని ప్రశంసించారట.56 సారళ్యం, స్పష్టత, సూటిగా ఉండే వాక్య నిర్మాణ పద్ధతి - ఇవన్నీ ధర్మారావు పత్రికారచనలో ఉంటాయి.57 పత్రికా భాషను బాగా పాలిష్ చేయడం, వచనంలో సాఫీగా సాగే శైలిని సృష్టించ

డంలో జనవాణే వరవడి పెట్టింది.58 ఆనాడు జనవాణి వ్యావహారికంలోరాసిన రచనలనే అచ్చేసేది. 10-8-1937 నాటి జన్మదిన సంచికను పరిశీలిస్తే "వింతల్లోకెల్ల వింత - ధర్మారావు వ్యాసం; మల్లంపల్లివారి గుమ్మడిదుర్రు (విస్మృత బౌద్ధక్షేత్రం) వ్యాసం; మొక్కపాటివారి ఫీచర్ 'అరెరే'; ఉన్నవ వారి 'జాతీయ విద్య' వ్యాసం, ఉన్నాయి. ఇవన్నీ చక్కని వ్యావహారికంలోనే సాగాయి.

నిర్మోహమాటంగా వార్తలను ప్రచురించడం సంపాదకుల నిజాయితీకి నిదర్శనం. ఇలాంటి సందర్భాల్లో కోర్టుకేసులూ అవీ సంపాదకులకు నిత్య కృత్యాలవుతూంటాయి. రాజమండ్రిలో మున్సిపల్ చైర్మన్‌గా ప్రముఖ గాంధీ వాది క్రొవ్విడి లింగరాజు ఉండేవారు. 'అమ్మ' నవలను తెలుగులోకి అను వాదం చేసింది వీరే. అక్కడి కూరగాయల బజారు కాంట్రాక్టు సందర్భంలో కంట్రాక్టరు రెడ్డి అచ్చయ్యకీ లింగరాజుకీ పేచీవచ్చింది. అచ్చయ్య లింగ రాజు కార్యకలాపాల మీద ఓ కరపత్రం వేస్తే అది అప్పుడక్కడ విలేకరిగా ఉన్న పందిరి మల్లికార్జునరావు జనవాణికి పంపారు. ఈ వార్త వేసినందుకు చైర్మన్‌ను బయటికి లాగినందుకు లింగరాజు, కంట్రాక్టరు మీదా జనవాణి సంపాదకుడుగా తాపీ ధర్మారావు మీదా, ప్రింటర్ పబ్లిషర్‌గా ఉన్న అప్పయ్య దీక్షితుల మీదా పరువునష్టం దావా వేశారు.59 ఇలాటివన్నీ సంపాదకులకు కత్తిమీద సాములాగా వారి నైపుణ్యాన్నీ, స్థయిర్యాన్నీ పరీక్షిస్తూంటాయి.

జనవాణిలో పదకొండు నెలలు పనిచేసినతర్వాత కార్మిక సమ్మెను బల పరుస్తూ నార్లా మరికొందరూ పత్రికనుండి బయటకు వెళ్ళిపోయారు. అప్పుడే యండమూరి సత్యనారాయణ (శ్రీవాత్సవ), ధర్మారావు కుమారుడు మోహన రావూ అందులో చేరారు. 1937 ఫిబ్రవరి వరకూ ఉండి బోయి భీమన్న వెళ్ళి పోయినా జానపదుడన్న పేరుతో తన రచనలు పత్రికలో సాగిస్తూనే ఉన్నారు. అనేక సాంఘిక సారస్వత విషయాల మీద వ్యాసాలనూ వాటినీ జనవాణి దినపత్రికైనా ప్రకటిస్తూండేది.

1937 ఎన్నికల్లో కాంగ్రెసు పెద్ద మెజారిటీతో ఎన్నికైంది. బొబ్బిలి రాజా కాంగ్రెసు సభలను చెదరగొట్టడానికి ఏనుగులను తెప్పించి వాడినా ఓడి పోయాడు. జస్టిసు పార్టీ పతనమైంది. కుటుంబతగాదాల్లో పైకొచ్చిన ప్రజా మిత్రపక్షం, ప్రజాపక్షాల గతి "వచ్చిన వరదలో గడ్డవలుగులే కొట్టుకెళ్తూంటే గడ్డిపరకలు మా గతేంటి ?" అన్న సామెతవతు అయింది. రెండవ ప్రపంచ యుద్ధం ఆరంభమైంది. పత్రికలకు కాగితం కోటా బాగా తగ్గించేశారు. ఇది కారణంగా చూపించి పిఠాపురం రాజావారు 'జనవాణి'ని 1939లో ఆపేశారు.



g 272 — Isis, holding the sistrum or symbol of virginity.



Fig. 273.—Origin and meaning of the sist...

21. 'ఐసిస్' కన్యాత్వ చిహ్నమైన 'సిస్ట్రం' ను పట్టుకుని ఉండడం - ఈజిప్టు.
కచ్చడం - సిస్ట్రం చిహ్నంగా మారడం.



OSIRIS TAKING THE PHALLIC OATH

22. ఈజిప్టు, వేల్స్‌లలో ఒట్టు పెట్టుకోవడం. బైబిల్‌లో
దీని ప్రస్తావన ఉంది. (జెనిసిస్ 24 - 2)



23. ఆస్ట్రేలియా తెగల్లో తాను చంపినవాడి పుర్రెమీద పడుకోవడం ఆచారం.



24. మెక్సికోలో జునీ, అజ్టి ప్రాంతాల్లో పంట సౌభాగ్యచిహ్నం.

ధర్మారావే నడుపుకుంటానని మొదట్లో అన్నారు కానీ - ఆర్థిక పరిస్థితులూ, యుద్ధమేఘాల జోరూ చూసి దినపత్రిక నడపడం అంటే 'తెల్ల ఏనుగు' లాటి దనుకుని తలకు మించిన బరువంటూ తానూ పత్రికను ఆపడానికి అంగీకరించారు.

జనవాణి ఈ స్వల్పకాలంలోనే వార్తా ప్రకటనలలోనూ, సంపాదకీయ వ్యాఖ్యలూ తదితర ప్రత్యేక శీర్షికా సముదాయాల్లోనూ నూతన పోకడలతో వచ్చి తెలుగువారి ఆదరాభిమానాలను ఎక్కువగా చూరగొన్నది. ఇది ఆగిపోవడం నిజంగా దురదృష్టం.60 అయితే తెలుగు పత్రికారంగానికి రత్నాల్లాంటి ప్రసిద్ధ వ్యక్తులను అందించడంలో తాపీ ధర్మారావు, జనవాణి చేసిన కృషి ఇంతా అంతా కాదు. నార్ల వెంకటేశ్వరరావు, పండితారాధ్యుల నాగేశ్వరరావు, శ్రీవాత్సవ, పి. శ్రీరాములు వంటి ఆ రత్నాలే నాడు ధర్మారావు పత్రికల రూపురేఖలను మార్చడంలో చేసిన కృషిని కొనసాగించి గర్వించదగ్గ పత్రికలూ అందించారు. నెత్తిన పెట్టుకోదగ్గ వ్యక్తులుగా తామూ నిలిచారు. అలాటి ధర్మారావు కృషిని గురించి ఓ అంచనాని ఈ సందర్భంగా పరిశీలిద్దాం.

తెలుగు పత్రికల్లో భాష గురించి పరిశోధించిన లక్ష్మణరెడ్డిగారు ఇలా అంటున్నారు. "జనవాణి దినపత్రికను కేవలం వ్యావహారికం మీదనే నడిపించారు తాపీ ధర్మారావుగారు. ..... . వ్యావహారిక భాషకు ఒక స్థాయి కల్పించారు. తెలుగు దిన పత్రికల్లో వ్యావహారికానికి సంపూర్ణ ప్రవేశం కల్పించిన ఘనత ధర్మారావుగారిదే."

రాసే చెయ్యీ కూసే నోరూ ఊరుకోదు. జనవాణిని ఒక సాహిత్య వేదికగా చెస్తూ కవి పండితులతో నిత్యం చర్చోపచర్చలు సాగించే ధర్మారావు ఇక అప్పటికి తన రంగం పత్రికా రంగంగా గుర్తించుకున్నాడు. అప్పుడే రామబ్రహ్మంతోనూ, నాటి ప్రజామిత్రరచయితల గ్రూపుతోనూ కలిసి చిత్ర రంగంలో కాలుబెట్టాడు. సముద్రాల, తాపీ రచయితలుగా ఆ రంగాన్ని ఏలుతున్నారు. చిత్రరంగానికి పత్రికారంగం కన్నా విశాలమైన పరిధి ఉన్న మాట నిజం. కానీ తన సాహిత్య భావాలనూ, అప్పుడప్పుడే వామపక్ష భావాలవైపు మళ్ళుతున్న రాజకీయాభిప్రాయాలనూ వ్యక్తం చెయ్యడానికీ, మధ్య తరగతి మేధావివర్గంలో చైతన్యం రగుల్కొల్పడానికి పత్రికే శరణ్యమనీ, అవసరమనీ ధర్మారావు విశ్వసించాడు. కుమారుడు మోహనరావు చేతికి అందొచ్చాడు పత్రికారంగంలో జనవాణిద్వారానే మోహనరావుకు కొంత తర్ఫీదు ఇచ్చి ఉన్నారు ధర్మారావు. రెండవ ప్రపంచయుద్ధం ముమ్మరంగా

సాగుతోంది. ప్రపంచ రాజ్యాల నడకలో స్పష్టంగా సోషలిస్టు - పెట్టుబడిదారీ తరహాలు కన్పిస్తున్నాయి. భారత దేశంలో కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భవించి అనేక రంగాలలో తన ప్రభావాన్ని ప్రసరింపచేస్తోంది. ఆంధ్రలో అనేక ఉద్యమాలను నిర్మిస్తూ భూస్వామ్య వ్యవస్థ మీదా, దాని రక్షకులైన స్థానిక భూస్వాములూ వారి తాబేదార్ల మీదా గట్టి పోరాటాలు సాగిస్తోంది. రాజగోపాలాచారి ముఖ్యమంత్రిగా మద్రాసు రాష్ట్రం తెలుగు ప్రాంతాలకూ, ప్రజలకూ అన్యాయం చేస్తున్నట్టు దేశం క్రమ క్రమంగా తెలుసుకుంటోంది. ఆంధ్ర రాష్ట్ర ఉద్యమం ప్రజా పునాదులకు పాకి దృఢతరమైంది.

## కాగడా

ఇలాంటి రాజకీయ వాతావరణంలో పూర్తిగా అటు భాషలోనూ - ఇటు భావాలలోనూ మారిన ధర్మారావు 'కాగడా' వారపత్రికను ఆరంభించారు. ప్రతి బుధవారం పత్రిక వచ్చేలా 1940 జనవరి 10వ తేదీ మొదటి బుధవారంతో ఆరంభించారు. సంపాదకులుగా తాపీ ధర్మారావు, మేనేజర్. పబ్లిషర్‌గా వారి కుమారుడుతాపీ మోహనరావు ఉండేవారు. బి.యన్.కె. ప్రెస్‌లో పత్రిక అచ్చుకావడం. కార్యాలయం మద్రాసులోని 43, ఆచారప్పన్ వీధి, జి.టి.లో ఉండేది. పదహారు పేజీలతో ఒక అణాకే పత్రికను అమ్మేవారు. ఇది ఒకరకంగా ధర్మారావు కుటుంబ పత్రికే అనాలి. ధర్మారావుకు సహాయకులుగా కుమారుడు మోహనరావు, సెట్టి ఈశ్వరరావు ఉంటూండేవారు.

పత్రికారంగంలో అప్పటికే చాలా వారపత్రికలున్నాయి. అయితే కాగడా అన్ని రంగాలలోనూ తన ప్రత్యేకతను నిలబెట్టుకోవాలని ఆశించింది. వార్తల రూపంలో సత్యాన్ని బయట పెట్టడంలో ముందుండాలనీ, పెరిగిపోయిన మూఢ సంప్రదాయాల యథార్థ స్వరూపాన్ని బయట పెట్టడంలో పెద్దలకే పాఠాలు చెప్పాలనీ ఆరంభించారు ధర్మారావు ఈ పత్రికను. దీనికితోడు మొదటి సంచికలో తమ పత్రిక ''ప్రపంచ సారస్వతానికి, మన సారస్వతానికి సాధ్యమయినంతవరకూ భాయీ, భాయీ సంబంధం కలిగించాలని'' ఆశించినట్లు చెప్పుకున్నారు. అలాగే రెండోసంచికలో 'సాంఘికం' - అని వ్రాస్తూ ''సంఘంలోని వివిధ అంశాలనూ అందులో జరిగిన వివిధ పరిణామా

లనూ సహేతుకంగా విశదీకరించి పత్రికా ప్రపంచంలో ఒక కొత్తయుగాన్ని స్థాపించాలని" కోరుకున్నారు.

"పత్రికలు వట్టి మాటల పోగులే కాదు, క్రియా కలాపానికి కూడా దారి తీయాలన్న" అభిప్రాయం తాపీవారిది. "సంఘంలో ఒక కొత్త జీవ కళను కలిగించడంలో చేతనయిన విధంగా పత్రికా ముఖంగా సాయపడాలని" వారి ఆశయం.

నాడున్న దేశ రాజకీయ పరిస్థితులు ధర్మారావు మాటల్లోనే చెప్పాలంటే "యుద్ధమేఘాల్లో నుండి 40 వచ్చింది". ప్రపంచ యుద్ధం దేశంలోని ప్రతి రంగాన్నీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో స్పృశించింది. తెలుగు దేశానికేం మినహాయింపు లేదు. దీన్ని గమనించిన ధర్మారావు' కాగడా' ఉద్దేశాలలో మరొకటి ఐకమత్యం సమకూర్చడం అన్నారు. దీన్ని విశదీకరిస్తూ "ఇప్పుడు సాంఘికంగా, రాజకీయంగా దేశంలో ముఖ్యంగా కావలసినది ఐకమత్యం. రక్త సంబంధం కుదిర్చినంత చిక్కని ఐకమత్యాన్ని మరే ఏర్పాటు కుదర్చ లేదు. వర్ణాంతర వివాహాల వల్ల కలిగినంత విశాలంగా ఈరక్త సంబంధం మరేవిధంగానూ కుదరదు. కాబట్టి వర్ణాంతరవివాహాలను గురించి భావ ప్రకటనకు అవకాశం ఇచ్చి తద్వారా అందుకుతగిన ఉద్యమానికి దారి తీయడం మా సంకల్పం"- అని అన్నారు. ఈ ఆశయ సాధనకు ఎముకలు కుళ్ళిన వయస్సుమళ్ళిన వాళ్ళవల్ల లాభంలేదని తెలిసికొన్న ధర్మారావు "ఆంధ్ర యువకలోకం అంతా నడుం బిగించి ఈ సంకల్పసిద్ధికి మాకు చేయూత నివ్వండ"ని విజ్ఞప్తి చేస్తూఉరకలెత్తే ఉడుకురక్తం యువకుల కోసం చెయ్యి సాచారు.

మోహనరావు, ఈశ్వరరావు, అప్పటికే కమ్యూనిస్టు ఉద్యమంలో పని చేస్తున్నారు. ధర్మారావుకు వీరిద్దరూ ఈ పత్రికా నిర్వహణలో సహాయకులు. ధర్మారావు, రామస్వామి నాయకర్‌లు బ్రాహ్మణేతర ఉద్యమ కాలంలోనూ, ఆ తర్వాతా మంచి మిత్రులు. నాయకర్ రష్యా పర్యటననుంచి వచ్చి అక్కడి అక్టోబర్ విప్లవ విజయాలకు ముగ్ధుడై అలాంటి లెనిన్ మనకూ ఒకడుండాలని ఆశించాడు. తెలియకుండానే ఆ సిద్ధాంతం అతనిలో ఒక కొత్త దృష్టిని తెచ్చిన విషయం నాయకర్ అక్కడ నుంచి వచ్చిన తర్వాత తన ఉద్యమానికి హేతువాదాన్నీ, ప్రజా పునాదినీ జోడించడం ద్వారా అర్థం చేసుకోవచ్చు. నాయకర్ పర్యటన తర్వాత ధర్మారావు మద్రాసులోనే ఉన్నాడు. గతంలో లాగానే ధర్మారావు, నాయకర్‌లు కలుసుకుంటూ ముచ్చటించుకునేవారు. వీటన్నిటికీ తోడు ప్రపంచ రాజకీయాలలో సామ్రాజ్యవాదం నిజస్వరూపం, దోపిడీ

లక్షణాలూ, నాజీజం దుష్టచేష్టలూ, ఫాసిజం విషవాయువులూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. సోషలిస్టు దేశాల ముందడుగూ, నిర్మాణ కార్యక్రమాల విశేషాలూ ప్రపంచాన్ని ఆశ్చర్యపరుస్తున్నాయి కూడా. సామాజిక శాస్త్రం అధ్యయనం చేసే వ్యక్తి, ప్రతివిషయాన్ని తార్కిక జ్ఞానంతో మూరేకాలంతో అంచనావేసే వ్యక్తి పరిణామాల ఎడ కళ్ళకు గంతలు కట్టుకోడు. దేశంలో బ్రిటిషు వారి దాస్య పాలనకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలు, ఆత్మార్పణలు, కాంగ్రెసులోని సోషలిస్టు శక్తులు స్పష్టతను పొంది ఏమి ప్రతిక్రియతో [illegible]ంటూ కాంగ్రెసులోని మితవాదుల్ని ఎండగట్టడం ధర్మారావు చాలా కుతూహలంతోనే గమనిస్తూ ఉండి ఉండవచ్చు. ఆ కాంగ్రెసు సోషలిస్టు శక్తులే క్రమంగా కాంగ్రెసునుండి వేరుపడి 1936లో ప్రత్యేక రాజకీయ పార్టీగా పనిచేస్తుండడం, సంఘంలోని బడుగు వర్గాలను సమైక్య పరుస్తూండడం చూస్తూంటే ధర్మారావులో వాటిమీద సద్భావం కలిగింది. దీనికితోడు మోహనరావు, ఈశ్వరరావుల సహకారం కాగడాకు వామపక్ష రాజకీయ తాత్వికత అబ్బేలా చేసింది.

కాగడా నడిచిన 1940 - 1942 కాలంలో ఇందులో ధర్మారావు అనేక విషయాల మీద ప్రయోగాలు చేశారు. వీరితో గతంలో పత్రికలో కల్సి పని చేసిన ముద్దా విశ్వనాథం అన్నట్టు కొత్త శీర్షికలు పెట్టడంలో ధర్మారావుదే పైచెయి.

దినపత్రికకన్నా వారపత్రికకు జీవితం ఎక్కువ. అందువలన అటు బుద్ధికీ, ఇటు హృదయానికీ సంబంధించిన వివిధాంశాలతోపాటు దినపత్రిక లక్షణాలైన దినసరి వృత్తాంతాల వివరణలు కూడా ఉండాలి. పాఠకులను దృష్టిలో పెట్టుకుంటే సమాజంలోని పత్రికా పాఠకుల్లో అనేక పొరలలోని వాళ్ళను ఆకట్టుకుంటూ ఉండాలి వివిధ రంగాలను స్పృశించడం అవసరం కూడానూ. దీనికితోడు సంపాదకుడికి అటు సాహిత్యం, ఇటు రాజకీయం తెల్సి వాట్లిలో అభిలాష ఉంటే ఎక్కువ శ్రమ లేకుండా పత్రికను నిర్వహించవచ్చు. కానీ ధర్మారావుకు అభినివేశం లేని విషయం లేదు. దీనికితోడు పత్రికాశయాలుగా ప్రకటించుకున్న అంశాలను పరికిస్తే ఈ 'కాగడా' పత్రిక పరిధి ఎంత విశాలమో అర్థమవుతుంది. ఇన్నిటినీ పత్రిక ప్రతిబింబించాలంటే వివిధాంశాల మీద శీర్షికలు అనేకం ఉండడం అవసరం. అందుకే ధర్మారావు సుమారొక పది శీర్షికలను ఎంచుకోవడం, ప్రతి పత్రికలోనూ కొన్ని తప్పనిసరిగా ఉండేలా చూసుకోవడం చేశాడు. ఈ శీర్షికలను స్థూలంగా రాజకీయ, సాహిత్య, సాంఘిక శీర్షికలని విభజించవచ్చు.

రాజకీయ క్షేత్రకల్లో కాగడా 'గాలివిసురు' అనేదాంట్లో నాటికి రాష్ట్రంలో నిత్యం జరుగుతున్న వాటిలో ప్రధానాంశాల మీద నిర్వాహకుల అభిప్రాయా లుండేవి. సామాన్యంగా ధర్మారావే నిర్వహిస్తూండేవాడు. 'తడాకా' - అనే మారుపేరు పెట్టుకున్నాడు. ఈ శీర్షికను 1940 ఫిబ్రవరి 14 నుండే ఆరంభించాడు. ఇందులో ఆయా వ్యక్తులనే సంబోధిస్తూ వాళ్ళ చర్యలను బయట పెడ్తూ సూటిగా ప్రశ్నించే విధానాన్ని ధర్మారావు అవలంబించాడు. ఆంధ్ర రాష్ట్రం విషయంలో రాజాజీ ఆ కాలంలో చేస్తున్న దుష్ట చేష్టలను, ఆయన మరో సందర్భంలో అన్న మాటలను పట్టుకొని తూర్పారపట్టాడు. ఉదాహరణకు - రాజాజీని సంబోధిస్తూ.......

రాజాజీ, మీరా మాటలు చెప్పడానికి మీ అంతటి వాడు మరి లేడు. నీతులు చెప్పడానికి పూనుకుంటే ఏదో శాస్త్రోపాధ్యాయునినా వచించెదవు మేలోహో - అన్న పద్యం జ్ఞాపకం వస్తుంది. ముందుచూపేగాని వెనకచూపు మీలో కనిపించదు. లోచూపు అన్నమాట అసలే లోపించింది లెండి. మొన్న తూత్తుకుడిలో ఏమన్నారో జ్ఞాపకం ఉందా. అధిక సంఖ్యాకుల అభిప్రాయాల ననుసరించి అల్ప సంఖ్యాకులు కొంచెం సవరించుకోడమె డెమోక్రసీ అన్నారు. మీ కడుపులో ఉన్న అభిప్రాయం వేరు .. ఆఖరుకి మా ఆంధ్ర రాష్ట్రం సంగతి ఏమంటారు? అదంతా డెమోక్రసీయే అని మీ వియ్యంకుడు (మహాత్మాగాంధీ) చేత చెప్పిస్తారా? లేకపోతే తమ చీపురుకట్టపట్టుకొని వీటి నన్నిటినీ తుడిచివేస్తారా? దేనికయినా సమర్థులు; కాబట్టే కదా, ఇంతమంది ఉన్నా గాంధీకి మీరు - ఈ రోజులలో - తలలో నాలుక అయినారు.

(తడాకా, 1940 ఫిబ్రవరి 14).

అలాగే మద్రాసు పౌరులకు నీళ్ళ సదుపాయం కోసం పూండీ రిజర్వాయర్ నిర్మించారు. దాని ప్రారంభోత్సవం ఇంగ్లీషువాడైన గవర్నరు చేస్తాడు. ఆ "సభకెవ్వరూ వెళ్లొద్దని పురపాలక సంఘంలో ఉన్న కాంగ్రెసు సభ్యులకు" ప్రకాశం గారు శాసనం పంపారు. దాన్ని పట్టుకొని -

ప్రకాశం పంతులుగారూ,

... ....ఎప్పటినుండి కలిగిందండి మీకీ ఆవేశం? మంత్రులుగా ఉన్నప్పుడు ఈ మతి ఉండేదా? రాజాజీగారు డిన్నర్లకు వెళ్ళినప్పుడు ఆంధ్రకేసరి నిద్రపోతూ ఉందా? యూనియన్ జాక్‌కు సలాం చేసినప్పుడు (కొత్త సంవత్సరం) పెద్ద మంత్రి; బాల మంత్రి, పనిలేని మంత్రి వగైరాలు హాజరు మనవి చేసినప్పుడు ప్రకాశంగారు ప్రసుప్తులయి కలలు గంటున్నారా?....

మద్రాసంతా తాగడానికి నీరు లేక తహతహపడుతూ ఉంటే కదా ఈ స్కీము వేశారు. పురజనులకు బాగా కావాల్సిన విషయం ఈ పూండీ రిజర్వాయరు .... మునిసిపల్ సభ్యులు మీ మాట వింటే ఏమయినట్టు ? .... మీ అధికారం బంగారంగానూ ఇదటండీ మీరు చేసేపని ... " (తడాకా, 1940 ఆగష్టు 7) ఈ విధంగా చక్కని తెలుగులో, వ్యంగ్యంగా, సూటిగా విమర్శించేవారు.

మరో శీర్షిక పర్యాలోకనం - ఇందులో ప్రపంచ రాజకీయ దృశ్యాలను సంపాదకుల దృష్టి నుండి సవిమర్శకంగా సమీక్షా రూపంలో పాఠకుల కందించేవారు. నాడు జరుగుతున్న యుద్ధ రంగాన్ని పర్యాలోకనం చేస్తున్నాడు. ఫిన్లండ్ సేనలు రష్యాలో ప్రవేశించి రష్యన్లను చీకాకు పరుస్తున్నాయనీ, రష్యన్లు బాగా నష్టపోతున్నారనీ, రాయిటర్ వార్త పంపుతూ; అయినా రష్యన్లు తిరుగుబాటు చేస్తున్నారని క్లుప్తంగా వార్తలో చేర్చాడు. దీన్ని ఆసరాగా తీసుకొని - రష్యావారు ఇంకా తీవ్రమయిన, బలమయిన సన్నాహాలు చేస్తున్నారని ఇటీవలి వార్తలు తెలిపాయి. సైనిక తిరుగుబాటులతో బాధపడుతున్నవారు ఇంకా తీవ్రతర యుద్ధసన్నాహాలు ఎలా చేయగలరో రాయిటర్ వారికే తెలియాలి ... ఏది ఏలాగున్నా రష్యా చర్యకు యావత్ ప్రపంచం ఒక విధంగా కృతజ్ఞత తెలపాలి. ఏమంటారా. చూడండి - మంచూరియా మానభంగం నాడు లేని విశ్వమానవ ప్రేమ .." (1940 జనవరి 10 ఆరంభ సంచిక) - అని అంటూ ఇతర రాజ్యాలు చిన్న రాజ్యాల మీద చూపే ప్రేమ నాటకమంటారు. రష్యా తనకున్న బలాన్ని ఒడ్డి శత్రుసేనలను మట్టు బెడుతున్నందుకే దాని చర్యను కృతజ్ఞతాభావంతో చూడాలంటాడు ధర్మారావు. ఈ శీర్షికలోనే క్వాంగ్టన్‌లో జపాను దాడిని చైనా తిప్పికొట్టడాన్ని 'చైనా విజయమని' ప్రస్తుతిస్తారు కూడా.

హిట్లరు, ముస్సోలినీల యుద్ధరంగం పాట్లను ఇదే శీర్షికలో 'మిరాయి' అన్న ఉపశీర్షిక కింద విమర్శిస్తూ ధర్మారావు ఇలా అంటాడు - "గ్రీసులో ప్రియమిత్రుడు ముస్సోలినీ పడరాని పాట్లు పడుతున్నాడు .... జర్మను ప్రజలను ఎలా ఓదార్చాలో, ఎలా జోకొట్టడమా అని ఆలోచించాడు హిట్లరు .... ఫ్రాన్సు భాగాలైన అల్సాస్ - లోరైన్ రాష్ట్రాలు కనిపించాయి. బాగుందనుకున్నాడు - ఇదిగో మిరాయి అని ప్రసాదించాడు జర్మనీకి.

అల్సాస్ లోరైన్ రాష్ట్రాలు అసలు ఎవరివో చెప్పడం సృష్టికర్తకయినా తరము కాదేమో. చరిత్రలో ఆ భూభాగం జర్మనీ ఫ్రాన్సుల మధ్య లెక్కలేనన్ని సార్లు చేతులు మారింది" (1940 డిసెంబరు 4). ఈరకంగా హిట్లరు
న్న నాటకాన్ని పాఠకులకు స విమర్శకమైన భావాలతో జతచేర్చి య

వార్తలనందించేవారు. ప్రత్యేకంగా వార్తలను విమర్శలను జోడించకుండా ప్రకటించడానికి 'యుద్ధం' అనీ 'యుద్ధశ్రవణం' అనీ శీర్షికలను నిర్వహించాడు.

భారతదేశ రాజకీయరంగాన్ని పాఠకులకందించేందుకు నిర్వహించిన శీర్షిక 'పిట్టచూపు.' ఆంగ్లంలో బర్డ్స్ ఐ వ్యూ అన్న దానికి తెలుగుసేత. దీన్ని ధర్మారావేకాకుండా ఈశ్వరరావు, మోహనరావు కూడా అప్పుడప్పుడు నిర్వహిస్తూండేవారు. ప్రధానంగా ధర్మారావే నిర్వాహకులు.

1941 జనవరి 29 సంచికలో ఉన్న పిట్టచూపులో బ్రిటిష ప్రభుత్వం-ఇండియా రక్షణ బాధ్యత సంస్థానాధీశుల బాధ్యత, ఐ.సి.యస్. ఉద్యోగుల రక్షణ బాధ్యతా స్వీకరించి "ఇవి మినహాయించి దేశ పరిపాలన బాధ్యత అంతా ఇండియనుల మీదే విడిచిపెడతారు. అదీ యుద్ధం పూర్తి అయిన తర్వాత జరుగవలసిన విషయం. ఆ మాట అన్నారేకాని యుద్ధం పూర్తి అయిన తక్షణం అని కానీ లేదా ఇంత టైములో అని కానీ ఏమీ అనలేదు" - అంటూ రాజకీయ ప్రతిష్టంభనను విమర్శించారు. అందులోనే విద్యార్థులకు గాంధీ ఇచ్చిన ఓ సలహానూ ఓ పట్టుపట్టాడు. "విద్యార్థులు అన్ని పార్టీల వారి వాదప్రతివాదాలూ పూర్తిగా చదవాలి. అందులో ఉన్న సత్యం తెలుసుకోవాలి. అంతటితో వారి పని సరి. అంతేకాని వారు రాజకీయాలలో దుమకకూడదు. అలాగా దుమికారు అంటే వారి కర్తవ్యము వేరైపోతుంది. ..." దీని చివరలో "వీరు చెప్పినది సమంజసమే. కాని విద్యార్థులంటే ఉడుకురక్తం అన్నమాట. వారికంత ఓర్మి ఉంటుందా" అని ముక్తాయింపులో గాంధీ వాదనకు తూట్లు పొడిచాడు ధర్మారావు.

ఇక కృష్ణాజిల్లా బోర్డు కప్పల తక్కెడ వ్యవహారాన్ని పట్టుకున్నారు. అప్పట్లో దానికి కె. లక్ష్మయ్య నాయుడు అధ్యక్షులు. వారి మీద విశ్వాస రాహిత్య తీర్మానం వస్తే అనుకూలురు 30 మందీ, ప్రతికూలురు 17 మందీ తేలారు. అయినా 3/5 వంతు అంగీకారం రానందుకు తీర్మానం పక్కకు నెట్టాల్సి వచ్చింది. ఈ గలభ్రగోళంలో ప్రభుత్వం అసలు జిల్లాబోర్డునే రద్దు చేసే యోచనకొచ్చింది. అప్పుడు కాంగ్రెసు వాళ్లు పదవులు పోతాయన్న భయంతో దాని వ్యవహారం తమకే వదలమని అర్జీ పెట్టుకున్నాడు. ధర్మారావు ఈ కథంతా చెప్తూ "పదవులకు పాకులాడే మనుష్యులను వెనకబెట్టి దేశసేవ చేయటానికి కంకణం కట్టుకున్న వారినే అధికారులుగా చేయడం కాంగ్రెసు సంస్థ విధి. ఇకనైనా కాంగ్రెసు ఈ పాఠం బోధపర్చుకుంటుందని ఆశిస్తున్నాం" - అని తెరవెనక రాజకీయాన్ని ముందుకు తెచ్చాడు.

ఈ విధంగా రాజకీయాలను ప్రధానంగా వామపక్ష భావాల వెలుగులో పర్యాలోచించడం స్పష్టంగా కనిపిస్తుంది. విమర్శ కటువుగా కాకుండా మృదువుగా, వ్యంగ్యంగా ఉండటం కూడా చూడొచ్చు.

సాహిత్య రంగంలో కాగడా కృషి పరిశీలిస్తే అటు సంప్రదాయ వాదులకూ ఇటు అధునాతనులకూ ఆనందం కల్గిస్తుంది. కారణం ధర్మారావు ప్రవేశ పెట్టిన శీర్షికలు ఈరెండు తరహాల వారి బుద్ధులకూ పదును పెట్టేవి. ధర్మారావు తత్వమే పాత కొత్తల మేలు కలయిక. దాన్ని వారు తమ కొత్తపాళీ వ్యాసాల్లో చాలా వివరంగా చెప్పుకున్నారు. ఆ ప్రణాళికతోనే ఇందులో శీర్షికలనూ నడిపాడు.

'పద్య భిక్ష' అన్న శీర్షిక కింద కొంతకాలం తెలుగుదేశంలోని ప్రజల జీవన పరిస్థితులను ఒక చిన్న గీతంలో గానీ, నాలుగు చరణాల్లో గానీ వివరించండని పాఠకులను కోరారు. "శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథ కోటిభిః" అన్న శ్లోకాన్ని గతంలో వీరు తాము నడిపిన 'కొండెగాడు' పత్రికకు కూడా నినాదంగా వాడుకున్నారు. దాన్నే కాగడాలో ఉపయోగిస్తూ -

"40 కోట్ల ప్రజలలో కోటి ముఖాల వీర తాండవం చేస్తున్న దారిద్ర్య సారం అంతా ఒక్క చిన్న పద్యంలో చెప్పలేకపోతారా? అని ఒక ఆశ కలిగింది. ఆంధ్ర కవి కుమారులకు దోసిలొగ్గి 'పద్యభిక్ష' పెట్టమని అడుగుతున్నాం" "ఏ పద్యమైనా సరే ఎలాంటి భాష అయినా సరే; మాకు బోధపడాలి - కఠోరమైన దారిద్ర్యాన్ని స్పష్టంగా సూచించాలి." అని సంపాదకులు దోసిలొగ్గారు. (1940 సెప్టెంబరు 25)

ఇది అక్టోబరు 9 వ సంచిక నుండీ ఆరంభమైంది. సంచికలో అయిదుగురు, ఆరుగురు చొప్పున రాశారు. ప్రతి పద్యానికీ చివర సంపాదకుల చిరు విమర్శ ఒక పంక్తిలో ఉండేది.

కొల్లగొట్టిన కోటీశు కొంప వోలె
పంట మళ్ళిన భారతావనిన నేడు
'ఓసి - దారిద్ర్యమా' - యన 'నో' యటంచు
నలుబదొక కోటి రుద్ధకంఠాలబలుకు. - బి.వి. సింగరాచార్య
(మంచి ఆరంభం)

ప్రళయ భైరవ భయద నర్తనము సేయు
క్షుభిత కంకాళమాలా విశుష్క ఘోష

క్షామ దేవత శతకోటి చరణఘాత
ముల దరిద్రోదర క్షుధాగ్నులను నేడు. - బాపిరాజు
(సంస్కృతమయితే నేమి)

కట్టుబట్టలేక కడుపుకన్నము లేక
నిలువ నీడ లేక, నీరు లేక
మనువు లేక మరల మరణించగా లేక
బ్రతుకు వాని బ్రదుకు బ్రతుకె అగునె? - భాగవతుల శంకరశాస్త్రి[61]
('మరణించగాలేక' మంచిముక్క) 1940 అక్టోబరు 16

ఆకటికి మ్రగ్గి చలిదెబ్బకలమటించి
మొండిరోగాల కవమానములకు లోగి
నాగరక సంఘమున కొక్క నవ్వు విసరి
పిలుచుచున్నాడు యమునహో - పేదవాడు.
- తుమ్మల సీతారామమూర్తి చౌదరి
(విసిరిన నవ్వు వెర్రెత్తించక తీరదు) 1940 అక్టోబరు 16

ఎండవానలకతడు సహింపలేని
అస్థిపంజరమైపోయి, అనుదినమ్ము
గోచి పీలికతో వడగొట్టుకొనుచె
జగతి బ్రతుకనులేడు, చావగను లేడు.
- పన్యాల వెంకటరంగనాథరావు
(చావగను లేడట - మేలు) 1940 నవంబరు 20

ఆకలో ఆకలో యంచు అడలనేల
చివికి జీర్ణించి పిగులు గోచియును లేక
జైన దేవుని వలె తోచు మానమునకు
చేతులర్పించి మిడుకుచు చీకటింట. - సముద్రాల
(మానానికే లేదు, ఆకలికెక్కడిది?) 1940 డిసెంబరు 11

1941 జనవరి కాగడా నుండి ఈ పద్య భిక్షను "దేవుడికొక ప్రశ్న. ఒక్కటే ప్రశ్న: ఘాటయినది - ముక్కు మీద గుద్దినట్టు" ముఖాముఖిగా ప్రశ్నించడం ఆరంభించారు. దేశ దారిద్ర్యాన్ని జనం దృష్టిలోకి తెచ్చారు. దీనికి కారణం ఎవరని ప్రజలు హేతువాదంతో ఆలోచించేలా చేశారు. దేవుడూ. అదృష్టాల చక్రంలో పడి నలిగే భావాలను తుడిచేస్తూ సరైన దిశకు మళ్ళించ డానికి చేస్తున్న ప్రయత్నమిది.

కులము పేరిట కొందర గొప్ప జేసి
మతము పేరిట కొందర మతులు చెరచి
రాతి బొమ్మల పూజయే నీతి చేసి
దేవుడా - కంటబడకుండ తిరిగెదేల ? - కొసరాజు

జీవ సుఖదాయి యౌ దేవదేవుడన్న
అందని సుఖానుభవముల కాసగొల్పి
ఆరని నిరాశ నెదల తూర్పారబట్టి
జీవితమ్మంత కాల్చి హింసింపనేల? - శ్రీవాత్సవ

సృష్టి అంతా నేనె చేసినానంటావు
అంతవాడవు నీవు అయితేను ఓ దేవ,
అల్పులం మాచేత అడిగించుకోనేల ?
ఇన్....న్ని లోపాలా ? కన్నున్నదా లేద ? - కాంతం

పైవన్నీ 1941 జనవరి జన్మదిన సంచికలోవి. కాంతం బహుశా మునిమాణిక్యమే కావచ్చు.

జవ్వనము మోసులెత్తిన చానకపుడె
పటిక రాళ్ళను మించు గుబ్బలనమర్చి
చయ్యనవె వాని దూది పింజల నొనర్తు
కాంక్ష చావనిదేయేల - కటికవాడ. - పైడిపాటి....శాస్త్రి.
(1941 జనవరి 8).

నీవు పుట్టించు తండ్రివి నే సుతుడను
సత్యమని యొప్పుకొందు, సంశయము కలిగె
తండ్రి కొడుకుల మధ్య, మధ్యే తెరవేల ?
ఎపుడు కనులగానబడవదేమి దేవ ? -నార్ల చిరంజీవి.
(1941 ఫిబ్రవరి 5).

దేశ దారిద్ర్యానికి మూల కారణం దేవుడు కాదన్న వాదాన్నీ, భావాన్నీ సూటిగా పాఠకుల మనస్సులోకి ప్రసరించేలా చెప్పించారు. ఇక కర్తవ్యం బోధపర్చడానికి ధర్మారావు ఉద్యుక్తులౌతున్నారు. దారిద్ర్య కారణం ఇది కాదన్న తర్వాత ఏది ? దాన్ని సమూలంగా నాశనం చెయ్యడానికి ఎవరు ముందుండాలి ? ఉంటే వాళ్ళకుండాల్సిన భావమేమిటి ? - అదే దేశభక్తి.

సరిగ్గా ఇదే కాలానికి దేశం అట్టుడికినట్టుడుకుతోంది. ఆంగ్లేయుల దమనకాండ అధికమైంది. కమ్యూనిస్టు పార్టీ జనంలో వెన్ను దన్ని యువకు

లను ప్రభుత్వం మీద పోరాటానికి సిద్ధం చేస్తోంది. ఎన్ని సంరక్షణ చట్టాలున్నా యువత వామపక్ష భావాలవైపు తియ్యనీటికి చేపల్లా ఎదురెక్కుతూంది. త్యాగం యువకుడికి పర్యాయపదమైంది. రాష్ట్ర రాజకీయాల్లో కూడా స్వరాష్ట్రోత్సాహం పెల్లుబుకుతోంది. ఇలాంటి సమయంలో కావలసింది దేశభక్తి. కనుకనే ధర్మారావు తన పద్యభిక్ష శీర్షికను అటు తిప్పాడు.

1941 జులై 30 సంచికలో నాలుగు చిన్న చరణాలలోకి మీ దేశభక్తి భావాన్ని కాచి వేడివేడిగా పంపండని - ప్రకటించారు.

తుచ్ఛుల నోళ్ళను మెలగుటవల్లా
దుష్టుల నాల్కల తిరుగుటవల్లా
దేశభక్తి - నీ పేరునగాదా
దేశద్రోహం జరిగేదంతా. - సదాశివం
(ఇదీ బురఖాదారులు చేసేపని)

కటిక చీకటి కోనలో గనులు మూసి
ఉక్కు కటకటాలను తలగ్రుక్కికొనుచు
జీర్ణగళగీతముల బాడి చివికిపోవు
ఎండు గుండెల 'తల్లి' నేనెపుడు గాతు. - నార్ల చిరంజీవి
(ఎండుగుండెల తల్లిని కావడా ,కొడుకు) 1941 ఆగస్టు 20

ఈ విధంగా పద్యభిక్షలో పలువురు ప్రసిద్ధులూ, యువకవులూ పాల్గొన్నారు. తర్వాత కేవలం ధర్మారావే నిర్వహించిన మరో సాహిత్య శీర్షిక 'పరాక్'. దీన్ని 1940 మే 22 నుండి నిర్వహించారు. "పాతమాటలే అయినా సమయాసమయాల్లో పనికివస్తాయి. మరిచిపోకుండా కొంచెం మననం చేసినట్టూ ఉంటుంది; కాబట్టి పరాకు చెప్పి ప్రకటిస్తున్నామ"ని ఆరంభించారు. ఇందులో ప్రాచీనకవులు అప్పుడప్పుడు చెప్పిన పద్యాలనూ, శ్లోకాలనూ తీసికొని వాటికి సంక్షిప్తంగా వ్యాఖ్య చెప్పేవారు.

''ఒక సంస్కృత విద్వాంసుడికి తెలుగు కావ్యాలంటే చాలా నీచమయిన అభిప్రాయం ఉండేది. ఒకనాడు ఆస్థానంలో అతడు ఆ అభిప్రాయం ప్రకటించాడు. 'ఆంధ్ర భాషామయం కావ్యం అయోమయ విభూషణం'. ఆంధ్రభాషా కావ్యాలు ఇనుముతో చేసిన నగలన్నాడు. ఆంధ్ర కవి ఊరుకుంటాడా. 'కాదు కాదండోయ్. "సంస్కృతారణ్య సంచారి విద్వన్మత్తేభ శృంఖలం". ఆ సంస్కృతం అడవులలో ఒళ్ళు మరచి తిరుగుతున్న పండితులనే ఏనుగులకు అంకుశం సుమండీ"- అన్నాడు. గట్టిగా తగిలి ఉంటుంది అంకుశంపోటు.

ఇదీ వీని తరహా. ఇందులో కూడా ధర్మారావు మారిన తన అభిప్రాయాలను ప్రకటిస్తూనే ఉన్నాడు. కొత్తపాళీలో అన్నట్టు వీరు ఏది పట్టినా మిషనరీ పట్టుదలతో చేసేవారనడాని కిదొక నిదర్శనం. అలా చేయనందువల్లే వ్యావహారిక భాషాఉద్యమం పండితులను దాటి జనంలోకి వెళ్ళలేకపోయిందని ధర్మారావు భావం కూడానూ.

అలాగే సాహిత్య విమర్శకుల రంధ్రాన్వేషణాసక్తిని పరోక్షంగా ఇలా చెప్పారేమోననిపిస్తూంది- మరో పరాక్‌లో. కుకవి నిందను ప్రస్తావిస్తూ-

"ఇష్టదేవతా ప్రార్థనంతో పాటు కుకవి దూషణం గూడా చెయ్యాలన్నారు. గట్టి నోరుంటే, తిట్టు బలంగా వినిపించేది. ఒకడు :

నక్కలు బొక్కలు వెతకును
అక్కరతో ఊరబంది అగడిత వెతకున్
కుక్కలు చెప్పులు వెతకును
తక్కటి నా లంజకొడుకు తప్పే వెతకున్.

అని తప్పులు వెతికేవారిని ఆశీర్వదించాడు. ఉపమానాల సదృశ్యంవల్ల, పైన చెప్పిన మూడు సంగతులు, ఎంత సహజంగా ఉన్నాయో, ఈ నాలుగో సంగతి గూడా అంత స్వభావసిద్ధం అని నిరూపించాడు. ఆ పైమూడింటియందు ఎటువంటి అసహ్యం కలుగుతుందో ఈ నాలుగోదానియందూ అలాటి అసహ్యమే కలిగించాడు కవి.

ఈరకంగా అనేక చాటువులను ధర్మారావు సామాన్య పాఠకులకర్థం అయ్యే రీతిలో చిన్నచిన్న వ్యాఖ్యానాలతో ఈశీర్షికలో పొందుపర్చాడు ఒక్కొక్కసారి 3, 4 పద్యాల చొప్పున 15, 16 సంచికల దాకా దీన్ని నడిపాడు. కొత్తగా సాహిత్యంతో పరిచయం కలుగుతున్నవారికీ, తరగతుల్లో పాఠాలు చెప్పేవారికీ ఇవి సభారంజకత్వానికి ఉపయోగపడే మసాలాలు. సాహిత్యపు రసగుళ్లాలు.

పెరటితోట సైతం, పెద్దల సుద్దులు పిన్నల పెన్నిధులనేవి కూడా ఎక్కువ భాగం సాహిత్యపరమైన శీర్షికలే. తెలుగు రచయితలు అనేక విషయాల మీద అప్పుడప్పుడు తమ రచనల్లో వెలిబుచ్చిన అభిప్రాయాలను పెద్దల సుద్దులు పిన్నల పెన్నిధులన్న దానిలో ప్రకటించేవారు.

'స్త్రీపురుషుల సమస్య' అంటూ 'పురుషుణ్ణి చూసి కలవరపడి సిగ్గుపడి యెడంగా పోయే ప్రతి స్త్రీ హృదయంలో గూ వ్యభిచారం దాక్కునే వుంది' - అన్న చలం సూక్తినీ, 'కవి భావన' అంటూ కృష్ణశాస్త్రి "భావనాశక్తి

గొప్పది. అది అందరి కవులకూ వుండదు. ఈ భావన వెనుక యుగాల్ని చిత్రిస్తుంది; ముందు యుగాన్ని చూపిస్తుంది. ఈ భావన యితరులకు వెర్రిగా ఉన్నా కవులకు మాత్రం హాయిగా ఉంటుంది. ఇది కవులకు ప్రత్యేకత" - అన్న మాటలనూ ప్రచురించారు. సిద్ధుదల పనికిరాని షష్ఠులేవో? రేశలింగం సూక్తి ద్వారానూ, శిల్పికి సత్యమే లక్ష్యమంటూ ఘుమ్మారి వారి మాటలనూ ఉదాహరించారు. ఈశీర్షికలో గురజాడ చలం, కుటుంబరావు, అబ్బూరి, పింగళి, కాటూరి, కృష్ణమంచి, ఇంద్రగంటి, వేదుల, రాయప్రోలు, వేంకట పార్వతీశ్వర కవులు, ఉపరాజు, తదితర ప్రముఖ సాహితీ వేత్తల భావాలను ప్రసారం చేశారు.

మెదడుకు మేతలో - అంతర్జాతీయ రచయితల భావాలను చాలా కొద్ది సంచికల్లోనే వేశారు. కీర్తికాంక్ష గురించి మిల్టన్ భావాన్ని 'కీర్తి' అన్న శీర్షిక కింద "అన్నీ విడిచిన అతిలోక మహానుభావులనైనా ఆఖరు దాకా వదలని అభిలాష - కీర్తి" అని ప్రకటించారు (1941 నవంబరు 19). అలాగే పొగడ్త గురించి ''సాయం- ఇచ్చిన వాడికీ పుచ్చుకున్నవాడికీ మేలుచేస్తుంది. అలాగే పొగడడం- చేసిన వాడినీ చేయించుకున్న వాడినీ పాడుచేస్తుంద"ని షేక్‌స్పియర్ సూక్తిని ప్రచురించారు. (1941 అక్టోబరు 8). అదే విధంగా 22 అక్టోబరు 1941 సంచికలో "చచ్చాడనగానే చిత్రం కీర్తిద్వారాలు తెరుచుకుంటాయి; అసూయకవాటాలు మూసుకుంటాయి'' అంటూ పెర్గుఅభిభాషణనూ అచ్చేశారు. ఈ రకంగా ఆలోచనా సరళిలో కొత్త భావాలనూ, నూతన వ్యాఖ్యానాలనూ ప్రవేశపెట్టడానికి ధర్మారావు ఈ రెండు శీర్షికలనూ ఉపయోగించుకున్నారు. అదే విధంగా జనం తరచూ వాడే నానుడులను కొన్ని ఇచ్చి "ననేమిరా, నందోరాజా భవిష్యతి, కించిత్ భోగో భవిష్యతి'' లాంటి వాటిని వివరించమని 'ఏమిటీ మాటలు' అన్న అతి చిన్న శీర్షిక (1942 మార్చి 4)లో పాఠకులను కోరారు. జనాన్ని విద్యావంతులను చెయ్యడంలో పత్రికల పాత్రను బాగా గుర్తించినవారు కనుకనే ధర్మారావు ఇలాటి ప్రయోగాలను చేయడానికి సాహసించారు.

పత్రికలు ప్రజల్లోకి బాగా వెళ్ళడానికి ప్రధానమైంది నాటి నిర్వహణలో ప్రజలకూ పాత్ర ఉన్నట్టుగా వాళ్ళు భావించేలా చేసినప్పుడే. దానికి మార్గం చర్చా వేదికలను ఏర్పాటు చెయడం. ఏదో సాంఘికమో, సాహిత్యమో ఒక సమస్యను వేసి పాఠకులను రెచ్చగొట్టి చర్చలో వాళ్ళు పెద్ద సంఖ్యలో పాల్గొనేలా చేయడం. దీనికి సంపాదకుడికి చాలా తెలిసీ, నేర్పూ ఉండడం అవసరం. ముందు ప్రజలకు చాలా సన్నిహితమైంది, ఆసక్తి ఉన్నది అయిన సమస్యను

ఏరుకోవాలి. దాన్ని జనం మధ్యకు భావాలను రెచ్చగొట్టేలా విసరాలి. అయితే అంతటితో సంపాదకుడి పని తీరదు. చర్చను తను ఆశించిన దిశలో నడపడానికీ, చాలా కాలం కొనసాగించడానికి చర్చల్లో కనబడకుండా తానూ పాల్గొంటుండాలి. చర్చలొక సందర్భంలో వ్యక్తిగత దూషణల స్థాయికి దిగ జారే ప్రమాదాలుంటాయి. అప్పుడే సంపాదకుడి ఓర్పు నేర్పులకు పరీక్ష. ఎవరినీ నొప్పించకుండా చర్చ అంతటితో ఆగకుండా అటూ ఇటూ సమాధాన పరుస్తున్నట్టుకనిపించీ కనిపించకుండా నెగ్గుకురావాలి. ఇలాటి పరీక్షలో మొదటి చర్చావేదికలోనే సంపాదకుడు అసమర్థుడుగా పడుగు లెదుటా బయటపడ్తే భవిష్యత్తులో ఆసంపాదకుడు చర్చా వేదిక ఊసు మరెత్తనక్కరలేదు. అన్ని కోణాల నుండీ వచ్చే విమర్శలకు సంపాదకుడి అమ్ములపొదిలో తగిన బాణాలుండాలి. అన్నిటికన్నా ముందు భాష మెత్తగా సంపాదకుడి చేతిలో మైనంలా మెదిగి ఒదిగిపోవాలి.

ధర్మారావు కాగడాలో ఇలాటి ఏడెనిమిది చర్చావేదికలను పలు విషయాల మీద ఈ రెండు సంవత్సరాలలో నిర్వహించాడు. వీటిలో ప్రధానంగా సామాజికాంశాలు ఎక్కువ. సాహిత్య విషయాలు కొన్ని రాజకీయ ప్రసక్తాలు మరికొన్ని కూడా ఉన్నాయి.

కాగడా ఆశయాల్లో ఒకటిగా వర్ణాంతర వివాహాలూ - స్త్రీల సమస్యలూ అంటూ ఒకసారి 41వ జన్మదిన సంచికలో ధర్మారావు చెప్పుకున్నాడు. దీనికి వారు 1940లోనే నాందీవాచకం పల్కారు.

'ప్రేమించినవాడిని పెళ్ళి చేసుకోవాలా వద్దా' అని ప్రశ్న వేసుకుని వద్దు- అని సమాధానం చెప్తూ 40 జూన్ 5వ తేదీ సంచికలో సత్యవతి వ్యాసం ఒకటి వచ్చింది. దాంతో రభస ఆరంభమైంది. 19వ తేదీ సంచికలో 'అసలు పెళ్ళి చేసుకోవాలా?' అని మొదటికే మోసం పెడ్తూ అ. వేం. రా. ఒక వ్యాసం రాశారు. సత్యవతికి సవాల్- అంటూ ఇనుమర్తి వీరభద్రరావు ఒక స్త్రీకి ఎన్ని పెళ్ళిళ్ళు కావాలని?- మరో సంచికలో ప్రశ్నించారు. వెంటనే చలసాని రామారాయ్ ధనమే మూలంగా ఉన్న ఈ సమాజంలో అసలు ప్రేమకు స్థానం వుందా? అన్న అనుమానంతో చక్కని ఆర్థిక పునాది మీద సమస్యను పరిశీలిస్తూ ఓ వ్యాసంరాశారు. ఇలా చర్చ రసవత్తరంగా సాగుతున్న దశలోనే 'పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాల'ను ధర్మారావు వ్యాసాలుగా ప్రతి సంచికలో ప్రచురించడం ఆరంభించాడు. సమస్య రెండంచులా అంటుకుంది. పురుషుడు స్త్రీనే పెళ్ళెందుకు చేసుకోవాలని మరో సంచికలో భీమన్న

ఊహించని కోణం నుండి నిప్పంటించారు. ఇలా సాగిన చర్చల్లో మంత్రిరావు సత్యనారాయణ, జగం, వసంతలు సత్యవతిని సమర్థిస్తూ తూలనాడుతూ పాల్గొన్నారు. సత్యవతి సవాళ్లకు జులై 31 సంచికలో 'శ్రీమతి దేవి' సమాధానం చెప్తూ పురాణాల నన్నిటినీ జల్లెడపట్టి ఆనాడు కూడా పురుషుడికి స్త్రీపై ప్రేమ లేదనీ, స్వార్థానికి వాడుకున్నాడనీ అంటూ చాలా తాత్విక జ్ఞానంతో సత్యవతి వాదనను సమర్థించారు. బండి బుచ్చయ్యచౌదరి, వి. కాశి, మధునాపంతుల వెంకట సూర్యనారాయణమూర్తి, చెన్నాప్రగడ తిరుపతిరావు ఇంకా అనేకమంది పాల్గొన్నారు. చివరకు సంపాదకులే సెప్టెంబరు 11 సంచికలో ఇక దీన్ని వచ్చే సంచికతో ముగిస్తామని బతిమాలుతూ ఆపాల్సి వచ్చింది. సత్యవతి తమ సమాధానాన్ని సెప్టెంబరు 25 సంచికలో కొంత, అక్టోబరు 2వ సంచికలో కొంతా రాసి, 9వ సంచికతో చర్చను ముగించారు. వారి ప్రధాన వాదం ప్రేమను పెళ్ళిబేరంగా నాదకూడదంటూ, ధనానికే ప్రముఖ స్థానం ఉన్న ఈ సమాజంలో ఉన్నది- ప్రేమ అనలేమని, కామం అనవచ్చనీ అన్నది. భార్యాభర్తల సంబంధాలూ, భర్త చనిపోతే భార్యకు జరిపే కేశఖండనం లాంటి అనాగరక సంస్కారాలూ ఈ చర్చల్లో వచ్చాయి. స్కూలు విద్యార్థులను సైతం ఇది ఆకర్షించి, చర్చల్లో నిర్మొహమాటంగా పాల్గొనేలా చేసి, సుమారు నాలుగైదు నెలలు సాగింది. చివరకు సంపాదకులుగా "మనకు కావలసింది చైతన్యం, భావ సంచలనం. అది కలిగింది. చాలామంది చక్కగా ఆలోచించారు" అని అంటూ ముగించారు. భీమన్నను చర్చ విషయమై అడిగితే ఆరోజుల్లో ఇది బాగా యువకుల్లో సంచలనం రేపిందని అన్నారు. ఇంతకూ ఆ సత్యవతి ఎవరో కాదు ధర్మారావే.

ఇలాంటిదే 'కుటుంబాలలో పరిస్థితులు' - అన్న విషయం మీద చర్చ. ఇందులో తాపీ వారే ఎక్కువగా కుటుంబం అందులోని వ్యక్తులు వాళ్ల జీవించే 'జమిలి బతుకులు' వీటిని బహిరంగపరుస్తూ అనేక మారుపేర్లతో వ్యాసాలు రాశారు. కుటుంబంలో ప్రేమ, ఆదర్శం అన్నవి వట్టి మోసాలని 23-7-41 సంచికలోనూ, 30-7-41 సంచికల్లోనూ ఇబ్సన్, షా, ఆస్కార్ వైల్డ్‌ల రచనలనూ వత్తాసుగా తీసుకొని నిరూపించారు. ఇలా ఉండే మన కుటుంబాలలో సంబంధాలు, విలువలు పూర్తిగా మారాలని పదేపదే చెప్పారు. దుష్టబుద్ధి, నీతిపరుడన్న మారు పేర్లతో ఈ వ్యాసాలు (6-8-41) రాశారు. ఇందులో మన కుటుంబాలలోని వారి 'హైఫామిలీ' లక్షణాలను తూర్పారబట్టారు. 22-10-41 సంచికలో 'కుటుంబాలలో ఉన్న కు-' అన్న వ్యాసంలో లక్ష్మణ పట్నాయక్ అన్నవారు కులాలను తెల్పే గుర్తులు పేర్లకు తగిలించుకోడాన్ని బాగా విమ

ర్శించారు. బ్రాహ్మణులు అంటే గొప్ప అన్న భావంతో తెలుగునాట వస్తున్న కమ్మబ్రాహ్మణులు, నాయీ బ్రాహ్మణులు, గౌడ బ్రాహ్మణులు, విశ్వ బ్రాహ్మణుల వంటి కులాలను వ్యంగ్యంగా ఎత్తిపొడిచారు. ఇదంతా డబ్బుతో ముడి పడింది తప్ప జ్ఞానంతో కాదని తేల్చారు. కుటుంబాలలో స్వచ్ఛత, నిర్మలత్వం ఉండాలంటే డబ్బుతో ప్రమేయంలేని కుటుంబ సంబంధాలుండాలనీ, కులాల పట్టింపులుండని సమాజం రావాలనీ అందుకోసం ప్రస్తుత సామాజిక విలువలు తప్పనిసరిగా మారాలనే సూత్రం ఈ వ్యాసాలలో గర్భితంగా సాగుతుంది. ఇవన్నీ ధర్మారావే మారుపేర్లతో రాశారు.62

తర్వాత "మత్స్య కూర్మ వరాహశ్చ . ." అన్న శ్లోకం ఆధారంగా 8వ అవతారం ఏది? అని ఒక చర్చను "పండితులకు పని కల్పించారా? ఏమన్నారు? కొంచెం వ్రాసి పంపించండి." అంటూ 15-1-41 సంచికలో ఆహ్వానించారు. కృష్ణుడని కొందరూ, బలరాముడే అని కొందరూ అనేక ప్రాచీన గ్రంథాలూ, పురాణాలను సాక్ష్యాలు పలికిస్తూ రచనలు సాగించారు. బలరాముడేనని ధర్మారావు సాధికారికంగా నిరూపించారు.

మరో చర్చావేదికలో 'సాహిత్యం చేయవలసిన పని'ని గురించి చాలా నిశితంగా వాదోపవాదాలు జరిగాయి. ఆరోజుల్లో ఆంధ్ర ప్రభ (14-12-41 సంచిక)లో జి.వి. కృష్ణారావు ఒక వ్యాసంలో ఈ విషయాన్ని తడుముతూ రాశారు. దానికి సమాధానం యం. వెంకట్రావు ఒక పెద్ద వ్యాసాన్ని 41 డిసెంబరు 10, 24 సంచికల్లో ఈ చర్చావేదికనుపయోగించుకుని రాశారు. వీరు పులుపుల శివయ్యగారేనంటూ మోహన్రావు సాక్ష్యం పలుకుతున్నారు. చదలవాడ పిచ్చయ్య సమాజానికి సాహిత్యానికి ఉన్న సంబంధాన్నీ అది చేయవలసిన పనినీ అప్పటికే భారతదేశంలో వచ్చిన (1936 నుండీ) అభ్యుదయ రచయితల ఉద్యమ ఆదర్శాల వెలుగులో వివరించారు (14 12-1941).

ఎం.ఎన్. రాయ్ అంతకు ముందే ఈ ప్రాంతమంతా పర్యటించి తన భావ బీజాలను నాటిపోయారు. ఆ మొలకలన్నీ తలెత్తడం ఆరంభించి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో రాయ్ లక్షణాలనే కొందరు పుణికి పుచ్చుకుని ఇక్కడా ప్రతి సమస్యనూ పరిశీలించడం ఆరంభించారు. ఇందులోని బండారాన్ని 'గబ్బిలాల విజృంభణ' అంటూ (5-2 41) ఓ వ్యాసం రాశారు. చివరకు పత్రికాభిప్రాయంగా రాయిజం సరైన ఆలోచనా విధానం కాదు- అంటూ నిర్ధారించారు. ఈరకంగా వామపక్ష రాజకీయాభిప్రాయాల్లో పెడధోరణులుగా తలెత్తిన వాటిని కూడా నాడు కాగడా సశాస్త్రీయంగా విమర్శించింది. ఇందులో సెట్టి ఈశ్వరరావు, తాపీ మోహన్రావుల పాత్ర చాలా ఉంది.

ఇన్ని రకాలుగా జనంలోని ఆలోచనావిధానాన్ని మధించి నిజాన్ని వెలికి తీయడానికి కాగడా శ్రమించి సఫలమైంది.

ధర్మారావు ఈ చర్చలన్నిట్లో నిరంతరం పాల్గొంటూనే, జనప కచ్చడాలు, పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు, అవస్నీ సీకస్నేనా నాటిక[63], ఆడుదాని ఆలోచన అన్న కుప్రిన్ కథ (అనువాదం 12-6-40) వొన్ని కవితలు ప్రచురించారు. అనేక చిన్నచిన్న విషయాల మీద చక్కని పరిశోధనాత్మక వ్యాసాలు రాశారు అలాటివాటిలో 41 నవంబరు 19న రాసిన నవ్వు, 41 డిశంబరు 5 న రాసిన సృష్టికి మూలం ఏది అన్నవి ఉన్నాయి.

ధర్మారావు 1933 నుండి 1936 వరకూ ఏవీ రాయక మౌనంగా ఉన్నాననీ, చాలా వేలపేజీల ప్రపంచ సాహిత్యం, సామాజిక శాస్త్రాలను చదివాననీ కొత్త పాళీ పీఠికలో రాసుకున్నాడు. ఆ అధ్యయనం వెలుగులే ఈ కాగడాలో ప్రతి అక్షరంలోనూ, వ్యాసంలోనూ కనిపిస్తాయి. ప్రతి సమస్యనూ మూలమట్టంగా పరిశీలించడం, చుట్టూరా ఉన్న సమాజ ప్రభావాలతో ముడిపెట్టి ఆలోచించడం, గత చరిత్రను అంచనా వేస్తూ ఈ సమస్యను వివరించడం అన్న లక్షణాలన్నీ ఈ పత్రికలో ధర్మారావు రాసిన ప్రతి రచనలోనూ కనిపిస్తాయి.

కాగడా పత్రిక స్త్రీ ఉద్యమాన్నీ,[64] విద్యార్థి ఉద్యమాన్నీ (వాటి మహాసభల వివరాలను ప్రకటించింది), రైతు ఉద్యమాన్నీ (ధర్మారావు స్వయంగా గుంటూరు జిల్లా రైతు మహాసభల్లో పాల్గొన్నారు. ప్రారంభకులు కూడానూ. 24.2.41 రిపోర్టు, 19.3.41, కాగడా)- వీటన్నిటికి తలమానికంగా ఆంధ్ర రాష్ట్ర ఉద్యమాన్ని బలపర్చింది.

ఆంధ్ర రాష్ట్ర స్థాపనకోసం పత్రిక ద్వారా ధర్మారావు చాలా కృషి చేశాడు. రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వంలో అనేకసార్లు కనిపించిన ఊగిసలాట ధోరణులను కాగడా గాలి విసురుల్లోనూ, సంపాదకీయాల్లోనూ బాగా విమర్శించాడు. కాంగ్రెసు నాయకుల్లోని తమిళులు తెలుగులకు చేస్తున్న అన్యాయాలను సత్యమూర్తి, రాజాజీలాంటి వారికి బహిరంగ లేఖలను రాసి ప్రచురించి వెల్లడించాడు ధర్మారావు. తెలుగువాళ్ళు తమకుతామే పూనుకొని ఉద్యమించందిఈ నాయకులవల్ల కానేకాదని అనేకసార్లు హెచ్చరించాడు. ఈ రకంగా ధర్మారావు ఆంధ్ర రాష్ట్ర ఉద్యమాన్ని - నిర్మించారని అనలేము కానీ - దాన్ని జనం మధ్యకు తీసికెళ్ళి జనంలో చైతన్యం రగుల్కొల్పారని అనవచ్చు.[65]

వీటన్నిటినీ మించి ప్రధానంగా నాటి ఆంగ్ల ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీ మీద జరుపుతున్న దమనకాండనూ, అత్యాచారాలనూ, సంరక్షణ చట్టాల పేరుతో చేసిన నిర్బంధాలనూ, వాటిని విచారిస్తున్నామనే కోర్టు ప్రహసనాలనూ

కాగడా బాగా ప్రచురించింది. మోహన్ కుమార మంగళం - ఇంకా అనేక కమ్యూనిస్టు నాయకుల మీద నాడు పెట్టిన మద్రాసు కుట్ర కేసును యథా తథంగా ప్రజలకు కాగడా తెలియ చేసింది. సత్యాగ్రహ సమరంలో వివిధ పార్టీల ప్రాతినిధ్యాన్ని సరిగా అంచనా వేసి వార్తల రూపంలో, వ్యాఖ్యల రూపంలో వెల్లడించింది. అంతర్జాతీయ విషయాలనూ, సోషలిస్టు దేశంలోని అనేక విషయాలను వ్యాసాల రూపంలో ప్రజల్లో ప్రచారం చేసింది.

ముఖ్యంగా యుద్ధం ప్రపంచానికి ఎంత వినాశకరమైందో తెల్పుతూ, హిట్లరు యుద్ధకాలపు ఎత్తులను జిత్తులనూ బహిరంగ పరుస్తూ వ్యాసాలు ప్రకటించింది. 'చరిత్రలో రక్తముద్ర' అంటూ 3.9.41న ఒక వ్యాసంలో హిట్లర్ రక్తదాహాన్నీ, చరిత్రకు చేస్తున్న ద్రోహాన్నీ, ప్రపంచానికి పెడ్తున్న చిచ్చునూ ధర్మారావు చాలా విపులంగా, నిశితంగా రాశాడు.

రెండవ ప్రపంచయుద్ధం, కాంగ్రెసు ఊగిసలాట విధానం, ద్రవ్యోల్బణం, కార్మికులు తమ హక్కుల కోసం భారతదేశమంతటా జరుపుతున్న సమ్మె పోరాటాలు వీటన్నిటినీ కాగడా ప్రతిబింబించింది. ఆ రోజుల్లో ఈ పత్రిక 'తమపత్రిక'ని కమ్యూనిస్టులూ, తమదేనని సాహిత్యకారులూ, ఏది ఏమైనా ప్రపంచం మొత్తాన్ని కళ్ళముందు చూపెడ్తోందంటూ సామాన్య ప్రజలూ అనుకుంటూండేవారు

ప్రతి ఆరునెలల సంచికలనూ కలిపి వాల్యూములుగా అమ్మి కొత్త వరవడి పెట్టారు కాగడా సంపాదకులు. జన్మదిన సంచికలను భద్రపరచుకో దగ్గ విలువైన సంచికలుగా రూపొందించేవారు కాగడా నిర్వాహకులు. యుద్ధ సమయంలో మద్రాసులో బాంబులు పడడంతో పత్రికను 1942 మధ్యలో ఆపేసి ధర్మారావు చల్లపల్లి వెళ్ళాడు.

1949లో జనవాణి వారపత్రిక ఆరంభించేవరకూ ధర్మారావు విజయ వాడ కేంద్రంగా పనిచేశాడు. నాటి రాష్ట్ర ప్రభుత్వం వీరిని రీజినల్ వార్ టెక్నీషియన్స్ రిక్రూటింగ్ ఆఫీసరుగా నియమించింది. అంతకు ముందే అంటే యుద్ధం ఆరంభం కాగానే ధర్మారావును ఈ పదవికి ఆహ్వానిస్తే వారు తిరస్కరించారు. జర్మనీ సోవియట్ యూనియన్ మీదికు తన సైన్యాలను పంపడంతో యుద్ధ స్వభావంలో మార్పు వచ్చింది. అంతవరకూ సామ్రాజ్యవాద యుద్ధంగా ఉన్నది ఒక సోషలిస్టు దేశంతో హిట్లరు తలపడడంతో ప్రపంచంలోని సోషలిస్టు అభిమానులూ, కమ్యూనిస్టు అభిమానులూ హిట్లరు చర్యను మరింతగా గర్హించడం ఆరంభమైంది. అతడి సమాధి రష్యా దేశ భక్తుల చేతుల్లో ఉన్న దన్న మాట నిజమే. అయినా ఇతరులూ నాజీ వ్యతిరేక శిబిరంలో చేరడం

ఆవశ్యకమైంది. సరిగ్గా ఈ పరిణామ కాలంలో ధర్మారావుకు తిరిగి ఈ ఉద్యోగం కోసం పిలుపొచ్చింది. వెంటనే అంగీకరించాడు.[66] విజయవాడ కార్యస్థానంగా రాయలసీమ, సర్కారుల్లో తిరిగాడు. జాషువా, కొమ్మూరి పద్మావతి లాంటి ప్రముఖ కవులనూ, రచయితలనూ ఈ యుద్ధ ప్రచార యంత్రాంగంలోకి ధర్మారావే తీసుకొచ్చాడు. వార్ టెక్నీషియన్స్ రిక్రూటింగ్ ఆఫీసర్‌గా ఉన్నప్పుడే అట్లూరి పిచ్చేశ్వర్రావునూ నేవీలోకి తీసుకున్నాడు.

ఈ కార్యక్రమంలో ధర్మారావు రాయలసీమలో తిరుగుతున్న కాలంలోనే కాలికి 'ఎగ్జిమా' వచ్చింది. జీవితాంతం వరకూ వారిని వేధించింది. సాధారణంగా పంచ కట్టుకునే వారు దీనివల్లే 'గూడకట్టు' కట్టుకోడం ఆరంభించారు. చనిపోయేవరకూ అలానే కట్టుకున్నారు.

దేశం పోయిన పోకిళ్ళను ధర్మారావు గమనించాడు. వచ్చిన మార్పులను పరిశీలించాడు. జన చైతన్యం ఏ మేరకు పెరిగిందో కనుక్కున్నాడు. ప్రజాస్వామ్యాన్ని మూడు పూలూ ఆరు కాయలుగా చేస్తామంటూన్న ప్రభుత్వ విధానాలనూ ఆకళింపు చేసుకున్నాడు. మళ్ళీ పత్రిక నడపడం అవసరమనే భావించాడు. అందుకు సన్నాహాలు పూర్తి చేసుకున్నాడు. 'జనవాణి' పత్రిక (వార) నడపడానికి నిశ్చయించుకున్నాడు.

## జనవాణి

''నాటి జనవాణి పరతంత్ర. నేటి జనవాణి స్వతంత్ర. అప్పటిలాగ ఇప్పుడు గూడా, మీ సేవచేయడమే మా దీక్ష. కాగడా పట్టుకుని కల్లాకపటము లేకుండా సత్యాన్ని కనబరచడమే మా పని. జంకూ గొంకూ లేకుండా జనవాణిని ప్రకటించడమే మా ఉద్యోగం. అన్ని రంగాలలోనూ ఆంధ్రుల పురోగమనానికి పాటుపడడమే మా సూత్రం.'' అంటూ ధర్మారావు 8.2.1949 న తొలి సంచికలో రాస్తూ 'జనవాణి'కి ఉపక్రమించారు. కాగడా పత్రికను కొన్ని సూత్రాల ఆధారంగా నడిపితే, దీన్ని పూర్తిగా ఆంధ్రుల పురోగమనానికి అవసరమైన అన్ని రంగాలకూ అంకితం చేశారు. పెట్టుబడిదారీ వ్యవస్థలో సామాజిక చైతన్యం రాజకీయం ద్వారా వ్యక్తమవుతూంటుంది. ఈ అంశం బాగా గుర్తెరిగిన ధర్మారావు తన చుట్టూ ఉన్న పెట్టుబడిదారీ వ్యవస్థా- దాని కుట్రా,

మేలు కీళ్లను, తద్వారా సంక్రమించే విషయాలను వెల్లడించడం రాజకీయాలను వెల్లడించడమే అవుతుందని కాగడాలోకన్నా జనవాణిలో రాజకీయాంశాలకు ప్రాధాన్యమిచ్చారు.

రెండో ప్రపంచ యుద్ధం చూపించిన స్పష్టమైన పెట్టుబడిదారీ శక్తులు సోషలిస్టు శక్తుల్లో తాను సోషలిస్టు శక్తులను బలపర్చడం అవసరమని ధర్మారావు గ్రహించాడు. ఆ శక్తులు నడిపిన ప్రతి ఉద్యమాన్నీ జనవాణి ద్వారా ప్రచారం చేశాడు పెట్టుబడిదారీ సమాజం సామ్రాజ్యవాద లక్షణాలతో ఎలా దోచి ప్రజలను పీడిస్తోందో వెల్లడించాడు. అనేక ముసుగుల్లో ఆ శక్తులు ప్రపంచాన్ని చీల్చి పంచుకోడానికి ఎలా తాపత్రయ పడ్తున్నాయో, ఆ వెంపర్లాటలో ప్రపంచ మార్కెటును పట్టుకోడానికి చిన్న చేపల్నెలా మింగుతున్నాయో కూడా జనవాణి ద్వారా పోరాటశక్తులైన జనం ముందు వివరించాడు.

కమ్యూనిస్టు పార్టీ ప్రజాశక్తిని వారపత్రికగా 1942లో మొదలెట్టింది. ధర్మారావు కుమారుడు మోహనరావు కాగడా ఆగడంతో అందులో చేరాడు. దినపత్రికగా ప్రజాశక్తి 1945లో ఆరంభమైంది. 1948 వరకూ వచ్చి ప్రభుత్వ నిర్బంధంవల్ల ఆగక తప్పలేదు. ఇంతకాలం ధర్మారావు - అంటే 1942 నుండి 1946 వరకూ- కొంతకాలం వార్ టెక్నీషియన్స్ రిక్రూటింగ్ ఆఫీసర్‌గానూ, కొంతకాలం యుద్ధప్రచార శాఖలోనూ పనిచేస్తూ తెలుగు చిత్రాలకు మాటలూ, పాటలూ రాస్తూనే ఉన్నారు. చల్లపల్లి రాజావారి ఆహ్వానంతో కొద్ది మాసాలు చల్లపల్లిలోనే ఉండి ధర్మారావు కుటుంబం విజయవాడకు వచ్చేసింది. మోహనారావు 1942 నుండి 1948 వరకూ విజయవాడలో ప్రజాశక్తిలో పనిచేస్తూండేవాడు. చాణక్య వార్ టెక్నీషియన్‌గా 'దేవలాలీ' మొదలైనచోట్ల శిక్షణపొందుతూండేవాడు.

1946 మార్చిలో ధర్మారావు పూర్తిగా చిత్రరంగంలో పనిచేయాలని తమ మకాం విజయవాడ నుండి మద్రాసు మార్చారు. 1946లోనే మోహనారావుకు రాజమ్మతో వర్ణాంతర వివాహమైంది. రాజమ్మ బ్రాహ్మణులు. తరువాత కొద్ది మాసాలకే 1946లోనే చాణక్య వివాహం, ధర్మారావు మనుమరాలు సరోజినితో అయింది. ఈ రెండు పెళ్ళిళ్ళూ నిరాడంబరంగా ఏ ఆర్భాటాలూ లేకుండా జరిగాయి విజయవాడలో. ఆ వెంటనే ధర్మారావు మద్రాసెళ్ళారు. మరి కొద్దికాలానికి చాణక్య కూడా అక్కడికి చేరుకుని సినీరంగంలో ప్రవేశించాడు. ప్రజాశక్తి ఆగిపోవడంతో మోహనారావు 1948లో మద్రాసు చేరుకున్నాడు. మోహనారావుకు ఉద్యోగం ఇప్పించడానికి ధర్మారావు చాలా కృషి చేశాడు. కమ్యూనిస్టు కావడాన ఎక్కడికెళ్ళినా చుక్కెదురే.67

అప్పటికే ధర్మారావు భావాలు పూర్తిగా వామపక్షాలవైపు తిరిగాయి. మోహనరావు, రాజమ్మ కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేస్తున్నారు. కమ్యూనిస్టు పార్టీకి పత్రికన్నదేదీ లేదు. ఇవన్నీచూసి ధర్మారావు 1949లో జనవాణిని ఆరంభించాడు. మోహనాన్ని అండగా ఉంటారన్నదే వారి ఆశ.

జనవాణిలో- మోహనరావు, అంత వరకూ విశాలాంధ్ర మాస పత్రిక నడిపి దాన్ని ఆపేసి వచ్చిన సెట్టి ఈశ్వరరావు, కొండేపూడి లక్ష్మీనారాయణ, బొమ్మారెడ్డి వెంకటేశ్వర్రావులు కొంతకొంత కాలం పని చేస్తూండేవారు. పత్రిక బి. యస్. మూర్తి నవజీవన్ ప్రెస్‌లో చాలాకాలం, జనవాణి ప్రెస్‌లో కొంతకాలం అచ్చయింది. ఈ పత్రికలో పనిచేసిన వారంతా అంతకు ముందు ప్రజాశక్తిలోనూ పనిచేశారు. అందుకే జనవాణి ఒకరకంగా ఆరోజుల్లో కమ్యూనిస్టు పార్టీకి సొంత పత్రిక లేని లోటు తీర్చింది. పార్టీ ప్రచారాన్ని విశేషంగా కొనసాగించింది.

జనవాణిలో సుమారు ఇరవై శీర్షికలుండేవి. అందులో అయిదో ఆరో మినహాయించి మిగిలినవన్నీ రాజకీయాలకోసం నిర్వహించినవే. అన్ని శీర్షికలు ఒకే సంచికలో కాక సగటున పది పదిహేను శీర్షికలు సంచికల్లో ఉంటూండేవి. సంచికకో అయిదారు శీర్షికలు మాత్రం తప్పకుండా ఉండేవి. 'కదలిక' అన్న దాంట్లో ప్రజా ఉద్యమాలూ, 'జనవాణి' అన్న దాంట్లో కొన్ని సందర్భాల్లో లేఖలూ, ఒక్కోసారి సంఘటనల మీద వ్యాఖ్యలూ ఉంటూండేవి. రాష్ట్ర రాజకీయాలను, అందులోని నాయకుల జమిలి బతుకులనూ నాటకాల తెరలనూ చించి తూర్పారపట్టడానికి 'పొల్లు - నెల్లు' అన్న దాన్ని నిర్వహించారు. ఆరంభంలో "ఇప్పుడు జరుగుతూన్న రాజకీయ, సాంఘిక, సారస్వతాది విషయాలను తూర్పారపట్టడానికి వినియోగిస్తాము. 'పొల్లు' అయిన దానిని ఎగరగొడ్తాము. నికరమైన నెల్లు (ధాన్యము) ఏమైనా ఉంటే కళ్ళనద్దుకొని స్వీకరిస్తాము. లోటుపాటులు తెలియచేస్తూ ఈ విధంగా అధికారులకు సహకారం చేయాలనే మా ఉద్దేశము" అంటూ మొదటి సంచికలో దీని నిర్వహణ వెనక ఉన్న భావాన్ని వెల్లడించారు. కాంగ్రెసు మంత్రివర్గంలో అవినాశ లింగం చెట్టి, వేముల కూర్మయ్యలను మంత్రివర్గం నుండి గుట్టుచప్పుడు కాకుండా జార్చారు. ఆ సందర్భంలో ఇదేమిటి అని అడిగిన ప్రతిపక్షసభ్యులకు గోపాల రెడ్డి 'అదంతా కాంగ్రెసు పక్ష గృహవిషయం' అని దబాయించాడు. దీన్ని ఈ శీర్షికలో విమర్శిస్తూ "పరిపాలన సాగించడానికి గజ్జె కట్టిన తర్వాత ఆ పక్షానికి గృహవిషయం అంటూ ఒకటి, బహిర్విషయం అంటూ ఒకటి

ఉండకూడదన్న మాటకూడా లేకుండా పోయింది." అంటూ అంటపొడిచాడు. (20.4.1949).

"కర్ణపిశాచం" అన్నది మరోటి. ఇదీ దేశంలో అక్కడక్కడ జరిగిన విషయాలను విన్నారా? అని మొదలెట్టి హాఁ, హీఁ, అంటూ వాళ్ళూ వీళ్ళూ అన్నట్టు చెణుకులు విసరడం ఇందులోని లక్షణం. రాజన్ నాడు మన ఆహార మంత్రి. ఆయన్ని ఓ శాసన సభ్యుడు "బియ్యం ధరలను తగ్గించే ఏర్పాటేదైనా చెయ్యరాదా?" అని అడిగాట్ట. అందుకాయన "నేనేం చేసినా అది తగ్గదు. నన్నేం చేయమంటారు" అని అన్నాట్ట. ఆ పక్కనున్న మరో సభ్యుడిది విని "ఇంటికెళ్ళి పులిహోర చక్కెర పొంగలీ తినమంటా"మని ముఖం చిట్లించుకున్నాట్ట. నిజంగా ఈ చివరి చురక ధర్మారావుది కాక మరెవరిది. (2.3.1949).

అలాగే 'వెర్రివెధవ' న్న దాంట్లో ఎక్కువ భాగం సాహితీపరమైన విమర్శలు చాలా వ్యంగ్యంగా, సరళంగా, హృద్యంగా చేశాడు. ఒక సందర్భంలో స్వాతంత్ర్య దినం నాడు కవర్లు విడుదల చేసింది ప్రభుత్వం. దాని మీదున్న విష్ణువు బొమ్మనాధారం చేసుకుని పత్రికల్లో దుమారం చెలరేగింది. అది ఆధారంగా చేసుకునీ, మన ప్రభుత్వం అదే సమయంలో సోమనాధ దేవాలయం పునరుద్ధరణకు పూనుకోడాన్ని కలిపి ఇలా అన్నాడు. "ఇంకా అనుమానమటండీ? ఇన్ని దేవాలయాలు పాడుపడిపోయినా వాటినన్నిటినీ పునరుద్ధరించడానికి చూచారా?" లేదు సోమనాధ దేవాలయాన్నే అని అంటూ ఎన్ని లక్షలూ, కోట్లూకావాలో తెలుసా ఆ పునర్నిర్మాణానికి-ఆ రూపాయలన్నీ దేశ సేవకోసం, ప్రజా సౌఖ్యం కోసం వినియోగిస్తే ఈ పన్నుల బరువు ఎంత తగ్గి ఉండేది, ప్రజాసామాన్యానికి కూడూ గుడ్డా ఎంత లభించేది? అయినా ఆ సోమనాధ దేవాలయం నిర్మించి తీరాలన్నాడు" - అంటూ ధర్మారావు తన బాధను- అదే ప్రజల బాధను పరోక్షంగా ఎత్తి చూపాడు. మరో దాంట్లో రిపబ్లిక్ సందడిలోని బండారాన్ని బయటపెడ్తూ "తెలిసిన సందడీ కాదు తెలియని సందడీ కాదు- వట్టి వెర్రి సందడి. ఆనాడు 1947 అగస్టు 15న స్వతంత్రం వచ్చిందంటే సందడి చేశారు. ఆనాడు వచ్చిందేమిటో కనబడదు. తెల్లదొరలు పోయి నల్లదొరలు రావడం తప్పితే. పాత పద్ధతులన్నీ పకడ్బందీగానే సాగాయి. పస్తులు పస్తులులాగే నిలిచాయి. ఇక ఈనాడొచ్చిందేమిటి?" ఇదీ మన స్వతంత్రం మేడిపండు. ఆనాడు కమ్యూనిస్టు పార్టీ అంచనాను సరిగ్గా ధర్మారావు ఈ శీర్షికలో వెలిబుచ్చాడు.

'పేలుడుగాయలు' - దీని తత్వాన్ని విడమర్చి చెప్తూ "కాయలను

కొంచెం నొక్కితే టప్మని పేలిపోతాయి .... తాకనంత సేపే కాయ. తాకితే పోయె'' (5-10-1949) అంటాడు. మన రాజకీయ సమస్యలూ అలాటివే. రూపాయ విలువ తగ్గటమన్న సమస్య - పట్టాభి మాటలూ ఈ శీర్షికలో ఒక చోట ప్రస్తావించాడు. దీనికి కారణం చీకటి బజారని పట్టాభి అన్నాడు. దాన్ని పట్టుకొని ఈ రాజ్యాంగంలో మెలిగే నాయకులకు ఇనుప ముఖాలూ-నూనె నాలుకలూ ఉంటాయి కనుక ఇది నిజమని నమ్మొద్దని ధర్మారావు వ్యాఖ్య. అంతేకాదు ''చిన్ననాటి నుంచీ కాంగ్రెసు సంస్థకు పట్టుగొమ్మలలాగా ఉన్న మహనీయులంతా ఈశీర్షికల కిందకు రావలసిన వారే కదా'' అంటూ రహస్యాన్ని బట్టబయలు చేస్తారు.

'ప్రపంచ సమీక్ష' - 'జగత్ ప్రగతి' లలో ప్రపంచ రాజకీయాలూ, పురోగమనం చెందే సోషలిస్టు దేశాల పద్ధతులూ వివరించేవారు. 'కొత్త పుంతలు'లో ముఖ్యంగా కొరియా, చైనా, జెకొస్లొవేకియా, రష్యాలాంటి దేశాల విశేషాలను వివరిస్తూ మనదేశ సమస్యలతో ముడేస్తూండేవారు 'తెలుగుగడ్డ' అన్న శీర్షికను 'కలన' గారు నిర్వహించారు. తెలంగాణా - ఆంధ్ర ప్రాంతాల్లో వివిధ సమస్యలకు ప్రజాదృష్టితో వివరణ ఇందులో కనిపిస్తూండేది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బోధనాభాష ఉర్దూ పోయి హిందీ పెట్టాలన్న తలంపు కొందరికి ఒక దశలో వచ్చిందట. దాన్ని అతి తీవ్రంగా విమర్శించి తెలుగుకు జరుగుతున్న అన్యాయాన్ని వెల్లడించారు (29-2-1952). 'వారం వారం' అన్నదాంట్లో రాష్ట్ర,జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలను మార్క్సిస్టు దృష్టితో కె. వి. రమణారెడ్డి విశదీకరిస్తూండేవాడు. రాయలసీమ కరువు రోజుల్లో 'కరువులో మావూర'న్న శీర్షిక కింద ఆయా గ్రామాల్లో ప్రజల బాధను గుండె కరిగించేలా వివరించాడు. ఇలా చాలా శీర్షికలు జనవాణిలో ఉండేవి.

కాగడాలో మొదలెట్టిన 'పద్యభిక్ష' శీర్షికను జనవాణిలో కొనసాగించాడు. స్వాతంత్ర్యం వచ్చి ఏం తెచ్చిందో చెప్పమని ; ఎప్పుడో ఏదో ప్రభుత్వం వాళ్లు చేస్తారు ; కానీ ''ప్రస్తుతం చెయ్యబోయేది ఒక్కటే. ఆ పని ఏదైతే మంచిదంటారు" - రాయండి. అదీ ''వృత్తాలూ శార్దూలాలూ వద్దు. సౌమ్యమైన చక్కని గీతాలు పంపండి'' అంటూ (2-3-1949) అర్థించారు. ఇది కొంత కాలమే సాగింది. సాహిత్య పరంగా 'వాఙ్మయ గుళికల'న్నది ఉంది. ఇందులో ప్రపంచ సాహిత్యంలోని ప్రసిద్ధ రచనల సంక్షిప్త కథలను అందించారు. అంకుల్ టామ్స్ కాబిన్ (10-9-52) అహోబలరావు ; యుద్ధమూ-శాంతి (17-10-52) వంటెత్తు ; బొమ్మరిల్లు (ఇబ్సన్ డాల్స్ హౌస్)

(1-10-52) వంటెత్తు; విలియం మెటల్ (జర్మన్ నాటకం. షిల్లర్) (24-12-52) పేరు లేదు - వంటివి ఈ శీర్షికలో వచ్చాయి. ఎక్కువ భాగం ధర్మారావే అనువదించాడు. 'సాహిత్య మీమాంస' ను విద్యాన్ విశ్వం నడిపాడు. ప్రజా కవిత్వం ఏది? అభ్యుదయ రచన ఎలాగుండాలి? వంటి వాటిని చాలా స్పష్టంగా ఇందులో చర్చించేవారు. అప్పుడప్పుడు వాసిరెడ్డి, కొత్తపల్లి రంగారావు, కొడవటిగంటి కూడా ఈశీర్షిక కింద రాశారు.

ధర్మారావే ఎం.ఎస్ నారాయణ అన్న పేరుతో 'కోదండరాయలతో కొన్ని నిముషాల'న్న శీర్షికను ఆరేడు సంచికల్లో సాగించాడు. ఇందులో ప్రధానంగా తార్కిక జ్ఞానంతో పదాలనూ - పద్యాలనూ వివరించాడు. ఒకదాంట్లో 'గూఢ రహస్యం' అన్న దాన్ని చెప్తూ గూఢమన్నా బట్టబయలు కాందే - రహస్యమన్నా అలాటిదే, ఇదెందుకొచ్చిందంటూ ఆరంభించి అతినేర్పుగా ముగించారు 3-9-52. కవులనూ - రచనలనూ ఇందులో ప్రస్తావించారు.

వ్యాస రచన ద్వారా కూడా ధర్మారావు 'జనవాణి' లో అనేక సమస్యల మీద సంచలనం కల్గించాడు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిని ఆస్థానకవిగా నియమించినప్పుడు వీరికెందుకివ్వాలంటూ 'సందేహి' అన్న పేరుతో చర్చ లేవదీశాడు (13-7-1949). దేశ స్వాతంత్ర్య పోరాటంలో వీరు చేసిందేమిటి, వీరి రచనల్లో స్వాతంత్ర్య పిపాస ఉందా ?- దర్బారులు లేని ఈనాడు ఆ రోజులకు చిహ్నంగా ఈ నియామకం ఎందుకు? అంటూ గ్రాంధిక భాషలోచర్చ లేవదీశారు. వడ్లమూడి గోపాలకృష్ణయ్య, ఉక్కుడాల రామ్మూర్తి, ఎం. ఆర్ కృష్ణ ఇంకా అనేకులు పాల్గొని అటూ ఇటూ వాదించారు. చివరకు 24-8-49 న మరో వ్యాసం రాస్తూ దేశం గతే ఇలా అఘోరిస్తున్నప్పుడు దీన్ని పట్టించుకోవడం అనవసరమంటూ ఉసూరుమన్నాడు. అంతేకాదు "విప్లవాత్మకమైన దృష్టి యెంతయో అవశ్యకమైనను మన ప్రభుత్వము పూర్వవాసనలను విడిచిపెట్టలేక పోయెననుట నిర్వివాదము"ని బాధపడ్తూ ప్రభుత్వంలోని ప్యూడల్ మనస్తత్వాన్ని తెరచించి బయటపెట్టారు.

జనవాణిలో ధర్మారావు సంపాదకీయాలు చాలా సూటిగా పదునెక్కి ఉండేవి. ఆంధ్రరాష్ట్ర సమస్యను ఏదో రూపంలో ప్రస్తావిస్తూ ఉద్యమ అవసరాన్ని నొక్కి చెప్తూండేవాడు. దీనికి తూట్లుబొడిచే తమిళ కాంగ్రెసు నాయకులనూ, వాళ్ళకు వంతపాడే కేంద్ర నాయకమ్మన్యులనూ ఎప్పుడూ తూర్పారపట్టేవాడు.

తెలంగాణా సాయుధ పోరాటాన్ని జనానికి తెలియపర్చిన ఆనాటి పత్రికల్లో జనవాణి ముందుంది. కడలూరి జైలు కాల్పులను నిరసిస్తూ

సంపాదకీయం (17-8-1949), ఘాతైవార్తలను (24-8-1949) ఇస్తూనూ డిటెన్యూల వివరాలనందిస్తూనూ, బయట పోరాటంలో చనిపోయారంటూ ప్రభుత్వం కాల్చి చంపిన ఘటనలను వెలికితెస్తూనూ, జయసూర్య రచనల ద్వారా తెలంగాణా రాజకీయ పరిస్థితులను వెల్లడిస్తూనూ జనవాణి చాలా సేవ చేసింది.

ఎలమర్రు, కాటూరులో నాడు (1949 జులై 14, 16లలో) జరిగిన దురంతాలు కటిక వాడికి కన్నీళ్ళు తెప్పిస్తాయి. పిడికిళ్ళు ఊపిస్తాయి. ఈ సంఘటనను "ఏమిటీ దారుణం. యలమర్రు కాటూరులనుంచి ఏమిటా మహా గోల........ అడవి మృగాలు గూడా చేయటానికి అసహ్యించుకునే చర్యలు." అంటూ నిరసించారు. "ఆహా ఎంత దుష్ట చర్య. ఆనాటి జలియన్‌వాలాబాగ్ ఏమూల? ఆ ఓడ్వాయర్; ఆ జనరల్ డయర్ మొదలయిన వారు మేక పిల్ల లయి పోయారే ఈ అడవి మృగాల ముందు.... ఆనాడు బ్రిటిష అత్యాచారా లను తీవ్రాతితీవ్రంగా ఖండించి ప్రజలను రెచ్చగొట్టినవారే ఈనాటి మన అధి కారులు. ఈ నాడు ఈ అమానుష కార్యాలకు తమ పరిపాలనలో తావు కలుగజేస్తున్నారు".... అని అసహ్యించుకున్నారు.అతి పెద్ద సంపాదకీయంలో కమ్యూనిస్టులకు చాలా అన్యాయం జరుగుతోందనీ, కాల్చి చంపేస్తున్నారనీ బాధపడ్డారు (27-7-1949). దీన్ని "తెలుగునాడులో పోలీసు దురాగతాలు ఇలాంటి నైచ్యాలు ఈ శతాబ్దంలో జరుగరాదని" శ్రీశ్రీ, కొ.కు, తాపీ, మల్లాది రామకృష్ణశాస్త్రి, గోపీచంద్, మా. గోఖలే ఆరుద్ర, సెట్టిఈశ్వరరావులు ఒక ప్రకటనలో తీవ్ర పదజాలంతో ఖండించారు (10-8-1949). దీన్ని పుర స్కరించుకునే హరీంద్రనాథ చటోపాధ్యాయ రాసిన కవితను ఎలమర్రూ - కాటూరూ అని అనువదించి శ్రీశ్రీ 7-12-1951 సంచికలో అచ్చేశారు. ఈ సందర్భంలో ఒక విషయం గమనించదగింది. ప్రముఖ చిత్రకారుడు మా. గోఖలే ఈ ఎలమర్రూ, కాటూరు ఉదంతాన్ని ఒక వ్యంగ్య చిత్రం ద్వారా ప్రకటించాడు. దాన్ని సెట్టి ఈశ్వరరావు నడుపుతున్న విశాలాంధ్ర పక్ష పత్రిక మొదట అచ్చేసింది. ఈ జనవాణి వారపత్రిక దాన్ని పునర్ముద్రిం చింది. అందుకే ప్రభుత్వం ఈ చిత్రాన్ని నిషేధించింది. కమ్యూనిస్టు పార్టీ ఈ చిత్రాన్ని వేల కాపీలు అచ్చేసి ప్రజలకు విరివిగా పంచింది. రాజకీయ ప్రచారాన్ని కొనసాగించింది.

తెలంగాణా పోరాట సందర్భంగా ఆనాటి ప్రభుత్వం అనేకులకు ఉరిశిక్ష విధించింది. దాన్ని ఒక సంపాదకీయంలో ధర్మారావు "ప్రజా రక్షణ కోసం - రజాకార్ ప్రతిఘటన కోసం ప్రాణాలొడ్డి కొందరు ఉద్రే

కించాదు. నిజమే ఎలాగో దేశశాంతిని ప్రజా సౌఖ్యాన్ని నిలబెట్టగలిగారు. వారంతగా తీంద్రించకపోతే మన భారత ప్రభుత్వ పోలీసు కార్యక్రమం జరిగే టప్పటికి ఆదేశం ఏ రూపంగా ఉండేదో ఊహించలేము" అని పోరాటాన్ని సమర్థిస్తూ " ఈ ఉరిశిక్షలను రద్దుచేయించి తమ నాగరికతా ముద్రను ప్రపం చానికంతటికి ప్రకటించవలసిందని కోరుతున్నామ''నీ అభ్యర్థించారు. (28-12-1949).

ఉరిశిక్ష పడ్డ యువకులు శివరెడ్డి (15 సం.); సత్తిరెడ్డి (17 సం.); పుల్లపుల్లయ్య (18 సం); చిల్కా వీరయ్య (18 సం.) కర్లపాటి రామిరెడ్డి (20 సం.); మాడా ఎల్లయ్య (18 సం.) మాడా నర్సింహ (18 సం.). వీళ్లు నైజాం పోలీసు చర్యకు ముందు 14 సెప్టెంబరు 1948న ఒడ్డు గ్రామానికి చెందిన రంగారెడ్డి అన్న భూస్వామిని చంపారన్నది అభియోగం. (19.7.1950) అలాగే మరో పన్నెండుగురికి హైద్రాబాద్ హైకోర్టు ఉరిశిక్ష వేసింది.[68] ఇవన్నీ గమనించిన ధర్మారావు 'ప్రాణ భిక్షపెట్టండి' అన్న సంపాదకీయంలో పోరాటాన్ని సమర్థించి వారి త్యాగానికి జోహార్లర్పించారు. అంతేకాదు ''ఈ యిరవైయవ శతాబ్దంలో ఉండకూడని శిక్ష - ఉరిశిక్ష.... వేయేల పై అధికారులకిది పరీక్షా సమయం ...'' అంటూ విజ్ఞప్తి చేశారు. (28.3.1951). ఇంతకు ముందొక సంపాదకీయం 'చంపవద్దు' అంటూ (20.12.1950) ప్రభుత్వాన్ని ''ఇది చేయకుంటే కలిగే నీతి ప్రచారం లేదు' అన్నారు.

లండన్ నుండి స్వచ్ఛందంగా డి. యస్. ప్రిట్ వచ్చి వాదించి గెలిపించి వెయ్యి రూపాయల విరాళాన్ని తెలంగాణా డిఫెన్స్ కమిటీ కిచ్చిన ఉదంతాన్నీ, కె. ఏ. అబ్బాస్ రాసిన బ్లిట్జ్ కథనాలనూ జనవాణి ప్రకటించి న్యాయ వ్యవస్థలోని డొల్లును బయటపెట్టింది. వీరందరి శిక్షలనూ రాజేంద్ర ప్రసాద్ యావజ్జీవ శిక్షలుగా మార్చిననాడు (9.5.1951) సుభీశవ - అనే సంపాదకీయంలో ధర్మారావు ''ఆ యువకుల రక్తం కడగరాని మచ్చ లాగా భారత ప్రభుత్వం చేతులకంటుకొని ఉండేది నూతన రాజ్యాంగ చట్టా నికి అంటవలసిన నెత్తురు మచ్చని అరికట్టగల్గారు రాష్ట్రపతి" అంటూ ఆనందాశ్రువులు రాల్చారు.

ఈ ఉరిశిక్షలూ తెలంగాణా పోరాటమూ ; ప్రపంచ వ్యాప్తంగా సాను భూతీ, ఖ్యాతీ సంపాదించాయి. ఒక పోలిష్ యువకవి ఉరిశిక్షకు గురైన ఈ యువకులపై తన మాతృభాషలో ఒక కవిత రాస్తే దాన్ని విద్వాన్ విశ్వం చేత

అనువాదం చేయించి 'ఉరికంబం కదులుతోంది' అన్న శీర్షికతో (24.4.1951) అచ్చేశారు.

స్వచ్ఛ రవికిరణ కాంతితో
స్వయం వ్యక్తిత్వంతో
జ్వలించవలసిన జీవితం
కాలుష్యాచ్ఛన్నమై మసకబారి పోయింది.
. ...................... ..
పదిహేడుగురు తల్లులు
కదలకుండా కిటికీలవద్ద నిల్చొని
కంట నీరు పెడ్తున్నారు
కాళరాత్రి తెలంగాణాలో
కటిక చీకటిని పూసింది.
.. ......... . ....... .....
నవయుగ నాందీ గీతం
నగారా మోగిస్తోంది
నేడో రేపో విని తీరాలి
నేడే వినడం మంచిది.
...... ....... ...........
నరలోకపు గుండెల్లో
చిరచిరలాడుతోంది బాధ
ఉరికంబం కదులుతోంది
ఉచ్చు - గాలికెగురుతోంది.

అలాంటిదే విక్టర్ గోంచరావ్ అనే కవి తెలంగాణాలో కఠిన శిక్షలకు గురైన పన్నెండేండ్ల బాలుడు దీనా లింగయ్య కథ విని దానికి స్పందించి రాసిన కవితను కె. వి. రమణారెడ్డి అనువదిస్తే (28.5.1951) అచ్చేశారు.

లేవు. ...... ...
కిరకర పొడిచే ప్రొద్దును ఆపే
శక్తులు లేవు.
లేవు........
లేవు ఉదయమాపు జైళ్ళు.
..................

కమ్యూనిస్టు పార్టీకి ఆనాడు అధికారికంగా పత్రికంటూ ఉండేదికాదు. అప్పుడు జనవాణి ఆ కొరత తీర్చింది. గతంలో కాగడా కూడా ఇలాగే పార్టీకి తోడ్పడింది. భారత కమ్యూనిస్టు పార్టీ డాక్యుమెంట్లనూ, తెలంగాణాలో సాయుధ పోరాటం విరమించడానికి జైళ్ళలో నాయకులతో జరిగిన సంభాషణ లనూ, వినోబాతో డాంగే ఈ సమస్యపైనే జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలనూ జనవాణి పతాక శీర్షికలతో ప్రచురించింది. పోరాటం వార్తలనూ, కాల్పుల ఘటనలనూ ప్రకటించింది. పార్టీ నాయకుల విడుదలనూ 1951 ఎన్నికల కార్యక్రమాలూ, బహిరంగ సభలనూ, పార్టి పొలిట్ బ్యూరో తీర్మానాలనూ ప్రముఖంగా అచ్చేసింది. పత్రిక చదివేవాళ్ళకు ఇది ఖచ్చితంగా పార్టీ నడిపే పత్రికే అని అనిపించినా, నాడు జనవాణి ధర్మారావు సారధ్యంలో వచ్చింది. రహస్య జీవితం నుంచి బయటికి వచ్చిన వెంటనే చండ్ర రాజేశ్వరరావు, సుందరయ్య, ముందుగా ధర్మారావు దగ్గరకెళ్ళి 'జనవాణి' పార్టీకి చేస్తున్న సాయం గూర్చి ధన్యవాదాలు చెప్పింది అందుకే.69

ఫాసిజం - నాజీజం ప్రపంచానికి గతంలో తెచ్చి పెట్టిన చెరుపును గ్రహించాడు కనుక ధర్మారావు యుద్ధంపై యుద్ధం ప్రకటించాడు. అంత ర్జాతీయంగా శాంతి శక్తులు బలపడాల్సిన ఆవశ్యకతను గుర్తించాడు కనుక తెలుగునాడులో కూడా శాంతి పతాకం పట్టి ఉద్యమంలో ఉరికాడు. శాంతి శక్తులు; పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాద శక్తుల ఇనుప దుప్పిళ్ళలో సతమతమవడం చూశాడు గనుకనే సోషలిస్టు శక్తులే శాంతికి ప్రాణం పోస్తా యని విశ్వసించాడు. దాని ప్రచారానికి పత్రికను వాడాడు. రాష్ట్ర శాంతి సంఘం పక్షాన అంతర్జాతీయ శాంతి మహాసభలకు పెకింగ్ వెళ్ళాల్సిన ప్రతి నిధి వర్గంలో ఉన్నందుకు గర్వించాడు (3.9.1952). కానీ రాజాజీ ప్రభుత్వం శ్రీశ్రీకి, తాపికి పాస్‌పోర్టులను నిరాకరించింది. దీన్ని ఆసరాగా తీసికొని (24.9.1952) ఒక సంచికలో ప్రభుత్వ దివాలాకోరుతనాన్ని, శాంతి శక్తులూ వ్యక్తులంటే దానికున్న భయాన్ని చాలా మెత్తగా వ్యంగ్యంగా ఎత్తి పొడిచాడు.

జనవాణి నడుపుతున్న కాలంలో ధర్మారావు పుస్తకరూపంలో తీసుకు రాదగిన పరిశోధనాత్మక రచనలు ఎక్కువగా చెయ్యలేదనిపిస్తుంది. బహుశా వారెక్కువకాలం సినిమారంగంలో పనిచేస్తూండడం, ఉన్న కొద్ది సమయంలో అనేక శీర్షికలను రాజకీయాలకే కేటాయిస్తూ రాస్తూండడం దీనికి కారణం కావచ్చు అయినా తన జీవిత చరిత్రను 'రాలూ రప్పలూ' అని 8-2-1952 నుండీ ఆరంభించి జనవాణి ఆపేవరకూ రాశాడు. అదీ మద్రాసులో బి.ఏ.

చదువువరకే రాయగలిగాడు. అది అలాగే అసంపూర్తి స్వీయచరిత్రగానే మిగిలిపోయింది.

కవిత్వపరంగా వీరి రచనలుకూడా 'ఓకపీ' అన్న శీర్షికతో జనవాణి ఆగిపోయేముందు ఓ మూడు సంచికల్లో (24-12-52; 21-1-53; 4-2-53) వచ్చాయి తప్ప ఇతరత్రా కూడా ఏవీ రాయలేదు.

జనవాణి నడుస్తున్న కాలంలో - సరోజినీ నాయుడు (2.3.1949); దేశభక్త కొండా వెంకటప్పయ్య (17.8.1949); వేటూరి ప్రభాకరశాస్త్రి (6.9.1950); జార్జి బెర్నార్డ్‌షా (8.11.1950) సర్దార్ పటేల్ (20.12.1950); సి. ఆర్. రెడ్డి (28.2.1951); న్యాపతి నారాయణమూర్తి (18.7.51); అడవి బాపిరాజు (1.10.1952); పొట్టి శ్రీరాములు (17.12.1952); చనిపోయారు. సంపాదకీయాలలో వీరికి ధర్మారావు ఇచ్చిన శ్రద్ధాంజలులు చాలా ప్రశస్తంగా ఉన్నాయి.

వేటూరిని స్మరిస్తూ "..నాకు చిరకాల మిత్రుడు. అంతేకాదు. విజయవిలాసం వ్యాఖ్యానం గురించీ వేదం వేంకటరాయశాస్త్రిగారినిగురించీ సత్యాన్ని నిర్ణయించడంలో నెలల తరబడిని పత్రికలలో హోరాహోరీగా నాతో పోరాడిన సహకారి. స్వీయాభిప్రాయానికి విరోధిగా ఉండినా సత్యానికి స్వాగతమియ్యగల ఉదారుడు. ఇంక ఎన్ని నూతన విషయాలు అతని భౌతికదేహంతో అంతరించిపోయాయో అని తలచినప్పుడంతా హృదయం స్తంభించిపోతుంది...." అని నిజాన్ని చెప్తూనే వారి గొప్పతనానికి నివాళులు అర్పించారు.

అలాగే - పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్ర నిర్మాణంకోసం 58 రోజులు నిరశన దీక్ష సాగించి చనిపోయాడు. ఆ సందర్భంలో "బాగా ఆలోచించినట్లయితే శ్రీరాములుగారు నిరాహారదీక్ష కాహుతి అయారని అనుకోవడం పొరపాటు. నలభై సంవత్సరాలుగా ఆందోళన జరుగుతున్నా, కాంగ్రెసువారు భాషా రాష్ట్ర నిర్మాణానికి కంకణం కట్టుకున్నా, స్వాతంత్ర్యంవచ్చి అయిదేళ్ళయినా, కమిటీ తర్వాత కమిటీ నివేదికలను పంపించినా, ఈనాటివరకూ రాష్ట్ర నిర్మాణాన్నొక మూలపడవేసి ఉంచిన ప్రస్తుత ప్రభుత్వ నిరాదరణకే ఆహుతయారనాలి. ఏకాభిప్రాయానికి రావడం ఎంతో అవసరమని తెలిసీగూడా మన నాయకులు చూపిస్తూ వచ్చిన ప్రాంతీయ దురభిమానాలకూ, వ్యక్తి దురహంకారాలకూ శ్రీరాములుగారు బలి అయారనడం సమంజసం" అని అసలు విషయాన్ని నిర్ద్వంద్వంగా వెళ్ళబెట్టారు. "విశాలాంధ్రను సాధించడానికి పూనుకోవాలి.....అదే శ్రీరాములుగారి త్యాగానికి మనం చూపే గౌరవం.".

అంటూ ముక్కోటి తెలుగుల నొక్కటిగా ముడి వెయ్యాలనే ధర్మారావు ఈ సందర్భంలో తెలుగులను హెచ్చరించాడు. (17.12.1952).

ఇదే అంశం మీద ఒక ప్రకటన తయారుచేసి తాపీ, శ్రీశ్రీ, కొ.కు., తుమ్మల వెంకట్రామయ్య, డాక్టర్ రాజారావు, సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు, మా. గోఖలే, ఆరుద్ర, అనిసెట్టి మొదలైనవారి సంతకాలతో జనవాణి ద్వారా తెలుగునాట మేధావులనూ మేల్కొల్పారు. ఆ ఆశయ సాధనలో కలిసే రమ్మన్నారు. (17.12.1952).

ప్రముఖ కవులు శ్రీశ్రీ, ఆరుద్ర, విశ్వం, అనిసెట్టి, నార్ల చిరంజీవి లాంటి వాళ్ళ కవితలే కాకుండా నాటి యువకవులనేకులు జనవాణిలో రచనలు చేశారు. అనేక దేశాల అభ్యుదయ కవితలను అనువాదం చేసి ప్రచురించేవారు. అలాగే కథలు గూడా. ఎక్కువగా రష్యా, చైనా, కొరియా, జెక్ దేశాల కథలూ; కిషన్ చందర్, సజ్జాద్ జహీర్. ముల్కురాజ్ ఆనంద్‌ల కథలూ అనువాదం చేసి ప్రకటించారు. బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు, విద్వాన్ విశ్వం, పొట్టపల్లి రామారావు, రమణారెడ్డి, లవణం, ఉమారాజ్, దర్శి చెంచయ్య, కొండేపూడి. వాసిరెడ్డి సీతాదేవి మొదలైనవారి రచనలుండేవి. మోహనరావు అనేక అనువాద కథలను సి. చందర్ అనే మారుపేరుతో రాశాడు.

'జనవాణి' నాటికల రంగంలో ప్రత్యేక కృషి చేసింది. ఆత్రేయ రాసిన ప్రగతి (16.11.1949); ఎవరు దొంగ (29-11-1950); ఓటు నీకే (16-11-1951); అంతర్యుద్ధం (23-11-1951); విశ్వశాంతి (4-4-52); చావకూడదు (3-9-1952); అన్న నాటికలు ఇందులోనే వచ్చాయి. అనిసెట్టి బ్రతుకుబాట (30-3-1949) లక్ష్మీకాంత మోహన్ నాటికలనూ జనవాణే ప్రచురించింది. అన్నీ ప్రజా సమస్యలను వివరించేవీ- ప్రదర్శన యోగ్యమైన వీనూ. ఆత్రేయ నాటికలు చాలా వచ్చయప్ప కళాశాల విద్యార్థుల ప్రదర్శన కోసం రాసినవి. వీటి వెనక చాణక్య ప్రోత్సాహం బాగా ఉంది. నాటి రాజకీయాలను తెల్పే అనేక వ్యంగ్య నాటికలు కూడా వచ్చాయి ఇందులో.

జనవాణి వస్తూన్న కాలంలో అనేక అభ్యుదయ కావ్యాలు వచ్చాయి. నాటి తెలంగాణా పోరాటం, దేశ రాజకీయ స్థితిగతులూ పలువురు కవులను స్పందింపచేసి కావ్యాలను రాయించాయి. పత్రికల్లో పుస్తక సమీక్షలన్నవి ఈనాడొక మొక్కుబడిగానూ, సమీక్షకులకు పుస్తకాల సేకరణకో ఉపాయంగానూ పరిణమించిందే తప్ప నిజాయితీగా ఈ శీర్షిక ఉండడం లేదు. జనవాణిలో వచ్చిన సోమసుందర్ వజ్రాయుధం (31-8-1949) అనిసెట్టి అగ్ని

పీణ (11-1-1950) శ్రీశ్రీ మహాప్రస్థానం (19-7-1950): రమణారెడ్డి అడవి (28-3-1951); గంగినేని ఉదయిని కావ్యాల మీద సమీక్షలు కవులకూ, పాఠకులకూ చక్కని వంతెన నిర్మించేవిగా ఉన్నాయి. అభ్యుదయ సాహిత్యం గీటురాయి మీద పస తేల్చే విధంగా ఉన్నాయి. కావ్యాల్లో గుణావగుణాలను బేరీజు వేసేవిగా ఉన్నాయి.

సాహిత్య ధోరణుల మీద కొడవటిగంటి, వాసిరెడ్డి, కొత్తపల్లి రంగారావు, ఆరోరా, లక్ష్మీకాంత మోహన్, ఎర్రప్రాలు మృత్యుంజయశాస్త్రి, ఈ. రాల వ్యాసాలు సాహిత్య విద్యార్థులకు పాఠాలుగా ఉపకరించే విధంగా ఉన్నాయి.

ధర్మారావు ముద్ర జనవాణి ప్రతి పేజీలోనూ కనిపిస్తుంది. ఇందులో - లోకవిరోధి, ఉత్కోచరావు; ఎం. ఎస్. నారాయణ; సందేహి; ముకురం లాంటి మారు పేర్లను ధర్మారావు వాడుకున్నారు. సంస్కృత పదాలు అతి తక్కువగా ఉండడం, చక్కని తెలుగు ఉపయోగించడం, సామెతలూ చిన్నచిన్న పద్యాలూ వాడడం, ఒక విషయం వివరించే సందర్భంలో మధ్య ఒక గీత పెట్టి రచన సాగించడం, సూటిగా మాట్లాడుతున్నట్టనిపించే ధోరణిలో ఉండడం వంటివనేకం ధర్మారావు ముద్రను మనకు పట్టిస్తాయి. ధర్మారావు ఈ పరకాయ ప్రవేశ రచనల్లో ఉండే మరో లక్షణమేమంటే రచన లక్ష్యాన్ని బట్టి భాష మారడం. 'అస్థానకవి మీద' చర్చను 'సందేహి' అన్న పేరుతో ఆరంభించిన దాంట్లో భాష సరళ గ్రాంధికంగా ఉంటే, లంచగొండి తనం మీద ఉత్కోచరావు ఉపన్యాసం (16-3-1949) చాలా వ్యావహారికంలో అందంగా ఉంటుంది. 'వెర్రివెధవ', 'పొల్లు నెల్లు' శీర్షికల్లో పాఠకులతో మాట్లాడుతున్నట్టే ఉంటుంది. సంపాదకీయాలు కూడా ఇలాగే. అధిక భాగం వ్యావహారికంలోనే ఉన్నాయి. సంపాదకీయాలు ఎప్పుడూ ఎన్ని పనులున్నా ధర్మారావే రాసేవారు. ఊళ్ళోలేని సమయాల్లో, ఈ. రా. కానీ మోహన్రావు కానీ రాసేవారు.[71] తెలంగాణా పోరాట కాలంలో సంపాదకీయాలు చాలా తీవ్రంగా ఉంటూంటే జైళ్ళలోని జనవాణి మిత్రులే తీవ్రత తగ్గించమని కొన్ని సందర్భాల్లో ధర్మారావును అర్థించడం జరిగింది.[72] జనవాణిలో వచ్చే ధర్మారావు రచన 'రాలూ రప్పలు'కు ఇంట్లో ఉండే కోడళ్లు రాజమ్మ, సరోజిని ప్రూఫులు అవీ చూస్తూండేవారు.[73] జనవాణిలో ఒకరకంగా ధర్మారావు కుటుంబం అంతా పాల్గొంటూండేది.

తెలంగాణా సాయుధ పోరాటాన్ని కమ్యూనిస్టుపార్టీ విరమించడం పార్టీపై నిషేధం తొలగించడంతో కమ్యూనిస్టు పార్టీ 'ప్రజాశక్తిని' తిరిగి ప్రచురించా,

లని తలపెట్టింది. ప్రజాశక్తిని వార పత్రికగా 1951 నవంబరులో తిరిగి ఆరంభించారు. దాన్నే విశాలాంధ్రగా 1952 జూన్ 22 నుండి ప్రచురించారు. ధర్మారావే దీని ప్రారంభోత్సవం చేశారు. జనవాణి ఈ కాలంలో అంటే 1952లో కొంత ఒడుదుడుకుల్లో పడింది. ధర్మారావు సినీరంగంలో చాలా ఉత్తమ రచయితగా క్షణం వెసులుబాటు లేని వ్యక్తిగా ఉండేవాడు. చాణక్య కూడా సినీరంగంలో ప్రవేశించాడు. అదేకాలంలో విశాలాంధ్రలో పనిచేయాలని పార్టీ నాయకత్వం మోహనరావును కోరింది. ఇవన్నీ చూసిన చాణక్య కొంత కాలం జనవాణి నడిపాడు. అనేక కారణాలవల్ల 23-7-1952 నుండి 3-9-1952 వరకూ; 24-10-1952 నుండి 10-12-1952 వరకూ జనవాణి రాలేదు కూడాను. ఎలాగోలా వళ్ళుబిగువు మీద 1953 ఏప్రిల్ వరకూ నడిచి ఆపైన ఆగిపోయింది జనవాణి మూగబోయింది. "అభిప్రాయ ప్రకటన స్వేచ్ఛ మన జన్మహక్కు. రాజ్యాంగం దానికి సంపూర్ణంగా అభయమిచ్చేంత వరకూ విశ్రమించము' అన్న తాత్విక చింతనతో ఆరంభమైన జనవాణి ఆనాటి రాజకీయాలకు స్పష్టంగా అద్దం పట్టింది.

పత్రిక చేత్తో పట్టుకుని రైలు దిగి స్టేషనులో అడుగుపెట్టిన కథానాయకుణ్ణి నైజాం పోలీసులు అరెస్టుచేసి పోలీసు స్టేషనుకు తీసుకెళతారు. ఇది మోదుగుపూలు నవల్లో దాశరథి రంగాచార్యా నవల ఆరంభించిన తీరు. ఆ అరెస్టు - పత్రిక పట్టుకొచ్చాడని తప్ప దిగిన వ్యక్తి పూర్వాపరాలు తెల్సికాదు. దీన్ని బట్టి పత్రికల్లో ఎంతటి చైతన్యం కల్గిస్తుందో నాటి నైజాం ప్రభుత్వానికి తెలుసన్నమాట. పత్రికలు వెదజల్లే భావబీజాలు, అవి సృష్టించే చైతన్యం ప్రభుత్వాలను గడగడలాడించడంలో ఆశ్చర్యంలేదు.

ధర్మారావు తనలో వచ్చిన మార్పును ప్రజలకందిస్తూ తన మార్పు సరైందా కాదా అన్న అనుమానాన్ని నివృత్తి చేసుకుందామనే కొత్తపాళీ వ్యాసాలతో ప్రజామిత్రలో కృషిచేశారు. అలాగే అంతవరకూ తాను అతి తీవ్రంగా అధ్యయనం చేసి గడించిన చారిత్రక జ్ఞానం, సామాజిక మానవ శాస్త్రాల సారం తన చుట్టూ ఉన్న ఆచార వ్యవహారాలకు అన్వయించి వ్యాసాల ద్వారా ప్రజలకందించి అందులో తానెంతవరకూ కృతకృత్యుడైందీ తెలుసుకున్నారు జనవాణి దినపత్రిక, కాగడా వారపత్రికల నాధారం చేసుకుని. ఈవిధంగా తను సముపార్జించిన జ్ఞానాన్ని అటు సాహిత్యపరంగా వచ్చిన దాన్ని జనవాణిలోనూ, సామాజికాంశాలను కాగడాలోనూ ఆచరణ గీటురాళ్లపై సిరవడి పెట్టి చూసుకున్నారు. సత్ఫలితాలొచ్చినట్టు గ్రహించారు.

జనవాణి కాగడాల వ్యాసాల్లో మనకు ధర్మారావు సాహితీవేత్తగా, సామాజికాంశాలను సునిశితంగా అన్వయించే వ్యక్తిగా మాత్రమే కన్పిస్తారు. అయితే వారిలో అస్పష్టమైన రాజకీయ భావాలు లేకపోలేదు. బ్రాహ్మణేతర ఉద్యమంలో వ్యక్తిగా గతంలో బ్రాహ్మణులను వ్యతిరేకించిన వీరే అవే అవ లక్షణాలు బ్రాహ్మణేతరులలో ఉండడాన్ని గమనించారు. కనుక తాను వ్యతిరేకించవలసింది బ్రాహ్మణులను కాదనీ బ్రాహ్మణత్వాన్ననీ గ్రహించి తన తప్పు దిద్దుకున్నారు. ఆది నుండీ వీరి దృష్టి తార్కికంగా ఉండేది. అది హేతువాదం వైపు నడిపించింది. అయితే ఆ హేతువాదంతో జతపడటంవల్లే ధర్మారావు తప్పుఎక్కడున్నా కత్తి ఝుళిపించాలన్న కార్యవాదిగా మారాడు. భౌతికవాదచ్ఛాయలులేని హేతువాదులకు ఈమార్పు ఈదిశగా జరగదు. దీనికి త్రిపురనేని రామస్వామి చౌదరి మంచి ఉదాహరణ.

ధర్మారావు ఈ భావమే తన మార్పును నిత్య ఆచరణలో నిగ్గుదేల్చునట్లు చేసింది. ఆ క్రమంలో వీరు అటూ ఇటూ మారారు. మొదట్లో గ్రాంథిక వాదం కొమ్ముకాసి ఆచరణలో అది తప్పని గ్రహించి ఏ మాత్రం బిడియ పడకుండా వ్యావహారికం వైపు రావడానికిదే కారణం. ఆ గ్రాంథిక భాష ద్వారా కొత్త భావాలను ప్రజల కందించడంలోకూడా తన గత సిద్ధాంతం ఆచరణలో తప్పని రుజువైంది. కనుకనే పత్రికలలో మార్పుకు ఆవాహన పల్కారు. జనవాణి కాగడాల (1942) కాలం వరకూ ధర్మారావు ప్రపంచ రాజకీయాలనూ, దేశ, రాష్ట్ర రాజకీయాలనూ అధ్యయనం చేస్తూండేవారు. కానీ ప్రధానంగా వీరి దృష్టి సామాజిక అంశాలపై ఉండేది. అందుకనే కాగడా వరకూ వారి రచనలు ఆ దిశలోనే సాగాయి. అయితే మొదటినుండీ కాంగ్రెసు సంస్థ మితవాదంగా ఉందన్న భావం వీరికుంది. బ్రాహ్మణేతరులకు చెప్పుకోదగ్గ సేవచేయలేదనీ ఉంది. గాంధీలాంటి వ్యక్తులు జాతీయ ఉద్యమాలు తీవ్రరూపం దాల్చే ప్రతి మలుపులోనూ సత్యాగ్రహమంటూ నీళ్ళు కార్చారన్నబాధా ఉంది. యువశక్తికి తగిన కార్యక్రమాన్ని అది ఇవ్వలేకపోతోందని దేశంలో కుళ్ళు మరింత పెరుగుతోందనీ తపనపడ్డారు. ఆ దశలో భారత రాజకీయరంగంలో సోషలిస్టు భావాలూ, కార్యక్రమాలూ తప్పటడుగువేసుకుంటూ ప్రవేశించాయి. యువజనసంఘాల నిర్మాణం, గ్రామాల్లో భూస్వామ్య వ్యతిరేక ప్రతిఘటనలు, గ్రంథాలయ ఉద్యమం అన్ని వర్గాల వారికీ విద్యావకాశాలకు ఈ నూతన తరం కృషిచేయడం వంటివి ప్రధానంగా ఈ కార్యకర్తల నిజాయితీతో కూడిన నిరాడంబర జీవనం ధర్మారావును బాగా ఆకర్షించి ఉంటాయి. కాంగ్రెసు దృష్టిలో ఆనాడు ఇవన్నీ తీవ్రవాద భావాలు. ఈ తీవ్రవాద కార్యాచరణనే ధర్మారావు ఆశించింది.

ఈ నేపథ్యంలోనే వీరు మూఢాచారాలూ, గుడ్డి నమ్మకాలూ, వర్ణ వ్యవస్థ తెచ్చిపెడ్తున్న అనర్థకాలూ బూజు పట్టిన రాచరిక భావావశేషాలనూ సశాస్త్రీయంగా తార్కికంగా పరిశీలించి రచనలు సాగించాడు. ఇవి నాటి యువకులను బాగా ఆకర్షించి ధర్మారావు ఆశించిన మార్గంలో విద్యావంతులను [illegible]యడం చూశాడు. కమ్యూనిస్టు భావ బీజాలు తెలుగునాట అస్పష్ట రూపంలో తలయెత్తుతున్న ఆ కాలంలో రెండవ ప్రపంచయుద్ధం, సోషలిస్టు శక్తుల ఘన విజయం, నాజీ శక్తుల పరాజయం వంటివి వీరి దృష్టి రాజకీయాంశాల వైపు మళ్ళే కార్యక్రమాన్ని వేగవంతం చేశాయి. జస్టిసు భావాల ఊబినుండి బయటపడి జాతీయవాదిగా ఉన్న ధర్మారావులో వామపక్ష భావాల అలలు లేచాయి. మోహనరావు కమ్యూనిస్టుగా ఆ పార్టీ పత్రికల్లో పనిచేయడం మరింత సాయపడింది. అయితే అదే కాలంలో 'రాయిజం' కూడా తెలుగునాట ప్రవేశించింది. తీరికా డబ్బూ ఉన్న బ్రాహ్మణేతర యువకులను అది బాగా ఆకర్షించింది. కమ్యూనిస్టుగా ఆరంభమై అందులో మానవత్వం లోపించిందన్న స్వీయ మానసిక ధోరణితో పెడదారి పట్టినవాడు రాయ్ అని ధర్మారావు నమ్మాడు. రాయిజం బోధించిన 'రాడికల్ హ్యూమనిజం' అన్నది కేవలం ఆచరణ శూన్యమైన సిద్ధాంతమనీ అప్పటికే అది భావవాదంగా స్థిరపడ్డదనీ దానికెలాంటి భౌతికవాద పూతకూడా లేదనీ కమ్యూనిస్టులు భావించారు. నాస్తికవాదంతో కూడిన హేతువాద మొక్కటే చాలన్న భావం ఈ వర్గానికుండేది. ఇదంతా ఇసుక మీద కట్టిన భవంతిగా ధర్మారావు గ్రహించాడు కాగడా చర్చల్లో ఈ విషయం స్పష్టపడింది.

సోషలిస్టు భావాలూ, కమ్యూనిస్టు భావాలూ (రాయిజంలాంటి పెడధోరణులను ఖండనం చేసిన తర్వాతనే) వీరిని ఆకర్షించాయి. మార్క్సిజాన్ని సశాస్త్రీయంగా ధర్మారావు అధ్యయనం చేశారనలేం కానీ తాను సేకరించుకున్న జ్ఞానాన్ని తర్కం, హేతువాదం, భౌతికవాదాల వెలుగులో వింగడించుకుంటూ, అన్వయించుకుంటూ రచనలు చేశారనవచ్చు. అయితే కొత్తపాళీ వ్యాసాల్లో వస్తువు, రీతులను సమన్వయపర్చాలన్న సందర్భంలో ధర్మారావు చేసిన చర్చ మార్క్సిస్టు మేధావి అంచనాలకేం తీసిపోదు.

ఇలా పరిణామం చెందుతూ జనవాణి (వారపత్రిక) కాలం నాటికి స్పష్టమైన రాజకీయ అవగాహనను ధర్మారావు పెంపొందించుకున్నాడు. అన్యాయం ఎక్కడున్నా ఎదిరించే నైజం ఉన్న వీరికి, నాజీల మించిన నైజాం నిరంకుశ పాలన ఏవగింపు కలిగించడమేకాదు దాన్ని ప్రాణాలొడ్డి పోరాడే ప్రతి వ్యక్తి

ఆరాధ్యనీయుడుగా కనిపించాడు. దీని వెనకున్న కమ్యూనిస్టు పార్టీ రాజకీయాలే నాటికి తాను పత్రికలో ప్రతిబింబించదగ్గవన్న భావం కలిగింది.

స్వాతంత్ర్య సముపార్జనలో అశేష త్యాగాలు చేసిన యువతకు అన్ని రంగాలలోనూ నిరాశ ఎదురు కావడం చూసి ధర్మారావు బాధపడ్డాడు. కాంగ్రెసు ప్రభుత్వాధిపతులు పదవుల వెంపర్లాటలో మునిగి ప్రజా సమస్యలను పట్టించుకోకపోవడం చూసి విసుక్కున్నాడు. ఇలాంటి ప్రభుత్వ దమనకాండను ధైర్యంగా ఎదురొడ్డి పోరాడే కమ్యూనిస్టులన్నా, వారి ఉద్యమాలన్నా సద్భావం పెంచుకున్నాడు. అన్ని దిశల్లోనూ పెలరేగిన అన్యాయం, అవినీతిపై పోరాట జండా ఎగరేస్తూ, నేలకొరిగే వీరుల పంథా సరైందన్న నమ్మకం ధర్మారావు పెంపొందించుకున్నాడు. కనుకనే జనవాణి వారపత్రికను పూర్తిగా రాజకీయాలకు - అదీ కమ్యూనిస్టు రాజకీయాలకు ప్రతిబింబంగా నడిపించాడు. ఆ దశలో సామాజికాంశాలకు ప్రాధాన్యం ఇవ్వడంకన్నా కూడా రాజకీయాలకు ప్రాముఖ్యం ఇవ్వడమే నిజమైన పత్రిక చెయ్యాల్సిన సేవగా ధర్మారావు గుర్తించాడు. అలాగే నడిపాడు.

ధర్మారావు అనేక శీర్షికలకు చాలా చక్కని తెలుగు పేర్లు పెట్టాడు. ఒకే విషయాన్ని అనేక స్థాయిల్లో ఉండే ప్రజలకు చెప్పడానికి అనేకరకాల శీర్షికలవసరమన్న గుర్తింపే దీనికి కారణం. చక్కని తేట తెలుగులో చెప్పడం అవసరమన్న ధ్యాసే ఈ పేర్లకు కారణం. కాగడాలో శీర్షికలన్నీ సామాజిక మానవశాస్త్రాల సాయంతో చూసిన సమస్యలకూ, సారస్వత విషయాలకూ కేటాయిస్తే, జనవాణి పత్రికలోని శీర్షికల్లో అధిక భాగం రాజకీయాంశాలకు పరిమిత మవడం ఈ పైకారణంచేతనే. కాగడాలో ఎక్కువగా చర్చలను నిర్వహించి పలువురు పాల్గొనేలా చేసిన ధర్మారావే జనవాణిలో తమ వామపక్ష భావాలను సూటిగా ప్రజల దగ్గరకు తీసికెళ్ళాలన్న ఉద్దేశంతో ఎక్కువ శీర్షికలు తామూ, ఈ భావాలున్న తమ అనుచరవర్గమూ రాసిన రచనలే వేశారు. ప్రజల్లో అభిప్రాయాన్ని తీర్చి దిద్ది ప్రచారం చెయ్యడానికి ఈ పద్ధతే ఆవశ్యకమైంది. పత్రికానిర్వాహకుల కొక నిర్దిష్టమైన అభిప్రాయం ఉందని అదే ప్రజల్లో ప్రచారం చేస్తామన్న భావానికిది తార్కాణం.

ధర్మారావు గ్రంథాలయాల్లో గంటల తరబడి కూర్చుని అధ్యయనం చేసిన వేలాది పుటల్లోని భావాలను అడుగడుగునా జనంలో పంచి ఫొల్లూ-నెల్లూ చూసుకున్నాడు. ఈ సిద్ధాంతం-ఆచరణల సమన్వయంలోనుండి అనేక పాఠాలను నేర్చుకున్నాడు. కనుకనే కరుడుగట్టిన తన భావాలను కూడా మార్చుకో గలిగాడు. మార్చుకున్న తర్వాత సముపార్జించుకున్న విజ్ఞానం కాగడాతో జనం

లోని ప్రతిసమస్యనూ వెలుగులోకి తెచ్చాడు. దేశంలోని అనాగరికమైన, అన్యాయమైన ప్రతిదాన్నీ జనందృష్టికి తెచ్చాడు. మార్పును-అదీ అభ్యుదయం దిశగా కోరే జనం ఉద్యమాలనూ, పోరాటాలనూ ప్రతిబింబించాడు. జనం వాణిని తెలుగునేల నాలుగు చెరగులా వినిపించాడు.

జనవాణి పీపుల్స్ పార్టీ దినపత్రికగా ఉన్నప్పుడు ఆకారంలో, భాషలో మార్పుతెచ్చిన ధర్మారావు తెలుగు పత్రికారంగంలో తగిన గుర్తింపును పొందలేదనే అనాలి తెలుగులో పాపులర్ జర్నలిజానికి పునాదులేసిన వ్యక్తి ధర్మారావు. ప్రముఖ పత్రికాసంపాదకుడు నార్ల వారన్నట్టు "ధర్మారావుగారి ప్రతిభ అనేక రంగాలలో అనేక ముఖాలుగా వెల్లడైంది అదే పత్రికారంగానికే వారు కట్టుబడి ఉండినట్టయితే వారు దీనికి చేసిన సేవకు తెలుగు పత్రికాప్రపంచం వీరిని నెత్తిన పెట్టుకుని ఉండేది."74 ఇది అక్షరాలా నిజమనిపిస్తుంది.

## దారిపోగుల పరమార్థం

1910 నుండి తీవ్రంగా సాగిన గ్రాంథిక భాషోద్యమంలో ధర్మారావు ప్రముఖ పాత్ర వహించడానికి రెండు మూడు కారణాలు కనిపిస్తాయి.

ఒకటి గ్రాంథికోద్యమాన్ని సమర్థించినవారిలో అధిక సంఖ్యాకులైన ప్రముఖులు ప్రభుత్వోద్యోగులూ, బ్రిటీషు రాజభక్తులూ. రెండవది గంజాం, వర్లాకిమిడి ప్రాంతాలలో తొలిరోజులలో వ్యావహారిక వాదానికి బలం చేకూరింది. గానీ మద్రాసుతోసహా మిగిలిన ప్రాంతంలో గ్రాంథిక భాషా వాదానికే బలం ఉండేది. ఈరోజుల్లో ధర్మారావు బరంపురం ప్రాంతంలో ఉండి గ్రాంధిక వాదానికి ఆ ప్రాంత ప్రతినిధిగా నిలిచాడు. ఒకటి రెండు సంవత్సరాలు కళాశాలాధ్యాపకుడుగాఉన్నా ఆయన 1932 వరకూ దాదాపు ఎక్కువ కాలం ఆయా జమీల రాజాస్థానాల వ్యవహారాల్లో పనిచేశాడు. సంస్థానోద్యోగాల్లో సంస్కృతాంధ్రాలే కాక ప్రపంచ సారస్వతంలో వస్తున్న భాషా, సాహిత్య పద్ధతులను అధ్యయనంచేసే అవకాశం వీరికి లభించింది. ఈ అధ్యయనం ఆయన భావాల్లో కనిపించకుండా మెల్లగా నూతనత్వానికి దారితీసింది. దీనికి తోడు 1924 అక్టోబరు 13 వ తేదీన ఆంధ్ర సాహిత్యపరిషత్తు వారు వ్యావహారిక భాషావ్యాప్తిని రద్దు చేశారు. గ్రాంథిక వాదానికి కంచుకోటగా ఉన్న అలాటి ఆంధ్ర సాహిత్య పరిషత్తు క్రమంగా వాదదౌర్బల్యంలోకి రావటం కూడా దాని ప్రముఖాభిమాని ధర్మారావు మనస్సులో కొంత మెత్తదనానికి దారితీసి ఉంటుంది.

జమీందారీ ఉద్యోగాల కాలంలో తాపీ ధర్మారావు కొందరు సంప్రదాయ పండితుల ప్రభావానికి లోనయ్యాడు. వీరిని ప్రభావితం చేసిన ప్రముఖ వ్యక్తి వేదం వెంకటాచలయ్య. వీరు వేదం వెంకట్రాయశాస్త్రి వలెనే తాతవెల్లి మిరాసీదారు శేషగిరిశాస్త్రి ద్వారా కాల్డ్వెల్ ద్రావిడ భాషా సిద్ధాంతానికీ, ఆనాటి పాశ్చాత్య పండితుల భాషా శాస్త్ర సిద్ధాంతానికీ లోనైన వారే. అప్పటికి ధర్మారావు ఆర్యప్రభావం ద్రావిడులనూ ద్రావిడ భాషలనూ వశపర్చుకొని బ్రాహ్మణాధిక్యానికి దారి తీసిందనే విశ్వాసంలో ఉన్నారు కాబట్టి ద్రవిడ భాషా వాదం దానికి మూలమైన భాషాశాస్త్ర సిద్ధాంతాలూ ఆయన్ని ఆకర్షించి ఉంటాయి. బెంగుళూరు మిథిక్ సొసయిటీలో సభ్యులుగా ఉండి వారి పత్రికలో వ్యాస రచనలు చేస్తున్న ఎల్. వి. రామస్వామి అయ్యర్, కె. వి. సుబ్బయ్య వంటి ప్రముఖ భాషా శాస్త్రజ్ఞుల ప్రభావం కూడా ధర్మారావు మీద పడి ఉండటం అసాధ్యమేమీ కాదు. తాపీ కూడా ఆ సంఘంలో సభ్యులే.

గిడుగు వెంకటరామ్మూర్తి వ్యావహారిక భాషోద్యమానికి ఉపోద్బలకంగా ప్రచారం చేసింది ప్రజాభాషలో రచనలు వెలువడాలనే సిద్ధాంతంతో. 1919లో గిడుగు వారు స్థాపించిన తెలుగు పత్రికలో ప్రపంచ సాహిత్య చరిత్రలో ప్రజారచయితలు ఏవిధంగా మహారచయితలైనారో విపులంగా వివరించారు.[75] దీనికితోడు ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో స్కాండినేవియన్ భాషల్లో పెద్ద ఎత్తున వచ్చిన భాషోద్యమం కూడా చెప్పదగింది. నార్వే, స్వీడన్‌లను పాలించిన డేనిష్ వారు - తమ భాషను 'రిక్స్‌మల్' బొఖ్‌మల్ భాషా స్వరూపాలను వ్యతిరేకిస్తూ ఐవార్ ఆసిన్ అనే విద్వాంసుడు నార్వీజియన్ మాండలికాల ఆధారంగా లాండ్స్‌మాల్ నైనార్స్క్ అనే ప్రజా భాషను అధికారభాష చెయ్యాలని 1885 లోనే ఒక మహోద్యమం తీసుకొచ్చారు. ఈ నూతన భాషా స్వరూపాన్ని 1907 - 1917 లలో మరింత సంస్కరించి ప్రజాభాషకు స్వతంత్ర దేశంలో అధికార భాషా గౌరవాలు సంపాదించారు. ఆ ఉద్యమ ప్రభావం ప్రపంచ భాషలన్నింటి మీదా పడింది.[76] గిడుగు సప్తతితమ జన్మదిన సంచికలో స్టెన్ కొనోవ్ మొదలైన పెద్దలు రాసిన వ్యాసాల ద్వారా ఆ ఉద్యమ ప్రభావం తెలుగుదేశానికి కూడా వ్యాపించిందని చెప్పచ్చు.

1917 - 1930 ల మధ్య రష్యాలోని 130 భాషలు 'ద్వపోతక' సిద్ధాంతం ప్రకారం జాతీయ స్థాయిలో ప్రామాణీకరించి భిన్నజాతుల వారు తమ మాతృ భాషలోనే ప్రాథమిక విద్య నుండి పరిశోధన వరకు చదువుకునే అవకాశం కల్పించారు.[77] దేశ సమైక్యతకు కూడా ప్రజాభాషకు సముచిత

స్థానం ఇవ్వటం ఎంతో శోభస్కరమయిందని ప్రజాభాషకు సాహిత్యంలో స్థానం అవసరమని సోవియట్ వ్యతిరేకులు కూడా అంగీకరించారు.

ఆయా ఉద్యమాల ప్రభావం, సిద్ధాంతాల ప్రభావం ధర్మారావు మీద పడిందని చెప్పటానికి కొత్తపాళీ (పేజీ 9) లో వారు చెప్పిన "ప్రపంచంలోని జనులనీ వాళ్ళ అభిప్రాయాలనీ ఒక్కసారి మార్చివేసిన గ్రంధాలు రషియా, జర్మనీ, నార్వే, స్వీడన్, ఫ్రాన్స్, ఇంగ్లండ్, అమెరికా ఈ దేశములలో ఉత్తమమైన గ్రంథాలు" - అన్న మాటలు ప్రబల నిదర్శనం. ఈ విషయాన్ని 1971 లో తెలుగు అకాడమీకిచ్చిన ఇంటర్వ్యూలో కూడా నొక్కి చెప్పాడు (ఇంటర్వ్యూ టేప్) బహుశా జస్టిసు పార్టీ సిద్ధాంతాలు ప్రజల్లోకి పోకపోవడానికి కారణం ప్రజా జీవితానికీ, భాషకూ ఆ పార్టీ కార్యకర్తలు దూరంగా ఉండడమని ధర్మారావు విశ్వాసం. అందువల్లనే భాషా సాహిత్యాల విషయంలో వారి నూతన మార్గానికి పరివర్తన చెంది ఉండవచ్చు. ఇరవయ్యో శతాబ్ది తొలి రోజుల్లో ప్రపంచ సారస్వతంలో, ముఖ్యంగా ఇంగ్లీషు సాహిత్యంలో, పేరు మోసిన సాహితీ ప్రక్రియ నవల. ప్రసిద్ధ నవలల్లోని పాత్రలన్నీ స్వభావోచిత భాషలో వ్యావహారికంలో ఉన్నవే. ఇది కూడా ధర్మారావు మనస్సు వ్యావహారికం వైపు మొగ్గడానికి మరో బలీయమైన కారణం కావచ్చు. బహుశా అందువల్లనే చిలుకూరి నారాయణరావు అధ్యక్షతన పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి సూత్రధారుడుగా 1933 మార్చి 10 - 12 తేదీల్లో జరిగిన 'అభినవాంధ్ర కవిపండిత సభ' లో ధర్మారావు కూడా పాల్గొన్నాడు. ఆ ఏడే డిసెంబరులో గిడుగు వారి 'గద్య చింతామణి' వెలువడి 16 - 20 శతాబ్దాల మధ్య తెలుగు వచన రచనా సంప్రదాయం ఏ విధంగా వికసించిందో ససాక్షికంగా వివరించింది.[78] ఈ పరివర్తన దశలో ఉన్నందువల్లనే కాబోలు మూడు సంవత్సరాల పై కాలం తానేమీ రాయలేదనీ, కానీ నలభై యాభై వేల పేజీల సారస్వతం భిన్న భాషలలో చదివాననీ ఆయన చెప్పుకున్నాడు.[79] కొత్త పాళీలో కనిపించే భావ పరివర్తనమంతా ఈ కారణాల వల్లనే జరిగి ఉంటుందని చెప్పవచ్చు. ఈ సంధి సమయంలో గ్రాంథికం నుండి వ్యావహారికానికి, కఠిన భాషనుండి సులభ శైలికి స్వీయ రచనలు మార్చడానికి సహజంగానే ఆయన ఎంతో శ్రమించి ఉంటాడు. శ్రమ ఫలితం తక్షణమే ప్రచురించక పోవటానికి ఈ ప్రయోగమే కారణం కావచ్చు.

ఇటువంటి భాషోద్యమం రవీంద్ర నాథ టాగూర్ నాయకత్వంలో బెంగాల్‌లో బయల్దేరి 1930 నాటికి అఖండ విజయం సాధించింది. ఇక్కడ 1936 లో నవ్య సాహిత్య పరిషత్తు వారి పత్రిక 'ప్రతిభ' వెలువడ్డ తర్వాత

ధర్మారావు గారి సుప్రసిద్ధ సమకాలికులెందరో వ్యావహారిక భాషలోనే రాయటం ఆరంభించారు. ఆ సంవత్సరమే జనవాణి దిన పత్రికకు సంపాదకత్వం వహించిన ధర్మారావు మొట్టమొదటి సారిగా వ్యావహారికాన్ని పత్రికా భాషగా చేశాడు. ధర్మారావు తాను నమ్మిన విషయంలో తీవ్రవాదులు. అందువల్లనే వీరగ్రాంధికవాదిగా ఉన్నవారు తమ మనస్సులో పరివర్తన రాగానే ఆ విషయం మనస్ఫూర్తిగా వ్యావహారికోద్యమ స్థాపకులైన గిడుగు రామ్మూర్తికి లేఖ ద్వారా తెలియపర్చుకున్నారని సీతాపతి అన్నారు. అప్పటికి తమకు వ్యావహారిక వాదం మీద ప్రత్యయం కలగగానే జనవాణి పత్రికాధిపతీ వీర గ్రాంధికవాదీ అయిన పిఠాపురం మహారాజా అభిలాషకు విరుద్ధంగా పత్రికలో వాడుక భాషను ప్రవేశపెట్టాడు. ఇది వారి స్వభావానికి మచ్చుతునక. ఆ తర్వాతి కాలంలో వచ్చిన ఆయన రచనలన్నీ వాడుక భాషలోనూ సులభ భాషలోనూ ఉన్నాయి.

ధర్మారావుకు ప్రజాభాష - ప్రజా సాహిత్యాల మీద గౌరవం ఏర్పడే నాటికే తెలుగులో ఎంకిపాటలవంటి గేయ రచనలూ, గుడిపాటి వెంకట చలం నవలలూ చక్కని చిక్కని వాడుక భాషలో వెలువడి ప్రజామోదం సంపాదించాయి. సంప్రదాయ వాదానికీ, సాంఘిక దురన్యాయాలకూ వ్యతిరేకంగా పోరాడిన చలం ధర్మారావును ఆకర్షించి ఉంటాడు. తాము కూడా సాంఘిక దురన్యాయాలనూ - సనాతనత్వాన్నీ వ్యతిరేకించేవారే కనుక ధర్మారావు చలం రచనాశైలిని అనుసరించి ఉండవచ్చు. చలం, గోపీచంద్, కొడవటిగంటి మొదలైన వారంతా ధర్మారావు లాగానే ప్రజామిత్రలో రచనలు ప్రచురించినవారే. మళ్ళీ వీరంతా సినిమా ప్రపంచానికి చేరుకున్నవారే. ప్రజామిత్ర భాష సరళ గ్రాంధికమైనా తాము మాత్రం వ్యావహారికంలోనే రాశారు. అందువల్ల ధర్మారావు ప్రభావం ఇతరుల మీదా, వారి ప్రభావం వీరి మీదా ఉన్నదని చెప్పక తప్పదు. అప్పటి వరకూ సాహితీపరులకు గానీ అభిమానులకు గానీ పత్రికలే ఏకైక వార్తా సాధనంగా ఉండేవి. సినిమాలు వచ్చిన తర్వాత, ముఖ్యంగా ఇదేకాలంలో చలం కథ రాసిన 'మాలపిల్ల' ను సినిమాగా తీసే ప్రయత్నాలు జరుగుతున్న కాలంలో సాధారణ ప్రజలకు విజ్ఞాన వినోదాలిచ్చే ఈ వార్తా సాధనం వాడుక భాషనే తీసుకోక తప్పదని తెలిసివచ్చి ఉండాలి. అంతవరకూ ఒక కన్యాశుల్కం మినహా తెలుగులోకి వచ్చిన నాటకాలన్నీ ముఖ్యంగా రంగస్థల నాటకాలు - వీరగ్రాంధికంలో గడ్డు సమాసకల్పనలతో ఉండేవి. అయినా వాటికొచ్చిన ప్రజాదరణకు ప్రధాన కారణం నటుల సంగీత పరిజ్ఞానమే కాని ప్రజలకు భాష అర్థమై ఆనందించటం కాదు. ఇవి గమనించి వాడుక భాషలో సాంఘిక, రాజకీయ నాటకాలను అప్పుడప్పుడు రాస్తూ

కొందరు ప్రజాదరణ పొందుతూ ఉండేవారు. ఆ రచనల్లో పాత్రచిత్రణ కాని, నాటకీయతగాని, శిల్పంకాని అత్యున్నత స్థాయిలోనే ఉండేవి. మహారచనకు ప్రజాభాష అడ్డంకి కాకపోగా మహత్తరసాధనంగా ఉపయోగపడుతుందని గిడుగువారు చేసినవాదం ఆచరణలో నిజమని రుజువైంది. ధర్మారావు ఇవన్నీ గమనించే ఉంటారు.

పై కారణాలే కాక బ్రాహ్మణేతర ఉద్యమ ప్రభావం పూర్తిగా ధర్మారావు మీద ఉండటం వల్లనూ, ప్రవృత్తివల్లనూ, మద్రాసు ప్రాంతాల్లో చేసిన వృత్తుల వల్లనూ వారికి తమిళ భాషా సాహిత్యంలో కొంత అభినివేశం కలిగి ఉండవచ్చు. నిజానికి కృష్ణదేవరాయలు, రామరాజభూషణుడు, చేమకూర వెంకటకవి వంటి ఏకొద్ది మందో తప్ప సుప్రసిద్ధులైన ప్రాచీనాంధ్ర కవుల్లో అత్యధిక సంఖ్యాకులు బ్రాహ్మణులు. ఇందుకు విరుద్ధంగా తమిళ సాహిత్యం లోని సుప్రసిద్ధులెందరో బ్రాహ్మణేతరులు. తెలుగు భాషా సాహిత్యాల మీద సంస్కృత ప్రభావం, ఆర్యమత ప్రభావం అత్యధికం. తమిళ భాష మీద సంస్కృత ప్రభావం కానీ, తమిళ సాహిత్యం మీద ముఖ్యంగా ధర్మారావు సమకాలిక తమిళ సాహిత్యం మీద బ్రాహ్మణ మత ప్రభావం కానీ అత్యల్పం. ధర్మారావు రాజకీయ సాంఘిక విశ్వాసాలకు తమిళదేశ ఉద్యమకారుల ప్రభావం ద్వారా సంక్రమించిన బ్రాహ్మణేతర ఉద్యమ ప్రభావంతోపాటు సంస్కృత భూయిష్టంకాని సులభ భాష మంచిదనిపించి వ్యావహారిక భాషావాదానికి వారిని అభిముఖులను చేసింది. అంతేకాదు, తమమీద భాషా, శైలీపరంగా వేమన బాగా ముద్ర వేశాడనీ, సులభ శైలిలో ప్రజలకు ప్రబోధాత్మకంగా రాయటానికి ఈ శైలే అనువైందని అనిపించిందనీ ధర్మారావన్నాడు. అదే వచనంలో వాడానని అన్నాడు. (అమర్ సుందర్ ఇంటర్వ్యూ. దక్కన్ క్రానికల్. 8-5-1972). ఈ అభిప్రాయాలు కొత్త పాళీ అంతటా కనిపిస్తాయి.

ధర్మారావుకు 'సారస్వతం అంటే ఏమిటి ? భాష ఎటువంటిది ? భావం ఎలాగుండాలి ? కవి ఎటువంటివాడు? కవిత్వానికి అర్హత ఎలాంటిది ?' ఈ ప్రశ్నల గురించి పూర్వమున్న అభిప్రాయాలన్నీ 'పూర్తిగా మారిపోయాయి'. ఆ మారిన అభిప్రాయాలనుసరించే ఈ కొత్తపాళీ చేపట్టారు. ఈ మార్పు క్రమంగా జరిగిందే. తన సమకాలికుల్లో కనబడ్డదే. అయితే ఒకగట్టి నమ్మకం కలిగిన తర్వాత ఇక పాత పాళీ పద్ధతి పనికిరానిదనుకున్నారుగానీ పేరు కోసమో, సమకాలికుల్లో వెనకబడిపోతాననో, అని మాత్రం కాదు. దీన్ని చేపట్టే ముందర తన పాత మిత్రులనూ ఆ పంథాలోనివాళ్ళనూ మనసులో ఉంచుకుని ఇలా అన్నారు. "కొత్తపాళీ చూచి కోపం తెచ్చుకోవద్దని వేడుకుం

టాను మిమ్మల్ని అందర్నీ . . అన్ని విధాలా ఆలోచించనిదే నేనీ పనికి పూనుకోలేదు."80

ఇందులో ప్రతీకలను బాగా ఉపయోగించారు. పిట్టకలం అని తన పాత కలాన్ని అంటారు. అంటే తాతలనాటి పద్ధతిలో నడిచేదని భావం. దీని నడకలో బరబరలూ, దబడబలూ అధికమని ఊపిరి పీల్చుకోవటానికి వీలుండదనీ అంటూ జటిల సంస్కృత సమాస భూయిష్ఠ రచనకు "ప్రాంచద్వ్యాబద్ధ పక్షద్వయ" - అన్న పద్యాన్ని ఉదాహరిస్తారు.

దీనికి 'రిలీఫ్ పాళీ' పెట్టానంటూ "కాలం కొత్తది - కాలం అంటే మనము, మనమంటే కాలం. కాలం మారనిదే మనం మారము. మనము మారనిదే కాలం మారదు". కనుక ఇప్పుడు కొత్తపాళీ పెట్టానంటారు. సమాజంతో పాటు మనిషి మారాలనీ అలామారకుండా ఉండడమంటే 'సత్యాన్ని విడిచి సాము చేయడంలాంటి'దని ఉపమిస్తారు. అయితే పాతకలానికి కొత్తపాళీ అతుకులా ఉండదా ? అని తన్ను తానే ప్రశ్నించుకుంటూ ఈ ప్రపంచమంతా అతుకులమయమనీ ఒక దేశానికి మరో దేశం అతికే ఉండాలనీ అంటే ఒక దేశంతో మరో దేశం సాంస్కృతికంగానూ, వాణిజ్యపరంగానూ, సాహిత్యపరంగానూ అతికే ఉండాలనీ, అలా ఉంటేనే వసుధైకకుటుంబక మన్నది సాధించగలిగి అంతర్జాతీయతాభావం, 'ఎల్లలోకము లొక్క యిల్లై' అన్న గురజాడ సూక్తి పెంపొందుతుందన్న ఆశాభావం పరోక్షంగా వ్యక్తపరుస్తారు. తాను పట్టిన ఈ కలం 'పురాతనాన్ని నూతనంతో అతుకుతుందం'టూ పాత కొత్తల మేలు కలయికనే ఇంక నా రచనల్లో మీరు చూడగలుగుతారని చెప్పకుండానే చెప్పారు.

ఇక్కడ ఒక విషయాన్ని ఆలోచించాలి. గతమంతా బూది కుప్ప అన్న వాళ్ళకు ధర్మారావు "పాత దానిని విడిచిపెట్టలేము. పాతది ఉండవలసిందే. ప్రపంచంలో మనం చూస్తున్న అభివృద్ధి అంతా పాత దాని మీద మెరుగేగదా"- అంటారు. గురజాడ భావంలో మంచి గతమున కొంచెమే నోయ్ అయినా, అది తరతరాల మానవ శ్రమఫలం కనుక వదలకుండా దాన్ని ఆధారంగా తీసుకొని ముందుకు పోవాలన్న భావం వ్యక్తపరుస్తారు. అయితే అందులో ఉండే చెత్తనూ చేపట్టాలా ? అన్న సందేహాలకు వెంటనే 'పనికిరానట్టుంటే కొట్టిపడవేస్తాం .... నిలవడానికి హక్కు లేనిది ఎంత అభిమానమున్నా ఎగరవలసిందే. నిస్సందేహంగా' అని

ఉపాలిస్తారు ఆ ఉద్దేశం ఉంచుకునే ధర్మారావు పాతను పూర్తిగా కొట్టిపారేయ లేదు. కొత్త చూపుల వాకిళ్ళు తెరిచే ఉంచుకున్నారు. బుద్ధి గీటురాయి మీద సాహిత్యం నిగ్గు తేల్చాలనుకున్నారు.

ఈ కొత్త పాళీలో ధర్మారావు ప్రధానంగా రెండు సూత్రాలను తయారు చేసుకున్నాడు. ఒకటి భాష - మరొకటి భావం. దీన్నే ఫారం అండ్ కంటెంట్ అని అనొచ్చు. అంటే రీతి - వస్తువు అని అర్థం. ఈ భావంలోనే తన పాతకాలానికి కొత్తనిబ్బును "ఒకటి పైకి కనబడే ఆకారానికి, రెండోది లోపలవుండే విషయానికి అన్నమాట. ఇంగ్లీషులో ఒకటి మేనర్ అంటారు. మరొకటి మాటర్ అంటారు"81 ఇలా రెండు-సూత్రాలు-దారాలతో కట్టేశాడు.

మొట్టమొదట రీతిని వివరించాడు. శబ్దాలు - అలంకారాలు - చందస్సు వ్యాకరణం ఇలాటివన్నీ ఆ ఫారంను పరిపుష్టం చేస్తూ దానికి అంగాలుగా ఉంటాయి. ధర్మారావు వీటన్నింటినీ కలిపి 'భాష' అనుకుంటూ ఈ భాగాన్ని వివరించాడు. భాష అనేది కవి తన అభిప్రాయాన్ని వివరించటానికుపయోగించే మాధ్యం. అయితే ప్రాచీనులు దీన్ని మర్చిపోయి "పదాలను పట్టుకొని పల్టీలుకొట్టడం ప్రారంభించి, డొంక తిరుగుడు వర్ణనలనూ భాషని చేపట్టి భాష లక్షణాన్ని నాశనం చేశార"న్నాడు. క్రమంగా ఇదే వేలంవెర్రిగా మారి శ్రీనాథుడి కాలానికి శబ్దాల 'దడబడలే కవిత్వం' కామోసుననే దురభిప్రాయం కలిగించేలా తయారైందని విమర్శించాడు. సంస్కృతం ఆధారమైంది కనుక యీ సూత్రాలూ దిగుమతి కావటంతో తెలుగు అంతరించడం చూసి ధర్మారావు బాధపడుతూ కవి కావాలంటే "బ్రాహ్మడయి ఉండాలి, షట్‌శాస్త్రాలు తెలిసుండాలి, వ్యాకరణాలు వల్లె వేసుండాలి"- అన్న నాటి భావాన్ని నిరసించాడు. ధర్మారావులో మొదటినుండీ ఉన్న ఈ భావాన్ని నిర్మొహమాటంగా వెల్లడిస్తూ అది ఎంతటి అసత్యమో వివరిస్తాడు. ఇదంతా సంస్కృతం చేసిన చెడుగే నంటాడు. అయితే తాను సంస్కృతానికి వ్యతిరేకిని కాననీ, అది గొప్ప రత్నాలగని అని కాని అనవసరంగా ఆ భాషను దిగుమతి చేసుకోవద్దంటూ తెలుగుతనం నిలపమంటాడు.82

ధర్మారావు ఉద్దేశంతో భాష ఎలాగుండాలి అనంటే 'ఎలాగ రాస్తే బాగా తెలుస్తుందో అదే కావాలి' అని. సంస్కృతాన్ని పూర్తిగా వదిలి అచ్చ తెలుగులో ప్రజలకర్థం కాకుండా రాసే రాతలనూ, కేవలం సంస్కృత శబ్దాలనూ వ్యాకరణ సూత్రాలనూ పేరుస్తూ రాసే అయోమయం రాతలనూ ఆయన ఈసడించుకున్నాడు. ఈ సందర్భంలో ఒక ఉదాహరణ ఇస్తూ వ్యావహారిక భాషావాదులుకొందరు వాక్యాన్నంతా సంస్కృత భూయిష్ఠంగా

రాసి చివరలో క్రియా పదాంతాలు వ్యావహారికంలో రాయటాన్ని 'ఇదీ ఒక లోపమే' అనంటాడు. తమకూ సంస్కృతంవచ్చునని పండితులకు చూపటానికి అలా రాస్తూ ఉండవచ్చని సమర్థించటానికి యత్నిస్తారు. ఇదంతా తప్పని చెప్తూ "చెప్పవలసిన విషయం చప్పన అయిపోతున్న కొద్దీ చప్పుడు ఎక్కువ అవుతూ ఉంటుందని" - భాషనాధారంగా చేసుకొనే శబ్దాల దబదబలను వ్యంగ్యంగా ధర్మారావు ఎత్తిపొడుస్తాడు. ఈ భావాన్నే ఒక సందర్భంగా రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ కూడా 'ఒకనటుడు భావాన్ని చక్కగా తన ముఖ కవళికల చేత చూపెట్టలేక అశక్తుడైనప్పుడు భుజకీర్తులూ, చమ్కీ కోటులూ, తళుకు కిరీటాల మధ్య చూపరులను మభ్యపరుస్తా'డంటాడు - తమ నాటకోపన్యాసాలలో.

రచయిత తొలిదశలో ఈ దబదబలకు దాసుడౌతాడు. మాటల ఆడంబరం మహాకవుల గుణం కాదని ధర్మారావు అంటాడు. అలా ఆడంబరంగా ఉండటానికి ఓ కారణాన్ని కూడా వివరిస్తాడు. చెప్పేవాడికి అసలు సంగతి చాలా బాగా తెలియాలి. అది ఎరువు సొమ్ము కాకుండా తన హక్కు అయిపోయి ఉండాలి. ఎరువుగా ఉన్నంత కాలము బరబరలు తప్పవు. మాటల ఆడంబరం పోదు.[83] అని అంటాడు. ఈ భావంతోనే వారు జనవాణి దినపత్రికకు సంపాదకుడిగా ఉండి నిర్వహిస్తున్న కాలంలో ఆచరించి చూపారు. సహచరులు ఆచరించేలా ప్రోత్సహించారు. అందుకే అందులో వ్యావహారిక భాష ఉపయోగించటం - అదీ వార్తలు, అనువాదాలనిపించకుండా తెలుగు వార్తే అనిపించేలా ఉండటం సంభవించింది. పత్రికారచన అభివృద్ధి దిశగా ఓ మలుపు తిరిగింది.

రచయిత దృష్టిలో మార్పు రావాలి. సభల దృష్టిపోవాలంటూ సభలంటే 'సత్సభాంతర సరసీవనాలూ', 'ఇమ్మగు సభలూ', 'బుధవరుల సభలూ' - అంటే సంస్కృతం వాళ్ళ మెప్పుకోసం ఉన్న సభలన్నారు ప్రజలు ఆనాడు మరుగునపడ్డారని కవికీ - జనానికీ మధ్య మహాసముద్రాలు పెరిగిపోయి జనానికి కవి ఎలాంటివాడో తెలియని, ప్రజలగోల కవికి అక్కర లేని నాటికాలాన్ని అసహ్యించుకున్నారు.

రచన సాఫీగానూ సూటిగానూ ఉండటానికి 'పడు' గడబిడా, 'యొక్క' అడావుడీ తగ్గాలంటూ కనబడు, వినబడు లాంటి చోట్ల ఎలాగూ 'పడు' ఉంటుందంటారు. వాక్యంలో అర్థం స్ఫురించేదాన్నిబట్టి బండిరాలు, అరసున్నల అవసరం ఉండదనీ ధర్మారావు వాదన. ఇలా పోయేవాటన్ని టినీ పక్షపాతం లేకుండా తీసెయ్యాలంటూ చిన్నయసూరి వ్యాకరణం

"ఇంతకు ముందు వ్రాతగాళ్ళు వ్రాసిన తెలుగు భాషది కావచ్చును. కాని ఇప్పటి భాషది కాదు. గతించిన తెలుగుది. ఆ వ్యాకరణం పనికిరాదు" అని ఖండితంగా చెప్పాడు.[84]

వాడుక భాషను గురించి రాస్తూ "వాడుక - ఒక పక్కనుండి కొట్టుకొని వస్తూ కవినీ, పండితుడినీ, ప్రజలనూ - అందరినీ ఒక్కలాగా ముంచివేస్తున్నప్పటికీ, దానిని మనవాళ్ళు గుర్తించారు కారు" అని అంటూ ఒక రకంగా ఆత్మవిమర్శ చేసుకున్నాడు.[85]

ఈ భాష ఉదాత్తమైన భావాలను తేలికగా అర్థం అయ్యేలా చెప్పడానికి చాలదనే విమర్శకు సమాధానంగా, వేమన మనకి సజీవమైన నిదర్శనంగా ఉన్నా చూడలేని కళ్లున్న కబోదులతో - కొత్త మాటలు రావటానికి అభ్యంతర పెట్టకూడదనీ అలాగే వాడుకమాటలు మన నూతన అభిప్రాయాల ప్రకటనకు తూగలేవనే దురభిప్రాయానికి జాగా ఇవ్వకూడదని విజ్ఞప్తి చేస్తారు. ఈ సందర్భంలోనే బంగాళీలో నాడు వచ్చిన భాషా ఉద్యమాన్నీ దాని నాయకులనూ స్మరిస్తారు.

ధర్మారావు కలానికి 'కొత్త నిబ్' పెట్టి కట్టిన మొదటి దారపోగు భాషాసూత్రం. ఇది వ్యాకరణాల దుర్గమారణ్యాలలో, ఛందస్సుల సర్పపరిష్వంగాల మధ్య, బండిరా అరసున్నల సంకెళ్ళతో భాషను అయోమయావస్థలో పడేసిన చిన్నయసూరి పాలిట ఉరితాడుగా మారింది. ధర్మారావు భావంలో స్పష్టంగా భాష రూపమనీ అదే ప్రధానం కాదనీ అలా అంటూంటే దాన్ని మరింత చులకన భావంతో చూడటం అనిపించుకోదనీ వస్తువును అంటే మాటర్‌ను జాగ్రత్తగా ఎంపిక చేసుకోవాలనీ ఉన్నట్టు అర్థమవుతుంది.

తనకున్న ఈ భావాన్ని స్పష్టం చెయ్యటానికే 'సూరి మరణం లేక బండి రా పల్లకీ' నాటిక రాశాడు. ధర్మారావుకు ఎప్పుడూ తను చెప్పిందాన్ని ఒక ప్రయోగంలో ఆచరించి చూపే అలవాటుంది. అలాగే తన ఊహ ప్రకారం భాషలో పలుకురాళ్ళు తీసేస్తే ఎలా ఉంటుందోనని ఒక చిన్న నాటికలో చూపించాడు.

ఇందులో అయిదు రంగాలున్నాయి. సూరిగారి అంతిమ కాలం - మరణం ఒక రంగంలోనూ; సూరి మరణాన్ని ఆయన శిష్యులు వాడుకున్న తీరునూ కొత్తగా వస్తూన్న తరానికి ప్రతినిధులుగా కొందరు కాలేజీ విద్యార్థుల అభిప్రాయాల తీరునూ వర్ణిస్తూన్న భావ సంఘర్షణ రెండో రంగంలోనూ; మూడో రంగంలో కాలేజీ విద్యార్థులు సూరిని భాషాపరంగా అసహ్యించుకున్న పద్ధతినీ వర్ణించాడు ధర్మారావు. కొత్తతరం పాత సంకెళ్లను వదిలించుకుం

టుందన్న దానికి ప్రతీకగా బండిరా పల్లకి చేసి సూరి బొమ్మను ఊరేగిస్తూ కాటికి చేర్చటం నాలుగో అంకంలో చూపాడు. అయిదో అంకంలో పనికిరాని పాతను చితిమంటల్లో కాల్చటం, పాత శని పీడ విరగడైందంటూ ఏటిలో మునిగి సంతోషంతో - ముఖ్యంగా కళాశాల విద్యార్థులు - ఇళ్ళకెళ్లటంతో నాటికను ధర్మారావు ముగించాడు.

ఇదొక అవహేళన నాటకం. అదీ ప్రతీకలను వాడుకుంటూ చేసింది. అయితే ఒకరి చావు - అతడెంతటి దుర్మార్గుడైనా ప్రేక్షకుల్లోగానీ శ్రోతల్లో గానీ, సానుభూతినీ - జాలినీ కలిగించె ఘట్టం. కన్నీళ్లకు సాధారణంగా తావుండక కర్తవ్య దీక్షనూ కార్యక్రమ రూపకల్పననూ చేస్తూ ముందుకు పోదామనే భావం అమర వీరుల మరణం సందర్భంగా కలుగుతుంది. కానీ ఈ సూరి మరణం అలాటిదీ కాదు. దీన్ని రావు అనే పాత్ర శ్మశానంలో చేసిన ఉపన్యాసం ద్వారా ధర్మారావు స్పష్టపరిచాడు. అన్యాయమైన కట్టుబాట్లు, అర్థం లేని సంకెళ్లు పోయినటువంటి దినం ఎవరికైనా ఒక మహాసుదినం అవుతుందని చెప్పిస్తాడు. జనాన్ని ఆధారంగా చేసుకుని చూస్తే ఈయన బతికున్నప్పుడు కవికీ - జనానికీ అరణ్యాలు సృష్టించాడు కనుక ఆ అరణ్యాలు దగ్ధం చేయట మంటే రచయితను జనంలోకి పంపటమూ, జనం నుండే కవిని సృష్టించడమూ అవుతుంది. కనుకనే ఈ సూరి మరణం "తెలుగు వ్రాతలకి ఈ దినం ఆరంభం. కాబట్టే ఉత్సవం" అంటూ ధర్మారావు తానే ముందుకొచ్చి రావుగా అనేస్తాడు.

ఈ ప్రయోగం మొరటుగా లేదా? అన్న అభిప్రాయం కొందరికి రావచ్చు. కాని ధర్మారావే పీఠికలో అన్నట్టు 'కొంత మిషనరీ మతబోధకుల పద్ధతి అవలంబించవలసివచ్చి' (కొత్తపాళీ తొలిపలుకు) రాశారని సరిపెట్టుకోవటం అవసరం చివరికి వ్యంగ్యంగా "గొప్పగొప్ప కార్యాలు చేసినవారికి పునర్జన్మ లేకుండా చేస్తావట. ఇంతకన్నా గొప్ప కార్యం చేసిన వాళ్ళుండడం కష్టం. కాబట్టి ఓ దయామయా, మాయందు కరుణించి ఈ సూరి గారికి, ఈ వ్యాకరణానికి, ఈ బండిరాలకి, ఈ అరసున్నాలకి తిరిగీ మాలోకంలో ఎప్పుడూ జన్మ లేకుండా ఉండేటట్టు తప్పకుండా చేయాలి. ఇదొక్కటే మా ప్రార్థన" - అని ధర్మారావు తన కసినంతా సున్నితమైన హాస్యంతో కలిపి వెళ్ళగక్కాడు. చివరి ప్రార్థన దేవుడికి కాదు. యువతరానికి. కొత్త రచయితలకు. అదెంత వరకు సఫలమైందో మన కళ్ళతో మనం చూస్తూనే ఉన్నాం.

ఇక రెండో సూత్రం భావానికి సంబంధించింది. దీన్నే ధర్మారావు 'కథ, కల్పన, వర్ణన, ఊహ అంతటికిన్నీ' సంబంధించింది అన్నారు. అప్పటి వరకూ సారస్వతం అంటే పండితులకోసమే పండితులే రాసింది. పద్యాల

కర్థాలు చెప్పటం, శబ్దార్థాలను చర్చించటం, సమాసాల సొగసులు విప్పటం వీటిలో తగాదాలొచ్చి చివరకు పద్యాల్లోనే తిట్టుకుంటూ విమర్శించుకోటం ఉంటూండేది. వాళ్ళ 'విమర్శన అంతా ఈ వాదనలతోనే తెల్లవారింది' - అని అంటూ పాత్రల్లో పేరుపెట్టి తిట్టటం లాటివి తానూ చేశానని 'నేనుగూడా ఈ వాదనల ప్రవాహంలో పడ్డవాడినే'86 - అని ఆత్మవిమర్శ చేసుకున్నాడు. తాను గ్రాంధికంలో ఉషఃకాలము అన్న సాహిత్య చరిత్ర రాయటమూ, గ్రాంధిక భాషను సమర్థిస్తూ చంపకమాల రాయటమూ వీరేశలింగం, జయంతి రామయ్యగార్లు సముద్ధించటాన్ని కూడా ప్రస్తావిస్తూ తానానాడు ఆ ప్రవాహంలో కొట్టుకుపోయాననీ తెలుపుకున్నాడు. అంతవరకూ ''సాహిత్యమంటే భాషను గురించి వాదించడమే ప్రధానమనుకున్నా'' రంటూ స్థూలంగా నాటి సారస్వత స్వరూపాన్ని చెప్పాడు.

సారస్వతంలో ప్రాధాన్యం విషయానికుండాలంటూ ధర్మారావు "సారస్వతానికి భాష మిస్తులు లాంటిది కోటు, చొక్కా, చీర, ఉత్తరీయం ఇలాంటి వాటితో సమానం అవుతుంది. అంతేకాని ఎక్కువకాదు. విషయం అన్నదే అసలు మనిషి'' - అని వివరిస్తూ అంతవరకూ వచ్చిన సారస్వతం అంతా దాదాపు దీర్ఘవాదనే అని విమర్శించారు. దీనివల్ల సృజనాత్మక రచనలు చేయగల చేవ ఉన్నవాళ్ళు కూడా దాన్ని మర్చిపోయి 'తెలుగుతల్లి ఒంట్లో ఉన్న ఎముకలన్నిటినీ విడదీశారనీ, ఆ ఎముకల వంకరటెంకర లన్నిటినీ' 'నిరూపించటం'లోనే కాలం గడిపారని తేల్చారు. అందుకే సారస్వతానికి అభివృద్ధి ఆగిపోయిందని కారణాన్ని విశదీకరించారు.

పుస్తకానికి విలువ తెచ్చేదీ ప్రజలకు లాభం ఇచ్చేదీ అందులోని విషయం అన్నది ధర్మారావు దృఢాభిప్రాయం. ఇదే అభిప్రాయం నవ్యకవులకు కూడా ఉంది. ఏ ప్రక్రియను చేపట్టినా - రూపానికే ఆనాడు విలువ ఇచ్చారని వీరి ఆరోపణ. మనకు మొదటి వ్రాతగాళ్ళందరూ పదాలు నోటపాడ్తూండే వాళ్ళేననీ వాళ్ళు విషయానికే ప్రాధాన్యం ఇచ్చారు కాని భాషకు కాదనీ సందర్భాన్ననుసరించి సామెతలు వాడారనీ అవి ప్రజలకు బోధపడేటట్టు ఉండేవనీ అవే నిజమైన సారస్వతపు తొలిదినాలని దర్మారావు అన్నాడు. క్రమంగా భాషాంతరీకరణలొచ్చి సంస్కృతం కట్టూ - సంస్కృతం టస్సా వచ్చింది. తెలుగుతనం చచ్చింది. అప్పటికీ తెలుగుతనాన్ని పట్టినిలిపినవాళ్ళున్నారంటూ పాల్కురికి సోమన, పోతన్నలను స్మరిస్తారు. వీళ్ళకు నాటి సంస్కృత కవులు పుట్టగతులు లేకుండా చెయటానికి కారణం వీళ్ళలో తెలుగుదనం ఉండడం- అది వాళ్ళకు సరిపడకపోవటమేనని నిరూపించాడు. అప్పకవి బయటపెట్టక

పోతే పోతన్న బాయ్‌కాట్‌తో రహస్యం తెలుగు సాహితీలోకానికి తెలిసేదేకాదని అభిప్రాయపడుతూ పాత తెలుగు కవిత్వం రుచి ఎలాటిదో తెలియకుండా పోవటానికి ఆనాటి సాహిత్య హిట్లర్, సారస్వత ముస్సోలినీలలాంటి సంస్కృత పండితులే కారణం అని ఖచ్చితంగా తేల్చాడు.

భాషాంతరీకరణాల వల్లే యతిప్రాసల జమిలి సంకెళ్ళూ, పాదపూరణాల బరువులూ, ఉద్యత్, స్ఫురత్‌లాంటివి, అర్థం లేకుండా ఉపయోగించే ఉపసర్గలూ, పదికట్టిరాళ్ళ సుదిబండలు తెలుగులో దిగుమతి అయ్యాయి. దీనంతో పాటు పీడా తెలుగుకొచ్చిపడింది ఈ మేకు బందెల మధ్య తెలుగు ఇరుక్కుపోయింది. విషయం ఉరిపోసుకుంది. అలాగే అసహ్యమైన కవిసమయాలూ-కావ్యసూత్రాలూనూ. నడున్న సాహిత్య నియమాలు తెలుగుతనం పిండయటానికి ఆటంకాలయ్యాయంటూ; ''మన అభివృద్ధికి దారి చూపించేవి. ప్రజలు అనుసరించాలాంటివి అలాంటి నియమాలు ఉండవలసిందే"87 - అని నియమాలలో తారతమ్యాన్ని చక్కగా వివరించాడు తెలుగులో తెలుగు సాహిత్యాన్ని చూపటం జరగలేదనీ అంతా సంస్కృత సంప్రదాయాల మూసపోతవర్ణనలూ, అరిగిపోయిన కవివర్ణనలతో సంస్కృతానికి తెలుగును బానిసగా చేసిన నాటి సాహిత్యకారులమీద తన ఆగ్రహం వెళ్ళబుచ్చాడు.

ధర్మారావు తన వాదనకు ఆసరాగా తమిళ సాహిత్యాన్నీ - సాహితీ వేత్తలనూ తీసుకొచ్చి ఆ విధంగా నన్నా తెలుగు సాహితీవేత్తలు సాగక పోవటానికి కారణం తెలుగు చెప్పేవాళ్ళకోసం సంస్కృతంకాగడాతో వెతికే ఆంధ్ర విష్ణువులు మనలో ఉండటమేనని అంటాడు. తన అభిప్రాయాలతో సాహిత్య చరిత్రను కొంత క్లుప్తంగా వివరించాడు ధర్మారావు. వ్యాఖ్యాతలు సహితం కవుల జీవనాడిని సరిగా పట్టుకోలేకపోయారనీ; హారంలో పూలే చూశారు కానీ సాగిన సూత్రాన్ని పసిగట్టలేక పోయారనీ బాధపడ్డాడు. విమర్శకులందరూ మెల్ల చూపు వారేననీ, పాఠకులన్నా మంచి వాచకం కల వాళ్ళా అంటే, వాళ్లూ నత్తినోళ్లవాళ్ళనీ అందుకే నాడు కవులు తమ ఇష్టా రాజ్యాన్ని చలాయించారన్న అభిప్రాయాన్ని తెలిపాడు. నాయికలని దింపినట్టే కవిత్వాన్ని కూడా శృంగార చష్టలలోకి దింపి, కళాశాస్త్రంలో చూపినట్టే కవిత్వాన్ని గూడా బంధాలలోకి దించి చివరకు సిక్కాడించక తప్పక, ఒక మత్తేభం కడుపున నాలుగు పిల్లలు పుడితే, మరొక శార్దూలానికి ఆరు పిల్లలు పుట్టిస్తూ కవితను నానా భ్రష్టూ పట్టించారన్నాడు ధర్మారావు. దీనివల్ల కలిగిన 'లాభాన్ని' అంచనా వేస్తూ 'ఉద్ధకవిత్వమంటే అసహ్యం కలిగేటట్టు చేశారని' ఖచ్చితంగా చెప్పాడు. (పేజీ 219, కొత్తపాళి.)

నాడు కవిత్వంలో ఇరికించిన కుకవినింద ద్వారా కవులు ఆత్మస్తుతీ-పరనిందలు చెయ్యటం ఆరంభించారు. వాళ్ళ దృష్టిలో విశ్వశ్రేయస్సు అంటే ప్రజలకున్న కష్టాలు తొలిగేలాగానూ, వాళ్ళకు సౌఖ్యాలు కలిగేలాగానూ కావ్యాలు రాయటం కాదు. కావ్యం చివరలో ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి ఇది చదివితే కలుగుతుంది అంటూ మొక్కు తీర్చుకోవటమే.

ధర్మారావు దృష్టిలో కవి ప్రజలలో, ప్రజలతో, ప్రజలకోసం బ్రతకాలి. (పేజి 180, నాల్గవ ముద్రణ, కొత్తపాళీ). తెలుగు సంస్కృతి, తెలుగు గడ్డ యుగయుగాలనుంచి వచ్చిన తెలుగు విజ్ఞానమూ తనకిచ్చిన శక్తితో "తెలుగు కవి తెలుగు ప్రజల జీవితంలో ఉండి వ్రాయాలి.'' ఆ జీవితానికి వికాసం కలిగిస్తూ దానిని అభ్యుదయ మార్గంలో నడిపించడం ప్రతి వ్రాతగాడి ప్రధానమయిన పనిగా ఉండాలని ధర్మారావు గట్టిగా నమ్మాడు. అలాటి విషయమే ధర్మారావు పాళీకి కట్టిన రెండో దారపోగు. ఈ దారపోగుతో వెనకచూపున్న రచయితల మెడలకు ఉరిపోశాడు.

ధర్మారావు అభిప్రాయంలో వస్తువు-రీతులకు సమన్వయం ఉండాలన్నది ప్రధానాంశం. దీన్ని వివరించటానికే కొత్తపాళీ రాశాడు. పాతను సమూలంగా నాశనం చేయాలన్నది వీరభిప్రాయం కాదనీ, ప్రస్తుతానికి అవసరం లేనిదాన్నే వదిలించుకోవాలనీ అంటారు. అదేవిధంగా వస్తువును అందంగానూ వాస్తవంగానూ తగిన తాత్విక పునాదితోనూ తీర్చిదిద్దాలన్న అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తాడు. అయితే కేవలం రీతివాదులుగా కొందరు ఆనాడూ ఈనాడూ సాహిత్యరంగాన్ని కలుషితం చేస్తున్నారు. అలాగే కేవలం వస్తువాదులు కూడా శుద్ధ నినాదాలను దింపుతున్నారు. అటు శుద్ధకళావాదంగా ఉన్నా, కేవలం 'సర్వేజనా స్సుఖినోభవంతు'లే కవిత్వమని అన్నా ధర్మారావు దృష్టిలో తప్పే. ప్రయోగాల గారడీలో పడిన కొందరు అత్యంతాధునికులను ఆనాటి కవిత్వాన్ని నిశ్శాడించిన వాళ్ళతో జమచేయవచ్చు. ప్రయోగం అన్నది జనోపయోగంగాను వారి హృదయాన్ని పట్టుక ఆడించేదిగాను ఉండాలేతప్ప మెదడును పట్టుకొని ఊపించేదిగా ఉండకూడదు. ప్రయోగం కోసం ప్రయోగంగా ఉండడం సాహిత్యానికి పుట్టిన కుక్కమూతిపిందె. ఈ అభిప్రాయాలన్నిటినీ కొత్తపాళీ చివర "గీటురాళ్లు ... వ్రాత... రోత" అన్న కొత్తపాటలో వివరించాడు.

వస్తువు మారినప్పుడు రీతి మారవచ్చు. రీతి దానికది ఎప్పుడూ మారకుండా ఉండేది కాదు. ఈ రెంటి మధ్యా ఉండే వైరుధ్యం పదునౌతూ రావటంతో రీతి మారటం జరుగుతుంది. వస్తువు ఎప్పుడూ చలనంలో



25. అమెరికాలోని కొన్ని తెగల్లో ఊరి ముందు లింగాకారం కర్రా, యోనిలా పంగల కర్రా ఉంటుంది.



26. ఆఫ్రికాలో బుష్‌మెన్ తెగ, రాళ్లను స్త్రీ అంగాలుగాను, చెట్లను పురుషాంగాలుగాను భావించి పూజిస్తారు.

27. 'ఇజరేనా' దేశంలో ప్రియాపస్ పూజ. పురుష జననాంగం కేకులను స్త్రీలు మొక్కుగా చెల్లించడం.

ed it." But in other nations the stones were often hewn, e
quite realistic phallic shapes.

Fig. 201. Towers, pillars, tombstones and menhirs as symbols of the phallus.

28. ప్రపంచంలోని ఎత్తయిన స్తంభాలు, టవర్స్, చర్చీలు, మసీదులు, గుళ్లు - వీటి నిర్మాణాలన్నీ స్త్రీ, పురుష జననాంగ చిహ్నాలే.

ఉంటుంది. అంటే మార్పుకు గురౌతూ ఉంటుంది. అభివృద్ధి దిశగా మారటంలో ముందుంటుంది.[88] దీన్ని బట్టి చూసినా వస్తువుకున్న ప్రాధాన్యం - వస్తువూ రీతీ అంటే ధర్మారావు పరిభాషలో భావం - భాషలు ఎలా చెట్టాపట్టాలేసుకుని వెళ్ళాలో అర్థమవుతుంది. వస్తువుకు విడాకులిచ్చి రీతి ప్రధానం కావటం ముఖ్యంగా కళారంగంలో దాని నాశనానికే దారి తీస్తుందని మార్క్సిస్టు శాస్త్ర వేత్తల అభిప్రాయం. సాధారణంగా బూర్జువా రచనల్లో వస్తువు రీతి మీద ఆధారపడుతూండటం చూస్తూంటాం. పేలవమైందీ - నిరభ్యుదయకరమైందీ అయిన విషయాన్ని అందమైన రీతిలో కళాత్మకంగా సృష్టిస్తూ మానవుల తలల్లో దూర్చటమన్న మాట.[89] దీన్ని ధర్మారావు నిరసించటమే కాదు తన కొత్తపాళీలో తూర్పారపట్టాడు.

మూడు సంవత్సరాల మౌనం, నిరంతర పఠనం, లోకపరిశీలనం ధర్మరావు నడకను, గొంతును పూర్తిగా మార్చివేశాయి. కొత్త గొంతుతో పల కటం ఆరంభించాడు. కొత్త చూపుతో రాయటం మొదలెట్టాడు. ప్రజామిత్ర ద్వారా కొత్తపాళీ చేపట్టాడు. తన సాహిత్య జీవితంలో మార్పుకు నివాళు లెత్తాడు.

## సాహిత్య మొర్మొరాలు

రచయిత తాను రాసే ప్రతి రచనకూ ముందు ఇది తానెవరికోసం రాస్తున్నాడన్న దాన్ని మనసులో ఉంచుకుంటాడు. ఆ రచన తానాశించిన పాఠకుల్లో ఎలాంటి ప్రభావాన్ని కలిగించాలో అంచనా వేసుకుంటాడు. అప్పుడే అతడి బాణం గురిని తాకుతుంది. సత్ఫలితాలనిస్తుంది.

ధర్మారావు బుద్ధి ప్రధానంగా సాహిత్యం వైపు ప్రసరించేది. వారు రాజకీయాలు రాసినా, సామాజికాంశాల మీద విమర్శలు చేసినా తప్పకుండా అవకాశం చూసుకుని సాహిత్యాంశాలను కలగలుపుతూంటారు. వారి తత్వం ప్రాచీన సాహిత్యాన్ని కొత్త చూపుతో చూడాలని. ఇతర దేశసాహిత్యాంశాలలో వచ్చిన కొత్త అందచందాలనూ, భావాలనూ మన సాహిత్యానికి కూడా అమరే లాగుంటే అలంకరించుకోవాలన్న తపన ధర్మారావు చేసిన ప్రతి కృషిలోనూ కనిపిస్తుంది.

భావకవిత్వం దేశాన్ని ఊపేస్తున్న కాలంలో యువకుల్లో పాతదంతా రోత సాహిత్యమన్న అభిప్రాయం ఉందని ధర్మారావు అభిప్రాయపడి అది తప్పని హెచ్చరించాడు. దీనికి విచారణ దినం అనే ఖండికను ఉపయోగించుకున్నాడు. ఈ విధంగా యువకులు ప్రబంధాల గూర్చీ, ప్రాచీన సాహిత్యాన్ని గూర్చి ఎందుకు అలసత్వం చూపిస్తున్నారో అర్థం చేసుకుంటే తప్ప తగిన వైద్యం సాధ్యం కాదని అనుకున్నాడు. ఆ దిశగా సాగిన పరిశోధన వల్ల తేలిందేమంటే ప్రాచీన ప్రబంధాలకు వచ్చిన వ్యాఖ్యానాలన్నీ కొత్త తరం యువకులను తప్పుదారి పట్టించేవిగా ఉన్నాయనీ, అసలు కవి భావనను వ్యాఖ్యానాలు పట్టుకోలేక పోగా గురికి బెత్తెడు ఎడంగా అవి ఉన్నాయనీనూ.

ఇప్పుడు ధర్మారావు పని తేలికయింది. లోపం తెలిసింది. ఎవరిదో? ఆదెక్కడుందో కూడా బోధ పడింది వెంటనే దాన్ని సరిదిద్దాలని ప్రయత్నం అరంభించాడు. ఆ కృషిలో భాగమే ఈ 'సాహిత్య మొర్మొరాల' వ్యాసాలు.

ధర్మారావు సాహిత్యాధ్యయనం చేసినప్పుడు కేవలం వాటి మీద ప్రత్యయంతోనే కొనసాగించాడు. వ్యాఖ్యానాల మంచి చెడ్డలను పట్టించుకోలేదు. అప్పటికొచ్చినవి కూడా వేళ్ల మీద లెక్కపెట్టదగ్గవే. కానీ కాలం గడుస్తున్న కొద్దీ తెలుగు దేశంలో విభిన్న సాహిత్యోద్యమాల ఝంఝ వీస్తున్న కొద్దీ ప్రాచీన సాహిత్యం మీదనే వాళ్లు ముందు ధ్వజం ఎత్తటం గమనించాడు. వ్యాఖ్యానాల సరళి - అవి కలిగిస్తున్న దుష్ప్రభావాలను తలచుకొని అప్పుడు బాధపడ్డాడు. అందుకే "ఈ వ్యాసాలు పండితుల కోసం వ్రాసినవి కావు. పూర్వ కవుల పరిచయం బాగా వున్న పాఠకులకోసం రాసినవీ కావు. ప్రబంధాలకూ-ప్రబంధ కవులకూ కొంచెం దూరమున్న వారికోసమే వ్రాశాను" - అంటూ మొదలెట్టాడు. నేటి యువకుల సాహిత్యాభిమానం గమనించి "చూస్తూ వుంటే మరికొన్నేళ్లలో ఈ కవుల పేరులూ, కావ్యాలూ అన్నీ విస్మృతిలో పడిపోతాయనిపిస్తూంది. అలా జరగటం మంచిది కాదన్న అభిప్రాయం కొందరితో పాటు నాకూ వుంది" - అని తన బాధ్యతను సాహిత్యకారుడిగా గుర్తించాడు. కాగడా, జనవాణి ద్వారా ప్రచారానికి పూనుకున్నాడు. అవన్నీ 1961 లో పుస్తక రూపంగా వచ్చాయి.

ఇంచుమించుగా ఈ శతాబ్ది ప్రథమ పాదం గడిచేవరకూ ప్రధానంగా సాహిత్య సమీక్ష అంతా పద ప్రయోగం, కల్పన, వర్ణన, ఛందోలంకారాలు, వ్యాకరణ విధేయాలా? అవిధేయాలా? అన్న దృష్టితోనే సాగింది. అంతకు పూర్వం కేవలం శబ్ద సాధుత్వాసాధుత్వ జిజ్ఞాసాపూర్వకంగానే సాగింది. అంతే కానీ ఆలోచనామృతాన్ని ఆవిష్కరించే ప్రయత్నం ఎంత మాత్రమూ సాగలేదు.

సజీవమైన భాషా సాహిత్యాలకు నిరంతర పురోగమనం అనివార్యం అన్న విషయం ధర్మారావు గుర్తించక పోలేదు. (పేజి 148). అయితే పురా వస్తు ప్రదర్శనశాలల్లో గతకాలపు జనజీవన సంస్కృతులు ప్రదర్శితమైనా ఆ విషయాలపట్ల అభిరుచీ ఆసక్తీ లేకపోతే పూర్తిగా అవి అవగాహన కావు. అందువల్ల తెలిసిన వాళ్లు చెప్పడం, వ్యాఖ్యానించడం అవసరం. ఆ దృష్టితో ధర్మారావు మన ప్రబంధాలలోని వర్ణనల ఔచిత్యానౌచిత్యాలను తెలుసుకునే విధానాన్ని ఈ వ్యాసాల ద్వారా అందించాడు.

దాదాపు అన్ని సాహిత్య ప్రక్రియల్లోనూ ఈ శతాబ్ది మొదటి రెండు దశాబ్దాల్లో నవ్యతా దృక్పథం కాలూనినట్లే సాహిత్య వ్యాఖ్యానంలోనూ నవీన దృక్పథం బయలుదేరింది. ఇందుకు కట్టమంచి రామలింగారెడ్డి కవిత్వ తత్వ విచారం ప్రోద్బలమై ఉంటుంది.

రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ వంటి విమర్శకులూ, వేటూరి ప్రభాకర శాస్త్రి వంటి పరిశోధకులూ పాత్రల మనోవిశ్లేషణం, మానసిక విపర్యదశలూ విశ్లేషించి చూపే విమర్శలతో ప్రాచీన సంప్రదాయాన్ని పరిపుష్టం చేశారు. ధర్మారావు ఈ సాహిత్య వ్యాఖ్యానాలకు పూనుకోవడానికి పూర్వరంగం చక్కగా నిర్దేశితమై ఉంది. రచనలో సారళ్యం, స్పష్టత, సంభాషణ శైలి తిరుపతి వెంకటకవుల కథలు గాథలలో కనబడ్డాయి. 1940కే చెళ్లపిళ్లవారు వివిధ పత్రికలలో ప్రాస్తావిక విషయాలు ఎన్నో రాశారు. అయినా వీరి దృష్టి ఎక్కువగా భాషాప్రయోగాల పైనే నిలిచిందని చెప్పాలి.

బాహ్య స్వరూప విశ్లేషణం కాకుండా అంతరంగంలోని ప్రవృత్తులను బట్టి కథాగమనంలోని అందచందాలు ఏ విధంగా స్ఫుటమవుతున్నాయో పరిశీలించే ప్రయత్నం ధర్మారావు చేసినట్టు ఈ సాహిత్య మొర్మొరాల వ్యాసాలు సాక్ష్యమిస్తున్నాయి.

వీటిని పరిశీలిస్తే ఇంకొక విశేషంగూడా కనిపిస్తుంది. సుమారు వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రలో ప్రబంధ యుగం అక్షరాల సాము గరిడీలకు అంకురార్పణం చేసిందనీ, కవికి కావలసిన ప్రతిభ, అభ్యాసం, వ్యుత్పత్తి మొదలైన వాటికి క్రమక్రమంగా ప్రాధాన్యం లేకుండా పోతూ వచ్చిందనీ సాహిత్య విమర్శకుల్లో ఒక అభిప్రాయం ఉంది. స్వోపజ్ఞత కన్నా అంధానుకరణానికీ, భావపుష్టి కన్నా పదాడంబర పటాటోపానికీ, వైశద్యం కన్నా గూఢ పదవిన్యాసానికీ ప్రబంధకవులు క్రమంగా మోహితులవుతూ వచ్చారనీ పశులవుతూ వచ్చారనీ ప్రచారం ఉంది. అందువల్ల ప్రబంధాలనగానే ఒక విధమైన వైముఖ్యం, పెదవి విరుపూ ఈ తరంలో ప్రబలకుండా, చూడగలిగిన

నేర్పుండాలేకానీ రసపోషణ, కవితాశిల్పం, భావనిరూపణం, విషయచిత్రణం మొదలైన వాటిలో కూడా మెరుపులు చూడవచ్చని చూపుతున్నాడు ధర్మారావు ఈ వ్యాసాల్లో.

ఈ పదిహేను వ్యాసాల్లో స్థూలంగా మొదటి ఆరు వ్యాసాలు పద ప్రయోగ వైచిత్రి ద్వారా భావుకతా రామణీయకతను నిరూపించే ప్రయత్నంగా భావించవచ్చు.

శబ్దంకాదు అర్థం ప్రధానమంటూ దృష్టిని మళ్ళించేది తాతామనుమల సమీక్ష.

ఎనిమిదో వ్యాసం సాహిత్యంలో వాస్తవికత ఎలా ప్రతిబింబించాలి అనే అంశాన్ని ప్రతిపాదిస్తుంది.

తొమ్మిది నుండి పదిహేను వరకూ సమర్థుడైన కవి పాత్రచిత్రణలో చూపదగిన ఉపజ్ఞను నిష్కర్షించేవి. అయితే ఆంధ్ర కవితాపితామహుడన్న వ్యాసం మాత్రం వీటి పరిధి నుండి బయటికొస్తుంది.

ధర్మారావుకు విజయవిలాసం తర్వాత బాగా నచ్చిన ప్రబంధం పారిజాతాపహరణమనవచ్చు. అనేక సందర్భాలలో దీనిలోని ప్రత్యేకతలను వివరించాడు. సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన సరసమైన ప్రతుల్లో దీనికి సంపాదకులుగా ఉండి చక్కని పీఠికనూ రాశాడు. వీటన్నిటినీ మించి దీనికి 'భావప్రకాశిక' అన్న వ్యాఖ్యానాన్ని సమదర్శిని పత్రికలో నాడే రాసి ధారావాహికంగా ప్రచురించాడు కూడా. కొందరు విమర్శకులూ, వ్యాఖ్యాతలూ ఏవో సూత్రీకరణలు చేస్తూంటారనీ దానివల్ల పాఠకులందరూ అవి మనసులో ఉంచుకునే చదవటం ఆరంభించటం జరుగుతూంటుందని అంటూ దానివల్ల నష్టం ఉందన్నాడు. ఎలాగంటే 'ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు' అనటంవల్ల పఠితలు ఆ పలుకుల అందం చూడటానికే సిద్ధమై మిగిలిన చందాలను పట్టించుకోరని ధర్మారావు అంటాడు.

అలాటి పాఠకులకు ఇందులో పాదతాడన ఘట్టాన్ని చక్కగా వివరించాడు. సత్యభామ కోపం 'అనవిని వ్రేటువడ్డ' అన్న పద్యం ద్వారా వెల్లడించిన తీరూ, అదే చివరకు 'మదహస్తి హస్తగత పద్మిని'గా కావటం అంచెలంచెలుగా ఎలా పరిణామ దశలకు గురైందో వివరించాడు. కృష్ణుడు ఆ సమయంలో అనునయించటానికి పూనుకోవటం సత్య "చేవిరిదమ్మి వ్రేయుటకు నైయుంకించి జంకించ'' టం, ఆపైన ''వామపాదంబునన్ తొలగంద్రోచె''- అనటాన్ని విశదీకరిస్తూ సత్యాదేవి కేవలం భర్తమీద అలిగిన ఏ ఆడదైనా చేసే పని మాత్రమే చేసిందన్న భావం కలిగిస్తాడు. కాని కవి ఉద్దేశం ధూర్త

గోపాలుడు 'ద్రోయు' అన్న దాన్ని 'తాచి'గా మార్చాడనీ దీనివల్ల పాఠకులకు సత్యపై కోపం, కృష్ణుడిపై జాలీ ఎలా కలిగేలా సందర్భం కల్పించాడో ధర్మారావు చెప్పాడు. ఇదంతా కృష్ణుడికి పుట్టిన బుద్ధిఅని తేల్చాడు. దీనికి వాదం నిలవడానికి పెద్దన వరూధినీ ప్రవరుల ఘట్టాన్ని తెచ్చి నిలిపాడు. ఇలాటి చక్కని కవికున్న నిర్వహణా కౌశలాన్ని వ్యాఖ్యాతలు చూపటం మానేసి 'ముద్దుపలుకని' తేల్చేయటం అన్యాయమని ధర్మారావు చక్కని తార్కిక జ్ఞానంతో వివరించాడు.

ఇలాటి అన్యాయానికి గురైన మరో కవి పోతన్న సహజ పాండిత్యం కలవాడు. అంటూ కవిత్వం ఏదోలా ఉంటుందిలే - అన్న భావం పాఠకుల మనసుల్లో పూర్వవిమర్శకులు కల్పించటాన్ని ధర్మారావు ఈ వ్యాసంలో ఖండించాడు. ఇలాటి విమర్శక లక్షణాన్ని వీరు 'అభిప్రాయ గుళిక' లన్నారు. దీనివల్ల జరిగే నష్టాన్ని విమర్శకులు సరిగా అంచనా వెయ్యలేదు కానీ కవులకు మాత్రం ఎనలేని చెరుపు కలిగించిందన్నారు. వామనావతార ఘట్టంలో 'ఇంతితై' - అన్న దాన్లోని రూపచిత్రణను వివరించి 'రవిబింబం' - అన్నదాని ద్వారా నిలబెట్టిన విశ్వరూపాన్ని చెప్పి ఇంత అందంగా తులనాత్మకంగా చెప్పిన కవి పోతనేనని ధర్మారావు అంటాడు. అలాగే గజేంద్ర మోక్షఘట్టాన్ని మరింత విశదంగానూ, రుక్మిణీ కల్యాణ సందర్భంగా బ్రాహ్మణుని గూర్చి ఆమె ఊహాపోహల వైచిత్రిసీ చెప్తూ 'స్వగతం' రాయటంలో పోతన్న చూపిన నేర్పుకు జోహార్లర్పించాడు. భక్తిరసం కుమ్మరించాడు గనుక జనం నాలుకల మీద పోతన్న జీవిస్తున్నాడనటం సబబు కాదనీ, ఇంత రసవత్తరంగా అన్ని ఘట్టాలూ రాశాడు కనుకనే అది సాధ్యపడిందంటూ దీన్ని ఆంగ్లంలోకి అనువాదం చేస్తే 'పోతన్న కవిత్వ పటుత్వం' ఇతర్లకు కూడా బాగా తెలిసేదని ఆశించాడు. ఇంతటి గొప్ప కవిని మనవాళ్ళు చిన్నచూపు చూడటం- తెలియకుండా 'గుళికలు' చేసిన అన్యాయమేనని ఈ వ్యాసంలో వెల్లడించాడు.

'తాంబూలం' - అన్న పదం ఎలా వచ్చిందో కానీ దీని వినియోగం యావద్భారతంలోనూ ఉంది. మంచిచెడులకన్నిటా దీన్ని ఉపయోగిస్తారు. హరవిలాసంలో శ్రీనాథుడు సముద్ర మథనంలో అన్నీ అందరూ తీసుకోగా 'నాగవల్లీ పత్రాలను' మర్త్యులకిచ్చాడు విష్ణువని చమత్కరించాడు. ఏది ఏమైనా ఆయా చాటువుల నడ్డం పెట్టుకుని ధర్మారావు 'కవిత్వంలో తాంబూల' విషయాన్ని వివరించాడు. దీన్ని తయారుచేసే శాస్త్రోక్త విధానం చెప్పాడు. ఉపయోగించే సామాన్లనెంచుకోవాల్సిన లక్షణాలను బయటపెట్టాడు. ఇవి చెల్లుబడి అయ్యే అనేకానేక సందర్భాలనేకరువూ పెట్టాడు.

కావ్యాల్లో దీని ప్రసక్తిని గురించి చెప్తూ చేమకూర "వీటి రహిమెచ్చ వలయుబో వేయునోళ్ళ"- అన్న దాని ద్వారా అటు పెద్దన లాంటి వాళ్ళను కూడా ఈ కవి తలదన్నాడని నిరూపించాడు. తాంబూలాలూ, సరసులూ అవినా భావ సంబంధమున్నవాళ్ళు. పరస్పరాశ్రితులూనూ. దీన్ని చాటువుల నాధారంగా చేసుకొని వ్యంగ్య ఘట్టాలను మన కళ్ళ ముందు చిత్రించాడు. ఇక్కడే శబ్దాలను కాక శబ్దార్థాలనాధారంగా చేసుకొని వరూధిని - ప్రవరుల శృంగార ఘట్టంలో 'పొమ్మంచున్ ద్రోచె' - అన్న దానికి 'సోకె కనుంగొనుమంచు' వరూధిని చూపిన దాన్ని చాకచక్యంగా ముడిపెట్టి అర్థం చెప్పాడు.

ఇక్కడ కూడా ధర్మారావు చెప్తోంది తమాషాగా తాంబూలం విషయమైనా పెద్దన చేసిన వర్ణనలో చమత్కారాన్ని వివరిస్తూ వ్యాఖ్యాన లక్షణాన్ని నిర్దేశించాడు. ఇంత చెప్పిన వాడు 'తాంబూల' పదావిర్భావం కూడా చెప్పి ఉంటే బావుండేది. సాధారణంగా వారి దృష్టి ఇలానే సాగుతుంది. మరి ఇక్కడ ఎందుకు మానేశారో తెలీదు.

వీరేశలింగం తన అభాగ్యోపాఖ్యానంలో ప్రబంధాలలోని అష్టాదశ వర్ణనల జాడ్యాన్ని బాగా అపహాస్యం చేశారు. వీటిమీద వారికన్నా ధర్మారావుకు కసి - కోపం ఎక్కువని 'అంటురోగం' అన్న పదం వాడటం వల్లే తెలుస్తుంది. వీరేశలింగం అన్ని వర్ణనలనూ జాడ్యాలుగా చెప్తే ధర్మారావు 'కుకవినిందను' మాత్రం ఈ వ్యాసంలో తీసుకుని అంటురోగమెలాగైందో విశదీకరించాడు.

ప్రబంధ కాలంలో ప్రతిభ అడుగంటటానికి ఆరంభం సూచనా ప్రాయంగా మొదలైంది. ఒకడు చేసింది మరొకడు అంధానుకరణం సాగించడం. ప్రధానంగా ఈ కుకవినింద హద్దులు దాటినట్టు ఈ కాలంలోనే కనిపిస్తుంది. అంతకు పూర్వం చమత్కారాలతో చేస్తే 'నికమొదలంట కోసెదను-చెప్పున కొట్టెద కాలతన్నెదన్' - అన్న తిట్లకు దిగజారింది. ఆత్మస్తుతీ, పరనిందల కాలవాలం ఈ ఘట్టం. దీనికి ప్రధాన కారణం రాజుల దగ్గర మెప్పు పొందటం. అందుకు తానెంత గొప్పకవో చెప్పుకోవడం ఒక మార్గమైతే, ఇతర కవులు ఎంత నీచులో చెప్పడం కూడా మరోమార్గం. ఆశయం మాత్రం ఇతర్లను రాజు దగ్గరకు చేరనీయకుండా తానే ఆశ్రయం పొందాలన్న తపన. రాజులూ దీన్ని ఒకరకంగా పెంచారనవచ్చు.

ఈ సందర్భంలోనే యతిప్రాసల ప్రస్తావన వ్యంగ్యంగా ధర్మారావు తెచ్చాడు. వీటిని పరిహరించాలన్న ఆకాంక్షను ద్రావిడ ప్రాణాయామంగా రఘునాథ భూపాలుడు చెప్పాడన్న ''యతియు ప్రాసయు తప్పనియంత

మాత్రమునకే'' అన్న పద్యం ద్వారా చెప్పాడు. అక్కిరాజు ఉమాకాన్తం కూడా నేటి కాలపు కవిత్వంలో యతిప్రాసలు వద్దని చెప్పాడు. దీన్ని ధర్మారావు చూసే ఉంటాడు. అందుకే ఆ అభిప్రాయాన్ని సమర్థించాడు.

ఇక్కడ కూడా చేమకూర ప్రస్తావన తెచ్చి చాలా హుందాగా సరసంగా ''ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా'' - అంటూ అది తన బాధో - సమకాలీన రచయితలు చేస్తున్న తప్పును ఎత్తిపొడవటమో తెలియకుండా చెప్పి (వ్యంగ్యంగా) ఆ వర్ణనా అయిందనిపించుకొన్నాడని ధర్మారావు వివరించాడు. ఇదో అంటురోగంగా మారి 'వర్ణన వర్ణన కోసం'గా మారిపోయిన దానికి బాధను వ్యక్తం చేశాడు రచయిత.

ప్రపంచంలో అనేక వృత్తులున్నాయి. అన్నీ పొట్ట నింపుకుని జీవించడానికే. కాని కొందరు అలాటి వృత్తుల్లోవాళ్ళతో సరసాలాడ్తారు. నిజంగా చూస్తే పిల్లికి చెలగాటంలా దాన్ని మనం భావించవచ్చు. కానీ వాళ్ళు ఇలాటి వాటిని ప్రతిదినం ఎదుర్కోవటంలో దక్కామొక్కీలు తిని ఉంటారు. మొదట్లో ఈ సరసాలకు కోపం వచ్చి ఉన్నా క్రమంగా తమ వృత్తి నేర్పే ఓర్పే వాళ్ళను నవ్వుతూ జీవిస్తూ తమ మీదే హాస్యం పన్నుకుంటూ ఉండేలా చేస్తుంది. రాటుదేలిన తర్వాత ఆ సరసులకు ప్రతిజోదులుగా నిలబడే ధైర్యాన్నీ ఆ జీవితం గతుకులే నేర్పుతాయి. ''ఆ కాలంలోని సంఘమూ, దాని లక్షణమూ, ఎలాంటిదో ఊహించవలసిందేకదా'' (పేజి 55) అంటూ పూలబజారు సరసాలన్న వ్యాసాన్ని మొదలెట్టాడు. ముందే శృంగారం తప్ప మరోటి వెదికినా కనబడని ఒకానొక గతకాలపు సామాజిక విలువల మధ్యకు పాఠకుణ్ణి తీసి కెళ్ళాడు ధర్మారావు.

అక్కణ్ణించి కావ్యాల్లో పుష్పలావికావర్ణన తీసుకుని కవుల వర్ణనా సౌందర్యాలను కుమ్మరించాడు. ఈ కాలమూ ప్రబంధ కాలమే. శబ్దాలకుండే ద్వంద్వార్థాల నాధారంగా చేసుకుని సరసులాడే సరాగాలివి. పూలమ్మే స్త్రీలు కూడా దీనికి కళ్ళల్లో నిప్పులూరుతున్నా మొఖానికింత నవ్వు పూసుకుని 'శేరుకు సవాశేరు' లా సమాధానమిస్తూ బతుకులెళ్ళమార్చటం "స్త్రీలను దేవతల లాగా గౌరవిస్తామన్న సభ్య సంఘంలో - ఇంటి దానిని వంట బానిసగా చూస్తుండడం లేదా" (పేజి 60) - ఇదీ అలాటిదేనని అంటూ సమాజం ముక్కుగుద్ది నిజం బయటపెడ్తాడు.నాటి పాలకులను తెరలు చించి చూపిస్తాడు. ఇంతలోనూ చేమకూర "ప్రాయపు గాయకుల్ వెలనెపాలన నెగాదిగ జూడ'' -అన్న పద్యం ఎత్తుకుని అందులో ప్రతిపద చమత్కారాన్ని వివరించాడు. ఇందులో వచ్చే "ఏర్పులౌరా'' అన్న దాన్ని పండితులు కాదన్నారని అంటూ యామినీ

పూర్ణ తిలకా విలాసంలో చెళ్ళపిళ్ళ సరసకవి "పేర్పుంగెంపులు" అన్న ప్రయోగాన్ని తెచ్చి చూపాడు. 'ఏరటం' అన్న దాన్ని సాధించాడు. ఇందులోనూ శబ్దార్థాల సమన్వయం ద్వారా చేమకూర కవి ఎలా ఈ వర్ణనను చేశాడో రచయిత మనకు వివరిస్తాడు.

దేవులపల్లి కృష్ణశాస్త్రి కూడా 'పుష్పలావికలు' అన్న వ్యాసం రాశాడు. అయితే అందులో వారు అమ్మేవారు - కొనేవాళ్ళ జీవితాలను అలా చేసిన సంఘం మీద కొన్ని చురకలు అంటిస్తూ పోయాడు.

భావం వ్యక్తీకరించటానికి భాష. భావ వ్యక్తీకరణలో ఆంగికాభినయం కూడా సాయపడుతుంది. తన భావాన్ని ఆగకుండా వ్యక్తీకరించే సందర్భంలో భావ సూత్రం తెగినందువల్ల గానీ, అతనికే ఆ భావం స్పష్టంగా తెలీనప్పుడు గానీ, మాట తొట్రుపడటం - అంగికాభినయం నట్టుపడటం జరుగుతుంది. ఈ మధ్యలో విరామం ఇతర్లకు తెలీదు. అది ఆ వక్తకే తెలుస్తుంది. క్షణాల్లో పని ముగుస్తుంది. అయితే ఈలోపు అతడు ఒక పదాన్నో, ఒక వాక్యాన్నో, ఒక చేష్టనో చేస్తాడు ఇదే అతడికి అలవాటుగా మారుతుంది. అదే ఊతపదంగానూ ఊత చేష్టగానూ అతని పాలిటికి స్థిరమౌతుంది. ఇది అతడికి చాలా అవశ్యకమైనా ఎదుటివాళ్ళకు వ్యర్థమైందీ అనవసరమైందీనూ.

ఇలాటివి కవిత్వంలోనూ చూస్తాం. యతిప్రాసల బిగింపు కోసం, కిట్టింపు కోసం వీటి అవసరం అప్పుడప్పుడు కవులకు ఆవశ్యకమౌతుంది. పద్యం అర్థం తీస్తున్నప్పుడు నిజంగా ఆ పదం ఉండనవసరం లేదనే భావం కలుగుతుంది. తో, తోడ, మెయి,తొట్టు, లసత్, విలసత్, ప్రాంచత్, రాజత్, భ్రాజత్, వంటివి నన్నయనుండి అరంభించి దాదాపు అందరి కావ్యాల్లో ఇవి కనిపిస్తాయి. ధర్మారావు వీటిని తీసికొని "మనవారు ఆ వ్యర్థ పదాలకు ఏదో అర్థం చెప్పి సమర్థించడానికి యత్నిస్తారు" (పేజి 73) అని అంటూ దీనివల్ల వ్యాఖ్యాతలు తప్పు దారిపట్టి అవి రాయనని భీష్మించుకున్న కవుల్లో కూడా అలాటివే ఉన్నాయన్న భావంతో కొన్ని పదాలకు పొరపాటు అర్థాలు చెప్పారంటూ చేమకూర వ్యాఖ్యాతలను ఉదాహరించారు. 'రమా-హేలా - కలావాసమై' అన్నదాన్ని తప్పుగా వ్యాఖ్యానించారనీ దానివల్ల 'హేలా' అన్నది వ్యర్థపదమనిపించవచ్చనీ అన్నాడు. అయితే హేలా అంటే పార్వతి అన్న అర్థం తీసుకుంటే 'లక్ష్మి, పార్వతి, సరస్వతుల' కు ఉనికిపట్టు అన్న భావం కవిదంటూ ధర్మారావు వివరించాడు.

దీనికి వ్యాఖ్యాతలకన్నా 'అటువంటి అభిప్రాయాలకు దారి కల్పించిన మన మహాకవుల (రచనల) గురించి దుఃఖించడం న్యాయం.' - అని ధర్మారావు బాణం విమర్శకులనొదిలి కవులపై వదిలాడు. ఈ బైరాగి చిట్కాల వల్ల

కవిత్వధార సాగవచ్చేమో కానీ కొన్ని నిజాలు మాత్రం మరుగునపడే ప్రమాద ముందని భావి వ్యాఖ్యాతలను హెచ్చరించాడు.

'భోగకాంత నిర్ణయం' - అన్న వ్యాసంలో కవి, పండితులలో ఎవరు గొప్పని సామాన్యులు నిర్ణయిస్తారో వివరించాడు. ఆ సామాన్యులకు ప్రతినిధిగా 'భోగకాంత' ను ధర్మారావు స్వీకరించాడు. ప్రాచీన చాటువుల ఆధారంగా చెప్పే కథ దీనికాధారం. దండి, కాళిదాసుల వర్ణనల తారతమ్య పరిశీలన-శబ్దాల ద్వారా చమత్కారం సాధించగా దాన్ని ఆలంబనంగా చేసుకుని సాగిన రచన ఇది. దండి భోగకాంతను

'తూర్ణమానీయతాం చూర్ణం
పూర్ణచంద్ర నిభాననే'

అంటూ సున్నమడిగాడనీ,

కాళిదాసు

'పర్ణాని స్వర్ణవర్ణాని
కర్ణాంతాయతలోచనే'

అంటూ ఆమెనే ఆకులడిగాడనీ చాటువు. భోగకాంత ముందు కాళిదాసుకే ఆకులిచ్చిందట. అక్కడ ధర్మారావు వ్యాఖ్య అందాలు చిందింది. ఒకటి : దండి ఆమె పూర్తి మొఖం వర్ణించాడు. అందులో గొప్పలేదు. కాళిదాసు ఆమె మొఖం అనే అంగిలోని అంగం కన్నులను 'ఆకర్ణాంతాయతలోచనే' అనటంతో ఆమెకు వచ్చిన ప్రశంసకు ఆమె స్పృహ తప్పింది. అంత అందమైన కన్నులకు తగ్గ కర్ణాలు, వీటికి సరైన నాసిక, చక్కగా అమరిన పెదవులు ఇవన్నీ లోచనాల అంచనాతో మిగిలినవీ వర్ణించినట్లే భావం. ఇది ధర్మారావు భావించలేదు. కానీ 'కాలాభాసం' గా దండి చేసిన వర్ణన 'పూర్ణచంద్రనిభానన' అనీ, కాళిదాసుది కవిచూపు కనుక 'కర్ణాంతాయతలోచనాలు' కనిపించాయనీ అందువల్ల శాస్త్రజ్ఞుడు అందం విరిచి నిజం తెలుసుకొంటాడే కాని భావుకుడుగా అనుభవించలేడన్న భావం ఆమెకు కలిగి ముందాకులు కాళిదాసు కిచ్చిందని ధర్మారావు వివరణ. ఈ సందర్భంలో అనాలోచితంగా వీరు 'గ్రాంధిక రచన' సాగించారు. బహుశా వ్యంగ్యంగా ఉంటుందని రాశారో లేక విషయం - రీతిని సంతరించుకుంటుందన్న సూక్తి ప్రకారం వారికి తెలియకుండానే ఆ భాష వచ్చిందో తెలీదు (పేజి 84 రెండో పేరా).

పై వివరణకు తోడు ధర్మారావు దండి వాడిన శ్లోకపాదంలో మూడు (అణాలు) 'ణ'లు ఉన్నాయనీ కాళిదాసు శ్లోక భాగంలో నాలుగు (అణాలు) 'ణ' లు ఉన్నాయనీ ఆమె వెలయాలు కనుక డబ్బును చూసే కాళిదాసుకు

ముందిచ్చిదంటూ శబ్దాలనాధారంగా చేసుకుని చమత్కారం చూపాడు.

ఇందులో భోగకాంత నిర్ణయం అంటే ఎవరు భోగకాంత అని నిర్ణయించటం కాదు. ఆమె చేసిన నిర్ణయమని వ్యాసోద్దేశం.

కాలం మారుతోంది. సమాజంలో పెట్టుబడిదారీ దశ వచ్చింది. పారిశ్రామిక విప్లవంతెచ్చిన శాస్త్రవిజ్ఞానం ప్రజలను వాస్తవికతవైపు చూపుమరల్చేలా చేసింది. ఈ వాస్తవికతను కళలూ - సాహిత్యంలో కూడా వెతకటం కొత్త తరం చేస్తున్న పని - దీన్ని ఆధారంగా చేసుకుని పాత కొత్త తరాలకు తాత-మనుమలను ప్రతినిధులుగా భావించి ధర్మారావు సాహిత్యంపై చర్చ సాగించాడు.

తాతకు శబ్దాల మీద, పదజ్ఞానం మీద, గ్రంథ పరిచయం మీద అభిమానం. ఆ దృష్టితో చూస్తూ అప్పుడప్పుడే పైకొచ్చి బాగా ప్రచారమైన భావ కవిత్వాన్ని

"ఎవరో గోదావరిలో
ఎర్రసిరా కలిపినారు"

అంటూ ఎద్దేవా చేస్తాడు. ఇవి ధర్మారావు పూర్వాశ్రమ భావాలేననవచ్చు. సాంధ్యరాగాన్ని పెద్దన చేసిన 'రవిబింబపతన'వర్ణన పద్యం ద్వారా తాత తన వాదం చెప్తాడు.

మనుమడు వినీవినీ ఇంత అసందర్భం లేదంటాడు. ఖగోళ శాస్త్రం దాఖలాగా చూపుతాడు. సూర్యుడు సముద్రంలో పడతాడనటం దగ్గర్నుండి చివరి దాకా అవాస్తవం అంటాడు. ఇలాటి వాస్తవికతా దూరాలైన రచనలే మన ప్రబంధాలు కనుక అందులో మేలేర్చి చదవటం చాలా నేర్పుగా సాగించాల్సిన పరిశ్రమ అనేది చెప్పకుండానే చెప్పిన ధర్మారావు బోధన.

లోకోక్తులుండటం మంచి కవిత్వానికి సూచన. కవిలోకజ్ఞతకు దర్పణం. అయితే ప్రాచీన కవులంతా లోకోక్తుల కోసం సందర్భాలను సృష్టించి తీరని అపచారం చేశారన్నది ధర్మారావు నెపం. దీనికి అల్లసానివారి కథ తీసుకుని వివరించాడు. వాడిన లోకోక్తికి సందర్భాన్ని బట్టి అందులో అర్థాలు సరిపెట్టుకోవాలంటూ

"తండ్రీ నాకు ననుగ్రహింపగదె వైద్యంబంచు" - అన్న దాన్లో "గుండ్రాడాచిన పెండ్లి ఏమిటికి చిక్కున్ కష్టముష్టింపచా" అన్న దాన్ని విశదీకరించాడు. ఇలా కాకుండా చేమకూర వారి లోకోక్తులు సందర్భోచితంగా ఉంటాయంటూ

"శివుడిటు రమ్మటంచు దయ
చేసినచో తలకెక్కి"

అన్న పద్యంలో 'అందితే సిగా అందకపోతే కాళ్లు' అన్న సామెతనూ,చంద్రుడి బతుకు 'వేళకొలదుల్ గచ నీ నడకల్' అంటే సమయాన్ని బట్టి నడుస్తాడనీ అనటంలో పూర్తి సామెత, లోకోక్తుల భావం పద్యంనిండా పిండారబోసి నట్లుండటం వివరించారు. కళ కళ కోసంలా, లోకోక్తి లోకోక్తి కోసం వాడ కూడదన్న భావాన్ని ధర్మారావు ఈసడించుకోవటం గమనార్హం.

సాహిత్యంలో దాస్య సాహిత్యమన్నదెక్కడన్నా ఉందీ అంటే అది తెలుగు సాహిత్యమేనన్నది ధర్మారావు అభిప్రాయం. అదీ సంస్కృతానికి దాసి. భావాలు - వర్ణనలు - పోకడలు అన్నీ చూచివ్రాతలేనంటాడు. అయితే స్వతంత్రంగా ఏమీ చెయ్యలేదా తెలుగు కవులు అని అంటే "ఒకరు పిల్లి మొగ్గలు వేస్తే తరువాత వచ్చిన కవులు కోతిమొగ్గలు వేయటమే ఆ స్వాతం త్ర్యం" అంటాడు (పేజీ 100). అంతా 'గుడిగుడి కుంచం - గుండపురాయ' అంటాడు. వీటికి ఉదాహరణలుగా రామరాజభూషణుడి

"సతియూరు ద్యుతి చెందబూని"

అన్న పద్యం, ముక్కు పద్యంగా ప్రశస్తి వహించిన

"నానాసూన వితాన వాసనల నానందించు" పద్యాల్లో

వర్ణనలను చెప్పాడు.

ఇక చేమకూరలో వర్ణనలో స్వాతంత్ర్యం గొప్పతనం ఉందంటూ కోట బురుజులు - అగడ్త నీళ్ళలో ప్రతిఫలించటం ఆధారంగా గుసగుసలు పోవ టాన్ని ఊహించాడనీ, కోటలకు పోటీ భూమిలోని ఆదిశేషుడూ - అగడ్తలోని నీటికి ప్రతిద్వంది ఆకాశగంగా కనుక ప్రత్యర్థులను వేపుకు తిందామన్న రహస్యాలోచన అంటాడు. అగడ్త నీరు ఆదిశేషుణ్ణి కలత పెడ్తే, కోటకొమ్ములు ఆకాశగంగను వేధిస్తాయి. అలా అగడ్తా, కోటకొమ్ములూ సంతోషపడవచ్చు. దీనికే ఆ కుట్ర. ఇంత భావాన్ని విజయవిలాసకర్త ఇమిడ్చి స్వతంత్ర వర్ణన చేశాడని ధర్మారావు ప్రస్తుతిస్తాడు

ఇలా దాస్యాన్ని వదిలించుకున్న కవి చేమకూర కవేనని వారి వాదం. కవుల్లో స్వతంత్ర భావం లేదన్న బాధను 'పూలబజారు సరసాలు' (పేజీ 60 - 61) లో కూడా వ్యక్తపరుస్తాడు.

నడమంత్రపు సిరి వచ్చినా నడ్డిమీద కురుపు లేచినా వాళ్ళను పట్ట లేరన్నదో సామెత. ధర్మారావు ఇందులో నడమంత్రపు సిరి నాధారంగా చేసు కుని పూర్వ కవులు ప్రబంధాలలో స్త్రీ యవ్వనాన్ని ఎలా వర్ణించారో చెప్పాడు. అందరూ స్త్రీ వర్ణనకే దీన్ని ఉపయోగిస్తే చేమకూర వెంకటకవి "అతివ కుచంబులున్ మెరుగుటారును" అన్న పద్యంలో స్త్రీ వర్ణన చేస్తూనే

''క్షితినటుగాదె ఒక్కొకరికిన్
నడుమంత్రపు కల్మి గల్గినన్''

అని అంటూ పద్యసందర్భంలోని స్తనాలు, నూగారూ, వేణులను స్ఫురింపచేస్తూ లోకంలో మధ్యలో డబ్బువస్తే కళ్ళు కనిపించవని అన్నాడు. అంటే కొత్తగా కవనం అబ్బినవాళ్ళ తుళ్ళింతలను తూలనాడటం. వాళ్ళ సుకవులను నిందించటాన్ని చాలా సున్నితంగా విమర్శించటం. కుకవినింద అన్న పేరు పెట్టకుండానే సందర్భం వచ్చినప్పుడల్లా తనకు ఇతర్లు పెట్టిన బాధను బయటపెట్టుకున్న చేమకూర సభ్యతను ధర్మారావు ప్రశంసించాడు.

సంస్కృత సాహిత్యం కానీ - తెలుగు సాహిత్యం కానీ చేతనాచేతనాల చేత చాకిరీ చేయించుకోవటం చూడగలం. తిర్యక్కులు సరేసరి. తెలుగు కవులు శ్రీనాథుడు, సూరన తదితర కవులందరూ ఈ పిట్టలను రాయబారులుగా వాడారు, వ్యాఖ్యాతలుగా చేశారు, నీతిశాస్త్రోపన్యాసకులుగా తీర్చిదిద్దారు. కానీ పక్షులుగా మాత్రం చూడకపోవటం, వాటి స్వభావాన్ని సరిగా ఉపయోగించుకో లేదని ధర్మారావు 'కవులకు పిట్టలసాయం' అన్న వ్యాసంలో నిరూపించాడు. పిట్టల పాత్రలు వచ్చిన సందర్భంలో అవి పక్షులన్న భావం అపీ మర్చిపోతాయి, కవీ మర్చిపోతాడు. చివరకు తద్వారా కవులు ధన్యులయ్యారు కానీ సారస్వతాన్ని ధ్వంసం చేశారు. పాఠకులకు కవి రచనలమీద అపనమ్మకం బయల్దేరింది. అయితే పక్షులను స్వభావసిద్ధ ప్రవర్తనల ద్వారా కావ్యంలో వాడుకున్న కవులు లేరా అంటే ధర్మారావు మళ్ళీ చేమకూరనే చూపించాడు. విజయ విలాసంలో సుభద్ర శుశ్రూష చేసే ఘట్టంలోని -

"చెలియ నిను రాజకీరంబు చెట్టబట్టె
కలికి నిను రాజహంసంబు కాలుత్రొక్కె
మంచి శకునంబులివిగో నామాట చూడు
కన్నె యీలోన పెండ్లి కాగలదు నీకు"

అన్న పద్యాన్నీ-చమత్కారాన్నీ చూపి శాబాసనిపిస్తాడు. అలాగే మరికొంత సమయం తర్వాతి ఘట్టంలో అర్జునుడు సుభద్రమీద అఘాయిత్యం చేస్తాడేమో నన్న భయం పాఠకులకూ సుభద్రకూ కలిగే దశలో 'నెమళ్ళ చప్పుళ్ళు' చూపి చెలికత్తెలొచ్చారని దిగ్గున లేచి పారిపోతుంది సుభద్ర.

ఈ దృశ్యాల్లో పక్షులచేత ఉపన్యాసాలూ, ఉపదేశాలూ చేయించకుండానే చేమకూర వాటి సాయంతో క్లిష్ట ఘట్టాలను దాటాడంటూ, అదే గొప్ప కవి లక్షణమంటాడు.

'అల్లసాని వాని అల్లిక గజిబిజి' అన్న భావం ధర్మారావుకున్నట్టు బోధ పడుతుంది. ఏ వ్యాసంలో ఏ సందర్భంలో చూసినా అనౌచిత్యానికీ, అస్పష్ట వర్ణనకూ, అందీ అందని భావాల పులుముడుకూ అల్లసానినే ఉదాహరణగా చెప్పడం గమనించవచ్చు. అలాగే 'ఆంధ్ర కవితాపితామహ బిరుదము' అన్న వ్యాసంలో బిరుదాలు అచిచ్చే ధరాధిపతులూ, అందుకొనే కవుల బండారం చాలా కసిగా వెల్లడించాడు రచయిత. ఇవన్నీ పరస్పర స్తుతికీర్తనలని తీసి పారేశాడు. పెద్దనగారికీ బిరుదు పొందటానికున్న అర్హత లేవీ దీన్ని ధ్రువీకరించ వన్నాడు. అంటే కేవలం 'ఈ బిరుదు కవితా గుణం వల్ల కలిగినది కాదనీ వయస్సు వల్ల కలిగినదే అని నిశ్చయించడం సమంజసము' - అని తీర్పు చెప్పాడు. 'ఆంధ్రకవితా' కాదనీ 'ఆంధ్రకవి' అన్నా పెద్దనగారికీ బిరుదు నప్పదనీ వాదించాడు.

అయితే కొత్త ఉద్యమాలకు బాగా ఊపునిచ్చిన వాళ్ళను ఇలా పిలవటం చూస్తున్నాం. నాటక పితామహ ధర్మవరం, ఆంధ్రపితామహ మాడపాటి వంటివి దీన్నే నిరూపిస్తాయి.

కావ్య ప్రకాశిక వాక్యంలోలాగ "అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజా పతిః'' - అన్నట్టు ప్రబంధ కవితాపితామహుడు- ఆ ప్రక్రియను ఆ కాలంలో పరాంకోటికి తెచ్చినవాడని సమర్థించుకుంటే ఆంధ్రకవితా పితామహ అని సమర్థించవచ్చు. ఏమైనా వయసుని బట్టే రాయలు పెద్దనకీ బిరుదిచ్చి ఉంటా డన్న ధర్మారావు భావం సమంజసమనిపిస్తుంది.

పెళ్ళికి మనసు ముఖ్యమా కాదా? అన్నదీ, ప్రేమకు ఈ తతంగంలో ఉన్న స్థానం ఏమిటన్నదీ, బహుకాలంగా చర్చల్లో ఉంది. ఈ విషయం మీద ధర్మారావు తన పత్రికల్లో చర్చ బాగా లేవదీశాడు. అది పట్టుకునే ప్రబంధాల కాలంలోనూ అభ్యుదయ కామినులున్నారని చూపటానికీ యత్నం చేశాడు. తార, వరూధిని వీరి వాంఛలలోని వ్యత్యాసాల వ్యాసంలో దీన్ని చూస్తాం. ధర్మారావుకు తారాశశాంక విజయం మీద చాలా అభిమానమున్న విషయం వారి రాలూ రప్పలులో 'ప్రబంధాలతో పరిచయం' అన్న శీర్షిక కింది రచన చూస్తే తెలుస్తుంది. (పేజీ 82). గిడుగు వారి ప్రోద్బలంతో వీరు చదివిన గ్రంథాల్లో తారాశశాంక విజయం ఒకటి. దీన్ని గురించి గిడుగువారు ధర్మా రావుకో చక్కని ఉపన్యాసం ఇచ్చి ఆ పుస్తకం మీద అభిమానం మరింత పెంచారు.

స్త్రీలు, పురుషుల్లో అందం చూసి మోహిస్తారా; మనసూ గుణం చూసి ప్రేమిస్తారా అన్నది సమస్య. తార "మది మక్కువ ఎవ్వనియందో కంటి

కింపగునతడెవ్వడో'' అతడే ప్రియుడు కావాలని చెప్తుంది. వరూధిని ప్రవరుడిలో ''ప్రాయము, సోయగము, వశ్యత, రతులనేకట తీర్చు గుణాలనే'' చూసింది. 'తనూ విభవ మెక్కడ' అంటూ అందాన్నే వలచింది.

వీటిని ఆధారంగా చేసుకుని ''తార కామంలో కొంత సున్నితత్వం కొంత వలపు వుంది. వరూధిని వాంఛలో కేవల శరీర సౌఖ్యం ప్రధానం'' - అని విడమర్చి చెప్పాడు ధర్మారావు. ప్రియుడు మానసికంగాకూడా ఉన్నతుడుగా ఉండాలని భావించిన తార, శారీరక సౌఖ్యం వాంఛించిన వరూధినికన్నా ఎన్నో రెట్లు ప్రశంసనీయమైందని అంటూ సమయం వచ్చిందని అల్లసాని రచనా, పాత్రల మానసిక స్థితిగతుల పైనా ఓ విసురు విసిరాడు. అయినా మన పాఠకులు ఇలాటి విషయాలవైపు తమ దృష్టిని ప్రసరించకుండా వరూధిననే మెచ్చుకోవటం అంటే అది పాఠకుల తప్పా ? కవి చేసిందా ? లేక విమర్శకుల గుళికా సంబంధి విషయమా ? ఆలోచించమని విడిచేశారు పాఠకులకు.

పెద్దన, తిమ్మన, రామరాజభూషణుల కావ్యాల్లో నాయికల ఏడుపును వ్యాఖ్యాతలు గుళికా రూపంలో —

— అల్లసానివాడు అలా అలా ఏడ్చాడు
— ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా ఏడ్చాడు
— భట్టుమూర్తి బావురుమని ఏడ్చాడని

సూత్రీకరించి తేల్చేశారు. వీటిలోని సామంజస్యాలను ధర్మారావు 'మూడేడుపుల ముచ్చట్ల'లో చక్కగా చర్చించాడు.

పెద్దన రాసిన 'పాటునకింతులోర్తురె' - అన్న పద్యంలోని 'విచ్చు' అనగానే పూలపదం కోసం పాఠకుడూహిస్తూంటాడనీ, కానీ కవి 'గబ్బిచనుమిట్ట' లంటూ కాఠిన్యం మీదపడి అవకతవక రూపకం చేసి నాశనం చేశాడని ధర్మారావు వివరించాడు.

తిమ్మన 'ఈసునబుట్టి డెందమున' అనే పద్యంలో 'బాలపల్లవ గ్రాస కషాయకంఠి' అంటూ ''మానవ స్వభావ సహజమైన దుఃఖ ప్రకటనలో కంఠ స్వరాలు ఎలాగుంటాయో బాగా గ్రహించాడని'' ప్రశంసిస్తాడు. ఇందులో 'కషాయ' అన్న దానికి 'వగరు' అనే అర్థం చెప్పుకుని గొంతు పట్టుకోవటం వల్ల వచ్చే ధ్వని అనాలనీ, దీనిమీద పద్యంలో 'గద్గదికా నిస్వనము' అని చెప్పాడనీ కనుక పెద్దనకన్నా తిమ్మన-సత్య కంఠస్వరం వర్ణించడంలో వాస్తవికత్వం, ఔచిత్యం బాగా పోషించాడనీ అన్నాడు.

ఇక భట్టుమూర్తి సంగీతజ్ఞుడు. ఏడుపుకు రాగం కాంభోజమని తెలిసినవాడు. కనుకనే గిరిక శోక, విషాదాలను 'ఆ జాబిల్లి వెలుంగు' అన్న

పద్యంలో 'కాంభోజీ మేళవిపంచికా' అని అన్నాడని సమర్థించాడు ధర్మారావు. కానీ, 'రాజీవానన' అంటూనే, 'రాకానిశారాజశ్రీసఖమైన మోము' అని కూడా వర్ణించడమంటే స్వవచోవ్యాఘాతమో ? మరుపో ? తెలీలేదనీ; ఏమైనా ఇది ఆయన చూపు వాస్తవికతకు దూరం అని మాత్రం అనవచ్చనే అభిప్రాయాన్ని వెల్లడించాడు.ఇది వ్యాఖ్యాతలకే కొరుకుడుపడని సమస్యఅని చివరకుతేల్చేశాడు.

మొత్తానికి ఈ ముగ్గురు కవుల్లో తిమ్మన చూపిన నేర్పు - పెద్దన, భట్టు మూర్తులకు లేదన్నాడు. చివరకు విమర్శకులపై కోపం పట్టలేక 'వాడూ బావురుమన్నాడని' విరుచుకుపడ్డాడు. వారికున్న పెద్దనమీది చిన్నచూపు ప్రదర్శించటానికి మళ్ళీ ఇందులో అదను దొరికింది ధర్మారావుకు.

చివరి వ్యాసం 'తంజావూరిలో తెలుగు సాహిత్యం'. ఒక యుగంలో కాగడా పట్టిన కవీశుడు ఒకడుంటాడనీ మిగిలినవారు నీడలుగా ఉండి మాసిపోతారనీ అంటాడు రచయిత. ఇది అన్ని యుగాలకు సహజమని భాషా, సాహిత్య చరిత్రలు చూస్తే తెలుస్తుంది. ''ఇది సజీవమైన భాషాసాహిత్యానికి ముఖ్యమైన లక్షణము'' అంటూ ధర్మారావు నిర్ధారించాడు.

అలాటి జ్యోతిర్మూర్తి తంజావూరు, మధురల్లో ఆంధ్ర పతాకం ఎగిరిన రోజుల్లో చేమకూర అని అంటాడు. వారి 'ప్రతిపద్యమునందు' అనన్న రాజుగారి పద్యాన్ని చూపి "తా, రసపుష్టిమై ప్రతిపదంబున జాతియు, వార్తయున్, చమత్కారము, నర్థగౌరవము" - అన్న పద్య లక్షణాల కోసం కవి పడ్డ తాపత్రయం బయటపెట్టి వెంకటకవి యుగకర్త అన్న భావం రచయిత మనకు కలిగిస్తాడు. చివరకు ధర్మారావుకు ప్రతిజోడు వేదంవారి ''చక్కెర మడిలో అమృతం పారించి పెంచినదిగాని యీ చేమకూర, మట్టిలో నీరు పారించి పెంచినదికాదు" అన్న చమత్కార సూక్తిని కూడా తెచ్చిచూపి తనకు చేమకూర వెంకటకవి కవితమీదున్న గౌరవ ప్రతిపత్తులను వెల్లడిస్తాడు.

ఈ వ్యాసాలన్నిటిలో అల్లసాని పెద్దన్నకన్నా చేమకూర వెంకన్న ఉత్తమ కవి అని నిరూపించటానికి ధర్మారావు కృషి చేశాడు. కృతకృత్యుడయ్యాడు. వీరి దృష్టిలో 'విజయవిలాసం' తర్వాత చక్కని ప్రబంధం 'పారిజాతాపహరణం' అన్న విషయం తేల్చి చెప్పాడు. విజయవిలాస వ్యాఖ్యానానికి తెలుగునాడంతా తిరిగి ఉపన్యాసాలూ, చర్చలూ సాగించి చేసిన కృషిలో ఇది ఒకపాలని తెలుస్తుంది. పాఠకులకు తాను రాసి ప్రకటించనున్న విజయవిలాస హృదయోల్లాస వ్యాఖ్యను ఈ రూపంలో రుచి చూపించాడేమోననిపిస్తుంది.భారతిపత్రికద్వారా శబ్దాల సాధుత్వాసాధుత్వనిర్ణయాలూ,పాఠ నిర్ణ

యాల ప్రసక్తి పండితులకోసమైతే, ఈ మొర్మొరాలలో తెలిపిన విషయాలు సాహిత్యంపై కేవలం అభిమానమున్న సాధారణ ప్రజలకోసం కావచ్చు.

కావ్యాలనూ, ప్రబంధాలనూ వ్యాఖ్యాతలు సూక్ష్మంలో మోక్షం లాగా సూత్రీకరణలు చేసి తమ అభిప్రాయాలను గుళికల రూపంలో పాఠకుల గొంతుల్లో వారికి తెలీకుండానే పడేయటం వల్ల కవులకు చాలా నష్టం కలిగిందన్న ఆవేదన ధర్మారావు ప్రతి వ్యాసంలోనూ వ్యక్తపరిచాడు. పాఠకులకు విమర్శలూ, వ్యాఖ్యానాలూ, కళ్ళకు గంతలుగా ఉండకూడదన్నది వీరి భావం. కవి భావనను అందించే ఊతకర్రగా ఉండాలంటాడు. మొత్తానికి ప్రబంధాల యుగంలో రచనలన్నీ అతిశయోక్తులూ వాస్తవికతా దూరాలైన వర్ణనలూ మొదలైన వాటితో సంస్కృతానికి దాస్యం చేశాయే తప్ప తెలుగు తనాన్ని ఎందులోనూ పుణికి పుచ్చుకున్న పాపాన పోలేదన్నది వీరి గట్టి అభిప్రాయం. దీనికి ఒకటి రెండు మినహాయింపులుండవచ్చు.

ధర్మారావు వైశారద్యం అంతా చేమకూర వెంకటకవి ప్రతి పద్య చమత్కృతి విశ్లేషించడంలో సార్థకమైంది కాబట్టి, ఈ వ్యాసాల్లో పదిహేనింట ఎనిమిది వ్యాసాల్లో ఆ ప్రసక్తి తప్పనిసరైంది.

తన అభిప్రాయాలను అవకాశం వచ్చినప్పుడల్లా అందిన ప్రతి ప్రక్రియలోనూ వెల్లడించే స్వభావం ధర్మారావుది. కనుకనే తేలికపాటి రచనల్లాగుండే ఈ మొర్మొరాలలో చక్కని భాషతోనూ, పాఠకులను తనవెంట తీసికెళ్ళే శైలితోనూ, ఆస్థ కలిగించే శీర్షికల్తోనూ సాహిత్యం చిరుతిండి పరితలకందించాడు. వారన్నట్టు "ఎప్పుడు చాలుననిపిస్తే, అప్పుడే మానివేయవచ్చు" అనే పద్ధతిలో సాగిన ఈ వ్యాసాలు ధర్మారావు వచన రచనకు మెరుగులు దిద్దాయని నిర్దిష్టంగా చెప్పవచ్చు.

## ఆలిండియా అడుక్కుతినేవాళ్ల మహాసభ

సమాజం ముఖంమీద పుట్టిన వికృతాకారపు గడ్డ -'యాచన'. దీనికి సంబంధించిన కణాలను సమూలంగా నాశనం చెయ్యాలే తప్ప పైపై శస్త్ర చికిత్సలెన్ని చేసినా లాభం లేదు. పెరుగుతూనే ఉంటుంది. ఈ 'అడుక్కోవడం' వెనకున్న తాత్త్వికతను అర్థం చేసుకోంది దీన్ని గురించి గుండె బాదుకోవటం నిరర్థకం.

సమాజంలో ఒకప్పుడు అన్నీ అందరివీ, అందరికోసం ప్రతివ్యక్తి అన్న భావం ఉండేది. అందరూ శ్రమించటం శ్రమోత్పత్తులందరూ అనుభవించటం జరుగుతూండేది. ఆ దశనుండి సమాజం ముందుకుపోయి వ్యవసాయ నాగరికతలో ప్రవేశించింది. అప్పుడు వర్గాలు ఆవిర్భవించాయి. వర్గాలు తలెత్తడంతో విరుద్ధ స్వభావాలున్న వర్గాల మధ్య తగాదాలు పొటమరించాయి. ఉత్పత్తుల పంపిణీలో హెచ్చుతగ్గులు ఆరంభం అయ్యాయి. దాంతో దోపిడీ మొదలైంది. ఉత్పత్తుల దోపిడీ, ఉత్పత్తి శక్తుల దోపిడీ. ఇందులో, దోపిడీ చేసే వర్గం ఉత్పత్తి కార్యక్రమాల్లో పాలు పంచుకోదు. దోపిడీకి గురయ్యే వర్గం ఉత్పత్తుల పంపిణీ ఆధిపత్యాన్ని కలిగి ఉండదు. ఈ రెండు వర్గాలూ సమాజంలో మారే ప్రతి దశలోనూ వేర్వేరు రూపాల్లో వేర్వేరు పేర్లతో ఉంటాయి. అంటే బానిస సమాజంలో బానిసలూ - యజమానులూ ఉంటే పెట్టుబడిదారీ సమాజంలో పెట్టుబడిదారులూ - శ్రామికవర్గంగా ఉంటాయి.

'అడుక్కోవడం' -'అడుక్కునేవాళ్ళ'- అన్నవి సాధారణంగా పేదరికం వల్ల వచ్చినవని అనుకుంటారు. పేదరికం పెచ్చరిల్లటానికి కారణాలను వెతుక్కుంటూ పోతే ఈ వర్గాలూ, దోపిడీలూ, వర్గ వైరుధ్యాలూ కనిపిస్తాయి. ఉత్పత్తి సంబంధాల చరిత్రను సరిగా అధ్యయనం చెయ్యాల్సిన అవసరం కనిపిస్తుంది. పేదలకు ధనికులకు మధ్య వైరుధ్యమనీ, అది పూడిన నాడు పేదరికం, దానివల్ల వచ్చే 'అడుక్కోవడం' ఉండదన్న దుర్భ్రమ కొందరిలో ఉంది. ఇది పూర్తిగా అబద్ధం. ఇది పేదరికం - ధనికత్వం మధ్యనుండే సమస్య కాదు. ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తులు, ఉత్పత్తి సాధనాల మధ్య ఉండే సంబంధాల సమస్యగా పరిశీలించాలి.

'ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ' అన్న గ్రంథం (1961) అనేక వ్యాసాల సంపుటం. కాగడా (1940 - 1942), జనవాణి (1949 - 1953) వారపత్రికల్లో ధర్మారావు రాసిన వ్యాసాలివి. అడగజాలనివాడనీ, దుష్టబుద్ధి అనీ మారుపేర్లతో ఆనాడు ప్రకటించాడు. ధర్మారావు చూపు సంఘంలో ఎక్కడ ఎలాటి చెడుగున్నా దానిమీద ప్రసరిస్తుంటుంది. దాన్ని సవిమర్శకంగా చూడటం, తానంతవరకూ సంతరించుకున్న విజ్ఞానం వెలుగులో దాని పూర్వాపరాలను సమీక్షించటం ప్రజలకు దాన్ని తెలియపర్చటం లక్ష్యంగా పెట్టుకున్నాడు.

ధర్మారావు ఒక ప్రజాస్వామ్యవాదిగా ఆలోచించి ''అందరూ సమానంగా ఉండవల్సిన మానవ సమాజంలో ముష్టి ఎత్తుకోవలసిన గతి ఎందుకు వచ్చింది?"90 అని ప్రశ్నించుకున్నాడు. "భారత భూమి సుందరాకారం మీద

కళంకంలాగా ఉన్న ఈ దుర్గతిని తొలగించాలన్న సదభిప్రాయం" 91 ప్రజలకు కలిగించాలని ఈ రచన చేశాడు.

వ్యాసాలకొక చక్కని నవల రూపం ఇచ్చాడు. అదీ మెత్తగా సమాజాన్ని చీవాట్లుపెట్టే వ్యంగ్యాన్ని పొదిగి రాశాడు. 'అడుక్కుతినేవాళ్ళ మహాసభ' అనటంలోనే దేశంలో జరిగే సభలన్నీ ఒకరకంగా ఓట్లు ముష్టెత్తుకోడానికో నోట్లు ముష్టెత్తుకోడానికో జరిగేవేననీ అసలు సమస్యలను పక్కదారి పట్టించి పబ్బం గడుపుకెళ్తుండేవేననీ చెప్పక చెప్పాడు.

ఇందులో 14 వ్యాసాలున్నాయి. అన్ని వ్యాసాల్లోనూ అంతర్గతంగా రచయిత ముష్టివాళ్ళ పక్షాన ఉండి సమస్యను పరిశీలించాడు. మొదటి నుండీ దానాలూ ధర్మాల పేరా, మతం పేరా దీన్ని పెంచి పోషించారన్నాడు. ప్రపంచంలో అన్ని చోట్లా దీని విశ్వరూపం ఉందని వివరించాడు

ఈ వ్యాసాలను భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేముందు కొన్నీ, వచ్చిన తర్వాత కొన్నీ రాశాడు. ముందరి వ్యాసాల్లో ఈ అడుక్కోవడం అన్నది మతం - పూజారులూ కలిసి పెంచిందన్న భావం వ్యక్తం చేశాడు. దీన్ని ముందే ప్రభుత్వం దృష్టికి తెస్తే స్వాతంత్ర్యానంతరం ఈ కళంకం తుదముట్టించి అందరూ సమానంగా, సమానావకాశాలతో జీవించగలరన్న ఆశాభావంతో 'కాగడా' లో రాశాడు. అందులోనే నిర్వహించిన పద్యభిక్షలో కూడా కొంత కాలం ఈ సమస్యను ప్రజల దృష్టికి తీసుకురావడానికి ప్రయత్నించాడు.

జనవాణి (వారపత్రిక) స్వాతంత్ర్యానంతరం సంచికల్లో పడ్డ మిగిలిన వ్యాసాల్లో ఈ సమస్యను ప్రభుత్వం పట్టించుకోకపోవడాన్నీ, ఇది మరింత పెరిగి పెరిగి భారతాన్నే కబళించేంత విశ్వరూపంతో నిలవడాన్నీ చూసి సమాజం మీద సవాలు విసిరాడు. దీన్ని 'ఆలిండియా అడుక్కు తినేవాళ్ళ మహాసభ' రూపంగా మార్చాడు. దీనికి ప్రభుత్వం, సమాజం రెండూ బాధ్యత వహించాలన్న అభిప్రాయం వెలిబుచ్చాడు. దీనికి ఓ ప్రబలమైన కారణం ఉంది. పెట్టుబడిదారీ - సోషలిస్టు దేశాలలోని అభివృద్ధి విశేషాలూ ధర్మారావుకు బాగా అందటం ఆరంభించాయి. రెండు వ్యవస్థలనూ త్రైపారు వేసుకున్నాడు. ''చీనా, రష్యా మొదలైన దేశాలను చూచివచ్చిన మన భారతీయ ప్రముఖులు చెప్పిన మాటలనుబట్టి చూస్తే ఆ దేశాలలో ముష్టివాడెక్కడా కనబడడని తేటపడుతుంది. మన దేశంలో గూడా ఇలా ఎందుకు కాకూడదన్న'' ఆవేదన కలిగింది. ''కొన్ని దేశాలలో ప్రభుత్వాలు వీళ్ళను గురించి శ్రద్ధ తీసుకుని, మచ్చుకైనా ముష్టివాడు తమ దేశంలో కనబడకుండా

ఏర్పాట్లు చేశారు'' - అంటూ ప్రభుత్వమే మన దేశంలో ఈ సమస్య ప్రబలటానికి కారణమని తీర్మానించాడు. దీనికి తోడు ధర్మారావు విన్న దేశాలు సోషలిస్టు దేశాలు కావడం. అక్కడ మతమన్నది వ్యక్తికి సంబంధించిందిగానీ ప్రభుత్వానికి సంబంధించింది కాదు. ఆ ప్రభుత్వాలు మతరహితం, వర్గరహితంగా ఉన్నాయి. కనుకనే ఈ సమస్య అక్కడ లేదన్న నిర్ధారణకు ధర్మారావు వచ్చాడు. దాంతో మతం పేరుతో దానాలూ, ధర్మాలుగా చెలామణి కింద ఉండే యాచన నాశనం కావాలనీ, దానికి తోడు ప్రభుత్వం కూడా దీన్ని సామాజిక సమస్యగా పరిగణించి శ్రద్ధ తీసుకున్నప్పుడే దేశం మొత్తం మీద ఈ కళంకం తొలగిపోతుందనీ ఆశించాడు. కనుక ఈ సమస్యను మతపరంగా ఆలోచించే దశనుంచి సామాజిక సమస్యగా చూసే దశకు ధర్మారావు పెరిగాడు. అయితే దీన్ని సామాజికార్థిక దృష్టితో చూసే దశవరకూ వెళ్ళలేదు. అలా వెళ్ళి ఉంటే దీనికి కారణాలు మతమూ, బాధ్యతారహిత ప్రభుత్వమూ కాదనీ, ఆ ప్రభుత్వం అనుసరించే పెట్టుబడిదారీ పంథా అనీ అది అమలుచేసే దోపిడీ విధానమనీ, దోపిడీ వర్గాలను పెంచి పోషించే తత్వమనీ బోధపడి ఉండేది. సహజంగానే సామాజిక ఆచారాలూ, విశ్వాసాలూ వంటి వానిని సామాజిక మానవ శాస్త్ర పరిధిలో అంతవరకూ చూసి విడమర్చిన ధర్మారావు దీన్ని ఆ వెలుగులోనే చూశాడు.

అడుక్కునే వాళ్ళందరికీ తినే యోగ్యత కూడా ఉండదనీ కనుక అడుక్కుతినేవాళ్ళనడం అంటే ఆ వర్గంలో ''ఆళ్ళే మనకిరోదులు - ఆళ్ళే మన నోట్లో మన్ను కొడుతుంటారు''92 అంటూ వేరే ఒక గుంపు ఉందంటూ రచయిత పాత్రల చేత చాలా చక్కగా చెప్పిస్తాడు. వాళ్ళెవరంటే అడుక్కోవడాన్ని ఆచారంగానూ, వృత్తిగానూ పెట్టుకుని దాన్నొక విద్యగా కళగా చేపట్టిన డాక్టర్లూ, లాయర్లూ, పూజార్లూ అంటాడు. ఈ వర్గంలో చేరని వాళ్ళకు 'అడుక్కోవడమే' అవుతుంది కానీ అవతలి వారు ఇస్తారన్న నమ్మకం లేనందువల్ల 'తినడం' అన్న ప్రసక్తి ఉండదని చాలా తార్కికంగా విశదీకరిస్తాడు.

అడగటానికి వెనక ఎంతో గాధ - బాధ ఉందని అంటూ భర్తృహరిని సాక్ష్యంగా తెచ్చి—

''యాచ్నా భంగభయేన గద్గదగళ, త్రుట్యత్, విలీనాక్షరం''93 - అంటూ తెరవెనక పడ్డ యమయాతనను చెప్తాడు.

ఇంతటి బాధకు గురైన వ్యక్తి స్వార్థం కోసం అడుక్కోడు. తన వెనకున్న గంపెడు సంసారం బతిక బట్టకట్టటానికి తన మానాన్ని, మానసాన్ని పౌరుషాన్ని విడిచి జోలెబడ్తాడు. దీన్నే వివరిస్తూ ధర్మారావు తాను 'చోరహృతార్థము' అన్న కవితా ఖండికలోని

''పొరిగొను నాకటన్ పౌరలు పుత్రుల బాష్ప నిరుద్ధ దృష్టులన్
బరపుచు నెత్తి ఊరడిల బల్కెడు సాధ్విని చూచిచూడన
ట్లరసి నిజార్తి విస్మరణ .........." (మబ్బుతెరలు పేజి 61)

పద్యాన్ని ఉదాహరించాడు. ఈ పద్యభావం చుట్టూనే 'అడిగేవాడి ఆలుబిడ్డలే' వారి ఆలనాపాలనే యజమానిని 'అడుక్కోమని' పంపిందని అంటాడు.

ఒక పెద్దమనిషి అడిగాడంటే ఎంతో యాతన ఆయాసం ఉందని గమనించాలనీ; అలాటప్పుడు 'రేపురా - మాపురా' అని తిప్పుకుని సకాలానికి సాయం చెయ్యని వాళ్ళే అడిగేవాళ్ళను ఖూనీకోరులుగా మారుస్తున్నారనీ అంటారు. సకాలానికి అందనప్పుడు "పిచ్చెత్తిపోతాడు. వెర్రి అయిపోతాడు. దిక్కూ మొక్కూ తోచదు. ఏమి చేయడమో ఎరగడు. ఏమిచేస్తాడో తెలియదు. ఒక మాను అయిపోతాడు. ఒక రాయి అయిపోతాడు. ఒక పాషాణం అయిపోతాడు అటు ఆత్మహత్య అయినా చేసుకొంటాడు;ఇటు అతి దారుణంగా ఏ ఖూనీనో, ఏ దొంగతనాన్నో చేస్తాడు. నిజం. అతనిలోని మనిషి చచ్చి పోయాడు' 94 అని సమర్థిస్తాడు. దీన్నే మరింత సూటిగా రేపురా మాపురా అనేవాళ్ళనూ లేమహో అనే వాళ్లని గురించి ''లేదన్న వాడిది గుండుదెబ్బ. రారున తెగడమో తేలడమో ఒకటి జరుగుతుంది. రేపురా మాపురా ది అది కాదు. కుళ్ళు చావు. రేపు మాపు దాతలంతా రూపుమాపు దాతలు. అడిగినవాడి రూపేకాదు యావద్దేశం రూపు మాపుతారు''95 అని విశదంగా చెప్పాడు.

ధర్మారావు ఇలాటి సందర్భాన్నే 'అవన్నీ నీకళ్ళేనా' అన్న నాటికలో కూడా ప్రస్తావించాడు. అందులో నాయకుడు కోదండరాయలు. కోదండం అంటే విల్లు. విల్లు ధర్మానికి ప్రతీక. కనుక ఇక్కడ ధర్మరాయలనే అర్థం. ఈ కోదండరాయలు గారే మళ్ళీ జనవాణిలో ప్రత్యక్షమవుతారు. అంటే ఒక రకంగా ఈ అడుక్కు తినేవాళ్ల వ్యాసాల్లో ధర్మారావు తమ జీవితంలోని కష్ట దశలు చూపించారనవచ్చు. ఇందులో ఉపయోగించిన పద్యాలుకూడా ధర్మారావు చుండిలో పనిచేస్తుండగా సమస్తమూ దొంగలపాలైన సందర్భంలో రాసినవే. ఈ గ్రంథంలో మహాసభకు అధ్యక్షుడు దమ్మన్నే. అడుక్కుతినే ముష్టివాళ్ళ యథార్థ కథలో "దమ్మడిది మంచి మనసు. మనలో పుట్టిఉంటే ధర్మన్న అని పిలిచేవారము''96 - అని రచయిత ఉండబట్టలేక చెప్పేశాడు.

ధర్మారావు ఈ వ్యాసాల్లో చెప్పదల్చుకుంది "అభిమానం కలవాడిచేత అడిగించడమే ఒక మహా దోషం సంఘానికి"97 అని సంఘధర్మం గంగలో కలిసింది. కనుకనే అది గుర్తుచేస్తూ ఓచ్చగాళ్లు ధర్మం చెయ్యండి బాబూ అని

అంటారని చమత్కరించాడు. పేరుకున్న సంపదను లేని వాళ్ళకు పంచడం అన్న ఆచారం అనేక దేశాల్లో ఉందని ఐస్‌లాండ్ ప్రజల ఆచారాన్నీ, భారత దేశంలో క్రీస్తు పూర్వం 646లో హుయన్‌త్సాంగ్ కథనం ద్వారా తెలిసిన మహామోక్ష దానాలను, హర్షుడి కథనూ వివరంగా తెలిపాడు. ఈ ధర్మం కాల క్రమేణా దానంగా మారి మతంలో భాగస్వామి అయిందనీ అప్పటినుండి దాతకూ-గ్రహీతకూ మధ్య పూజారులనే దళారీలు - గుటకాయస్వాహాగాళ్ళు. భూలోక బ్రహ్మలు వచ్చి మధ్యనే అపహరించటం ఆరంభమైందనీ అన్నాడు.[98]

ఈ సమస్యకు ఖచ్చితమైన కారణం కనుక్కోవటంలో నిజానికి చాలా దగ్గరగా ధర్మారావు వచ్చాడు. దేశంలో సంపదను పొందినవాళ్లు "ఆసొత్తంతా తాను చెమటూర్చి గడించిందే అనుకుంటాడు. నిజానికి వీరికి చెమటేలేదు. అసలు చెమట ఊర్చినవాడు ఒకపూట భోజనాలతో, ఉపోష్యాలతో జరుపు తున్నాడు .... ఇదంతా నాదేనని (సంపద పొందినవాళ్ళు) ఉబ్బుతుంటారు. ఇదంతా వట్టి దోపిడీ - ఇప్పటి శిక్షాస్మృతికి చిక్కని దోపిడి అని అనుకో కుండా ఉన్నారు" - అంటూ విడమర్చి బోధించాడు. కానీ వెంటనే మరోచోట తమ ధనాన్ని కొంత ఇతరులకు పంచటమన్న ధర్మం మర్చిపోవడం వల్ల ఈ సమస్య వచ్చిందనీ అంటాడు. అలాగే ఇంకోచోట డబ్బును సృష్టించింది ఐశ్వర్య వంతుడు కాడనీ "అలా చేసే ఆమంత్రం ఇచ్చినదిగూడా సంఘమే"[99] అనీ అంటూ ధనం ఒక సామాజిక శక్తి అనీ అది వ్యక్తుల చేతుల్లో బందీగా ఉండి వ్యక్తిగత ఆస్తిగా మారటమన్నదే ఈ పేదరికానికి - యాచనకు - దోపిడీకి మూలకారణమన్న మార్క్సిస్టు భావాన్ని మరో విధంగా చెప్పాడు. ఇవన్నీ చూస్తే ధర్మారావులో ఈ సమస్యకు మూలకారణాన్ని పసికట్టడంలో కొంత ఊగిసలాట కనపడుతూందని అనవచ్చు.

వీటన్నిటికీ తోడు ఈ గ్రంథంలో చివర కొన్ని ముష్టివాళ్ళ యథార్థ కథలు ప్రచురించాడు. ధర్మారావులో ఉన్న మరోగుణం తానొక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినా - ప్రచారం చేసినా ఆ లక్షణానికి లక్ష్యాలను రాస్తాడు. కొత్త పాళీ సందర్భంలో కూడా బండి జా పల్లకి, వ్రాతా - రోతా రాశాడు. ఇప్పుడు ఈ కథలూ రాశాడు. ఇలా చెయ్యనందువల్లే వ్యావహారిక భాషా ఉద్యమం సరిగా జనానికి పట్టించటంలో గిడుగువారూ, ఆ ఉద్యమవాదులూ విఫలమయ్యా రని ధర్మారావు బాధపడ్డాడు కూడా.

ఈ కథలన్నీ అడుక్కుతినేవాళ్ళ తెరమరుగు నిజ జీవితాలు. అనేక తరహాల వ్యక్తుల జీవితాల్లోకి ఎక్స్‌రే చూపులు. అయితే చెప్పదలచింది ఏమిటి? సమాజంలో వీళ్ళను బాగుచేస్తే సమాజమంతా బాగుపడుతుందనా ? దోపిడీ అంత

మవుతుందా ? కుష్టు, రోగిష్టులకు సత్రాలూ అవీ కట్టిస్తే సమస్య తీరుతుందా ? అసలు ఇలాటి వాళ్ళెవరు ? - వీటిని గురించి స్పష్టంగా ఆలోచించ లేక పోయాడు. దానికి కారణం లేకపోలేదు. సమాజంలో చెడును చూపెట్టటం, విమర్శించటం తమ రచనల్లో చేసే తత్వం బూర్జువా రచయితలకు సహజంగా ఉంటుంది. ప్రజాస్వామ్యభావాలకు ప్రభావితమైన ధర్మారావూ సమకాలిక రచయితలందరూ చేసిన పని ఇదే. సామాజిక సమస్యలను ఎత్తి చూపుతాడు. ప్రజాస్వామ్య హక్కులకోసం ప్రజల పోరాటాన్ని చూపగలడు. తపననూ వ్యక్తపరచగలడు.[100] ఇలాటి దాన్ని సవిమర్శక వాస్తవికత అనీ, అలా రాసే వాళ్ళను సవిమర్శక వాస్తవికతావాదులనీ అంటారు. వీళ్ళనే బూర్జువా వాస్తవికవాదులని కూడా అనచ్చు. సామాజిక దురన్యాయాలనూ, జనం జీవితాలనూ చూపటంలో వీళ్ళు మతపరమైన ఛాందసాలనూ, కుటుంబ సంప్రదాయాలనూ, న్యాయం - ధర్మం పద్ధతులనూ చెప్తూ ఇందులో ఇరుక్కున్నారు కనుకనే ఆ సమస్యలు అలా ఉన్నాయంటారు. మతం- దాని ప్రభావం సమాజంలోని కుళ్ళుకు మూల కారణమంటారు.[101] కనుక గురజాడ తన రచనల్లో ప్రస్తావించిన సామాజిక సమస్యలూ, కందుకూరి తన ప్రహసనాల ద్వారా మతాన్ని ఆలంబనంగా చేసుకుని వచ్చిన మూఢనమ్మకాలపై చేసిన నిరసనలూ, ఇప్పుడు ధర్మారావు ఈ రచనా; ఆ కోవకిందకూ, వీరందరూ సవిమర్శక వాస్తవికతావాదుల కిందకూ వస్తారని అంచనా వెయ్యాలి. ఈ ధోరణి 19 వ శతాబ్దం చివరి పాదంలో బాగా ప్రచారంలో ఉంది. పెట్టుబడిదారీ దశ వచ్చిన తర్వాత ఉన్న రచయితలను కూడా ఈ సవిమర్శక వాస్తవికత బాగా ఆకట్టుకుంది. దీని ప్రధాన లక్షణాలు సమాజం తెరలు చించటం, వైరుధ్యాలు బయట పెట్టటం చేస్తూ మానవుడిలో సామాజిక ప్రజాస్వామ్య భావాలు ప్రేరేపించటం వంటివి.[102] కొందరు సమాజానికి సన్నిహితంగా పనిచేసే రచయితలు ప్రజాపోరాటాలను కూడా చిత్రిస్తారు. ధర్మారావు ఈ తరహాకు చెందినవాడుగా చూడగలం. అంటే కేవలం సమస్యలను ప్రతిబింబించడమే కాదు వాటి నిర్మూలనకు ప్రజాపోరాటాలవసరమన్న చైతన్యం కలిగి ఉండటం కూడా. ఈ స్పృహ వీరికి ఉంది కనుకనే "ఇది సంఘ దోషం. ప్రజలూ, పాలకులూ బాధ్యులు. ఆ దోషాన్ని వీరు నిర్మూలించాలి. తర్వాత చూద్దామనవలసిన విషయం కాదు - అత్యవసరం"[103] - అని ప్రజలను దారిద్ర్యంపై పోరాటానికి సన్నద్ధులు కండని పిలుపు ఇచ్చాడు.

ఈ గ్రంథంలో వర్ణించిన లాంటి వర్గాలను 'లంపెన్ ప్రోలిటేరియట్' అంటారు. అంటే సమాజం మీద పడి బతుకుతున్న పరాన్న భుక్కులని

అర్థం. దీనికి కారణం సమాజం కావచ్చు. కానీ ధర్మం చేసినందువల్ల వీళ్ళు పోరు. సత్రాల్లో ఉంచినా అలవాటును మర్చిపోలేక పారిపోయి వస్తారు. ఇది ధర్మారావు సరిగా అంచనా వెయ్యలేదు. ఈ వర్గాన్ని సంఘటిత పర్చలేము. వీళ్ళని 'సంఘం నది మీద కట్టిన మురుగు తెట్టగా' వర్గాల ఆధారంగా సమాజాధ్యయనం చేసేవారు భావిస్తారు.

మొదట్లో చాలా మంది రచయితలు, ఇలాటి వర్గాలు పోతే సమాజం బాగుపడుతుందన్న ఆశతో గోర్కీ, కిషన్ చందర్ లాంటి వాళ్ళు కూడా- వీళ్ళ జీవితాలనే కథావస్తువులుగా స్వీకరించారు. మన తెలుగు దేశంలో ఇప్పటికీ వీరి జీవితాల ఆధారంగా రచనలు చేస్తున్న రావిశాస్త్రి, బీనాదేవిలాంటి వాళ్ళు లేక పోలేదు. దీనికి కారణం ఈ వర్గ స్వభావాన్ని, వర్గ ఆవిర్భావాన్ని వీళ్ళు సరిగా అర్థం చేసుకోలేవనాలి. పొరపాటు కారణాలను ఊహించి గురికి బెత్తెడు ఎడంగా పరిష్కార మార్గాలు సూచిస్తారు. ధర్మారావు కూడా అప్పటికి తనకందిన సాహిత్యాన్ని బట్టి ఈ సమస్యను అలాగే అర్థం చేసుకుంటూ 'గోర్కీని మా సోదరుడు' అని అంటారు. అయితే గోర్కీ క్రమంగా సవిమర్శక వాస్తవికతా పరిధి దాటి సామాజిక వాస్తవికతా ధోరణికి వచ్చాడు (అమ్మ నవల). ధర్మారావు ఆ సామాజిక వాస్తవికతా ధోరణిని తన సృజనాత్మక రచనల్లో ప్రతిబింబించే కాలానికి రచనా వ్యాసంగం మాని విశ్రాంతి దశకు చేరుకోవటం జరిగింది. అయితే వీరు చేపట్టిన ఉద్యమాలలో అది అభ్యుదయ రచయితల ఉద్యమం కానీ, శాంతి ఉద్యమం కానీ, ఈ ధోరణిని వెలిబుచ్చటం గమనార్హం. అంటే సామాజిక వాస్తవికతలోని అంశాలైన ప్రజా సేవా భావం, శ్రామిక పక్షపాతం, శ్రామిక పోరాటాలతో సన్నిహిత సంబంధాలు కలిగి ఉండటం, సామాజిక మానవతావాదం, చారిత్రక ఆశా భావం, రీతి వాద నిరసనం, ప్రధానంగా సామ్యవాద తాత్విక భావాల యెడ దృఢ విశ్వాసం[104] వంటి లక్షణాలలో చాలా వాటిని పొదివి పుచ్చుకున్నారు.

దాతలు ఎన్నిరకాలో ధర్మారావు చెప్పాడు. వారి ఈ దాన గుణం –

ఆదిన్ శ్రీసతి కొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపై గపోలతటిపై బాలిండ్లపై నూత్నమ
ర్యాదంజెందు కరంబు గ్రిందగుట మీదై నాకరంబుంట మేల్
గాదే రాజ్యముగిజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే.

(భాగవతం అష్టమస్కంధం 592 వ పద్యం)

అని అంతటి రాజ్యాలనే కాలదన్నేలా చేస్తే, యీలోకంలో పేరుప్రతిష్ఠలొస్తా యంటేనూ, పుణ్యంపేరు చెప్తేనూ చెయ్యరా మరి. స్వార్థం దీని వెనక ఎంతుందో తెలియదా. దీన్నే ధర్మారావు అసహ్యించుకున్నాడు.

సహజంగా ధర్మారావు రచయితా, కవీ కనుక ఈ వ్యాసాలు కానీ, యథార్థ కథలు గానీ చాలా స్వభావసిద్ధంగానూ కవితాత్మకంగానూ ఉన్నాయి. అతడు దమ్మన్న కావచ్చు, అంకమ్మ, యెంకడు, నారిగాడు, సుబ్బిగాడు ఎవరైనా కావచ్చు. వాళ్ళ కళ్ళు ''అవి కళ్ళేనా? తమ ముందు కనబడుతున్న ఈ విశాల ప్రపంచంలో ఎక్కడా, ఏదీ దారి కనబడలేదని నిరుత్సాహం పొంది వెనక ప్రక్కను ఏదయినా గతి కనబడుతుందేమో అని చూడడానికి తలలో సొరంగం తవ్వుకుంటూ పోతూ ఉన్నాయా అన్నట్టు కనబడతాయి.'' నారిగాడి డొక్క "తన శరీరాన్ని తానే కొరుక్కుతింటుంది. అలాగా కొరుక్కు తిని ఇప్పుడు వెన్నునంటుకుంది."105 అని వర్ణిస్తాడు. భారతంలో విదురుడి చివరి దశను వర్ణించే 'చర్మాస్థుల గదియ' అన్న భావ చిత్రణకిది ఎందులో తీసిపోతుంది.

ధర్మారావు అభిప్రాయంలో దానం అన్నది ''మనుష్యులకు వెళ్ళవలసిన రథాన్ని మతానికెప్పుడు తిప్పారో అప్పుడే దరిద్ర లక్షణాలు దేశానికి దాపురించాయన్న"106 భావం ఉంది. కనుకనే ఈ వ్యాసాలన్నీ ఆ దిశగానే నుళ్ళాయి ఏదిఏమైనా అతి సహజమైన భాష వాడారు. మెత్తగా సంఘాన్ని చీవాట్లు పెట్టేలా వ్యంగ్యం కలబోశారు. మనుష్యుల్లో అడుగంటిన మానవత్వం చిగురెత్తితే ''మానవ హృదయంలో ఉన్న నీచత్వానికి స్మారక చిహ్నాలుగానూ మనుషుల దుష్టత్వానికి సజీవంగానూ ఉన్న మాన్యుమెంటులు"107 అయిన ఈ అడుక్కు తినేవాళ్ళు ''ముష్టి ఎత్తడానికి యోగ్యతలేని వారు" అవుతారని ధర్మారావు ఆశాభావం వెలిబుచ్చుతాడు.

## అన్నా కెరినీనా

నిరక్షరాస్యతా నిర్మూలన అనేక సామాజిక రుగ్మతలను మాన్పేందుకు ఉపయోగపడుతుంది. జనంలో కొత్త భావాలు ప్రచారం కావటానికి సాధారణంగా నిరక్షరాస్యత ఆటంకం కలిగిస్తుంది వృద్ధుల్లో ఇది ఉన్నందువల్ల

కొత్త తరానికి వాళ్ళు ఆటంకాలుగా పరిణమిస్తారు. మూఢనమ్మకాలనూ, ఆచారాలనూ తరతరాలకి పంచిపెడ్తారు. కొత్త నెత్తురులో ఈ పాత క్రిములు దూరకుండా చెయ్యాలంటే అవిద్యమీద దండయాత్ర సాగించటం చాలా అవసరం. శాస్త్రీయ దృక్పథం ప్రజల్లో అలవడందే అంధ విశ్వాసాలు అంతరించవు. అందుకు అక్షరాస్యుల శాతం పెరగాలి. ఆ దిశలో కృషి చెయ్యటం చాలా అవసరం. ఏ దేశంలోనన్నా కొత్తగా అధికారానికొచ్చిన ప్రభుత్వం ముందుగా దీన్నే చేపట్టి తమ ప్రజలను సరైన దిశగా నడిపించుకోటానికి కృషిచేస్తుందన్న సత్యాన్ని సోవియట్ యూనియన్, చైనాలు నిరూపించాయి. తరతరాలుగా జనంలో నాటుకున్న అభిప్రాయాలు అభ్యుదయానికి అడ్డుగా పరిణమించినప్పుడు అందుకు కారణమైన చదువురానితనాన్ని రూపుమాపటానికి ముందు ధ్వజం ఎత్తాలి.

ధర్మారావు భారతదేశంలో అనేక అంశాలపైన ప్రజలకు సరైన అవగాహన లేదన్న నమ్మకం కలిగినవాడు. దీనికి సాక్ష్యంగా జనంలో ఉన్న అర్థ రహితమైన సామాజికాచారాలు - ఎంత గుదిబండలుగా ఉన్నా వదిలించుకోలేకపోవటాన్ని గమనించాడు. కొత్త సాహిత్యాన్ని కానీ, సామాజికాంశాలను కానీ కొత్త చూపుతోచూడాలన్న అభిప్రాయాన్ని తన రచనల్లో సూచించాడు. అందుకు నాందిగా సశాస్త్రీయంగా పెళ్ళినీ, అనేక ఆచారాలనూ పరిశీలించి జనానికి తెలియ పరిచాడు. ఇతర దేశభాషాసాహిత్యాలనూ, ప్రక్రియలనూ, వాటిల్లో అందచందాలనూ తెలుగువాళ్లూ తెలుసుకోవటం చాలా అవసరమన్న భావంతో గతంలో వేగుచుక్క గ్రంథమాల నిర్వహించారు. చాలా పుస్తకాలు తెచ్చారు.

అయితే 1951 నాటికి ధర్మారావు పూర్తిగా భావాల్లోనూ, భాషలోనూ మారారు తదనుగుణంగా రచనలూ చేశారు. తన కొత్త సూత్రాలను, భావాలను ప్రచారం చెయ్యటానికి పత్రికలూ నడిపారు. దీనికి తోడు ఒక గ్రంథమాలనూ నడపాలన్న ఆశయం ధర్మారావుకు, వారి చుట్టూ ఉండే మిత్రులకూ కలిగింది. ప్రపంచ రాజకీయ గ్రంథాలూ, విజ్ఞానగ్రంథాలూ ఈ గ్రంథమాల ద్వారా అనువాదం చేసి ప్రజలకందించాలని అనుకున్నారు

అందుకే 'ఇంటింటి విజ్ఞానమాల'ను నెలకొల్పారు. అప్పటికి ధర్మారావు మద్రాసులో "జనవాణి" వారపత్రికను నడుపుతున్నారు. ప్రజల్లో పత్రికకు విశేషాదరాభిమానాలుండేవి. పత్రికలో అన్ని అంశాలమీదా వ్యాసాలూ అవీ వస్తూండేవి. జనం నాడిని తెల్సుకున్నారు అలాగే ఇతర మిత్రులూనూ. దీనికి వెన్నెముక దర్శి చెంచయ్య. మద్రాసులో ప్రఖ్యాత ఆడిటర్‌గా పర్వతనేని బహ్మయ్య ఉంటుండేవారు. సాహిత్యాభిమానులు ఆంధ్ర ఇన్సూరెన్సు భవ

నంలో వారి కార్యాలయం ఉండేది. ప్రత్యేక ఆహ్వానాల మీద కొందరు సాహిత్యకారులూ సారస్వతాభిమానులూ 19-5-51 న బ్రహ్మయ్య కార్యాలయంలో సమావేశమయ్యారు. ప్రపంచ వాఙ్మయంలోని ముఖ్యమైన రచనలన్నింటినీ తెలుగులోకి అనువదించి అందించాలన్న సంకల్పంతో నాటి సభలో చర్చ సాగింది. ఏకాభిప్రాయానికొచ్చారు. "ఇంటింటి విజ్ఞానమాల" అన్న పేరును స్థిరీకరించారు. సంవత్సరానికి కనీసం పది పుస్తకాలు ప్రచురించాలనీ, 25 వేల రూపాయలను మూలధనంగా సేకరించాలనీ భావించారు. పోషకులు, శాశ్వత సభ్యులుగా చందాదారులను చేర్చాలని అనుకున్నారు. ''ప్రపంచ విజ్ఞానంలో విప్లవకరమైన మార్పులీ రెండు శతాబ్దులలో చాలా వచ్చినవి. అవి యాదృచ్ఛికంగా తప్ప మన భాషలోని కెక్కలేదు. ఇందుకు మన పరిస్థితులు కారణమని వేరే చెప్పనవసరంలేదు. .... ........"

"ఏదేశంలో కానీ, జాతిలో కానీ విజ్ఞానమంతా మౌలికంగా ఉత్పన్నం కాదు. ప్రపంచ విజ్ఞాన భాండారంలో అత్యవసర వస్తుసామగ్రినంతటిని యెవరి భాషలోనికి వారనువర్తింప జేసుకోవాలి'' .

"అందుకనే మన సాహిత్యాన్ని స్వయం సంపూర్ణం జేసేందుకు ప్రపంచ వాఙ్మయంలోనుంచి అతి ముఖ్యములూ, అతిప్రసిద్ధములూ అయిన వానినొక వందాయాభై దాకా అనువదించవలసి ఉంటుంది'' . ..

"రాజనీతి, అర్థనీతి, తత్వశాస్త్రం .... మొదలుకొని, సారస్వతంలోని నవలలు, నాటకాలు, కథలు వగైరాల వరకూ అరిస్టాటిలు మొదలు మార్క్సు, లెనిన్‌ల వరకూ, గోగోల్, చెకోవ్, బాల్జాక్ వంటి ప్రపంచ సాహిత్యంలో మెరికల్లాంటి వారి రచనలన్నీ త్వరలో తెలుగు చదువుకొన్న ప్రతి ఆంధ్రునికీ అందించనున్నాము''108 అన్న విజ్ఞప్తిని ఆ సమావేశం తయారుచేసింది.

ఈ ఆశయాలతో విజ్ఞానమాల నిర్వహణకు ఒక కార్యనిర్వాహక వర్గాన్ని కూడా ఎన్నుకొంది.

| | |
|---|---|
| అధ్యక్షులు | : మోటూరి సత్యనారాయణ |
| ఉపాధ్యక్షులు | · తాపీ ధర్మారావు |
| కోశాధికారి | : పర్వతనేని బ్రహ్మయ్య |
| కార్యదర్శి | : పందిరి మల్లికార్జునరావు |
| కార్యవర్గ సభ్యులు | : నార్ల వెంకటేశ్వరరావు, దర్శి చెంచయ్య, విద్వాన్ విశ్వం, కొడవటిగంటి కుటుంబరావు, డా॥ వి. యన్. శర్మ, దర్శి సుభద్రమ్మ. |

1951 జులై నెలలో అన్నా కెరినీనా, టాంపేన్, రానున్న సంక్షోభం అన్న గ్రంథాలను ప్రచురించాలని నిశ్చయించారు. కార్యదర్శి పందిరి మల్లికార్జునరావు అప్పుడొక ముద్రణాలయం పెట్టి 'కిన్నెర' పత్రికను నడుపుతున్నాడు. ఈ ముద్రణాలయంలోనే గ్రంథాలను అచ్చేయాలనుకున్నారు. అప్పటికి విద్వాన్ విశ్వం ఖచ్చితమైన ఉద్యోగమంటూ ఏదీ లేకుండా ఉన్నాడు. జనవాణితో సహకరిస్తూండేవాడు. ప్రిట్జు స్టెరన్‌బర్గ్ రాసిన గ్రంథాన్ని 'రానున్న సంక్షోభం' గా విశ్వం అనువదించాడు. అచ్చయింది. ఈ విజ్ఞానమాల నిర్వాహకుల్లో చాలామందికి కమ్యూనిస్టు భావాలుండేవి. దర్శి చెంచయ్య గదర్ పార్టీ నుండి కమ్యూనిస్టుపార్టీవైపువచ్చాడు. పైపుస్తకం విడుదలతర్వాత సభ్యులుకల్సి చర్చించి జనంలో బాగా వెళ్ళేదీ-తేలికగా అర్థమయ్యేదీ ఒక పుస్తకాన్ని వెంటనే ప్రచురించాలని భావించారు. ఈ సూచన ధర్మారావే చేశారు. అన్నా కెరినీనా అనువాదం ధర్మారావే చేపట్టాడు.[109] చాలా కొద్దికాలంలో పూర్తిచేశాడు. అచ్చు విషయాలు విద్వాన్ విశ్వం చూస్తూండేవాడు. అన్నా కెరినీనా ప్రచురణ కావడం, తక్కువకాలంలో జనం ఆదరానికి పాత్రం కావటం జరిగింది. కానీ పాపం పందిరి మల్లికార్జునరావుకు ప్రింటింగ్ చార్జీలు కూడా దక్కలేదు. తక్కువ ధర పెట్టటం ఒక కారణమంటారు. అంతే ఆ పైన ఈ విజ్ఞానమాల మరే పుస్తకాన్నీ చేపట్టలేదు.

"అన్నా కెరినీనా'' రచయిత లియో నికొలయేవిచ్ టాల్‌స్టాయి. రష్యాలో 1828 - 1910 సంవత్సరాల మధ్య జీవించాడు. చాలా సంపన్న కుటుంబంలో జన్మించాడు. టాల్‌స్టాయ్ రచనలన్నీ 90 వాల్యూములున్నాయి. అనేక కథలూ వ్యాసాలూ రాశాడు. అతనికి పేరుతెచ్చిన నవలలు వార్ అండ్ పీస్, అన్నా కెరినీనా, రిజరక్షన్.

టాల్‌స్టాయి తన రచనల్లో రష్యాలో వచ్చిన మొదటి విప్లవం చారిత్రక పరిస్థితులు, దాని బలం-బలహీనతలను స్పష్టంగా చూపాడు బూర్జువా రైతాంగ విప్లవం చిత్రించాడు. రష్యన్ రైతు దృష్టిలో ఆ కాలంలో రష్యా ఎలాగుందో కళ్ళ ముందు నిలబెట్టాడు. టాల్‌స్టాయి పెట్టుబడిదారీ విధానాన్నీ, చర్చినీ దుయ్యబట్టాడు. ప్రజా వ్యతిరేక మార్గాల ద్వారా ప్రభుత్వం చేస్తున్న దోపిడిని వెల్లడించాడు. కానీ అదే సమయంలో లొంగుబాటుతనాన్నీ, చెడును ప్రతిఘటించని లక్షణాన్నీ చెప్పే ఓ కొత్తమతాన్ని ప్రబోధించాడు. టాల్‌స్టాయి సిద్ధాంతంలో ప్రధానమైంది విశ్వాసం మానవుడి జీవిత పరమార్థం, ప్రజలు ప్రేమసూత్రం ఆధారంగా సమైక్యం కావాలనీ, దేవుడూ - దివ్యత్వం ఆధారంగా ఆ ప్రజలను

దేవుడిలో ఐక్యం చెందించాలనీ - అప్పుడే వారి బతుక్కి సార్థక్యం ఉందనీ ఆశించాడు.

టాల్‌స్టాయి రచనల్లో 1861 - 1904 మధ్య వచ్చిన వాటిల్లో పెరుగుతున్న పెట్టుబడిదారీ విధానం - క్షీణిస్తున్న వంశ పారంపర్య రైతాంగ స్థితి వర్ణనలూ అధికంగా ఉంటాయి. బూర్జువా నాగరికత దుర్లక్షణాలను బహిర్గతం చేస్తూ మొత్తంమీద అనాగరికతను తృణీకరించాడు. నిరాడంబర జీవితం గడుపుతూ సామాన్య రైతుగా బతుకులు కొనసాగించాలని ఉపదేశించాడు. దేవుణ్ణి ఆరాధించినప్పుడే మానవుడు స్వేచ్ఛ పొందగలడన్న భావాన్ని టాల్‌స్టాయి ప్రదర్శిస్తాడు. మానవుడి ప్రధాన లక్ష్యం భూమ్మీద దేవుడి రాజ్యం స్థాపించటమేనంటాడు. దీనికోసం కళల్లో కూడా మతపరమైన చోదకశక్తి అవసరమన్న నిర్ణయానికి రావడం కూడా జరిగింది. టాల్‌స్టాయికొచ్చిన కీర్తి ప్రతిష్ఠలు విప్లవ ప్రతీప రచనలు చేసినందుకూ, ఊహాత్మక భావవాది అయినందుకూ రాలేదు. వాస్తవికమైన యుద్ధమూ శాంతి, అన్నా కెరినీనా, రిజరక్షన్ నవలలు రాసినందుకే వచ్చింది. సామాజిక అసమానతలకూ, నిర్బంధకాండకూ గురైన ప్రజల తిరుగుబాట్లను తన రచనల్లో ప్రతిబింబించినందుకు లెనిన్ 'టాల్‌స్టాయి రష్యన్ విప్లవాన్ని ప్రతిబింబించిన దర్పణం' అని 1908లో ఒక వ్యాసంలో ప్రస్తుతించాడు. ''రష్యన్ రైతులు తమ యజమానుల దుశ్చర్యలనూ - దోపిడీనీ అసహ్యించుకొనేవారేగానీ వారిని ఎదిరించి ప్రతిఘటించే స్థాయికి ఎదగని'' దశను టాల్‌స్టాయి వర్ణించాడు.

ఈ వైరుధ్యం నిజంగా టాల్‌స్టాయిలో కూడా ఉండబట్టే ఆ కోణంలో చిత్రించాడని లెనిన్ భావించాడు.110 టాల్‌స్టాయి రచనలను అంచనా వేస్తూ లెనిన్ ''అతడి రచనల్లో వారసత్వం గతానికి సంబంధించింది కాదు. భవిష్యత్తుకు చెందింది. దీన్ని మనం స్వీకరించాలి. రష్యన్ శ్రామికుడు దాన్ని ఆధారంగా పెంపొందించాలి'' అంటాడు.111

టాల్‌స్టాయి రచనల్లో 'అన్నా కెరినీనా' రెండో ప్రసిద్ధమైన నవల (1878). అప్పుడప్పుడు టాల్‌స్టాయి రచనల్లో చెప్పిన విషయాలు అతడి అభిప్రాయాలకు విరుద్ధం కావటం కూడా ఉంది. అన్నా కెరినీనాను మొదట రాసిన ప్రతిలో - తన విధులను అటు తల్లిగానూ, ఇటు భార్యగానూ మరిచి స్వసుఖాలకు పాకులాడినందుకు ఖండించదగ్గ పాత్రగా చిత్రించాలని భావించాడు. కానీ నవల పూర్తయి తుదిమెరుగులు దిద్దుకున్న ప్రతిలో పాత్ర స్వభావం బాగా మారిపోయింది. లోకంలోని జమిలి బతుకులమీద, ఉన్నత వర్గాల నీతి సూత్రాల మీద ఆమె చేసిన తిరుగుబాటు సమంజసమే అనిపి

స్తుంది. పాఠకులకు ఆమె మీద సానుభూతి కలుగుతుంది. దీన్నే టాల్‌స్టాయి ఒక మిత్రుడితో "నా నాయకులు - నాయికలు నేను కోరుకోని పనులు చేస్తాంటారు. వాళ్ళు నిజజీవితంలో ఆ ఘట్టంలో ఎలా మసులుకోవాలో అలానే ప్రవర్తిస్తారు తప్ప నా యిష్టాయిష్టాల ప్రకారం నడుచుకోరు" - అని వివరిస్తాడు.[112]

అన్నా తనకన్నా ఇరవయ్యేళ్ళ పెద్దవాణ్ణి పెళ్ళి చేసుకుంటుంది. అతడు అలెగ్జీ. వారి కొడుకు సెర్యోజా. కాలం గడుస్తున్నకొద్దీ అన్నాకు వొరొన్‌స్కీ పరిచయం ప్రేమగా పరిణమిస్తుంది. కొడుకు - ప్రేమికుడి మధ్య అన్నా మథనపడ్తుంది. ప్రేమికుడు అన్నా కొడుక్కీ - ఆమెకీ మధ్య అగాధం తవ్వుతాడు. అది భరించలేదు. చివరికి రైలుకింద పడి చనిపోతుంది.

అన్నా బతుకును డాలీ ఓబ్లాన్‌స్కియాతో పోల్చి చెప్తాడు టాల్‌స్టాయి. డాలీ భర్త అవిధేయుడు. కానీ డాలీ తన పిల్లలకోసం అన్నీ భరిస్తుంది. అన్నాను కూడా పిల్లవాడికోసం భర్త దగ్గరే ఉండాలని టాల్‌స్టాయి కోరుకుంటాడు. కానీ అలా జరగదు.

లెవిన్ పాత్ర ద్వారా టాల్‌స్టాయి అన్నా అదృష్టాన్ని సరితూస్తాడు. లెవిన్ అంటే టాల్‌స్టాయి సిద్ధాంతాలైన ఆత్మశుద్ధి, విశ్వమానవప్రేమ, ఇహలోక సుఖాలకన్నా పరలోక సుఖాలకై కృషి చేయటం వంటి లక్షణాలున్న వ్యక్తి. అన్నా పాత్ర శారీరక సుఖం, సౌందర్యోపాసన కోసం తపిస్తే లెవిన్ తద్వ్యతిరేకంగా వాటిని అధిగమించడానికి కృషి చేస్తాడు.

టాల్‌స్టాయి నాటి సామాజిక పరిస్థితులను అంచనా వేసుకుంటూ, ఉన్నతవర్గాల వాళ్ళలో ఉండే తెరలను చించుతూ భౌతికంగా అన్నా పాత్రపై సానుభూతి కల్గివున్నాడు. కాని మానసికంగా అన్నా భర్తతో కలిసి కాపురం చేయడం ఆశించాడు. ఏమైనా పరిస్థితుల వైరుధ్యానికి తట్టుకోలేక అన్నా ఆత్మహత్య చేసుకుంది.

లెవిన్ నాటి రష్యాలో పరిస్థితిని "రష్యాలో ఉన్న సమస్య అంతా భూమికీ, దానిలో పనిచేసే వారికీ మాత్రమే"[113] అంటాడు. అంతేకాదు "రష్యాలో ప్రతిదీ కిందుమీదౌతోంది. ఇప్పుడిప్పుడే కుదురుకొంటోంది"[114] అని చాటిచెప్పాడు.

"టాల్‌స్టాయి రచనలు మాకు జవము - జీవమూ ఇస్తాయని, ఐరోపాలో చాలా అవసరమైన నీతిని ఇవి అందిస్తాయని అంటూ" ఈ మందు ఆర్భాటంతో కూడి కుంగి కృశించిపోతున్న మాకు చాలా అవసరమని" ప్రఖ్యాత నవలాకారుడు రోమరోలా అంటాడు టాల్‌స్టాయికి రాసిన ఓ ఉత్తరంలో.

ధర్మరావుకు ఈ అన్నా కెరినీనాలో ఉండే - స్త్రీజాతి పాత్రచిత్రణం, పెరుగుతున్న పెట్టుబడిదారీ దశలో ఉన్న బూర్జువా నాగరికతలోని దుర్లక్షణాలను బయటపెట్టటం; విశ్వమానవ ప్రేమవంటి భావాలు బాగా మనసుకి నచ్చాయి. అందుకే దీన్ని చాలా త్వరగా అనువాదం చెయ్య గల్గారు. చిన్న చిన్న వాక్యలతో సులభ శైలిలో చక్కని భాషలో రచన సాగించారు. తన మిత్రులందరికి దీన్ని గురించి చెప్తూండేవాడు. బి. ఎన్. రెడ్డిగారికీ కథలో గొప్పతనం నిత్యం ధర్మారావు చెప్పేవారని ఓ ఇంటర్వ్యూలో రెడ్డిగారన్నారు. (పేజి 69, ఆంధ్రప్రభ వారపత్రిక. 15.7.81)

ధర్మారావు అనువాద రచనను ఉదాహరణకు చూద్దాం

"ఇదేమిటి ? అతనెవరు ? నేనెలాగ అతణ్ణి ప్రేమించాలి ? నాకేమీ తెలియడంలేదే. అది తెలుసుకోకపోవడం నా తప్పే. నేను పట్టి శుంఠనయినా కావాలి. కొంటె పిల్లవాణ్ణయినా కావాలి." ఇదంతా అన్నా కొడుకు సెర్యోజా, అన్నా - వ్రాన్స్కీల సంబంధం గురించి అనుకునే స్వగతం. 115

ముఖ్యంగా 'పెళ్ళి' దాని సంబంధాలు ఎలాగుండాలి అన్న అంశాలు ధర్మారావుకు మొదట్నుండీ ప్రశ్నార్థకాలుగా ఉంటూ రెచ్చిస్తూ పుస్తకమే రాయించాయి. 'పడుపు వృత్తి' మీద చర్చావేదికలనే తన పత్రికలో నిర్వహించాడు. ఇవి కూడా ఈ నవలను అనువాదం చెయ్యటానికి వీరిని పురికొల్పి ఉండవచ్చు. టాల్‌స్టాయి మీద అభిమానం మరింత కుదురుకొని జనవాణిలో 'యుద్ధమూ - శాంతి'ని కూడా 'వంటెత్తు'తో అనువాదంచేయించి 'వాఙ్మయ గుళికలు' అన్న శీర్షిక కింద ప్రచురించేటంత వరకూపోయింది.

ఇంత చక్కగా మానవతా వైరుధ్యాలను వివరిస్తూ సాగిన అన్నా కెరినీనా నవలను "బాధలతోనూ, అబద్ధాలతోనూ, దుఃఖాలతోనూ, దుర్మార్గాలతోనూ నిండి ఉన్న పుస్తకాన్ని అన్నా ఏ దీపం సహాయంతో చదువుకుందో, ఆ దీపం ఒక్కసారి ఇదివరకెన్నడూ వెలగనంత ప్రకాశంతో వెలిగి చీకటిలో ఉన్న ప్రపంచాన్నంతటినీ స్పష్టంగా కనబరచి, భగ్గుమని మండి మెల్లగా తగ్గి, శాశ్వతంగా ఆరిపోయింది"116 - అన్న సుదీర్ఘ వాక్యంతో ధర్మారావు ముగిస్తాడు. ఇది జీవితం వ్యాఖ్యానం.

## రాలూ - రప్పలూ

స్వీయచరిత్ర అన్నది ఆధునిక సాహిత్య ప్రక్రియ. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో స్పష్టమైన ఆకృతి పొందింది. సాధారణంగా చరిత్ర అంటే దేశ చరిత్ర అన్న భావమే కలుగుతూంటుంది. రాజుల, దేశాల భూతార్థాల వివరణ. ఇక జీవితచరిత్ర అంటే వ్యక్తి సంపూర్ణ జీవితాన్ని వెల్లడిస్తుంది అతడి జీవితంలో ఏయే ఘట్టాలు ఏ విధంగా అతణ్ణి ప్రభావితం చేశాయో తెలియ చేస్తుంది. ఒక వ్యక్తి జీవితం అతడు జీవించిన దేశ, రాజకీయ, సాంఘిక, సారస్వత రంగాల చరిత్రతో పెనవేసుకుని ఉంటుంది. అందువలన వ్యక్తి జీవిత చరిత్ర అంటే స్థూలంగా నాటి దేశ సామాజిక చరిత్రగా రూపుకడ్తుంది.

తాను రాసుకున్న తన చరిత్ర అనే అర్థంలో గురజాడ శ్రీరామ్మూర్తి 'స్వీయచరిత్ర' అన్నదాన్ని మొదట వాడారు.116 వారు రాసిన 'కవి జీవితములు' గ్రంథాది పీఠికలో దీన్ని ఉపయోగించారు. ఈ ప్రయోగం మీద కందుకూరిని ఆధారంగా చేసుకుని కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి దుయ్యబట్టారు. "స్వీయచరిత్ర మిందపశబ్దము. అనాఘ్రాత పాణినీయ గంధులగు పండితులు వారిది యెరుగక గ్రంథమునకీ నామకరణము గావించిరి"....స్వకీయ చరిత్ర అని కానీ 'సౌవచరిత్ర' అనికానీ 'స్వ - చరిత్ర'117 అనికానీ పిలవాలని వారి వాదం. (ఆర్యమత బోధిని అన్న పత్రికలో కూడా చాలా సంచికల్లో ఈ విమర్శనం సాగింది.) అయితే ఎవరూ దీన్ని అంతగా పట్టించుకున్న పాపాన పోలేదు. 'స్వీయచరిత్ర' అన్నదే రూఢి కావడం, తర్వాత చాలామంది అలాగే రచనలు చెయ్యడం కనిపిస్తుంది.

ఆంగ్ల సాహిత్య ప్రభావం ద్వారా ఈ నూతన ప్రక్రియ తెలుగులోకి వచ్చిందనుకుంటే ఆంగ్లంలో సామాన్యంగా ఇది వచన ప్రక్రియగానే విలసిల్లింది. తెలుగులో వచన ప్రక్రియగా ఇది రూపం దాల్చక ముందు పద్య రూపంలో సాక్షాత్కరించిన ఉదాహరణలూ కొన్ని కనిపిస్తాయి. మన ప్రాచీన కవులందరూ కావ్యావతారికల్లో ఎంతో కొంత తమ చరిత్రను చెప్పుకున్నారు. అయితే అది కవి జీవితాలను వెల్లడించటానికి ఎంతవరకూ ఉపకరిస్తుందన్నది

అనుమానం. దీన్ని కవులందరూ కావ్యరచనలో ఒక భాగంగా రాశారే తప్ప ఒక ప్రక్రియగా భావించలేదనే చెప్పాలి.

19 వ శతాబ్దం చివరి దశాబ్దంలో కొక్కొండ వెంకటరత్నం పంతులు,[118] మండపాక పార్వతీశ్వర శాస్త్రి,[119] (1833 - 1897) తమ స్వీయ చరిత్రను కొంత భాగం పద్యకృతులుగా రాశారు పార్వతీశ్వర శాస్త్రి గ్రంథానికి పూండ్ల రామకృష్ణయ్య పీఠిక రాస్తూ "ఇట్టి గ్రంధమీ భాష నూతనముగా దీనింబ్రకటింప బ్రయత్నించినారము''[120] అని అన్నారు. ఇది ఒక నూత్న ప్రక్రియగా ఆంగ్ల సాహిత్య ప్రభావంతో వచ్చిందన్నప్పుడు దీని లక్షణాలేవో తెల్సుకోవటం అవసరం.

**"Autobiography as the suggestive nomenclature of Southey implies is the biography of a person written by him-self. Its motives are various among others self scrutiny for self edification, self justification, as cardinal Neuman's beautifully written Apologia Projunita (1864), a nostalgic desire to linger over enchanting memories as Selma Laserlof's Marbacha (1922) belief that ones experiences may be helpful to others as Hellen Keller's "The story of my life" (1903) an earnest attempt to orient self amid a world of confusion, as the Education of Henry Adams (1906), the urge for arti-stic expression or the purely commercial desire to capitalize on fame or position"**[121]

— అని ఆంగ్ల విజ్ఞాన సర్వస్వంలో ఉదాహరణ పూర్వకంగా వివరించారు. "తన చరిత్రను తానే రాసుకోవటం, తానే రాసుకున్న ఆత్మకథ'' అంటూ ఆక్సుఫర్డ్ నిఘంటువు ఆటోబయోగ్రఫీకి అర్థం చెప్తుంది.

ఈ ప్రమాణాల వెలుగులో పరిశీలిస్తే తెలుగు వాళ్ళలో జీవితచరిత్ర రాసుకున్న మొదటివాడు వెన్నెలకంటి సుబ్బారావు (1784 - 1839). 'ఏ లైఫ్ అండ్ జర్నల్ ఆఫ్ వెన్నెలకంటి సుబ్బారావ్' - అన్న గ్రంథాన్ని 1872 లో అచ్చేశారు. మద్రాసులో ఆనాడుండే సర్ అదాలత్ కోర్టులో అనేక భాషలు తెలిసిన అనువాదకుడుగా పనిచేశాడు. భారతదేశం యావత్తూ రెండుసార్లు పర్యటించి అనేక విషయాలను ఈ గ్రంథంలో పొందు పర్చాడు.[122] రచన ఇంగ్లీషులో సాగింది. అలాగే అదేకాలంలో గవర్నర్ కార్యాలోచన సభలో సభ్యుడు వెళ్ళె వెంచల్‌రావు పంతులు తమ చరిత్ర రాసు

కొన్నారని వంగవోలు వెంకట రంగయ్య రాశారు.[123] లభించలేదు. చెంచల్ రావు వీరేశలింగం సమకాలికుడు. అది వంగవోలు మాటలు చూసినా అది ఏరూపంలో, ఏభాషలో ఉందో కూడా తెలీదు. కావలి బొర్రయ్య (1777 - 1803) కాలం నాడే తన దినచర్యను ఇంగ్లీషులో నమోదు చేసుకున్నాడు. మెకంజీకి బాగా తోడ్పడ్డ వ్యక్తి. రాయల్ ఏషియాటిక్ సొసైటీ పత్రికలో ఇంగ్లీషు రచనలు చేశాడు. వీరి తమ్ముడు ఆంగ్లంలోనే లైవ్స్ ఆఫ్ దక్కన్ పొయెట్స్ (1829) ను ప్రకటించాడు. ఇవన్నీ చూస్తే నాటి మేధావులకూ విద్యాధికులకూ ఆంగ్లం మక్కువ ఎక్కువని తెలుస్తుంది. అందువల్లనే అక్కడ నుండి వచ్చిన ఈ ప్రక్రియను బొర్రయ్య నుండి సుబ్బారావు వరకూ ఏదో రూపంలో ఆంగ్లంలోనే నిర్వహించారు.

వీటి తర్వాత కందుకూరి వీరేశలింగం స్వీయచరిత్ర వచ్చింది. అందులో వారు తెలుగులో మొట్టమొదట స్వీయచరిత్రను తామే రాశామని చెప్పుకున్నారు. కనుక అంతకు పూర్వపు రచనలన్నీ ఆంగ్లంలోనే వచ్చాయని రూఢి పడింది. ఇంగ్లీషు సంప్రదాయంతో, ఆ ప్రభావం కారణంగా తెలుగులో వెలువడిన మొదటి స్వీయచరిత్ర కందుకూరిదైతే (1911), తెలుగువాడు రాసుకున్న మొదటి సంపూర్ణ జీవితచరిత్ర వెన్నెలకంటి సుబ్బారావు దనవచ్చు. అయితే ఇది ఆంగ్లంలో ఉంది (1872).

దినచర్యలు రాసుకోవడమూ, యాత్రావృత్తాంతాలు రాయడమూ, స్వీయ చరిత్రకు ముడిసరుకు కాబట్టి ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్రా చరిత్ర దీనికిందికే రావచ్చు. ఇది 15 మాసాల 15 రోజుల 15 గంటల యాత్రా చరిత్ర. ఇందులో స్వీయచరిత్ర ఉన్నా యాత్రకు సంబంధించిన మేరకే. ఇదే సందర్భంలో అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు స్వీయచరిత్ర 'నాయెరుక' ముందు వచ్చిన స్వీయచరిత్రన్నవాదం ఇటీవల బయల్దేరింది.[124] ఇది అసమగ్రం - ఏకదేశం అయిన స్వీయచరిత్ర. ఆధునిక రూపరేఖలకు అనుగుణమైనదీ, అనేక విధాలుగా ప్రామాణికమైందీ అయిన స్వీయచరిత్ర కందుకూరిదే. ఈ వాదాన్ని స్వీయచరిత్రలను శతాధికంగా సేకరించి అందులో కృషి సాగిస్తున్న అక్కిరాజు రమాపతిరావు సోపపత్తికంగా తమ 'వీరేశలింగం - సమగ్ర పరిశీలన' లో సిద్ధాంతీకరించారు కూడా.

తెలుగు నాట స్వీయచరిత్రలు కవులు, కళాకారులు, పండితులు, సంఘ సంస్కర్తలు, ఉద్యమకర్తలు, రాజకీయ నాయకులు మొదలైన వాళ్ళెందరో రాసుకున్నారు. వీరిలో మహిళలు కూడా ఉన్నారు.[125] వీటిలో కొంత వైవి ధ్యాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. అనుభవాలు - జ్ఞాపకాలు, గతకాలపు

స్మృతులు, చిన్ననాటి ముచ్చట్లు మొదలైనవి కూడా కేవలం ఏకదేశంగా కాకుండా, పరిధిలోనూ విస్తృతిలోనూ వ్యక్తి జీవితకాలంలోని ముఖ్యఘట్టాలను సన్నివేశావధులను స్పృశించగలిగితే, సమీక్షిస్తే వాటినీ స్వీయచరిత్రలుగానే గ్రహించవచ్చు. వీటన్నిటినీ స్థూలంగా సాహిత్య, భావుక, సామాజిక, రాజకీయ, చారిత్రక, యాత్రా సంబంధులుగా విభజించవచ్చు. ఇప్పటి వరకూ లభించేవన్నీ ఈ వర్గీకరణలో ఇముడ్తాయి.

తాపీ ధర్మారావు 'రాలూ - రప్పలూ' - అంటూ సాగించిన రచన స్వీయచరిత్ర. దీన్ని జనవాణి వారపత్రికలో 8.2.52 న ఆరంభించి 4.2.53 సంచికతో ముగించారు. అయితే ఈ రచనలో మద్రాసులో బి. ఏ. చదువు కొనసాగుతూండటం వరకే వచ్చింది. దీన్ని రాయమని చాలామంది మిత్రులు కోరినట్టు జనవాణిలో వినయంగా తనను గురించి చెప్పుకున్నాడు.

ధర్మారావు ఈ స్వీయచరిత్ర వస్తూన్న కాలానికి కొద్దిగా అటూ ఇటూ వచ్చిన స్వీయచరిత్రలు ప్రజ్ఞాప్రభాకరం అన్న పేరుతో వేటూరి ప్రభాకరశాస్త్రి అసమగ్ర రచనా (1951) ; కొండా వెంకటప్పయ్య పంతులు స్వీయచరిత్ర (1952); కె. వి. యన్. కేసరి 'చిన్ననాటి ముచ్చట్లు' (1953) దర్శి చెంచయ్య 'నేనూ-నాదేశం' అనేవి. ధర్మారావు స్వీయచరిత్ర అసమగ్రం. ఏకదేశం. కాబట్టి ఆయన చెప్పాలనుకున్నవన్నీ అక్షరబద్ధం కాలేదు. బాల్య, కౌమారాలను స్మరిస్తూ యవ్వన ప్రాంగణంలో అడుగుపెట్టిన కథతో ఆపే శాడు. అందువల్ల దీన్ని స్థూలంగా మాత్రమే జీవితచరిత్ర అనవచ్చు.

రాలూ-రప్పలూ అని పేరుపెట్టడంలో తన జీవితంలో తన వ్యక్తిత్వం రూపుకట్టుకోవడంలో తానధిగమించిన సన్నివేశాల్లో ఎదురైన సమస్యలు, అవసరమైన చొరవ మొదలైనవానిని ధ్వనింపచేసే అభిప్రాయం ధర్మారావు కుందని భావించవచ్చు. సాహిత్యవిషయకంగానూ, సామాజిక పురోగతి విషయకంగానూ, భాషాపరంగానూ కందుకూరి, గురజాడ, గిడుగుల వారసత్వం వీరిలో తర్వాత ప్రస్ఫుటమైంది. అందువల్ల దారిలో రాలూ రప్పలూ చూచుకుంటూ నడిచానన్న ధ్వని - అంతేకాకుండా ఆ సమస్యల పేలవత్వం - అసార్థకతలు కూడా ధ్వనితమే అనాలి.

ఈ రచన పుస్తక రూపంతో 1979 లో ధర్మారావు చనిపోయిన తర్వాత వెలువర్చి ఉంది. ఇందులో 19వ శతాబ్దం చివరికాలంలో కుటుంబాలూ, వృత్తులూ, విద్య అప్పుడప్పుడే ప్రబలుతూండే కొత్త లక్షణాలూ బ్రాహ్మణేతర కుటుంబాలు దీనివైపు మొగ్గటం కనిపిస్తుంది. కులవృత్తులు శిథిలమైపోతూ ఆంగ్లవిద్యాప్రభావం వ్యాపించటాన్నీ, ఆంగ్లభాషపై మోజూ, ఆ ఆచారాలపై ఆసక్తి ప్రబలడాన్ని ధర్మారావు చక్కగా వివరించాడు.[126]

సామాజికంగా వస్తూన్న మార్పులనూ పెళ్ళి విషయాల్లో కొత్తతరం ఎలా ప్రవర్తించిందీ వివరించాడు. అలాగే వందేమాతరం ఉద్యమం తెచ్చిన ఉత్సాహం, ఆకాలంలో సామాజిక సంస్కరణలకోసం యువకులు చిన్న చిన్న చర్చాగోష్ఠుల ద్వారా ఎలా తమ మనసులను పరిపక్వం చేసుకొనేవారో వర్ణించాడు (పేజి 34). శిథిలమైపోతున్న ఫ్యూడల్ సమాజం దుర్లక్షణాలు, వేశ్యల సంపర్కం - మేజువాణీల వంటివి మర్యాదస్తులకెలా అత్యవసరాలూ-గౌరవ ప్రదాలుగా ఉండేవో బాగా గమనించాడు (పేజి 45). ఆ సమాజం పతనం అయ్యే దశను చూస్తూ కొత్త దశకు ఆవాహన పలికే లక్షణాలను చాలా అందంగా సోదాహరణంగా తన తండ్రిని ఉదాహరణగా తీసుకొని వివరించాడు.

స్త్రీలు, మూఢనమ్మకాలను ధర్మారావు తల్లి ఉదంతాల ద్వారా వివరిస్తూ కొత్తయువరక్తం ఎలా ఎదిరిస్తుందో ఇందులో చెప్పాడు (పేజి 52). బాల్యవివాహాల ప్రసక్తి తెస్తూ అందులో తల్లిదండ్రుల పాత్రను చెప్తూ తన అన్న పెళ్ళి, తన పెళ్ళి ప్రస్తావించాడు. అయినా అప్పుడప్పుడే తనలో అంటుకడుతున్న అభ్యుదయ భావాలను తన వివాహం సందర్భంలో విశదీకరించాడు (పేజి 55-60).

ఈ రోజుల్లో భావప్రచారానికి నాటకాలే చాలా అనువుగా ఉండేవి. ఎక్కువ మందిని ఒకచోట చేర్చటానికీ, వారికి తమ భావాలను ఉపదేశించటానికీ అటు రాజకీయాలవాళ్ళు గానీ, సంస్కరణవాదులు గానీ చేస్తూండేవారు. సాహిత్యపరంగా చూసినా ఈ ప్రక్రియనే చాలామంది వినియోగించుకోటం గమనించగలం. ధార్వాడ నాటక కంపెనీ వచ్చి దీన్ని మరింతగా పెంపొందించింది.[127] ఊరూరా నాటక సమాజాలు వెలవడం వల్ల పసితనం మీద బాగా ముద్రవేసింది. ఈ విషయాన్నే ధర్మారావు విజయనగరంలో స్కూలు విద్యార్థులను చేరదీసి తానే రాసి నాటకాలు ఆడించటం, తెరలూ అవీ తానే చిత్రించటం వంటి అనేక విషయాలను ప్రస్తావించాడు (పేజి 38-39). ఇదే క్రమంగా బూర్ల కంపెనీ నాటక సమాజం ద్వారా ధర్మారావు ప్రేరితుడై మొదటి నాటకం రాయడం బరంపురంలో సంభవించింది.

ఆరోజుల్లో సంస్కరణ భావాలూ, బ్రహ్మసమాజ భావాలూ బాగా ప్రచారంలో ఉండేవి. వీటి వలన యువకుల్లో కుల, మతాల పట్టుదలలు సడలించటానికి వాళ్లు కృషిచేశారు అయితే పాతతరం అంత త్వరగా తన బంధనాలను తెంచుకోదు. యువతను ముందుకుపోనీదు. ఈ విషయం విజయనగరంలో ఉన్న బాల విధవ వివాహ సమస్యను చెప్పే సందర్భంలో(పేజి 53) నూ, పర్లాకిమిడిలోని గిడుగులాంటివారే బొట్టువిషయంలో పట్టుబట్టినప్పుడూ (పేజి 68) చాలా బాధతో ధర్మారావు పేర్కొంటాడు.

గురజాడ ఆ కాలంలోనే ఒక పెద్ద 'సాహిత్య రాక్షసుడు' (లిటరరీ జయంట్). ఇది వింటానికి కటువైన ప్రయోగం. అలాటి వ్యక్తి వీధిలో నడుస్తూంటే ఎలాటివారైనా పిపీలికాలుగా ఉండేవారన్న విషయాన్ని సూచ్యార్థ సూచకంగా అన్నాడు.

ఆకాలంలోనే ఇంటర్మీడియట్ వచ్చిన విషయం కూడా తెలుస్తుంది. నాటి విద్యావిధానం గురువులకూ, శిష్యులకూ ఉండే సంబంధం, అధ్యయనం చేసే విధానం వర్లాకిమిడి ఘట్టం వివరిస్తూ చాలా విపులంగా చెప్పాడు.

ఒక పుస్తకం ఎలా చదవాలన్నది, గిడుగువారి సొంత గ్రంథం తన కిచ్చినప్పుడు తెల్సిందంటాడు ధర్మారావు. ప్రతి పేజీలోనూ, పంక్తిలోనూ, క్రీగీతలూ పక్క ఖాళీ స్థలంలో సూచనలూ - విమర్శలూ రాసుకునేవారట గిడుగువారు. విద్యార్థి, అధ్యాపకుల సంబంధం కేవలం తరగతి సమయాలతోనే పూర్తి కాదనీ, అతని జీవితంలోకి గురువు ప్రవేశించి నిత్యం ప్రభావితం చేయడమన్నది నాడుండేదన్న సంగతి గిడుగు - ధర్మారావు సంబంధాలవల్ల తెలుస్తుంది. అంతేకాదు, ప్రిన్సిపాల్ మంగు శ్రీనివాసరావు దినచర్యవల్లా బోధపడుతుంది (పేజీ 78- 80)

నాడు సాహిత్యప్రచారానికి జమీందార్లు సాయపడ్డారనవచ్చు. అందులో వెంకటగిరి సంస్థానం వాళ్ళు చేసిన సేవను ధర్మారావు వివరించటం చూస్తే ఒక రకంగా నాటి యువకుల్లో ప్రాచీన సాహిత్యం మీద అభిమానం కలిగించటానికి వాళ్ళు బాగా ప్రయత్నించారనవచ్చు దీనికి కారణం ఉంది. ఫ్యూడల్ దశలో సామాజిక చైతన్యాన్ని మతం ద్వారా ప్రస్ఫుటపర్చటం జరుగుతుంది. మతం పతాకం కిందనే నాటి జనం జీవింగేవారు. నాటి జనం తాత్విక చింతనా జీవితం మతంతో ప్రభావితమై ఉండేది.[128] రాజులూ - జమీందార్లూ దీన్నే ఆలంబనంగా చేసుకుని పాలించేవారు. ఆ మతమే సాహిత్యంలో కూడా ప్రతిబింబించి ఉండేది. రాజులు అవతారమూర్తులనీ, వాళ్ళే సాహిత్యాన్ని ఉద్ధరిస్తారన్న భావంతో ఆగ్రంథాలను అలాంటి అవతార పురుషులకే అంకితమిస్తే పుణ్యమన్న ఆలోచన ఉండేది. అందుకే ఈభావాలను ప్రచారంచేసే సాహిత్యాన్ని వాళ్ళు విరివిగా అచ్చేసి చౌకగా అందించటం జరిగింది. అయితే పెట్టుబడిదారీ విధానం మారాకు వేస్తున్న కాలానికి బూర్జువా నాగరికత వచ్చింది. ఇది గతంలో ఉన్నదాన్ని పొదువుకునే కొత్తనాగరికతకు నివాళులెత్తింది. ఈ దశను ఆ కాలంనాటి తెలుగుదేశంలోని విజయనగరం, బొబ్బిలి, వెంకటగిరి సంస్థానాలు ప్రతిబింబించాయనవచ్చు. ఈ విషయం రేఖా మాత్రంగా ధర్మారావు సూచించాడు.

ధర్మారావు కాలంలోనే విద్యాబోధనలో ప్రత్యక్ష పద్ధతి (డైరెక్టు మెథడ్) అమల్లోకి వచ్చింది. యేట్సు మొదలైనవాళ్లు శ్రీనివాసయ్యంగారి సహాయంతో దీన్ని విద్యాలయాల్లో ప్రవేశపెట్టారు. అప్పటికి ధర్మారావు బరంపురంలో అధ్యాపకులు. వీరుకూడా దీన్ని వినియోగించినట్టూ పరీక్షాధికారులు చాలా సంతోషించిన ఉదంతాన్ని (పేజి 96) చెప్పి దీనివల్ల విద్యార్థులకెంత లాభమో విశదీకరించాడు.[129]

మద్రాసుకో విద్యార్థులూ, అధ్యాపకులూ, విద్యాలయాలూ, వీటన్నిటినీ సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనతో ధర్మారావు వివరించటం వల్ల చాలా విషయాలను చెప్పినట్టయింది. గైడ్ల ప్రభావం - నోట్సు బట్టీయంవేసి మార్కులు సంపాదించటం లాంటివి విద్యార్థులకు సరేసరి, అధ్యాపకులకు కూడా పట్టిన జాడ్యంగా చాలా వ్యంగ్యంగా చెప్పాడు. బోధన సమయంలో అధ్యాపకుడి లక్షణం విద్యార్థులను తేజపర్చటమన్నది. దీన్నే నిశితంగా చెప్తూ రామనాథన్ బాగా చదువుకున్నవారు. విషయం అంతా తెలిసిన వారూనట. "కాని వారి బోధనా పద్ధతి నిద్రపోతూ ఉంటుంది ఎంత ఉత్సాహపూరిత ఘట్టమైనా ఏదో బజారు ధరలు చెప్పినట్టే చెప్పేవారని" (పేజి 107) ఆంగ్లోపన్యాసకుడిని మన కళ్ళముందు చిత్రించాడు.

నాడు అరవదేశంలో ఆంధ్రులకున్న పేరు ప్రతిష్ఠలను చూడాలంటే "ఆ రోజుల్లో ఆంధ్రులకు రూములు అద్దెకివ్వడానికి అరవవారు చాలా భయపడేవారు ఏదయినా తకరారు, నీళ్ళ దగ్గరో, అద్దె ఇవ్వడం దగ్గరో వచ్చిందంటే ముందుగా చెయ్యి విసిరేస్తారని ఆరోజుల్లో ప్రతీతి" (పేజి 102) అన్నదాన్ని చూడవచ్చు. ఈరకంగా తెలుగువాడి ప్రతాపం కోడి రామ్మూర్తి సర్కసు దగ్గరనుండీ పై ఉదంతందాకా అవసరమొచ్చినచోటల్లా ధర్మారావు రాయటం మర్చిపోలేదు

మద్రాసులో ట్రాములూ వాటి నిర్మాణాలూ, అవి వెళ్ళే నత్తనడకలూ చెప్తూ "జట్కా బళ్ళకన్నా అన్యాయం" అంటాడు. (పేజి 106).

ధర్మారావు దృష్టిలో విద్యార్థులు సంవత్సరమంతా చదువుతూండాలి గానీ, పరీక్షల ముందు ముక్కున పట్టి రాయటం విరుద్ధం (పేజి 123). అంతకు పూర్వం చదివిందాన్ని పరీక్షలకు ముందు పది రోజుల్నుండీ గుప్తంగా మనసులో మననం చేసుకోవటం ముఖ్యం. ఇది నిజంగా ఈనాటి విద్యార్థులకు చుక్కెదురు పద్ధతి.

నాటి సామాజికాంశాలలో ఒరిస్సా ప్రాంతంలో హోటల్‌లో భోజనం చేసిన వ్యక్తి తను తిన్న విస్తరిలోనే డబ్బు ఉంచి లేచిపోవటమనే వింత

విషయం (పేజి 65) ఒకటి. అలాగే విశాఖపట్నం నుండి మద్రాసుకు ఓడలో ధర్మారావు తండ్రి వైద్య విద్య కోసం వెళ్ళటం (పేజి 6) వంటివి నమోదు చేశాడు.

ధర్మారావు జీవించిన ఈ కాలంలో ఒరిస్సా రాష్ట్రంలో మారుమూల సంస్థానం, తెలుగునాట ఓ మూలకున్న గ్రామాల్లో ఉండడంకాకుండా రాజమండ్రి, కాకినాడలు అయి ఉంటే ఇంతకన్నా సామాజికాంశాలపై ఎక్కువ దృష్టి వీరికి విద్యార్థి దశలోనే అలవడి ఉండేది. అప్పటికే కందుకూరివారి ప్రభావం, బ్రహ్మసమాజ ప్రచారకుల ప్రభావం గోదావరీ తీరాన పరవళ్ళు తొక్కుతూంది. వీటికి అతిదూరంలో ఉండటంవల్ల ప్రధానస్రవంతిలో బహుశా ముందే ధర్మారావు కలవలేకపోయాడు. సాహిత్యవిషయకంగా కూడా ముందు స్థిరపడే దేదో గుర్తించలేకపోవటం జరిగింది.అందుకే భాషాపరంగా, విషయపరంగా వెనకచూపుతోనే తన జీవితాన్ని ఆరంభించాడు.

జీవితచరిత్ర-స్వీయచరిత్ర రాసేవాళ్ళు చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. అందులో అది సాహిత్యం కిందకి రావాలన్న ఆకాంక్ష ఉన్న రచయితలు కథా పురుషుని వ్యక్తిత్వాన్ని వ్యక్తంచేస్తూనూ, కథనకౌశలం కలిగి ఉండేలానూ జాగ్రత్తగా రచన సాగించాలి. దీనితోపాటు రచనా సౌందర్యం కూడా చాలా అవసరం. విషయప్రధానాలైన రచనలకు శైలి ముఖ్యం కాకపోవచ్చు. కానీ విషయ ప్రాధాన్యం ఉండి రమ్యమైన శైలీ సౌభాగ్యం కూడా దానికి అబ్బితే ఆ జీవితచరిత్రా, స్వీయచరిత్రా సాహిత్యంగా శోభిల్లుతుంది.

స్వీయచరిత్రకారుడు ప్రధానంగా సత్యకథనం మీద దృష్టి ఉంచాలి. ఎవడూ సర్వదోష రహితుడు కాడు కనుక అలాటి విషయాలను మరుగు పర్చటం అంటే జీవితంలో ఒక భాగాన్ని చెప్పకపోవడమే అవుతుంది. మానవ జీవితంలో ప్రకాశం-అప్రకాశాలని రెండు విధాలుంటాయి.130 స్వీయచరిత్ర కారుడీ రెంటినీ ప్రకటించాలి. బహిరంగ జీవితానికి ప్రేరకాలైన సంఘటనలు ఆంతరంగిక జీవితంలో ఉంటే అవి ఎంత గోప్యాలైనా బహిరంగ పర్చాల్సిందే. ధర్మారావు ఈ విషయంలో న్యాయం చేకూర్చాడు.

స్వీయచరిత్రకారుడికి సాధారణంగా ఆత్మవిశ్వాసం ఎక్కువగా ఉంటుంది. అందువలన తన జీవితంలోని ఆయా ఘట్టాలను వివరించే సందర్భంలోనూ, తాను సాధించిన ఘనకార్యాల వివరణల్లోనూ తన ఆధిక్యాన్ని ప్రదర్శించుకొనకుండా వినయ సంపదను ప్రదర్శించుకోవాలి.131 ఈ లక్షణం కూడా రాలూ-రప్పలులో ముఖ్యంగా మద్రాసు చదువు ఘట్టంలో కనిపిస్తుంది.

అయితే విజయనగరం, పర్లాకిమిడి ఘట్టాలలో ఆత్మవిశ్వాసం కొంత 'శ్లాఘ' కిందకు వచ్చిన ప్రమాదం కనిపిస్తుంది.

ధర్మారావుది "వెయ్యి ముఖాలతో వెలిగిన జీవితం. పూలబాటలు, ముండ్లపుంతలు, అగాధమైన పల్లాలు, ఆకాశాన్నంటే మెరకలు అన్నీ తొక్కుకుపోయిన జీవితం" (పేజి 1). దీన్ని వివరించడంలో అతిశయోక్తుల వైపు పోకుండానూ, నైచ్యానికి దిగకుండానూ జాగ్రత్త పడ్డాడు. మొదటినుండి ధర్మారావుకు 'మరిచిపోవడం మరింత కష్టం' అనే తత్వం ఉంది. కనుక ఇందులో విషయాలన్నీ సత్యాలేనంటూ ధర్మారావే అన్నాడు.

ధర్మారావు శైలి తరుముకుంటూ చదివించుకుపోయేది. ఇది రాసే కాలానికి అనేక రచనలు చేశారు. పత్రికల ద్వారా కొత్త భావాలను ప్రజల కందించటానికి వీలైన శైలిని సంతరించుకున్నారు. ప్రజలచేత శాబాసనిపించు కున్నారు కూడా. అందుకే ఈ రచన చాలా అందంగా సరళంగా సాగింది.

నిత్యం అభ్యుదయశీలం ఉన్న ఉద్యమాల మధ్య జీవిస్తూ ఆ జనం వెంట నడుస్తూ సాగించిన ప్రయాణం వివరాలు పూర్తిగా రచనలో కొనసాగించి ఉంటే ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో నడిచిన అనేక రాజకీయ, సాంఘిక ఉద్యమాలూ వాటి ప్రభావం ప్రజలమీద పడ్డ వైనం బాగా తెలిసి ఉండేది. ఆంధ్ర రాష్ట్ర ఉద్యమం, శాంతిపోరాటం, విశాలాంధ్ర నిర్మాణం, తెలంగాణా సాయుధ పోరాటాల అనుపానులూ-వీటిలో ధర్మారావు పాత్ర బాగా వెల్లడయ్యేవి. సాహిత్య ఉద్యమాలూ వ్యాఖ్యాన వివాదాలూ తెల్లమయ్యేవి. అవే జరగలేదు. 'రాలూ - రప్పలూ' అసలైన విషయాలు ప్రసక్తం కాకముందే ఆగిపోయింది.

ఏదిఏమైనా 'జీవితంలోని కొన్ని సంఘటనలు కల్పనల కథలకన్నా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయన్నది' ఓ సామెత. ఇందులోవన్నీ పచ్చి నిజాలు కనుక పాఠకులనాకట్టుకోవటంలో ఆశ్చర్యం లేదు.

## వెండితెర 'సాహిత్య దర్జీ'

భావప్రచారానికి చాలా శక్తిమంతమైంది చలనచిత్ర రంగం. ప్రపంచంలో నేడున్న అన్ని వ్యవస్థలలోని దేశాలూ దీని గొప్పతనాన్ని విస్మరించటం లేదు. పైపెచ్చు దీన్ని ఇతోధికంగా అభివృద్ధి పరచటానికి చాలా

యత్నాలు సాగిస్తున్నాయి. ముఖ్యంగా ప్రయివేటు వ్యక్తుల, సంస్థల చేతుల్లో ఉంచకుండా ఈ పరిశ్రమను సోషలిస్టు దేశాలు ప్రభుత్వ పరంగా నడుపుతూ నిజమైన ప్రజాకళలనూ, సంస్కృతినీ ప్రచారం చేస్తున్నాయి.

మూకీ - టాకీగా మారటంతో ఈ చలనచిత్ర రంగం ఒక గొప్ప పరిణామానికిలోనైంది. ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఆ మార్పే భారతదేశంలోనూ వచ్చింది. 1931 మార్చి 14 భారత చలనచిత్ర రంగంలో గుర్తుంచుకో తగ్గ రోజు. ఆనాడే 'ఆలం ఆరా' మొదటి టాకీగా విడుదలైందంటారు. దీని నిర్మాత ఆర్దేషిర్. యం. ఇరానీ. దీన్ని బొంబే మెజస్టిక్ సినిమాలో తొలిసారి ప్రదర్శించారు.

ఇక తెలుగులో కూడా టాకీ యుగం 1931 లోనే ఆరంభమైంది. దీనికి నాంది పలకినవాడు హెచ్. యం. రెడ్డి. బొంబాయిలో ఇంపీరియల్ కంపెనీ పేరు మీద భక్త ప్రహ్లాద నిర్మించాడు.

ధర్మారావు తెలుగు చలనచిత్ర రంగం మొదటిదశలోనే అందులో ప్రవేశించాడు. మద్రాసులో పత్రికల్లో వ్యాసాలు రాస్తూండే సమయంలో అప్పుడప్పుడే ఈ రంగం రూపు కట్టుకుంటోంది. ఈ రంగం అనేక కళల సమాహారరూపం కనుక ఎందరో సాంకేతికులు అవసరం అవుతారు. రచయితల అవసరం ఇక చెప్పక్కర్లేదు. ధర్మారావు, వారి చుట్టూ ఉండే మిత్రులూ సహజంగానే రచయితలు కనుక ఇందులో వెంటనే ప్రవేశించక తప్పలేదు. దీనికితోడు అప్పటి రాజకీయాల్లో ధనవంతులూ, భూస్వాములూ, జమీందార్లూ ఉండే పక్షానికి ధర్మారావు సన్నిహితులుగా ఉండేవారు. ఈ రంగం డబ్బున్న వాళ్ళమీదే ఆధారపడి ఉండేది కనుక ఆ తరహా రాజాలందరూ ఇటువైపు దృష్టి, డబ్బూ ప్రసరింప చేశారు వాళ్ళకు మిత్రులైన వాళ్ళందర్నీ ఈ రంగంలోకి ప్రవేశపెట్టారు ఆవిధంగా రామబ్రహ్మం, ధర్మరావు తదితరులందరూ ఇందులో తొలి దశలో అడుగుపెట్టారు. దీన్ని గురించి చర్చించే ముందు క్లుప్తంగా ఈ రంగం పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవటం అవసరం.

సినిమా అత్యంతాధునికమైంది. 19వ శతాబ్దంలోనే ఆవిర్భవించింది. కొన్ని ఛాయాచిత్రాల ఆధారంగా కదిలే వస్తువుల భ్రాంతిని కలిగించవచ్చని ఇంగ్లండ్ దేశస్థుడు ఫ్రీజ్ గ్రీన్ 1887 వ సంవత్సరంలో ఒక కెమేరాను కనిపెట్టాడు. తర్వాత 1890 - 1891 సంవత్సరాల మధ్య అమెరికా శాస్త్రవేత్త ఎడిసన్ 'కినిటోస్కోప్'ను తయారుచేశాడు. అదే నేటి సినీప్రొజక్టరుకు ప్రథమ రూపం దాంతో ప్రపంచంలో చలనచిత్రాలకు (మూకీ) ఆస్కారం కలిగింది.

భారతదేశంలో దాదాభాయి ఫాల్కే 1912 లో 'హరిశ్చంద్ర' మూకీ చిత్రాన్ని నిర్మించాడు. అయితే మరో రకంగా చూస్తే రఘుపతి వెంకయ్యే ఆదిపురుషుడనాలి. వీరు 1910 లోనే 'క్రోనో మెగాఫోన్' అన్న యంత్రాన్ని దిగుమతి చేసుకొని తెరమీద బొమ్మలు కదలడం చూపిస్తూ అనేక దేశాలు పర్యటించాడు. ఈ వెంకయ్య తన కుమారుడు ప్రకాశ్‌కు విదేశాల్లో ఈ సంబంధమైన సాంకేతిక శాఖల్లో తర్ఫీదు ఇప్పించి 1920 నుండి భీష్మప్రతిజ్ఞ, నందనార్, గజేంద్ర మోక్షం వంటి మూకీ చిత్రాలు తీశాడు. ఏలూరు జమీందారు మోతే నారాయణరావుతో కూడా కల్సి ఈ ప్రకాశ్ 1925 లో దక్షిణాదిన ఫిలిం నిర్మాణానికి చాలా ప్రయత్నాలు సాగించాడు. అవి సఫలమైనట్టు కన్పించదు. దక్షిణ భారతాన ఈ విధంగా 1910 - 1925 ల మధ్య ఈ రంగంలో కొంత కృషి మూకీ నిర్మాణాల దశలో సాగింది. ఇలాటి పరిస్థితుల్లో ఇరానీ 1931 లో తొలి టాకీని నిర్మించి భారత చలన చిత్ర రంగంలో విప్లవం సృష్టించాడు.[132]

ఈ సమయానికల్లా మద్రాసులో సినిమా థియేటర్ల నిర్మాణం కూడా ఆరంభమైంది. మూకీలు దక్షిణాది భాషల్లో చాలా తయారవటం మొదలైంది. ఎప్పుడైతే టాకీ రంగంలో ప్రవేశించిందో దాని మోజు దక్షిణాది చిత్రరంగం మీద కూడా పడింది. భాషకు ప్రాధాన్యం వచ్చింది. ఇంపీరియల్ ఫిలిం కంపెనీ పేరు మీద హెచ్. యం. రెడ్డి బొంబాయిలోనే 'భక్తప్రహ్లాద' మొదటి తెలుగు టాకీగా నిర్మించి విడుదల చేశాడు (1931). తర్వాత ఈస్టిండియా ఫిలిం కంపెనీ ఆధ్వర్యంలో సి. పుల్లయ్య దర్శకత్వంలో సావిత్రి, లవకుశలు వచ్చాయి (1934). ఇవన్నీ బ్రహ్మాండంగా విజయయాత్ర సాగించాయి.

1934 లో బందరు వాస్తవ్యులు పి. వి. దాసు 'వేల్ పిక్చర్స్ లిమిటెడ్' అజమాయిషీలో మద్రాసులో ఒక స్టూడియోను నిర్మించటంతో నిర్మాణ రంగం బొంబాయి నుండి మద్రాసుకే వచ్చింది. అందులోనే దక్షిణాదిన నిర్మించిన మొదటి తెలుగు టాకీ చిత్రం 'సీతా కళ్యాణం' తయారైంది. క్రమంగా కృష్ణలీల, మాయాబజారు వంటివి తయారయ్యాయి. ఇప్పటికి తెలుగు టాకీ నిర్మాణం బొంబాయి నుండి దక్షిణాదికి వచ్చింది.

ఆరోజుల్లో పౌరాణిక, జానపద కథల్నే సినిమా వస్తువులుగా స్వీకరించేవారు. అదికూడా రంగస్థలం మీద ప్రజాదరణ పొందిన నాటకాలనే సినిమాలుగా తీశారు. అందులో నటించినవాళ్ళనే ఇందులో కూడా నటించమనేవారు.

ఇలా ఉండగా '936 లో 'ప్రేమ విజయం' అన్న సినిమా తెలుగులో విడుదలైంది. ప్రజాదరణ పొందలేదు. ఇతివృత్తం మాత్రం సాంఘికం. మొదటి

సాంఘిక చిత్రంగా దీన్ని భావించవచ్చు. ఇందులో భాష పూర్తి గ్రాంథికం. ఇండియన్ ఆర్ట్ సినీటోన్ బానర్ కింద కృత్తివెంటి నాగేశ్వరరావు దర్శకత్వంలో దీన్ని తీశారు.[133] వెంటనే 1937 లో బి. యన్. రెడ్డి, కె. వి. రెడ్డి, నాగయ్య, కన్నాంబ, సముద్రాల, కడారు నాగభూషణం వంటి ప్రముఖులు మరికొందరి సహకారంతో 'గృహలక్ష్మి' విడుదలైంది. ఇదీ సాంఘికమే. దీన్ని బాగా ఆదరించారు ప్రజలు. దాంతో తెలుగు సినిమాలలో సాంఘిక ఇతివృత్తాలు చోటుచేసుకోవటం ఆరంభించాయి

కమ్మ చరిత్ర రాయాలని గూడవల్లి రామబ్రహ్మం, కొసరాజు, సముద్రాల మద్రాసొచ్చారు 1928-1930 ల మధ్య. అదెటు పోయిందో కానీ ప్రజామిత్ర ఆరంభించారు. అది నడుస్తూండగానే సినిమాల మీద రామబ్రహ్మం గారికీ, వారి చుట్టూ ఉన్న ప్రజామిత్ర బృందానికీ మనసు పోయింది. దాంతో సారథి ఫిలిమ్స్ పేరు కింద 'మాలపిల్ల' సినిమా నిర్మించాలని తలపెట్టారు. (1938). చలం రాసిన కథ ఆధారంగా స్క్రిప్టు - సంభాషణలు ధర్మారావు రాశాడు (కృష్ణా పత్రిక 26.2.1938). ధర్మారావే ఒకచోట అన్నట్టు అప్పుడు హరిజనోద్యమం ముమ్మరంగా సాగుతోంది.[134] బ్రాహ్మణేతర ఉద్యమం కూడా పతాకస్థాయినందుకొంది. జానపద పౌరాణికాలనుండి గండి కొట్టుకొని వచ్చిన సాంఘిక ఇతివృత్తం 'మాలపిల్ల'ది. వీటన్నిటిపైనా ఆ సినిమా బాగా నిలదొక్కుకుంది. దీనికి భీమవరపు నరసింహారావు సంగీతం సమకూర్చాడు.[135] ఆనాటి హరిజనోద్యమానికి చాలా బలం కలిగించింది. ధర్మారావు ఆశయాదర్శాలకు తగిన కథావస్తువు. అందువలన మాటల రచనలో ప్రాణం పోశాడు. సనాతన బ్రాహ్మణ కుటుంబాలవాళ్ళు తమ పిల్లల్ని ఈ సినిమా చూడనిచ్చేవాళ్ళు కాదు. దొంగతనంగా చూసేవాళ్ళు.[136] ఇందులో ధర్మారావు కొన్ని పాటలు కూడా రాశాడు.

ఈ సంస్థే 1939 లో రైతుబిడ్డ నిర్మించింది. జమీందారీ పద్ధతిని విమర్శించే చిత్రం ఇది. ఆ సంవత్సరంలోనే అసెంబ్లీలో ప్రకాశం బిల్లు వస్తోంది. ఇది ప్రచారసాధనంగా ఉపయోగపడుతుందనుకున్నారు. రాబోయే ఎన్నికల్లో జమీందార్లకు వ్యతిరేకంగా దీన్ని ఉపయోగించుకోవచ్చని కొందరనుకున్నారు. అంతే, జమీందార్ల భూస్వాముల ఆగ్రహానికి ఇది గురైంది. దీన్ని నిషేధించటానికి శాయశక్తులా కృషిచేశారు. దీన్ని నిషేధించకూడదని చాలా కార్మిక సంఘాలూ అవీ ఆందోళన చేశాయని ఓ సమీక్షకుడు ఓ పత్రికలో ఆనాడు రాశాడు.[137] పదకొండు జిల్లాల్లో విడుదలకు సిద్ధమైంది. బొబ్బిలి, వెంకటగిరి రాజాలు నిషేధించమంటూ నోటీసులిచ్చారు.

విడుదల తేదీ 27-8-1939. తమ ఎస్టేట్లలో దీన్ని ప్రదర్శించరాదని జిల్లా మెజిస్ట్రేట్లను పట్టుకొని తమ అధికారం చూపి నిషేధం సంపాదించు కున్నారు. గూడూరు డివిజన్‌లో చెక్కసన్ కంపెనీ డేరాలో జరుగుతున్న దీని ప్రదర్శనలాపాలని వెంకటగిరి రాజా చాలా దౌర్జన్య పద్ధతులవలంబిం చాడు. కోర్టులో దావా వేశాడు. కానీ ప్రజల్లో 'రైతు బిడ్డ' చాలా ప్రభావం కలిగించింది. ఇందులో గిడుగు సీతాపతి, కొసరాజు తదితరులు నటించారు. రచన తాపీ ధర్మారావు, గోపీచంద్‌లు చేశారు. అందులో హాస్యరచనా భాగం మల్లాది విశ్వనాథ శర్మది కొసరాజు - తాపీ పాటలు రాశారు. చాలా ప్రజాదరణ పొందాయి.[138] అందులో, 'ఎల్లాగెక్కువా?' అన్న వీరి పాటకు నెల్లూరు ప్రాంతం ప్రజలు వెంకటగిరి రాజా మీద పారడీ గట్టి పాడు కునేవాళ్ళు.

"ఎల్లాగెక్కువా? ఇంకెల్లాగెక్కువా?
సద్యూకున్న వెంకటాయలు రైతూ బిడ్డా సుబ్బన్నకంటె
ఎల్లాగెక్కువా? ఇంకెల్లాగెక్కువా?"

ఇంతటి చైతన్యం చూపి ఆ ప్రాంతంలో దీన్ని ఆడించుకున్నారు. జమీందారీ వ్యతిరేక పోరాటంలో ప్రజలు అలా పాల్గొన్నారు[139] పర్లాకిమిడి, బొబ్బిలి సంస్థానాల్లో దీన్ని నిషేధించారు. కొందరు జమీందార్ల అండదండలతోనే ఇంతటి మహత్తర సాంఘిక చిత్రాన్ని నిర్మించిన ఘనత రామబ్రహ్మానిది.[140] తమ మిత్ర బృందమంతా రాజాలూ, జమీందార్లూ అయినా జమీందారీ వ్యతి రేక పోరాట చిత్రంలో జంకూ గొంకూ లేకుండా రచన సాగించిన ధర్మారావు నిర్భయత్వం, నిర్మొహమాటం కూడా చక్కగా తెలుస్తుంది.

ధర్మారావు సినీ రచయితగా స్థిరపడ్డారనవచ్చు. మోహినీరుక్మాంగద (1936 నేషనల్ మూవీటోన్ వారిది) వీరు రచన చేసిన మొదటి చిత్రం. అదీ రామబ్రహ్మం ప్రోద్బలంమీదనే చేపట్టాడు. మొత్తం రచనకు రు. 500/ లు ఇచ్చాడు ఆ రోజుల్లో ధర్మారావు ఆర్థికంగా చాలా కష్టాల్లో ఉండేవాడు.[141] అప్పుడే సి. పుల్లయ్యతో పరిచయం ఏర్పడింది. వారి 'సారంగధర'కు కూడా రచన చేశాడు (1937). అన్ని విషయాలూ చాలా కూలంకషంగా ఇతరులతో చర్చించంది ధర్మారావు రచనకు ఉపక్రమించేవాడు కాదు. చర్చలు చాలా పాండిత్యవరంగా సాగుతూండేవి.[142] సారధివారి ఇల్లాలు (1940) లో మాటలు, పాటలు రాశాడు. కస్తూరి వారి అపవాదు (1941)లో పాటలు రాశాడు. శిలప్పదికారం అంటే ధర్మారావుకు చాలా అభిమానం. దాన్ని కథగా సమదర్శినిలో రాశాడు. దాన్నే సారధి వారు 1942 లో 'పత్ని'గా తీస్తే

సంభాషణలు రాశాడు. దీన్నే తర్వాత కొందరు అరవంలో "కణ్ణగి" అని నిర్మించారు. ఆ రోజుల్లో సినిమాల్లో పాటలు కాస్త ఎక్కువగానే ఉండేవి. సముద్రాల కూడా రచన చేస్తూండేవారు.

బి. ఏ. సుబ్బారావు తీసే చిత్రాలకు మొదటినుండి స్క్రిప్టు ధర్మారావే రాస్తూండేవాడు. ధర్మారావు న్యూయింగ్టన్ కళాశాలలో పనిచేస్తున్నకాలంలో మీర్జాపూర్ రాజా వీరి శిష్యులు. తర్వాత శోభనాచల స్టూడియో పెట్టి ఆయన తీసిన దాదాపు అన్ని సినిమాలకూ ధర్మారావు మాటలో, పాటలో రాశాడు. అన్నీ విజయవంతమయ్యాయి. గొల్లభామ (1947), కీలుగుర్రం (1949), తిలోత్తమ (1951), మొదలైనవి.

మహాత్మా గాంధీ జీవితంమీద హేమలతా వారు నిర్మించిన డాక్యుమెంటరీ చిత్రానికి (1941) చాలా చక్కగా ఉద్వేగపూరితంగా వ్యాఖ్యానం రాశాడు.

1943 లో వచ్చిన కృష్ణప్రేమలో పాటలు - మాటలూ రాశాడు. సరికొత్త భావాలను ఇరికిస్తూ -

"ఎక్కడున్నావే పిల్లా ఎక్కడున్నావే?
కంటిపాప గుడ్డులోన సెలయేటి కడుపులోన"

-అంటూ భావస్ఫోరకంగా రాశాడు.

కె. యస్. ప్రకాశరావు చిత్రాలలో చాలావాటికి ధర్మారావు పనిచేశాడు. ద్రోహి, మేలుకొలుపు, మొదటిరాత్రి, దీక్ష మొదలైన నాటికి మాటలూ పాటలూ రాశాడు. సినిమాలకు 'స్క్రీన్‌ప్లే' అంటూ రాసే ఆచారం ద్రోహితో ఆరంభం అయింది. దానికి ధర్మారావే ప్రారంభకులు. ధర్మారావు రాసిన పాటలు గుండెల్లోనుండొచ్చే మాటల్తో ఉంటాయన్నది ఆనాటి వారిసమకాలిక వ్యక్తుల నమ్మకం.[143]

ఈ చిత్ర నిర్మాణ సందర్భంగా కలకత్తా బొంబాయి నగరాలకు అనేక సార్లు ధర్మారావు వెళ్ళొచ్చాడు. అలా వెళ్ళిన ఓ సందర్భంలో బొంబాయిలో ధర్మారావుతో కొడవటిగంటి కుటుంబరావు మొదటిసారి ప్రత్యక్ష సంబంధం పెట్టుకున్నాడు. అలాగే కలకత్తా వెళ్ళినప్పుడు బి. వి. రామానందం ద్వారా ప్రముఖ దర్శకుడు బి.ఏ. సుబ్బారావుకి ధర్మారావును కలుసుకోవటంతో వారి అనుబంధం చివరిదాకా కొనసాగటం జరిగింది. అంతేకాదు బి. ఏ. సుబ్బారావుకు ఓ ముస్లిం కన్యతో పెళ్ళి జరిపించడంలో కూడా ధర్మారావు పాత్ర ఉంది. భానుమతి, రామకృష్ణల వివాహ సందర్భంలోనూ తాపీవారి చెయ్యి ఉంది.[144]

చిత్రరంగంలో కూడా సంస్కరణ వివాహాలు చేయించడం ధర్మారావు మానుకోలేదని వీటినిబట్టి తెలుస్తుంది.

బి. ఏ. సుబ్బారావు తీసిన పల్లెటూరిపిల్లకు మాటలూ - పాటలూ ధర్మారావు రాశాడు. అది షెరిడన్ నాటకం 'పిజారో'కు అనుసరణ. కానీ ఎక్కడా ఆ ఛాయలు కనిపించకుండా తెలుగుదనంతో నింపాడు. పల్లెటూళ్లలో ఉండే దౌర్జన్యవాదులకు గుణపాఠం చెప్పే వస్తువు అందులో ఉంది (1950). ఇది వచ్చిన రోజుల్లో తెలంగాణా సాయుధ పోరాటం సాగుతోంది. ఈ సినిమా చూసి ప్రజలు ఇది కమ్యూనిస్టు చిత్రమంటూ చాలా ప్రశంసలు కురిపించారు. దాంతో విశాఖపట్నంలో 'ప్లాంటర్స్ అసోసియేషన్' వాళ్లు దీన్ని నిషేధించాలని ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చారు. సినిమాను మంత్రులందరూ చూశారు. ముఖ్యమంత్రి మాధవమీనన్, చీఫ్ జస్టిసు రాజమన్నారు కూడా చిత్రం చూశారు బాగా అభినందించారు. ఆ అభిప్రాయాలను ధర్మారావు సూచనల మేరకు పత్రికల్లో వేశారు. అంతే - నిషేధించే ప్రతిపాదనను ప్రభుత్వం విరమించుకుంది.

అప్పుడు సెన్సారుబోర్డులో ధర్మారావు మిత్రులు పందిరి మల్లికార్జునరావు ఉండేవాడు. దీన్ని చాలా 'కట్' చేశారు. తాపీ వెళ్ళి ఆయన్ను కారణం అడిగాడు ఆ సమాధానం ధర్మారావుకు నచ్చలేదు. వెంటనే 'అందుకేనయ్యా మిమ్మల్ని చూడంగానే మంగళ్లొస్తున్నారంటాం' అన్నారు చమత్కారంగా తాపీ. అందులో హాస్యానికి మల్లికార్జునరావు నవ్వుకున్నాడు.145

ఆ రోజుల్లో ప్రభుత్వం ప్రజానాట్యమండలి కార్యక్రమాలను చూసి బెదిరి దాన్ని నిషేధించింది. ఆ సమయంలో ఆ సంస్థలో కళాకారులందరూ సినిమాల కెళ్ళారు-ప్రవాసంగా. ఆకాలంలో చాలామందిని ధర్మారావు తన పలుకుబడి చూపి అనేక సినిమా సంస్థల్లో ప్రవేశపెట్టాడు.

ఎక్కడున్నా యువకులను ప్రోత్సహించే గుణం ధర్మారావుది. ఆరుద్రను అలాగే చాలావాటికి తనతో కలిసి రాసేలా చేశాడు.146 అలాగే రాజూ - పేదా రచన సాగిస్తూ ధర్మారావు పినిసెట్టిని బాగా ప్రోత్సహించాడు.147

మద్రాసులో బాంబులు పడ్డ కాలంలో మద్రాసొదిలి విజయవాడ వెళ్ళిన కాలం తీసేస్తే 1958 లో హైదరాబాదు వెళ్ళి స్థిరపడేంతవరకూ సినిమారచన సాగించాడు ధర్మారావు. సుమారు నలభై చిత్రాలకు మాటలు కానీ, పాటలు కానీ, చిత్రానువాదం కానీ, అజమాయిషీ కానీ చేశాడు. చాలా చిత్రాలు బాగా డబ్బు చేసుకున్నాయి. వాటిల్లో మాలపిల్ల, రైతుబిడ్డ, కృష్ణప్రేమ, ఇల్లాలు, ధర్మాంగద, కీలుగుర్రం, గొల్లభామ, ద్రోహి, మంత్రదండం, దీక్ష, సారంగ

ధర, నారదనారది, ఎం. ఎల్. ఏ., ఎత్తుకు పై ఎత్తు, అంతా మనవాళ్ళే, పల్లెటూరి పిల్ల, రాజూ - పేద, ముద్దుబిడ్డ, నమ్మినబంటు, రోజులు మారాయి, భీష్మ చాలా ముఖ్యమైనవి.

బి.ఏ.సుబ్బారావు నిర్మించిన భీష్మ ధర్మారావు రాసిన చివరిచిత్రం(1963). దీని నిర్మాణం చాలా కాలం కొనసాగింది. ఎవరో ధర్మారావును 'ఇంకా ఎంత కాలంలో పూర్తవుతుందండీ భీష్మ ?' - అని అడిగారట. వెంటనే 'ఒకరు ఆదుర్దా మరొకరు తాపీ, దాని అంతు ఒక పట్టాన తెములుతుందా' అంటూ గలగలా నవ్వేశారట. ఈ చిత్రానికి ఆరుద్ర కూడా పనిచేశాడు.

సినిమా ఆరంభకాలంలో నాటక రచయితలే ఈ రంగానికి వచ్చారు. బలిజేపల్లి, సముద్రాల వంటి వాళ్ళు. ఇది కళకు సంబంధించిన ఒక కొత్త 'ఫారం'. వీళ్ళకు అంతగా అంగ్ల సాంకేతిక పరిజ్ఞానం, పరిచయం లేదు. రచనలో అంత్యానుప్రాసలూ, యమకాలతో రచన నాటక ఫక్కీలోనే చేసేవాళ్ళు ఈ అలంకారాలతో ఆ రచనలూ పేలేవి.148

ధర్మారావు రచనలో సంభాషణల్లో అలంకారాలు తక్కువగా ఉంటూ గుండెల్లోంచి వస్తున్నట్టుగా చాలా స్వాభావికంగా ఉండేవి. సినిమాకు 'ట్రీట్ మెంటు' చాలా ముఖ్యం. ధర్మారావే ఆ పద్ధతిని ఆరంభించారు. అందులో సమస్తమూ విపులంగా రాసేవారు. ఇప్పటి రచయితలు ట్రీట్ మెంటు జోలికి అంతగా పోరు. ఆత్రేయ లాంటి కొద్దిమంది అలా రాస్తారు. ఈ రచయితల్లో తాతాజీ స్కూలు, సముద్రాల స్కూలు అని రెండుగా విభజించి చూస్తే నేటి సినీ రచయితలు దేనికి చెందరంటూ ప్రముఖ చిత్ర నిర్మాత భావనారాయణ అభిప్రాయపడ్డారు.

రచయితకు చిత్ర నిర్మాణంలో దర్శకుడితో సమాన హోదా ఇవ్వటం హాలీవుడ్ సంప్రదాయం. ఈ హోదా చిత్రరంగం తొలినాళ్ళలో తన ప్రతిభా వ్యుత్పత్తుల ఆధారంగా ధర్మారావే సాధించుకున్నాడు.149 ధర్మారావు దృష్టిలో ''సినిమా పదిమంది కలిసి చేసే పని- రచయిత మాత్రమే బాధ్యుడు కాడు'' - అంటాడు. మొదటి దశలో దాని బాగోగులకు రచనా, రచయితే బాధ్యుడుగా దర్శకులూ, నిర్మాతలూ భావించేవారని పుల్లయ్య తన సినిమా అనుభవాన్నంతా కాచి వడపోసి చెప్పారు. ఆ రచన జనరంజకంగానూ, పాత్రోచితంగానూ ఉండటానికి ధర్మారావు చాలా శ్రమించేవారని, దీక్షతో కృషిచేసేవారని సినీరంగ ముఖ్యుల అభిప్రాయం.

ఇల్లాలు చిత్రానికి రచన చేస్తుంటే తాపీవారిదగ్గర ఆఫీసుబాయ్‌గా జైహింద్ సత్యం ఉండేవాడు. తాపీవారు రచన సాగిస్తూ కాల్చుకోటానికి పక్కన చుట్టలు

పెట్టుకుంటూండేవారట. రచనలో మునిగిపోయి కొంత సేపటికి పక్కన చూస్తే చుట్టలు ఖాళీ అయ్యేవి. ఏం భాయి ఇవన్నీ నేనే తాగానా? - అని అడిగితే కాదు సార్ మీరు రాసుకుంటుంటే వీటిని నేను తాగుతున్నానంటూ సత్యం జవాబు. ఇదేమీ గమనించనంత ఏమేకంతో రచన చేసేవారు తాతాజీ.150

అయినా నిర్మాణంలో డైలాగులేవన్నా మార్పుల్కి వస్తే నవ్వుతూ మార్చేసే అలవాటు ధర్మారావుకు అబ్బింది. ముద్దుబిడ్డ నిర్మాణంలో ఒక డైలాగు దగ్గర నటీమణికీ దర్శకుడు తిలక్‌కీ అభిప్రాయభేదం వచ్చింది. ధర్మారావు అంటే తిలక్‌కు దైవభావం. డైలాగు మార్చటానికి అంగీకరించక నటిమణినే మార్చటానికి కూర్చున్నాడు దర్శకుడు. ఇది ఆరుద్ర తాపీ చెవిన వేశాడు. వెంటనే ఆయన "భాయీ, నారీజనాన్ని పూజించేచోట దేవత లుంటారట. వెధవ డైలాగుకేం భాగ్యం. బిగువుగా ఉన్నాయంటే కుట్లు ఊడదీసి మళ్ళీ కుట్టేస్తాం. సినిమా రచయితలం సాహిత్య దర్జీలం కదా" - అంటూ మొత్తం ఆ నిర్మాణాన్ని ఓ ఒడ్డుకు చేర్చాడు.151 తగాదా ముగిసింది.

సినీ రచనను ఆధునికంగా, వ్యావహారిక భాషలో నడిపింది ధర్మారావు. ఇలా రచన సాగించటంలో తమకు వరవడి పెట్టి నేర్పింది ధర్మారావేనంటూ సముద్రాల, ధర్మారావు 70వ జన్మదినోత్సవ సభలో మాట్లాడుతూ చెప్పాడు.152 నిర్మాతలు పెట్టిన లక్షల ధనం నష్టపోకుండా చూడాలన్న ఆకాంక్ష వీరి కుండేది. ద్రోహి విషయంలో సెన్సారువాళ్లు ప్రమాదం కలిగించబోతున్నారని తెలిసి ధర్మారావు అందులో చాలా భాగాలు కట్ కాకుండా ఎంతో కృషి చేశాడు.153 దీన్ని సెన్సారువాళ్ళు మూడుసార్లు చూశారు.154

తాతాజీ తన సినిమా రచనల్లో అవకాశం వచ్చిన చోట్లల్లా సంస్కరణ భావాలూ అవీ చొప్పించటానికి ప్రయత్నించేవారు. ద్రోహిలో ఒక పాత్ర - సీత పాడిన పాటలో -

"ఇదియేనా నీ న్యాయం దేవా ఈ పలపక్షము తగునా
పాలూ నేయీ కొందరికిచ్చి పల్చని గంజి లేకెందరినో
పస్తులతోపడి చావమందువా దేవా?
పేరులు చీరలు కొందరికిచ్చి పేలికలైనా లేకెందరినో
మానహానితో బతకమందువా దేవా?"

అంటూ సూటిగా దేవుణ్ణే ప్రశ్నిస్తుంది.

అదే విధంగా మాలపిల్ల చిత్రంలో హరిజన సమస్యను తీసుకుంటూ ఇలా రాశాడు.

"మాలలు మాత్రము మనుషులుకారా భారతపుత్రులు వేరా
ఏడుకోట్ల హరిజనులే తొలగిన ఏమగు మతమని కనరా
మాలను కోసిన రక్తం రాదా నీలోనున్నది పాలా ?
మానరోషములు అనురాగములును మాలకు కలవస వేలా ?
ఈభేదమేలా సుజనులారా భేదమేలా
సుందర భారతి జనని ముఖానా ఇట్టి కళంకము తగునా ?
అంటు దోషమట ఇకనీ జగమున ఏయెడ కనుగొననగునా ?"

- అని మానవుల గుండెల్లో గునపంలా ప్రశ్నను గుచ్చాడు.

అలాగే లోకంలో ఆర్థిక అసమానత్వం - అపాత్ర గౌరవాలను ఈసడిస్తూ సందర్భం కలిగించుకొని ఇల్లాలు చిత్రంలో ఓ పాట ఇలా రాశారు-

"మన లోకపు లీలా నటనా ఒక బొమ్మల ఆటయె కాదా
అతడొక రాజూ, వీడే కూలి - కాదని నేననినా అదేగా
... ... .. .. . ... ... .. . ....
పాత్రునకార్తి,పందకు కీర్తి శాస్త్రములేమాయె వేడుకయో ...మరియేదో".

తిలోత్తమలో అయిదు భాషల్లో ఒక పాట రాశాడు. కన్నడం, అరవం, మళయాళం, హిందీ, తెలుగు చరణాలుంటాయి. ఈ సినిమాలో అడవి తిలోత్తమ పాత్రకు అతి సహజంగా ఉండే గిరిజన మాండలికంలో పాట రాశాడు. పాత్రోచిత భాష సినిమారంగంలో మొదటిసారి 1936 లో వచ్చిన ప్రమీలార్జునీయంలోవాడారు. కొండవాళ్ళకు సవరభాష అందులోపెట్టారు.[155] అప్పటికన్నీ గ్రాంథికబాషలో వస్తుండేవి ధర్మారావు ఇంకా రంగ ప్రవేశంచేసి వ్యావహారిక బాషనుప్రవేశ పెట్టలేదు. ధర్మారావు పాటలు క్లుప్తంగా, భావప్రపూరితంగా ఉంటాయి. భాష మీద అధికారం ఉన్నవాడి రచనలా సాగుతుంటాయి.[156] ప్రజాస్వామ్యంలో నాటి కాంగ్రెసు పాలకులు పంచాయితీలను ఎలా అర్థంలేనివిగా తయారుచేశారో తాతాజీ 'ఎత్తుకు పై ఎత్తు' చిత్రంలో ఓ సన్నివేశం సృష్టించి విమర్శించారు. పంచాయితీ సభ జరుగుతుండే ఎవరోఒకరు 'లత్తుకోరు' అని అంటారు. ఇక సభ్యులందరూ ప్రజల సమస్యలనొదిలి 'లత్తుకోరు' అన వచ్చునా లేదా అని చాలా తీవ్రంగా చర్చించటం ఈ దృశ్యంలో ప్రదర్శిస్తారు. ఇలా దాని డొల్ల రాజకీయాలను బయట పెట్టారు - అని పరుచూరి హనుమంతరావుగారు అంటారు.

సినిమాలోకంలో ధర్మారావును తాతాజీ అంటూ చాలా గౌరవంగా పిలుస్తూంటారు. అదే అన్ని రంగాల్లోనూ వీరికి మారుపేరై స్థిరపడింది. ధర్మారావు తనకు 1956 లో మద్రాసులో సాహిత్యవేత్తలూ, సినీజగత్తు వ్యక్తులూ రిపిన 70 వ జన్మదిన వేడుకల్లో మాట్లాడుతూ ఇలా అన్నారు-




Fig. 231.—Phallic symbols still used on our houses.

ther forms of trinities, not so distinctly or coarsely se

29 భారత దేశంలో అన్ని ప్రాంతాల్లో ఉపయోగించే సౌభాగ్యవర్ధక చిహ్నాలు.

Sexual union was symbolized by yonic and lingam symbols joined in various ways. These illustrations are, most of them, self-explanatory; the origin of the Latin cross was a phallic pillar with a yonic ring around it, which, in profile, looks like a cross. The 10 is a mystic esoteric sign; it means: "Man without




Fig. 340.—Symbols of sexual union; the lingam-in-yoni and the Arba are signs of union; the symbol of wisdom is a male and female triangle joined by the serpent, or passion.



Fig. 341.—Symbols of sexual union; the last one is interpreted: man without woman is one, woman without man is nothing, together they are many (ten).

30 స్త్రీ, పురుష జననాంగాల రూపాలలో ప్రపంచమంతటా ఇలాంటి చిహ్నాలను ఆరాధించడం ఉంది.



31. ముగ్గుల్లో కోణాలన్నీ స్త్రీ సౌభాగ్యవర్ధక చిహ్నాలే.



32 హిందూఅర్ధనారీశ్వరుడి రూపకల్పన.

"సినిమాకు నేనెలా వచ్చానంటే అప్పటికి నాకు రొట్టె ఉంది. దానికి కాస్త వెన్న ఉంటే బావుంటుందనిపించింది. వచ్చేశాను. పాత్రల సంభాషణలో గూఢార్థం దానంతటికదే రావాలి. రాసి రప్పించకూడదు. సినిమాను టెక్స్ట్ బుక్‌గా చదివేవాళ్ళుండరు. కనుక సాహిత్యం అంతగా కనిపించకపోవచ్చు. అయినా ఇందులోనూ సాహిత్యసేవ చెయ్యవచ్చు. ఏ వృత్తిలో ఉన్నా - సేవకుడు - తన గొప్పతనాన్ని చూపించవచ్చు."[157]

ఇదీ క్లుప్తంగా తాతాజీ ఉద్దేశం. సినిమా గురించీ ఇందులోకి తన ప్రవేశం గురించీనూ.

## ఫిలిం జర్నలిజం

జర్నలిజంలో ఫిలిం జర్నలిజం అంటూ ఒకటి ఏర్పడింది. దీన్ని ఇప్పటివరకూ ప్రధానంగా అయిదు దశలకింద విభజించవచ్చు.

| | | |
|---|---|---|
| 1931 - 1936 | వరకూ | 1 |
| 1936 - 1942 | వరకూ | 2 |
| 1942 - 1950 | వరకూ | 3 |
| 1950 - 1956 | వరకూ | 4 |
| 1956 - నేటి | వరకూ | 5 |

చలన చిత్రాలను గురించి ప్రత్యేకంగా రాసే పత్రికలు మొదటి రోజుల్లో తెలుగులో ఉండేవికావు. అప్పటి కృష్ణా పత్రిక, ఆంధ్ర పత్రిక, సమదర్శిని పత్రికలే వీటి వార్తలను ప్రచురిస్తూండేవి. అప్పుడప్పుడు ఈ రంగానికి సంబంధించిన కొన్ని అంశాల మీద వ్యాసాలను అచ్చేస్తూండేవి. అవన్నీ కూడా ఆ చిత్రాల్లో ఉండే రచనా, అవి సమాజానికి ఉపయోగపడ్తాయా లేవా? అన్న అంశాల మీద కేంద్రీకరించిన వ్యాసాలనే ప్రచురించేవి. ఈ రంగంలో తాపీ ధర్మారావు, సముద్రాల రాఘవాచార్య,[158] గోపీచంద్, ఎస్. జి. ఆచార్య, బి. టి. నరసింహాచార్యు, బి. యన్. మూర్తి, కొడవటిగంటి, కాటూరి జగన్మోహన్, శ్రీనివాస చక్రవర్తి, కమలాకర కామేశ్వరరావు, జి. బాలసుందర రావులు చిత్రాల మీద బాగోగులను వ్యాసాల రూపంలో రాసేవారు. అవన్నీ

చాలా నిశితమైన విమర్శల్లాగుంటూండేవి. రాంబ్రహ్మం ప్రజామిత్ర ఆరంభించటంతో ఈరకం జర్నలిజానికి ఒక ఊపు వచ్చింది. రచనల్లో వ్యంగ్యం, కటువూ, హేళనా చోటు చేసుకుంటూ సామాన్య పాఠకులను కూడా ఈ విమర్శలూ - సమీక్షలూ ఆకర్షిస్తూండేవి అయితే సినిమాకోసం ప్రత్యేకంగా ఒక పత్రిక ఆవశ్యకతను గుర్తించి దాన్ని ఆరంభించిన ఖ్యాతి ఇంటూరి వెంకటేశ్వర్రావుకే దక్కుతుంది. వారు 1937 లో 'చిత్రకళ' అన్న పత్రికను ఆరంభించి కొన్నాళ్ళు నడిపారు. తర్వాత కొమ్మూరి సాంబశివరావు 'తెలుగు సినిమా' అన్న పత్రికను నడిపారు. ఇవే తొలి పత్రికలనవచ్చు. ఇవన్నీ మాస పత్రికలు. ప్రస్తుతం చాలా పత్రికలున్నాయి.[159]

ధర్మారావులా మొదటిదశలోనే వచ్చిన సినీ వ్యాస రచయితలందరూ సినీ స్క్రిప్టు రచయితలుగా స్థిరపడ్డారు. వారు సినీరంగానికి చెందిన వాళ్ల వటం వల్ల వాళ్ళ సమీక్షలూ విమర్శలూ చిత్రపరిశ్రమకు బాగా ఉపకరిస్తూండేవి. ప్రస్తుతం సినీ రచయితలు ఏదో విధంగా సినీ జర్నలిజాన్ని పరిపుష్టం చేస్తున్నారు. కానీ కొందరు కేవలం సినీ జర్నలిస్టులుగా ఉన్నవాళ్ళు సినిమా పరిశ్రమతో సంబంధం లేకుండా కూడా ఉంటున్నారు. ఈ రెంటిలో మొదటి రకం వ్యక్తులు పరిశ్రమకూ - సినీ జర్నలిజానికీ బాగా దోహదకారులు అవుతారు.

1957 లో మద్రాసులో ఫిలిం పరిశ్రమ రజతోత్సవాలు జరిగినప్పుడు దక్షిణభారత ఫిలిం జర్నలిస్టుల సంఘం తాపీ ధర్మారావు, ఇంటూరి తది తరులను ఇతర భాషా రచయితలను కొందరిని సన్మానించింది. వీరందరూ తొలి దశనుండి అప్పటివరకూ పరిశ్రమను కాపాడుకుంటూ వస్తున్న ప్రముఖులు.[160]

ధర్మారావు తొలి తెలుగు చిత్రాల రచయితగానూ, ఫిలిం జర్నలిజం వ్యాప్తికి తోడ్పడిన తొలినాటి జర్నలిస్టుగానూ చిత్రరంగ చరిత్రలో నిలిచి పోతాడు. అంతేకాదు ఆరుద్ర అన్నట్టు చిత్రాలలో వ్యావహారిక భాష ప్రవేశ పెట్టిన మహనీయుడుగా కూడా ఉండిపోతాడు. ఏటన్నిటినీ మించి అనాడు తాతాజీ చుట్టూ సామ్యవాద భావాలున్న యువకులూ, సమధర్మానికి జీవితాన్ని అంకితం చేసిన విప్లవకారులూ ఉండేవారు. వారి ఆశయాల్లో మంచిని తాను నమ్మి గ్రహించారు తాతాజీ వాటినే రాసి పెంపొందించి చిత్రరంగంలో కూడా ప్రవేశపెట్టినవాడుగా, అందుకు శాయశక్తులా కృషిచేసిన వ్యక్తిగా నిలిచి పోతాడు. వీరు ప్రకాశ్ స్టూడియోలో పనిచేస్తున్న కాలంలో శ్రీశ్రీ, ఆరుద్ర, సుంకర, వాసిరెడ్డి, ఆత్రేయ, నార్ల చిరంజీవి, అనిసెట్టి - వీళ్ళందరూ తాతాజీ చుట్టూ చేరి సాహిత్య చర్చలూ, సినీరంగ చర్చలూ సిద్ధాంత వాదోపవాదాలూ

సాగిస్తూండేవారు. అందుకే తాతాజీని గురించి "నేను వారిని పుస్తకంలాగా చదువుకొన్నాను" అని ఆరుద్ర అనగల్గాడు, వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ.

ధర్మారావు అలా సినీరంగంలో తనదంటూ ఓ ముద్ర వేసుకుంటూ పైమెట్టుకెళ్ళాడు. ఓసారి సముద్రాల (జూనియర్) హైదరాబాదు వెళ్ళి తాతాజీని చూడాలని చిక్కడపల్లిలో వారింటికెళ్ళారు. ధర్మారావు మేడ మీదున్నారు. కిందినుండే సముద్రాల ఎవరితోనో వారు కిందికి రాలేరా? అని అడుగుతుంటే తాతాజీ విన్నారు. అంతే "భాయ్ ఒకసారి ఎక్కితే ఏదైనా ఇక దిగను రా. నీవే పైకి"- అని చిరునవ్వుతో ఆహ్వానించారు సముద్రాలని.

నిజంగా అలాగే సుమారు ఇరవై సంవత్సరాలు ఆ సినీ రంగంలో దాదాపు నలభై చిత్రాలకు పనిచేసి 1963 లో భీష్మతో మానేశారు. వీరి చిత్రాలు అన్నీ ఆ రోజుల్లో శతదినోత్సవాలు జరుపుకున్నవే. అనేక బహుమానాలు తాతాజీకందించినవే. ఇంత కృషే వీరిని నంది అవార్డ్స్ నిర్ణేతగా ఓ పర్యాయం పనిచేసేలా చేసింది. (1964). ఇంతటి వారసత్వాన్ని వీరి కుమారుడు తాపీ చాణక్య అందుకున్నాడు. తారాపథంలో వెలుగుతున్న అత్యున్నతదశలో చాణక్య హఠాత్తుగా రాలిపోయ్యాడు (1973).

ధర్మారావు పేరు చిత్రరంగ చరిత్రలో కొన్ని అధ్యాయాల్లోనన్నా సువర్ణాక్షరాలతో భద్రపరచదగ్గ చరిత్రను సృష్టించుకొంది. అందులోనూ కొన్ని అంశాల్లో సిరీ చుక్కా పెట్టించుకున్న వ్యక్తి తాతాజీ.

## ఉద్యమాల ఊపిరితో ఎర్రకేక - సూచికలు

1. శ్రీ మరుపూరి కోదండరామిరెడ్డితో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
2. శ్రీ సి పుల్లయ్యతో ఇంటర్వ్యూ - మద్రాసు.
3. ధర్మారావు 70వ జన్మదినోత్సవ సభలో మోహనరావు ఉపన్యాసం టేపు - మద్రాసు. 1956
4. ప్రజామిత్ర - 1936 ఫిబ్రవరి 2.
5. ధర్మారావు 70వ జన్మదినోత్సవం టేపు, కృష్ణశాస్త్రి ప్రసంగం - మద్రాసు. 1956.
6. కృష్ణాపత్రిక. 1940 ఫిబ్రవరి 10.
7. శ్రీ పాలగుమ్మి పద్మరాజుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
8. కృష్ణాపత్రిక, 1940 జూన్ 29.
9. కాగడా వారపత్రిక, 1941 మార్చి 19.
10. రిపోర్టు, కాగడా వారపత్రిక, 1941 ఏప్రిల్ 2.
11. శ్రీ కె. యస్. ప్రకాశరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
12. ప్రజామిత్ర, 1942 సంక్రాంతి సంచిక.
13. కృష్ణాపత్రిక, 1942 మే 9.
14. ఏ. బి. కె. ప్రసాద్ వ్యాసం, శ్రీశ్రీ షష్టిపూర్తి సన్మాన సంచిక - విశాఖపట్నం. 1970.
15. శ్రీ తుమ్మల వెంకట్రామయ్యతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
16. ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభల సంచిక, 1943 మార్చి.
17. జనవాణి వారపత్రిక, 1952 సెప్టెంబరు 24.
18. శాంతి సంఘీభావ రాష్ట్ర సమితి ప్రధాన కార్యదర్శి శ్రీ కాట్రగడ్డ గంగయ్యతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
19. టంగుటూరి ప్రకాశం, నా జీవిత యాత్ర పేజి 139.
20. 1940 లో 7 వ మహాసభ మల్కాపురంలో ముందుముల రామచంద్రరావు అధ్యక్షతన జరిగింది. ఈ నడుమ 1938 లో హైదరాబాదులో 'కామ్రేడ్స్ అసోసియేషన్' అంటూ మఖ్దుం, రాజబహదూర్ గౌడ్, సయ్యద్ ఇబ్రహీం, ఆలం కుందుమిరి, బూర్గుల రామకృష్ణారావు ఒక సంఘంగా ఉండేవారు. ఫాసిజం గూర్చి, సోషలిజం గూర్చి చర్చోపచర్చలు సాగుతుండేవి. 1941 లో 8 వ మహాసభ చిలుకూరులో రావి నారాయణరెడ్డి

అధ్యక్షతన జరిగింది. అప్పటికే, అంటే 1939 నుండే ఆయన కమ్యూని నిస్టు పార్టీ సభ్యులు. ఈ సభల తర్వాతనే 'డిటెన్యూ డే' అనీ, 'విద్యా వారం' అనీ, 'వెట్టిచాకిరీ వ్యతిరేకదినం' అనీ కార్యక్రమాలు ఆందో ళన రూపం గ్రహించాయి. 1942 లో 9 వ మహాసభలు ధర్మవరంలో జరిగాయి. 1943 లో 10 వ మహాసభ హైదరాబాదులో కొండా వెంకట రంగా రెడ్డి అధ్యక్షతన జరిగింది. ఆపదవికి అతివాదయువకుల ప్రతినిధిగా బద్దం ఎల్లారెడ్డి పోటీ చేసి ఓడిపోయారు. 1944 లో 11 వ మహాసభ భువనగిరిలో రావి నారాయణ రెడ్డి అధ్యక్షతన జరిగింది. నాయకత్వం అతివాదుల చేతుల్లోకొచ్చింది. చంద్ర రాజేశ్వరరావు కూడా ఈ సభల్లో పాల్గొన్నారు. 1945 లో ఖమ్మంలో జరిగిన 12 వ మహాసభలకు కూడా రావి నారాయణరెడ్డిగారే అధ్యక్షత వహించారు. ఇది భరించలేక మిత వాదులు ముందుముల నరసింగరావు అధ్యక్షతన వేరొకసభ జరిపారు.

21. జనవాణి వారపత్రిక, 1951 డిసెంబరు 28.
22. జనవాణి వారపత్రిక, 1952 మార్చి 28.
23. శ్రీమతి తాపీ సరోజినితో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
24. అభ్యుదయ, 1956 మే.
25. ఒక తీర్మానంలో "అరసం ఉద్యమ స్థాపకుల్లో ప్రధానులు, ఈ సాహి త్యాభివృద్ధికి నిరంతరం కృషి చేస్తున్న తాపీ ధర్మారావును అరసం పెద్ద ఎత్తున సన్మానించాల"ని తలపెట్టింది. దాని ఏర్పాట్లకు మద్రాసు శాఖను కోరింది. తెలుగు సాహితీ ప్రముఖులందర్నీ ఆహ్వానించాలని భావించింది.

    అభ్యుదయ, 1956 అక్టోబరు.
26. బంగోరె, బ్రౌన్ జాబులు 1973 పేజి 69.
27. శ్రీ పురిపండా అప్పలస్వామితో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
28. గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, సారధి రామబ్రహ్మం (గూడవల్లి రామ బ్రహ్మం స్మారక సంచిక) తెనాలి 1980 పేజీ 17. దీన్ని బలపరిచే ఆధారం కె. వి. రమణారెడ్డి రాసిన 'కవి కోకిల' పుస్తకంలో పేజీ 135 లో "1921 తర్వాత రామిరెడ్డి మనస్సు కొంత కాలం జస్టిస్ పార్టీ వైపు మళ్ళిందేమో" అంటూ కారణం, కాంగ్రెస్ ఉద్యమాల వైఫల్యం, నిరాశ నిస్పృహలని అన్నారు - 1965.
29. గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, సారధి రామబ్రహ్మం (గూడవల్లి రామ బ్రహ్మం స్మారక సంచిక) తెనాలి 1980 పేజి 17.

30. జస్టిస్ పార్టీ అధికారంలోకి వచ్చి 1937 లో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడే వరకూ ముఖ్యమంత్రులుగా ఈ కింది వారు పని చేశారు. పానగల్ రాజా 1921 - .927; డాక్టర్ సుబ్బరాయన్ 1927 - 1930; డాక్టర్ మునుస్వామినాయుడు 1930 - 1932; బొబ్బిలిరాజా 1932 - 1937, సర్ కె. వి. రెడ్డినాయుడు 1937 లో కొంతకాలం.
జి. వెంకట్రామారావు, ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్య ఘట్టాలు. హైదరాబాదు 1979 పేజి 46.
31. అంతకు ముందు ఖద్దరునూ, రాట్నాన్ని తిట్టిన ఈ పార్టీ సర్ పాత్రో అధ్యక్షతన మదురైలో సమావేశమై రాట్నమూ ఖద్దరునూ ప్రోత్సహించాలని తీర్మానించింది.
కృష్ణా పత్రిక, 1927 జనవరి 1.
32. వెలివోలు సీతారామయ్య, గూడవల్లి రామబ్రహ్మం స్మారక సంచిక తెనాలి 1976.
33. శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరితో ఇంటర్వ్యూ - మద్రాసు.
34. తాపి ధర్మారావు, గూడవల్లి రామబ్రహ్మం స్మారక సంచిక తెనాలి 1976 పేజి 17.
35. "సమదర్శినిలో ధర్మారావు, అన్నాదొరైలు కలిసి పని చేస్తుండేవారు. వీరిద్దరూ ఆప్తమిత్రులు." కొసరాజు రాఘవయ్య చౌదరితో ఇంటర్వ్యూ-మద్రాసు.
36. దీన్ని ముద్దా విశ్వనాధం నడుపుతూండేవారు. 1941 జనవరి నుండి 1942 మార్చి వరకు వచ్చింది. ముద్దా విశ్వనాధంతో ఇంటర్వ్యూ - మద్రాసు.
37. పి. రాజేశ్వరరావు, స్టడీస్ ఇన్ హిస్టరీ ఆఫ్ తెలుగు జర్నలిజం 1968 పేజి 107.
38. ప్రజామిత్ర, 1936 ఫిబ్రవరి 9.
39. గోరెపాటి వెంకటసుబ్బయ్య, డాక్టర్ సి. ఆర్. రెడ్డి 1972 పేజి 139 - 146.
40. సంపాదకుడన్నాక అన్ని విషయాలూ తెలిసుండాలని బెర్నార్డ్ షా అభిప్రాయం.
గోరెపాటి వెంకటసుబ్బయ్య, సారధి రామబ్రహ్మం (గూడవల్లి రామబ్రహ్మం స్మారక సంచిక) తెనాలి 1980.

41. "అమాంగ్ ది తెలుగూస్ ఇట్ (ప్రింటింగ్) కమెన్స్‌డ్ అబౌట్ ది 1806 బట్ మేడ్ లిటిల్ ప్రోగ్రెస్ అంటిల్ 1830" - బ్రౌన్ తెలుగు ఇంగ్లీషు నిఘంటువు 1852 పీఠిక.
42. బంగోరె, బ్రౌన్ జాబులు 1973 పేజి 9-10.
43. నార్ల వెంకటేశ్వరరావు అభినందన సంచికలో ఆరుద్ర గుర్తించిన పేర్లు. 4 వ పేరు బాగానే కనిపిస్తోందని బంగోరె తన బ్రౌన్ జాబుల్లో ఫోటో స్టాట్ కాపీ ఇచ్చాడు.
44. కె. నటరాజన్ హిస్టరీ ఆఫ్ ఇండియన్ జర్నలిజం 1955 పేజీ 63-64.
45. దీన్నే గిడుగువారు గద్యచింతామణిలో (1933) మొదటి భాగంలో కొద్ది పదాల వాక్యాల తేడాతో ముద్రించారు.
46. బంగోరె, బ్రౌన్ జాబులు 1973 పేజి 13.
47. ఆచార్య తూమాటి దొణప్ప రాసిన 'నన్నయ అన్యదేశ్యాల'న్న 'సాహితి' లోని వ్యాసం ఆధారంగా.
48. 1842 ఆగస్టు 4, 18 తేదీల వర్తమాన తరంగిణి సంచికలలో ఆది పర్వం, మనుచరిత్ర, వసుచరిత్ర, అమ్మకానికున్నట్టు ఓ ప్రకటన ఉంది. పువ్వాడ(1852) వారి ఉత్తరాలద్వారా వెల్లడయిన'అచ్చయిందనే భారతానికి' ఇదే పూర్వంది.
బంగోరె, బ్రౌన్ జాబులు 1973 పేజి 44.
49. బంగోరె, బ్రౌన్ జాబులు 1973 పేజి 80, 81.
50. 1908 సెప్టెంబరు 9 నుండి బొంబాయి నుండి ఆంధ్రపత్రికను వార పత్రికగా కాశీనాధుని నాగేశ్వరరావు నడిపేవారు. అప్పుడు ఆ. నారాయణ రావు సంపాదకుడు. 1914 ఏప్రిల్ 1 నుండి దినపత్రికగా మద్రాసు నుండి వచ్చేది. 1910 నుండి సంవత్సరాది సంచికలను తెచ్చారు. 1921 నుండి సారస్వతానుబంధం ఆరంభించారు.
51. శ్రీ విద్వాన్ విశ్వంతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
52. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
53. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
54. తెలుగులో అచ్చు మొట్టమొదట శ్రీరాంపూర్ (బెంగాల్), మద్రాసు లలో ఒకేసారి 1807 లో మొదలైంది. పంచానన్ అతని మిత్రుడు మనోహర్, ఇద్దరూ కమ్మరం తెలిసినవాళ్ళే. పంచానన్ 'పంచ్ కటింగ్'లో విల్కిన్స్ దగ్గర శిక్షణ పొందాడు. లండన్ మిషనరీ సొసైటీ సభ్యుడైన కేరీ ఆధ్వర్యంలో నడిచే ప్రెస్‌లో పనిచేస్తూ

1800 - 1804 ల మధ్య ఈ తెలుగు అచ్చు దిమ్మెలను వారు తయారు చేశారు. బైబిల్ కథలను వివిధ భారతీయ భాషల్లో అచ్చేసి అవి అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయని 'తెలింగా గాస్పెల్స్ రు. 4/- రాధా బజార్, కలకత్తాలో దొరుకుతాయ'ని శ్రీరాంపూర్ క్రైస్తవ మిషనరీలు ప్రకటించారు.

జె. మంగమ్మ, ఆరిజిన్ ఆఫ్ తెలుగు ప్రింటింగ్ (స్టడీస్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ తెలుగు జర్నలిజం) 1968 పేజి 12.

55. తెలుగు భాషా సమితి - మద్రాసు ఏర్పాటు చేసిన పత్రికా ప్రదర్శన సభకు అధ్యక్షత వహిస్తూ చేసిన నార్ల ప్రసంగం, 1951 డిసెంబరు 23. గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, నవమేధావి నార్ల 1976 పేజి 56.
56. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
57. శ్రీ విద్వాన్ విశ్వంతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
58. శ్రీ బోయి భీమన్నతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
59. కృష్ణా పత్రిక, 1938 డిసెంబరు 17.
60. మాగంటి బాపినీడు, పత్రికలు ఆంధ్ర సర్వస్వం పేజి 385.
61. వీరే ఆరుద్రగా ఈనాడు సాహిత్యలోకంలో ప్రసిద్ధులు.
62. శ్రీ తాపీ మోహనరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
63. ఇదే ఇంతకు ముందు ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురణ అయింది. పునర్ముద్రణ 1941 ఫిబ్రవరి 17.
64. గుడిపాటి రంగనాయకమ్మ 'స్త్రీల హక్కులు' మొదలైన వాటి మీద 1941 మార్చి 26, 1941 ఏప్రిల్ 23 సంచికలలో వ్యాసాలు రాశారు.
65. నాటి నైజాం సంస్థానంలో కూడా కాగడాకు మంచి పేరుండేది. అక్కడనుండి అనేకమంది (హైదరాబాదులో ప్రజారోగ్యం - ఒక హితవాది - 1940; హిందూ మహమ్మదీయ ఐక్యత - ఒక జాతీయవాది - 1940 జూన్; హైదరాబాదులో ప్రాథమిక విద్య - కె. వి. రఘుపతి, బి. ఏ. బి. టి - 1940 జులై) అక్కడి సమస్యలను వ్యాసాలుగా రాసి పంపుతూండేవారు.
66. శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరితో ఇంటర్వ్యూ - మద్రాసు.
67. శ్రీమతి తాపీ రాజమ్మతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
68 శ్రీయుతులు జనార్దనరెడ్డి, 19 సం.; గర్లపాటి రఘుపతిరెడ్డి, 15 సం.; గులాం దస్తగిరి, 18 సం.; ముంగల శామ్యూల్, 18 సం.; దాసిరెడ్డి నారాయణరెడ్డి, 20 సం.; వడ్ల మల్లయ్య, 20 సం.; కూర్మా లింగయ్య,

20 సం.; తంగదూర్ హన్మంతు, 23 సం.; దూడిపళ్ళ చినసత్తిరెడ్డి, 23 సం.; నూగి వెంకయ్య, 25 సం ; కల్లూరి ఎల్లయ్య, 28 సం.; వడ్ల పాపయ్య, 23 సం (1951 జనవరి 31).

69. శ్రీమతి తాపీ రాజమ్మతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
70. ఎర్రప్రాలు మృత్యుంజయశాస్త్రి, ఈ.రా. - లన్నవి సెట్టి ఈశ్వరరావు మారు పేర్లు.
71. శ్రీ తాపీ మోహనరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
72. శ్రీ తాపీ మోహనరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
73. శ్రీమతి తాపీ రాజమ్మతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
74. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు
75. గిడుగు వ్యాసావళి.
76. ది స్కాండినేవియన్ లాంగ్వేజెస్ యాజ్ కల్చరల్ ఆర్టిఫాక్ట్స్ బై ఐనర్ హాగన్ ఇన్ లాంగ్వేజ్ ప్రాబ్లమ్స్ ఆఫ్ డెవలపింగ్ నేషన్స్. సంపాదకుడు జె.ఏ. ఫిష్మన్, జాన్ విల్లీ అండ్ సన్స్ ఇన్కార్పొరేషన్, న్యూయార్క్ 1968 పేజి 267 - 281 ఎస్ప 281.
77. భాషాభివృద్ధిని గురించి వి.వి. నాగ్రొగోవ్, యూనస్.డి.షిరివ్‌లు రాసిన వ్యాసం. సోవియట్ భూమి ప్రచురణలు 1967 పేజి 65 - 103. ఇ. గ్లిన్ లూయీ రాసిన మల్టీ లింగ్వలిజం ఇన్ ది సోవియట్ యూనియన్ అనే వ్యాసం. సంపాదకుడు జె. ఏ. ఫిష్మన్, ది హేగ్ 1972 పేజి 287.
78. సంపాదకుడు కురుగంటి సీతారామభట్టాచార్యులు, పిల్లలమర్రి వెంకట హనుమంతరావు, నవ్యాంధ్ర సాహిత్య వీధులు పేజి 553 - 559. వ్యావహారిక భాషా వికాసం పేజి 97.
79. కొత్త పాళీ, పేజి 9.
80. కొత్త పాళీ, పేజి 7.
81. కొత్త పాళీ, పేజి 23.
82. కొత్త పాళీ, పేజి 4 - 5.
83. కొత్త పాళీ, పేజి 49.
84. కొత్త పాళీ, పేజి 55.
85. కొత్త పాళీ, పేజి 57.
86. కొత్త పాళీ, పేజి 92.
87. కొత్త పాళీ, పేజి 139.

88. డిక్షనరీ ఆఫ్ పిలాసఫీ  ఫార్మ్ అండ్ కంటెంట్ 1967 పేజి 164.
89. డిక్షనరీ ఆఫ్ పిలాసఫీ - ఫార్మ్ అండ్ కంటెంట్ 1967 పేజి 165.
90. ధర్మారావు, చిన్న మనవి, ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ 1976 పేజీ 5.
91. ,, ,, ,, ,, ,, 1976 పేజీ 6.
92. ,, ,, ,, ,, ,, 1976 పేజి 15, 16.
93. ,, ,, ,, ,, ,, 1976 పేజి 23.
94. ,, ,, ,, ,, ,, 1976 పేజి 45.
95. ,, ,, ,, ,, ,, 1976 పేజి 57.
96. ,, ,, ,, ,, ,, 1976 పేజి 95.
97. ,, ,, ,, ,, ,, 1976 పేజి 48.
98. ధర్మారావు ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ 1976 పేజి 28.
99. ధర్మారావు ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ 1976 పేజి 53.
100. బోరిస్ సచ్‌కోవ్, ఎ హిస్టరీ ఆఫ్ రియలిజం, ప్రోగ్రెస్ పబ్లిషర్స్ 1973 పేజి 373.
101. మాగ్జిం గోర్కీ, ఆన్ సోషలిస్ట్ రియలిజం సోషలిస్ట్ రియలిజం ఆన్ ఆర్ట్ అండ్ లిటరేచర్, ప్రోగ్రెస్ పబ్లిషర్స్ 1971 పేజి 41 - 42.
102. డిక్షనరి ఆఫ్ ఫిలాసఫీ, ప్రోగ్రెస్ పబ్లిషర్స్ 1967 పేజి 102.
103. ధర్మారావు ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ 1976 పేజి 88.
104. డిక్షనరీ ఆఫ్ ఫిలాసఫీ (రియలిజం సోషలిస్ట్) ప్రోగ్రెస్ పబ్లిషర్స్ 1967 పేజి 379.
105. ధర్మారావు, ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ 1976 పేజి 106.
106. ధర్మారావు, ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ 1976 పేజి 31.

107. ధర్మారావు, ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ 1976 పేజీ 42.
108. జనవాణి పత్రికలో ప్రకటన, 1951 మే 23 పేజి 11.
109. శ్రీ పందిరి మల్లికార్జునరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
110. వ్లాడిమిర్ షెర్‌బినా, లెనిన్ అండ్ ప్రాబ్లమ్స్ ఆఫ్ లిటరేచర్, ప్రోగ్రెస్ పబ్లిషర్స్ 1974 పేజి 265.
111. వి. ఐ. లెనిన్ కలెక్టెడ్ వర్క్స్, వాల్యూం 16 పేజి 327.
112. కల్పనా సహాని, టాల్‌స్టాయిస్ సర్చ్ ఫర్ ట్రూత్, నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ప్రోగ్రెసివ్ రైటర్స్ బులెటిన్ 1979 పేజి 29.
113. ధర్మారావు అన్నాకెరినీనా, 1961 పేజి 220.
114. వ్లాడిమిర్ షెర్‌బినా, లెనిన్ అండ్ ప్రాబ్లమ్స్ ఆఫ్ లిటరేచర్, ప్రోగ్రెస్ పబ్లిషర్స్ 1974 పేజి 269.
115. ధర్మారావు, అన్నాకెరినీనా 1961 పేజి 123.
116. ధర్మారావు, అన్నాకెరినీనా 1961 పేజి 424.
116.ఎ. రాజయోగ నైఅన్న పత్రికను గురజాడ శ్రీరామ్మూర్తిగారే నిర్వహించేవారు. అందులో 1893 జూన్ సంచికలో 'కవి జీవితములు' ఉంది.
117. కృతి విమర్శనము, సరస్వతి సంచిక - 13, సంపుటి 3,1911 మార్చి.
118. బిల్వేశ్వరీయం అన్న కావ్యంలోనూ, బిల్వేశ్వరీయం అనే శతకంలోనూ ఇది కనిపిస్తుంది.
119. ఆత్మ పర్యాయచర్య లేక హరిహరేశ్వర శతకంలో చెప్పుకున్నారు.
120. అముద్రిత గ్రంథ చింతామణి 1894 ఫిబ్రవరి.
121. వాల్టర్ యుస్ట్ (సం.) ఎన్‌సైక్లొపీడియా బ్రిటానికా వాల్యూం 11 1956 పేజి 783.
122. ఇంతకాలం తర్వాత దీన్ని (ఇటీవలే 1976 లో) డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు అనువదించి పుస్తక రూపంలో అందించాడు.
123. "కొందరు నెల్లూరి గొప్పవారు - రాజమంత్ర ప్రవీణ పశ్మె చెంచలరావు పంతులుగారు'' - వంగవోలు వెంకటరంగయ్య, సుబోధినీ గ్రంథ మాల నెల్లూరు 1933.
124. వావిలాల సోమయాజులు, పీఠిక "నాయెరుక" నారాయణదాసు చరిత్ర (రచయిత మరువాడ వెంకటచయనులు)
125. "అప్పారావుగారూ - నేనూ" అని రాశారు. అనేకులు ఆధునికులు కూడా రాశారు.

బసవరాజు రాజలక్ష్మమ్మగారు 1962.
సంగం లక్ష్మీబాయి నా అనుభవములు.
126. ధర్మారావు, రాలూ - రప్పలూ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్ విజయవాడ 1979 పేజి 7.
127. 1881 వ సంవత్సరంలో ఒకసారి, 1885 వ సంవత్సరంలో మరోసారి వచ్చింది. దీనిలో వ్యక్తిగత తగాదాల వల్ల 1885లో చీలికవచ్చి ఏలూరి కంపెనీ అంటూ మరోటి పుట్టింది.
చిలకమర్తి లక్ష్మీనరసింహం కవి, స్వీయచరిత్రం పేజీ 65.
128. డిక్షనరీ ఆఫ్ ఫిలాసఫీ, ప్రోగ్రెస్ పబ్లిషర్స్ 1967 పేజి 160.
129. ఆరోజుల్లో విద్యాలయాలు జనవరి నుండి డిసెంబరు వరకూ విద్యా సంవత్సరంగా పరిగణిస్తుండేవి. 1910 నుండి ఇది మారిపోయి జులైలో తెరవడం, మార్చిలో పరీక్షలు జరగడం అన్న కొత్త నిబంధనలు అమలులోకొచ్చాయి.
చిలకమర్తి లక్ష్మీనరసింహ కవి, స్వీయచరిత్రం, 1957 పేజి 295
130. పింగళి లక్ష్మీకాంతం, సాహిత్య శిల్ప సమీక్ష 1966 పేజి 388.
131. పింగళి లక్ష్మీకాంతం, సాహిత్య శిల్ప సమీక్ష 1966 పేజి 390.
132. విజ్ఞానసర్వస్వం, వాల్యూము 2, తెలుగు భాషా సమితి 1961 పేజి 1195 - 1199.
133. శ్రీ వి. ఎ. కె. రంగారావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
134. ఒక పత్రికకిచ్చిన ఇంటర్వ్యూ ఆధారంగా. (బహుశా ఆంధ్రప్రభ కావచ్చు). 1972.
135. దీనికి భీమవరపు నరసింహారావు సంగీతం సమకూర్చారు.
ఇంటూరి వెంకటేశ్వరరావు, ఆంధ్రజ్యోతి వారపత్రిక, 1981 అక్టోబరు 16.
136. శ్రీమతి తాపీ రాజమ్మతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
137. దీన్ని నిషేధించకూడదని చాలా కార్మిక సంఘాలూ అవీ ఆందోళన చేశాయని ఓ సమీక్షకుడు ఓ పత్రికలో ఆనాడు రాశాడు.
విశాలాంధ్ర పక్షపత్రిక, 1949 జులై 15.
138. శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరితో ఇంటర్వ్యూ - మద్రాసు.
139. జమీన్ రైతు ఈ వార్తలనన్నిటినీ నాడు ప్రచురిస్తూండేది. ఈ అంశాలు నాకు మిత్రుడు జయధీర్ తిరుమలరావుగారు చెప్పారు. అవే ఆంధ్రజ్యోతిలో వ్యాస రూపంలో కూడా వచ్చాయి. 1981.

140. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి వ్యాసం, గూడవల్లి రామబ్రహ్మం సంస్మరణ సంచిక, తెనాలి 1976.
141. శ్రీ తాపీ మోహనరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
142. శ్రీ సి. పుల్లయ్యతో ఇంటర్వ్యూ - మద్రాసు.
143. చిత్రనిర్మాత యస్. భావనారాయణతో ఇంటర్వ్యూ - మద్రాసు.
144. శ్రీ కె. యస్. ప్రకాశరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
145. శ్రీ పందిరి మల్లికార్జునరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
146. ధర్మారావుగారికి ఆరుద్ర శ్రద్ధాంజలి - విజయచిత్ర సంచిక.
147. శ్రీ బి. ఏ. సుబ్బారావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
148. శ్రీ యస్. భావనారాయణతో ఇంటర్వ్యూ - మద్రాసు.
149. శ్రీ వి ఎ. కె. రంగారావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
150. శ్రీ వేమన సత్యంతో ఇంటర్వ్యూ - మద్రాసు.
151. ధర్మారావుకు ఆరుద్ర శ్రద్ధాంజలి - విజయచిత్ర సంచిక.
152. ధర్మారావుగారంటే సినీరంగంలో చాలా గౌరవం ఉంది. వీరి 70 వ జన్మదినోత్సవం సందర్భంగా రేలంగి వెంకట్రామయ్య వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి 15 వేలు విరాళాన్ని ప్రకటించారు జన్మదినోత్సవ సభల టేపు ఆధారంగా - 1956.
అలాగే రోజులు మారాయి శతదినోత్సవాల సభ విజయవాడలో తాతాజీ అధ్యక్షతన జరిగింది. నటి సావిత్రి వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి 25 వేలు విరాళాన్నిచ్చింది. ఈ విరాళం తాతాజీకి గౌరవ సూచకంగా ఇస్తున్నానని ప్రకటించింది - 1952.
శ్రీమతి తాపీ రాజమ్మతో ఇంటర్వ్యూ - హైదరాబాదు
153. శ్రీ కె. యస్. ప్రకాశరావుతో ఇంటర్వ్యూ - మద్రాసు.
154. రిపోర్టు, విశాలాంధ్ర పక్షపత్రిక మద్రాసు 1949 జులై 15.
155. శ్రీ వి. ఎ. కె. రంగారావుతో ఇంటర్వ్యూ - మద్రాసు
156. ధర్మారావుగారితో కలిసి పనిచేసిన ఇంటూరి వెంకటేశ్వరరావుగారి లేఖ ఆధారంగా - మద్రాసు
157. తాతాజీ 70 వ జన్మదినోత్సవం ఉపన్యాసం టేపు ఆధారంగా. 1956.
158. సంపాదకుడు మాగంటి బాపినీడు ఆంధ్రసర్వస్వం పేజీ 440
159. తుర్లపాటి కుటుంబరావు, ఎన్. జగన్నాథ్, స్టడీస్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ తెలుగు జర్నలిజం (సం. కె. ఆర్. శేషగిరిరావు, ఢిల్లీ 1968 పేజి 128 - 131.
160. ఆంధ్రమహిళ, 1957 మార్చి సంచిక మద్రాసు.

# 5

# రావేలు గలవాడ రార పొలిగాడ

ఆచారాలను గుడ్డిగా అనుసరించడం, అర్థాలు తెలియకుండా ఏవేవో తంత్రాలకు నిత్యజీవనంలో స్థానమివ్వడం సాధారణంగా జరుగుతూండే విషయం. ప్రపంచంలో మానవులు పుట్టుకనుండి చావు వరకూ అనేక సంస్కారాలను చేస్తూంటారు. మనుషుల్లో జ్ఞానం పెరుగుతున్న కొద్దీ ఆ సంస్కారాలకూ ఆచారాలకూ కొత్త అర్థాలు ఇస్తూ వాటిని తిరస్కరించడంగానీ లేదా పూర్తిగా విశ్వసించి ఆచరించడం గానీ జరుగుతూ ఉంటుంది.

ప్రతి సంస్కృతీ దాన్నవలంబించే వారికి గొప్పదే. కాదనలేం. కానీ ఆ స్వాభిమానంతో ఇతర సంస్కృతులను వాటి ప్రాచీనతలనూ తోసి రాజన కూడదు. ఏ దేశ సంస్కృతీ ఒంటరిగా పుట్టి పెరిగిన దాఖలాలు మనకు కనిపించవు. మన సంస్కృతీ అలా పెంపొందిందే. ఇది కూడా హఠాత్తుగా వచ్చిందీ, ఏ ఒక్క జాతి మాత్రమే సంపాదించిందీ కాదు. తరతరాల మానవ మేధోశ్రమ సంచితంగా దీన్ని పరిగణించాలి.

ఈ అభిప్రాయాలు ధర్మారావులో చోటుచేసుకున్నాయి. వీటిని తెలుగు నాట జనానికి పంచాలని భావించాడు. అలా చేసే ముందు తన అభిప్రాయాలు

ఏ మేరకు సరైనవో, సత్యమైనవో తైపారు వేసుకోవటానికి చాలా శ్రమించాడు. అనేక గ్రంథాలు ఆకరాలుగా ఎంచుకున్నాడు. విషయగ్రహణం చేశాడు.

ఈ అంచనాను సామాజిక పరిణామ సిద్ధాంతాలతోనూ మానవశాస్త్రం వెలుగులోనూ చూడడం సశాస్త్రీయమైంది. అందుకు అనేక సంస్కృతులనూ, దేశాల చరిత్రలనూ, ఆ అంశాల్లో నిష్ణాతులైన శాస్త్రవేత్తల గ్రంథాలనూ అసాంతం అధ్యయనం చేశాడు. మూడు గ్రంథాలు రాశాడు.

## దేవాలయాలమీద బూతు బొమ్మలెందుకు?

దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు : మొదటిది. దీనికోసం వారు సంప్రదించిన గ్రంథాల జాబితా గ్రంథానికి ముందే ఇచ్చారు. ఏ పరిస్థితుల్లో దైవ భావం వచ్చిందో, వాటికి ఆకృతులెలా వచ్చాయో, అవి బూతు బొమ్మల రూపంలో దేవాలయాల మీదకు ఎలా వెళ్ళాయో సంక్షిప్తంగా ఈ గ్రంథంలో చూపాడు.

ఇక రెండోది ఇనుప కచ్చడాలు. మానవ సమాజం ఒక స్వామ్యం నుండి మరో స్వామ్యానికి నడిచింది. ఆ మార్గంలో ఒక దశలో ప్రధానమైన వ్యక్తి మరోదశకల్లా అప్రధానం కావడం జరిగింది. పురుష ప్రాజాపత్యం వచ్చింది. అలా నడమంత్రపు సిరి రావడంతో అహంకారం పెల్లుబికింది. తానెక్కి వచ్చిన నిచ్చెననే పడదోయటం ఆరంభించాడు. తన ఆధిపత్యం కోసం స్త్రీలను నానాకష్టాలకూ, దౌర్జన్యాలకూ గురిచేశాడు. అందులో ఒక అంశం ఈ ఇనుపకచ్చడాల ఆచారం. ఈ విషయం ధర్మారావు వివిధ దేశాల గ్రంథాలనుండీ మ్యూజియంలలో ఉండే చిత్రాల సంపుటాలనుండీ సేకరించాడు.

మూడో గ్రంథం పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు. ఇది ఈ వరసలో చివరిదైనా జనసామాన్యానికి బాగా సన్నిహితంగా ఉండే అనేక ఆచారాల గుట్టు బయటపెట్టేది. వీటిని తానేయే గ్రంథాలను సాక్ష్యంగా తెచ్చుకొని రాశారో ఆ జాబితా పుస్తకం ముందే ఇచ్చారు. ధర్మారావులో మొదట్నుండీ ఉన్న సంస్కరణ భావాభిలాషకు ఇది చక్కగా అద్దం పట్టింది. జనంతో కూడా పెళ్ళితంతుల్లో కొంత మార్పురావడానికి ఇది దోహదపడింది. స్వయంగా ధర్మారావు చేయించిన అనేక సంస్కరణ వివాహాలకు ఇది సిద్ధాంత గ్రంథంగా పనిచేసింది. పలువురు ఆ మార్గంలో నడవటానికి కరదీపికగా ఉపయోగ పడింది కూడాను.

ఈ మూడు గ్రంథాల రచనలో ధర్మారావు మోర్గాన్ సామాజిక దశల వివరణను పాటించాడు. పితృస్వామ్యం అన్న దశ మాతృస్వామ్యం నుండి వచ్చిందేనన్న బ్రిఫాల్టు, సుమ్నర్, మలినొవస్కీ, మెక్లాన్‌ల ప్రతిపాదనలను సమర్థించాడు. వెస్టర్‌మార్క్ వంటి కొందరు మొదటి దశలో పితృస్వామ్యం ఉండేదని చేసిన వాదనను ధర్మారావు ఖచ్చితంగా ఖండించాడు. ఎంగెల్సు చారిత్రక అవగాహనను ధర్మారావు అడుగడుగునా ప్రతిపాదించడానికి ప్రయత్నించాడు. ఆచారాల వివరాలకు థర్‌స్టన్, ఫ్రేజర్‌లను ప్రమాణ గ్రంథాలుగా స్వీకరించాడు. భారతీయ ఆచారాలతో సరిపోల్చే సందర్భంలో అనేక సాహిత్య పరమైనవీ, సిద్ధాంతపరమైనవీ అయిన భారతీయ గ్రంథ సముదాయాలను ఎంచుకున్నాడు.

ధర్మారావు రచనలు వచ్చినప్పుడు విమర్శలూ వచ్చాయి. అయితే పుస్తక రూపంలో వారణాసి సుబ్రమణ్యశాస్త్రి రచనే ప్రధానంగా కనిపిస్తుంది. ఇది ఆస్తికత్వము-2 అంటూ 'తాపీవారి దేవాలయ దూషణము - సమాధానము' అన్న పేరుతో 1970 లో వచ్చింది. పుస్తకానికి పెట్టిన శీర్షిక చూస్తేనే వీరు ధర్మారావు రచనను సరిగా అంచనా వేసుకోలేదన్నది తెలుస్తుంది. 52 ఉప శీర్షికలుంచి రాసిన ఈ విమర్శలో వారణాసివారు ధర్మారావు రచనలో జీవ నాడిని పట్టుకోనేలేదు. సత్యాన్ని వెతకాలన్న భావంతో కాకుండా, దేవుణ్ణి 'కించపరుస్తున్న వ్యక్తి' మీది ఆగ్రహంతో వారణాసివారి గ్రంథం సాగింది.

ఇక ధర్మారావు మార్గం నచ్చి రాసిన గ్రంథాలూ కొన్ని ఉన్నాయి. ముఖ్యంగా హేతువాదంతో రచనలు చేసినవారిలో గోరా ముఖ్యులు. అన్నీ బూతులబుంగలంటూ సాగినది గౌరిబోయిన పోలయ్య 'పురాణాల్లో బూతు'. కొత్త భావయ్య చౌదరి 'దేవతల రహస్యాలు' ఎక్కువ భాగం భౌగోళికంగా వివరణలు ఇచ్చిన గ్రంథం. వర్మగారి గుడి గుంపా, కళింగ దేవర, మైలార దేవలు విషయ సేకరణ చేసి సరిగా కూర్చునట్టు కనిపించే గ్రంథాలు.

అనేక హేతువాద సమాజాలు, నాస్తిక ప్రచార సంఘాలు ఈ రకమైన ఆలోచనలతో సశాస్త్రీయంగా మన ఆచారాలనూ సంస్కృతినీ వివరిస్తున్నాయి. ఈ సంఘాలన్నిటికీ ప్రధానాశయం ప్రజల్లో మూఢ నమ్మకాలు పారదోలటం. అజ్ఞానాంధకారంవల్ల నాశనమయ్యే జనం బతుకుల్లో ఓ వెలుగు నింపాలన్న భావం ఉండటం. ఇంతగా అభివృద్ధి చెందిన రాకెట్ యుగంలో మాయలూ, మంత్రాలూ మతానికి అంగాలుగా ఉండడంవల్లే సామాజిక అసమానతల వైపూ, వాటి నిర్మూలనకోసం జరిగే పోరాటాల వైపూ జనం మళ్ళవలసినంతగా వెళ్ళడం లేదన్నది వీరందరి అభిప్రాయం.

ఆ మార్గంలో కాగడా పట్టి ముందుకెళ్ళిన వ్యక్తి తాపీవారు. తమ అనుభవాలను పంచి ఇస్తూ వాటినుండి పాఠాలు నేర్చుకుని ముందుకు సాగండన టానికే ఈ మూడు గ్రంథాలనూ తెలుగు వారికి అందించారు. వాటిని సవిమర్శకంగా పరిశీలించడం అవసరం.

## రచనోద్దేశం – సౌభాగ్యతంత్రం

"మానవ నాగరికత ఏదేశంలోనయినా ఏ ఖండంలోనయినా కొన్ని మెట్ల మీదుగానే వికాసాన్ని పొందుతూ వస్తుంది. ఆ మెట్ల వరసని తప్పించడం కష్టం. ఆలస్యంగానో, వేగంగానో ఎప్పుడో ఒకప్పుడు ఆ మెట్ల మీద నడక తప్పదు" - అంటూ ధర్మారావు తను రాసిన 'దేవాలయాల మీద బూతు బొమ్మ లెందుకు' అన్న గ్రంథం పీఠికలో అన్నాడు (పేజి 22). ధర్మారావు నాగరికతను అధ్యయనం చేస్తూ మన భారతీయ నాగరికతలోని అనేక అంశా లను పైన వారే వివరించినట్టు ఏ మెట్టులో ఎలా వర్తించిందీ తెలియచేయాలని అనుకున్నారు.

సామాజిక పరిణామ దృష్టితో అనేక విషయాలను ఆలోచించే గుణం ధర్మారావులో మొదటి నుండీ ఉండేది. ఈ పుస్తకం రాయటానికి ముందు అగ్రవర్ణాలవారి రాజకీయ ప్రచారం కోసం వృత్తిరీత్యా పనిచేయాల్సి వచ్చింది. తాత్విక పాండిత్యాభిమానం, తార్కిక దృష్టి ఉన్నవాడు కాబట్టి ఈ వర్ణవ్యత్యా సానికి మూలం ఏమై ఉంటుందన్న ప్రశ్న ధర్మారావుకు కలిగింది. అగ్ర వర్ణాల్లో, సమాజం అనుకుంటున్నంత పవిత్రత ఉందా ? అధమ వర్ణాల్లో అసలు పవిత్రతే లేదా ? అన్న అనుమానం కూడా వచ్చింది. అదివరకే కొందరు అగ్రవర్ణాలవారు అతి పవిత్రంగా ఎంచే పురాణాలన్నీ బూతులబుంగలని వ్యాఖ్యా నించడం విన్నాడు.

"పౌరాణికానాం వ్యభిచార దోషో<br>
నశంకనీయః కృతిభిః కదాచిత్<br>
పురాణకర్తా వ్యభిచారజాతః<br>
తస్యాపి పుత్రో వ్యభిచారజాతః"

అన్న చాటువు వల్ల సంస్కృత పండితులు కూడా పురాణాలెలాటివో చెప్పారు. ఆ రోజుల్లోనే ప్రఖ్యాత పండితుడు, వ్యాఖ్యాత, పెండ్యాల సుబ్రమణ్య శాస్త్రి మహాభారత చరిత్రం, రాజసూయయాగ రహస్యాలను రాసి తెలుగు దేశంలో దుమారం లేవదీశాడు. ఇవన్నీ చదివిన మీదట ధర్మారావుకు వీటన్నిటికీకూడా కారణాలేమిటి ? అన్న ప్రశ్న కలిగించి. అసలే పరిశోధకదృష్టి వీరిది. బుద్ధితో ప్రపంచ నాగరికతలను తవ్వడం ఆరంభించారు. మన ప్రాచీన గ్రంథాలు చూస్తే పురాణాలకే కాదు, పురాణ పురుషులైన దేవుళ్ళకూ, వాళ్ళ గుళ్ళకూ, ఆ పురాణ పురుషులను కొలిచే పండగలకూ అన్నిటికీ ఈ బూతులు ఉన్నట్లు తోచింది. ఆ భావాన్ని ధృవపర్చుకోడానికి ఆయన చేసిన పరిశోధనల ఫలితాలే ఈ వ్యాసాలు. ఈ పరిశోధనల వల్ల మరొకటికూడా తెలిసింది. ఏ దేశం 'నన్ను ముట్టుకోకు నా మాలకాకీ' అంటూ అంటీముట్టనట్టు లేదు. భారతీయ మతం మీద, ఆచారాల మీద, సంస్కృతి మీద అనేక దేశాల ప్రభావాలు పడ్డట్టు వెల్లడైంది అనేక సంప్రదాయాలొచ్చి కలిశాయి దాంతో ధర్మారావుకు మరిన్ని ప్రశ్నలు తలెత్తాయి. మన పూర్వులు చెప్పే భారత వర్షం ఈ దేశమేనా ? మరెక్కడైనా ఉందా ? వీటిని గురించి ఆ రోజుల్లోనే వీరి మిత్రులు వేదం వేంకటాచలయ్య కొన్ని వ్యాసాలను మిథిక్ సొసైటీ పత్రికల్లో రాసేవారు. ధర్మారావు అంతకు ముందు నెల్లూరులో ఉండగా వీరిద్దరూ చాలా మంచి స్నేహితులు. ఇలాటి ఆలోచనలవైపు, పరిశోధనలవైపు ధర్మారావు దృష్టి మరింత స్పష్టంగా మళ్ళించిన వ్యక్తుల్లో ఆయన ముఖ్యుడు. అలాటి పరిశోధనాంశాలను క్రోడీకరించి భారత వర్షం ఏది? అన్న వ్యాసపరంపర ధర్మారావు రాద్దామనుకున్నాడు.[1] కానీ ఒక మునుము పెట్టి రాయలేకపోయాడు. అయినా దేశదేశాల సంప్రదాయాలు మన ఆచారాల్లో ఇమిడి ఉన్నాయన్న అంశాన్ని కొన్ని వ్యాసాల్లో చెప్పాడు [illegible]పండగలాంటివి ఈజిప్టు సంప్రదాయాల్నుండి మనకు సంక్రమించాయని చెప్పాడు. బహుశా ఇలా చాలా వ్యాసాలు ప్రకటిద్దామని తలపెట్టి ఉంటాడు. కాని కొన్ని వ్యాసాలే రాయగలిగాడు. దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు అన్న వ్యాసాలను ప్రజామిత్ర వారపత్రికలో 1936 లో ధారావాహికంగా ప్రచురించారు. తెలుగునాట పండితులు గగ్గోలు పెట్టారు. తమ నెత్తిన పిడుగు పడ్డట్టు కలవరపడ్డారు. మన సంస్కృతిలో విషం పోస్తున్నారని వీరిమీద 'తెగపడ్డారు'. ఈ వ్యాసాలు అచ్చవుతున్న కాలంలో రచయిత తమ పేరును బయట పెట్టలేదు. "ఇవి చాల శ్రద్ధతో రాసిన విషయాలు ... బూతు మీద మోహం నాకు లేదు. విషయం మీద విశ్వాసమే నన్ను ఈ వ్రాతలకు పురికొల్పింది .... తెలిసి బుద్ధితో వ్రాసి

## సమాజ పరిణామ



సమాజం
వర్గపూర్వ సమాజం
వర్గ సమాజం
పూర్తి వ్యావసాయిక సమాజం
గిల్డుల అవతరణ
పశుపాలక సమాజం
వ్యావసాయిక సమాజం పోడు
వనచరాఖేటకం
జలచరాఖేటకం
పోడుపద్ధతి
ఏరువాక పద్ధతి
పశుపాలన ప్రధానం
వ్యవసాయం అంగం
వ్యవసాయం ప్రధానం. అనార్యులు
పశుపాలన అంగం ఆర్యులు
బ్రాహ్మణ
పశుపాలక వృత్తి
అటవీ నివాసం
ఆరణ్యకాల ఆవిర్భావం
క్షత్రియ
వ్యావసాయిక వర్ధనం
నగర నివాసం
ఉపనిషత్తుల అవతరణ
వైశ్య
చేతివృత్తుల వర్ధనం
క్షత్రియులకు సాయం

## దైవ భావ పరిణామం


సమాజం
వర్గపూర్వ సమాజం. కాస్మాలజి
వర్గ సమాజం
పశుపాలన, వ్యవసాయాలు పరస్పరాశ్రయాలు
పూర్ణ కుంభ భావం
లింగ - పానువట్టం భావం
అర్ధనారీశ్వరుడు
ఆకాశం
భూమి
పశుపాలక సమాజం
పురుషాధిక్యం వృషభం
టోటం అవతరణ
పోడు వ్యవసాయ సమాజం
లోయలు, నదులు, కొండలే దైవస్థలాలు
చెట్ల గుంపులు, స్త్రీల జననాంగాలు. ఆఫ్రోడైట్స్.
వనచరాఖేటకం
వన్య ఆహార పదార్థాలు
జలచరాఖేటకం
జలాహార పదార్థాలు
పోడు
కొండలు
ఏరువాక
వనాలు, నీళ్ళు
పశుపాలనం ప్రధానం
వృషభ జననాంగం. పురుష జననాంగం
లింగ భావం
పోతురాజు
వ్యవసాయం ప్రధానం
స్త్రీ జననాంగం - భూ సౌభాగ్య తంత్రం
యోని భావం
అక్కలు

నది కాదు ... కవి సమయాలూ కల్పనలూ వాడుక చేయలేదు. యథార్థంగా నేను చదివి సంగ్రహించిందే వ్రాశాను" - అంటూ మనవి చేసుకున్నారు (పేజి 21). ఈ అంశాలకు సంబంధించిన ప్రశ్న ధర్మారావుకు సుమారు 1920 ప్రాంతాల్లో పుట్టింది (చూ. పీఠిక). పదిహేను సంవత్సరాలు పరిశోధన సాగింది. "ప్రత్యేక కృషి చేసిన మహానుభావులు వ్రాసిన విషయాలను" అధ్యయనం చేశాడు. ఈ గ్రంథం రాశాడు.

దీన్ని రాయడంలో ధర్మారావు ఓ ఉద్దేశం మనసులో పెట్టుకున్నట్టు దీన్ని చదివితే అర్థమౌతుంది. ఆదిమ పశుపాలక వ్యావసాయిక గణాల దగ్గర్నుండీ బాగా అభివృద్ధి చెందిన వ్యవసాయ దశ వరకూ మానవజాతి కని పెట్టిన కామ్యతంత్రాలకు సంబంధించిన చరిత్రను తెలుగువాళ్ళకు తెలియ పర్చాలన్నదే ఆ ఉద్దేశం. దాన్నే వారు పంట ఉత్సవం' అన్నారు (పేజి 101). దీన్నే సౌభాగ్య తంత్రమనీ, ప్రజన తంత్రమనీ కూడా పిలుస్తారు.[2] కామ్యతంత్రం, సౌభాగ్య తంత్రం అని వాడడంలో దీని వెనుకనున్న తత్వం కూడా అర్థమయ్యే అవకాశం ఉంది. ఆ పదాలనే ఇందులో ఉపయోగించడం జరిగింది.

ఈ గ్రంథాన్ని సవివరంగా పరిశీలించాలంటే సమాజ పరిణామాన్ని వృత్తుల ఆధారంగా పరామర్శించాలి. ఆయా దశల్లో సౌభాగ్య తంత్రాలను చూడాలి. ఆ దశల్లో దేవాలయాల అవతరణనూ, దైవభావం పుట్టుకనూ పరిణామాలనూ కూడా విమర్శించుకుంటూ పోవాలి. బహు దేవతలను ఆరాధించే అలవాటునుండి ఏకేశ్వరోపాసన రావడానికి సామాజికంగా గల కారణాలను అన్వేషించాలి. మంత్రం, తంత్రం, యంత్రాల అర్థాలను తరచాలి. నేడు మన కళ్ళెదుటున్న దేవాలయ నిర్మాణాలను, పుట్టుపూర్వోత్తరాలనూ వెతకాలి. చిత్రాల రూపంలోనూ శిల్పాల రూపంలోనూ ఈ బూతు బొమ్మలు ఎలా దేవాలయాల్లో స్థానం సంపాదించాయో విశదంగా పరిశీలించాలి. ఈ పద్ధతి ప్రపంచంలో ఉన్న అన్ని ప్రాంతాల్లోని వివిధ మతాల్లోనూ, వాటి ఆలయాల్లోనూ ఉన్నాయేమో చూడాలి. ఒక వేళ ఉంటే వాటికీ, మన దేవాలయాలమీద శిల్పాలకూ వెనకుండే తత్వం ఒకటేనా? కాదా? అన్న విషయం తైపారు వేసుకోవాలి. వీటన్నిటికీ ఆధారాలుగా ప్రాక్, పశ్చిమ సామాజిక, మానవ శాస్త్రజ్ఞుల పరిశీలననూ, ప్రాచీన సాహిత్య రచనలనూ భూతద్దాలతో వెతకాలి. సామ్యాలుంటే వెలికి తీయాలి. ధర్మారావు మాటల్లోనే "వేల సంవత్సరాలు వెనకకి చూడగలిగి ఉండాలి. పరిస్థితులను పరిశీలించగలిగి ఉండాలి" (పేజీ 20). మానవ చరిత్రలో అట్టడుగునున్న తొలి పుటల మడతల్లోకి చూడాలి.

వాళ్ళ ఆచారాలు, అలవాట్లు, భావాలు, యుద్ధాలు అన్నీ అవగాహన చేసుకో వాలి. ఆ ప్రయత్నమే ఈ ప్రకరణంలో నేను చేశాను.

ఈ పుస్తకం రాయడంలో ధర్మారావు ముఖ్యంగా

- భాషా శాస్త్రం
- సామాజిక మానవ శాస్త్రాల

మీద ఆధారపడ్డారు. అయితే ఆయన ఈ రచనలు చేసేనాటికి వారికి అందుబాటులో ఉన్న పరిశోధనా గ్రంథాలు చాలా తక్కువ. పెంపొందిన సిద్ధాంతాలూ పరిమితం. ఈ పరిమితులు వారి రచనల్లో స్పష్టంగా కనిపిస్తాయి. ఈ బూతు బొమ్మలు ఎందుకొచ్చాయన్న విషయాన్ని గ్రంథం చివరలో 'ఉప సంహారం' అన్న దాంట్లో (పేజీ 103) స్థూలంగా వివరించారేగానీ ఆదినుండీ ఈ కారణానికి ఉదాహరణలను జోడించలేదు.

ఆదిలో వీరి పరిశోధన శబ్దాల ఉత్పత్తులనాశ్రయించి సాగింది. 'కోవె ల'కూ, 'రవికె'కూ 'గుడిసె'కూ ఇచ్చిన ఉత్పత్తులను చూస్తే ఈ విషయం స్పష్టపడుతుంది. సమాజాన్ని ఖచ్చితంగా దశలుగా విభజించడం, ఆ దశల్లో వచ్చిన సామాజిక పరిణామాల్లో ఈ దైవభావం - సౌభాగ్యతంత్రాల పరిణా మాలను విడమర్చే ప్రయత్నం చేయలేదు. ఉత్పత్తి సంబంధాల్లో మార్పు లొచ్చినప్పుడల్లా వ్యవస్థలోనూ వాటినంటిపెట్టుకున్న వివిధాభిప్రాయాల్లోనూ మార్పులు రావడం సహజమన్న భావం అందించే గ్రంథాలు ధర్మారావుకు అప్పటికి అందుబాటులో ఉండి ఉండకపోవచ్చు. ఇన్ని పరిమితులను దృష్టిలో ఉంచుకుంటూనే ఈ పుస్తకాన్ని వివరంగా పరిశీలించడం అవసరం.

సామాజిక శాస్త్రం, సామాజిక మానవశాస్త్రాలు నేడు చాలా పెంపొం దాయి. ఆదినుండీ పైతృక సమాజం (పితృస్వామ్యం) ఉండేదన్న వాదన తప్పని రుజువైంది. దీన్ని ప్రచారంలో పెట్టిన వెస్టర్ మార్క్ కొన్ని సంద ర్భాల్లో తన అభిప్రాయాలను మార్చుకోక తప్పలేదు. అందువల్ల ఆ వాదనల ఆధారంగా చేసిన పరిశోధనలూ, వెలువడ్డ గ్రంథాలూ లోపభూయిష్టాలని తేలాయి. ఆదిమ సమాజం మాతృకా సమాజమని (మాతృస్వామ్యం) శాస్త్రవేత్త లందరూ అంగీకరించారు. కొన్ని తండాలు అతి ప్రాచీనకాలంలో పైతృక తండాలుగా మారినా మరికొన్ని తండాలిప్పటికీ మాతృకా తండాలుగానే మిగిలి పోయాయి. ఈ అంశాలను మలినవొస్కీ, ఫ్రేజర్, మార్గరెట్ మీడ్ లాంటి మానవశాస్త్రజ్ఞులు అనేక ఆధారాలతో రుజువు చేశారు. ఇలా ఉండడానికి కారణమేమిటి? అన్న పరిశోధకాంశం శాస్త్రజ్ఞులకు మౌలికంగా మిగిలింది.

ఇందుకోసం వివిధ శాస్త్రజ్ఞులు భిన్నభిన్న మార్గాల్లో అన్వేషించి అభిప్రాయా లను వెలువర్చారు. ఆ అభిప్రాయాలే ధర్మారావు రచనకు ఆకరాలు.

యూరోపియన్ సమాజాల్లో ఇప్పుడు మాతృకా సమాజాలు లేవు. మాతృకా సమాజ అవశేషాలు సకృత్తుగా కనిపిస్తాయి. కానీ యూరోపియనేతర సమాజాల్లో మాతృకా సమాజాలిప్పటికీ ఉన్నాయి. వాటి అవశేషాలు దండిగా వివిధ ప్రాంతాల్లో కనిపిస్తాయి కూడానూ.

యూదు, అరబ్ మొదలైన సెమైట్ సమాజాలు కూడా యూరోపియన్ సమాజాల్లాగే పైతృకా సమాజాలు. ఒకనాడు ప్రపంచం అంతటికీ బైబిలును వర్తింపచెయ్యాలనుకున్నవారు ఆ సిద్ధాంతాన్ని యూరపు - సెమైటు జాతు లకు మాత్రమే పరిమితం చేసి వాదించడం ఆరంభించారు. కానీ జార్జిథామ్సన్4 లాంటి వారు చేసిన పరిశోధనలవల్ల గ్రీకు, రోమను సామ్రాజ్యాలు చాలాకాలా నికి గానీ పైతృక సమాజాలుగా మారలేదని వెల్లడైంది. ఇలాగే ఈయనే రాసిన ఎస్కైలస్ అన్న గ్రంథం దీన్నే బలపరుస్తుంది. అయితే ఇందులో సాహిత్యాన్ని ఎక్కువగా ఆధారంగా తీసికొని థామ్సన్ ఈ నిర్ణయానికొచ్చారు. ఏదిఏమైనా బ్రిఫాల్ట్, ఫ్రేజర్, థామ్సన్, మీడ్, మక్లాన్, క్రాలీ, స్కాట్, విల్ డ్యూరాంట్, అవ్ బరీ వంటి సామాజిక మానవశాస్త్రజ్ఞులందరూ మాతృకా సమాజం నుండే, పైతృకాసమాజం ఆవిర్భవించిందనడంలో ఏకాభిప్రాయం వెల్లడించారు.

ఇక సమాజాన్ని దశలుగా విభజించుకుంటూ క్రమంగా వచ్చిన వివిధ రంగాల్లోని పరిణామాలను అధ్యయనం చెయ్యాలి.

నాగరికతదశను, చారిత్రకదశ అనీ వర్గసమాజం అనీ మానవపరిణామ శాస్త్రంలో అంటారు. దీనికి పూర్వదశను ప్రాక్ చారిత్రక యుగమని చరిత్ర కారులంటారు. సమాజశాస్త్రజ్ఞులు అంతకు పూర్వ సమాజాలను శావేజీసమాజం (పాశవిక), బర్బర సమాజాలనీ అంటూ వీటి తర్వాతనే నాగరిక సమాజం వచ్చిందంటారు. శాస్త్రీయ సమాజవాదులు, మోర్గాన్‌లాంటి వారు చేసిన ఈ పై విభజనను అంగీకరిస్తూనే మరింత స్పష్టంగా పూర్వదశకు వర్గపూర్వ సమాజ మనీ నాగరిక దశకు వర్గ సమాజమనీ పేరుంచారు.5

మానవుడు మనుగడకోసం కూడూ గూడూ సంపాదించుకోడానికి పడే తాపత్రయంలో సాధనాలూ (ఇన్స్ట్రుమెంట్స్) సాధ్యాలూ (ఆబ్జెక్ట్స్) సిద్ధులూ (ప్రొడక్ట్స్) మొదలైన వాటిమీద అందరికీ సమాన వాల్లభ్యం ఉన్న దశకు వర్గ పూర్వదశ అని పేరు పెట్టారు. సాధన - సాధ్యాల మీద యాజమాన్యం ఒక డిదీ ; అలాగే సిద్ధినీ - సిద్ధిభాగాలనూ పంచే బాధ్యత యజమానులదీగా సామా

ఉక సంబంధాలు ఏర్పడినప్పుడు సమాజం యజమాని వర్గం - దాసవర్గంగా విభక్తమౌతుంది. అంతవరకూ లేనిదీ ఇప్పుడే తలెత్తిందీ 'వర్గం' కాబట్టి ఈ సమాజానికి వర్గసమాజమని శాస్త్రీయవాదులు నిర్ధారించారు. ఈ వాదం శాస్త్రీయం కనుక ఈ కోణం నుండే దేవాలయ స్వరూప స్వభావాల సమస్యను పరిశీలించడం యుక్తంగా ఉంటుంది.

సమాజం వర్గంగా మారక పూర్వమే పశుపాలన - వ్యవసాయం బాగా పెంపొందాయి. పశుపాలక గణాలు ప్రధానంగా జంగమ గణాలు వ్యావసాయికులు ముఖ్యంగా స్థావర గణాలు అయినా చాలాకాలం ఒకేచోట స్థావరమేర్పరచుకున్న పశుపాలక గణాలూ, ఏయేటికాయేడు కదిలిపోయే వ్యావసాయిక గణాలూ మనకు చరిత్రలో కనిపిస్తాయి. పశుపాలకులైన ఆర్యగణాలు వెయ్యేళ్ళపాటు సరస్వతీ నదీతీరంలో స్థిరంగా సత్రయాగం చేసినట్లు వేదాలవల్ల తెలుస్తుంది. ఈ ప్రాంతం ఏడు నదుల ప్రాంతం కనుక దీన్ని 'సప్తసింధు' అన్నారు. సింధు అంటే నది. ఇరాను వాళ్ళు దీన్ని 'హప్త హింద్' అనేవాళ్ళు. జండా అవెస్టాలోనూ డేరియస్ I గోరీ మీద కనిపించిన రాతి శాసనంలోనూ ఈ విషయం ఉంది.[6] ఇప్పటికీ ఏటేటా కదుల్తూ పోతూ 'పోడు' వ్యవసాయం చేస్తూండే కొండజాతులున్నాయి. ఇవన్నీ సామాన్య లక్షణాలకు కన్పించే కొన్ని విప్రతిపత్తులుగానే పరిగణించాలి.

పశుపాలక గణాలు వృత్తినిబట్టి పురుషప్రాధాన్యాన్ని సంతరించుకున్నాయి. అందుకని ఆ గణాల్లో పైతృక లక్షణాలు ఆదిలోనే అంకురించాయి. ఈ లక్షణాలు చాలా బలంగా ఉన్న ఆర్యులు, సెమైట్లు, తార్తారులు అందరూ పశుపాలకులు. ఈ ఆర్యులు అన్న పదం 'ఆర్' అనే మూలంనుండి వచ్చిందంటారు. ఆర్ అంటే దున్నడం. దీనినుంచే 'అరక' అనీ 'ఆరబుల్' అనీ తెలుగు ఇంగ్లీషు భాషల్లో వచ్చింది ఆర్యులు భారతదేశంలోకి అడుగు పెట్టినప్పుడు అప్పటికే సప్తసింధు ప్రాంతంలో వ్యావసాయిక నాగరికత చూశారు. అది బాగుందని తలచారు. దాన్ని తామూ ఆచరించాలన్న తలంపుతో తమనూ 'ఆర్యుల'ని పిలుచుకోవడం ఆరంభించారన్న వాదం ఒకటుంది. దీన్ని రెగోజిన్ తన 'వేదిక్ ఇండియా' అన్న గ్రంధంలో ప్రతిపాదించాడు.[7] ఆలోచనీయం ఇది ఇక మంగోలులైన తార్తారులు అశ్వపాలకులు. టర్కులు, ఇజ్రేలీలు గొర్రెల కాపరులు. అరబ్బులకు ఒంటెలూ, గుర్రాలూ, గొర్రెలు కూడా ఉన్నాయి. ఇక ఆర్యులు ఆవులు, గొర్రెలు, గుర్రాలు వీటిని పాలించేవారు.[8] ఈ జాతుల్లో స్త్రీల బాధ్యతలు తక్కువ. మందలను కాయడం పురుషుని పని.

కనుకనే పురుష వాల్లభ్యంతో పైతృక లక్షణాలు త్వరితంగా వ్యాపించడం జరిగిందన్నారు. 9

పశుసంపద వృద్ధికోసం ఒక గుర్రం, ఒక పొటేలు, ఒక వృషభం బలిష్ఠమైనవి ఉంటే చాలన్న భావం పెరిగి. మంద పెరుగుతుంది. దాంతో పుష్టికరమైన గుర్రం, బలిష్ఠమైన ఎద్దూ, మంద సౌభాగ్యానికి ప్రతీకలుగా నిల్చాయి. మందను పెంచగల్గినవాటి మగసిరికి ఆ సమాజంలో దైవత్వం ఆరోపించారు. వాటికున్న శక్తిని తమకూ ఆరోపించుకోవాలనీ, దానిలోనే గొప్పతనం, దైవత్వం ఉంగనీ కూడా భావించారు.

తర్వాతి సమాజంలో ఈ శక్తి సాధనకు కనిపెట్టిన ఉపాయాలను వాజీకరణాలూ, వృషీయోగాలూ అని పిల్చారు. అధర్వణ వేదంలో వాజిలాంటి, వృషభంలాంటి అంగాన్ని తమకు ప్రసాదించవలసిందనే మంత్రాలెన్నో ఉన్నాయి.

"అశ్వశ్యాశ్వత రస్యా జస్య పేత్వ స్వచ
అధ ఋషభస్య యేవ వాజస్తానస్మిం ధేహి తనూవశిన్"

(కాండం 4, ప్రకాండం 7, అనువాకం 1, మంత్రం 4, ఋచ 8 - అధర్వణ వేదం)

"ఆవృషాయ స్వశ్వశిః వర్ధస్య ప్రవధయస్వచ
యధాంగం వర్ధతాం సేవస్తేన యాషిత మిజ్జహి"

(6 - 14 - 10 - 101 - 1 అధర్వణవేదం పేజి 137)

మందను వృద్ధిచేయడానికి వృషభం, అశ్వాలలాగే తానూ వాజీకరణ, వృషీయోగాలతో సంతానాభివృద్ధి చెయ్యగలనన్న భావం కలిగింది. ఈ భావం తోనే ప్రజాపతులవతరించారు. స్త్రీ రక్తసంబంధం సంతానం స్త్రీ పేరుతోనే చెలామణీ అయినా స్త్రీ మండలాన్ని పాలించే పురుష 'పుంగవ' - 'వృషభు'డు ప్రజాపతిగా పేరొందాడు. పురాణాల్లో కనిపిస్తూ సృష్టిభారం వహించారనుకుంటున్న వాళ్ళందరూ ఇలా వచ్చినవారే. దీనితో ఈ ప్రజాపతుల అంగానికి (సేఫం) ఒక పవిత్రత ఏర్పడింది ఇదే ప్రపంచ మతాల్లో లింగావిర్భావానికి మూలం.

వృషీయోగంమీద సంపూర్ణాధిపత్యం సంపాదించిన ప్రజాపతి లింగ రూపి. అతడి వాహనం వృషభం. అతడి ధ్వజం వృషభం. అతడు మాత్రం నఖశిఖపర్యంతం లింగాకారుడు. ఈ విధంగా మొట్టమొదట పైతృక సమాజాలకు దారితీసిన పశుపాలక గణాల్లో పురుషునికి ప్రాజాపత్యం, పురుషాంగానికి దైవత్వం సిద్ధించాయి

భారతదేశంలోనే కాక గ్రీసు, రోము శిల్పాల్లోనూ, ఈజిప్టు చిత్రాల్లోనూ చాల్డ్యా, సుమేరియా, బాబిలోనియా పురాణగాథల్లోనూ ఈ లింగ ప్రాశస్త్యం కనిపిస్తుంది.

సాపేక్షంగా - స్థావర గణాలనుకునే వ్యావసాయిక గణాలు ఇందుకు భిన్నం. వ్యవసాయాన్ని మొదట కనిపెట్టింది స్త్రీలు. మనిషి ఆఖేటకదశలో ఉన్నప్పుడు తండా మొత్తం వేటకోసం తరలిపోతుండేది.10 వేట జంతువు కనిపించగానే బాదరబందీ లేనివారు వెంటపడేవారు. గర్భవతులూ, ఎడపిల్లల తల్లులూ పిల్లలూ వెనకబడడం సహజం. వీరు నెమ్మదిగా కదుల్తూ దారిలో కనబడే కాయా కసరూ చవిచూస్తూ సాగుతూండేవారు. వేటగాళ్ళకు కూడా సాపేక్ష స్థవిర జీవితం వస్తుంది. తృణకాష్ఠ జలసమృద్ధి కలచోట పశు సంపద ఎక్కువ ఉంటుంది. అలాంటిచోట ఏ కొండ గుయ్యారాల్లోనో తలదాచుకుని వేటను అక్కడికే తెచ్చుకుని కాల్చుకుని తింటూండేవారు. చరిత్రకారులు దీన్నే 'గుహావాసదశ' అని అన్నారు. ఈ దశలో కండగల యువకులు జంతువుల వేటకెళ్తే, స్త్రీలూ పిల్లలూ కాయాకసరూ కోసం వేటకెళ్తూండేవారు. ఇప్పుడే వ్యవసాయం, పశుపోషణకవసరమైన బీజావాపనం జరిగింది. గుహావాసాల్లో ఉండే స్త్రీలకు చుట్టుపట్ల పెరిగే కాయాకసరులు పెరిగే కాలాలు తెల్సాయి. సహజంగానే తండా ఎలా వృద్ధి పొందుతున్నదీ తెలిసిన వీరికి గింజలూ - పంటలూ ఎలా వృద్ధి పొందగలవో అర్థమైంది. ఈ దశకల్లా పిల్లల పుట్టుకకు చేప కరవటాలూ నీళ్లు శరీరంలోకి11 ప్రవేశించటాలూ, సూర్యకిరణాలూ, చంద్రకిరణాలూ12 కారణాలు కావనీ పురుషులే కారణమన్న భావం బలపడింది. దీన్ని ఇంతకుముందే వివరించడం జరిగింది. అందుకని వ్యవసాయం మీద, దాని అనుబంధ పశుపాలన మీద, స్త్రీలకే ప్రాజాపత్యం లభించింది. ఉత్పాదన కుపయోగపడేది స్త్రీ అనీ, దాని చిహ్నం 'భగ' మనీ' ఉత్పాదశక్తికి 'సౌభాగ్య'మనీ, ఆ శక్తి నశిస్తే 'దౌర్భాగ్య'మనీ భావించారు. భూమి స్త్రీ చిహ్నం. స్త్రీలాగే భూములూ ఋతుబద్ధాలు. ఈ భావమే మన పురాతన దేవతల్లో 'శాకంభరీ' రూపకల్పనలో కనిపిస్తుంది ఒకప్పుడు భూమికే 'శాకంభరీ' అన్న పేరూ ఉంది.13 భూసౌభాగ్యానికి ఈ దేవతను ఊహించారు. అదెలాగంటే యోని ద్వారా మొక్కలను మొలిపించే స్త్రీ ఆకారం. లేక యోని భాగాన్ని గింజల ఆకారంలో చూపడం. ఇది మొహంజొదారో శిలలమీదా, ఈజిప్షియన్ పిరమిడ్ల గోడల మీదా, గ్రీకు, రోము తదితర యూరోపియన్ ప్రాచీన శిల్పాలలోనూ కనిపిస్తుంది.

అలాగే యోని పూజవల్ల అంటే స్త్రీ సౌభాగ్య పూజనం వల్ల అనుకంపన ఆధారంగా భూమికి కూడా సౌభాగ్యవర్ధనం జరుగుతుందని భావించేవారు. యూరోపియన్ తదితర ప్రాచీన నాగరికతల్లో 'ఆఫ్రొడైట్' అని శాస్త్రజ్ఞులు పిలిచే విగ్రహాలూ, మొహంజొదారోలో దొరికినవీ అన్నీ నాటి ఇలాంటి సౌభాగ్య వర్ధనాన్ని నిరూపించే మూర్తులే.

ఈ విధంగా పశుపాలక నాగరికతలో పురుషుడు ప్రజాపతిగా అవతరిస్తే, వ్యావసాయిక నాగరికతలో స్త్రీ మాతృమూర్తిగా, జగన్మాతగా అవతరించింది. సౌభాగ్యానికీ, వర్ధనానికీ గుర్తుగా యోని నిల్చి దానికి దైవత్వం కూడా వచ్చింది.

ఇలా ఒక దశలో లింగానికీ, మరో దశలో యోనికీ14 సౌభాగ్యవర్ధన చిహ్నాలన్న గుర్తింపులొచ్చాయి.

## వృత్తుల ఆధారంగా సామాజిక పరిణామం
## దైవభావ పరిణామం

సౌభాగ్య తంత్ర చిహ్నాలుగా భావించినవాటికి దైవత్వం ఎలా వచ్చింది? దాని వెనకున్న తాత్త్వికచింతన పరిణామాలేవిధంగా ఉన్నాయి? అన్న వాటిని పరిశీలించడం అవసరం. ఆదిమ మానవుడికి తన కంటి ముందున్న ప్రకృతిలోనూ, తన జాతిలోనూ కనిపించే జనన మరణ చక్రం దిగ్భ్రాంతిని కల్గించింది. తన వశం కాని, తనకు మించిన ఏదో శక్తి ఈ చక్రాన్ని నడిపిస్తోంది అన్న ఎరుక కల్గింది. ఆ ఎరుకే దైవభావంగా అంకురించింది.

సమాజం బాగా అభివృద్ధి చెందిన తర్వాత కూడా పెంపొందిన మత తాత్విక భావాలూ, దైవ భావాలూ ఈ చక్రంలోనే పరిభ్రమించాయి. మత చింతనకూ తత్వచింతనకూ పండితులు ఇక్కడే మునుముపెట్టారు. "పునరపి జననం పునరపి మరణం - పునరపి జననే జఠరే శయనం" అనీ "కాతేకాంతా కస్తే పుత్రః-కస్యత్వంవా కుతయాయాతః" అనీ శంకరాచార్యులు ప్రశ్నించి, సమాధానంగా తన మాయావాదాన్నీ, బ్రహ్మవాదాన్నీ తాత్వికంగా పెంపొందించడం పై దాన్నే బలపరుస్తుంది.

మతాలక్కూడా ఈ ప్రశ్నలకు జవాబులే మూలం అన్న విషయాన్ని ఆయా మతగ్రంథాలు తెల్పుతాయి. మతసంబంధమైన తత్వశాస్త్రాలకు ప్రాణం కాస్మాలజీ, ఎస్కాటాలజీలు. కాస్మాలజీ అంటే విశ్వజననం, పురుషజననం. ఎస్కాటాలజీఅంటే మరణానంతర స్థితి. ఈరెంటినీ సమగ్రంగా వివరించేదే మత మని పండితులు నిర్వచించారు.[15] దైవాన్ని అంగీకరించేవారూ, అంగీకరించని వారూ ఈ రెండు మౌలిక ప్రశ్నలనూ విపులంగా చర్చించారు. మన దేశంలో పూర్వమీమాంసాకారులు దైవాన్ని ఒప్పుకోరు. వారు నిరీశ్వరవాదులు. కానీ జనన మరణ చక్రాన్ని మొట్టమొదట విపులంగా నిరూపించింది వారే. దీన్ని నడిపించేది కర్మ అని వారు సిద్ధాంతీకరించారు ఒకవేళ దైవమంటూ ఎవరన్నా ఉన్నా అతడూ కర్మబద్ధుడేనన్నారు. ఈ చక్రానికి లోబడే ఉంటాడన్నారు. అందువల్ల జననమరణ చక్రాన్ని గుర్తించిన ఆదిమానవుడు ఆ చక్ర భ్రమణానికి తనకు ఆనాటికి తోచిన కారణంతో దైవ భావానికి అంకురారోపణ చేశాడు.

అయితే ఆది మానవునికి ఆధునిక మానవునికి ఒక మౌలికమైన భేదం ఉంది. ఆ చక్రాన్ని దాని మూలకారణాన్ని తాను అదుపులో ఉంచుకోగలను - అని ఆదిమానవుడు భావించాడు. ఆ మూలకారణ శాసనానికి తాను బద్ధుడనని ఆధునిక మానవుడు భావిస్తున్నాడు. ఈ మూలకారణాన్ని శాసించడానికి చేసిన యత్నాలే మంత్రాలుగా (మాజిక్) తంత్రాలుగా (రిచ్యువల్స్) రూపొందాయి. తర్వాతి కాలపు పరిణత మతాలకు ఇవి పునాదులుగా పనికొచ్చాయి, ఇంకా పనికొస్తున్నాయి కూడా. మంత్రం అంటే ఉపాయం. తంత్రం అంటే ఉపాయాన్ని ఆచరణలో పెట్టే క్రియాకలాపం. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు మతాలకు మూలరూపం మాజిక్ అంటే మంత్రం అన్నారు. ఆదిమ జాతుల మంత్రాన్ని స్థూలంగా రెండుగా విభజించారు.

మాజిక్

సింపతిటిక్ మాజిక్ | హోమియోపతిక్ మాజిక్

ఒకవిధంగా చూస్తే ఈ రెంటికీ అర్థం ఒక్కటే అయినా రెండుగా విభజించడానికి కారణం మంత్రం వల్ల కాక దాన్ని చేపట్టే తంత్ర భేదం వల్లనే.

సింపతిటిక్ మాజిక్‌ను అనుకంపం అంటే హోమియోపతిక్ మాజిక్‌ను స్వకంపం అనవచ్చు. సాహిత్య పరిభాషలో చెప్పాలంటే, తన ఉదాత్త కవిత వల్ల కవిలో సాత్విక భావాలు కలిగితే అది స్వకంపనం. ఉదాత్త కవితాపరనం వల్ల శ్రోతల్లో కలిగే సాత్విక భావాలు అనుకంపనం ...కి తాంత్రికులు మహా

మంత్రాలనీ, అభిచార మంత్రాలని మొదట్లో అన్నారు. కాని వాటికి ఆ భేదం సమసిపోయి తంత్ర సహాయం లేని శుద్ధమంత్రానికి మహామంత్రం అనీ, తంత్రా ధీనమైన ప్రయోగమంత్రానికి అభిచారమంత్రమన్నది ఇప్పుడు స్థిరపడింది.

వేదాలలో రుక్కులు శుద్ధ మంత్రాలలాంటివి. యజుర్మంత్రాలు ప్రయోగశరణ్యాలు. కాని ఆదికాలంలో తంత్రం అన్ని మంత్రాలకూ ఉండేది. ఆనాడు మంత్ర తంత్ర సమన్వయం ఉండేది. ఈ పరిణామాన్ని తెలుసు కొనడంకోసం ఆదిమ సమాజంలో మంత్రతంత్ర ఆవిర్భావాన్ని దశలవారీ పరి ణామాన్ని తెలుసుకోవడం అవసరం. ఇవి సరిగా తెలియంది దేవాలయాల్లో ఆనాడు జరిగే మైథున కర్మకాండలూ, పూజారుల తతంగాలూ, ఆయా పండుగల వెనక జరిగే ఆర్భాటాలూ అర్థం కావు అలాటప్పుడు దేవాలయాలపై నేడు కన్పించే బూతు బొమ్మల తత్వమూ బోధపడదు. ధర్మారావు దీన్ని అంటే ఈ తత్వాన్ని చాలా సూక్ష్మంగా చెప్పి ఎక్కువగా తంత్ర భాగాన్ని విడమర్చ డానికే యత్నించారు.

మొదట్లో జననమరణ చక్రాన్ని చూసి ఆది మానవుడు ఆశ్చర్య పోయాడు. ఈ ఆశ్చర్యాన్ని కల్పించింది ముందుగా ప్రకృతి కాదు. తన తండా. అన్న సంగ్రహణంకోసం పరుగులు పెట్టే దశలో గాయపడ్డవారు కొందరు ఎప్పటికీ కోలుకునేవారుకాదు. దీనికి కారణం ఏమిటో అతనికి తెలీదు. హఠాత్తుగా తండాలోకి కొత్త జీవాలొచ్చేవి. వారెలా వచ్చేవారో తెలీదు అంతవరకూ వేటలో ఎక్కువ చురుకుదనం చూపినవాడు మాటా చూపూ లేకుండా పడిపోయి చివికి పోవడం, మరొక జీవి తండాలో ఆవిర్భ వించి పెరిగి వేటలో మెలకువ సంపాదించి వెనకటివాడిలా వేట గురించిన విషయాలను ఆచరిస్తూండటం చూసిన మీదట ఇది ఏమిటి? అన్న ప్రశ్న తండా వృద్ధుల్లో రావడం సహజం. ఈ ప్రశ్న అంకురించి కొన్ని శతాబ్దాల పాటు పెంపొందిన మీదట ఈ పరిణామం ప్రకృతిలోనూ వారికి సర్వత్రా గోచ రించింది. ఇలాగ పెంపొందిన ఈ ఎరుక ఒక తరం నుండి మరో తరానికి సంప్రదత్తమై ఒకానొక స్థాయికి వృద్ధి పొందిన తర్వాతనే దాని కారణాలమీద ఆలోచనలు సాగాయి. ఈ ఆలోచనలు కూడా ఒకరినుండి మరొకరికి సంక్ర మిస్తూ పెరుగుతూవచ్చాయి. ఇవి ఒక స్థాయికి పెరిగిన దశ మాత్రమే మన ఊహకుఅందుతుంది. అప్పటికి అన్నసంపాదకులలో కొంత సాపేక్ష స్థిరత్వం (రిలెటివ్ స్టెబిలిటీ) కూడా ఏర్పడింది. తనను గురించి, ప్రకృతిని గురించీ జ్ఞానంకూడా కొంత సంచితమైంది.

తొలిదశల్లో అన్నసంపాదకులు ఒకరు నదీ తీరాలూ, సరస్సులూ అంటిపెట్టుకుని జల, భూచరాలను కందమూలాలను ఉపాహారంగా చేసుకుని జీవిస్తూండేవారు. ఇక రెండోవారు కొండలు, కోనల్లో సంగ్రహణకోసం తిరుగుతూ తమ వేటకు కందమూలాలను ఉపాహారంగా చేసుకుని జీవిస్తూండేవారు. వీరిలో నీటి ఒడ్డునున్నవారికి అన్నం పుష్కలంగా లభించేది. అడవులూ పచ్చిక బీళ్ళూ అందుబాటులో ఉండేవి. అడవులూ కొండల్లోవారికి అన్నం దొరికేది. కానీ జలచరాలు జలపక్షులుండేవి కావు. కనుక ఈ రెండు గణాల పెంపుదలల్లో స్వభావాల్లో కొంత భేదం ఉండడం సహజం. జలావాసాల తండాలను గాంగేయ గణాలనీ, పర్వతాల నాశ్రయించుకున్న వారిని పార్వతీయులనీ అనవచ్చు.

ఆహారం పుష్కలంగా దొరికే రుతువుల్లో కదలకుండా స్థావరంగా ఉండేవారు. తీరిక దొరికే ఈ జీవితం వీరి ఆలోచనలను పదును పెట్టడానికి సాయపడింది. దీనికి పరిసరాల్లోని ప్రకృతి పరిజ్ఞానం మరింత తోడుపడింది. వేట జంతువులూ, వాటి అలవాట్లూ, వాటి అన్న సంగ్రహణ ప్రాంతాలూ, వాటి వృద్ధిక్షయాలూ, ఆ జంతువుల శత్రుమిత్ర గణాలూ మొదలైన వివరాలు వీరికి అర్థంకాజొచ్చాయి. అందువల్ల ఈ తండాలు తమకి అనువైన ప్రాంతాలను ఎన్నుకుని అక్కడి నిర్దిష్ట ప్రాణికోటిని ఆహారంగా సంగ్రహిస్తూ మనగల్గేవారు. అలాంటి దశలో మొదట తమ తండాలో మాత్రమే కనిపించిన జననమరణ చక్రాన్ని తన మనుగడకు మూలాధారమైన జంతుకోటిలో కూడా చూడగల్గారు. ఈ చూపులో వారికి మరో అంశం కూడా గోచరించింది. ఇదివరకు వాటి జననమరణ చక్రానికి రెండే ఆకులుండేవి. అవి పుట్టుకా-చావూ. ఇప్పుడు వారికి మూడో ఆకు కూడా కన్పించింది. అదే వృద్ధి. జనన - వృద్ధి-మరణం అనే మూడాకులతో ఈ చక్రం సమగ్రంగా సాక్షాత్కరించింది. అంతవరకూ ఉన్న రెండు ప్రశ్నలైన పుట్టుక-చావులకు తోడు 'వృద్ధి' అన్న మూడో ప్రశ్నకూడా తోడైంది. ఈ ప్రశ్నలకు చిన్నచిన్నగా సమాధానాలు కూడా కనిపించసాగాయి. తాను ఒక జంతువును వేటాడుతున్నాడు. తింటున్నాడు. ఈ క్రియలో జంతువు మరణించింది. ఆ మరణం వల్ల తాను వృద్ధి పొందుతున్నాడు. తన వృద్ధివల్ల తన తండాలో కొత్త ప్రాణులు ఉద్భవిస్తున్నాయి. దీనితో ఒక కొత్త సంగతి అతనికి గోచరించింది. ఒక మరణం ఒక వృద్ధికి కారణం.[17] ఒక వృద్ధి మరో జననానికి హేతువు. కనుక మరణం అనేది ప్రాణుల్లో ఒక కీలకాంశంగా మనిషికి తోచింది. ఈనాడు మానవునికి

మరణం విషాదాంతం అయింది కానీ, అది మానవునికి మరణం తన మను గడకు మూలం, సుఖాంతం కూడానూ. అందువల్ల మృత్యువుకు అతిలోక శక్తిని అతడు కల్పించుకున్నాడు దానికొక పవిత్రతను కూడా కల్పించాడు. నూతన సృష్టి స్థితులకు మూలమైన మృత్యువు కొంతవరకు అతని అదుపులో కూడా ఉంది అన్నానికి ఉపయోగపడే జంతువును తానే చంపుతున్నాడు. దాన్ని తిన్న తర్వాత తాను పుష్టిని పొందుతున్నాడు. తన తండా వృద్ధికూడా అవుతోంది. అలాగే ఆ జంతువు మృతివల్ల ఆ జంతువు సంతతికూడా పుష్టిగా వృద్ధి చెందగలదని అతనికి తోచింది.[18] అలా తట్టిన మరుక్షణంలోనే అన్న సృష్టి - వృద్ధి ఈ రెండు క్రియలూ తన ఆధీనంలో ఉన్నట్టు భావించాడు. ఆ భావంనుండే పుష్టి వర్ధనోపాయం అంకురించింది. అయితే ఈ ఉపాయాన్ని ఎప్పుడు ప్రయోగించాలి ఆహారానికి పనికొచ్చే జంతువును చంపినప్పుడే ఈ ఉపాయాన్ని ప్రయోగించాలి. వీటి అవశేషాలు వేదకాలంలో కూడా మనకు కనిపిస్తాయి వేదాలు మంత్రాలయితే ఆ మంత్ర ప్రయోగం సమయంలో పశు బలి ఉంటుంది వాటన్నిటికీ ఫలం పుష్టి. కొన్ని యాగాలకు పౌష్టిక యాగా లనీ, కొన్ని మంత్రాలకు పౌష్టిక మంత్రాలనీ పేరు మిగిలి ఉండడం దీన్నే రుజువు చేస్తాయి. పోతే జనన - వర్ధన రెండు క్రియలనూ కలిపి పుష్టి అని పేరు. ''యజ్ఞాద్భవంతి భూతాని'' - అన్న ఋగ్వేద ఊహకు ఆదిమ మాన వుని పై అనుభవమే ఆధారం.

జనన మరణ చక్రానికి మూలకందమైన పశుబలిని తినడం అన్నదానికి మనిషి ఓ ప్రత్యేకతను ఆపాదించాడు. దానితో ఆ క్రియ చుట్టూ క్రమంగా తంత్రం (రిచ్యువల్) అల్లుకుంది. తమ పుష్టికి కారణమైన ఆ జంతువే తమ తండా మనుగడకు మూలమన్న భావం అంకురించింది. ఆ జంతువు నుండి తమ శరీరం కానీ తండా కానీ భిన్నం కావన్న ఆలోచన పుట్టింది. తమలో ఎవరైనా ఏ కారణంవల్లనైనా చనిపోతే జంతువును చంపినప్పుడు చేసే తంత్రాన్ని ఆమృతునిపై కూడా చేస్తే, అది నరరూపంలో ఉన్న వంశాన్ని (అంత ర్వంశం), జంతురూపంలో ఉన్న తమ ఆహార వంశాన్ని (బహిర్వంశం) పుష్టినొందిస్తుందని నమ్మారు.[19] అందుకని తమలో చనిపోయిన పితరులనూ, తమ కట్టెదుట పెరుగుతున్న అన్నరూపమైన జంతుజాలాన్నీ ఒకే రూపంలో దర్శించగలిగాడు [20] కనుకనే వేదవాఙ్మయంలో పితుః శబ్దానికి అన్నం అనే అర్థం సంస్కృత నిఘంటువు చూపుతుంది. ఆది మానవునికి తనకు పుష్టి కల్గించే జంతువు పితృరూపంలో మిగిలింది. తర్వాత కాలంలో తండాకు మూలపురుషుడు ఆ జంతువేనన్న భావం పెరిగింది. అతడికి జరిపే పౌష్టిక

తంత్రాలకన్నిటికి పితృయూపంలో ఆ జంతువే ఆలంబనమైంది. ఈ విధంగా తండాలకు టోటెమ్[21] అన్న పితృరూపానికి దైవరూపం వచ్చింది. జనన మరణచక్రాలకు మూలభూతమైన మృత్యువు 'పితరుడు'గా, చివరకు 'దైవం'గా అవతరించింది.[22]

తన తండాలో మృత్యువుకూ అపమృత్యువుకూ (ఆక్సిడెంటు) గురైన వాడికీ, పితృరూపమైన జంతువుకూ భేదంలేదని అతడు భావించాడు. జంతువును తానెలా భుజిస్తూ వచ్చాడో పుష్టివర్ధకుడైన తన పితరుని కూడా తినాల్సిన అవసరం ఉంది అని భావించడం సహజం అలా కానప్పుడు జనన మరణ చక్రానికి కీలక స్థానం మృత్యువుకు దక్కదు. అందుకని జంతువును చంపినప్పుడు పుష్టివర్ధక క్రియగా ఒక ప్రత్యేక భాగాన్ని తాంత్రిక రూపంలో తినడం అనే సంప్రదాయాన్నేర్పర్చుకుని అదే సంప్రదాయాన్ని తన పితరుల విషయంలో కూడా పాటించి పుష్టివర్ధనానికి దోహదం చేసుకునేవాడు. ఇలాంటి వాటినుంచే రిచ్యువల్ ఆఫ్ ఈటింగ్ ది డెడ్ అన్న తాంత్రిక భక్షణ అంకురించింది. ఈ తంత్రంనుండె రాక్షసులు - అసురులు నరభక్షకులని పురాణ కాలంలోనూ, ప్రపంచ పర్యటనలు చేసిన క్రైస్తవ మిషనరీల రాతల్లోనూ మనకు కనిపిస్తుంది. భారతంలో పాండురాజు శవాన్ని భక్షించే ఘట్టాన్ని ఈ భావంతోనే అర్థం చేసుకోవాలి. ఈ తాంత్రిక భక్షణ అనేక రూపాల్లో ఉంటుంది. లాంఛనంగా ఏదో ప్రత్యేక భాగాన్ని తినవచ్చు. నిన్న మొన్నటి వరకూ యజ్ఞాలు చేసేవారు బలిపశువు 'వప' (కొవ్వుపొర)ను మాత్రమే లాంఛనంగా తినేవారు. ఇది ఒక పద్ధతి.

రెండవ పద్ధతి నెత్తురు. అన్నిటికన్నా పుష్టిని భావించి తాగటం శరీరానికి పట్టించుకోడం అన్నది ఇందులో వస్తుంది. ఈ క్రియవల్ల మృతుల పుష్టి తమకు సంక్రమిస్తుందని వాళ్ళు నమ్మేవారు. శవభక్షణలాంటిది అనాగరకంగా తోచిన నాగరిక దశలో నిన్నమొన్నటి వరకూ కూడా మృతుల రక్తాన్ని మాత్రమే లాంఛనంగా చవిచూసి వంటికి పూసుకునేవారు. భారతంలో భీమసేనుడు దుశ్శాసనుడి రక్తం తాగడం, దాన్ని ద్రౌపది కురులకు పూయడం దీన్నే రుజువుచేస్తుంది. అయితే దీనికి కసితో చేసిన పని అన్న అర్థం ఇవ్వ బూనటం తర్వాతి విషయం. క్రమంగా రక్తానికి ప్రత్యామ్నాయంగా ఎర్ర చందనం వాడేవారు. దాన్ని పేరగింపం అన్నారు. యుద్ధభూమిలో మృతుల రక్తంతో అన్నం వండి, ఆ రక్తంతో స్నానం చేసి పేగులు మెడలో యజ్ఞోపవీతాలుగా ధరించి, రక్తాన్నాన్ని భూతబలిచ్చి శవం గుండెల మీద కొంత అన్నాన్ని పెట్టి దాన్ని లాంఛనంగా తినే ఆచారం నిన్న మొన్నటి వరకూ

తెలుగునాట ఉండేది. దీనికి వీరభోజనం అని పేరు.[24] వెలుగోటివారి చరిత్ర ఇలాటిదాన్ని నమోదు చేసింది. కుంకుమ, సిందూరం, రక్తచందనం, ఎర్ర మన్ను ఇవన్నీ రక్తానికి ప్రత్యామ్నాయాలుగా ఈనాటికీ మనకు కనిపిస్తాయి. మల్లులకు గురువైన ఆంజనేయునికి సిందూరం ప్రీతి. గురురక్తాన్ని పూసుకోడం ద్వారా గురుశక్తి తమలో ప్రవేశిస్తుందన్న భావంతో ఆంజనేయ భక్తులు సిందూరం బొట్టు పెట్టుకుంటారు.[25] రాసుకుంటారు. మల్లులు గోదాలోకి దిగినప్పుడు అక్కడి ఎర్రమన్నుకు నమస్కారం చేసి దాన్ని వంటికి పులుముకోవడం ద్వారా అనేక మల్లుల శక్తిని తమలో ఆవహించుకొంటూంటారు.[26] మన దేశంలో అన్న సంపాదకుడు సజీవుడుగా ఉన్నాడనడానికి నిదర్శనంగా తన భార్యకు పాపిట సిందూరం, నుదుట తిలకం దిద్దే అలవాటు నేటికీ ఉంది. ఇది చెరగడమంటే అన్న సంపాదకుడు లేడన్నమాట. ఇవన్నీ రక్తపాన తంత్ర అవశేషాలేనంటూ ప్రొ. డి. డి. కొశాంబ్ అనేక ఉదాహరణలతో సమర్థించాడు.

గాంగేయగణాలు ఆహారానికి పనికొచ్చే జంతువులనూ, ఓషధులనూ వృద్ధిచేసుకోవడం నేర్చుకున్నాయి. ఉష అంటే భోజనం కనుకనే దానికి ఓషధి అన్న పేరొచ్చింది. ఈ ఆదిమ జనావాసాలనే చరిత్రకారులు నదీలోయ నాగరికతలనీ, సరస్సు నాగరికతలనీ అన్నారు. సింధు, నైలు, డాన్, బైకాన్, బాబిలోనియా నాగరికతలన్నీ ఇలాంటివే. దీనితోనే ప్రకృతికి ప్రతిద్వంద్విగా సంస్కృతి ఆవిర్భవించింది. తర్వాతి కాలంలో ఇదే మేదినీ సంస్కృతి (అగ్రికల్చర్), పశుపాలన సంస్కృతులు (పాస్టోరల్ కల్చర్)గా ఆవిర్భవించాయి.

ఈ భౌతిక సంస్కృతులకు (మెటీరియల్ కల్చర్) అనువుగా ఆయా గణాల్లో చేతన సంస్కృతి కూడా (స్పిరిచ్యువల్ కల్చర్) పెంపొందింది.

మేదినీ సంస్కృతిని వృద్ధిపొందించడం ఆదిలో స్త్రీలు అలవర్చుకున్నారని తెలుసుకున్నాం. అప్పటి సమాజంలో స్త్రీలే అధిపతులు గనుక స్త్రీలే గణాధి దేవతలు. తండాలూ అలాగే. దితి-దైత్యులు; అదితి - ఆదిత్యులు; దనువు-దానవులనే గుర్తింపు పొందేవి. స్థిరత్వానికి ఓషధుల పెంపకం అవసరం. గణాలు దీనికి ప్రాముఖ్యాన్నిచ్చాయి. దీనితో కొత్త విజ్ఞానాన్ని సంతరించుకోవాల్సి వచ్చింది. జంతువులు, మానవుల్లోలాగే జననమరణ చక్రాన్ని ఓషధులకు కూడా అన్వయించడం నేర్చుకున్నారు. మృతులైన పితరులు నేలలోకి పోయి తిరిగి ఆవిర్భవిస్తారన్న విశ్వాసాన్నే ఓషధీరోహణలో కూడా ఊహించారు. ప్రత్యక్షంగా కనిపించింది కూడానూ. బీజం మరణించి భూమిలోకి పోతుంది. కొంతకాలం అక్కడున్న తర్వాత అంకుర రూపంలో వెల్వడి పెరిగి అనేక బీజాలనిస్తుంది. ఆ బీజాలు మరణించి ఆహార రూపంలో పుష్టి

నిస్తాయి. ఆ పుష్టివల్ల తమ సంతానం వృద్ధి అవుతోంది. ఇటు మృత బీజాలు భూమిలో చేరి అంకురరూపంలోనూ, అటు పితృభాగాలు శరీరంలో చేరి శిశు రూపంలోనూ ఆవిర్భవిస్తాయి. అందుకని భూమికి స్త్రీకి సారూప్యాన్ని గమనించగలిగారు. ఈ భావననుండే తర్వాత కాలంలో భూమి అడుగున మృత లోకమైన నరకముందనీ, స్త్రీ గర్భం కూడా నరకమేననీ భావించారు. ఈ ఉదంతాన్ని గ్రీకు పురాణాల్లో దయానా - ప్రోసర్పినా గాథ విపులంగా వివరిస్తుంది. ఈ పేర్లు ఆయా గ్రంథాల్లో అనేక రకాలుగా మారాయి. కానీ అసలు విషయం అదే. దయానా ఒక గొప్ప వేటకత్తె. ఆఖేటక దశనాటి స్త్రీకి గుర్తు. ఆమె కూతురు ప్రోసర్పినా. చాలా అందగత్తె. ఒకనాడు ప్రోసర్పినా అడవిలో తిరుగుతూండగా నరకాధిపతి ప్లూటో అంటే యముడు ఆమెను మోహించి చెరబట్టి తన లోకానికి తీసుకుని పోతాడు. దీన్ని అక్కడ తిరుగుతున్న పంది పిల్లలు చూశాయి. వెంటబడ్డాయి. భూమిలో గర్తల్లో రథాన్ని దూకించి ప్లూటో ఆమెతో మాయమయ్యాడు. పంది గున్నలు అక్కడే దిక్కుతోచక గర్తలలో పడి ఉన్నాయి.

దయానాకు కూతురు కనిపించలేదు. భూ స్వర్గలోకాలు గాలించింది. దేవతలందర్నీ అడిగింది. వాళ్ళకూ అంతుబట్టలేదు. నరకంలోకి చూడడం దేవతలకు సాధ్యం కాలేదు. దయానా అడవిలో వెతుకుతుంటే గర్తల్లో పంది పిల్లలు కనిపించి విషయం చెప్పాయి. దయానా దేవసభలో వ్యాజ్యం వేసింది. ప్లూటోను దేవరాజు పిలిపించాడు. ప్రోసర్పినాను తల్లికి అప్పగించమన్నాడు. నరకాధిపతి అంగీకరించలేదు. అందరూ ఒక రాజీ మార్గానికొచ్చారు. నరకలోకం చేరినవారు తిరిగిరాని నియమం అనుల్లంఘనీయం. అయినా రూపం మారితే రావచ్చు. అదైనా కొంతకాలం వరకే. ఆకాలం తర్వాత తిరిగి నరకానికి ఆమె చేరుకోవాలని ప్లూటో సూచించాడు. అందరూ అంగీకరించారు. దయానా కూడా విధిలేక అంగీకరించింది. ఆ మేరకు ప్రోసర్పినాను ఆరునెల్లు నరకంలోనూ, ఆరునెల్లు భూలోకంలోనూ ఉండేలా కట్టడిచేశాడు.[27]

ఈ కథలో ప్రోసర్పినా అంకురం. నరకలోకం భూమిపొర. ఆరునెల్లు భూమి పొరల్లోపల అణగి ఉన్న బీజాలు అంకురించి మరో ఆరునెల్లో వృద్ధి పొందుతాయి. బీజాలు తిరిగి ఆరు నెలలు నరకవాసానికి పోయి మళ్ళీ అంకురిస్తాయి. ఇది ఓషధీ జనన మరణ చక్రం. మానవ చక్రం కూడా ఇదే పద్ధతిలో ఊహించారు. దీన్నే శంకరుడు తన శ్లోకంలో చెప్పడాన్ని ఇంతకు ముందే వివరించడం జరిగింది.

ఈ కథనుబట్టి వేటకత్తె దశలో ఉన్న దయానా ఓషధీ సంస్కారం నేర్చుకున్న క్రమం తెలుస్తుంది. తమకు పుష్టి కలిగించే బీజానికి నరకవాసంలో కూడా పుష్టి అవసరమని ఆదిమానవులు అనుకున్నారు. తమ గర్భనరకంలో ఉన్న శిశువుక్కూడా పుష్టి ఎంత అవసరమో, భూగర్భ నరకంలో ఉన్న బీజానికీ అంతే అవసరమని భావించడం నాటి సామాజిక విజ్ఞానం ప్రకారం అత్యంత సహజం. అందువల్ల తమకు ఏది పుష్టినిచ్చే ఆహారమో భూగర్భ వాసం చేస్తున్న బీజానికీ అదే పుష్టినిస్తుందని అనుకున్నారు. భూపౌష్టిక తంత్రాలు ఆవిర్భవించాయి.

ఈ కథలో గమనించాల్సిన మరో అంశం ఉంది అది ప్రోసర్పినా అపహరణోదంతాన్ని దయానాకు చెప్పిన పందిగున్నలు. మనిషి మొదట్లో మచ్చిక చేసుకున్న జంతువుల్లో తామరతంపరగా వృద్ధి అయ్యేది పంది. అంతేకాక వ్యవసాయ విజ్ఞానానికి కూడా ఇది ఎంతో తోడ్పడింది. జలాశయాల సరసనున్న చిత్తడి నేలల్లోనూ ఆవల్లోనూ తుంగ ముస్తలకోసం భూమిని కుళ్ళగించడం వల్ల నీరుజారిపోయి బీజారోహణకు అనుకూలమైన మెత్తని నేల పైకొచ్చేది. అక్కడ పడిన బీజాలు చాలా ఏపుగా పెరిగి అధికాధికంగా ఫలితాన్ని ఇచ్చేవి. నేల అడుగు పొరలు తిరగేయడంవల్లా, తేమ సమృద్ధిగా ఉండడంవల్లా ఏపుగా మొక్క పెరిగిందన్న విషయం గ్రహించడానికి ఆనాటి జ్ఞానం చాలదు. జంగమ పశువుల్లో సంతానాభివృద్ధిని ఎక్కువగా చేసుకునే పంది నేలను సంస్కరించడంవల్ల ఆ పశులక్షణమే ఓషధులకు కూడా వచ్చిందని వాళ్ళనుకున్నారు. ఇది వేట దశలో వారు నేర్చుకున్న స్వకంపన మంత్రం (హోమియోపతిక్ మాజిక్). దీన్నే పౌష్టిక తంత్రం అనవచ్చు. అందువల్ల తొలిదినాల్లో పందిగున్న భూపౌష్టిక తంత్రాలకు చిహ్నమైంది. నీటిలో మునిగిన భూమిని ఉద్ధరించిన వరాహావతారం ఈ జ్ఞాపకాలకే పౌరాణిక రూపకల్పన కావచ్చు. వ్యవసాయ సంస్కృతికి చిహ్నంగా వెలసిన ఈ వరాహాన్నే తర్వాత అనేక రాజవంశాలు తమ ధ్వజంగా, రాజముద్రికగా స్వీకరించాయి. భారతదేశంలోని ప్రాచీన రాజవంశాలు వరాహలాంఛనంగా ఉంచుకున్నాయి. నాణాన్ని వరాహ, వరహా అనికూడా అంటారు. రామదాసు పాటల్లో - "సీతమ్మకు చేయిస్తి చింతాక పతకాము - ఆ - పతకామునకూ పట్టె పదివేల వరహాలు" అని కనిపిస్తుంది.

ఈరకంగా ప్రపంచ వ్యాప్తంగా వ్యావసాయిక సౌభాగ్యతంత్రాలకు పంది చిహ్నంగా వచ్చింది.[28] తెలుగు దేశంలో సౌభాగ్యదేవతకు 'పోల' అని పేరు. ఇది ఉభయలింగాలలో పోలమ్మ, పోలేరాజు, పోలేరమ్మ,

పోలయ్య అంటూ కనిపిస్తుంది. భూసారాన్ని రక్షించుకోవడానికి ఒక పంది గున్నను ఆ భూమిలో ఒక గోతిలో వేసి అది చనిపోయేదాకా కాలితో తొక్కడాన్ని 'పొలి' తొక్కడం అంటారు. ఆ సమయంలో వేసే కేకలను 'పొలికేక' లంటారు. పొలిని బంధించిన మేరకు 'పొలిమేర' అన్నపేరూ వచ్చింది. బలి వల్ల భూమికి సౌభాగ్యం పెరుగుతుందన్న నమ్మకమే నరరక్తం ప్రవహించిన యుద్ధభూమిని 'పొలికలను' అని పిలిచేలా చేసింది.

మొదట్లో సంతానోత్పత్తి తెలియని దశలో స్త్రీకి భూమికీ సారూప్యం కనిపెట్టారు. రుతువుల వల్ల కూడా ఈ రెంటికీ సంబంధం గమనించారు. క్రమంగా ఈ రెంటికీ సౌభాగ్య చిహ్నాలను కూడా ఏర్పరచుకున్నారు. పుష్టి వర్ధక క్రియలనూ ఆ భావంతోనే పెంపొందించుకున్నారు. కొంతకాలానికి స్థవిరులుగా స్త్రీలు వ్యవసాయం అలవర్చుకున్నారు. జంగమాలుగా పురుషులు పశుపాలకులయ్యారు. ఇవే క్రమంగా రెండూ రెండు ప్రధాన వృత్తుల య్యాయి.[29] పురుష ప్రాజాపత్యం - స్త్రీ ప్రాజాపత్యాలుండే సమాజాలుగా మారాయి. పురుష సమాజంలో సౌభాగ్య వర్ధనానికి వృషభం, వృషభాంగం; స్త్రీ సమాజంలో కూడా అప్పుడప్పుడే వృషభాంగం గొప్పతనం గమనించడం జరిగింది. అదే క్రమంలో పురుషుల్లో పుష్టిగల యువకులే స్త్రీ సౌభాగ్య వర్ధకులన్న ఎరుకా వారికి కలిగింది. అలాటి పురుషులు అనేకులుండాలని స్త్రీలు తలచారు. ఇది వ్యావసాయిక అనుభవం. దీనినుండే "ఏకోశక్తిః - పురుషోబహవః" - అన్న సాంఖ్యంలో సూక్తి వచ్చింది. ఇక పురుషుల్లో ఇలా కాక ఒక ఆబోతు అనేక ఆవులకు సౌభాగ్యవర్ధనానికి సరిపోతుందనీ అలాగే స్త్రీకి కూడా అనీ భావించారు. దీనివల్లే వారి పశుపాలక అనుభవం నుండి "ఏకోపురుషః - ప్రకృతిరనంత"- అన్న బ్రహ్మవాదసూక్తి పుట్టింది.

సమాజం రెండుగా ఇలా చీలినా రెండూ పరస్పరాశ్రయాలుగానే ఉండేవి. విజ్ఞానం ఆదాన ప్రదానాలతో పెంపొందుతూనే ఉంది. అయినా వ్యావసాయిక గణాల్లో భూమికీ, స్త్రీ యోనికీ సారూప్యం ఉన్నట్టూ రెంటికీ దైవత్వం ఆపాదించడాన్నీ ఇంతకుముందే చూశాం. అలాగే పశుపాలకులకు పురుషాంగం భూసౌభాగ్య తంత్రంలో ప్రధానమైంది. ఈ రెండూ కలిసే పందిని పొలిపెట్టడం, ఎద్దును బలివ్వడం వంటి భూసౌభాగ్యవర్ధన తంత్రాలుగా వెలిశాయి.

ఈ సౌభాగ్య తంత్రాల పరిణామాన్ని జాగ్రత్తగా అధ్యయనం చేయడం అవసరం. ఎందుకంటే వీటి మారురూపాలే తమ గ్రంథంలో ధర్మారావు

వివరించిన అనేక బహిరంగ సంగమాలు, యజ్ఞాలు, పండుగలుగా మనకు కనిపిస్తాయి.

జననమరణ చక్రంలో మృత్యువు జననానికీ - వర్ధనానికీ కారణమని మానవుడు తెలుసుకున్న విధానాన్ని గమనించాం. దీని ఆధారంతోనే సౌభాగ్య వర్ధనానికి అనేక మృత్యు తంత్రాలు పుట్టాయి. విత్తనం భూమిలో పడి చచ్చి తిరిగి పుడుతోంది. ఈ వర్ధన శక్తి గట్టి గింజకు గానీ, తప్పాలాలుకు కాదని కూడా నాటి వారు తెలుసుకున్నారు. కనుక జనన, వర్ధనాలకు దోహదం చేసేది యవ్వనంలో ఉండగా వచ్చే చావుగానీ జరాజీర్ణదశలో వచ్చే మృత్యువు కాదని ఆదిమానవులకవగతమైంది.

వ్యావసాయిక, పశుపాలక గణాల పునర్మేలనంతో విజ్ఞానం ఆదాన ప్రదానం అయింది. పశుపాలక గణాల విజ్ఞాన సంపర్కంతో స్త్రీల గర్భ ధారణకు కారణం పురుషుడని తెలిసింది. బలిష్ఠుడూ, ద్రాఢిష్ఠుడూ అయిన పురుషుని బీజం బలిష్ఠమైన సంతానానికి కారణం అని తెలుసుకున్నారు. అప్పటికే వ్యవసాయ సౌభాగ్యతంత్రాల్లో స్త్రీకి, భూమికి సారూప్యం ఏర్పడిందన్నది గమనించాం. స్త్రీలకు సౌభాగ్యవర్ధనం కలిగించగలిగిన యువకుడు, భూమికి కూడా సౌభాగ్యవర్ధనం కలిగించగలడన్న నమ్మకం ఆ గణాలకు ఏర్పడింది. పురుషుడికీ భూమిలో నాటే బీజానికీ అలా సారూప్యం ఊహించుకున్నారు.

యువకులను సజీవంగా పాతిపెట్టడం, ముక్కలుగా తరిగి పాతిపెట్టడం, కాల్చి ఆ బూడిదను వెదజల్లడం, చంపి రక్తాన్ని ప్రోక్షించడం లాంటి అనేక సౌభాగ్యతంత్రాలు తలెత్తాయి. ఎంత సౌభాగ్యవర్ధనం కోసం హత్య చెయ్యాల్సి వచ్చినా అదివరకే ఆ యువకుని మీద అప్యాయం, మమకారం స్త్రీలకు పెరిగి ఉన్నందువల్ల ఈ తంత్రపు కార్యకలాపాల్లో ఏడుపు, గుండెలు బాదుకోడం లాంటి శోకమంత్రాలు కూడా ఆవిర్భవించాయి. ఆ వెంటనే ఆ యువకుడు ఓషధీ రూపంలో పునర్జన్మ ఎత్తి తమకూ తమ సంతానానికీ పుష్టి చేకూరుస్తాడు. కనుక సంతోషం, ఉత్సాహం. దాంతో ఆనంద ప్రకటన మంత్రాలు కూడా పుట్టాయి. ఇవి ఈజిప్టులోని మృత్యుజనన తంత్రాలుగా, పశ్చిమాసియాలో తమూజ్, బాల్ తంత్రాలుగా తర్వాతి కాలంలో అవతరించాయి. అవే యూరప్‌లోని కార్నివాల్, భారత దేశంలోని కామదహనం పండుగలుగా రూపొందాయి. వీటిని ధర్మారావు ఈ గ్రంథంలో వివరించారు. ఆయా దేశాల్లో తాము తినే తిండి ఆసిరిస్, తమూజ్‌ల శరీర భాగాలనే భావన కూడా పెంపొందింది.

భూసౌభాగ్యవర్ధన క్రియల్లో నరమేధం గూర్చి కొంత విపులంగా చూడడం అవసరం. ఎందుకంటే ఇది ప్రపంచవ్యాప్తంగా కనిపిస్తుంది. దీని గుర్తులు భారతదేశంలోని కొన్ని మతాల తాత్విక భావనల్లోనూ తంత్రాల్లోనూ ఇంకా మిగిలి ఉన్నాయి.

తొలిరోజుల్లో ఈ నరమేధాలు రహస్యంగా జరిగేవి. తల్లి ఈ బాధ్యతను నిర్వహించేది. దీని నిర్వహణకు అవసరమయ్యే పారవశ్యం కోసం మధువు, మాదక ద్రవ్యాలూ ఉపయోగించేవారు. నగ్ననాట్యం చేస్తూ నరమేధానికి సిద్ధమైన యువకుడి సమస్తభాగాలూ మర్మాంగాలుగా భావించే ప్రక్రియలూ అవీ స్త్రీలు చేపట్టేవారు. ఈ తంత్రాలే గ్రీకు, రోము దేశాలలోని 'బకనాలియా' తంత్రాలుగానూ, భారతదేశంలో రేణుకా తంత్రాలుగానూ నిలిచాయి. బేకస్ అనుయాయులే బకనాలియాలు.

ఈ బేకస్ ద్రాక్షాసవం కనిపెట్టాడని పాశ్చాత్య పురాణాలు చెప్తాయి.[30] పురుషమేధ తంత్రాన్ని ఇతడే ప్రచారం చేశాడంటారు రాణివాసమంతా బేకస్ వెంటపడి అడవుల్లో సిగ్గూలజ్జా విడిచి ప్రవర్తిస్తున్నారని రాజులు బేకస్‌ను దేశబహిష్కృతుణ్ణి చేస్తారు. అప్పుడు రాణులు తమ భర్తల్నే చంపిన, చంపించిన ఉదంతాలు గ్రీకు చరిత్రలో దొరుకుతున్నాయి.[31] ఇతడు భారత దేశం నుండే ఈ తంత్రాలు నేర్చుకున్నాడని అంటారు. వీటికీ, రేణుకా తంత్రాలకూ చాలా పోలికలను పండితులు పసిగట్టారు. బేకస్‌ను బచ్చూస్ అనీ అంటారు. భారత దేశంలో వత్సరాజులు. వీరి కొడుకు నరవాహనదత్తు. ఇలాంటి తంత్రాలకు అతడే ఆద్యుడని బృహత్కథవల్ల తెలుస్తుంది. ఇతడి కొడుకు 'వాత్సుడు'. బృహత్కథలో విద్యాధరత్వం పొందడానికి గర్భస్థపిండం వండి తినడం ప్రధాన క్రియ. బకనాలియా తంత్రాలలో కూడా ఈ కలాపం ఉంది. అక్కడి తంత్రంలో కనిపించే మధుపానం, శివమెక్కడం, స్వైరవిహారం, కొసకు శిశువును కానీ యువకుణ్ణి కానీ ముక్కలు చేసి[32] లాంఛనంగా తిని మిగిలినవాన్ని భూసౌభాగ్యవర్ధనానికి వినియోగించడమన్నది విద్యాధరత్వ సాధనాలుగా బృహత్కథ పీఠికలో సాక్షాత్కరిస్తాయి.[33]

బీజమే అన్నం. అది భూమిలో చేరి చనిపోయి తిరిగి అన్నరూపంలో వస్తుంది. బీజరూపుడైన పురుషుణ్ణి చంపి భూస్థాపితం చేసేముందు అతణ్ణి లాంఛనంగా తినేవారు. ఆ పురుషుడు తిరిగి పంట రూపంలో చేతికందినప్పుడు తొలి పంట అన్నాన్ని ఆ పురుషుని శరీరంగానూ, వాత్సతంత్రాల ద్వారా నేర్చుకున్న మధువును అతని రక్తంగానూ భావించేవారు. ఈ తంత్రావశేషమే రొట్టె క్రీస్తు శరీరంగానూ, మధువు క్రీస్తు రక్తంగానూ వర్ణించడం ఈనాటికీ

కేథలిక్ తంత్రాల్లో గోచరిస్తుంది. ఈ క్రిస్తు కథ కేవలం సౌభాగ్య వర్ధక క్రియాకలాపంగానే కొందరు పండితులు ఎశదీకరించారు.[34] అంతకు మించి దీనికి మరో గుర్తింపులేదనీ చెప్పారు. ఆసిరిస్, తమూజ్ మొదలైనవారి మరణ శోక జననోత్సాహ తంత్రాలు క్రైస్తవమతంలోకూడా మరణ పునరుత్థానాలుగా కనిపిస్తాయి.[35] తర్వాత పెంపొందిన దీక్షా తంత్రాల్లోనూ వీటి ఛాయలు కనిపిస్తాయి.

అనేక తండాలలో ఉన్న ప్యూబర్టీ రైట్స్, ఇనీషియేషన్ సెరమనీస్ అన్నీ ఈ జననమరణ చక్రాన్ని ఆధారంగా చేసుకున్నవేనని అనిపిస్తాయి. లాంఛనంగా శిశువు శరీరంలో ఒక భాగాన్ని కోసి తిరిగి తమ కులంలోనో, మతంలోనో జన్మించినట్టు భావిస్తారు. యూదులూ, ముస్లిములూ, మరికొన్ని ఆదిమజాతుల సున్నతి (సర్కంసిషన్)[36]; బ్రాహ్మణుల మరికొన్ని తండాల లోని కర్ణవేధ (చెవికుట్టు), కొన్ని తండాలలో నాసావేధ (ముక్కుకుట్టు); చిటికిన వేలుకోత, పుట్టువెంట్రుకలు, స్త్రీలకు మర్మావయవాల మీద గాట్లు, కుట్లు ఇవన్నీ అలాటి ఆచారాలే మరికొన్ని తండాలలో యవ్వన దీక్షా క్రియలు చిత్ర హింసలతో కూడి ఉంటాయి. ఇవన్నీ మరణానికి, ఆ తర్వాత దృఢమైన పునర్జన్మకూ ద్విజత్వానికీ సంకేతాలు.[37] వీటిని గురించి ఫ్రేజరు తన గోల్డెన్ బౌ గ్రంథంలో చాలా విపులంగా రాస్తాడు. మనదేశంలో ద్విజశబ్దం కేవలం ఒక వర్ణానికే పరిమితమై ఉన్నా ద్విజత్వానికి చేసే పనులు మాత్రం ప్రపంచంలో మానవులందరికీ స్త్రీ పురుష భేదంలేకుండా ఉండేవి. అందువల్ల ప్రతిమనిషీ ద్విజుడే.

సౌభాగ్య తంత్రాల్లో ప్రవేశించిన పురుషపాత్ర క్రమంగా పెరిగింది. తర్వాత కాలంలో గోమేధంగా మారింది. ప్రతి ఏటా మరణించే ఆసిరిస్, తమూజ్‌లు ఎద్దు రూపం పొందారు. దాంతో ఎద్దు బలిపశువైంది. వాత్స తంత్రాల్లో స్త్రీ ఆధిపత్యం ఉండే దశ మారి అక్కడా పురుష ప్రాధాన్యం వచ్చింది. స్త్రీల ఈ తంత్రాలన్నీ నోములూ, వ్రతాలు, కొలువులుగా కుంచించు కొనిపోయాయి.

ఈ పరిణామం చాలా క్రమంగా జరిగింది. పురుష ప్రాజాపత్యం ఉన్న పశుపాలక గణాలలో సౌభాగ్య తంత్రాలకు యవ్వనం చిహ్నం అయితే స్త్రీ ఆధిపత్యం గల వ్యావసాయిక గణాల సౌభాగ్య తంత్రాలకు మృత్యువు చిహ్నం అయింది. వ్యావసాయిక గణాల్లో యజనసాధనం మధువు పశుపాలక గణాల్లో అది అనేక వస్తువుల్లో ఒకటి మాత్రమే. ఈ దశలోనే గ్రీకు కథల్లో బౌపెష్ వచ్చాడు. ఆదిమ గ్రీకు భాషలో 'బౌ' అంటే ఆవు. బౌపెష్ అంటే గోపతి

మనదేశంలో శివుడు. ఇద్దరికీ ఎద్దే వాహనం. చర్మాంబరధారులూ ఒకప్పుడు దిగంబరులూనూ. అంటే భూతేశుడూ - అతడి వాహనం ఎద్దూ రెండూ కల్సి అటు గోయూథానికీ - ఇటు స్త్రీయూథానికీ సౌభాగ్యవర్ధనాలయ్యాయి. సమాజ పరిణామ క్రమంలో భూతేశుని చిహ్నంలింగం. ఈ తంత్రాల్లో ఇదే ప్రాముఖ్యం పొందింది. అనేక కరణాలు ఉపయోగించేవారని ఇంతకుముందే చెప్పడం జరిగింది. చాల్డ్యాలో అర్చకులూ, పూజారులూ జననేంద్రియాలకు కొన్ని చెట్ల పాలు కుడిపీ, ఆకుల పసర్లు పూసీ, రాళ్ళుకట్టి సాగదీసీ వృషభ వాజీ ఆకారాలు తెచ్చుకునేవారు. ఇలాటివి దేవాలయ శిల్పాల్లోనూ కనిపిస్తాయి. ఇప్పటికీ ఈ తంత్రాలు బెంగాల్ ప్రాంతంలో ఉన్నట్టు ఇటీవల కొన్ని పత్రికలు వ్యాసాల రూపంలో అందించాయి.[38] సౌభాగ్యం కోరే స్త్రీలు ఆ జీవలింగారాధన చేస్తుండేవారు. ఇలాటి ఓ ఉదంతాన్ని స్కాటు తన గ్రంథంలో వివరించాడు. మూర్ఖుల జననేంద్రియం పెద్దదిగా ఉంటుందన్న నమ్మకంతో వాళ్ళను పూజించ డమన్న ఆచారం భూసౌభాగ్యవర్ధనంలో చేరింది.

భూమిలోకి ప్రవేశించి తిరిగి అదే ఆకారంలో పైకి రాగల శక్తి పాముల కుంది. అందుకని పురుషావయవాలకున్న మహత్యం వీటికి సంక్రమించింది. పైగా పాములు మరణం లేకుండానే కుబుసం విడిచి పునర్జన్మ ఎత్తగల సామ ర్థ్యం కలవి. కనుకనే సౌభాగ్యవర్ధక క్రియల్లో నాగులూ, నాగపూజలూ ప్రాధాన్యం సంతరించుకున్నాయి.[39] ఆ కారణంచేతనే మనిషికి పునరారోగ్యం ప్రసాదించే గ్రీకు ఆయుర్వేద వైద్యానికి సర్పాలు గుర్తులయ్యాయి. మధ్య యుగంలో అనేక భూసౌభాగ్యవర్ధక క్రియల్లో ఈజిప్టు, గ్రీకు, రోముల్లో సర్పాలు చాలా ప్రాముఖ్యం పొందాయి. దేవతలకు ఆయుధాలూ, ఆభరణాలూ, కిరీటాలూ సర్పాలే అయ్యాయి. ఆ తర్వాత వ్యావసాయిక ఉత్పాదనకూ, వాటి కళలకూ 'మాయ', 'మోసం' లాంటి పేర్లు పశుపాలకులు ఉంచినప్పుడు వాటికీ పామే చిహ్నం. వృత్తులకు పేరు క్రాఫ్ట్ క్రాఫ్టీ అంటే మాయ. వేద వాఙ్మయంలో కూడా వ్యావసాయిక వృత్తులకు, ఇనుము వాడకానికీ 'మాయ' అని పేరుపెట్టారు. మాయావి అంటే మోసగాడు. వ్యావసాయిక సౌభాగ్యచిహ్న మైన ఈ సర్పాన్ని 'మాయ విద్య'కూ కొందరు గుర్తుగా వాడారు.[40] బైబిలు కథలో సైతాను సర్పరూపి. అయితే ఆ సైతాను ఆవిర్భావం తర్వాతే మానవుడు శ్రమించడం - వ్యవసాయం నేర్చుకోవడం జరిగిందని బైబిలు చెప్తుంది. ఈవ్‌ను మాయచేసి తినమని చెప్పిన ఫలానికి జ్ఞానఫలమని పేరు. పశుపాలన నుండి మన జ్ఞానం పెరిగిందన్నది దీని భావం. అసీరియాభాషలో సర్పాన్ని 'నహూష్'

అంటారు మన పురాణాల్లో ఇంద్ర పదవి సలంకరించిన ఒకానొక రాజు శాప గ్రస్తుడై సర్పరూపం పొందుతాడు. అతడే 'నహుషుడు'.

సర్పానికీ, మానవజాతికి స్థిరత్వం కల్పించిన వ్యవసాయానికి గల ఘనిష్ఠ సంబంధం మన పురాణాల్లో చాలా కథల్లో కనిపిస్తుంది. మనిషికి వ్యవసాయం ఆధారం. దానికి భూమి ఆధారం. ఆ భూమికి ఆధారం ఆదిశేషుడు. అలాగే సిరికి భర్త విష్ణువు. అతడు సర్పశయనుడు. అమృత సాధన కోసం సముద్ర మథనానికి తోడ్పడింది సర్పం. పురుషాంగానికి సౌభాగ్యవర్ధనత్వాం అబ్బిన తర్వాతనే సర్పానికి ప్రాముఖ్యం ఇచ్చిన కథలు వచ్చాయి.

ఈ సౌభాగ్యవర్ధన తంత్రంలో భాగంగానే శివావతారం వచ్చింది. పెరుగుతున్న సమాజంలో సౌభాగ్యవర్ధనానికి మానవజాతి ఊహించిన సకల సాధనాలకూ దైవత్వం అబ్బింది అలా సంతరించుకున్నవీ, విభిన్న దశలలోవీ అన్నీ ఒకచోట కేంద్రీకృతమై మహాదేవుడుగా రూపొందాడు. అతడే హిందువుల శివుడు.

ఈ భావం వర్గసమాజం ఏర్పడిన తర్వాత వచ్చింది. గ్రీకుల భూతేశుడే ఇలా పరిణమించి ఉండవచ్చు.

శివుడు- భూతేశుడు, వృషభవాహనుడు, చర్మాంబరధారి, సర్పాభరణుడు, మృత్యుంజయుడు, మృత్యువును కంఠంలో నిల్పిన నీలకంఠుడు, మృత్యువు కధిదేవత, జననమరణ చక్రానికి మూలమైన లయకారుడు, ఓషధీశుడైన చంద్రుణ్ణి నెత్తిపై ధరించినవాడు, ఓషధులకు జీవాన్నిచ్చే జలాలను కూడా నెత్తి మీద ధరించినవాడు. మృత్యుచిహ్నాలైన కపాలమాలాధరుడు. సౌభాగ్య వర్ధకమైన లింగరూపి. భూసౌభాగ్యవర్ధకమైన భస్మధారి. ఆ భస్మానికి మూల పురుషుడైన కాముని మూడోకంటితో కాల్చినవాడు. ఇన్ని రూపాలు పొందినా భారతీయ తాంత్రికుల దృష్టిలో అతడు శివప్రాయుడు మాత్రమే. అతడి మీద అధిష్ఠించిన శక్తివల్లనే ఆయనకు మహాదేవత్వం వచ్చింది. అందుకని ఆ శక్తిని అర్ధాంగంలో ధరించాడు. అర్ధనారీశ్వరుడయ్యాడు.

ఈ విధంగా పశుపాలక, వ్యావసాయిక గణాల్లో అవతరించిన సౌభాగ్య శక్తులన్నీ రాసిపడి శివుడి రూపం పొందాయి. శివపురాణం, లింగపురాణాదుల్లోనూ; శైవాగమాల్లోనూ ఉన్న తంత్ర స్వరూపాలన్నీ శివలీలలుగా, కథలూ గాథలుగా మనకు గోచరిస్తాయి. దారువనంలో రుషిపత్నుల వెంటపడడం, చిరుతొండనంబి ఇంట నరమాంస భక్షణ మొదలైనవీ వీటినే సూచిస్తాయి వీటినే ధర్మారావు ఈ గ్రంథంలో (పేజి 49) వర్ణించాడు. ఇలాంటి శివునికి చిహ్నం స్త్రీ-పురుషావయవాల రూపాలైన పానువట్టం - లింగం. వ్యావసాయిక - పశుపాలక గణాల సౌభాగ్య చిహ్నాల సమ్మేళనంగా రూపొందింది.

ఇన్ని సౌభాగ్య వర్ధన చిహ్నాలకు ఒకటిగా రూపం కల్పించిన ఆది మానవుని సాముదాయిక ఊహాశక్తికీ, మేధాశక్తికీ జేజేలర్పించాల్సి ఉంటుంది.

## దేవతల యుద్ధాలు

ఆఖేటక దశలోనే మానవులు సకల చరాచరాలకూ మానవభావన ఆరోపించారు. అందువల్ల టోటెమ్ జంతువైనా, ఓషధైనా అది వర్గసమాజంలో మనుష్యరూపాన్నే ధరించింది. జంతు లక్షణాలన్నిటినీ మానవ రూపానికి అమర్చారు. అలాగే కొలిచారు.

వ్యావసాయిక దశలో పురోహితులూ గణదేవతలూ అందరూ స్త్రీమూర్తులే. నాగరికత ఏర్పడింతర్వాత గ్రీకు తండాలలో ఎథెనా, డయానా లాంటి మూర్తులే సౌభాగ్యవర్ధక దేవతలుగా ఉండేవారు. దైవ భావం రాని దశనుండీ తంత్రాలలో స్త్రీల ఆధిపత్యమే ఉండేది. అర్చకులు స్త్రీలే. తండా కొత్త ప్రాంతాలకు తరలిపోతే తమ దేవతనూ తీసికొనిపోయేవారు. ఆకొత్త ప్రాంతంలో అదివరకే ఉన్న తండాలతోనూ దేవతలతోనూ ఈ కొత్తతండాలూ దేవతలూ యుద్ధాలుచేసేవారు. ఇందులో గెలిచిన తండా తమ దేవతనూ, పౌరోహిత్యాన్నీ, అర్చనా విధానాన్నీ ఓడిన తండాలో ప్రతిష్ఠించేవారు.[41] ఒక్కొక్కప్పుడు రాజీపడి ఉభయతండాలూ కలిస్తే; ఉభయ దేవతలూ అర్చనా విధానాలూ కలిసిపోయేవి. గ్రీకుదేశంలో తొలి దేవతలూ, అర్చకులూ స్త్రీలైనా యువకుల అవసరాన్ని గుర్తించారు. అందుకని ఆ అర్చనలో యువకులకు స్త్రీ వేషం వేసి తీసుకపోవడం, ఆ స్త్రీ వేషంలో ఉండగానే బలివ్వడం లాంటి ఆచారాలు ఆరంభమైనాయి.

సమాజం వర్గాలుగా మారడంతో బానిసలు వ్యవసాయోత్పత్తిలో బాగా తోడ్పడేవారు పురుష బానిసలను అదుపులో ఉంచేందుకు పురుషులనే ఉంచడం అదే క్రమంగా క్షత్రియ వర్గంగా మారడం గమనించవచ్చు. గుళ్ళు అదనపు సంపదకు ఆగారాలు కావడంతో వాటి రక్షణ కూడా క్షత్రియ వర్గం చేపట్టింది.[42] ఇదే పురోహిత (స్త్రీ) రాజవర్గాలకు సంధి కుదిరిన దశ. క్రమంగా పౌరోహిత్యంలో కూడా పురుషుడికి భాగస్వామ్యం లభించింది. అయినా ప్రజా

బాహుళ్యం దృష్టిలో ప్రధాన పౌరోహిత్యం స్త్రీకే ఉండడంవల్ల రాజు ఆ రాణికి ప్రతినిధిగా మాత్రమే ఉండేవాడు. కాలక్రమేణా పౌరోహిత్యం, రాజరికం, వంశ పారంపర్యాన్ని సంతరించుకున్నప్పుడు స్త్రీ ప్రాజాపత్య సంప్రదాయానుసారం రాజ్యాన్ని కొడుకులు కాక అల్లుళ్ళు పాలిస్తూ వచ్చేవారు. గ్రీకు చరిత్రలో కొన్ని శతాబ్దాల పాటు సాగిన ఈ అల్లుళ్ళపాలన మనకు కనిపిస్తుంది. అలాగే ఈజిప్టులో రాజు కొడుకె అల్లుడయి అంటే చెల్లెల్ని చేసుకుని రాజ్యాధికారం పొందేవారు. ఈ వివరాలు పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాల విమర్శలో విశదీక రించడం జరుగుతుంది. తొలుత దైవ ప్రతినిధి పురోహితుడైతే, పురోహిత ప్రతినిధి రాజుఇటు లౌకిక, అలౌకికాధికారాలన్నీ స్వాయత్తం చేసుకున్నాడు. ఇది వ్యావసాయిక గణాల పరిణామం.

పశుపాలక గణాల్లో ఆదిలో పురోహితుడే సర్వాధికారి. వ్యవసాయ గణాల దాడుల నుండి రక్షణకు వారికి క్షత్రియ వర్గాన్ని పెంచుకోవడం తప్పనిసరైంది. అలాటి దాడుల సందర్భంలో ఆ క్షత్రియ నాయకుడికి పురోహితుడితో సమాన హోదా కల్పించడం జరిగింది. తర్వాత ఈ రెండు గణాలు కల్సినప్పుడు తొలిరోజుల్లో పురోహిత రాజులొక్కరే ఉండేవారు. సుమేరియాలో ఇలాటి పురోహిత రాజును 'పటేసి' అని అంటారు.

యుద్ధాలు నిత్యకృత్యాలు కావడంతో పురోహితుడూ, రాజూ[43] అన్న విభజన స్పష్టంగా ఏర్పడింది. సుమేరియాలో ఈ విభజన తర్వాత పురోహితుణ్ణి 'సంగ' అనేవారు. ఈ సంగులే మంత్రాలూ, స్తోత్రాలూ, ప్రార్థనలూ పెంపొం దించడంతో విపుల మంత్ర సాహిత్యం వచ్చింది. దీన్ని 'సంగం సాహిత్య' మని సుమేరియన్లు పిలిచేవారు. బహూశా తమిళుల సంగం సాహిత్యం - ఈ సంగం సాహిత్యాల వెనుకున్న మూలతత్వం ఒకటే కావచ్చు.

అసీరియన్ (అసుర) లకూ కొంత సుమేరియా సంగ సాహిత్యం అందింది. తమిళ సంగ సాహిత్యంలాగే అసురులు కూడా సుమేరు సంగ సాహిత్యాన్ని రెండు భాగాలుగా విభజించారు. వ్యవసాయం, అది ఆధారంగా ఉన్న పల్లెలూ, పల్లెవాసుల హావభావాలు తెలిపే భాగానికి 'పురం' అని అసుర భాషలో అర్థం ఉంది. తమిళ సంగ సాహిత్యంలో కూడా ఈ పదానికిదే అర్థం. పట్నవాసుల వ్యవహారాలూ, వారి హావభావాలను తెలిపే భాగానికి 'అహం' లేక 'అగం' అని సుమేరియన్ భాషలో అంటారు. తమిళ సంగ సాహిత్యంలోని ఈ విభాగానికిదే పేరు. ఇదే అర్థం.

ఈజిప్టు, గ్రీకు చరిత్రల్లో మాతృస్వామిక దశ కనిపించడంతోపాటు రాజరికాల్లో, దేవతల్లో కూడా స్త్రీలే కన్పిస్తారు. సుమేరియన్ చరిత్రలో ఈ

భాగం మిగల్లేదు. అయినా తొలి దశల్లో స్త్రీమూర్తులు మలిదశలో పురుష మూర్తులుగా మారిన కథలు కన్పిస్తాయి. అసుర సమాజంలో స్త్రీదేవతలూ, రాణులూ కనిపిస్తారు. ప్రముఖ రాణి 'సెమిరామిన్' సంగతి గ్రీకుసాహిత్య చరిత్ర ద్వారా తెలుస్తుంది. ఈమెను అసుర భాషలో 'శంబర మాత' అంటారని అసీరియా శాసనాలు వెల్లడిస్తున్నాయి.44

ఇక మన దేశ ఆది సాహిత్యమైన వేదాల్లో పురోహితుణ్ణి బ్రహ్మణస్పతి, బృహస్పతి అన్నారు. వీరుల నాయకుణ్ణి ఇంద్రుడనేవారు. పురాణకాలం నాటికి ఇంద్రుడు దేవరాజుగా పెరిగాడు. బృహస్పతి దేవపురోహితుడుగా దిగజారాడు. ఆదిలో దేవతాస్తోత్రాలైన మంత్రాలను జ్ఞాపకం పెట్టుకోవడం, అవసరాన్నిబట్టి కొత్త మంత్రాలను కట్టడం ఈ పురోహితుడి పని. అప్పుడు ద్వైరాజ్యం ఉన్నా పురోహితుణ్ణి తొలి రాజుగానూ45 క్షత్రియ నాయకుణ్ణి మలిరాజుగానూ మాత్రమే పరిగణించారు. పురోహితుడే సమైక్య గణాలకు సర్వాధిపతిగా కూడా ఉండేవాడన్నది ఈ కింది వేదభాగం వల్ల తెలుస్తుంది.

''గణానాం త్వ గణపతిం హవామహే - కవిం కవీనాం ఉపమశ్ర వ స్తమం - జ్యేష్ఠరాజం, బ్రహ్మణం, బ్రహ్మణస్పతి - ఆనస్శృణ్వన్ - నూతిభి స్సీదసాదనం" (రుగ్వేదం). అంటే నీవు గణాలన్నిటికీ గణపతివి. కవులందరికీ కవివి. నువ్వు రాజులలో పెద్దరాజువి. బ్రహ్మణ్యులలో బ్రహ్మణస్పతివి. అంటే ఈ హోదాలన్నీ ఒకడిలోనే నిహితమయి ఉండేవని తెలుస్తూంది. ఈ హోదా క్రమంగా ఏ స్థాయికి దిగజారిందో పురాణాలే చెప్తాయి.

ఆదే దశలో సౌభాగ్య దేవతలను గురించి- అందులోనూ అసీరియా సౌభాగ్య దేవత గురించి తెలుసుకోవాలి. ఆ దేవత పేరు 'ఇస్తారి.' గ్రీకులు 'అష్టార్తి' అంటారు. ఈమెకో పెద్ద దేవాలయం ఉంది. దేశంలోని ప్రతి కన్యా ఈ దేవాలయంలో ఏడాదిపాటు స్వైరిణిగా జీవించాలని నియమం. ముఖ్యంగా ముక్కూ మొహం తెలియనివాడై ఉండాలి. ఆ సమయంలో సంపాదించిన కానుకలతో తర్వాత వివాహం చేసుకుని గృహస్థ జీవనం గడపాలి. ఆ దశలో ఈ కన్య ఎందర్ని ఆకర్షించిందో దాన్నిబట్టి ఆమెకు తర్వాత గౌరవం వస్తుంది. లేని నాడు కుటుంబ సౌభాగ్యములకు ఆమె అనర్హురాలు. దీన్నే ధర్మారావు అనేక దేశాల ఆచారాలతో సోదాహరణంగా వివరించాడు (పేజి 34, 35).

పైలాటి పురోహిత రాజులు, దేవతాలయాలూ, సంపదశాలలూ, అర్చనా విధానాలూ, సౌభాగ్య తంత్రాలూ అన్నీ జరిగే ఈ దేవాలయాలను కొల్లగొట్టడం ఆచారంగా ఉండేది. అప్పుడు రాజు మారినా కొత్తపాలనకు హామీ

లేదు. అందువల్ల పాత దేవతల స్థానే తము కొత్త దేవతనూ, కొత్త పురోహిత వర్గాన్నీ, కొత్త అర్చనా విధానాన్నీ, మంత్రాన్నీ, సౌభాగ్య తంత్రాన్నీ నెల కొల్పేవారు. ఈ కొత్త తంత్రాలు తమ పూర్వానుభవానికి అనుకూలంగా ఉంటే సరేసరి, లేనప్పుడు జనం తమ పూర్వదైవాన్నీ, పురోహిత వర్గాన్నీ తంత్రాలనూ వికేంద్రీకరించుకునేవారు. ఈ వికేంద్రీకరణ వల్ల రాజ్యాధి కారం పల్చబడుతూ వచ్చేది. అందువల్ల బలమైన రాజ్యాధికారానికి బలమైన దేవుడూ బలవత్తరమైన పురోహిత వర్గమూ అవసరమని రాజులు గుర్తించక తప్పలేదు. రాజులు మారినప్పుడల్లా దేవతలూ, పురోహితులూ మారేవారు. గ్రీసులోనూ ఇతర ఆసియా దేశాల్లోనూ వణిక్ రాజుల ప్రాజాపత్యం వచ్చి నప్పుడు మాత్రమే ఈ దశ మారింది.

నాగరిక సమాజం కనుక వివిధ వృత్తులూ పెరిగాయి. వారు తయారు చేసిన వస్తువులను భూసముద్ర మార్గాల ద్వారా ఇతర ప్రాంతాలకు తీసికెళ్ళి వర్తకం చేసేపద్ధతిని ఫినీషియన్లు మొదట కనిపెట్టారు. అనేక దేశాల ఆచా రాలు, తంత్రాలు, దేవతలు వారికి పరిచయమయ్యారు. తండాల బలాబలాల జ్ఞానం కూడా వారికి వచ్చింది. వర్తకంలో వస్తుమార్పిడికి లోహాల వినియోగం నేర్చుకున్నారు. వీటికి అప్పటికే విశ్వవ్యాప్తమైన విలువా వచ్చింది. తండాల ఆమోదముద్రా లభించింది. ఆర్థిక జీవనంలో మార్పు వచ్చింది. ఇదే రాజ్యాం గంలో ప్రతిబింబించింది.

అంతవరకూ తండాల్లో, తండా పురోహితుడికి ప్రాబల్యమున్న రాజ్యం అంతరించి వర్తక రాజ్యాలు అవతరించాయి. వీరికి లోహాలు అవసరమయ్యాయి. వాటికోసం కొత్త గనులు కనిపెట్టారు. అందులో పని చెయ్యడానికి వెనకబడ్డ తండాలవారిని బానిసలుగా తెచ్చేవారు. రకరకాల దేవుళ్ళూ - ఆచారాలూ - సౌభాగ్య తంత్రాలూ కల ఈ బానిసలు ఒకచోటికి బలవంతంగా చేరారు. వీరందరి మధ్యా ఉన్న వైరుధ్యాలను రూపు మాపడం వర్తక పాలకులకు తలకు మించిన పనైంది. అందుకని ఓ ఉపాయం పన్నారు. తండాలవాళ్ళ దేవుళ్ళను ముందుగా లొంగదీసుకోంది తండాలను లొంగదీసుకోవడం కష్టం. కనుక బానిసల వేట కోసం జరిగే యుద్ధాలలో, గణదేవతల మధ్య కూడా యుద్ధాలు ఆరంభమయ్యాయి. ఈ యుద్ధాల్లో ఇతర గణాల దేవతలనోడించి తమ గణదేవతలను సర్వాధికారులుగా నిలపాల్సిన అవసరం ఈ వర్తక పాలకులకు కలిగింది. తమ దేవుడొక్కడే సత్య దేవుడనీ ఇతరదేవుళ్ళందరూ దొంగ దేవుళ్ళనీ నిరూపించాల్సిన అవసరం వచ్చింది. దీని వల్ల దేవుళ్ళకు సౌభాగ్యవర్ధక శక్తులకు బదులు; మహిమలూ, మాహాత్మ్యాలూ చూపించి హడ

ప్రేరేపించే శక్తిని అలవర్చుకోవాల్సిన అవసరం ఏర్పడింది. అందుకు మొదటి మెట్టు ఆ దేవత ఆకారం. భీకరమైన ఆకారంగల దేవుళ్ళకు బ్రహ్మాండమైన దేవాయతనాలు వెలిశాయి. అంతవరకూ వనాల్లో కొండల్లో, కోనల్లో, బొడ్రాళ్ళుగా ఉన్న దేవతలు, బానిస యజమానుల్లాగా భయంకర రూపాన్ని ఈ యుగంలోనే సంతరించుకున్నారు. రాజ్య స్వరూపాన్ని దైవస్వరూపం నిర్ణయించేది. అందువల్ల ఈ భయంకర దేవుళ్ళకు కళ్ళు చెదిరేటట్లు నరబలులూ, పశుబలులూ ఇచ్చి బానిస గణాల్లో భయాన్ని సృష్టించారు. వీళ్ళు తమ మాహాత్మ్యాలు చూపించడానికే అప్పటి వర్తక పాలకులు సేకరించిన నౌకాయాన, జ్యోతిషాది విజ్ఞానాన్నంతా ఉపయోగించేవారు. పురోహితులు ఇంద్రజాలాన్ని అభ్యసించి అదంతా దేవుని మహిమగా నమ్మించేవారు. ఇలాంటి దశలో పుట్టిన పురోహితులనే మాజీలనేవారు (పర్షియన్). సెమైట్స్లు షామాలంటారు.

ఈ యుద్ధాల్లో గెలిచిన సత్యదేవుడు మిగిలిన గణదేవతల మీద విజయం సాధించి తాత్కాలికంగా మహాదేవుడయ్యేవాడు. అంతకు పూర్వం గణ దేవతల మీద గణాలకు వాల్లభ్యం ఉండేది. ఆ సమాజంలో దేవుడు మానవాధీనుడు. ఈ మహాదేవిని ఆవిర్భావంతో అదంతా తల్లకిందులైంది. ఇక్కడ మనిషి దైవాధీనుడు. పురోహితుల మీదా రాజుల మీదా కూడా దేవుడికే వాల్లభ్యం ఉండేది. దీనివల్ల బానిస గణాలు తాత్కాలికంగా ఆ మహాదేవుణ్ణి, రాజునీ, పురోహితుణ్ణి అంగీకరించినా వాళ్ళ మీద భక్తి కుదరలేదు. అందుకే అవసరం వచ్చినప్పుడూ అవకాశం చిక్కినప్పుడూ ఆ రాజుకు చిహ్నమైన దేవుణ్ణి ముందు ధ్వంసం చేసి ఆ స్థానంలో తమ గణదేవతనూ-తమ అర్చనా విధానాన్ని - సౌభాగ్య తంత్రాలనూ ప్రతిష్ఠించేవారు.46 కానీ అప్పటికే సమాజంలో ఆర్థిక వ్యవస్థ పెరిగింది. అందుకనుగుణంగా ఉత్పత్తి సంబంధాల్లో మార్పు వచ్చింది. కొత్తరాజు స్వతంత్ర తండాల నాయకుడైనా ఇతర తండాలను అదుపులో పెట్టి తండా స్వాతంత్ర్యం కాపాడ్డం అసాధ్యమైంది. అందుకు పూర్వపు రాజులు చేసినట్టు ముందు తన దేవుణ్ణి భయంకరుడుగా మార్చి తదనుగుణంగా తానూ భయంకరుడుగా మారి, నిరంకుశత్వం చలాయించక తప్పలేదు. ఈ విధంగా దేవుళ్ళలో పరమేష్ఠి, రాజుల్లో రాజపరమేష్ఠుల యుగం అవతరించింది. వీళ్ళనే గ్రీకులు 'టైరెంట్ ప్రిన్స్'47 లని పిలిచేవారు. ఆసియా దేశాల్లో వీళ్ళనే చరిత్రకారులు డెస్పాట్స్ అని అన్నారు.

క్రమంగా ఈ నిరంకుశ క్రౌర్య రాజ్యాలదేవుళ్ళు వారిలాగే భయంకరంగా పెరిగారు. ఇతర గణదేవతలను చూడలేని అసహనాన్ని పెంచు

కున్నారు. ఈ గణాలూ - గణ యుద్ధాలూ; నిరంకుశ రాజపరమేష్ఠుల యుద్ధాలూ; సుమేరియా, బాబిలోనియా, అసీరియా, ఈజిప్టు ప్రాచీన చరిత్రల్లోనూ, బైబిలు పాత నిబంధనల్లోనూ కొల్లలుగా కనిపిస్తాయి.

ఏకరాజ సిద్ధాంతంనుండి ఏకేశ్వర సిద్ధాంతం ప్రపంచంలో మొలకెత్తింది. ఆదిలో దేవుడు క్రౌర్యానికీ దురాశకూ ఆలంబనంగా ఉండే వాడనీ - క్రమంగా అతడిలో సుగుణాలు పెరిగి కొసకు సాధువుగా మారి కరుణామయుడయినాడన్న భావం జార్జి బెర్నార్డ్‌షా వెల్లడించాడు. 48

ఈ గణ యుద్ధాలూ - గణదేవతా యుద్ధాలూ భారత దేశంలో కూడా సాగాయి. అయితే ఇక్కడున్న భౌగోళిక పరిస్థితులవల్లా, అనేక మానవ జాతుల సంగమాలవల్లా ఇవన్నీ కొత్తరూపు ధరించాయి. కొన్నివేల సంవత్స రాలపాటు భారతదేశంలో పశుపాలక, వ్యావసాయిక వృత్తులవాళ్ళ మధ్య సంఘ ర్షణలు సాగాయి. ఇతర దేశాల పశుపాలక గణాల్లో చాలాకాలానికి వచ్చిన స్థిరత్వం, ఇక్కడి పరిస్థితులవల్ల చాలా త్వరగా ఇక్కడుండే పశుపాలక గణాల్లో ఏర్పడింది.

వైదికార్యులు ప్రధానంగా పశుపాలకులు. ఒక నదితీరాన వారు స్థావరంగా ఉంటే, ఆవలి ఒడ్డున వ్యావసాయిక స్థావరాలుండేవి. సప్త సింధు ప్రాంతంలో ఆదిలో ఉన్న సరస్వతీ నది కూలంకషంగా ఉన్నప్పుడు ఆర్యులు వెయ్యేళ్ళపాటు అక్కడ సత్రయాగం చేసుకున్నట్టు పురాణాలు చెప్తున్నాయి. వ్యావసాయికులకూ, పశుపాలకులకూ అన్నోత్పాదన విధానం దగ్గర నిత్యం ఘర్షణలు జరుగుతూండేవి. వ్యావసాయికులు అన్నోత్పత్తికోసం 'ఏరువాక' వ్యవసాయ పద్ధతిని కనిపెట్టారు. నదులకూ, కొండవాగులకూ వరదలొచ్చే ముందు తీరానవుండే చెట్టూ చేమా నరికి అడ్డం వేసి కట్ట కట్టేవారు. వచ్చిన వరద నీరు గట్టుకు తాకి పొంగి గట్లుదాటి ప్రవహించేది. వరదగా కాకుండా పలుచగా పారేనీటిని 'వాక' అంటారు. ఏరుకు గట్టు కట్టి వాకలుగా పారించే వారు కాబట్టి దానికి 'ఏరువాక' అని పేరొచ్చింది. ఇది ఒక నిర్వచనం. కొందరు 'ఏరు' అంటే నాగలి అని దాని ద్వారా ఈ పేరొచ్చిందనీ అంటారు. ఇది మరొకటి. కానీ మొదటి నిర్వచనమే ఈ దశలో మన సిద్ధాంతానికి సరిపోతుంది. ఈ వ్యవసాయ పద్ధతినే 'ఇనండేషన్ ఇరిగేషన్' అని అంటారు. మనిషి అనాదిగా కనిపెట్టిన నీటిపారుదల పద్ధతి ఇది.

ఉత్తరాదిన నదులన్నీ హిమాలయాలనుంచి పుట్టాయి. వేసవిలో ఎండ వేడికి మంచుకరిగి నదులకు వరదలొస్తాయి. పంటలకు నీరు కావాల్సిన సమయమూ అదే. అందుకని వేసవిలో వరదలు వచ్చేముందు వ్యావసాయికులు

ఏరులకు చెట్లతో అడ్డుకట్టలు (డైక్స్) కట్టేవారు. వరద వచ్చినప్పుడు నీరు ఒకవైపున మాత్రమే వాకలు కట్టదు. ఇరువైపులా కట్టుంది నదికి ఒక వైపున వ్యావసాయికులు ఉన్నారు. కనుక ఆ ఏరువాక వారి అన్నాన్ని వృద్ధిచేసేది. అయితే రెండో తీరాన పారిస వాకవల్ల పచ్చికబీళ్ళు మునిగి గోగణం కాలుకదపడానికి వీల్లేకుండా పోయేది. దీనివల్ల పశుపాలకుల అన్నం ఐక్కచిక్కేది. ఈ ఏరువాకవల్ల వ్యావసాయికులకు అన్నపుష్టి కల్గితే, పశుపాలకులకు అన్ననష్టి కలిగేది. అందువల్ల ఏరుకు అడ్డంగా కట్టిన డైక్ ఒక గణానికి దేవుడైతే మరోగణానికి రాక్షసుడయ్యాడు. సరస్వతీ నదీతీరంలో వెయ్యేళ్ళు సత్రయాగం చేసిన ఆర్యులు ఈ ఏరువాక డైక్‌లతో కూడా యుద్ధాలు చేశారు. ఆర్య యుద్ధనాయకుడు ప్రతి ఏటా వరద వచ్చినాక ఈ డైక్‌ను పగులగొట్టేవాడు. దీన్నే ఋగ్వేదం అనేక మంత్రాల్లో కవితాత్మకంగా వర్ణించింది. ఈ డైక్‌ను ఆర్యులు 'వృత్ర' అని పిల్చేవారు. ఆర్య నాయకుడు ఇంద్రుడు. అతడు వృత్రుణ్ణి కొట్టినవైనాన్ని ఋగ్వేదమంత్రాల్నిండాచూడగలం.

''నల్లగా పాములా మెలికలు తిరిగి వృత్రుడు ఈ నదికి అడ్డంగా పడుకున్నాడు. వాడి కాయంవల్ల ప్రవాహం ఆగిపోయి గట్టుదాటి పచ్చిక బీళ్ళను ముంచెత్తుతోంది అందుకని ఓ ఇంద్రా, వీణ్ణి సంహరించు".... ''ఇంద్రుని దెబ్బకు వృత్రుడు నదీ గర్భంలో పడిపోయాడు. విముక్త జలాలు వాడి శరీరం మీద నుండి గలగల్లాడుతూ ప్రవహిస్తున్నాయి. కొడుకు శవంమీదపడి ఏడుస్తోన్న తల్లి ఆక్రోశంలా ఉన్నాయి ఆ గలగలలు."

ఇలాటి వర్ణనలనుబట్టే డైక్‌లకు వృత్రుడనీ, ఇంద్రుడిని వృత్రాసురుణ్ణి చంపినవాడనీ అనడం జరిగిందని డి. డి. కొశాంబి అభిప్రాయపడ్డారు.

ఈ యుద్ధాలు ఆ రెండు గణాల్లో ద్వేషాలను పెంచాయి. సహజీవన సమస్యలు పరిష్కారం కాలేదు. కానీ కొందరు ఆర్య ప్రముఖులు పరిష్కార మార్గానికి యత్నించారు. అలాంటి వారిలో విశ్వామిత్రుడు ఆద్యుడు.

పశుపాలకులకన్న వ్యవసాయకులది స్థిరమైన సమాజం కాబట్టి అనేక వృత్తులు విలసిల్లాయి. నైపుణ్యం పెరిగింది. బుద్ధి కూడా బాగా వికసించింది. వ్యవసాయానికి అవసరమైన జ్యోతిషం, రేఖాగణితం, వీటి ఆధారమైన మూల గణితం అప్పుడప్పుడే శాస్త్ర ప్రతిపత్తిని సంతరించుకుంటున్నాయి.

పశుపాలకులకు అన్నీ రాతి పనిముట్లూ, చెక్క ఆయుధాలూ, కొయ్య బల్లలూ. వీటిని తయారు చేసుకొంటూండేవారు. లోహంతో పనిబడలేదు. వీటిని దాటి వాళ్ళు పైకి పోలేదు. అగ్నిని వేల్చేటప్పుడు కొన్ని రాళ్ళలోంచి యాదృచ్ఛికంగా రాగి కరిగి వచ్చేది.49 అయినా ఆనాడు వారికి రాగితో పనిబడలేదు. పైగా రాగిని వారు 'అగ్ని అశ్రువులు'గా వర్ణించారు (ఋగ్వేదం).



33 కోణార్క సూర్య దేవలాయంలోని నాగ మిధున శిల్పం.



34. నాగర్జునకొండ బౌద్ధస్థూపంలోని మిధున శిల్పం



35 ఖజురాహోలో విశ్వనాథ గుడిమీది శిల్పం.



36 వీరుడు యుద్ధానికెళ్తూ భార్యకోసం తెచ్చిన కచ్చడం - మధ్యయుగాలనాటి చిత్రం.

అది దగ్గరుంటే చెరుపని కూడా భావించారు. ఏమైనా పశుపాలక గణాలు కని పెట్టిన ఈ మొదటి లోహం తర్వాతి సమాజాల్లో ధనానికి మూలం అయింది. అందుకని అది పవిత్రతను కూడా సంతరించుకుంది.

వ్యావసాయిక గణాలు 'ఇనుము'ను ఉపయోగించడం నేర్చుకున్నారు. కనుక ఆ ఇనుప వృత్తులకు 'మాయ' అనీ, వాళ్ళను 'మాయావుల'నీ పశు పాలకులు పిలుస్తూండేవారు. అందువల్ల వేదాల్లో ఇనుము ప్రస్తావన వచ్చినప్పుడల్లా దానితో అవినాభావ సంబంధంగా మాయా-మాయావి అన్న పదాలు కూడా వాడడం గమనించగలం (అధర్వణవేదం).

వేదకాలంనాటి ఈ పశుపాలక వర్గం వాళ్ళు ఈ వ్యావసాయికులైన మాయావులను అసురులని పిల్చేవారు. తర్వాత ఇనుముతో సంబంధమున్న వాళ్ళందర్నీ 'అసురు' లన్నారు. ఇనుపముళ్ళ గద సంగ్రహించిన ఇంద్రునికి మహా మాయావి, మహాసుర అన్న బిరుదులూ వేదాల్లో మనకు కన్పిస్తాయి. అలాగే వేదాల్లో తరుచు ప్రసక్తమయ్యే వరుణుడి ఆయుధం త్రిశూలం. అతడికీ మహామాయావి, మహాసుర బిరుదులున్నాయి.

ఉన్నత సామాజిక దశలో ఉన్న వ్యావసాయికులతో యుద్ధాలు రాకుండా రాజీపడడానికి కొందరు యత్నించారు. కానీ వాళ్ళు చాలా ప్రతి ఘటనలను ఎదుర్కోవాల్సి వచ్చింది. మన వేద పురాణాది గ్రంథాలవల్ల పశుపాలక గణాల్లో వ్యవసాయాన్ని ముందు అభిమానించిన వ్యక్తి విశ్వామిత్రుడని తెలుస్తుంది. ఈయన మొదట నదులకు కాలువలు తవ్వి వ్యవసాయాన్ని ప్రోత్సహించినట్లు రుగ్వేదంలో సాక్ష్యాలున్నాయి. అలాగే ప్రకృతిసిద్ధంగా లభించే అనేక ఓషధులను సంస్కరించడానికి యత్నించాడు. అదివ్పటికీ కథలూ - గాథలుగా మిగిలి ఉంది. కొత్తగా తెలిసిన కూర గాయలకు విశ్వామిత్ర సృష్టి అనడం సాంప్రదాయిక కుటుంబాలలో ఇప్పటికీ ఉంది. అంటే ప్రాకృతమైన దానికి బ్రహ్మసృష్టి అనీ సాంస్కృతమైనదానికి విశ్వామిత్ర సృష్టి అనీ మనవాళ్ళంటూ వచ్చారు. అందుకే వేదకాలంలో ఓషధీ సంస్కృతికి ఆద్యుడు విశ్వామిత్రుడనవచ్చు. బహుశా ఆనాడు ఆయన ఎదుర్కొన్న ప్రతిఘటనలనుబట్టే ఆయన విశ్వ అమిత్రుడై ఉంటాడు. ఇతని గాథ వల్ల మరో విషయం తెలుస్తుంది. వ్యవసాయదారులతో స్నేహానికి - ఓషధీ సంస్కారానికీ ప్రాముఖ్యం ఇవ్వడంవల్ల; అందుకోసం ఆయన అనేక యుద్ధాలు కూడా చేయడం వల్ల; పశుపాలక అగ్ర వర్గాలవారు ఆయన్ని వెలేశారు. అలా వెలిపడ్డవారిని ఆరోజుల్లో బహుశా క్షత్రియులని పిలిచి ఉండవచ్చు. అదికాక తర్వాతి దశలో యుద్ధనాయకుడు

క్షత్రియుడు కావడం కూడా కావచ్చు. అంటే విశ్వామిత్రుణ్ణి కింది వర్గానికి నెట్టేశారన్నమాట. వంశంవల్ల కాక వారవలంబించే దృక్పథం వల్ల ఆర్యుల సమాజం బ్రహ్మ - క్షత్రియులుగా చీలింది. కేవలం పశుపాలకులుగానే సాము దాయక జీవితం గడపాలనుకున్నవారు బ్రాహ్మణ వర్గంగానూ; వ్యవసాయానికి పశుపాలనను ఉపాంగంగా చేసి వర్గ సమాజంలోకి ప్రవేశించాలని భావించేవారు క్షత్రియులుగానూ విడిపోయినట్టు కనిపిస్తుంది. ఋగ్వేద కాలం నాటికి బ్రాహ్మణ వర్గానికి వాశిష్ఠులూ, క్షత్రియ వర్గానికి వైశ్వామిత్రులూ నాయకత్వం వహించారు. వ్యవసాయ విస్తరణకు వృషభశక్తి ఎక్కువ దోహదం చేస్తుంది. అందుకు వృషభాలను ఆహారంగా వినియోగించుకునేకన్న వాటిని వ్యవసాయానికి వినియోగిస్తే మంచిదన్న భావం క్షత్రియవర్గానికి కలిగింది. బ్రాహ్మణవర్గం అందుకు వ్యతిరేకించింది. దీనితో ఉభయ వర్గాల మధ్య జరిగిన యుద్ధాలు చక్కని కథలుగా మన పురాణాల్లో కనిపిస్తాయి. ఇందులో వశిష్ఠ - విశ్వామిత్ర యుద్ధం మొదటిది.

ఒకసారి విశ్వామిత్రుడు మందీ మార్బలంతో వశిష్ఠాశ్రమానికి వెళ్ళాడు. వశిష్ఠుడు నందినీ సంతానంతో పరివారమంతటికీ విందు చేశాడు. విశ్వామిత్రుడు నందినిని తనకిమ్మన్నాడు. వశిష్ఠుడు అంగీకరించలేదు. ఇద్దరికీ జరిగిన యుద్ధంలో విశ్వామిత్రుడు ఓడిపోయాడు. ఓటమి తర్వాత విశ్వామిత్రుడు క్షాత్రధర్మాన్ని విసర్జించి అత్యధిక సంఖ్యాక బ్రాహ్మణ ధర్మాన్ని స్వీకరించాడు. అప్పుడాయనకు బ్రహ్మర్షి ప్రతిపత్తిని ప్రసాదించారు.

ఈ కథవల్ల క్షత్రియులు తాత్కాలికంగా ఓడిపోవలసి వచ్చిందని తెలుస్తుంది. తర్వాతి ఘట్టాన్ని నిరూపించేదే కార్తవీర్యార్జునుడి కథ. అప్పటికి వర్గసమాజం కుదుటపడి క్షత్రియ ప్రాజాపత్యం వచ్చింది. రాజ్యాంగ వ్యవస్థ సహస్రాంగాలుగా విస్తరించింది. కార్తవీర్యార్జునుడికి వెయ్యిచేతులు. అప్పటికి సొంత ఆస్తి ఏర్పడింది. దాని రక్షణే ప్రభుత్వ ధర్మమన్న భావమూ వచ్చింది. ఎక్కడ దొంగలున్నా కార్తవీర్యార్జునుడు వెయ్యిచేతులతో పట్టుకునేవాడని ప్రతీతి.

ఇతడు తన సహస్ర బాహువులతో ఆస్తి రక్షణే కాకుండా నదులకు ఆనకట్టలు కట్టి వ్యవసాయానికి మళ్ళించేవాడని కూడా ప్రథ ఉంది ఈయన ఒకసారి వెయ్యిచేతులతో నదీప్రవాహాన్ని ఆపేస్తే, దిగువని జలక్రీడ లాడుతున్న రావణునికి కోపం వచ్చిందని, ఆ కోపిష్టి రావణుణ్ణి ఓ పది తలల వింత పురుగుగా భావించి కార్తవీర్యార్జునుని భార్యలు ఆడుకున్నారనీ ఓ కథ ఉంది.

కార్తవీర్యార్జునుడు గోసంపదను వ్యవసాయానికి మళ్ళించడానికి కూడా పూను కున్నాడు. అప్పటికి బ్రాహ్మణవర్గ నాయకుడు జమదగ్ని. విశ్వామిత్రుని మార్చ లానికి వశిష్ఠుడిలా కార్తవీర్యార్జునుని బలగాలకు అతడూ గోసంపదతో విందు చేశాడు. అతడిలాగే కార్తవీర్యార్జునుడు కూడా గోవును అడిగాడు. అప్పటిలాగే ఇప్పుడూ యుద్ధమైంది. అయితే ఇప్పటికి క్షాత్రబలం పుంజుకున్నందు వల్ల జమదగ్ని ఓడిపోయాడు. కార్తవీర్యార్జునుడు గెలిచాడు. ఇతడి విజయం బ్రాహ్మణ క్షత్రియ వర్గాల మధ్య మహాసమరాలకు దారితీసింది. జమదగ్ని కొడుకు పరశురాముడు కార్తవీర్యార్జునుని చంపటమే కాకుండా బ్రాహ్మణ జీవన విధానానికి విరోధమైన క్షత్రియ వర్గం మీద ఇరవై ఒక్క సార్లు దండ యాత్ర చేశాడు. ఇదే తుది సమరం అనీ - దేశాన్ని అక్షత్రియం చేస్తాననీ ప్రతిజ్ఞ కూడా పట్టాడు. కొద్దిమంది వర్గశత్రు నిర్మూలనం జరిగింది కానీ యావత్తు వర్గనిర్మూలనం చెయ్యలేకపోయాడు. కనుక తన ఓటమిని క్షత్రియవర్గం ముందు అంగీకరించి లాంఛనంగా తన ఆయుధం - నాటి పశుపాలకుల ఆయుధాల్లో ఒకటి - పరశువును రాముడికి అందించాడు. కానీ సైద్ధాంతికంగా అంగీకరించ లేక తన అనుయాయులను తీసికొని పడమటి కనుమలకూ, పశ్చిమ సముద్రా నికీ మధ్యగల ప్రదేశాని కెళ్ళిపోయాడు. దాన్నే పరశురామ క్షేత్రమంటారు. అదే నేటి కొంకణ.

వ్యావసాయిక, పశుపాలక గణాల మధ్య అనేక పద్ధతుల్లో సిద్ధాంత చర్చలు సాగాయి. వర్గ సమాజం మీద క్షత్రియుల పట్టు బలపడిన కొద్దీ వర్గ పూర్వ సమాజానికి చెందిన బ్రాహ్మణులకు నదీతీర వాసాల్లో శాంతి కొర వడింది. క్రమంగా అడవుల్లోకి చేరి తమ జీవన విధానాన్ని కాపాడుకోవాలను కున్నారు. దీనివల్ల వారికి అనేక సౌకర్యాలు పోయాయి. అడవుల్లో బాగా అనాగరికంగా ఉన్న ఆటవిక తండాలవల్ల వీరి యజ్ఞ జీవనానికి విఘాతం కలగడం, పశు సంపదకు రక్షణ సన్నగిల్లడం జరిగింది. తమలో యుద్ధ కుశలురంతా క్షాత్రవర్గంలో చేరారు. అందువల్ల ఆటవిక తండాల నుండి రక్షణకు తమ సిద్ధాంత శత్రువులైన క్షత్రియుల మీద ఆధారపడక తప్పలేదు. మన రామాయణ కథల్లోనూ, పురాణాల్లోనూ యజ్ఞయాగాదులను రాక్షసులు భగ్నం చేయడం, రుషి పల్లెలను ధ్వంసం చేయడం, అప్పుడు రుషులు రక్షణ కోసం క్షత్రియ రాజులకు మొరబెట్టుకోవడం అలాటి దశనే సూచిస్తాయి.

ఇటు క్షత్రియులను బ్రాహ్మణులనూ కూడా ఉమ్మడిగా బంధించింది వేద సంస్కృతి. క్షత్రియులు వ్యావసాయిక జీవన విధానాన్ని ప్రోత్సహించి తద్వారా పాలకవర్గంగా ఏర్పడినప్పటికీ తమ పూర్వసంస్కృతిని వదులుకోలేదు. యజ్ఞా

లకు సౌభాగ్య వర్ధనం, మాహాత్మ్యం ఉన్న సంగతిని విస్మరించలేదు. అందువల్ల అడవుల్లోకి వెళ్లిన బ్రాహ్మణవర్గంతో వీరికి పని ఉంది. అక్కడికెళ్ళిన వారు వేదాలనూ - సౌభాగ్య వర్ధనం, మాహాత్మ్యం ఉన్న సంగతిని విస్మరించలేదు. అందువల్ల అడవుల్లోకి వెళ్ళిన బ్రాహ్మణవర్గంతో వీరికి పని ఉంది. అక్కడికెళ్లినవారు వేదాలనూ - సౌభాగ్యతంత్రాలనూ కూడా కాపాడుకుంటూ వచ్చారు. రాజ్యభారంవల్ల వేదాలను కాపాడే తీరిక క్షత్రియులకు లోపించింది. అందువల్ల బ్రాహ్మణులతో ప్రత్యక్షయుద్ధం కాక పరోక్షయుద్ధాన్ని అంటే సిద్ధాంతయుద్ధాన్ని చేపట్టారు. వాళ్ళను మచ్చికచేసుకోవడం అవసరమనికూడా భావించారు. వీటిల్లో భాగంగానే అటు అడవుల్లో జరిగిన చర్చలు అరణ్యకాలుగానూ, రాజాస్థానాల్లో నగరాల్లో జరిగిన చర్చలు ఉపనిషత్తులుగానూ తర్వాత రూపొందాయి.

ఈ దశలో రంతిదేవుడి కథ పరిశీలించాలి. అతడొక యజ్ఞం తలపెట్టాడు. అప్పటికి క్షత్రియుల దగ్గర వ్యవసాయానికి చాలినంత గోసంపద లేదు. బ్రాహ్మణ వర్గంనుండి ఎలాగైనా దాన్ని క్షత్రియవర్గం చేజిక్కించుకుని వాటిని వ్యవసాయానికి మళ్ళించాలి. రంతిదేవుడు చేసే యజ్ఞానికి రోజుకు రెండువేల గోవులు కోసి బ్రాహ్మణులకు సమారాధన చెయ్యాలి. బ్రాహ్మణ వర్గం బంగారానికి తమ గోవులను అమ్మేది. రోజూ ఇరవైవేలమంది యజ్ఞశాలల్లో భోజనం చేసేవారు. క్రమంగా బ్రాహ్మణుల దగ్గర పశుసంపదా, రంతిదేవుడి దగ్గర స్వర్ణసంపదా సన్నగిల్లింది. యజ్ఞం అంతటితో ఆగిపోయింది. రంతిదేవుడు చేసిన యజ్ఞంవల్ల బ్రాహ్మణుల దగ్గర గోసంపద కరువు కావడంతో విధిగా వారందరూ ఓషధీ ఆహారానికి అలవాటుపడవలసి వచ్చింది. క్రమంగా వాళ్ళు అడవులొదలి క్షత్రియులిచ్చిన మాన్యాలతో తృప్తి పడడం తప్ప గత్యంతరం లేకపోయింది. ఈ విధంగా విశ్వామిత్ర - కార్తవీర్యార్జున - రంతిదేవులు విభిన్న మార్గాలలో బ్రాహ్మణ — క్షత్రియుల పోరాటాలలోనూ, సమాజాన్ని వర్గసమాజంగా రూపొందించడంలోనూ ఆనాడు కృషిచేశారు.

రాముడు గౌతముడి భార్య అహల్యను శాపంనుండి విముక్తి చెందించడం కూడా వ్యవసాయ సంపదను పెంచే కార్యక్రమంలో భాగమే. ఇంద్రుడు అంటే నీటికి అధిపతి. అతడు అహల్య - అంటే నాగలితో దున్ననిది - తో కలవడం అంటే నీరు బీడుభూములలో ప్రవహించడం. గౌతముడు అహల్యను రాయి కమ్మని శపించడమంటే నీటిని ఆపి తిరిగి బీడుగా చేయడం. తమ పశువులకు మేతకుపయోగించే భూమి కింద ఉంచడం. రాముడు క్షత్రియుడు. వ్యవసాయాన్ని వాళ్ళు ఆదరించారు. గౌతముడు పశుపోషణకు బీడు పెట్టిన

నాగలి పడని భూమిని తన క్షాత్ర ధర్మంతో తిరిగి వ్యవసాయ యోగ్యం చేశాడు. అహల్యను హల్యం చేశాడు.

ఈ రకమైన కృషివల్ల పశుపాలక గణాలు వ్యావసాయిక గణాలకు లొంగడం, వర్గపూర్వ సమాజం వర్గ సమాజంగా అవతరించడం జరిగింది.

ఈ కృషిలో పాల్గొన్న గణాలూ, వ్యక్తులూ అందరూ సౌభాగ్య తంత్రాలలో దేవతామూర్తులుగా క్రమంగా నిలిచిపోయారు. ఇక ఈ రెండు గణాల దేవతల మధ్య సామరస్యం ఎలా జరిగి అందరూ సౌభాగ్యతంత్ర దేవతలుగా రూపొందారో పరిశీలించాలి.

పశుపాలక గణాలకు ఒకడే దేవుడు. పేరు ఏదైనా అతడు భూతేశుడు. శివుడు. వృషభధ్వజుడు - వృషభవాహనుడూ కూడా. పశుపాలక గణాల్లో ఎన్ని తండాలు వచ్చి చేరినా ఈ దేవుడిలో పెద్ద మార్పురాదు. రాలేదు. వేదాల్లో ఒకప్పుడు ప్రాచీన శివ లక్షణాలన్నీ ఇంద్రుడికుండేవి. సోమం - గోమాంసం - భామినుల వాసనవస్తే ఇంద్రుడు వెర్రెత్తి పోయేవాడు. తర్వాత వర్గ సమాజకాలంలో ఇంద్రుడు శివునితో లింగైక్యం పొందాడు. వేద కాలంలో పురంధర - పురహంత అన్న ఇంద్రుడి బిరుదులు పురాణకాలంలో శివుడికి సంక్రమించాయి. వేదకాలంలో కట్టుబడిన గంగను ఇంద్రుడు విడిపిస్తే, పురాణకాలంలో శివుడు తన జటాజూటంనుండి విడిపించాడు. వేదకాలం నాటి వరుణుని పాశ, త్రిశూలాలు శివుడికి తర్వాత ఆయుధాలయ్యాయి. వేద కాలంలో ఇంద్రుడు శంబరారి. పురాణకాలానికొస్తే మన్మధుణ్ణి చంపి మరు జన్మలో అతనిచేత శంబరుణ్ణి చంపించడానికి కారణభూతుడు శివుడు. వేద కాలంలో ఇంద్రుడు మహాసురుడు. పురాణకాలంలో మహాసురులందరికీ ఇల వేల్పు శివుడు. ఈ విధంగా ఏదశలో చూసినా పశు సౌభాగ్యవర్ధకుడైన పురుషదేవుడు ఒక్కడేనని పశుపాలక గణాలూహించాయి. వ్యావసాయిక గణాలు అలాకాదు. వీరికి రకరకాల దేవుళ్ళున్నారు. ఈ గణాలలో ఆది దేవుళ్ళందరూ స్త్రీలే. తర్వాత పురుష ప్రాధాన్యంకల సమాజం వచ్చినప్పుడు ఆ దేవతలే పురుష రూపం దాల్చారు. అలా పురుష రూపం తెచ్చుకున్న వ్యావసాయిక సౌభాగ్యతంత్రంలో దేవుడు విష్ణువు. భూదేవి అతడి భార్య. అందువల్ల భూసౌభాగ్యవర్ధకుడు విష్ణువు. ధన రూపిణి అయిన లక్ష్మి కూడా ఇతనికి భార్యే. సకల ప్రాణులకూ జీవనాధారమైన గంగ ఇతని కాళ్ళనుండి పుడుతుంది. ఓషధీశుడైన చంద్రుడు ఇతని బావమరిది. పునరుత్పాదన కారకుడైన మన్మధుడు ఇతని కొడుకు. పూర్వాశ్రమంలో విష్ణువు స్త్రీ అనడానికి రుజువుగా మోహినీ అవతారం ఎత్తాడు. పురుషరూపంలో ఉన్నా ఆయనకు

స్త్రీ సహజమైన మోహినీతత్వం పోలేదు. రామావతారంలో ఆయన 'పుంసా మోహనరూపాయ' - అన్న ప్రశంసని పొందాడు కృష్ణావతారంలో ఆయన జగన్మోహనుడు. సౌభాగ్య వర్ధనానికి సాక్షాత్తూ సాకారమూర్తి. ఇటు మానవ జాతికే కాదు అటు వ్యవసాయానికి ఉపాంగంగా ఉన్న ఆలమందలకు కూడా.

వైదిక దేవతలు ఈ విధంగా వ్యవసాయ దేవతలకు లొంగారని పురాణ కాలంనాటి విష్ణువు ఉదంతం తెలియచేస్తుంది. వైదిక దేవతల్లో సర్వోత్తముడు ఇంద్రుడు. మొదట వైదిక పశుపాలకులు వ్యవసాయదారుల మీద పెత్తనం చేసినప్పుడు విష్ణువుకు ఉపేంద్రస్థానాన్నిచ్చారు. సమాజం వృద్ధి పొందిన కొద్దీ పురాణకాలం నాటికి విష్ణువు మొదటి స్థానానికొచ్చి ఇంద్రుణ్ణి నాలుగో స్థానానికి నెట్టి నామమాత్రావశిష్టుణ్ణి చేశారు.

వ్యవసాయ గణాల్లో వర్గ పూర్వ; గణాలూ, దేవతలూ, సౌభాగ్యవర్ధక క్రియలూ తెలుసుకోవడానికి అవైదికాలైన శైవ - శాక్తాది తంత్ర సాహిత్యం తోడ్పడుతుంది. వైదిక సాహిత్యం పశుపాలక ప్రధానమైంది కనుక అది సాయపడదు.

ఇక సాయపడేవేవంటే - శంకరాచార్యుని సంస్కార హస్తం సోకని శైవ, శాక్త, వైష్ణవ, సౌర, గాణాపత్య, కాపాలికాది షణ్మతాలూ, వాటి తంత్రాలూ. అలాగే బౌద్ధ జైన మతాలూ; వాటి సాహిత్యాలూ, ఆచారాలూ, కర్మకాండల్నే నమ్ముకోవాలి.

## దేవాలయ నిర్మాణాలు - వాటి వెనుక ఉన్న భావాలు

ఇలాంటి పరిస్థితుల్లో దైవభావం ఎలా వచ్చిందో, దేవాలయ నిర్మాణం ఎలా సాగిందో పరిశీలించడం కూడా ఆవశ్యకం. ఆదిమానవుడు తన ఆహారాన్నే దైవంగా భావించాడు. అన్న సంగ్రహ దశలో తనకు నిరంతరం దొరికే అన్నానికి అతడు దివ్యత్వాన్ని ఆపాదించాడు. అది భూతమూ అవుతుంది, పునర్భూతమూ అవుతుంది. అలాగ సృష్టి స్థితి లయాలను కనుక్కున్నాడు. క్రమంగా మనిషి పశువుల్నీ ఓషధుల్నీ మచ్చిక చేసుకున్నాడు. ప్రకృతిని సంస్కరించడం నేర్చుకున్నాడు. సృష్టికి ప్రతిసృష్టి చేశాడు. భౌగోళిక పరిసరాలను అనుసరించి నదీతీరాలూ చిత్తడి నేలల్లో వ్యవసాయం పెంపొందించాడు. కొండప్రాంతాలూ లోయల్లో పశుపాలనను వృద్ధి పర్చాడు.

పశుపాలకులు అస్థిరులనీ తృణకాష్ఠజలసమృద్ధి ప్రాంతాలకు తరలి వెళ్ళడం అవశ్యకమనీ తెలిసింది. కనుకనే వాళ్లు నిత్య సంచారులు. గొడ్డు చర్మాలతో చేసిన డేరాలు వాళ్ళ తాత్కాలిక నివాసాలు.[50] మాంస పచనానికి అతి ముఖ్యమైన అగ్నే వారికి ఆరాధ్య దైవం. అదెప్పుడూ బండి మీదే ఉండేది. బండి తండా వెంట ఉండేది. అగ్నియుధ్యులూ (తయారు చేసేవారు) అగ్నిహోతలూ (మండింపేవారు) తండా యజమానీ ఉద్గాతలూ (పాటకులూ) ఆ బండి వెంటే ఉండేవారు. ఈ విషయాలను విపులంగా ఎస్. ఎ. డాంగే[51] తన గ్రంథంలో నిరూపించాడు.

కొన్ని తండాలలో పశుసంవర్ధకశక్తి కల మంత్రవేత్త స్వయం దేవుడైతే, మరికొన్ని తండాలలో పశు సౌభాగ్య శక్తి చిహ్నాలు దేవుళ్ళుగా ఉండేవి. తండాలు స్థిరంగా ఉన్నప్పుడు ఈ తోలు గుడారాలే దైవాలయాలు. తర్వాత తోలు గూడుబండి (రథం) నిలయమైంది. మన దేశంలో ఇది మూలవిరాట్టులున్న గుడి, ఉత్సవమూర్తులు ఊరేగే రథం దీనికి ప్రతిరూపాలుగా పరిణమించాయనవచ్చు. ఈ పశుపాలన దశలో సాపేక్షంగా స్థిరత్వాన్ని కల్పించిన నదీతటాలూ, లోయలూ, కొండలూ చరిత్రలో దివ్యత్వాన్ని సంతరించుకున్నాయి. నేటికి మనకు కనిపించే దేవాలయాలన్నీ ప్రపంచంలోని అన్ని మతాల్లోనూ ఇలాటి ప్రదేశాల్లోనే అధికంగా ఉండడం గమనించవచ్చు. ఇవే దేవుళ్ళుంటారనుకునే ప్రాంతాలుగా నాడు పరిగణించడం జరిగింది. ఈ విషయాన్ని గ్రాంట్ ఆలెన్ చక్కగా నిరూపించాడు.[52]

ఇక వ్యావసాయిక గణాలు సుస్థిరమైనవని గమనించాం. వీరు ఉత్పాదన చేసే అన్నం ఎక్కువ కాలం నిలవ ఉంటుంది. మానవ శ్రమ ఎక్కువ అవసరమవుతుంది. వ్యవసాయానికి పనిముట్లూ ఎక్కువగానే కావాలి. పండిన ధాన్యం నిలవకు ఏర్పాట్లుండాలి. అన్న పచనానికి కుండలు కావాలి. అందువల్ల సమాజంలో పెద్ద ఎత్తున శారీరక శ్రమననుసరించిన పని విభజన జరిగింది. ఇదీగాక వ్యవసాయానికి నీరు అవసరం. వర్షం ఎప్పుడు వస్తుందో తెలియాలి. నదులకు వరదలెప్పుడొస్తాయో, వచ్చిన వరదలు ఎప్పుడు ఎలా తీస్తాయో కూడా తెలియాలి. భూముల లక్షణాలూ వాటి సారమూ అర్థం కావాలి. భూమి, తల్లితో సమానం కనుక దాని మాతృత్వ శక్తిని పెంచగల మంత్రతంత్ర యంత్రాల మీద వాల్లభ్యం కావాలి. అందువల్ల వ్యావసాయిక గణాల్లో కాయక శ్రమ విభజనే కాకుండా మానసిక శ్రమ విభజన కూడా అవసరమైంది. జరిగింది.

వ్యవసాయానికి పశుబలం అంగంగా లేనప్పుడు అది కొద్ది స్థాయిలో మాత్రమే ఉండేది. అలాటి దశలోనే వారు ఎప్పటికీ మోడువారని చెట్లలో

అమరత్వాన్ని చూశారు. దానికే దైవత్వాన్ని ఆరోపించారు. అలాటి చెట్ల గుబురులనే దేవాయతనాలన్నారు. అక్కడే దేవుళ్లుంటారని భావించారు వాటి అమరత్వ సౌభాగ్యత్వాలను నీటిలోకి దింపి దాన్ని తమ గ్రామాలకు కొని తెచ్చుకొనేవారు. అలాటి అమృత జలంతో తమ పొలాల సౌభాగ్యాన్ని పెంచుకోవచ్చని భావించేవారు. నేడు దేవాలయాల్లో కానీ ఇళ్ళలో కానీ సకల పుణ్య కార్యాల్లోనూ కలశస్థాపనలూ, ఆకులుంచడాలూ, పూర్ణకుంభాలూ, దేవాలయ శిఖరాల మీద కలశాలూ, పల్లెల్లో అమ్మవార్ల ఘటాలూ ఆ ప్రాచీన దేవాలయాల భావావశేషాలే. ఈ కలశాలను ఎత్తయిన పీటమీదో దేనిమీదో ఉంచడం ఇంతకుపూర్వపు దశలో కొండలూ ఎత్తయిన ప్రదేశాల్లో దేవు ళ్ళుంటారనుకొన్న భావనలకు ప్రతిబింబాలే.[53]

సారవంతాలైన భూములున్న చోట అవసరాన్ని మించి పంట ఎక్కువగా పండింది. ఆలోచనలకు తీరుబాటు దొరికింది. దానితోపాటు కాయక, మానసిక శ్రమ విభజన మరింత ఉన్నత దశకు చేరింది. సాంస్కృతికంగా వెనుకబడ్డవారిని లొంగదీసుకుని వారిని వ్యవసాయపు పనుల్లో ఉపయోగించడం వల్లా, పశుశ్రమను కూడా వినియోగించుకోవడం వల్లా ఉత్పత్తి అధికమైంది. ఈ పెరిగిన ఉత్పత్తిని నిలవ ఉంచడానికీ, పంచడానికీ ఒక వ్యవస్థ అవసరమైంది. దాంతోనే వర్గ సమాజం పుట్టింది. వ్యవసాయం, పశుపాలన ఒకదానికొకటి ఆలంబనాలయ్యాయి. మరింత పని విభజన అవశ్యకమైంది. అందులో ముఖ్యంగా తమ సంపదను ఇతర్ల దోపిడీనుండి కాపాడుకోవడానికీ ఇతరుల సంపదను కొల్లగొట్టడానికీ సైనిక శక్తి కావాల్సి వచ్చింది. వీటన్నిటినీ కలిపి ఉంచే భౌగోళిక స్థావరాలుగా నగరాలు వెలిశాయి. ఎక్కడో ఊరు చివర వనంలో ఉన్న సౌభాగ్యదేవత నగరం నట్టనడిమికి నడచి వచ్చింది. ఆ దేవత అందరికన్నా గొప్పది. కనుక ఆ గొప్పతనాన్ని నిలపడానికి దానికో ఎత్తయిన కట్టడం కట్టేవారు. నగరం నడుమ కొండలాంటిది ఉంటే సరేసరి. లేకపోతే రాళ్ళనే పేర్చి కొండంత ఇల్లు తయారు చేసేవారు. ఆదిలో అది సౌభాగ్య తంత్రాధికారం గల పురోహితులకు నెలవుగా ఉండేది. పండిన పంటకు గిడ్డంగిగా ఉండేది. సైనికులకూ, చేతి వృత్తుల వారికీ కేంద్రంగా ఉండేది. సౌభాగ్య దేవత ప్రధాన పురోహితుడు దైవప్రతినిధిగా అటు దైవాన్ని ఇటు సమాజాన్ని శాసించేవాడు.[54] క్రమంగా సంపద పెరుగుతూండడంతో యుద్ధం నిత్యకృత్యమైంది. దానితో యుద్ధ నాయకుడు వేరయ్యాడు. ఆదిలో అతడు పురోహితుడికి లోబడి ఉండేవాడు. తర్వాత సమానుడయ్యాడు. ఆ తర్వాత అధిపుడే అయ్యాడు. సమానుడైన దశలో రాజప్రాసాదం, దైవాయతనం నువ్వా నేనా అన్నట్టు పోటాపోటీలు పడేవి. బాబిలోనియాలో నెబూ

చెడ్ నద్‌జార్ (రాజు) కాలంలో ఎనిమిది అంతస్థుల మహా ప్రాసాదం దేవాలయంగా ఉండేది. వీటిని వాళ్ళు జిగురెట్ అనేవారు.[55] దీన్నే బైబిల్‌లో టవర్ ఆఫ్ బాబుల్ అన్నారు. అలాగే సుమేరియాలోని ఇస్తారి ఆలయం, ఆసియా మైనర్‌లోని అస్తార్తె, గ్రీసులోని ఎథెనా దేవాలయాలు రాజప్రాసాదాల కన్నా ఎత్తుగా ఉండేవి. అలాగే ఈజిప్టులో అటన్, అమున్ ఆలయాలు కూడానూ.

క్రమంగా సమాజంలో సైనిక వర్గానిది పైచేయి పురోహిత వర్గానిది కింది చేయీ కావడంతో రాజప్రాసాదాల పరిమాణం పెరగడం దేవాలయాల పరిమాణం తరగడం ఆరంభమైంది.

ఇలా పూర్వం వనాలే గుళ్లుగా ఉన్న దశలో ఒక ప్రసిద్ధ వనం చరిత్ర, వర్జిల్ రాసిన అనియోడ్‌లో కనిపిస్తుంది. అది 'నేమి' వనం చరిత్ర. దీన్ని ఫ్రేజర్ చాలా విపులంగా చర్చించాడు.[56] ఆ చెట్టు నిత్యం పచ్చగా ఉంటుంది. అలాగే ఎఫ్ పర్ చెట్టూ, తులసి చెట్టూ, ప్రతి సంవత్సరం వార్ధక్యాన్ని విడిచి యవ్వనం పొందే ఆసిరిస్ దేవుడులా భావించే రావి చెట్టూ, వీటన్నిటికీ దైవత్వాన్ని ఆపాదించారు. యూరపులో నిటారుగా పెరిగే కోనిఫెరస్ చెట్ల మధ్య ఓక్ కూ దైవభావం కట్టించారు.

ఇవన్నీ ఉండే వనాలనే అమ్మవారి వనాలనేవారు. గ్రీసులో, డిమ్మిత్రీ, డయానా, ఎథెనాలకు వనాలున్నట్టు తెలుస్తుంది. ఒక్కొక్క తండా వీటిని అధి దేవతలుగా భావించేవారు. స్థలం మార్చినప్పుడల్లా తమ దేవతలను కూడా తీసుకుని పోయేవాళ్ళు. ఆ కొత్త ప్రాంతం పేరు కూడా ఈ దేవత పేరుతోనే చెలామణీ అయ్యేది. అందుకే గ్రీకు చరిత్రలో మనకు అనేక ఎథెనాలు, డిమ్మిత్రీలు, డయానాలు కనిపిస్తాయి.

ఇవి రోము, పశ్చిమాసియాలలో కూడా విస్తారంగా ఉన్నాయి. ఇదంతా వర్గపూర్వ దశ అనవచ్చు. ఇది ఇప్పటికీ మన పల్లెల్లో ముత్యాలమ్మ, నూకాలమ్మ, పైడితల్లి, మైసమ్మ, మారెమ్మ వనాలుగా కన్పిస్తూంటాయి. ఊడుగు (అంకోలం) బర్రెంక, విషముష్టి, చెట్టు ఈ వనాల్లో ఉంటాయి. ఈ చెట్ల మీద సాధారణంగా పిట్టలూ పక్షులూ ఉండవు. ప్రశాంతత ఉంటుంది. అంకోలం విత్తులు నేలరాలి తిరిగి చెట్టుకెక్కుతాయన్న నమ్మకం ఉంది. ''అంకోలం నిజ బీజ సంతతిరయః కాంతోపలం సూచికా - సాధ్వీ నైజవిభుం లతా మహిరుహం సింధుస్సరిద్వల్లభః'' (శివానందలహరి) అనే దానివల్ల అది శంకరుడే

నమ్మాడు. ఇవన్నీ బయలు స్త్రీ దేవాలయాలు. తండాలు జనంగా మారిన తర్వాత ఈ మాతృకలను అంటే స్త్రీ దేవీమూర్తులను సంస్కృతీకరించి సప్త మాతృకలుగా మార్చారు. బ్రాహ్మి, వారాహి లాంటి పేర్లుంచారు. కానీ పల్లెల్లో వీటిని 'అక్క' లనే పిలుస్తారు.

ఇదే దశలో పశుపాలకుల ప్రాంతాల్లో గ్రామీణ వ్యవస్థ ఏర్పడిం తర్వాత ఆలకాపరులు ప్రత్యేక సమాజాలుగా బతికారు. పచ్చిక బీళ్ళ గుత్తకు తీసుకుని పశువులను మేపుకునేవారు. పశ్చిమాసియా, రోము, గ్రీకు దేశాల్లో కూడా వాటి అవశేషాలున్నాయి. ఈ ఆలమందలు తిరిగే ప్రాంతాలే గ్రామ నామాలయ్యాయి. వాటి నాయకుల పేర్లూ వాటితో కలిశాయి. ఆ ప్రాంతాలనే గోత్రాలన్నారు. సామాజిక పరిణామ దశలో ఆ నాయకుల పేర్లే గోత్రాలుగా వచ్చాయి. ఇప్పటికీ భరద్వాజస గోత్రీకుడన్న పేర్లు దీన్నే సూచిస్తాయి. ఈ పశుపాలకులు గడ్డి బాగా పెరగడం కోసం సౌభాగ్య దేవతలను పూజించడం అవసరమైంది. ఈ గణాల్లో పురుష ప్రాజాపత్యమని ఇంతకుముందే వివరించడం జరిగింది కనుక వీరి దేవుడు పురుషుడు. అతడే 'కాట్రేడు'. అడవి రాజని అర్థం. వీళ్లకూడా ఓమూల చట్టమైన వనం, గుబురును చూసి అందులో 'కాట్రేడు' న్నట్టు భావించేవారు. అలా వీళ్ళకూడా బయలు దేవాలయాలను పెంచారు. పోతే ఈ వనాల మధ్య కొయ్యతో చేసిన 'పురుషాంగాన్ని' పాతేవారు. వాడే కాట్రేడు. ఇతని కోసం కేటాయించిన వనాలే కాట్రేసి కోనలూ, కాట్రేసి కోటలూనూ. కంఠాభరణంలో పానుగంటివారు 'కాట్రేసికోన బ్రాహ్మలు - ఇట్టాకవి చెప్పగలరె ఇలలలిసరవిన్" అనడం దీన్నే సూచిస్తుంది.

గ్రామీణ వ్యవస్థ పెరిగి పశుపాలక, వ్యావసాయిక వృత్తులు పరస్పరాశ్రయాలుగా మారడం జరిగింది. అప్పుడే 'కాట్రేడు' అంతకు ముందే చేరిన 'అక్కల' (మాతృకల) సరసన చేరాడు. 'పోతురాజు'గా మారాడు. క్రమంగా ఇతడే దేవగణంలో చేరాడు. సంస్కృతీకరణంతో పురుషపుంగవుడు, పురుషోత్తముడులాంటి పేర్లతో తయారైనాడు. అవే సప్తమాతృకలకు భైరవుడూ ఏడుగురక్కలకు పైన చెప్పిన పోతురాజూ తోడయ్యారు. మాతృకలంటే నాడు తల్లి అన్న పవిత్ర భావం లేదు. సౌభాగ్యతంత్రమే వాటికి ప్రధానం. అలాగే అక్కలకూనూ. శ్రీనాథుడు 'అక్కలవాడ' అని ప్రయోగించడంలో అర్థం 'తల్లులుండే ప్రాంతం' కాదన్నది అందరికీ తెలిసిందే.

స్త్రీ మూర్తుల విరళోత్పాదన వల్ల దానికి సాంకేతిక రూపం అబ్బింది. ఇతర అవయవాలు బిందువులుగా మిగిలాయి. జననేంద్రియం మాత్రం ప్రధానంగా ఉండే మూర్తి నిర్మాణం సాగింది. అది కొసకు ముక్కోణం రాయిగా మారింది. ఇందులో కోణం పైకి, ఆధారం కిందికి ఉంటుంది. ఈ మార్పు మనకు నాగార్జునకొండ శిల్పాల్లో కనిపిస్తుంది. ఇలాంటి ముక్కోణపు రాళ్ళు ఇప్పటికీ మన దేశంలో ఇంటింటా తులసి కోటమీద కనిపిస్తూంటాయి. ఇదంతా వ్యావసాయిక గణాల్లో దేవతా పరిణామం.

సౌభాగ్య తంత్రం వ్యవసాయానికెంత ముఖ్యమో పశుపాలనకూ అంతే అవసరం. వ్యవసాయ సౌభాగ్యం మనిషి విశ్వాసం మీద, విశ్వాసాన్ని పెంపొందించే తంత్రాలమీదా ఆధారపడ్డ పరోక్ష జ్ఞానం. అయితే పశుసౌభాగ్యం ప్రత్యక్షం. దీన్నింతకుముందే పరిశీలించాం. వృషభవర్ధకుడైన వృషభ నాథుడు ప్రత్యక్ష్య సౌభాగ్య దేవతగానూ వృషభాలూ అలాగేనూ ఉండేవి. ఈ దశ మనకు గ్రీకు గణాల్లో కనిపిస్తుంది. వారి పురాణాల్లో బౌటెష్ వృషభాధిపతి లేక భూతేశుడు. మహాదేవుడుగా అవతరించాడు. వీటి బొమ్మలను తయారు చేసేవారు. స్త్రీమూర్తి జననేంద్రియం ప్రధానంగా ఉండే బొమ్మల్లాగా వృషభ జననేంద్రియాన్ని కూడా ప్రధానంగా చూపించే బొమ్మలు ఇప్పటికీ దొరుకుతున్నాయి. హరప్పా, మొహంజదారోలలో దొరికిన హరప్పా బుల్ ఇలాటివే. వ్యవసాయానికి సౌభాగ్య చిహ్నంగా స్త్రీ జననేంద్రియం లాగా, పశుపాలన సౌభాగ్య చిహ్నంగా పురుష జననేంద్రియం పెంపొందింది.

ఈ రెండు కలిసిన దశలో పశుపాలక సౌభాగ్య చిహ్నంగా ఒకటే కనిపిస్తోంది కానీ, వ్యావసాయిక సౌభాగ్య చిహ్నాలు ఒకటి స్త్రీ చిహ్నం - రెండోది బీజ, జననమరణాలకు చిహ్నం. ఇది అనేక పద్ధతుల్లో సాగేది. పుష్టి కల యువకులను కాల్చి ఆ బూడిద పొలాల మీద చల్లడం. ఎక్కువ పిల్లలు పెట్టగల పందుల్ని భూమిలో పాతిపెట్టడం;[57] నరమాంసాన్ని కండల కింద కోసి వెదజల్లడంలాంటివెన్నో ఉన్నాయి. అన్నిట్లోకీ నర చితాభస్మాన్ని చల్లడమనేది బహుళ ప్రచారంలో ఉండేది. ఆ చితి ఉన్న స్థలాన్ని సౌభాగ్య కేంద్రంగా భావించారు. అందువల్ల దహనప్రదేశానికి గుర్తుగా చితి చుట్టూ రాళ్ల పేర్చడం - చితి మీద పెద్ద రాయి గుర్తుగా పెట్టడం ఆనవాయితీ అయింది. తరువాతికాలంలో సౌభాగ్య తంత్రం ఏరూపం తీసుకున్నా ఇలాటి చితుల

వద్దకు వచ్చి అక్కడి శక్తిని ఆవహించుకుని పోవడం పరిపాటైంది. ఈ భావమే సమాజం నాగరిక దశకొచ్చింతర్వాత ఆకారంగా రూపొందిన అర్ధనారీశ్వరుని లక్షణాలను వివరించే సందర్భంలో ముందు విశదపరుస్తాను. బుద్ధుడు మరణించిన తర్వాత అతడి చితాభస్మాన్ని పంచుకోవడానికి భయంకర యుద్ధాలు జరిగాయి. బుద్ధ జాతక కథలూ ఇతర గ్రంథాలూ వీటిని చెప్తాయి. ఇతని చితాభస్మానికి సౌభాగ్య గరిమ ఉందని నాటి తండాలు విశ్వసించాయి. ఆ కారణం చేతనే అతని భస్మం, అస్థికలను అనేక ప్రాంతాలకు తీసికెళ్ళి పాతిపెట్టి బౌద్ధస్థూపాలు కట్టారు. ఆదిలో వీటికి 'ధాతుగర్భ' అన్న పేరుపెట్టారు. ధాతు అంటే ఎముక. లంకలో దాన్ని 'దాగోబా' అంటారు. మొదట్లో పెద్ద నిర్మాణం ఏదీ లేకుండానే మధ్యలో ఒక రాయి, చుట్టూ రాతి వలయాలూ ఉండేవి. క్రమంగా పెద్ద నిర్మాణ స్వరూపాన్ని సంతరించుకుంది.

ఆరుబయలు గుళ్ల క్రమంగా రాళ్ళు పేర్చిన స్థలాలుగా మారి, స్థాపత్య కళ పెరిగిన తర్వాత దేవాలయ నిర్మాణాల్ని సంతరించుకొంది.

ఆర్యజాతుల్లో నాగరికత ఒకస్థాయికి చేరింతర్వాత మృతులకు 'దహనం' ప్రచారంలో ఉండేది. కానీ సెమైట్ జాతుల్లో ఖననం మాత్రమే ఉండేది. లాంఛనంగా ధాతుగర్భాలకు పూజాపునస్కారాలు చేసినట్టుగా, ఈ ఖననస్థలంలో కూడా కట్టడాలు కట్టి పూజించే ఆచారం ఆ జాతుల్లో పుట్టింది. ఇవే ఈజిప్టు ప్రాంతాల్లో పిరమిడ్లుగా ఎత్తుకు ఎదిగాయి. అలాంటి సంస్కృతి వ్యాపించిన ప్రాంతాల్లో సౌభాగ్యకారకుల సమాధులు ఊరి పొలిమేరల్లోనూ, గొప్పవారి ఇళ్ళల్లోనూ కూడా పూజామందిరాలుగా రూపొందాయి. ఆ వ్యక్తి చనిపోయిన చోటనే పాతిపెట్టడం, అతని పుర్రెను అతణ్ణి పాతిన ప్రదేశంలో నేల మీద ఉంచి పూజించడం వంటి అనేక రూపాలను సౌభాగ్య తంత్రాలుగా కాకున్నా పూర్వుల ఆరాధన అంటూ గ్రాంట్ ఆలెన్ చాలా ఉదాహరణ లిచ్చాడు. ఆయా దేశాల తెగల స్థాపత్య స్థాయిని బట్టి వీటి రూపాలుండేవి.

ఈ రకం సంప్రదాయం, విగ్రహారాధనకు వ్యతిరేకులూ, నిర్గుణబ్రహ్మోపాసకులూ అయిన మతాలవారిలో కూడా కొనసాగుతోంది. తురకలకు గోరీలే పూజాస్థలాలు. క్రైస్తవులకు గోరీలే చర్చిలు. వీటి వివరణలు గ్రాంట్ ఆలెన్ చాలా ఇచ్చాడు.

కొన్ని ప్రాంతాల్లో దహనం చేసిన తర్వాత ఆ ధాతువుల మీద కట్టడం కడ్తారు. అంటే పై రెండూ కలిసిన పద్ధతి అన్నమాట.

స్థవిర జీవితం ఏర్పడగానే ఈ దైవచిహ్నాలకు అంటే పశుపాలక, వ్యావసాయిక సౌభాగ్య చిహ్నాలకు కూడా స్థిరరూపం ఏర్పడింది. అయితే పైన

వివరించిన అన్నిసౌభాగ్య తంత్రాలూ చేరాయి. మానవ చితాభస్మం, సకృత్తుగా అక్కడక్కడ సౌభాగ్య చిహ్నాలుగా మిగిలిన కపాలాలు, కందరాలు కోసి వెదజల్లే పద్ధతికి గుర్తుగా ఛిన్నమస్తకాలూ ఇవన్నీ ఒకే ఆకారానికి వచ్చి చేరి నిల్చాయి. అయితే మన దేశంలో ఇలాంటి సౌభాగ్య దేవతలకు దేవాలయ నిర్మాణం ఎప్పుడు జరిగిందో చెప్పడానికి ఖచ్చితమైన ఆధారాలు లేవు. మొహంజదారోలో ఇలాటి దిబ్బ ఉందంటారు. ఇంకా దాని స్వరూపం వెల్లడి కాలేదు.58

భారతదేశంలో సమాజం వృద్ధి పొందిన మీదట ఆయా తండాల దేవుళ్ళు కూడా ఈ సౌభాగ్య దేవతల్లో భాగస్వాములయ్యారు. ప్రధాన మూర్తి గుడిలో ఏదైనా చుట్టూ ఈ సౌభాగ్య చిహ్నాలన్నీ తప్పనిసరిగా చోటు చేసుకున్నాయి.59 గుడిగా రూప నిర్మాణానికి బీజం బౌద్ధ స్థూపంలోనేపడింది. బౌద్ధులు బోధివృక్షం తిన్నె మీద బుద్ధ పాదుకలూ, దాని మీద చక్రం, ఆ వృక్షం బొమ్మలు గీసిన రాళ్ళనే పూజించారు. తర్వాత అతని జాతక కథలను చిత్రించే నిర్మాణాలను మహాసాంఘికులు ఆరంభించారు. వీరినే చైత్యకవాదులనీ మహాయానులనీ అంటారు. భారత దేశంలో దేవాలయ నిర్మాణానికి దారిచూపింది వీరేనని పండితుల అభిప్రాయం.

దేవుడూ - దేవాలయ నిర్మాణం60 ఈ రెంటిలో సౌభాగ్య తంత్రాలే ప్రధానాశయంగా ఉన్నాయని ఆ తంత్ర శాస్త్రాన్ని ఇప్పటికీ భారత దేశంలో కొందరు గుప్త విద్యగా కాపాడుకుంటూ వస్తూన్నారు. ఈ తంత్రం పూర్వ కాలంలో శాస్త్రాల్లో ఆరు రకాలుగా ఉండేది. శైవం, వైష్ణవం, శాక్తం, సౌరం, గాణాపత్యం,61 కాపాలికం. వీటిని శంకరాచార్యుడు తన సమాజానికి అనువుగా సంస్కరించినట్టు ప్రతీతి. ఆయనకు 'షణ్మత స్థాపనాచార్య' అన్న బిరుదూ వచ్చింది. ఆయన కాలం నాటికే వజ్రయానం అన్న బౌద్ధ సౌభాగ్య తంత్రం కూడా ప్రచారంలో ఉండేది. అది క్రమంగా శాక్తేయంలో లీనమైంది. ఈ తంత్రాల్లో అన్నిటికీ కూడా స్త్రీ పుంసయోగం ప్రధానం. సౌరానికి ప్రత్యేకంగా రక్తతర్పణంకూడా కావాలి.ఒకప్పుడది మిత్రమతంగా చెలామణీఅయ్యేది. సౌర దీక్ష పొందగోరేవారిని నేలలో గొయ్యి తీసి అందులో కూర్చోపెట్టేవారు. ఆ గోతి మీద కర్రలు పరిచి దాని మీద ఓ ఎద్దును తెచ్చి బలిచ్చేవారు. వృషభ రక్త స్నాతుడైన ఆ దీక్షితుడు గోతిలోంచి లేచినప్పుడు ఎర్రగా ఉదయార్క సారూప్యడౌతాడని వారి విశ్వాసం.

కాపాలికులకు చితాభస్మం ముఖ్యం. ఈ సౌరతంత్రాలు ఒకప్పుడు కాశ్మీరులోని 'మార్తాండ'లో ఉండేవని ఇప్పటికీ అక్కడున్న శిల్పాలు

సూచిస్తాయి అలాగే ఒరిస్సాలోని కోణార్క కూడా ఒకప్పటి సౌరతంత్ర కేంద్రం. శ్రీకాకుళంలోని అరసవెల్లి అలాటిదే.

తాంత్రిక శైవ దేవాలయం ఖజురహోలో ఉన్న 'ఖండేల్‌వాల్' గుడి. ఇప్పటికీ వంగదేశంలో తాంత్రిక శాక్త, వైష్ణవ, కాపాలిక మతాలున్నాయి.

ఒకప్పుడు కాలాముఖ శైవంతో తాంత్రిక శైవం దేశంలో చాలా ప్రచారంలో ఉండేది. అందుకని ఈ మతాల్ని కూడా బాగా పరిశీలిస్తే దేవుళ్ళూ - దేవాలయాల నిర్మాణాలూ వాటి పుట్టుపూర్వోత్తరాలూ తెలుస్తాయి.

ఈ అన్నిరకాల తంత్రాల్లోనూ తంత్రం, మంత్రం, యంత్రం అనేవి మూడు ప్రధానాంగాలు. తంత్రం సౌభాగ్యవర్ధకమైన క్రియ. అందులో ముఖ్యమైనది స్త్రీ పుంసయోగం. మంత్రం అనేది ఆయా తంత్రాల తాత్విక రూపం. అది గుప్త విద్య కావడంవల్ల ఆల్జీబ్రా రూపంలో ఉంటుంది. ఇందులో అక్షరాలకు విలువలు స్పష్టంగా తెలిసినప్పుడే లెక్క తేలినట్టు; మంత్రాల్లో బీజాక్షరాలకు తాత్వికమైన విలువ తెలిసినప్పుడే వీటి అర్థం బోధపడుతుంది. మూడోది యంత్రం. ఇది తాంత్రిక క్రియలకూ దేవాయతనాలకూ ఒకరకమైన పథకం అంటే బ్లూప్రింటు అనవచ్చు. శాక్త యంత్రాల్లో సర్వోత్తమంగా పరిగణించేది శ్రీచక్రం. దీనిరూపం 'బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మం' - అంటారు.

ఈ ఒక్క యంత్రానికి మాత్రమే మేరుప్రస్తారం ఉంది. అంటేఎలివేషన్. మిగిలిన వాటికి లేదు. అంటే మిగిలిన వాటిలో చాలాభాగం సౌభాగ్యతంత్ర ఆచరణ పథకాలే కాని శాశ్వత దేవాలయ పథకాలుకాకపోవచ్చును. ఈ శ్రీచక్రంలో కేంద్రకం బిందు త్రికోణాలు. ఇవి తొమ్మిదుంటాయి. అంటే ఇవి మళ్ళీ స్త్రీపుంస యోగ చిహ్నాలు.[62] దీనికి మేరుప్రస్తారం చేసి దాని దళాలూ, ప్రాకారాలూ, అంతరాలూ కనిపించకుండా మూసేసినట్లయితే అది ఈజిప్టులోని పిరమిడు ఆకారంగా తేలుతుంది. పిరమిడ్ల చివర ఆసిరిస్ కాంతి ప్రవేశానికి ఏర్పరచిన రంధ్రం శ్రీచక్ర కేంద్ర బిందువుగా మారుతుంది.[63] బహుశా ఆదిమ దేవాలయానికి తాంత్రికులు ఏర్పరచిన ప్రామాణిక రూపమే శ్రీచక్రమై ఉండవచ్చు. తాంత్రికులు పూజా సమయంలో ముగ్గులతో అనేక యంత్రాలను గీస్తారు. వాటిలో సర్వతోభద్రం, త్రికూటం వంటి పేర్లెన్నో ఉన్నాయి. ఇవన్నీ ప్రాసాద దేవాలయ నిర్మాణాలకు పథకాలు. ఈ పేర్లూ పథకాలూ భోజుని సమరాంగణ సూత్రధార గ్రంథంలో చాలా వివరణాత్మకంగా ఉన్నాయి. శంకరాచార్యుల కాలానికి బాగా నెలకొన్న దేవాలయ నిర్మాణం క్రమంగా పెరిగింది: దేవగిరి దివానూ, ధర్మశాస్త్రకర్తా, మహాపండితుడూ హేమాద్రి దీక్షితులు (12వ శతాబ్దం) ఈ నిర్మాణాలకు ప్రామాణికతను

ఏర్పర్చాడు. వీటికి కొన్ని మార్పులూ చేర్పులూ చేసి కాకతీయులు తెలుగునాట తమ సొంత పద్ధతులు రూపొందించారు.

దైవభావం ఏర్పరచుకున్న కొన్ని విషయాలను సౌభాగ్య తంత్రాల్లో భాగాలుగానే నాటి తండాలు ఆచరించాయి. వివిధ తంత్రాలను ఒకే దశలోనూ, ఒకే ఆకారంలోనూ కూడా ఊహించారు. ఆ సౌభాగ్య తంత్ర కేంద్రంగా దైవ భావానికి స్థిరరూపం ఇచ్చారు. అలా ఇచ్చిన నిర్మాణరూపాలు భారతదేశంలో భిన్న దశల్లో, వివిధ మతాల్లోనూ చాలావరకూ సామ్యాలతోనే ఉన్నాయి. అవన్నీ కలిసే నేటి దేవాలయ నిర్మాణ రూపాన్ని సంతరించుకున్నాయి. ఆరుబయలు గుహనుండి దేవాలయ నిర్మాణం వరకూ సాగిన చరిత్ర సంక్షిప్తంగా ఇందులో చెప్పడం జరిగింది.

## పురోహితుల ఆవిర్భావకారణం

అన్న వృద్ధికోసం అన్న పుష్కలాన్ని ఒక దశలో మానవులు అభినయించేవారు. దీన్ని మిమాటిక్ మాజిక్ అనవచ్చు. దీన్ని తెలుగులో అభినయ తంత్రంగా పరిగణిద్దాం. జంతువృద్ధికీ, పంటల వృద్ధికీ ఇలా అభినయోత్సవాలు జరుపుకునేవారు. సమాజం పెరిగిన కొద్దీ ఈ తంత్రాలను గుర్తుంచుకునే బాధ్యత కొందరికి పంచారు. ఆ ఉత్సవాల సమయంలో తండా మొత్తం ఇతడి నేతృత్వంలో సాగేది ఈ వ్యక్తికి మానవశాస్త్రజ్ఞులు వైద్యుడనీ, మాంత్రికుడనీ (మాజీ, మాగీ) 64 పురోహితుడనీ (ప్రీస్ట్) రకరకాల పేర్లు పెట్టారు. 65 పురోహిత శబ్దాన్నే ఇక ముందు వాడుకోవడం మంచిది. ఇందులోనే, మిగిలిన రెండు పదాలకున్న స్వభావాలూ ఇమిడి ఉన్నాయి. తండాలో ఒక వ్యక్తినిష్ఠమైన ఈ పౌరోహిత్యం కొన్ని తండాలుకల్సి గణంగా మారినప్పుడు ప్రధాన తండా మొత్తానికే ఈ పురోహిత ప్రతిపత్తి ఏర్పడేది. అప్పుడు గణంలో వృత్తివిభజన తండాల వారీగా జరిగేది. దీనికి చరిత్ర నిండా ఎన్నెన్నో ఉదాహరణలు కనిపిస్తాయి. ఆసియా మైనర్‌లో ఫ్రిగియన్స్ (భృగువులు) ప్రధాన పాత్ర వహించారు. చరిత్రకు తెల్సిన పెద్ద భృగుచక్రవర్తి గోర్డాన్. అతడి కొడుకు పట్టిందల్లా బంగారం చెయ్య

గల మైదాన్. ఈ భృగువులకు పురోహితులు అంగిరులు. గోర్డాన్ తమ పురోహితుల పేరు మీద రాజధాని నిర్మించాడు. దాన్నే 'అంగిర' అన్నారు. అదే కాలక్రమాన 'అంకార'గా మారింది. ఇప్పుడది టర్కీలో ప్రధాన పట్టణం. దీన్ని ఆసియా మైనర్ చరిత్రకారులు శాసనాధారాలతో తెలుసుకున్నారు. మన పురాణాలు కూడా మొదట అగ్నిని కనుగొన్న వారిని అంగిరులని చెప్తాయి. ఆ ప్రత్యేకత వల్లనే అనేక తండాలు వీళ్ళను పురోహితులుగా అంగీకరించాయి.

మానవ జాతిలో పురోహిత ఆవిర్భావం ఇలా జరిగింది. అప్పటికింకా దేవుడూ, దైవ భావం అంకురించనేలేదు. అప్పటి అనుభవాన్నిబట్టి ముందు దేవుడు, ఆ తర్వాత పురోహితుడని ఊహిస్తే అనేక సమస్యలకు పరిష్కారాలు దొరకవు. దొరికినా సహేతుకంగా కనిపించవు.

తొలి రోజుల్లో పురోహితుడే తండా నేత. అంటే రాజు, పురోహితుడూ ఒకరేనన్నమాట. సమాజం వర్గ సమాజంగా మారుతున్న తొలి దశల్లో ఈజిప్టు, సుమేరియా, అసీరియా, గ్రీకు దేశాలలో ఈ పురోహిత రాజులే (ప్రీస్ట్ కింగ్స్) ఉండేవారు. సమాజం ఈ దశకు చేరుకోడానికి చాలాకాలం పట్టింది.

పురోహితుడి బాధ్యత ఆహారాన్ని పుష్కలంగా పెంచేందుకు అభినయ తంత్రాన్ని నిర్వహించడం. ఈ బాధ్యతా నిర్వహణలో అతడికి ఇతరులకన్నా ఎక్కువ విజ్ఞానం అవసరాన్నిబట్టి అలవడింది. మొదట్లో ఆహారానికి పనికి వచ్చే అలవాట్లు, ఓషధుల విజ్ఞానం వంటి విద్యలు అతనికి అవగతం కాగానే, అతడికి పురోహిత పాత్రతోపాటు విద్యాంస లేక వైద్య పాత్ర కూడా తోడయ్యింది. వేట సమయంలో తగిలిన గాయాలకు కట్టుకట్టడం, రక్త స్రావాన్ని ఆపడం, మాను పట్టడానికి ఆకూ అలంతో కట్టు కట్టడం అతడి బాధ్యతగా మారింది. ఈ దశలోనే మానవుడికి జనన మరణ చక్రం తెల్సింది. ఆహారంలో ఉన్న జంతువు చావే అతడి పుష్టికి కారణం అనుకున్నాడు. ఒక్కొక్క సమయంలో గాయాలు మాననప్పుడు, నలతలొచ్చినప్పుడు, కారణాలను వెదికే బాధ్యత కూడా పురోహితుడికే వచ్చింది. జ్వరం ముమ్మరంగా ఉన్నప్పుడు సంధిప్రేలాపన సహజం. సౌభాగ్య తంత్రాలు తప్ప మరే ఉత్సవాలూ కార్యకలాపాలూ ఎరగని అతడు సంధి దశలో వాటిని గురించే పలవరించేవాడు. అభినయ తంత్రంలో ముఖ్యాంశం పశు నడవడిక, అరుపులూ. కనుక సంధి ప్రేలాపన కూడా అలాగే ఉంటుంది. ఆ కాలంలో సామాన్యునికి వచ్చే ఈ అభినయ కౌశలం పురోహితుని అభినయ కౌశలంతో అడిగిన ప్రశ్నలకు అలాగే జవాబు చెప్తుంది. తమకు ఆహారంగా ఉన్న పశువుల చేతనం

అతనిలో ప్రవేశించి ఈ పని చేయిస్తున్నడన్న అనుమానం వాళ్ళకు కలిగింది. కనిపించని ఆ చేతనాన్ని ఎలా అదుపులో పెట్టాలో తోచక భయం కల్గింది. ఆ భయంనుంచ దైవభావం అంకురించింది. ప్రకృతిని శాసిస్తున్నాననుకున్న పురోహితుడి భ్రమకు చ్యుతి కలగింది. ఈ చేతనమీద వాల్లభ్యం పొందడానికి యత్నాలు ఇక ఆరంభమయ్యాయి.

ఆహారంకోసం జంతువును చంపేముందు ''మా పుష్టికోసం, మా సంతానాల అభివృద్ధికోసం మాత్రమే నిన్ను చంపుతున్నాముసుమా''-అని ఆ జంతువుతోచెప్పి తానుతిని ఆ చేతనను తాను పొందానని పురోహితుడు భావించుకోవడం ఆరంభించాడు. తండా అందరి పక్షాన కొంత తాను తినడం పురోహితుడు నేర్చుకున్నాడు. ఆ జంతు చేతన అతనిలో ఆవహించిందని అనుకున్నాడు. అతడి అనుమతి లేకుండా, పురోహితుడి ద్వారా కాకుండా తండాలోని జంతువులను చంపినా, తిన్నా వాటి చేతనలు తిన్న వాళ్ళనూ, తండా వాళ్ళనూ బాధించగలవన్న నమ్మకం కలిగించాడు. భయం కలిగించాడు. అంటే తన కున్న పరిమిత జ్ఞానం వల్ల కలిగిన భయాన్ని, తండాకు దత్తంచేసి ఆ విధంగా తాను ఆత్మ విశ్వాసాన్ని పుంజుకున్నాడు. సామాన్యుల కంటికి అందని చేతన వ్రాతం ఒకటి ఉందనీ దానిమీద వాల్లభ్యం ఒక్క పురోహితుడిదేనన్న నమ్మకం మొదలైంది. అంటే అంతవరకూ తండాలో సాముదాయకంగా ఉన్న విజ్ఞానం విశ్వాసం ఇప్పుడు ఒక్క వ్యక్తి నిష్టమైంది. అంతవరకూ తమతో సమానుడూ, తమలో ఒకడుగా ఉన్న పురోహితుడు అసమానుడూ విశిష్టుడూ అయ్యాడు.66 పురోహితుని అనుమతీ, తంత్రమూ లేకుండా అలవాటైన జంతువులను తినడం తప్పన్న భావం తండాలో కలిగింది. ఈ విధంగా మానవ జాతిలో మొదటి సారిగా టాబూ అంటే తప్పు ప్రవేశించింది. దీని చుట్టూ క్రమేణా భయమూ - భక్తీ అలుముకున్నాయి.

ఈ భావం తమకు ఆహారంగా పనికొచ్చే జంతువు చుట్టూ ఏర్పరచుకున్నారు. ఆ జంతువే తమకు ఆది పురుషుడనుకున్నారు. తమ బాధలను దానికి విన్నవించుకోవాలంటే ఈ పురోహితుడి ద్వారానే జరగాలని నమ్మారు. ఆ జంతువులనే టోటెం అన్నారు. వీటి స్థావర చిహ్నాలనే ధ్వజాలుగా పెట్టుకున్నారు. ఈవిధంగా కనిపించని చేతనమీద వాల్లభ్యం పొందిన పురోహితుడు-మాంత్రికుడూ, తాంత్రికుడూ కూడా అయ్యాడు. పురోహితుడు మాంత్రికుడుగా మారడం దైవ భావం అంకురించడం ఒకే కాలంలో జరిగి ఉంటుంది. భయ భీతులనుండే దైవభావం వచ్చింది కనుక రాగద్వేషాలు కూడా దాని చుట్టూ చేరాయి. ఒకనాడు ఈఙిష్టువారికి వారి టోటెం - అతి పవిత్రమైన దైవ భావంగా

ఉండే పంది.[67] తర్వాతి కాలంలో అదే ద్వేషానికి గురికావడం చూడగలం. దైవభావంతో భక్తితో తాకకుండా ఉన్న వస్తువు, క్రమంగా ఏహ్యభావంతో ద్వేషంతో తాకరాని వస్తువుగా పరిణమిస్తుంది.

సమాజ పరిణామ క్రమంలో అన్న సంగ్రహ దశ నుండి అన్న ఉత్పాదన దశకు చేరుకున్నాడు నరుడు. అప్పటికి సమాజంలో వ్యవసాయ, పశుపాలక, మిశ్రమ దశలు వచ్చాయి.

సమాజం స్థిరపడడంతో టోటెంకూ పంటకూ స్థావరాలు అవసరమయ్యాయి. పురోహితుడు దైవ ప్రతినిధి కానీ, దైవం కాడు. సంపద కోసం కట్టిన శాలలే పెరిగి, దానితోపాటు టోటెం ఆకారాలూ అంటే దైవపరిమాణాలూ పెరిగాయి. అంతవరకూ తండాలకు పురోహిత - నేతలుగా ఉండే వీళ్లు, పురోహిత రాజులయ్యారు. అంతవరకూ బయలు ప్రదేశాల్లో నిర్వహించే సౌభాగ్య తంత్రాలను పురోహిత రాజు ఆ కట్టిన పెద్ద శాలల్లో నిర్వహించడం ఆరంభించాడు. గుహ నిర్మాణ దశలో పురోహిత తండా అంటూ ఉండేదని ముందే తెలుసుకున్నాం. అలాటి తండాలోని వ్యక్తులందరూ ఈ శాలల్లో పురోహితులయ్యారు. అదో వర్గం అయింది.[68] దైవ భావం కల్పించడానికి సామాన్యంగా ఉన్న సౌభాగ్య తంత్రాలను విస్తరించి సంక్లిష్టతను ఆపాదించారు. ఇవే నాటి గుళ్ళు. వీటిల్లో పెంపొందిన సౌభాగ్య వర్ధక క్రియల కథలు - వాటి తీరులనూ ఈజిప్టు గ్రీకు, సుమేరియా, అసీరియా దేశాల చరిత్రలు బాగా వివరిస్తాయి.

ఈ సౌభాగ్య వర్ధనానికి ఉపయోగించిన చిహ్నాలనూ వాటి భావాలనూ దేవాలయ నిర్మాణంతోపాటు పరిశీలించడం అవసరం.

## ప్రపంచంలో సౌభాగ్య చిహ్నాలూ - ఆరాధనలూ

అది భూసంబంధం కానీ, స్త్రీ సంబంధం కానీ పెంపొందించే లక్షణం ఉన్న ప్రతి దాన్నీ సౌభాగ్యవర్ధనంగా మానవుడు ఆరాధనా భావంతో చూశాడు. తనుతినే ఆహార పుష్టికుపయోగపడే వస్తువైతే దాని చుట్టూ తంత్రాన్ని ఏర్పరచుకున్నాడు. ప్రకృతిలో కనిపించే ప్రతిదాన్నీ ఆశ్చర్యంతోఆరాధించాడని అందరూ అనవచ్చు కానీ అసలు విషయం సౌభాగ్యవర్ధక దృష్టి. చంద్రుడుకానీ,

సూర్యుడు కాని, 69 నిప్పు, నీరూ70 జంతువులూ అన్నిటికీ తనలాంటి ఆకార గుణవిశేషాలనే ఊహించుకున్నాడు. అవన్నీ తమ తండాల మధ్య కలిసి మెలసి తిరుగుతూంటాయనే విశ్వసించాడు. తన కళ్ళముందర వృద్ధి పొందే ప్రతి చెట్టూ చేమనూ, ఆకూ అలాన్నీ వృద్ధి పొందించడానికి ఉపయోగపడే వస్తువులుగానే స్వీకరించాడు.

పశుపాలకులు మొదట్లో సరస్వతీనదీతీరంలో ఉన్నకాలంలో ఆ నీరు తమకు వ్యవసాయాన్ని నేర్పడాన్ని చూశారు. ఆహారం అన్నివేళలా ఉండే అవకాశం ఈ నీటివల్ల కలగడం గమనించారు. ఒక కొత్త నాగరికత ఆ నీటి వల్లే అబ్బిందని భావించారు. అందుకే ఆ సరస్వతీనదిని తమలాంటి మానవిగా ఊహించారు. ఆ నీటిలో కనిపించిన అంశాలన్నీ ఆమెకు అంగాలుగా చేశారు. ఆ తీరాన్నే ఈ కొత్త విద్య తమకు సంక్రమించిందని ఆ సరస్వతిని విద్యకు దేవతగా తలచారు. నీటిలో తామర చాలా వేగంగా పెరుగుతుంది. అందుకు ఆ పువ్వునూ ఆమెకు జత చేశారు. నీటిలో తిరిగే హంసలను వాహనం చేశారు. నీటి గలగల భావాన్ని సంగీతంగా భావించి ఆమె చేతిలో వాయిద్యం ఉంచారు. 'సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ' అన్న భావంతో సౌభాగ్యవర్ధన దేవతగా మలిచారు.

ఈ తామర పద్మం బౌద్ధుల కాలంలో కూడా సౌభాగ్యవర్ధక చిహ్నంగా బాగా ప్రచారంలో ఉంది. కనుక నాటి మానవుడు తన జీవితయాత్రలో అడుగడుగునా తనకు కనిపించిన వాటిని సౌభాగ్య వర్ధన దృష్టితోనే చూశాడు. తన పూర్వీకులను బూడిద రూపంలో పొలాల్లో చల్లినా, పుర్రెలను ఇంట్లో పెట్టుకుని ఆరాధించినా ఈ భావంతోనే చేశాడు. ఇది చైనాలో చాలా ముమ్మరంగా ఉండేది. కాంటన్ నగరంలో 500 దేవతలున్న ఒక పెద్ద ప్రార్థనా మందిరం ఉంది. అవన్నీ వాళ్ళ పూర్వీకుల ప్రతిమలే.71 ఇదే జపాన్‌లో కూడా ప్రాచుర్యంలో ఉండేది. రామాయణంలో రాముడికి అతని పూర్వీకులందరి ప్రతిమలనూ చూపడం సూర్యుడి వారసులని వివరించడం దీన్నే సూచిస్తుంది.

అలాగే గణనాయకులనూ, తండా మాతలనూ పూజించడంలో కూడా ఈ భావమే ఉంది. గణపతి రూపకల్పనలో ఈ సౌభాగ్యవర్ధనాంశాలే గోచరిస్తాయి. పెద్ద కడుపుండడం పుష్టివర్ధక సూచకం. ఆఫ్రొడైట్ బొమ్మలూ అలాగే ఉండేవి. సిద్ధి, బుద్ధి అనే స్త్రీలను అతనితో జతచేర్చడం తమ కోరికలు సిద్ధించడానికి సౌభాగ్య వృద్ధిని కలగించడానికే. దీనికి శ్రీధరమూర్తి రాసిన 'గణపతి' అన్న గ్రంథంలో కూడా ప్రాధాన్యం లభిస్తుంది. పంట

కుప్ప వినాయకుడి ఆకారమనీ, కింద ఎలుక వాహనం వాటిని నాశనం చేసే అంశాలనీ, అందుకే దాన్ని అధిరోహించి ఆ నష్టాలను దాటుకోడం సూచిస్తోందనీ అంటాడు.[72] ఊహ సమంజసంగానే కనిపిస్తుంది. వీటన్నిటినీ మించి దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ గణాలనూ, గణాధిపతినీ వివరిస్తూ చేసిన అంశాలు చాలా సమర్థనీయాలు.[73]

ఇక చెట్లు చేమలు గురించి ఆలోచిస్తే ఆనాడు కాయలు కాసే ప్రతి చెట్టునూ స్త్రీగా భావించారు. జర్మనీలో ఆడపిల్లను 'బాప్టిజం' లోకి తెస్తే 'ఆపిల్' చెట్టునీ, బాలుడికి బాప్టిజం ఇస్తే 'పియర్' చెట్టునీ పాతుతారు. పియర్ మగ చెట్టనీ ఆపిల్ ఆడ చెట్టనీ భావించేవారు.[74] 'మాండ్రక్' చెట్టును చాలా ఎక్కువ సౌభాగ్యవర్ధకంగా తలచేవారు.[75]

భారత దేశంలో రావి, వేప వంటి చెట్లు ఇలాటి భావంతోనే పూజ లందుకున్నాయి. తెలుగునాట ప్రధానంగా 'కందగడ్డ'కు చాలా ప్రాధాన్యం ఉంది. స్త్రీల నోములలో దీనికి గొప్పస్థానం ఉంది. కందగడ్డ ఒక పిలక నాటితే అతి తక్కువ కాలంలోనే అనేక పిలకలు పెడ్తుంది. తమ జీవితం అలాగే వృద్ధి కావాలన్న భావమే ఈ నోములో ఇమిడి ఉంది. దీన్ని కొందరు మహాపితృ అమావాస్యనాడు చేస్తారు.

ఇంతకుముందే వృషభ జననాంగానికి, స్త్రీ జననాంగానికి పూజలు జరుగుతుంటాయన్న అంశం గమనించాం. ఇప్పటికీ గ్రామాలలో నిస్సంతులైన వారి ఇళ్ళ ముందర కొయ్యతో చేసిన వృషభ జననాంగం పాతి ఉండడం చూస్తుంటాం. ఈ తంతును ఆబోతును వెయ్యడం అంటారు. ఇది ఒకరకమైన అనుకంపన తంత్రంగా పరిగణించవచ్చు.[76] అలాగే స్త్రీ యోనిని పూజించడం ఈ ఆకారంలో వస్తువులను ఆరాధనా సందర్భంగా ఉపయోగించడం. వీటిని ధర్మారావు అలంపురం విగ్రహం, ఇంటిలో దీపపు సెమ్మాల ఉదాహరణలతో చక్కగా సమర్థించాడు.

ప్రాచీనకాలంలో ఈచిహ్నాలన్నీ పురుష స్త్రీ జననేంద్రియ రూపాలల్లోనే ఉంచి మానవులు సౌభాగ్య వర్ధనానికి ఆరాధించేవారు. ఆనాడు నగర పొలి మేరలలో లింగరూపంలో రాళ్ళను పెట్టేవారు. [77] అలాగే మృతుల గోరీల మీద లింగరూపంలో రాళ్లను పెట్టేవారు. వీటినే మెన్‌హర్[78]లనేవాళ్ళు. ఇవే క్రమంగా స్తూపాలుగా, దేవాలయాలుగా ఆవిర్భవించిన విషయం చూశాం.

ఆఫ్రికాలో 'బుష్ మెన్'లు, రెండు రాళ్ళు, మధ్య ఓ చెట్టూ ఉండేదాన్ని పూజిస్తారు. వాళ్ళ భావంలో అవి సౌభాగ్యవర్ధక చిహ్నాలు.[79] దీన్ని చాలా విపులంగా ఓ. ఏ. వాల్ తన గ్రంథంలో వివరించాడు.

ఈ భావమే లింగపూజగా ప్రపంచమంతటా వ్యాప్తి చెందింది. ఈజిప్టులో నేదీ పూజ పురుషజననాంగం బాగా పెద్దగా ఉండే విగ్రహాన్ని పూజించడంగా జరుగుతుంది. రోములో బచ్చూస్ అనేదేవతను లింగారాధనగా చేస్తారు. ఇతడు సూర్యదేవుడు. డిసెంబరు 25తో ఇతనికి సంబంధం ఉంది. ఆ నాడే ఈ పండుగ జరుగుతుంది. ఫ్లారెన్స్ గాలరీలో బ్రహ్మాండమైన పురుష జననాంగం సింహంమీద నిలబెట్టి ఉంటుంది. దాన్ని అందరూ పూజిస్తారు. ఇది సూర్యాంశగా వారు నమ్ముతారు.

రచయిత ఎవరో తెలియని పర్షియన్ గ్రంథం ఒక దానిలో ప్రియాపస్‌ను గూర్చి చాలా రాసి ఉంది. ఇతడిని ఏప్రియస్ అని అంటారు. లింగాన్ని ఏప్రియస్‌గా భావించి పూజిస్తారు. చాలా గుళ్ళుకట్టారు. కొన్నిచోట్ల చాలా పెద్ద జననాంగాలు పెట్టారు. కొన్ని చోట్ల పెద్ద రాళ్ళను పెట్టారు. మొత్తానికి పురుషుల వృద్ధిచేసే శక్తికలవాడుగా పూజించేవారు. అలాగే స్త్రీల వృద్ధిని ఐసిస్ జననాంగంగా (స్త్రీ) పూజిస్తారు. వాళ్ళ వాళ్లకున్న రోగాలు పోతాయన్న నమ్మకంతో పూజిస్తారు. ఇవన్నీ స్త్రీ సౌభాగ్య తంత్రాలేనని స్కాట్ అంటాడు.80. స్టాౖబో తెగలో కన్యలు ఈ ప్రియాపస్ జననాంగంతో కన్నెరికం చేసుకోవాలన్న ఆచారం ఉంది. సెయింట్ అగస్టన్ ఒకచోట రాస్తూ మ్యూటినస్ అనే జననాంగం మీద నూతన వధువు కూర్చోవాలి. అంటే కన్నెరికం ఆతడు చేసినట్లు భావిస్తారు. కుటుంబం వృద్ధి కాగలదన్న నమ్మకం వారి కుండేది.

స్త్రీ సౌభాగ్యం కోసం ఆడవాళ్ళు ఎన్నిపనులన్నా చేస్తుండేవారని వెస్ట్రాౖప్ అంటాడు. లింగాకారం రాళ్ళను పెకిన్‌లో బుద్ధ విగ్రహానికి దానం చేస్తారు. కొందరు ముస్లిం స్త్రీలు ఒక సాధువుది కానీ, మూర్ఖుడిది కానీ జననాంగాన్ని ముద్దు పెట్టుకోవడం కూడా ఉంది.[81]

స్త్రీ జననాంగాల పూజ, వాటిని గుళ్లలోనూ, ప్రధాన ద్వారాల దగ్గర ఉంచడం అన్న ఆచారం అనేక ప్రదేశాల్లో ఉందని పైనేనైట్ తన గ్రంథంలో చాలా ఉదాహరణలిచ్చాడు. ఐర్లండ్, టిప్పరేరే, కౌంటీకావన్, బాలినా హెండ్ కాజిల్, వైట్ ఐలెండ్. వెస్ట్‌మీత్‌లలో అన్ని చర్చిల్లోనూ ఇది ఉంది. అసహ్యం, జుగుప్స కలిగించే రీతిలో స్త్రీ జననాంగం అక్కడ ఉంది. ఐర్లండ్‌లో అనేక రాళ్ళున్నాయి. ఆ రాళ్ళల్లో సొరంగాలుంటాయి. అలాటి రాళ్ళలో క్లాక్ డెగ్లెన్ ఒకటి. ఇది ఆర్ట్‌మోర్‌బేలో ఉంది. యువతీ యువకులు ఈ రాతి సొరంగం గుండా వెళ్ళే ఆచారం ఉంది. అలా వెళ్తే వాళ్ళ జననాంగాలకు పుష్టి కలుగుతుందన్న నమ్మకం వారిలో ఉంది.[82]

ప్రియాపస్ పండుగ యూరపులో అంతటా జరుగుతుంది. స్త్రీలందరూ ఈ ప్రియాపస్ జననాంగాన్ని పూజించడం, వీధుల్లో ఊరేగింపులు జరపడం చేస్తారు. ఇదంతా తమ సౌభాగ్యం కోసమన్న భావన వారిలో ఉంది.[83] ఫ్రాన్స్‌లో ఒక సాధురూపంలో ఉన్న శిల లింగాన్ని పిల్లలు లేని తల్లులు కౌగిలించుకోడం అన్న ఆచారం ఉంది. బోర్గ్‌డిదియో అన్న వూళ్ళో ఎస్. గురిలిచో అన్న సాధు, స్త్రీలకు పిల్లలను కలిగిస్తాడన్న నమ్మకం ఉంది. అక్కడున్న విగ్రహం మీద స్త్రీలు పడుకుంటారు. శిల్ప జననాంగాన్ని నీటితో కడిగి ఆ నీరు తాగుతారు. నేపుల్స్‌లో లింగం ఊరేగింపు పెద్ద ఎత్తున స్త్రీలు నిర్వహిస్తారు. అక్కడే ఇజర్నియా నగరంలో పిల్లలకోసం స్త్రీలు పురుషజననాంగాలను మైనంతోనూ, ఇతరలోహాలతోనూ చేసిన వాటిని ప్రియాపస్ దేవుడికి కానుకలుగా సమర్పిస్తారు. అక్కడి లింగాకారంలో ఉన్న దేవుడికి నూనెతో అభిషేకం చేసి దాన్ని తమ మర్మావయవాలకు రాసుకుంటారు ఇవన్నీ అతి ప్రాచీనకాలం నాటి కథలు కావు. విలియం హామిల్టన్ 30. 12. 1781న నేపుల్ మంత్రిగావుంటూ, జోసెఫ్ బాంక్ అన్న అధికారికి రాసిన ఉత్తరంలోని విశేషాలు.

ఇప్పటికీ మన దేశంలో గుళ్ళలోకి వెళ్ళి ప్రసాదం తీసుకోవడం, తీర్థం తాగడం అడుగున ఈ భావం కూడా ఉండి ఉండవచ్చు. అయితే ప్రధానంగా కనిపించేది ఆ దేవుడి మాంసంగా ప్రసాదాన్ని, రక్తంగా తీర్థాన్ని తాగడంగా మిగిలి ఉందనడంలోనే సహేతుకత్వం కనిపిస్తుంది. ఆ దేవునిశక్తి సామర్థ్యాలు మనకూ వచ్చి సౌభాగ్యవర్ధన కారకాలు అవుతాయన్న విశ్వాసమే అది.

ఇంతవరకూ సౌభాగ్యవర్ధకమని భావించిన వస్తువులనూ, స్త్రీ, పురుష జననాంగాల పూజనూ వివరించడం జరిగింది. అలాగే సౌభాగ్యవర్ధక చిహ్నాలు కూడా ప్రపంచమంతటా వ్యాపించి ఉన్నాయి. ఇవి అన్ని మతాల్లోనూ కనిపిస్తూండటం గమనార్హం.

స్త్రీ శరీరంలో ప్రధాన భాగాలైన స్తనాలు, జననాంగం రూపం చిహ్నాలుగా మారడం చూడవచ్చు మనదేవతలందరికి పీన స్తనాలున్నట్టు చూపడం సౌభాగ్యవర్ధక భావ ప్రబోధమే.[84] అలాగే



స్తనం, యోనులకు రూపాలు. ప్రపంచంలో ఆడవాళ్ళ వ్రతాలలో మూన్, మా, ఐసిస్, సిబెలీ, ఇస్తార్, అష్టార్తే, అష్టారెత్, డయానా, ఫ్రెయా, లాంటి స్త్రీ దేవతామూర్తులను గానీ, వాటి స్థానంలో పైన వివరించిన ఆకారాలను కానీ

పూజిస్తూంటారు. స్కిధియన్లు తమ 'తబితీ' దేవతనూ, ఇతర స్త్రీ దేవతా రాధకులు సామాన్యంగా త్రికోణాన్నీ, వర్తులాకారాన్నే వాటి చిహ్నాలుగా తీసుకుంటారు. ట్రాయ్‌లో స్కిలెమాన్ అన్న శాస్త్రజ్ఞుడికి ఒక దేవతా శిల దొరికింది. అందులో స్త్రీ యోని భాగం చాలా స్పష్టంగా ఉండి మిగిలినవి ఆకారంగా మాత్రమే ఉన్నాయి. అలాగే దక్షిణ యూరప్‌లో ట్రోగ్లోడైట్స్ గుహల్లోగీసిన బొమ్మల్లో కూడా ఇలాటి చిహ్నాలే కనిపించాయి. ఇవి 30వేల సంవత్సరాల నాటివని శాస్త్రజ్ఞుల అంచనా. మాన్స్ వెనెరిస్‌గా ప్రసిద్ధికెక్కిన ఈ త్రికోణం ఈజిప్టులో పవిత్రత, పరిశుద్ధత, కన్యాత్వం, సత్యాలకు ప్రతీకగా వాడ్తారు. ఈజిప్టులో నెప్తె దేవతల చేతుల్లో ఒక కర్ర, దాని చివర స్తనాకార రూపంలో ఉన్న గుర్తులు ఉంటాయి. అన్ని దేవాలయ శిల్పాల్లోనూ ఈ గుర్తులు అక్కడ అధికం. మెక్సికో ప్రాంతాల్లో పొలాల్లో సౌభాగ్యవర్ధన చిహ్నంగా



దీన్ని పెడ్తారు. ఇదే బహుశా భారత దేశంలో పంగనామం ఆకారం ధరించి ఉండ వచ్చు.





ఈజిప్టు దేవాలయాల్లో జరిగే సౌభాగ్య తంత్రాల్లోఒక వాద్యాన్ని వాడతారు. దీనర్థం తాళమేసిన యోని అంటే ఇనపకచ్చడంతో యోని ఆకారం. బ్రహ్మచర్యానికి గుర్తు. ఐసిస్ దేవత చేతిలో ఇదే గుర్తు ఉంటుంది.

గ్రీకు, రోముల భావంలో ఓషియానస్ తండ్రి; భూమి తల్లి; నదులు పిల్లలు; గుహలు, గుబుర్లు తల్లి కడుపు; ఆర్చిలు, గుహలకు గోరీలకు ప్రవేశ మార్గాలు మొదలైనవన్నీ స్త్రీ జననాంగాలు. ఆసియా పౌరాణిక భావ నలో దేవాలయం కింది వెడల్పు గుండ్రమైన భాగాలు స్త్రీ జననాంగాలనీ పొడవుగా ఉన్నశిఖరాలు పురుషజననాంగాలన్న విషయం కనిపిస్తుంది. అలాగే 'ఆర్క్' ల ఆకారాలన్నీ యోని భావ రూపాలన్న విషయం విశ్వవ్యాప్త దేవాలయ నిర్మాణాలు చూస్తే తెలుస్తుంది.[85]

కొన్ని చర్చిల్లో యోని రూపంలో ద్వారాలూ, కిటికీలూ ఉంటూం టాయి.[86] అలాగే రాళ్ళు కూడా ఉంటాయి. వాటిల్లో దూరి పోవడం అంటే పునర్జన్మగా భావించే ఆచారం అన్ని దేశాల్లోనూ ఉంది. గుత్తికొండ బిల ప్రవేశం ఇలాంటిదే కావచ్చు. గోగర్భం ఈ భావంతోనే ఉండి ఉండవచ్చు ముత్యపు చిప్పలు, శంఖాలు కూడా స్త్రీ జననాంగ చిహ్నాలే. ప్రాచీన వీనస్ బొమ్మలన్నీ ఈ ఆలిచిప్పలతో కలిసి ఉండడం ఈ భావాన్నే తెలియచేస్తుంది. క్రైస్తవుల ఆరాధనలో చేపకు ప్రాధాన్యం ఉంది. ఎందుకంటే గ్రీకు భాషలో చేపకున్న పేరులోని అక్షరాలు జీసస్ క్రైస్ట్, సన్ ఆఫ్ గాడ్, ది సేవియర్

అనే వాటి మొదటి అక్షరాల క్రమంలో ఉంటాయి. ప్రాచీన షీబా దేశంలో దేవాలయాల కింది నిర్మాణం యోని ఆకారంలో ఉంటుంది.

బైబిల్‌లో (పాత నిబంధన) లింగ పూజకి సంబంధించిన ఉదాహరణలు చాలా కనిపిస్తాయి. జరమయ్యా ఈ పూజను నిరసిస్తూ అనేక విధాల ఖండించాడు. బాల్ పియోర్ అంటే లింగాకారమైన దేవుడే. ఈ పేరు ఎలా వచ్చిందో చెప్తూ ఇయార్చీ ఇలా అంటాడు. 'ఈ బొమ్మ ముందర మగవాళ్ళూ-ఆడవాళ్ళూ తమ జననేంద్రియాలను నగ్నంగా చూపించి పూజిస్తారు.' లూయీ మరో ఉదాహరణ ఇస్తూ బాల్ విగ్రహం ముందు స్త్రీ పురుషులు చాలా అసభ్యంగా ప్రవర్తిస్తూంటారు. దీన్ని ఫార్ అంటారు. దీన్ని పూజారులు నిషేధిస్తూ, ఆరాధకులు డ్రాయర్లు వేసుకోవాలన్న ఆజ్ఞను జారీచేశారు.

హీబ్రూల దేవుడైన యహ్వేహ్ కూడా ఇలాంటి లింగాకారపు దేవుడే. జిపోరాహ్ అనేవాడు తన కొడుకును ఈ విగ్రహం ముందు సుంతీ చేసి రక్తతర్పణం చేశాడు. ఈ దేవుణ్ణి 'యోనిని తెరిచే వాడు' అన్న అర్థంతో పిలుస్తూంటారు. జోషో అనేవాడు సికేమ్ అనే స్థలంలో ఒక స్తంభాన్ని పూజించాడు. సాలొమన్ గిబియాన్‌లో ఒక రాయి పెట్టి పూజించాడు.

జెనిసిస్ 28వ భాగంలో జాకబ్ ఒక స్తంభాన్ని పూజించిన కథ విపులంగా ఉంది. ఆ ప్రదేశాన్ని బెత్ ఎల్ అన్నారు. అంటే దేవుడిల్లు అని అర్థం. ఆ ప్రదేశానికి మొదటి పేరు లజ్. అదే నేటి బెతెల్‌హామ్. యహోవా ఈ రాళ్ళ పూజను నిరసించాడు. మోజెస్ కొత్తగా రాళ్ళని పెట్టి పూజించడాన్ని నిషేధించాడు. అంటే పాత రాళ్ళ దేవుళ్ళనే పూజించాలని అతడి భావం.

స్త్రీ జననాంగాల పూజ ఒక పండుగగా సిరియాలో సెజైర్స్ అనే తెగ జరుపుకుంటూంటారు. దీన్ని ఫెస్టివల్ ఆఫ్ ది వూంబ్ అంటారు. నగ్నంగా ఉన్న స్త్రీలజననాంగాన్ని పురుషులు ముద్దుపెట్టుకోవడం ఇందులో ప్రధానాంశం. ఇదే భావాన్ని ప్రతిబింబించే తోరణాలు, ద్వారబంధాలు, కిటికీలు మెక్సికోలో అనేక చర్చిలలో, ఇళ్ళలో చూడవచ్చు. ఇవన్నీ సౌభాగ్యవర్ధక కార్యక్రమాల్లో భాగాలుగానే పరిగణిస్తూంటారు.

క్రైస్తవమతం ఆదిదశలో 'గ్నాస్టిక్స్' అనే ఒక ఆచారాల తెగ ఉంది. ఒక పండుగనాడు వాళ్ళు ప్రధానంగా స్వేచ్ఛా సంగమాలాచరిస్తారు. ఈ దేవాలయం వాళ్ళ సౌభాగ్యవర్ధక క్రియల స్థానం. వీళ్ళ గుర్తు; స్త్రీ పురుష జననాంగాల చిహ్నాల కలయిక. ఆరు అంచుల కోణాల కలయిక. ఇందులో పైన మొనతేలిన కోణం పురుషునికి, కిందికి మొనతేలిన కోణం స్త్రీకి చిహ్నం.



దీన్ని డేవిడ్స్ షీల్డ్ అంటారు. ఇది శిల్పంగా అందరూ ఇళ్ళ నిర్మాణంలో నిలుపుకునేవాళ్ళు. యూదుల పెళ్ళిలో కొత్త జంటల పైన కప్పే బట్టల మీద ఈ గుర్తునే కుడతారు. ఇలాంటి చిహ్నాలు భారతీయుల్లో అనేక మతాల యంత్రాల్లోనూ, ముగ్గుల్లోనూ కూడా మనకు కనిపిస్తూంటాయి. అలాగే మనకు కనిపించే



స్వస్తిక గుర్తులు ఒక స్త్రీ, అనేక పురుషుల జననాంగాల ముద్ర. దీన్ని ఇళ్ళలోనూ, పూజామందిరాలలోనూ, వాడడం తరచు కనిపిస్తూంటుంది. దీన్ని చాలా ఎక్కువగా ఉత్తర భారతంలో చూడగలం. దీన్ని ప్రాచీన కాలంలో క్రైస్తవుల ఇళ్ళమీదా, మెడలో తగిలించుకునే బిళ్ళలమీదా ముద్రించుకునేవారు ఇలాంటి చిహ్నాలు అజ్టెక్ శిధిలాల్లోనూ (యుకాటన్-మధ్య అమెరికా), ఉక్స్‌మాల్ ప్రాంతాల్లోనూ (మధ్య అమెరికా), మెక్సికోలోని అజ్టెక్ గుళ్ళలోనూ కనిపించాయి. ఇవన్నీ అతి ప్రాచీన చారిత్రకావశేషాలు. వీటిని స్కాండినేవియాలో థోర్స్ హామర్‌లు అంటారు. ఈ దేవతను వాళ్ళు దంపతీ సౌభాగ్య దేవతగా ఆరాధిస్తారు. ఐరిష్‌లో అతి ప్రాచీనకాలంలో దీన్ని ఆరాధనా విశేషంగా చూశారు.



అది ఈ ఆకారంలో ఉండేది. దీన్నే మాల్టా సైనికులు తమ మత యుద్ధాల్లో ఉపయోగించారు. ఐరిష్ చర్చిలన్నిట్లో ఈ గుర్తు కనిపిస్తుంది. కనుక క్రైస్తవ మతానికి పూర్వ దశలో ఈ ఐరిష్ చిహ్నం స్వస్తిక రూపంగానే భావించాలి. ఫ్రాన్సు, ఇంగ్లండ్, జర్మనీలలో ఉండే చర్చిలలో స్త్రీ, పురుష సంయోగాన్ని వివరించే అనేక శిల్పాలు మధ్య యుగాల వరకూ ప్రధాన ద్వారం దగ్గర, ఇరువైపులా ఉండడం ఆచారం. దేవాలయంలోకి ప్రవేశించే ముందు వీటిని ఆరాధించడం తప్పనిసరి. చర్చిలలోపల ఆల్టార్ విగ్రహం దగ్గరా, పైన ఉండే ప్రధానమైన 'డోము' నిర్మాణంలోనూ ఆడం ఈవ్‌ల సంభోగ దృశ్యాలు చిత్రీకరించడం ఓ ఆచారం. ఇలాంటి ఐకాన్స్‌ను ధ్వంసంచేసే ఇకోనోక్లాస్ట్స్ క్రాంవెల్ కాలంలో బయల్దేరి చాలా వాటిని రూపుమాపారు. ఇలాంటిదే కాథ్లాక్ క్రూసేడ్ (డబ్ల్యు. సి. టి. యు) అనే మరో ఉద్యమం కూడా బయల్దేరి వీటి అర్థాలు, తత్వాలు తెలియక దిగంబర కళగా భావించి నాశనం చేశారు. మెక్సికో దేవాలయాల్లో ప్రతి చోటా సంభోగ శిల్పాలు ప్రత్యక్షమవుతూంటాయి. అలాగే ఈజిప్టు దేవత 'మా'లో ఉండే స్త్రీ



చిహ్నం, కర్ర-ఇవి స్త్రీ పుంస చిహ్నాల సంయోగమని వివరించడం జరిగింది. ఇది క్రైస్తవ చర్చిలలో పూజారుల చేతుల్లో క్రక్స్ అన్సాటా, ఆర్ క్రాస్ విత్ ఎ హాండిల్ అన్న రూపం దాల్చింది.87 అంటే జీవానికి ఇది గుర్తు. ఇవే భారతదేశంలో లింగం పానువట్టాల ఆకారం ధరించాయి.

"పురుషుడు, స్త్రీలేకుండా ఒంటరి వాడు. స్త్రీ, పురుషుడు లేకుండా లేనేలేదు. ఇద్దరూ కలిస్తే అనేకులు" — అన్న సూక్తికి 'శిలువ' చిహ్నం. జంతు శాస్త్రంలో స్త్రీ, పురుష చిహ్నాలు కూడా ఇవే.




ఈ చిహ్నాలన్నీ సూబన్, ఈజిప్టు మాతృదేవతలందరి చేతుల్లోనూ ఉంటాయి. సూబన్ పురాణాల్లో మాతృదేవత ఒక పక్షి. పడుకున్న పురుషుడి జననాంగం మీద ఆమెఉంగరం ఉంచుతున్నట్లుండే అనేక శిల్పాలు అక్కడి దేవాలయాల మీద కనిపిస్తూంటాయి. ఇవన్నీ సౌభాగ్యవర్ధక చిహ్నాలే.

ప్రాచీన రోము సంస్కృతిలో ఒక దశలో స్త్రీ, పురుషుడికి బానిస. స్త్రీలను ఇళ్ళలోనే ఉంచేవారు. కానీ ఇళ్ళలో వీళ్ళదే అధికారం. ఇళ్ళ పనుల నిర్వాహణకు బైటకు వెళ్ళేముందు వాళ్ళ భర్తలు వాళ్ళకొక ఉంగరం ఆకారంలో ఉండే ముద్ర - చిహ్నం ఇచ్చేవారు. దీనర్థం బజారు వెళ్ళడానికి భర్తలు అధికారం ఇవ్వడమనవచ్చు. ఇది క్రమంగా పెళ్ళినాడిచ్చే ఆచారంగా పరిణమించింది. ఇది లేకుండా బజారుకెళ్ళిన స్త్రీని వ్యభిచారిణిగా నాడు పరిగణించేవారు. మధ్యయుగాల్లో ఈ పరిణయం ఉంగరాన్ని 'పోసీరింగ్స్' అనడ ఆరంభమైంది. దీన్ని పూజారికానీ, భర్తకానీ ఆ సమయంలో వధువు వేలికి తొడుగుతారు. దీనిమీద 'ములీర్ విరోసుబ్జెక్ట ఎస్టో' (ది వుమన్ షల్ బి సబ్జెక్ట్ టు ది మాన్) అని చెక్కేవారు. ఈనాడు వాటిమీద 'లవ్ అండ్ ఒబేయ్' 'ఫియర్ గాడ్ అండ్ లవ్ మీ' అని చెక్కుతూండడం చూస్తాం. పోపు జనసమూహాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూన్నప్పుడు కాలిబొటనవేలికి దీన్ని ధరిస్తాడు. ప్రజలు దాన్ని తాకి ముద్దు పెట్టుకోవడం ఓ ఆచారం. కనుక ఉంగరం-స్త్రీ జననాంగ చిహ్నంగా ఈనాడు అన్ని మతాల పెళ్ళిళ్ళలో ఆచారంగా ధరించడం ఆరంభమైంది.

రోములో గుళ్ళలోనే కాకుండా ఇళ్ళలోకూడా మంచివీ పెద్దవీ సంభోగ చిత్రాలనూ శిల్పాలనూ నాటి ప్రజలు ఏర్పాటు చేసుకుంటుండేవారు. ఈ విషయం సాంగర్ రాసిన వ్యభిచారం పుట్టుపూర్వోత్తరాలనే గ్రంధంలో విశదీకరించాడు.

ఇలాంటి సౌభాగ్య చిహ్నాలు మన భారత దేశంలో కొత్తగా ఇళ్ళు కడుతున్నప్పుడు దిష్టి బొమ్మల రూపంలో పెడుతుంటారు. వీటికి అందరికీ కనిపించే పెద్ద జననాంగాన్ని ఎర్రగా రంగుపూసి పెడ్తారు. ఇది కేవలం ఆ యింటికి సౌభాగ్యం కలగాలనే. అదేవిధంగా గృహప్రవేశ సందర్భంగా ఆవును ఇంట్లోకి తిప్పడం కూడా గోయూధంలాగా ఇల్లు 'పిల్లాపావలతో' కలకలలాడాలనే. అలాగే ఇంటి ముందర ఇలాటి చట్రంతో పిట్టల బొమ్మలనూ పెడ్తారు. శుభం - లాభం - అనీ రాస్తారు.



మధ్యలో స్వస్తిక వేస్తారు. ఇవన్నీ సౌభాగ్యవర్ధక చిహ్నాలుగానే భావించాలి. గుళ్ళలో ఉపయోగించే గంటలు స్త్రీ పురుష జననాంగ సంయోగమనీ, అవి కొట్టడం అంటే జననకార్యం ఆగలేదన్న దాన్ని సూచించడమనే సౌభాగ్య వర్ధక భావమనీ పలువురి భావం. ఈ సందర్భంలో పైన్లే నైట్ ఇలా అంటాడు. గంటలో డోము భాగం ఐసిస్ దేవతా జననాంగం. అలాగే మధ్యది ఆసిరిస్ జననాంగం. దీన్ని కొట్టడం అంటే దుష్టశక్తులను అంటే 'దౌర్భాగ్య' శక్తులను పారదోలడం. చర్చిల్లో వీటిని మోగించడం అంటే మనిషి, దేవుడు నడుస్తున్నాడని వివరించడం. ఈజిప్టులో యూదు పూజారులు తమ బట్టలకు గంటలు కట్టుకునే ఆచారం ఉంది. ఆనాడు వాళ్ళే దేవుళ్ళు. ప్రియావస్ గుళ్ళలో ఈ గంటలు అధికంగా కనిపిస్తాయి. ఈ అభిప్రాయంతో ఫోర్లాంగ్[88] కూడా ఏకీభవిస్తాడు.[89]

భారత దేశంలో జంగాలు, కాశీకావడివాళ్ళు అందరూ ఈ గంటలు మోగించుకుంటూ తిరగడం గమనించగలం. వీళ్ళందరూ జంగమ దేవతలూ, సౌభాగ్యవర్ధక స్వాములూనూ.

చైనాలో యాంగ్, యిన్ పురుష స్త్రీ దేవతలు యాంగ్కన్నా షాంగ్ - టె ప్రధాన దేవుడు. లింగాకారుడు షింగ్. మూ ప్రధాన దేవత. ఈమెను యోని రూపంలో ఆరాధిస్తారు. ఈమె మేరీలాగా కన్యగా ఉన్నప్పుడే ఒక ప్రవక్తను కన్నది. అక్కడి ప్రధాన సౌభాగ్య దేవత క్వాయి - యిన్. ఈమెను 'యోని ఆఫ్ యోనిన్', అనీ 'మదర్ ఆఫ్ మదర్స్' అనీ అంటారు. ఈమెను కొందరు షాంగ్-టె భార్య అని అంటారు. ఈమెనే జపానులో కూడా పూజిస్తారు. జపాన్లో కునాడో దేవుణ్ణి లింగాకారంలో పూజిస్తారు. అలాంటిదే సాహే నొకామి. దీన్ని షింటోయిస్టులు, బౌద్ధులూ పూజిస్తారు. కొనెనెయి మ్యోజిన్ గుళ్ళమీదా, క్వాన్ - నాన్ (వీనస్ దేవత) ఆలయాల మీదా

అతి అసభ్యకరమైన శిల్పాలున్నాయి. ఇవన్నీ సౌభాగ్య చిహ్నాలుగా భావిస్తారు. అదేవిధంగా అసాకుసా గుళ్ళ మీదా ఉన్నాయి. షింటూగుళ్ళ శిల్పాలూ లోపల తంత్రాలూ అన్నీ సౌభాగ్యవర్ధక భావాల పుట్టలే పీటిని ఇజబెల్లా ఎల్. బర్డ్ తన గ్రంథంలో బాగా వివరిస్తుంది. 90

ఈ చిహ్నాలన్నీ సౌభాగ్య లక్షణ క్రియలుగా గుళ్ళలో చేశారు. అలాటి శిల్పాలుగా దేవాలయాలన్నిటి మీదా చేర్చారు. దేవాలయాల నిర్మాణమే ఈ లింగ పూజారూపకంగా ఉండడాన్నీ గమనించవచ్చు. చర్చీలు, దేవాలయాలు, మసీదులు అన్నీ భూమినుండి పైకి లేచిన పురుష జననాంగాలనవచ్చు. ఈ గుళ్ళ కింది భాగం నిర్మాణరూపం గుండ్రంగా స్త్రీ జననాంగంగా ఉంటూ, క్రమంగా మధ్యలో గోపురంగా నిలవడం పురుష జననాంగ చిహ్ననిర్మాణమే. చాలా ఎత్తైన గోపురాలూ, చర్చీలూ, మసీదులూ అన్నీ ఈ ప్రాచీన సౌభాగ్య భావాలకు ప్రతిరూపాలే. వీటన్నిటిలోనూ, పై భాగం గుబ్బగా ఉండి పైకి పోను పోను సన్నమవడం సమానంగా కనిపిస్తుంది.

భారత దేశంలో అన్ని కాలాల్లోని గుళ్ళలోనూ ఈ సౌభాగ్యవర్ధక శిల్పాలు కనిపిస్తాయి. చాలా ప్రధానంగా గిరిజన ప్రాంతాల గుళ్ళ ఆకారాలూ-శిల్పాలూ చెప్పుకోదగ్గవి. ఒరిస్సాలో గుళ్ళ నిర్మాణాలన్నీ ఈ లింగరూపంగానే ఉండడం కనిపిస్తుంది. తమిళనాడు ప్రాంతాల్లో కింది భాగ నిర్మాణం విశాలంగానూ; అంటే స్త్రీ జననాంగ రూపంగానూ; మధ్యనుండి పైకి పోను పోను ఎత్తయిన శిఖరాలుగానూ అంటే పురుష జననాంగాల రూపంగానూ వెలిసినట్టు చూడవచ్చు. మధ్య భాగాన్ని గర్భాలయం, గర్భగృహం అనడంకూడా దీన్నే సూచిస్తుంది. 91

ఈ విధంగా విశ్వవ్యాప్తంగా అతి ప్రాచీన కాలం నుండి మానవుడి మనస్సులోని స్త్రీ, భూసౌభాగ్య వర్ధనాలకు ఆకారాలే దేవాలయాలు. వాటికి ప్రతిరూపాలే మూర్తులు. ప్రత్యక్షసౌభాగ్యవర్ధక కార్యక్రమాలు అనాగరికం అయినప్పటి నుండీ వాటిని శిల్పాల రూపంలోనూ, చిత్రాల రూపంలోనూ, అప్పుడప్పుడు జరిపే పండగల రూపాల్లోనూ మిగుల్చుకుని తృప్తిపడుతున్నారు.

## భారత దేవాలయాలూ - సౌభాగ్యతంత్ర చిహ్నాలూ

భారత దేశంలో దేవాలయాల చరిత్ర ఆధునికమనే అనాలి. పశ్చిమాసియా, గ్రీకు, రోము దేశాల్లో దేవాలయాలు అతి ప్రాచీనమైనవి. బానిస సమా

ాలూ పట్నాలూ ఒకే కాలంలో అక్కడ ఏర్పడ్డాయి. ప్రత్యక్షమైన భయం తోనూ, పరోక్షమైన భీతితోనూ బానిసలను అదుపులో ఉంచారు. దేవుళ్ళు భయంకర అధికారులుగా, గొప్ప పరిమాణంలో పెరిగారు. బానిసరాజే ప్రధాన పూజారి. వారి ప్రధాన సౌభాగ్య దేవత పేరే పట్నానికుండేది. ఉదాహరణకు ఎథ్నా పేరుమీద ఏథెన్స్. తర్వాత పట్నం పేరుమీద దేవతలను పెట్టడం వచ్చింది. పశ్చిమాసియాలో 'గిరసు' పట్నం కట్టి 'నింగిరసు' దేవతను పెట్టారు.

అప్పటి దేవాలయాలన్నీ స్త్రీమూర్తులవే. వ్యవసాయం పెరిగింది కనుక భూసౌభాగ్య తంత్రం జరిపే బాధ్యత రాజపూజారి మీద ఉండేది. దేశంలో ఏ బాధ వచ్చినా అందుకు రాజ దౌర్భాగ్యమే కారణమని తలచేవారు.92 (ఈతి బాధలు). రాజపూజారుల బ్రతుకు కత్తి మీద సాములాగా ఉండేది. కష్టాలొచ్చి నప్పుడు జనం తిరగబడి పూజారిని చంపేవారు. కొత్త పూజారిని ప్రతిష్ఠించే వారు. చరిత్ర నిండా వీటి ఛాయలు ఉన్నాయి.

భూసౌభాగ్యవర్ధనానికి రాజపూజారి వాజీకరణానికి దగ్గర సంబంధా లుండేవి. అతడిలో ముసలి లక్షణాలు కనిపిస్తే తామే తొలగిపోయేవారు కాని నాడు, జనం బలవంతాన దింపేవారు. మన పురాణకాలంలో రాజుల యౌవరాజ పట్టాభిషేకాలూ, వానప్రస్థానానికి వెళ్ళడాలూ వీటినే సూచిస్తాయి. భారతంలో యయాతి పూరుల కథ దీన్నే బలపరుస్తుంది.

అనేక దేశాల్లో రాజుల్లో ముసలి ఛాయలు కనిపించగానే చంపే ఆచారా లున్నాయి. ఫ్రేజర్ చాలా ఉదాహరణలిచ్చాడు. ఈ దశ నుండి తప్పుకోడానికి రాజు - పూజారి బాధ్యతలు క్రమేణా వేర్వేరు వ్యక్తుల అధీనానికి వెళ్ళాయి.

ఈజిప్టు రాజ - పురోహితు లొకరుగానే ఉన్న దశ చాలాకాలం సాగింది. ఇద్దరూ వేర్వేరైన కాలంలో సౌభాగ్యవర్ధకులుగా పూజారులకే ఎక్కువ ప్రాధాన్యం ఉండేది. వాజీకరణశక్తి సన్నగిల్లడంతో రాజు - పూజారుల మధ్య శ్రమ విభజన రావడమే కాదు, పూజారి కూడా ఈ చావు నుండి తప్పించుకోవ డానికి ఈ శక్తిని ఇతరులకు బదలాయించేవాడు.

వాజీకరణానికి ఉపయోగపడే సేఫాన్ని పెంచుకునే ఉప పూజారి వర్గం తయారైంది. అతడి ఆ చిహ్నాన్నే స్త్రీలు సౌభాగ్య వృద్ధికోసం పూజించేవారు. చాల్డ్యా దేశంలో ఇలాటి ఆచారం ఎక్కువగా ఉండేది. మన దేశంలో కూడా అనేక పండుగ పబ్బాల్లో ఈ ఆచారం రకరకాల ముసుగుల కింద ఇప్పటికీ దర్శనమిస్తూనే ఉంది. అతడి లింగాన్ని పూజించి ఆ ఆకారంలో కుడుములూ అవీ చేసి పంచిపెట్టేవారు. తర్వాతి కాలంలో సౌభాగ్య కుడుములు తింటే

మూర్ఖత్వం వస్తుందన్న విశ్వాసం ప్రబలింది. దీనికి కారణం ఉప పూజారులు సామాన్యంగా సేపం పెంచుకోవడమే తెలిసిన మూర్ఖులు. ఈ ఆచారమే వినాయక చవితి కుడుములను పచ్చ పెట్ల మీదా, ఇళ్ళ మీదా, నీళ్ళలోనూ పడేయడంగా మారింది. మూర్ఖత్వానికీ, వాజీకరణలకూ పరస్పర సంబంధం బృహత్కథా పీఠికలో వర్షోపాధ్యాయోదంతం చక్కగా తెలియజేస్తుంది.

రెండో పద్ధతి దేవాలయ ప్రాంగణంలోనే యువతీయువకుల స్వేచ్ఛాసంగమాన్ని ప్రోత్సహించడం.[93] దీనివల్ల భూమి పులకరిస్తుందన్న నమ్మకం ఉండేది. అష్టార్తి దేవాలయ విషయం ఈ భూ సౌభాగ్య వర్ధన కార్యకలాపమే.

ఈ రకంగా బృహత్సౌభాగ్య చిహ్నాన్ని ఒక వంకా - నిత్య యవ్వనాన్ని వేరొక వంకా దేవాలయంలో చేస్తూ తనకు వార్ధక్యం వచ్చినా ప్రజల కోపాగ్ని నుండి పూజారి తప్పించుకునేవాడు. అంతటితో అతని బాధ్యత పోలేదు. కనుక జితేంద్రియత్వం, ఊర్ధ్వరేతస్కత అనే సిద్ధాంతాలు ఆరోపించుకున్నారు. అందుకు స్వాంగఖండనం ఉపాయంగా తెచ్చుకుని 'షండు' లయి క్రమంగా 'పండా' లయ్యారు.[94] ధర్మారావు ఈ ఉదంతాన్నే విడమర్చాడు. ఈ ఆచారం పల్లెల్లో ఇంకా కనిపిస్తుంది. ఆడ వేషంలో పూజారులు అక్కలగుళ్ళ దగ్గర కనిపెట్టుకుని ఉంటూంటారు.[95] ప్రస్తుతం బిచ్చమెత్తి బతుకుతున్నారు.

ఈ తంత్రం 'వామాచారం' అయింది దీనికున్న గౌరవం సమయాచారానికి తదితరాలకూ లేదు. ఈ అంశాన్ని పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాల పరామర్శలో వివరంగా పరిశీలిద్దాం.

ఇవన్నీ మారే సమాజానికనుగుణంగా మారాయి. ప్రత్యక్ష లింగ పూజలూ, కామ క్రీడలూ గుళ్ళలో సాధ్యం కాకపోయింది. అర్చనా విధానం మారింది. పురోహితుల, పూజారుల ప్రతిపత్తి మారింది. వీటి ఫలితమే బూతు బొమ్మల రూపంలో అవన్నీ దేవాలయాల పై భాగాలనాక్రమించుకున్నాయి.

పశ్చిమ దేశాల్లో దేవాలయాలు బానిస యుగంలో ఆవిర్భవించాయి. ఆ యుగాంతంలో అంతరించాయి. ఏకేశ్వరోపాసన వచ్చింది. సౌభాగ్య తంత్రాలకు ఉపాంగంగా వెలసిన మంత్ర, తంత్ర శక్తులకు యూరోపియన్ దేశాలలో ప్రాచుర్యం ఉంది. ఇవి స్త్రీలు ఉపాసించేవి. వీటిని విచ్‌క్రాఫ్ట్ అను వీళ్ళను విచెస్ అని అనడం వింటున్నాం. వీళ్ళందరూ వామీ భూతాచారులైన పూజారిణులే.

మన దేశంలో దేవాలయ నిర్మాణం ఫ్యూడల్ యుగంలో ఆరంభమైంది. వీటి ఆవిర్భావం దేశం అంతటా ఒకేసారి జరగలేదు. బౌద్ధమతంలో ఆరంభమైన భస్మం, ధాతు పూజలకోసం కట్టిన స్థూప నిర్మాణాలే వీటికి

ఆరంభాలనవచ్చు. ఉత్తరాదిన క్రీస్తు పూర్వం 2-వ శతాబ్దాల మధ్యకాలంలో ఆరంభమైతే దక్షిణాదిన క్రీస్తు శకం 7-10 శతాబ్దాల మధ్య ఆరంభమై ఉంటుంది. దేవాలయాలంటూ కన్పించే బ్రహ్మాండ నిర్మాణాలు పట్నాలకే పరిమితమైతే, గ్రామాల్లో గుళ్ళు - గుండ్రంగా ఉండే చిన్నపాటి నిర్మాణాలే కనిపిస్తాయి.

సాధారణంగా గ్రామాల్లో ప్రతిబింబించే జనజీవితం పట్నాల్లో ప్రతిబింబించదు. గిరిజన తండాలు జనప్రవాహంలో కలిసినప్పుడు వారి ఆచారాలు ఆ జనప్రాంతం వరకే పరిమితమయ్యేవి తప్ప పట్నాల్లో ప్రభావం చూపేవి కావు. అందుకనే పట్నాల్లో దేవాలయాలు సౌభాగ్య తంత్రాలను ప్రతిబింబించే ప్రయోజనం సాధించేవికావు. కానీ భారత దేశంలో కొన్ని చారిత్రక పరిస్థితుల్లో కొన్ని తండాలకు తండాలే గ్రామాలనూ పట్నాలనూ స్థాపించి రాజరికానికి వచ్చేవి. అప్పుడు గ్రామ దేవాలయాలకూ, పట్టణ దేవాలయాలకూ వ్యత్యాసం ఆచారాల్లోనూ నిర్మాణాల్లోనూ ఉండేదికాదు. ప్రత్యక్షంగా సౌభాగ్య తంత్రాలతో పట్నం దేవాలయాలకు సంబంధంలేకున్నా పరోక్షంగా ఉండేది. అది శిల్పాల రూపం దాల్చింది. పండుగల్లో బూతు కూతలు కూయడం ఇందులోని భాగమే. అందుకే ఇలాటివన్నీ గిరిజన ప్రాంతాలకు సమీపంలో ఉండే మధ్యప్రదేశ్ (ఖజరహో), ఒరిస్సా (కోణార్క్) పట్నాల్లోని గుళ్ళమీదా, అక్కడి దేవాలయ ఉత్సవాలలోనూ కనిపిస్తాయి.

గ్రామీణ వ్యవస్థ ఏర్పడిన తొలిదినాల్లో రాజులు సౌభాగ్యవర్ధనాన్ని అనుమతించిన మతాలనే ఆదరించేవారు. నగరాలు నిర్మాణం చెందుతున్న దశలో బౌద్ధం ప్రాచుర్యంలో ఉండేది. నగరాల్లో చేతి వృత్తులు ప్రాధాన్యం పొందాయి. కొండజాతులవారి భయంనుండి వర్తక బిడారులనూ సార్థవాహులనూ కాపాడడానికి బౌద్ధం ఎంతో ఉపకరించింది. వీళ్ళు అనేక తండాలను మూకుమ్మడిగా తమ సంఘంలోకి స్వీకరించేవారు. ఆ విధంగా మచ్చిక చేసినందుకు బౌద్ధ భిక్షుకులకు ఈ వర్తక సంఘాలు అన్న వసతులు కల్పిస్తూ, ఆరామాలను పోషిస్తూండేవి. వీరందరూ వ్యవసాయ గణాలను మాత్రం పట్టించుకోలేదు. బౌద్ధం కూడా అంతే. భూసౌభాగ్యవర్ధనానికి బౌద్ధంలో ఉపాయాలు కూడా లేవు. ఆ దశలో ఈ కార్య తంత్రాలు వైదికులు చేజిక్కించుకున్నారు. అందుకనే ఆ కాలంలో మహారాజులు బౌద్ధారామాలకు దానం చేస్తే, మహారాణులు యజ్ఞాలూ యాగాలూ చేయిస్తూ వేద సౌభాగ్యతంత్రాలను పోషిస్తూ ప్రజలమీద ప్రభావం సన్నగిల్లకుండా తమ రాజరికాలు కాపాడుకొంటూండేవారు. గ్రామీణ వ్యవస్థ స్థిరపడ్డ కొద్దీ బౌద్ధం పరపతి

కోల్పోవడం, సౌభాగ్య తంత్రాల కారణంగా వైదికం నిలదొక్కుకోవడం జరిగింది.

కొంత కాలానికి బౌద్ధమతానుయాయులు ప్రమాదాన్ని గుర్తించి ఈ తంత్రాలను గూడా తమ మతంలో చేర్చుకున్నారు. అనేక తండాల పద్ధతులను అమలు జరపాలని చూశారు. కానీ అప్పటికే సమాజం తెలివి మీరింది. ప్రత్యక్ష పరోక్ష సౌభాగ్య తంత్రాలన్నీ నైరూప్య స్థితికి చేరాయి. ఇది అర్థం చేసుకొనని బౌద్ధుల మధ్యవైష్ణవంలాంటి సౌభాగ్య తంత్రాల అమలు మితి మీరడమే కాదు ప్రజల ఏవగింపుకు కూడా గురయ్యాయి. ఇలాటి స్థానిక సౌభాగ్య తంత్రాలను కూడా కలుపుకున్న బౌద్ధానికి వజ్రయానమన్న పేరు వచ్చింది. వీరప్పుడు కట్టిన 'తారణి' దేవతాగారాలకు 'లంజగుళ్ళు' అన్న ముద్దు పేరు పెట్టారు జనం. అవి కూలిన తర్వాత ఏర్పడిన దిబ్బలను 'లంజల దిబ్బ' లంటూండడం తెలిసిన విషయమే.

బౌద్ధం పతనం, బ్రాహ్మణోత్థానం కాలంనుండి దేవాలయ నిర్మాణం ఆవిర్భవించింది. అయితే సౌభాగ్య వర్ధనం అప్పటికే బ్రహ్మకర్మలనూ, యజ్ఞాలనూ ఆశ్రయించడంవల్ల దేవాలయాలకు సౌభాగ్యవర్ధన కేంద్రాలుగా, బహిరంగ సంగమాలయాలుగా, దేవదాసీ గణ పరివేష్టితాలుగా ఉండాల్సిన అవసరం పోయింది. కానీ అవి పూర్తిగాపోతే దేవాలయాల అవసరమే సమాజంలో పోతుంది. అందుకని వీటికి అనుబంధాలుగా దేవ దాసీ గణం, బసివిరాంద్ర సంస్థలు తలెత్తాయి. ఈ విధంగా సౌభాగ్య వర్ధనానికీ, దేవాలయాలకూ సంబంధం ఇంకా మిగిలి ఉంది. పూర్తిగా పోలేదనే అనిపిస్తుంది. అది పోయిననాడు దేవాలయాల మహత్తు పోవడం, అవన్నీ పురాతత్వ అవశేషాలుగా మిగలడం మాత్రం ఖాయం.

## తత్వం వెతికే దిశలో...

దేవాలయం అన్నదాన్ని 'కోవెల' అంటారు. కోవెల అంటే అర్థం ఏమిటి? ఎలా ఆ పదం వచ్చిందన్న ప్రశ్నలు వేసుకుంటూ ధర్మారావు ఈ గ్రంథాన్ని ఆరంభించాడు. వారి ఉద్దేశంలో ఇక్కడనుండి మొదలెట్టి దేవాలయాల ఆవిర్భావం, అందులో జరిగే కర్మకాండలు, ఆ కర్మకాండలకు అధి

పత్యం వహించే పూజారులు, వాళ్ళ లక్షణాలు అన్నీ వివరిస్తూ పోదామని ఉంది. ఆ తర్వాతనే దేవాలయాల్లో జరిగే బూతు కర్మకాండ మన దేశంలోనే కాదనీ ప్రపంచవ్యాప్తంగా ఆదిమకాలంనుండీ సాగుతూ వస్తోందనీ సాహిత్య, చారిత్రకాధారాలతో వివరించడానికి పూనుకున్నాడు.

వీటన్నిటికీ ఆధారాలుగా సుమేరియన్, అసీరియన్, ఈజిప్టు, గ్రీకు, రోము నాగరికతల్లో, ఆ కాలాల్లో సాగిన కర్మకాండల్లో,సంగమచ్ఛాయలెక్కడెక్కడున్నాయో సేకరించాడు. ఆ పండగలను విశదీకరించాడు. అలాటి కర్మకాండలున్న భారతీయ ఉత్సవాలను కొన్నిటిని సమానాంతరాలుగా చూపించాడు.

తర్వాత సమాజం పురాణనాగరికత దశకొచ్చినా ఈ ఆచారాలుండడాన్ని వివరిస్తూ వేదనాగరికత యజ్ఞాల రూపంలో మన పురాణ నాగరికతకందించిన వాటిల్లోకూడా ఈ బూతు కనిపిస్తోందని పౌండరీక, అశ్వమేధ యాగాల ఆధారంగా చెప్పాడు. ఈ లక్షణాలన్నీ ఆయా కాలాల్లో పవిత్ర కార్యాలుగా భావిస్తే క్రమంగా మారిన కాలం వాటిని బూతు పనులుగా ముద్ర వేసిందన్నాడు. అయినా ఆ కార్యక్రమాల తంతు ఆగలేదంటూ తెలుగు కావ్యాలలో హరవిలాస ప్రసక్తిని తెచ్చి రుజువుచేశాడు.

ఈ తంత్రాలే కాలక్రమేణా, దేవాలయం నిర్మాణ రూపం సంతరించుకున్న కాలం నుండీ పండుగలూ, పబ్బాలూ జరిగే రోజుల్లో జరగడం అన్న ఆచారంగా పరిణమించాయనికామునిపండుగ, కనుముపండుగఆధారాలుగా చూపాడు. అవీ మొరటుగా భావించిన రోజుల్లో అలాటి సంగమ తంత్రాలను బొమ్మల రూపంలో దేవాలయ నిర్మాణాల్లో భాగాలుగా మలిచి నిలిపారంటూ తన ప్రశ్నకు సమాధానం చెప్పుకున్నాడు.

ఆ గుళ్ళల్లో కనిపించే రాళ్ళకు మొక్కడం, చెట్లకు ప్రదక్షిణాలు చెయ్యడాన్ని విప్పిచెప్తూ, అవన్నీ కేవలం స్త్రీల సంతాన ప్రాప్తికీ, పునర్జన్మ భావానికీ నిలిచిన బూతు చిహ్నాల కొలుపులేనన్నాడు. ఈ రాళ్ళ రూపంలోనూ, చెట్ల రూపంలోనూ కొలిచే పద్ధతులు ప్రపంచమంతటా ఉన్నాయంటూ 'ఇరుకురాళ్ళ' భాగంలో చెప్పాడు.

ఇవన్నీ మొత్తానికి స్త్రీలకు సంతాన ప్రాప్తికీ, పంటలు బాగా పండడానికీ చేసే కొలుపులన్న భావానికి ధర్మారావు సరిగానే వచ్చాడు. స్త్రీ పురుషుల సంగమాలకు, పంట భోగభాగ్యాలకూ సమాన ధర్మాలను పూర్వకాలం జనం ఊహించే, వీటిని నిర్వహించారనడంలో కూడా ధర్మారావు సరైన అంచనా వేశాడు.

దేవతా చిహ్నాలుగా లింగం, యోనులను విశ్వవ్యాప్తంగా ఆరాధించడాన్ని సోదాహరణంగా నిరూపించాడు 96 రాజ పూజారులు ఈ గుళ్ళలో ఉండడం ఈ కర్మకాండలకు సారథ్యం వహించడం గుర్తించాడు ధర్మారావు. పూజారులు షండులుగా ఉన్న దశను పదాల ఉత్పత్తి ఆధారంగా విశదీకరించాడు ఇంత వరకూ దేవాలయాల్లో ఏ పనులు ఎలా జరుగుతున్నాయో ఎవరు జరిపిస్తున్నారో ధర్మారావు చక్కగానే వివరించాడు.

కానీ, ఈ పనులు జరగడం వెనకఉన్న తత్వం వివరించడాన్ని ఆయన వదిలాడు. ఏకాలాల్లో ఏయే దశల్లో ఈ కార్యక్రమాలు జరిగాయో చెప్పలేదు. ఆ విధంగా ఆ దశల్లో జరగడానికి ఏ సామాజిక పరిస్థితులు కారణమయ్యాయో చూపలేదు. స్త్రీ పురుష జననేంద్రియ చిహ్నాలు పూజార్హతను సంపాదించడానికి ఏయే నాగరికతలు ఎంతవరకు బాధ్యత వహించాయో లోచూపుల్లోకి ధర్మారావు వెళ్ళలేదు. సమాజ పరిణామాన్నీ, స్త్రీ, పితృస్వామ్యాలనూ అక్కడక్కడ ప్రస్తావించినా విశదీకరించలేదు. ప్రధానంగా ఈ గుళ్ళ ఆవిర్భావాన్నీ, దేవుళ్ళ ఆవిర్భావాన్నీ, బూతు బొమ్మలుగా శిల్పీకరించే దశలనూ వివరించలేదనే అనాలి. అయితే ఈ శిల్పాలు ఏ చిలిపి శిల్పి చేతలో కావన్నది మాత్రం రచయిత స్పష్టపర్చాడు.

ఆయా సందర్భాలలో వచ్చిన పదాల పుట్టుకను వివరిస్తూ తత్వాన్ని విశదీకరించడానికి యత్నించాడు. కానీ పదాల ఉత్పత్తే వాటి తాత్విక అవగాహనను కలిగించడానికి సరిపోదు. కొంతవరకు తోడ్పడవచ్చు. సమాజ పరిణామ క్రమంలో ఈ దశల స్థానాన్ని అధ్యయనం చెయ్యాలి. లేకపోతే పదాలకు స్త్రీలింగ పుంలింగ రూపాలున్నాయంటూ చేసే వారణాసిలాటివారి విమర్శలకు గురి కావచ్చు. సామాజిక అవగాహనతో వివరించిననాడు కాదనే దమ్ము ఎవరికీ ఉండదు. కారణం ఆ దశల ఆవిర్భావం చారిత్రక సత్యం కనుక.

ఈ గ్రంథంలో వివరణలు, పైపైన చూసినా, చదివినా దీన్ని కేవలం పాఠకుల ఆసక్తితో పేరు సంపాదించాలన్న కోవకు చెందిన గ్రంథంగా తీసి పారేసే ప్రమాదం ఉంది. మొదట్లో అలా జరిగింది కూడా. అందులోనూ శీర్షిక నుండీ ఉదాహరణల దాకా బూతు తంత్రాలను మనసుకు తట్టించేవే కావడం మరో ప్రమాద కారణం. ఈ వ్యాసాలు 1936లో ప్రజామిత్రలో అచ్చవుతున్న కాలంలో వచ్చిన విమర్శలన్నీ పైన చెప్పిన పొరపాటు అవగాహనలవల్ల కలిగినవే. చాలా కాలానికి గ్రంథరూపంలో వచ్చిన వారణాసి సుబ్రమణ్యశాస్త్రి ఆస్తికత్వము - 2 అన్న పుస్తకం కూడా అలాంటిదే. అందులో సుమారు 15 - 16 అంశాలను లేవనెత్తి "ధర్మారావు మన సంస్కృతిని

తప్పుగా చిత్రిస్తున్నార"ని అన్నాడు. పీరు దైవ భావాన్ని నాశనం చేస్తున్నారనీ అన్నాడు. వారణాసి వారు ముందే 'దేవుడు' - 'దైవభావం' అన్న కళ్ళ గంతలతో ధర్మారావు వ్యాసాలను విమర్శించడానికి పూనుకున్నాడు. అందుకే ధర్మారావు చూపించిన ప్రపంచవ్యాప్త ఉదాహరణలను చూడలేక పోయాడు. దేవుని మీద భక్తి అన్న కళ్ళద్దాలతో చూడడం ఆరంభించిన వారణాసివారికి నిజం కటువుగా వినబడడం - నగ్నంగా కనబడడం ఎలా రుచిస్తుంది ?

ఇలాంటి విమర్శలకు కారణం పైన వివరించిందే. అదేమంటే ఈ గ్రంథానికి వెనకున్న తాత్విక చారిత్రక అవగాహనను ఖచ్చితంగా సౌభాగ్య తంత్రాలన్న దాన్ని ధర్మారావు స్పష్టంగా వివరించకపోవడం. సామాజిక దశల పరిణామ క్రమంలో సౌభాగ్య తంత్రాలు పొందిన పరిణామాలను విశదీకరించక పోవడం. ఈ భూ, స్త్రీ సౌభాగ్య తంత్రాల చిహ్నాలే బూతు బొమ్మలుగా గుళ్ళపై ఎక్కాయని వివరించడంలో ధర్మారావు వారణాసివారి వంటి విమర్శకుల అనుమానాలను నివృత్తి చేసేలా తాత్వికంగా రచన సాగించకపోవడం.

ధర్మారావు ఈ రచనలో ఏం విశేషం చూపించాడు?- అన్న విమర్శ లేకపోలేదు. ఒక రచయిత్రి శ్రీమతి లక్ష్మి, తన పేపరులో (క్వెస్ట్ 1973) దీన్ని లేవనెత్తారు. ధర్మారావు "ఆంగ్ల గ్రంథాలలోని విషయాన్ని అనువాదం చేశారు తప్ప వీరి గొప్పేమిట"న్నది - ఆ విమర్శలో అంశం.

నిజమే. ధర్మారావు సొంతంగా ఏ ఉదాహరణా ఇవ్వలేదు. ఎలా ఇస్తారు. ఇది కావ్యం కాదు కథలల్లడానికి. కాశీ మజిలీల కథలుగావు కావ్యాల్లా ఉల్లాసంగా భ్రమింపచేస్తూ రాయడానికి. మానవశాస్త్రం, సామాజికశాస్త్రాల పిండితార్థం. అయితే ధర్మారావు నేర్పు ఎక్కడుందంటే ఇలాటి ప్రపంచవ్యాప్త ఉదాహరణలతో మన దేశ ఆచారాలను జోడించడంలోనూ, పరమ బూతు తంత్రాలను చెప్పే సందర్భంలో ఎలాటి అశ్లీలతా, అసభ్యతా తొంగి చూడకుండా జాగ్రత్తపడడంలోనూ, అన్నిటినీ మించి పాఠకులకు ఇది స్వతంత్ర గ్రంథం అనిపించే శైలిలో రాయడంలోనూ ఉంది.

ధర్మారావు మంచి పత్రికా రచయిత గనుక పాఠకులను ఆకర్షించే శైలిని వాడాడు. మనస్సులను ఆకట్టుకుని చదివించే శీర్షికలుంచాడు. పాఠకులలో హేతువాదదృష్టిని పెంపొందించి మన ఆచారాలను గుడ్డిగా నమ్మకుండా అసలైన అర్థాలను తెలుసుకోవడమన్న భావాన్ని రచనలో అడుగడుగునా పొదిగాడు. ఇలాటి సమన్వయంతో కూడిన పుస్తకం 1936 నాటికి ఏ ఒక్కటీ తెలుగులోకి రాకపోవడం గమనించాలి. ఇందులో ప్రసక్తాంశాలు బుకాయింపులు

కావంటూ తాను ఆకరాలుగా ఎంచుకున్న గ్రంథాలను పేర్కొనడం ధర్మారావు నిజాయితీకి నిదర్శనం. సాధారణంగా ఆస్తికుల్లో ఉండే స్వాభిమాన, స్వమతాభిమానం వంటి దుర్లక్షణాలను వదిలించాలన్న ఆశయం ధర్మారావుకుంది. అందుకే ఏ సంస్కృతీ ఒంటరిగా పెరగదు. పెరగలేదు. ఆయాసంస్కృతుల్లో కొన్ని కొన్ని అంశాలు ఇతర సంస్కృతుల్లో కలిసిపోవడం సహజం. అన్నీ ఆదానప్రదానాల ద్వారానే వికసిస్తాయన్న సత్యాన్ని విడమర్చి, సంకుచితత్వం పోగొట్టడంలో ధర్మారావు ఈ రచన ద్వారా కృతకృత్యులయ్యారనవచ్చు. అయితే చెప్పే సందర్భాల్లో కొన్నిచోట్ల 'పట్టుబట్టల వాళ్ళూన్నూ, నిష్టానీమాల వాళ్ళూన్నూ; ఆచార్యుల వాళ్ళూ; పండితులూ' - అన్న పదాలు కాస్త కటువుగానే వాడాడు. దీనికి కారణం ఒకటే. ఇంతకాలంగా అసలైన సత్యం ప్రజలకు తెలియచెప్పకుండా శాస్త్రమనీ, నియమమనీ మన పండితులు తాము తప్పుదారి పట్టి, తర్వాత లోకాన్ని తప్పుదారి పట్టించారే అన్న బాధే రచయిత చేత ఇలా రాయించింది.

ఈ విషయం మీద ధర్మారావు దృష్టి పడడానికి కూడా కారణం ఉంది. వారు చిన్నతనం గడిపిన ప్రాంతాలూ, ఉద్యోగరీత్యా పనిచేసిన కొన్ని సంస్థానాలూ అన్నీ గిరిజన ప్రాంతాలకు సన్నిహిత ప్రదేశాలు కావడం. అక్కడి ప్రతి దేవాలయం మీదా ఈ బొమ్మలు చాలా ఎక్కువగా కనిపిస్తాయి. గిరిజనుల పండుగలన్నీ, ఆచారాలన్నీ ఈ తంత్రాల ఆలంబనంగా జరిగేవే. నాగరికత పేర పట్టణవాసులకు వీరితోనూ, వీరి ఆచారాలతోనూ సంబంధాలు తక్కువ వుంటాయి. కనుక అశ్లీలంగా భావించే వీటిని గిరిజన ప్రాంతాలకు సన్నిహిత గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ అతి సహజంగా జరిగే పండగల్లా భావిస్తారు. వీటికి తోడు దేవుడికీ - ప్రజలకూ మధ్య ఉండే పూజారి దళారుల మీద ధర్మారావుకు మొదటి నుండీ ఉన్న అసహ్యం. అది బ్రాహ్మణవర్గం చేతిలో ఉండడం వలన ఆ తత్వం మీద వీరికున్న అసహనం కూడా ధర్మారావు ఆలోచన ఇటు సాగేలా చేసి ఉండవచ్చు.

ఈ వ్యాసాలను వీరు మందసాలో ఉండగా రాసి ఉంటారు. ఆ తర్వాతే ప్రజామిత్రలో ప్రచురించారు. 1933-36 మధ్య తమ కాలాన్నంతా ఇలాంటి రచనలకు ఆకరాలైన సామాజిక మానవశాస్త్రాల అధ్యయనానికి ఉపయోగించారు.

ఈ అధ్యయనమే వీరిలో మార్పు తెచ్చింది. మూఢ విశ్వాసాలలో కూరుకొనేలా ఉంచి, ప్రజలనుతన గుప్పెట్లోపెట్టుకొని ఆడించే దేవుడిమీద మొదటిదెబ్బ కొట్టాడు. ఆ భావంతో, సమాజంలో వచ్చిన పితృస్వామ్యం స్త్రీల మీద తెచ్చిన అత్యాచారాలనూ; వాటి అంశలుగా ఉన్న 'ఇనుప కచ్చడాల'ను రెండో వ్యాస

పరంపరలో చీల్చిచెండాడాడు. ఇవన్నీ కల్సి స్త్రీలను పురుషుడికి బానిసగా చేశాయనీ, దానికి పెళ్ళితంత్రం బాగా సాయపడిందనీ రచయిత నమ్మాడు. దాన్ని నిరూపించి ఆ తంత్రాలెంత అర్థవిహీనాలో చెప్పడంలో సామాజిక దశలూ, స్త్రీపురుష సంబంధాలూ, వివాహతతంగాలూ చెప్తూ; పెళ్ళి దాని పుట్టు పూర్వోత్తరాల ద్వారా మన కథ మనకే చెప్పాడు. దైవభావం స్త్రీ నుండి పురుషుడెలా గుంజుకొని పురుష దేవతా ప్రాజాపత్యాన్ని నెలకొల్పాడో అదే, చివరకు స్త్రీలకు సామాజిక శృంఖలాలకు దారితీసిందని నిరూపించే యత్నం ఈ మూడు గ్రంథాల్లో కనిపిస్తుంది. ఆ ప్రయత్నానికి మొదటిమెట్టు ఈ గ్రంథం. జనంలోని ఆలోచనా తరంగాల్లో ఆనాడు ధర్మారావు విసిరిన మొదటి రాయి ఇది. గతంలోని సామాజిక ఆలోచనా పొరల్లోకి చూసిన ఎక్సురే చూపు ఇది.

# కచ్చడాల ముచ్చట్లు

"ముద్దర్లు ముద్దర్లుగా ఉండగానే ముగ్గురు బిడ్డల తల్లయిందన్న" దో సామెత. జన జీవితాన్నీ ఆచారవ్యవహారాలనూ చాలా సూటిగా కొండంత భావాన్ని ఉండంత రూపంలో ఇలాటి సామెతలందిస్తూంటాయి. ఈ సామెత వెనకుండే కథను తెలుసుకోవాలంటే తీగ కదపటం అవసరం. ఈ సామెత స్త్రీపరంగానే ఉందని తెలుస్తుంది. అయితే వేసిన ఆ ముద్ర ఏమిటన్న మీమాంసలోకె ళ్తే తేలేదే ఇనప కచ్చడాల పుట్టుపూర్వోత్తరాలు. ఇది అవగాహన కావాలంటే సూక్ష్మంగానైనా సమాజంలో స్త్రీ పురుష సంబంధాల పరిణామాలను సామాజిక దశల వారీగా అధ్యయనం చేయటం అవసరం.

కచ్చడం అన్నది కచ్చనుండి వచ్చింది. కచ్చ అంటే వెనకదోపుకునే ధోవతి కొంగు. కచ్చ బిగించటం అన్నదీ, కచ్చపోసి కట్టుకున్నాడన్నదీ వ్యవహారంలో మనకు తగుల్తూంటాయి. ఇదే 'కాసె'గా కూడా మారింది. 'కచ్చ కాడు' అంటే ముని అనే అర్థం ఉంది. గోచీ పెట్టుకున్నవాడన్నమాట. సిక్కుల పంచ కకారాల్లో కచ్చ, కేశ, కడ, కంగ, కృపాణం ఉన్నాయి. ఎఱ్ఱాప్రగడ తన హరివంశం పూర్వభాగంలో గోచి అన్న అర్థంలో -"మొల గచ్చ కట్టుపై మలగిన పచ్చని నునుగొంగు దిండుగా నులిచి చుట్టి''(7.13.వ) అని ఉపయోగించాడు.

శంకర కవి తన హరిశ్చంద్రోపాఖ్యానంలో "వెడవెడ దన కచ్చ పిడంగ బాటి" (1107 ద్వి. హరి ఉ.) అని దోవతి కొంగు అన్న అర్థంతో ప్రయోగించాడు.

కాసె అన్న అర్థంలో తిక్కన తన విరాట పర్వంలో "కచ్చ యమర బట్టి కాళ్ళను చేతులు, వ్రేల మత్తగజములీల మెఱయ" (2. 17 ప) అంటూ ప్రయోగించాడు.

బసవ పురాణంలో పాల్కురికి సోమన "భువినిట్టి భక్తురాలవు కచ్చ డంబు-ధవళాక్షి మరి యేల తాల్పవీవన"(3 ఆ. 90పు) అంటూ ప్రయోగించాడు.

జక్కన తన విక్రమార్క చరిత్రలో 'జమిలి మొలత్రాట నినుప కచ్చడమమర్చి" (2. 92 ప) అని అంటూ ఇనుప కచ్చడం అన్న దాన్నే ప్రయోగించాడు. ఇనుప కచ్చడాల ప్రసక్తి ప్రయోగాల విషయం వస్తే సాధారణంగా తెలిసిన పద్యం మనుచరిత్రలో అల్లసాని పెద్దన వాడింది. "ఇనుప కచ్చడాల్గట్టుకొను ముని ముచ్చులెల్ల'' (2. 73 ప) అన్నది.

ప్రజా కవి వేమన ఈ కచ్చడాల ప్రసక్తిని అనేక సందర్భాల్లో చాలా పద్యాల్లో వేర్వేరు అర్థాల్లో వాడాడు. కొన్నిటిని చూద్దాం.

"ఇల్లునాలి విడిచి ఇనుప కచ్చలు గట్టి
వంటకంబు నీరు వాంఛలుడిగి
యొంటినున్నయంత నొదవునా తత్వంబు'' . .
''వెరపు మొదకి విడిచి వాయువేగముగాను
కచ్చ యొడ్చి గట్టి కాళ్ళు దీసి
తరమ తరమ శివుడు తారకంబున జిక్కు'' .
''ముక్కు త్రాళ్ళ గుచ్చి మురికి పోవగదోమి
కచ్చ నీరు నించి కడిగి కడిగి
డొక్కదోమినంత దొరకునా మోక్షము'' ....
"కచ్చ మీద నాస కనకంబుపై నాస
లేనివాడు పుడమి లేని వాడు
కలిగెనేని యతడు గానంగరాడయా" .. ....

ఇందులో చివరి రెండు పద్యాల్లో కచ్చ అంటే జననాంగం అన్న అర్థం వచ్చేలా గుంది. ఎన్ని అర్థాలున్నా బ్రహ్మచర్యం అన్నది స్థిరపడ్డట్టు కనిపిస్తుంది. ఈనాడు కూడా కచ్చడం అన్నదాన్ని బ్రహ్మచర్యం అన్న అర్థంలో వాడుతూ ఉండటాన్ని చూస్తూంటాం. వల్లూరి సూర్యనారాయణరావు తమ స్వీయ చరిత్రలో దీన్నీ అర్థంలోనే వాడాడు. ఇక ఈ కచ్చడాలను సునిశితంగా పరిశీలిద్దాం.

వేదకాలంలో బ్రహ్మచర్యం అంటే విద్యాభ్యాసం అని అర్థం. ఆదిలో వేదద్రష్టలైన రుషులు కంఠస్థం చేసిన వాఙ్మయాన్ని (మౌఖిక) అభ్యసించటం అన్న మాట. తన కాలం వరకూ పుట్టిన వాఙ్మయాన్ని కంఠస్థం చేసి దాని ప్రయోగ - ఆఖ్యానాది వ్యాఖ్యానాలేవైనా ఉంటే కలిపి తన తర్వాత తరాల వారికి అప్పజెప్పటం నాటి విధి. ఆ విధి నెరవేర్చే వాళ్ళనే 'బ్రాహ్మణు'లనే వారు. శృతులు కూడా ఈ విషయాన్నే ధృవీకరిస్తాయి.

"త్రిభిర్ ఋణమాజాయతే బ్రాహ్మణః
బ్రహ్మచర్యేణ ఋషిభ్యః
యజ్ఞేన దేవేభ్యః
ప్రజయా పితృభ్యః"

ఇందులో బ్రహ్మచర్యమంటే విద్య అనీ, యుద్ధం అంటే మనుగడకు కావాల్సిన ఉత్పాదన అనీ ప్రజా అంటే పునరుత్పాదన అనీ అర్థం. ఈ వైదికార్యుల నుండీ ఆదునిక తండాల వరకూ - పితృ, పితామహ, ప్రపితామహుల పేర్ల వరకే గుర్తుంచుకొనేవారు. ఆ పై వారంతా దేవతల కింద లెక్క. ఇప్పటికీ బ్రాహ్మణుల శ్రాద్ధ కర్మల్లో ఈ మూడు స్థానాలకే పితృదేవతలనీ ఆ పై వారికి విశ్వేదేవతలనీ పేరు. కనుక దేరురుణం అంటే పేరు తెలియని తన పూర్వులు ఉత్పాదక విధానంలో కనిపెట్టిన సాధన, సాధ్య, సిద్ధులను ఆకళించుకొని, వాటికి తన నైపుణ్యాన్ని జోడించి తర్వాతి తరం వారికందించటమని భావం. వేదకాలం లోనే; ఆదిమ గణాల్లో ఉండే ఓపిక కొద్దీ పని, అవసరం కొద్దీ అనుభవించటం అన్న సూత్రం అంతరించింది. కనుక అలాంటి భావాన్ని సంస్కరించుకొనే మంత్రాలు రుగ్వేదం, అధర్వణ వేదాల్లో ఉన్నాయి. ఈ సూక్తానికే ''దేవభాగమ'' ని పేరు. ఈ దేవభాగం అందరూ సమానంగా సమితిగా ఉన్నప్పుడే సాధ్యమని కూడా వారు గుర్తించారు.97

తర్వాత వేదవాఙ్మయం బాగా పెరిగిపోయింది. ఒక్కొక్క వేదంలో అనేక శాఖలు పుట్టాయి. ఒక్కొశాఖకు బ్రాహ్మణం, ఆరణ్యకం, ఉపనిషత్తులు అవతరించాయి. శ్రౌత, గృహ్యా, గుల్బ్య, స్రౌతాది సూత్రాలూ పెరిగాయి. దీన్నంతటినీ పుక్కిట పట్టటం ఎవడి తరమూ కాదు. ఏ ఒక్కడికీ సాధ్యం కాదు. కనుక అలాటి సమయంలో బ్రహ్మచర్యానికి అవివాహితత్వం అనే కొత్త అర్థం వచ్చింది. వివాహ విధిని నిర్వచించే గృహ్యాసూత్రాల కాలానికి, తాను చదువుకున్న దాంతో సంతృప్తి పడి బ్రహ్మచర్యం అయిపోయింది గార్హస్పత్యంలో ప్రవేశిద్దామనుకుంటున్నాను కనుక నాకు కన్యను వెదికిపెట్టండి అని సుహృద్వరులను కోరే దశ వచ్చింది. సరైన కన్య

దొరక్కపోతే ఇంకా ఎక్కువ చదవటం కోసం నాటి విద్యా పీఠమైన కాశీ యాత్రకు ప్రయాణం కట్టడం లాటివి నేటి మన వివాహం మంత్రాల్లోనూ వేడుకల్లోనూ చూడవచ్చు.

పౌరాణిక యుగంలో, అంతవరకూ కొన్ని గణాల వరకే పరిమితమైన దేవప్రతిపత్తి గణదేవతలందరికీ వచ్చింది. వాళ్ళకు గుళ్లూ గోపురాలూ వెలిశాయి. వాటితోపాటు అర్చక వర్గం కూడా కావాల్సి వచ్చింది. దీంతో బ్రహ్మచర్యానికి అర్థం మారిపోయింది. బ్రహ్మచర్యమంటే అవివాహితమే కాకుండా అస్ఖలితత్వం (సెలిబెసీ) కూడా తోడైంది. అది వరకు ప్రాచీన కాలం నుంచీ మాతృ స్వామిక గణాల్లో మాతృపూజార్లు ఈ పద్ధతి నవలంబిస్తూండేవారు.

గ్రీకు పురాణాల్లో అడోనిస్ అనే దేవుడు కనిపిస్తాడు. ఈ దేవుణ్ణి తొలుత ప్రేమ దేవత వీనస్ ప్రేమిస్తుంది. అడోనిస్ ఒక అడవి పందితో పోరాడి చనిపోతాడు. అతడినో పువ్వుగా మారుస్తుంది. తర్వాతి పురాణాల్లో అడోనిస్ స్వయంగా వీనస్‌ను ప్రేమిస్తాడు. ఆ ప్రేమ భగ్నం కావడంతో తన అంగాన్ని కోసి ఆమెకు నైవేద్యం పెట్టి ఆమె పూజారిగా మారిపోతాడు. ఈ పేర్లు రకరకాలుగా మారాయి. రోములో 'గాలి' దగ్గర 'అత్తిస్' పూజారులయ్యారు. ఇక్కడ పూజారిగా మారే ప్రతి వ్యక్తీ అంగచ్ఛేదం చేసుకుంటాడు. సిరియాలో పూజారులూ; అసీరియా, బాబిలోనియాల్లో పూజారులూ నపుంసకులే ఉంటారు. ఇదంతా ఈ అడోనిస్ తత్వమనే అనాలి.98

ఈ సంప్రదాయం ప్రపంచమంతటా శాక్తేయుల్లో కనిపిస్తుంది. భారత దేశంలో శాక్తేయులు రెండు కూటాలుగా ఉన్నారు. ఒకరిని 'వామాచారు'లనీ, రెండో వారిని 'సమయాచారు'లనీ అంటారు. వామాచారులు ప్రాచీన సంప్రదాయవాదులు. వామ అంటే ఎడమ అని అర్థం చేసుకొని తద్భిన్నమైన దానికి ఇటీవలివారు (కుడి అనే అర్థంలో) దక్షిణాచారం అని పేరుపెట్టారు. వామచారులు పంచమకారాలను అనుసరిస్తారని వారి మీద బోలెడు నిందా గ్రంథం కూడా తయారుచేశారు. నిజానికి వామాచారం అంటే ఎడమ పద్ధతి లేదా లెఫ్టిజం అని అర్థం కాదు. వామకేశ్వర తంత్రం ప్రకారం "వామీ భూత్వాయజేత్‌పరం" అంటే స్త్రీ భావాన్ని ఆరోపించుకొని పూజ చేసే విధానానికే వామాచారమని పేరు.99 స్త్రీ భావాన్ని ఆరోపించుకోవాలంటే స్త్రీ వేషం వెయ్యడమే కాకుండా 'అడోనిస్' లాగ పురుషాంగచ్ఛేదనం కూడా అవసరమని వామాచార గురువులు భావించారు.100 ఇప్పటికీ ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాలలో గ్రామ దేవతల గుడి పూజారులు మగవారైనా స్త్రీ వేషాలలోనే కనిపిస్తారు. 101

ధర్మారావు ఈసంప్రదాయాన్నంతా చర్చించకపోయినా 'పండా' అంటే 'షండా' అన్న అర్థం చెప్పి పండిత శబ్దానికి 'షండుడు' అన్న వ్యాఖ్యానం చేశాడు. దీనికి దీర్ఘాలు - హ్రస్వాలు చర్చచేసి లింగ వివక్ష చూపి మేధ అనే అర్థం నుండే పండిత శబ్దం వచ్చిందంటూ వారణాసివారు తాపీవారిని ఖండించారు.[102] అయినా అది వాదానికి నిలవదు. వామకేశ్వరతంత్ర సంప్రదాయం పురుషదేవతల ఆరాధనతో అంతరించింది. కానీ అస్ఖలితత్వాన్ని పాటించాలన్న పాత అలవాటు మాత్రం పోలేదు. ఆ దశలోనే మన దేశంలో పురుషులకు ఇనుపకచ్చడాలు పుట్టాయి. షండత్వారోపానికి ఇనుప కచ్చడాలు ఓ సాధనం మాత్రమే కాని అదే సర్వస్వంకాదు. దానికి-అంగచ్ఛేదంతో సహా అనేక పద్ధతులున్నాయి. షండ అనే అర్థంలో ఉన్న పండాలే కొన్ని యాత్రాస్థలాలలో ప్రముఖ వ్యక్తులుగా కనిపిస్తారు.

బహుచారమాత పూజారులుగా అంగచ్ఛేద షండత్వం భారతదేశంలో ఉంది. (కొజ్జాలు) - ఇదొక గుప్త సంఘం. బహుచార మాత కుక్కుట వాహిని. ఇప్పుడు వీరి వృత్తి ఏదనేది అనవసరం. కానీ వారి దీక్షావిధానం, గుర్వాజ్ఞాపాలనా విధానం ఇవన్నీ ఒక పకడ్బందీ అయిన తాంత్రిక వర్గ (సెక్ట్) లక్షణాలనే ఇప్పటికీ సూచిస్తూంటాయి. పురుషుల్లో ఈ షండత్వం వచ్చినవాళ్ళు తర్వాత తిరిగి పుంస్త్వంకోసం చేయాల్సిన పనులను వాత్స్యాయనుడు కొన్ని సూత్రాల్లో తెలిపాడు.[103]

యూరపులో క్రిస్టియానిటీ ప్రవేశించిన తర్వాత కూడా అతి ప్రాచీనమైన అస్ఖలితత్వం కాథలిక్ మత గురువుల్లో ఇంకా పోలేదు. బైబిల్‌లో ఏ సూత్రం వివాహాన్ని వ్యతిరేకించదు. జీసస్ 'యూనక్‌లుగా మారితే కొత్త రాజ్యం సిద్ధిస్తుంది' అన్నట్టుంది. (మత్తయ్ 19: 12). ఇది పోవటానికి చాలా పోరాటం జరిగింది. 4 వ శతాబ్దంనుండే చర్చి మతగురువులు బ్రహ్మచర్యం అవలంబించాలని వచ్చింది. ఇది క్రమంగా స్పెయిన్, ఫ్రాంసు, ఇటలీలకు పాకింది. రోము మొదట్లో దీనికి మధ్యస్థంగా ఉంది. అయితే పోప్ ఇన్నొసెంటు I, మతగురువులు బ్రహ్మచర్యాన్ని వ్యతిరేకిస్తే పదవులు వదిలిపోవాలని శాసించాడు. 7 వ శతాబ్దంలో 'ట్రూలో సమితి' బాగా చర్చించి మత గురువులు భార్యలతో ఉండచ్చని తీర్మానించింది. కానీ క్రమంగా పూర్తి బ్రహ్మచర్యం అవలంబించే ఆచారం తర్వాత వచ్చింది. రోము మతగురువుల్లో చీలిక వచ్చింది. ఆర్చిబిషప్ కాంటర్బరీ ఇంగ్లండ్‌లో మతగురువులు భార్యలను వదిలేయాలని ఆదేశించాడు. మిలన్‌లో దీన్ని బాగా వ్యతిరేకించారు. కానీ 1018లో పోపు బెనిడిక్ట్ VII, మతగురువుల పిల్లలను చర్చి బానిసలుగా ప్రకటిం

చాడు. తర్వాత మత గురువుల భార్యలను 'ఉంపుడుకత్తెలు'గా ముద్రవేశాడు. మతగురువులు బ్రహ్మచర్యం కోరేవాళ్ళు జనాన్ని రెచ్చగొట్టారు. వాళ్ళు వివాహితులైన మతగురువులను చితకబాదారు. రోములో 1059లో మరో సమావేశం జరిగి వివాహితులైన మతగురువులను ప్రార్థనలు చేయకుండా నిషేధించింది. మెంజ్, ఎర్‌ఫర్ట్, పారిస్‌లలో ఈ విషయం మీద అనేక సభల్లో వాదోపవాదాలు చెలరేగాయి. మధ్యయుగాల వరకూ ఈ అస్ఖలితత్వం కొనసాగింది. మార్టిన్ లూథర్ వచ్చి దీన్ని చెదరగొట్టాడు. క్రైస్తవమతాన్ని చీలగొట్టాడు.104

అలాగే ఇస్లాములో ఉండే సూఫీ గురువుల్లో కూడా అస్ఖలితత్వానికి ప్రాధాన్యం ఉంది. 'సఫ్' అనే పదం నుండి 'సూఫీ' వచ్చింది. సఫ్ అనేదానికి మూడు రకాలైన అర్థాలున్నాయి. సఫ్ అంటే 'క్యూ'. ప్రళయకాలంనాడు మానవులంతా క్యూలో నిలుచుంటారు. అక్కడ నకీర్, మున్‌కిర్ అనే దూతలు మానవుల మంచి చెడ్డలను జాబితా వేసి చెప్తుంటారు. వీటి ఆధారంగా వాళ్ళకు స్వర్గ, నరకాలను నిర్ణయించడం జరుగుతుంది. రెండో అర్థంలో 'సఫ్' అంటే అరుగు. ముస్లింలకు పవిత్ర ప్రదేశం మక్కా దగ్గర ఇది ఉంది. ముస్లింలలో రుషితుల్యులు కొందరు ఆ అరుగెక్కి మతబోధనలు చేసేవారు. ఆ అరుగును క్రమంగా 'సుఫా' అన్నారు. ఈ బోధకులు తమనే పైగంబర్‌లని భావిస్తారు. అన్ని బోధలూ చేస్తుంటారు. ముస్లిం అభిప్రాయాల ప్రకారం మహమ్మదు తర్వాత పైగంబర్‌లిక రారు. ఇది మహమ్మద్ వాక్యం. కానీ ఈ గురువుల ఒంటి మీద పైగంబర్ పూని ఈ బోధలు చెప్తున్నాడని వాళ్ళు అంటుంటారు. దీన్ని 'ఇల్‌హాం' అంటారు. 'సూఫ్' అంటే మూడో అర్థం తెల్ల ఊలు. ప్రాచీన కాలంలో ఈ బోధలు చేసేవాళ్ళు తెల్ల ఊలు శాలువా కప్పుకొనేవారు. ఇలా బోధలు చేసేవాళ్ళనే 'సూఫీలు' అంటారు. వీళ్ళు తర్వాతర్వాత ఆకు పచ్చశాలువా కప్పుకోవటం ఆరంభించారు. స్త్రీలలాగా పెద్దజడలను పెంచుకుంటారు. వీళ్ళు పెళ్ళిళ్ళు సాధారణంగా చేసుకోరు. అంగచ్ఛేదం ప్రధాన లక్షణం. అస్ఖలితత్వసాధనం. 105

ఈ విధంగా బ్రహ్మచర్యానికి విద్యార్జన అన్న అర్థం మాసిపోయి అస్ఖలితత్వమే పరమావధి అన్న అర్థం దాపురించింది. దీంతో ఊర్ధ్వ రేతస్కత ఉత్తమోత్తమమనే భావం రావటం, దానికి ఉపాయాలను వెదకటం ఆరంభమైంది.

భారతదేశంలోనే ఇనుప కచ్చడాలూ, ఇతర షండతా సాధనాలూ పురుషుల పరంగానే ఎక్కువ ఉండటానికి కారణం ఏమిటి? యూరపు

ప్రాంతంలో స్త్రీలపరంగా అధికంగా ఉండటానికి కారణం ఏమిటి? అన్న దాన్ని సామాజిక దృష్టితో పరిశీలించడం అవసరం.

మానవజాతిలో మొట్టమొదటిసారిగా ఆస్తి మీద ఆధారపడిన బానిస రాజ్యాలు పశ్చిమాసియాలోనూ, యూరపులోనూ ఏర్పడ్డాయి. సుమేరియా, అసీరియా, ఈజిప్టు దేశాల్లో నిరంకుశ రాజ్యాలు (డెస్పోటిక్); గ్రీసు రోముల్లో క్రూర రాజ్యాలు (టైరెంట్) ఏర్పడ్డాయి. అక్కడ అంతవరకూ స్త్రీపరంగా ఉన్న వారసత్వాన్ని పురుష పరం చేయవలసిన అవసరం వచ్చింది. రాణికి పుట్టిన పుత్రుడు తనవల్లనే పుట్టాడని నిర్ధారణ చేసుకోవడం కోసం చాలా కట్టుదిట్టమైన అంతఃపురరక్షణ అవసరమైంది.[106] కంచుకి లాంటి కాపలాలతో పాటు ఇనుపకచ్చడాలు కూడా స్త్రీలకోసం కనిపెట్టడం అవసరమైంది. ఆ తర్వాత యధా రాజా తధా ప్రజాగా స్త్రీలకు ఇనుప కచ్చడాల సంప్రదాయం మొన్నమొన్నటిదాకా ప్రవర్తిల్లింది.

భారతదేశంలో నిరంకుశ బానిస రాజ్యాలు గానీ, క్రూర బానిస రాజ్యాలు గానీ తలెత్తలేదు. కనుక యధా రాజా తధా ప్రజాగా స్త్రీల విషయంలో ఇనుప కచ్చడాల ప్రాచుర్యం అంతగా లేకుండా పోయింది. పశ్చిమాసియా, యూరపులలో బానిస చక్రవర్తులననుసరించి సొంత ఆస్తితత్వం జనంలో కూడా తలెత్తింది. భారతదేశంలో అలాకాదు. నిన్నమొన్నటిదాకా ఆస్తి ఉమ్మడి. దాయం మీదనే భాగస్వాములుండేవారని స్మృతులను సరిగా అర్థం చేసుకొన్న వారు అంగీకరిస్తారు. దాయాదులన్నదానికి అర్థం దాయం అనుభవించేవారనే కాని 'రిక్థాధిపతులన్న' (ఆస్తి) అర్థం ఎక్కడా లేదు. ఆదిలో 'రిక్థ' అన్న పదానికి చరాస్తి అన్న అర్థమే ఉండేది. దాన్నే పంచుకునేవారు. చరాస్తి ఒక్కటే. సొంత ఆస్తి (ప్రయివేటు ప్రాపర్టీ) కాదు. ఈ అన్ని కారణాల వల్ల ఇక్కడ నారీలోకంలో కచ్చడాల అవసరం తక్కువనవచ్చు. కనుకనే ధర్మారావు కూడా దానికి ఉదాహరణలివ్వలేకపోయాడు. అంతఃపురరక్షణ గురించి చాలా రాసిన కౌటిల్యుడు, కామందకాదులు కూడా వీటి ప్రస్తావన తేలేదు. పురుష షండత్వం పోవటాన్ని గురించి రాశారు. మన దేశచరిత్ర పరిశీలిస్తే బలంగల ఏ రాణీ పుత్రుడైనా రాజ్యానికి రాగలిగేవాడు కనుకనే తెలుగు దేశాన్నేలిన శాతవాహన ఇక్ష్వాకులు తల్లుల పేర్లతోనే ప్రసిద్ధికెక్కారు గానీ తండ్రుల పేర్లతో కాదు. కనుక తెలుగు సాహిత్యంలో ఇనుప కచ్చడాల ప్రసక్తి పురుషుల విషయంలోనే కవులు ప్రస్తావించటం కనిపిస్తుంది. కానీ స్త్రీల విషయంలో ఎక్కడా చెప్పకపోవటానికి ఈ సామాజిక వాస్తవికతే కారణం అనిపిస్తుంది.

ఇనుప కచ్చడాలను సామాజిక పరిణామ దశల వెలుగులో చూడటం చాలా అవసరం. ప్రపంచంలో మానవజాతి చరిత్రను చాలా శాస్త్రీయంగా అధ్యయనం చేసిన వ్యక్తి మోర్గాన్. ఆయన సమాజ పరిణామ దశల్లో ఆటవిక యుగం, అనాగరిక యుగం, నాగరిక యుగం అన్న మూడు ప్రధానమైన వాటిల్లో మొదటి రెండు దశలనూ; నాగరిక యుగంలోకి పరిణామం చెందే సంధి కాలాన్నీ, క్షుణ్ణంగా పరిశీలించాడు. యుగాల్లో మార్పులు రావటానికి ముఖ్యకారణం జీవనాధారానికి మూలమైన వస్తువుల విస్తరణ అనీ, ఈ రెండూ పరస్పరం కలిసే ఉంటాయనీ మోర్గాన్ అభిప్రాయపడ్డాడు. అయితే ఆయా యుగాలకు సంబంధించిన కాలాలను వేరుచేయటానికి స్పష్టమైన చిహ్నాలు కనపడవు.

స్త్రీ పురుష సంబంధాలను దశలవారీగా పరిశీలిస్తే ఈ కింది విషయాలు తెలుస్తాయి. ప్రాచీన చరిత్రను చూస్తే ఏకకాలంలో స్త్రీలు బహుభర్తృత్వాన్నీ, పురుషులు బహుభార్యాత్వాన్నీ అవలంబించిన రోజులు ఉన్నాయి. అందువల్ల బిడ్డల్ని ఉమ్మడిగా అందరి బిడ్డలుగా పరిగణించేవారు. ఈ పరిస్థితులు ఎన్నో మార్పులకు లోనై ఏక భార్యా, భర్తృత్వంలోకి మార్పు చెందాయి. ఆరంభంలో బహు విస్తృతంగా ఉన్న వివాహబంధంలో ఇమిడి ఉన్న ప్రజల సంఖ్యని అంతకంతకూ తగ్గించడం వైపే ఈ మార్పులు కొనసాగాయి. చివరకు ఒక జంటని మాత్రమే ఇముడ్చుకొనే స్థితి ఏర్పడింది. ఇదే ఈనాడు ప్రాధాన్యం పొందుతున్న వివాహ పద్ధతి. వీటన్నిటికన్నా అతి ప్రాథమికమైన దశ ఒకటుందనీ అందులో స్త్రీ పురుషులమధ్య సంబంధాలలో ఏ విధమైన నిర్బంధాలన్నవీ లేవనీ, అంటూ మొదటిసారిగా సామాజిక పరిణామ దశలను అధ్యయనం చేసేవారికి తెలిపింది 'బాకొాఫెన్' అన్న శాస్త్రజ్ఞుడు. కానీ దీన్ని ఒప్పుకునే ధైర్యం నాగరికులమని అనుకుంటున్న కొందరు శాస్త్రజ్ఞులకు అబ్బలేదు. ఈ పై సిద్ధాంతం ఒప్పుకుంటే మానవజాతికి అవమానం కలుగుతుందని వెస్టర్ మార్క్ వంటివాళ్ళు భావించారు. జంతు ప్రపంచంనుండి ఉదాహరణలు తెచ్చీ, లెథోర్నె అనే శాస్త్రజ్ఞుడు చేసిన కొన్ని పరిశోధనాంశాలను సాక్ష్యం పలికిస్తూనూ, మానవుడు ఆదినుండీ ఏకపత్నీ వ్రతుడని చెప్పటానికి నానా తంటాలూ పడ్డారు. కానీ కాలం, తర్వాతి పరిశోధనలూ - వాళ్ళ భావాలను తుక్కుకింద ఎగరగొట్టాయి. జంతువులను ఆధారంగా తీసికొని మానవుల్లో స్త్రీ పురుష సంబంధాలను అంచనా వేయటంవల్లే వెస్టర్‌మార్క్ పప్పులో కాలేశాడు. దీన్ని ఎస్పినాస్ అన్న శాస్త్రజ్ఞుడు తన 'డెసోసియాటిస్ అనిమల్స్' (1877) అన్న గ్రంథంలో జంతువుల్లో 'మంద'

ఉన్నతం. కుటుంబం - మంద అన్నవి ఒకదానికొకటి వ్యతిరేకాలు. అందులో ఒకటి అభివృద్ధి చెందుతుంటే రెండోది సన్నగిల్లుతుంది - అని వివరిస్తూ వెస్టర్ మార్క్‌ను తోసిరాజన్నాడు. మానవుల కుటుంబం అన్నది జంతువుల దానికి భిన్నమని రుజువు చేశాడు.

మానవుల్లో ప్రాచీన కుటుంబ విధానం గుంపు పెళ్ళి. అది కొంత అభివృద్ధి చెంది బహుభర్తృత్వంగా మారింది. జంతువుల్లో కనబడని అసూయ ఈ దశలో మానవుల్లో ప్రవేశించింది. హార్ట్‌లాండ్ తన 'ప్రిమిటివ్ పెటర్నిటీ' అన్న గ్రంథంలో 'అసూయకు బీజం సొంత ఆస్తి భావం' (పే 11. 102) అంటాడు.

ప్రాచీన కాలం నుంచీ అనుశ్రుతంగా వస్తూన్న సమిష్టి కుటుంబ జీవితాన్ని బహుభర్తృత్వంలోనుండి వచ్చిన జంట కుటుంబం నిర్మూలించలేకపోయింది. సమిష్టికుటుంబ నిర్వహణలో స్త్రీదే పైచెయి. జంటకుటుంబం ఏర్పడే వరకూ ఉన్న అన్ని దశల్లోనూ బిడ్డలకు తండ్రులను గుర్తించడం చాలా కష్టం. అందుకని సంతానాన్ని ఒక్క తల్లివైపు నుండే గుర్తించేవారు. ఫలితం తల్లులకే గౌరవం. పెత్తనం కూడానూ. అషూర్ రైట్ అన్న మతబోధకుడు 'ఇరాక్వ్యా సెనెకా' అనే తెగల మధ్య చాలాకాలం జీవించాడు. అతడి పరిశీలనలను మోర్గాన్ తన గ్రంథంలో నమోదు చేస్తూ పైవిషయాలను స్పష్టంచేశాడు. (పే 454)

అందరికీ భార్యగా ఉండడం అనే స్థితినుండి, ఏకపత్నీ ఏకభర్తృత్వ స్థితికి మార్పు స్త్రీయే తెచ్చిందని బాకొఫెన్ చెప్తాడు. మన పురాణాల ప్రకారం అరుంధతి, జంట పెళ్ళికి నాంది పలికిందని తెలుస్తూంది. ఆటవిక యుగంలో ఆరంభమైన 'గణం' లో స్త్రీదే పైచేయి. అనాగరిక యుగంలో దిగువ దశ నుండి నడిమి దశవరకూ కూడా బహుభార్యాత్వం బహుభర్తృత్వం ఉంది. స్త్రీల అధికారం ఇంకా అమల్లో ఉంది. అనాగరిక యుగం నడిమి దశనుండి పైదశకు మారే మధ్యకాలంలో జంట కుటుంబం ఏర్పడి దాని నుండి ఏకపత్నీ కుటుంబం రూపుదిద్దుకొంది. నాగరికత ప్రారంభానికి ఇది చిహ్నం. స్త్రీ స్థాయి పతనానికి ఇదే నాంది.

పితృస్వామ్యం అవతరించింది. వ్యవసాయం బాగా సాగి భూమి, మందలు, వ్యక్తుల ఆస్తులుగా మారడం ఆరంభించాయి దీనితో ఈ ఆస్తులకు వారసులను నిర్ణయించడం అవశ్యకంగా పరిణమించింది వంశాలు పురుషుణ్ణిబట్టి నిర్ణయించడం మొదలైంది. సంపద పెరగటం, నూతన సామాజిక సంబంధాలు ఏర్పడటంతో బానిస విధానం ఆరంభమైంది. ఆస్తి అన్నది

ఉండడం, వారసుడి కోసం తపనపడడం మొదలవడంతో జంటపెళ్ళి, మాతృస్వామ్యం గల సామాజిక వ్యవస్థ మీద పెద్ద దెబ్బ పడింది. తండ్రి ఎవరో నిర్ధారించడం మొదలైంది. సంపదలు వృద్ధి పొందినకొద్దీ మగవాడి ప్రాముఖ్యం పెరిగింది. తల్లి హక్కును తోసెయ్యడం అతనికి అవసరమైంది. అందుకోసం బిడ్డలను తండ్రి కోపతో గుర్తించాలన్నదీ, తండ్రి గణంలోనే ఉంచాలన్నదీ చిన్న చట్టంగా చేస్తే చాలనుకున్నారు. చేశారు. దాంతో వంశాన్ని స్త్రీ వేపునుండి గుర్తించడం ఆగింది. వారసత్వం తల్లి వేపునుండి సంక్రమించడం పోయింది. ఒకే దెబ్బతో రెండు పిట్టలు. స్త్రీ కిందపడటమే కాదు సేవకురాలు - బానిసగా దిగజారింది కుటుంబం అంటే అర్థం మారింది.

రోమనులు కుటుంబం అన్నదాన్ని ఫెమిలియా అంటారు. దీనర్థం వివాహితులైన భార్యాభర్తలనిగానీ, వారి సంతానమని గానీ కాదు. ఫెములస్ అంటే ఇంటి బానిస. ఫెమిలియా అంటే ఒకే యజమానికి చెందిన బానిసల గుంపు. ఈరకంగా బానిసగా ఇంటిస్త్రీ మారడం చట్టసమ్మతం అయిందని మోర్గాన్ అంటాడు. దీన్ని ఏంగెల్స్ అంగీకరిస్తూ "ఆధునిక కుటుంబంలో బానిసత్వమే కాదు దాసత్వం కూడా బీజరూపంలో ఇమిడి ఉంది. కారణం వీటి ఆవిర్భావం వ్యవసాయ పనుల కోసమే" అని స్పష్టీకరిస్తాడు.107

భార్య పాతివ్రత్యాన్ని ధృవపర్చడానికి, బిడ్డల తండ్రిని ధృవపర్చడానికీ - ఈ విధంగా స్త్రీ భర్త అధికారంలోకి ఎలాటి షరతులూ లేకుండా తలవంచుకు వెళ్ళిపోయింది. అప్పటి వరకూ మాతృత్వం వాస్తవం. పితృత్వం విశ్వాసం. అంటే ఒకటి ప్రత్యక్ష ప్రమాణం అయితే, మరోటి శబ్దప్రమాణం అన్నమాట. ఆస్తి సమాజ పరంగా ఉండి, కుటుంబ పరం కానంతవరకూ ఆస్తికి వారసుని సమస్య తలెత్తలేదు. అప్పుడు పిల్లల పితృత్వాన్ని పట్టించుకోలేదు. దీనికి ఉదాహరణలుగా కాద్రవేయులు, దైత్యులు లాంటి పురాణోదాహరణలనూ ; వాసిష్ఠీపుత్ర, మాఠరీపుత్ర, హారీతి పుత్ర వంటి చారిత్రకోదాహరణలనూ చూడవచ్చు భారతంలోని మాద్రేయులూ, కౌంతేయులూ అన్నవి దీన్నే నిరూపిస్తాయి.108

ఈ విధంగా జరిగిన మార్పువల్ల సగోత్రవివాహాలూ, దంపతీ వివాహాలూ పోయి ఏకపత్నీ వివాహదశ ఏర్పడింది. పత్నుల సంఖ్య ఎంతున్నా వారసత్వం హక్కుండే పుత్రుణ్ణి కనే హక్కు ఒక్కదానికే. ఆమెను ఏకపత్ని అని109 మిగిలిన వారిని ఉపపత్నులనీ అనేవారు. ఏకపత్నికి చాలా అధికారాలు ఉంటాయి. ఉపపత్నుల మీద అంటే సవతుల మీద అధికారం చెలాయించవచ్చు, ఇంటి పనులు పురమాయించవచ్చు. ఉపపత్నుల సంతా

నానికి ఆస్తి హక్కు లేదు. 'దాయాద' అధికారం తప్ప, 'దాయ మూలాల' మీద అధికారం, హక్కు ఉండేదికాదు. ఆ ఏకపత్నే ప్రధాన గృహిణి - పట్టమహిషి.110

అలాంటి వారసుణ్ణి కనాలి కనుకనే ఆ పత్నికి పరపురుష సంపర్కం లేకుండా సాధ్యమైనంతవరకూ బందోబస్తు చేసేవారు. ఆడపిల్లలను కొనుక్కొని వివాహం చేసుకునే ఆచారంలో కూడా స్త్రీకి పరపురుష సంపర్కం లేకుండా జాగ్రత్తపడేవాళ్ళు.111 అంటే కొనుక్కున్న పురుషుడి వల్లే ఆ స్త్రీ వారసుణ్ణి కనాలన్నమాట. ఇంతకు పూర్వం ఉన్న అన్ని దశల్లోనూ స్త్రీల కన్యాత్వం గురించి ఎవరూ పట్టించుకునేవారుకాదు. దీనికి మతానికి దగ్గర సంబంధం ఏర్పడటంతో కన్యాత్వం మీద పట్టింపులు అధికమయ్యాయి.

బ్రిటిష్, మధ్య ఆఫ్రికా, మార్షల్ దీవులూ, ఇండొనేషియాలో ఉండే కొన్ని జాతుల ప్రజల్లో అతి చిన్న వయస్సునుండీ ఆడపిల్లలకు పరపురుష సంపర్కం ఉంటుంది.112 నాగాలలో పెళ్ళి తర్వాత దీన్ని నిషేధించారు. మడగాస్కర్ దగ్గర వాలావే అనే చోట చిన్నపిల్లల సంపర్కాలను వాళ్ల తల్లిదండ్రులు చూస్తూ సంతోషిస్తూంటారు. ఇలాటి ఉదాహరణలను ఫ్రేజరు చాలా ఇచ్చాడు. వివాహానికి ముందు ఆడపిల్లకు బిడ్డలుండటం ఆమె గౌరవప్రతిపత్తులను పెంచేది. కొన్ని సందర్భాలలో పెళ్ళికొడుకు, పెళ్ళికూతురుకు పెళ్ళికి పూర్వం పుట్టిన బిడ్డలను పదిమందికి చూపి తన గొప్పతనాన్ని (బిడ్డలు కనగలిగే దాన్ని చేసుకున్నానంటూ) చాటుకొనేవాడు కూడానూ. 'సెరం' అనే ప్రాంతంలో చిన్నపిల్లలకు ఆ తండాలో ముసలిది ఒక ఆకును చూపుడు వేలితో పొడిచి పరస్పర సంపర్క విషయాలు తెలుపుతుంది. ఇష్టమొచ్చిన వాళ్ళతో కన్నెరికం అయింతర్వాత తిరగటానికి స్వేచ్ఛ ఆడపిల్లలకు లభిస్తుంది. ఎవరో ఒకరితో పెళ్ళికాగానే ఆ స్వేచ్ఛ హరించుకుపోతుంది. ఇదింకా కొన్ని ఆఫ్రికా జాతుల్లో ఉంది. కన్నెరికం చేయడమన్నది తండా నాయకుడికి కానీ, తండాలో వృద్ధులకు గానీ బాధ్యతగా ఉంటుంది. అంతవరకూ ఆ పిల్ల కన్యాత్వం కాపాడాల్సిన బాధ్యతకూడా ఆనాయకుడి మీదే ఉంది.

ఈ వివరణల ద్వారా ఆడపిల్లకు పరపురుష సంపర్కం లేకుండా కాపాడవలసిన అగత్యాలు కొన్ని తెలిశాయి. ఆస్తికి వారసుణ్ణి కనడంకోసం, శుల్కం ఇచ్చి కొనుక్కునే వరుడికోసం, కొన్ని సందర్భాల్లో ప్రధానంగా అనాథబిడ్డల పుట్టుకను ఆపటంకోసం అన్నవి కారణాలు. వివాహానికి పూర్వం పుట్టిన బిడ్డలు సొంత ఆస్తి రాకముందు సమిష్టి ఆస్తికీ, మందకూ చెంది ఉండే

వారు. కాని మందనుండి జంట ఆవిర్భవించగానే, సమిష్టి ఆస్తి నుండి వ్యష్టి ఆస్తి రాగానే ఈ బిడ్డలు తలబరువుగా తయారయ్యారు. వీటన్నిటినీ ఆప డానికి, కన్నెరికం కాపాడుకోవలసిన బాధ్యత స్త్రీల మీదా, కాపాడవలసిన బాధ్యత తండా, తండా నాయకుడు, భర్తల మీదా పడింది. దాంతో అందుకు మార్గాలూ, విధి నిషేదాలూ ఏర్పాటు చేసుకోవడం ఆరంభించారు.

తన తండాలోవాళ్ళను చేసుకోవడం నిషేధించారు. తన 'టోటం' లో వాళ్ళను పెళ్ళిచేసుకోవడం నిషేధించారు. తన గోత్రంలో వాళ్ళను వివాహం చేసుకోకూడదన్నారు. వీటన్నిటికీ కారణం వారసత్వం, పురుషుడి ఆధిపత్యం వంటివేనని మలినొవిస్కీ స్పష్టంగా వివరించాడు. ట్రోబ్రియాండ్ తెగల ఆచారవ్యవహారాలను నిశితంగా పరిశీలించి పైనిషేధాలను అతిక్రమించిన వాళ్ళకు కఠినంగా మరణశిక్షవేసేవాళ్ళనీ కూడా చెప్పాడు.[113] సామాజికశాస్త్రా ధ్యయనం చేసిన మార్గరెట్ మీడ్ 'అరాపేశ్' తండాలను బాగా పరిశీలించింది. ఆమె కూడా పైనిషేధాలను ఆ తండాలు అమలు పర్చేవని అనేకోదాహ రణలతో తన 'సెక్స్ అండ్ టెంపరమెంట్ ఇన్ త్రీ ప్రిమిటివ్ సొసయిటీస్' అన్న గ్రంథంలో వివరించింది.[114]

ఈవిధంగా సమాజంలో మాతృస్వామ్యం త్రోసిరాజని పితృస్వామ్య అవతరించింది. పురుషుడి ఆధిపత్యం అందలమెక్కింది. ఏకపత్నీ, ఏక భర్తృత్వం మగవాడికి కాక ఆడదానికి మాత్రమే వర్తించేదిగా అయింది. ఈ పరిస్థితుల్లో ఆడవారి రక్షణ ఆవశ్యకం. వాటికి అనేక మార్గాలు ఆలోచిం చారు. ఇళ్ళల్లో స్త్రీలుండే భాగం వేరుగా ఉంచారు. బానిస స్త్రీ తోడు లేకుండా ఇంటిస్త్రీ బయట కడుగుపెట్టకూడదన్నారు. ఇంట్లో వాళ్ళమీద నిఘా ఉండేది. పరపురుషుల్ని దూరంగా ఉంచేందుకు మొలోషియను కుక్కలను కాపలా పెట్టే వారని 'అరిస్టోఫానెస్' రాశాడు. ఆసియా నగరాల్లో స్త్రీలకు కాపలాగా కొజ్జా లను పెట్టేవారు. హెరిడోటస్ కాలం నాటికే ఈపనికోసం కొజ్జాలను తయారు చేసే పరిశ్రమ 'చియాన్'లో ఉండేది. వాక్స్‌మత్ ఈ కొజ్జాలను నాగరికులు కూడా కొనుక్కునేవారని అంటాడు.

ఏకపత్నీ పద్ధతి రంగం మీదికి రావటం అనేది; స్త్రీ పురుషుల మధ్య స్నేహ సమ్మేళనంగా రానేలేదనీ, గతించిన ప్రాచీన యుగాలలో ఎన్నడూ ఎరగని స్త్రీ పురుషుల మధ్య పోరాటాన్ని ప్రకటించిందనీ ఎంగెల్సు గట్టిగా అభి ప్రాయపడ్డాడు. గ్రీసులో పురుషులు అతికఠోరరూపంలో దీన్ని స్త్రీ మీద ప్రయోగించారు. తోలు, ఇనుప కచ్చులను కట్టి ఆమెను బంధించారు. తమ భార్యల పాతివ్రత్యం కాపాడగలిగామని చంకలు గుద్దుకున్నారు.



THEY'RE STILL USING chastity belts!

Orders from all over the world are pouring into the town of Ridgeway in England for objects costing 360 apiece that most persons thought had gone out of style after the Middle Ages.

The orders are for custom-made chastity belts, which David Renwick and his five-man staff carefully produce from top-quality Sheffield steel.

Because every chastity belt has to be made to measure, the hard-



37 ఇంగ్లండ్‌లో ఇప్పటికీ కచ్చడాలమ్మే దుకాణంలోని బొమ్మ, కచ్చడం.



38 న్యూగినీలో 'కురేలూ' తెగల్లో పురుష కచ్చడం.

ఇంతటి తాత్విక పునాది ఉన్న ఇనుప కచ్చడాల ఆవిర్భావాన్ని పూర్వ రంగంగా ఉంచుకుంటూ ధర్మారావు ఇనుప కచ్చడాల రచనను పరిశీలించాలి.

ధర్మారావు ఇనుప కచ్చడాల వ్యాసాలను తాము నడిపిన కాగడా వార పత్రికలో 1940 జనవరి నుండి జులై వరకు ధారావాహికంగా ప్రచురించారు. జనంలో సంచలనం కలిగించారు. అప్పటికే దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు ? అన్న వ్యాసాలను ప్రజామిత్రలో రాశాడు. సాహితీవేత్తల్లో ఒకరుగా ఉండే ధర్మారావు కలం నుండి సామాజిక మానవశాస్త్రాల వెలుగులో ఇటు వంటి వ్యాసాలు కూడా రావడం వారి ప్రతిష్ఠను బాగా పెంచింది. మొదట్లో ఈ వ్యాసాలు ఆషామాషీగా రాస్తున్నారని కొందరనుకున్నా రానురాను దీని వెనుక ధర్మారావు నిశిత పరిశీలనాశక్తి పాఠకులకు అర్థంకావడం ఆరంభ మైంది. అనేక పదబంధాల, పలుకుబళ్ళ, సామెతల వెనక తరతరాల మానవ సంచితమైన ఎంత చరిత్ర ఉందో ఈ వ్యాసాలు తెలియచెప్పాయి. మానవ సంస్కృతి పరిణామదశల్లో ఉండే అనేక మజిలీల్లో ఈ కచ్చడాల కాలంకూడా 'ఒక మజిలీ వంటిదని' ధర్మారావు అభిప్రాయం. ఈ మజిలీ చేరుకోవడానికి జరగిన యాత్రావిశేషాలు ఇంతవరకూ చర్చించడం జరిగింది. ఇక ఈ కచ్చ డాల నిర్మాణం గురించి, ఉపయోగించిన చరిత్రలోని ఆధారాలను పరిశీలించడం అవసరం. మానవ చరిత్రలో మధ్యకాలపు పుటలు తిరగెయ్యటం ఆవశ్యకం.

ధర్మారావు భావంలో 'మానవుడు ప్రకృతికి విరుద్ధంగా ఉండడమే ఒక గొప్పతనం అనుకున్న కాలం'లో, ప్రవాహానికి ఎదురీదాలన్న భావంతో, నిగ్రహా నికి స్వశక్తి చాలక ఈ ఇనుప కచ్చడాలకు లోనుఅయ్యారని ఉంది (పేజి 5). దీనికన్నా మరికొంత శాస్త్రీయ అవగాహనతో ధర్మారావే ''మతం కోసం అని కొందరు; మహత్వం కోసం అని కొందరు; తమంతట తాము తెచ్చిపెట్టుకున్న గోల" అని వివరించాడు. దీనికంతటికీ వెనుక ఉన్న తాత్విక భావాన్ని విశ్లే షిస్తూ "తన వంశం - తన వంశ గుణాలు - తన వంశ గౌరవం అన్న భావం ప్రబలడంతో ఇవి అవతరించాయనీ (పేజి 10), నా సొత్తు ఇతరులు వినియో గించ కూడదన్న బుద్ధి వివాహం తర్వాతనే కనబడుతుందనీ" (పేజి 9) చెప్తూ ఈ కచ్చడాల రాకనూ వాటి దశలనూ స్థూలంగా చెప్పాడు.

ఈ భావాలు రావడంతో స్త్రీ పురుషుడినీ, పురుషుడు స్త్రీనీ ఇలా కట్టివపడే శారు. పురుషాంగాలకు స్త్రీలు ఇనుప రింగులు కుట్టించేవారు, స్త్రీలకు కూడా ఇలాటి బందోబస్తునే పురుషులూ చేశారు. కన్యాత్వం పట్టించుకోని దశనుండి, కన్యాత్వ నిరూపణ అవసరమైన దశకొచ్చేసరికి ఎటి అవసరం పెరిగింది.

అక్షతయోనుల గౌరవం పెరిగింది. 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' అన్నా; 'అవసరదూరాత్' అన్నా; స్త్రీ అంటే యమదూత, కఠోర సర్పం, మృత్యుదేవతకు దగ్గర చుట్టం అన్నా;-
ఇలా వాడినవన్నీ పురుషుడు ఒకరకంగా తన అశక్తతను వెల్లడించుకునే డాబుసరి మాట. ప్లేటో స్త్రీలను చాలా తక్కువ భావంతో అంచనా వేశాడు. యురిపిడిస్ 'విమెన్ ఆర్ ఇంపొటెంట్ ఫర్ గుడ్ బట్ క్లెవర్ కంట్రైవర్స్ ఆఫ్ ఆల్ ఈవిల్' - అన్నాడు. అనేక దేశాల సామెతలు కూడా స్త్రీలను కించపరిచే విధంగా ఇలా ఉన్నాయి.

నీ భార్య సలహా విను - వ్యతిరేకంగా చేయి. (చైనా)
పదిమంది ఆడాళ్ళలో ఒకరికే హృదయముంటుంది. (రష్యా)
మనల్ని మనం దుష్టస్త్రీలనుండి రక్షించుకుందాం.
మంచి చూపుల ఎరల్లో చిక్కుకోకూడదు. (స్పానియర్డ్స్)
మంచిదైనా చెడ్డదైనా గుర్రానికి దెబ్బలు కావాలి. అలాగే స్త్రీకి.
(ఇటలీ)

ఫ్రెంచి సాహిత్యంలో 13వ శతాబ్దంలో రాసిన రోమన్ - డిస- లా రోజ్ అనే పెద్ద గ్రంథం ఉండేది. అందులో స్త్రీని "యాన్ ఆనెస్ట్ వుమన్ ఈజ్ యాజ్ రేర్ యాజ్ ఎ బ్లాక్ స్వాన్" - అని వర్ణించారు.116 ఆడదాని నమ్మకద్రోహాన్ని వర్ణిస్తూ కథలూ గాథలూ, పదాలూ పాటలూ రాశారు. 117 వీటన్నిటివెనకా తన స్త్రీని తాను తృప్తిపరచలేక పోతున్నానేమోనన్న బాధా, అలాటప్పుడు ఆ లోపాన్ని కప్పి పుచ్చుకోడానికి ఈ కచ్చడాలూ చాలా నేర్పుగా మగవాడు వాడాడు. (పేజి 63). స్త్రీని ఎలా తృప్తిపరచాలి అన్నదానికి వాత్స్యాయనుడు ఒక కాండమే రాశాడు. పురుషుడు వాడాల్సిన మందులనూ, ఉపయోగించాల్సిన ఇనుప సాధనాలనూ తెలిపాడు. ఇదొక శాస్త్రంగా పరిణతి చెందింది తూర్పు దేశాల్లో కనుక, ఈ కచ్చడాలు కూడా బహుశా తూర్పునుండే పడమటికి పాకి ఉంటాయని ధర్మారావు భావించాడు. తాను బహుభార్యాత్వాన్ని అవలంబించినా, స్త్రీ ఏక భర్తృకగా ఉండాలన్న అసూయతో వీటిని ఆరంభించి ఉంటారని కూడా వీరభిప్రాయపడ్తున్నారు. (పేజి 32).

చరిత్రలో బాగా స్పష్టంగా ఈ కచ్చడాలు 13 వ శతాబ్దం నుండి వినియోగంలో ఉన్నట్టు కనబడ్తాయి. మతప్రచారం కోసం జరిగిన యుద్ధ సందర్భాల్లో, వెళ్తూవెళ్తూ తమ భార్యలకు ఈ కచ్చడాలను కట్టే యూరోపియన్

వీరుల చరిత్రలు చాలా తెలుస్తాయి. ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సు, స్పెయిన్ దేశాలలో ఈ కచ్చడాల ఆచారం బాగా వ్యాప్తిలో ఉండేది.[118] 19వ శతాబ్దంలో కూడా స్పెయిన్‌లో కచ్చడాలను చాలా బహుళంగా స్త్రీలకుపయోగించే ఆచారం కనిపిస్తుంది.[119] అంతేకాదు 1970 లో కూడా ఇటువంటి ఆచారం కొనసాగుతున్నట్టు, ఆ కచ్చడాల బొమ్మలను దుకాణాలలో ప్రచారంగా పెడుతున్నట్టు కూడా చూడగలం.[120]

గతంలో హోమర్ తన 'ఒడిస్సీ' గ్రంథంలో ఈ కచ్చడాల ప్రసక్తి తెచ్చింతర్వాత, సుమారు రెండువేల సంవత్సరాలకు గ్రీసులో 'ఫ్లొరెంటైన్' నగరంలో వీటి ఉనికి తేలింది. హోమర్ కథలో వీనస్ తన భర్తకు నమ్మకద్రోహం చేస్తుంది. అప్పుడు భర్త హిఫియస్టాస్ వీనస్‌కు ఈ కచ్చడం తొడుగుతాడు. వీటిని ఆధారాలుగా తీసుకుని ఈ కచ్చడాలకు 'వీనస్ కచ్చడా' లనీ, 'ఫ్లొరెంటైన్' కచ్చడాలనీ పేరొచ్చింది. ఆ తర్వాతే ఇవన్నీ ప్రచారంలోకి వచ్చాయి. 15, 16 శతాబ్దాలలో చాలా ముమ్మరంగా తూర్పు, పశ్చిమ దేశాల్లో వీటి వాడకం పెరిగింది.[121] వాల్టేరు ఈ కచ్చడాలను రోము, వెనిసులలో మధ్యయుగాల్లో బాగా వాడారని రాశాడు.[122]

ధర్మారావు ఈ ఇనుప కచ్చడాల చిత్రాలను అనేక దేశాల మ్యూజియంల ఆల్బములలోనుండి సేకరించి ప్రచురించారు. సుమారొక ఎనిమిది కచ్చడాల చిత్రాలను ఇందులో చూడచ్చు. పొచెంజర్ కచ్చడం, క్లూనీ కచ్చడం (పారిస్‌లో ఒక మ్యూజియం పేరు క్లూనీ), కాల్మార్ కచ్చడం (జర్మనీలో ఉపయోగించింది), పారిస్ కచ్చడం, ఓడెన్వాల్డు కచ్చడం, కరారా కచ్చడం (కరారా ఇటలీలోని 'పాదువాకు' డ్యూక్. ఇతడు పరమ కిరాతకుడు 'టైరెంట్ ఆఫ్ పాడువా' అనే వాళ్ళితన్ని. ఇతడు స్త్రీలను బాధించడానికి చాలా నాజూకుగా వీటిని తయారు చేయించాడు.) ఎర్బాక్ కచ్చడం, నార్డిస్కా కచ్చడం ఆ చిత్రాల్లో ఉన్నాయి.

ఈ కచ్చడాల గురించి కొన్ని ఆసక్తికరమైన కథలను కూడా ధర్మారావు సేకరించాడు. అక్కడక్కడ ప్రపంచ సాహిత్యంలో సకృత్తుగా వచ్చిన కచ్చడాల ప్రస్తావనలనూ ఈ వ్యాసాల్లో ప్రస్ఫుటీకరించాడు. కోర్టుల్లో మధ్యయుగాల నుండీ ఇరవయ్యో శతాబ్దం వరకూ అప్పుడప్పుడొచ్చిన కొన్ని కేసుల విషయాలనూ, అందులో బయటపడ్డ – కచ్చడాలు వేసినందుకు పడ్డ శిక్షలనూ వివరించాడు.

1910లో పారిస్‌లో 'పీటట్ కేసు' సంచలనం కలిగించింది. ముద్దాయి ఓ పేరుమోసిన డాక్టరు. పత్రికలు అనేక శీర్షికలు పెట్టి ఆ కేసును

బాగా ప్రచారం చేశాయి. చివరికి ఆ డాక్టరుకు భార్యను అవమానపర్చాడని కోర్టు శిక్ష విధించడంతో కథ ముగిసింది. దీనికంతటికీ కచ్చడమే కారణం. (పేజీ 47). 1932లో పారిస్‌లోనే హెన్రీ లిటిర్, క్లూనీ మ్యూజియం చూడటానికె ళ్ళాడు. అక్కడ ఓ కచ్చడం చూసి బాగుందనుకొని ఓ కంపెనీ చేత తయారు చేయించాడు. భార్యను తొడుక్కోమని నిర్బంధించాడు. అతడి చర్యలను సమ ర్థించే కొందరు పురుషులు వీటిని చూసి తామూ తమ ఇల్లాండ్ర మీద ప్రయో గించటం ఆరంభించారు.[123] దాంతో వీటిప్రశస్తి, ప్రచారమూ మళ్ళీ మొదలైంది. ఇలా ఉండగా 1968 ప్రాంతాల్లో ఇంగ్లండ్‌లో రిడ్జ్‌వే ప్రాంతంలో ఓ మెటల్ పనివాడుండేవాడు. అతడి పేరు డేవిడ్ రెన్‌విక్. అతడి భార్య రోజ్‌మేరీ ఓ మ్యూజియంలో 13వ శతాబ్దం నాటి ఓ కచ్చడం చూసి అందానికి మోజు పడి దాని బొమ్మ కాగితం మీద రాసుకొచ్చి భర్తకు చూపింది. హాస్యంగా ఉండకపోతుందా అని అతడు ఓ కచ్చడం అలాగే తయారుచేసి తన దుకా ణంలో పెట్టాడు. కొద్ది రోజులకు అతడికొక్క ఇటలీ నుండే 150 కచ్చడాలు కావాలని ఉత్తరం వచ్చింది. క్రమంగా ప్రపంచంలోని చాలా దేశాలనుండి వీటి కోసం ఉత్తరాలు అతడికొస్తున్నాయి. ఒక్కొక్కదాని ఖరీదు 60 పౌండ్లు పెట్టాడు. అయిదుగురు పనివాళ్ళతో మంచి షెఫీల్డు లోహంతో వారానికి అతడు 30 కచ్చడాలే తయారు చేయగలడు కానీ దాని గిరాకీ ఊహించ నంతగా పెరిగిందంటాడు.[124]

వీటినిబట్టి చూస్తే ఇంకా ఈ కచ్చడాలు ప్రపంచంలో కొన్ని దేశాల్లో వాడుకలో ఉన్నాయనే అనవచ్చు. ఈ మధ్య కేరళ నుండి వచ్చే 'పంపారం' అన్న ఆంగ్ల పత్రికలోనూ (1979), బొంబాయి నుండి వచ్చే బ్లిట్జ్ సంచిక లోనూ (1980) ఈ కచ్చడాల బొమ్మలు వేస్తూ వ్యాసాలుకూడా వచ్చాయి.

ధర్మారావు ఈ కచ్చడాలను చాలా విపులంగా వర్ణించాడు. ఇవి తోలు బెల్టులనుండి అనేక లోహాలతో కూడా తయారుచేసేవారు. నడుముకో పటకా కట్టి స్త్రీ మర్మావయవం కనిపించకుండా వెనక పురీషభాగం మీదుగా పట్కాకు తగిలిస్తారు. కాలకృత్యాలు తీర్చుకోవటానికి అనువుగా రంధ్రాలుంటాయి. శరీరానికి ఒత్తుకొని బాధ కలగకుండా మెత్తటి గుడ్డలూ, చర్మంతో కచ్చడం లోపలి భాగాలను అమరుస్తారు. కష్టం లేకుండా కదలటానికి వీలుగా అనేక ముక్కలను లింకులుగా అతికి నిర్మిస్తారు. తాళం వెయ్యటానికి అవకాశం ఏర్పాటు చేస్తారు. రంధ్రాలచుట్టూ పళ్ళు అమర్చటం ద్వారా మరింత కట్టుదిట్టం చేయడం కూడా ఉంది. ధరించేవాళ్ళ ఆర్థికపరమైన స్థాయిలననుసరించి బంగా రంతోనూ, వివిధాలైన నగిషీ పనులతోనూ కచ్చడాలు చేసేవారు.

ఈ కచ్చడంలో ముందు భాగం రావి ఆకు ఆకారంలో ఉంటుంది. ఆంధ్ర సంస్కృత కవులు 'విప్పలచ్ఛదం' అన్నారు. జపానులో స్త్రీలు స్నానం చేసే సమయాల్లో ఈ కచ్చడం లాంటి బికినీని ధరించేవారు. దాన్ని ఫిగ్‌లీఫ్ అంటారు. మనకున్న ఆచారాలలో ఎదురయ్యే అనేక తంతులు అతి ప్రాచీన కాలం నుండీ వచ్చే భావాల స్మృతి చిహ్నాలుగా కనిపిస్తూంటాయి. అటువంటి వాటిల్లో సిగ్గుబిళ్ళ ఒకటి.

'సిగ్గుబిళ్ళ' ఎలా వచ్చి ఉంటుందన్న చర్చ సాగిస్తూ ధర్మారావు గోప్యాంగాన్ని కప్పటానికన్న వాదనతో విభేదిస్తూ పురుషులకెందుకు కట్టరని ప్రశ్నించాడు. (పేజి 21). ఈ సందర్భంలోనే ప్రాచీన కాలంలో జననేంద్రియాలను చాలా పవిత్రంగా చూసుకునేవాళ్ళనీ, ఆ నమ్మకం ఆధారంగా వాటికి దృష్టి తగలకుండా ఇలాటి కప్పడాలుండి ఉండచ్చునీ అన్నాడు. ఈ దృష్టిని మరేదైనా వస్తువు మీదకు తిప్పే ప్రయత్నంలో ఇలాటిది కల్పించుకొని ఉండ వచ్చునన్న అభిప్రాయం వెలిబుచ్చాడు. ఈ భావాలను కొంతవరకు ఫ్రేజరు కూడా తన గోల్డెన్ బౌ గ్రంథంలో సమర్థించాడు.

జననేంద్రియాల ప్రాధాన్యం - పవిత్రత అతి ప్రాచీనమైన ఆది మానవుల భావం. తండాను వృద్ధి చేసే అంగం అన్న ఊహ కావచ్చు. దీనినుండే పూర్వకాలంలో సాక్ష్యం పలికేవాళ్ళు తన గోప్యాంగంమీద చెయ్యేసి సాక్ష్యం చెప్పే ఆచారం వచ్చింది. కొంతకాలానికి తొడమీద చెయ్యేసి సాక్ష్యంచెప్పమనే రూపం పొందింది. ఈ విషయాలు బైబిలులో ఉన్న సాంకేతిక పదాలకర్థం తెలిసినవాళ్ళు ఎరిగినవే. సాక్షి హీబ్రూలో "ఇవన్నీ నా తొడల నుండి వచ్చే దాని సాక్ష్యంగా" చెప్తున్నానంటాడు. ఇలాగే అబ్రహాము తన సేవకుణ్ణి ఒట్టు పెట్టుకోమంటాడు. జాకబ్ చనిపోతూ జోసెఫ్‌ను నీ తొడలకింద చెయ్యి పెట్టి ఒట్టు పెట్ట'మంటాడు. ఇంతకూ అతడు చెయ్యాల్సిన పనేమిటంటే జాకబ్ చనిపోయిన తర్వాత అతణ్ణి ఈజిప్టు నేల మీద కాకుండా వాళ్ళ పూర్వీకుల గోరీల దగ్గర పాతాలట. ఆ మాటే ఒట్టేయించుకున్నాడు.

ఈ ఒట్టుకుపయోగించే మానవుడి గోప్యాంగం టెస్టిస్ నుండే టెస్టిమెంట్, టెస్టిమోనియల్ అనే పదాలు వచ్చాయి. వీటన్నిటి అర్థం ఏమంటే 'సాక్ష్యాధారాలతో' అనే. ఆ సాక్ష్యం ఏదో తెలిసిందే. వీటిలో అంతర్గత భావం అతడు ఇంతగా ఒట్టుపెట్టుకొని అబద్ధం చెప్పినా, ఆడిన మాట తప్పినా అతడికింక వంశాభివృద్ధి ఉండదు. అతడికుండబోయే ముందు తరం వాళ్ళ శిక్షకతడు పాత్రుడౌతాడన్నదే.[125]

ఇంత గొప్పభావం ఉన్న అంగాల ఆచ్ఛాదన కోసంగా మారిన ఈ సిగ్గుబిళ్ళ ఒకరకంగా కచ్చడంలోని భాగమేననటంలో ఎక్కువ సామంజస్యం కనిపిస్తుంది. నాగరికులు కూడా మధ్యయుగాల్లోనే కొన్ని ప్రదేశాల్లో కచ్చడాలను ఆభరణంగా మార్చేసుకొని లొంగిపోయారు. కనుక క్రమంగా అదే 'ఆభరణ శిథిలం'గా మన మధ్య నిలిచి ఉండవచ్చు. నేడు మన ఇళ్ళల్లో కనిపిస్తున్న సిగ్గుబిళ్ళల నిర్మాణమూ, పూర్వకాలంలో కచ్చడాల నిర్మాణమూ చూస్తే కనిపించే పోలికలను బట్టి 'ఇవి రెండూ ఒక్కచేతి మీదనే తయారయినట్టు కనబడతాయి' (పేజి 23)-అంటూ సిగ్గుబిళ్ళ పూర్వాపరాలను నిర్ధారించాడు ధర్మారావు.

ఇంగ్లీషులో వీటిని 'చేస్టిటీ బెల్ట్' అని అంటారు. గ్రీకులో 'అయేహా' అన్న చేస్టిటీ పదానికి అర్థం ఇలా ఉంది. అన్నం తినకుండానూ, లైంగిక వ్యాపారంలో పాల్గొనకుండానూ, సాధారణ సంతాప దినాల్లోనూ, అసహ్యాన్ని వెలిబుచ్చే కాలంలోనూ పాటించే విధి. పై విషయాలనింతవరకూ పరిశీలిస్తే ఆయా దశల్లో ఆయా కాలాలలో, ఇందులోనిభావాలు కొన్నికొన్ని చేస్టిటీ కింద అమలు జరిగినట్టు అర్థమవుతుంది. ఏది ఏమైనా ఈ చేస్టిటీని అమలు జరపడంలో ఉపయోగించే ఈ సాధనాలు 1980 సంవత్సరంలో కూడా పురుషులు ఉపయోగిస్తున్నారు. ఢిల్లీ దగ్గర ఓ సాధువు తన గోప్యాంగానికి రింగు వేసి శీలచొప్పించి, ఒక చెయ్యి పైకెత్తి సంవత్సరాల తరబడి నగ్నంగా ఉంటున్న ఓ ఉదంతాన్ని ఈ మధ్య పత్రికలు ప్రచారం చేశాయి.[126]

అతి ప్రాచీన కాలంలో ఒక ఉద్దేశంతో ఆరంభమైన ఈ పద్ధతి సమాజ పరిణామంతోబాటు భిన్నార్థాలనూ,భిన్న రూపాలనూ, భిన్నోపాయాలనూ సంతరించుకుంటూ, ఇంకా నిలబడి ఉండటం గమనార్హం. న్యూ గినీలో బాలియం లోయలో 'వుకాహుంపి' తెగలో మగవాళ్ళందరూ తమ గోప్యాంగాన్ని డొల్లగా చేసిన పొట్లకాయలాంటి దానిలో దూర్చి ఉంచుకునే ఆచారం ఉంది. ఇది కచ్చడంగా ఆరంభమై అలంకారంగా మారిందని పీటర్ మాథైసేన్ తన అండర్ ది మౌంటెన్ వాల్ అన్న గ్రంథంలో వివరిస్తాడు. ఈ ప్రాంతాన్ని 1938 లో కనుక్కున్నారు. వీరిప్పటికీ పాత రాతియుగపు సంస్కృతిలోనే జీవిస్తున్నారని శాస్త్రజ్ఞుల అంచనా.

ఇప్పటికీ సూడాన్‌లో బగ్గారా తెగలో తల్లిదండ్రులు తమ ఆడపిల్లల గోప్యాంగాలను కుట్టేస్తారు. పెళ్ళికాగానే ఆ కుట్లను భర్తే విప్పుతాడంటూ రిచర్డ్ కార్లిస్లే 'ఇల్లస్ట్రేటెడ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ మాన్‌కైండ్' లో (పేజి 150) రాస్తాడు.

చారిత్రక కాలంలో చూస్తే రెండవ హెన్రీ, ఫ్రాన్సులో తన భార్య కాథరిన్-డి-మెడిసీస్‌కి ఇలాటి కచ్చడం ఇచ్చి కట్టుకోమన్నాడు. ఆర్లేన్స్‌కు చెందిన మోడినో రాకుమారుడు తన భార్య చార్లెటు ఆగ్లేకు దీన్ని కట్టబెట్టాడు. అలాగే ఫ్రాన్సులో నాల్గవ హెన్రీ తన అందాలభరిణ అయిన భార్య గేబ్రియల్-డి-ఎస్ట్రీస్‌కు మణులూ మాణిక్యాలూ పొదగిన కచ్చడాన్ని బహూకరించాడు. సూడాన్‌లో జనానా రక్షణకోసం అందరికీ వీటిని కట్టబెట్టే వాళ్ళని పి. సి. రేమాండినో సాక్ష్యం చెప్తున్నాడు. ఇవి చాలా ప్రాథమికంగా, అతి నాసి రకంగా ఉన్నట్టు కనిపిస్తాయి. వాటి నిర్మాణం ఇలా ఉంది. మర్మావయవంలోకి వెళ్ళేలా ఒక వెదురు ముక్కా, దాని పైభాగానికి అతికి ఉండేలా ఓ గట్టి చెక్కముక్కా కలిపి కచ్చడం తయారుచేసేవాళ్ళని అతడంటాడు.[127] దంతం, వెండి, బంగారంలాటి లోహాలతో చాలా చక్కని పనితనంతో చూడ ముచ్చటైన కచ్చడాలకిప్పటికీ ఉత్తర ఇటలీ ప్రసిద్ధి చెందింది.

తెలుగులో ఇలాటి వ్యాసాలతో, ఈ తరహా విషయాలతో వెలువడిన గ్రంథం లేదు. వెలువరించిన ఖ్యాతి ధర్మారావుకు దక్కింది (1979). ధర్మారావు ఈ గ్రంథంలో అడుగడుగునా స్త్రీలపై పురుష ప్రాజాపత్యం నెరపిన దుండగాన్ని ఖండించటం చూస్తాం. ఎప్పుడైతే ఏదైనా వ్యక్తిగత ఆస్తిగా పరిణమిస్తుందో- దాని రక్షణకోసం, సొంతంగా దాన్ని నిలబెట్టుకోవడంకోసం మానవుడు పడే తపనను రచయిత అసహ్యించుకోవడం కనిపిస్తుంది. పితృస్వామ్యం పడదోసిన మాతృస్వామ్యం, దాంతోపాటే అణగారిన స్త్రీ స్థాయీ, వివరిస్తూ ధర్మారావు "ఏ పాపమెరుగని ఇల్లాళ్ళను పట్టి వేధించింది ....... మగవాడు ఎప్పటికైనా ఇలాటి వాడే సుమా అని మరచిపోనీకుండా చేస్తూంది. మగవారిని ఆడువారిని ఒకే రీతిని హెచ్చరిస్తూంది"- అని కచ్చడాల కాండ లోకానికి కనువిప్పు కావాలని కాంక్షించాడు(పేజి 69). ఆహార, నిద్రా వాంఛల లాగానే మైథున వాంఛ కూడా స్వభావసిద్ధమైంది. దీన్ని ఏవో తంత్రాలతో ఆపాలనుకోవడం ఏటికి ఎదురీదటం. ఈ కామవాంఛను విచ్చలవిడిగా అనుభవించాలనుకునే స్వభావం వెనుక ఏముందో "మూల కారణం ఏమిటో గ్రహించాలి. అదెక్కడుందో - స్త్రీలోనా, పురుషుడిలోనా - తెలుసుకోవాలి. ఆ కారణాన్ని నిర్మూలించాలి" అంటూ కచ్చడాల పుట్టుకకు ఆది కారణం కోసం ప్రయత్నించాడు ధర్మారావు. (పేజి 64)

ఈ మూలకారణం అన్వేషించడంలో రచయితకు అప్పటికి అందిన సమాచారం ఆధారంగానే ఒక శాస్త్రీయ అవగాహన ఏర్పడిందనవచ్చు. సమాజ పరిణామాన్ని దశలవారీగా అర్థంచేసుకున్నాడు. ఆ దశల్లో స్త్రీ, పురుష

సంబంధాల్లో వచ్చిన ప్రధానమైన మార్పులను స్థూలంగానైనా పసిగట్టాడు. అయితే ఈ మార్పులు ప్రధానంగా ఉత్పత్తి సంబంధాల్లో వచ్చే మార్పుల కనుగుణంగా జరుగుతూంటాయన్న మరింత శాస్త్రీయ అవగాహనకు రాలేకపోయాడు. బహుశా అప్పటికి ఈ రకమైన విశ్లేషణకు ఉపయోగించే సాహిత్యం, సిద్ధాంత గ్రంధాలూ రచయితకు లభ్యమై ఉండకపోవచ్చు. కానీ వ్యాసాలన్నింటా కొంతకు కొంత ఆర్థికపరమైన కారణాలూ అవీ కచ్చడాల పుట్టుకకు దారితీసి ఉంటాయన్న సూత్రాన్ని ఇముడ్చగలిగారు.[128]

భావాలపరంగా మారిననాటి నుండి ధర్మారావులో పాఠకుల మీద దృష్టి చాలా పెరిగింది. తన రచనలన్నీ అతిసరళంగా ఉండే భాషలో రాయడం ఆరంభించాడు. దీన్లోని విషయాలు చాలాభాగం ఆంగ్ల గ్రంధాలలోవి అయినా పాఠకుడికి అలా అనిపించవు. వస్తువుకు తెలుగులోనే మూలాలున్నాయేమో అన్నంత సాఫీగా, భావ ప్రకటనను ధర్మారావు ఈ గ్రంథంలో చూపించాడు. పాఠకుల మనస్సుల్లోకి ఈ విషయాలను దృఢంగా ఎక్కించాలన్న తలంపు వీరికుంది. అందుకే వ్యాసాలకు ఆకర్షకంగా ఉండేలా 'కడిగి వడపోసిన సత్యం'; 'భార్యాత్వం రక్షించడానికి ఇనుపకట్లు'; 'అఖరుకు అలంకారాలలాగ పరిణమించాయి'; 'బుద్ధిహీనతకు స్మారక చిహ్నాలు' - అంటూ శీర్షికలుంచారు.

మానవ చరిత్ర మొదటి పుటలు నిశితంగా పరిశీలించి చేసిన రచనల్లో ఇది ఒకటి. కడిగి వడపోసిన సత్యం ఏమంటే ఈ కచ్చడాలు ముఖ్యంగా ''మగవారి కృత్రిమాలకు స్మారక చిహ్నాలు. మగవారి స్వప్రయోజన బుద్ధికి నిత్య సాక్ష్యాలు. మగవారి పక్షపాతబుద్ధికి తార్కాణాలు'' (పేజి 66). ఇదీ ఈ రచనతో పాఠకలోకానికి ధర్మారావందించిన భావధార. సనాతన భావవాదులకు గుటక పడని చారిత్రక గంగధార. ఇది నా దక్షర సత్యం. కానీ భారత దేశంలో మగవాళ్ళ కచ్చడాలకు సౌభాగ్య తంత్రాలతో సంబంధమున్న విషయాన్ని ఇంతకు ముందే దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు అన్న తాపీ వారి గ్రంథ పరామర్శలో గమనించాం. ఇది మన 'పండిత' మండలికి కొంత ఊరట కలిగిస్తుంది.

## పెళ్ళి 'లో'చూపులు'

''మాంగళ్య తంతునానేన మమజీవన హేతునా
కంఠేబధ్నామి సుభగే త్వంజీవ శరదశ్శతమ్'' -

ఇదీ ఎవరైనా ఈనాడు పెళ్ళి పందిట్లో జనం సందడిలో వినే మంత్రం. దీంతో పెళ్ళి అయిందన్న నమ్మకం పీటల మీద కూర్చున్న యువతీయువకులకూ, వచ్చిన పెద్దలకూ కలుగుతుంది. ఈ పెళ్ళి అనే తతంగం లేదా తంత్రం ఎలా వచ్చింది? ఎందుకొచ్చింది? అన్నది పరిశీలించాలని ధర్మారావు భావించాడు. అప్పటికే సామాజిక చరిత్రకు సంబంధించిన అనేక మూల సమస్యలను ఆధారంగా చేసుకొని దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు? ఇనుపకచ్చడాలు లాంటి వ్యాసాలను రాశాడు.

దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు? - అన్న వ్యాసాల్లో ఆదిమ పశుపాలక వ్యవసాయ గణాల దగ్గర్నుండి, బాగా అభివృద్ధి చెందిన వ్యవసాయ దశ వరకూ మానవజాతి కనిపెట్టిన కామ్య తంత్రాలనూ (ఫర్టిలిటీ కల్ట్స్), వాటికి సంబంధించిన చరిత్రనూ విడమర్చి చెప్పాడు. 'ఇనుప కచ్చడాలు' వ్యాసాల్లో-సొంత ఆస్తిమీద ఆధారపడ్డ వర్గసమాజం పుట్టిన తర్వాత సంతానానికే ఆస్తిని సంక్రమింపచెయ్యాలనే పురుష వాంఛకు అనువుగా కనిపెట్టిన అంతఃపుర రక్షణ సాధనాలను వివరించాడు. అయితే మధ్యయుగాల కేథలిక్ గురువుల్లోనూ; పూర్వపు రుషులూ, బౌద్ధ శ్రమణకుల్లోనూ; మహమ్మదీయ మత శాఖల్లోనూ; బ్రహ్మచర్యం ఊర్ధ్వరేతస్కం సాధించడానికి కూడా ఇనుప కచ్చడాలు సాధనాలుగా ఉపయోగపడ్డాయి. ఈ అంశాలను ధర్మారావు తమ వ్యాసాల్లో సూక్ష్మంగా విశదీకరించాడు.

ఇక వారు రాసిన మూడో గ్రంథం 'పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు'. ఈ వ్యాసాలు కాగడాలో వరసగా ప్రచురించారు. అవి సామాజిక చరిత్రకు సంబంధించినవి. కుటుంబ నిర్మాణానికి చెందినవి. కుటుంబమన్నది ఏదో ఒక దశలో ఆకస్మికంగా సమాజంలో పుట్టుకొచ్చిన 'యూనిట్' కాదు. సమాజ పరిణామ చరిత్రను దశలవారీగా పరిశీలించినప్పుడే దీని ఆవిర్భావం, అందులో పెళ్ళి తంత్రం-సాకల్యంగా అర్థమౌతుంది.

వివాహం సంపదుత్పత్తికి తోడ్పడగల సామాజిక నిబంధన. అందుకని ఆదిమసమాజంనుండి నేటి వరకూ సంపదుత్పాదన సాధనాలూ (మీన్స్ ఆఫ్ ప్రొడక్షన్), సాధ్యాలూ (ఆబ్జెక్ట్స్ ఆఫ్ ప్రొడక్షన్), సిద్ధులూ (ప్రొడక్ట్స్), వాటి భుక్తి (కన్సంప్షన్ ఆఫ్ ప్రొడక్ట్స్) వీటన్నిటినీ; వీటి పరిణామాల్ని పరిశీలిస్తే తప్ప వివాహ వ్యవస్థా దాని పరిణామం అర్థం కాదు. ఇదేదో మత సంబంధమైన తతంగం అనుకుంటే ఏ చిక్కూ లేదు. ఆలోచించాల్సిన అవసరం అంతకన్నా లేదు.

సమాజం పశుపాలక వ్యావసాయ దశలకు చేరిన తరా... పశుసంతా నాభివృద్ధీ, వ్యవసాయభివృద్ధీ సాధించడానికి మానవుడు యత్నించడం సహజం. ఆ యత్నంలో ప్రకృతి మీద తన వాల్లభ్యాన్ని పెంచుకోవడానికి ప్రయత్నించాడు. అయితే అది విజ్ఞానశాస్త్ర ప్రగతితో తప్ప సాధ్యంకాని పని. అయినా అది మానవుడు తనకున్న కొద్దిపాటి విజ్ఞానంతోనూ విశ్వాసాన్ని పెంచుకుని ఊహలు వృద్ధిచేసుకుని మంత్ర తంత్రాలతో ప్రకృతిని అదుపులో పెట్టుకున్నట్టు తృప్తి పడేవాడు. ఆ యత్నంలోంచి ఉద్భవించినవే కామ్య తంత్రాలు లేక సౌభాగ్య తంత్రాలు. వీటినే ప్రజనన తంత్రాలని కూడా కొందరంటారు. కనుక ప్రకృతికి మనిషికి జరిగిన నిరంతర పోరాటంలో మానవుని ఊహావిజయాన్ని అర్థం చేసుకోవడానికి ఈ సౌభాగ్య తంత్రాల పరిశోధన తోడ్పడుతుంది.

స్వభావసిద్ధమైన మాతృవంశికం స్థానంలో అసహజమైన పితృవంశికం స్థాపనకు మనిషి చేసిన యత్నాలను తెలిసికోవడానికి ఇనుపకచ్చడాలు తోడ్పడతాయి. ఆ దిశలోనే వచ్చిన మరో పెద్ద మలుపును తెలుసుకోవాలంటే 'పెళ్ళి'ని అధ్యయనం చెయ్యాలి.

సమాజాన్ని దశలవారీగా మోర్గాన్ విభజించి ఆయా దశల్లో అనేక రకాలైన పరిణామాలు జరిగినట్టు వివరించాడు. వాటిలో కుటుంబ నిర్మాణం అన్న పరిణామాన్ని మరింత శాస్త్రీయంగా ఎంగెల్స్ పరిశీలించాడు. ఎంగెల్సు ఆదిమ సమాజాన్ని అధ్యయనం చేస్తూ ప్రధానంగా రెండు మహాయుగాలున్నాయని భావించాడు. ఒక్కొక్క యుగం ఒక దశగా అనుకున్నాడు. ప్రతి దశనూ మూడేసి మహర్దశలుగా మళ్ళీ విభజించాడు. కలగాపులగంగానూ, అగమ్యగోచరంగానూ ఉండే సమాజ పరిణామాలను నిర్దిష్టంగా అవగాహన చేసుకోవడానికి ఈ విభజన అవసరం ఎంతైనా ఉంది.

పాశవిక యుగం:

ఇది మొదటి దశ. దీన్ని మళ్ళీ మూడు మహర్దశలుగా విభజించటం జరిగింది. అధమ మహర్దశ - మధ్యమ మహర్దశ - ఉత్తమ మహర్దశ. ఆయా పరిణామాలను దశలవారీగా పరిశీలిద్దాం.

అధమ మహర్దశ: ఈ దశలో మానవుణ్ణి పశువులనుండి వేరుచేసే-మాట-ఆవిర్భవించింది. 'జ్ఞానం హితేషాం అధికోవిశేషః' - అంటూ మనిషికి పశువు కన్నా ఎక్కువ గుణం జ్ఞానమనీ ఆది మాట ద్వారా ఇతరులకు వ్యక్తపరచటం జరిగిందనీ గ్రహించాలి. ఈ దశలో మానవుడు కోతికన్న భిన్నంగా లేడు చెట్లలో జీవనం చేయటం, శాకాహారం తీసుకోవడం, కాయకసరులు వెతికి తినడం మానవుడి లక్షణాలుగా ఉండేవి. సరిగ్గా ఈ దశలోనే భాష ఆవిర్భ

ఇది మోర్గాన్‌ను అనుసరించి చేసినవిభజన. ఎంగెల్స్ దీన్నే అనుసరించాడు.




వివాహపరిణామం
భగినీవివాహం
గణవివాహం
మాతృస్వామికం
మేట్రియార్కల్
మాతృ వంశికం
మేట్రిలీనియల్
దాంపత్యవివాహం
మాతృస్థానికం మేట్రిలోకల్
పితృస్థానికం పేట్రిలోకల్
పితృస్వామికం
పేట్రియార్కల్
పితృవంశికం
పేట్రిలీనియల్
ఏకపత్నీ వివాహం
మాతృస్థానికం మేట్రిలోకల్
పితృస్థానికం పేట్రిలోకల్
బహు భర్తృత్వం
పొలియాండ్రి
బహు పత్నీత్వం
పోలీగమి
విటులు - స్వైరిణులు
పేరమోర్ - కుకోల్డ్
వ్యభిచారం
కాంకుబయనేజ్

వించింది. అదీ మానవుని ప్రాథమికావసరాలను తీర్చడానికి మాత్రమే. ఇక సామాజిక వ్యవస్థను పరిశీలిస్తే గుంపులుగుంపులుగా జీవించడం జరిగేది. పేర్లు లేకపోయినా ప్రతి గుంపుకో వృద్ధమాత నేతగా ఉండేది.[129] వివాహ వ్యవస్థ పశుసామాన్యంగా ఉండేది. పశువుల్లో లాగే రుతు కాలమే కూడే కాలం. ఈ సంబంధాన్ని 'కన్ శాంగ్యునేరియన్' అని అన్నారు. అంటే రక్త సంబంధీకుల మధ్య సంబంధాలుండటం అని అర్థం. ఈ స్థితి అనేక వేల సంవత్సరాలుండి ఉండవచ్చు.[130] 'శాంగ్యున్' అన్న మాటకు రక్తం అని భావం. ఈ సంబంధానికి దృష్టాంతాలు నాగరికత వచ్చిన తర్వాత మిగల్లేదు. అయితే పురాణాల్లో మాత్రం దీన్ని సమర్థించడానికి కొన్ని కథలూ, పాత్రలూ దొరుకుతాయి. రామాయణంలో రుష్యశృంగోపాఖ్యానం, సుమేరియన్, అసీరియన్‌ల కథల్లో గిల్గమేశ చరిత్ర.[131] ఇక్కడ రుష్యశృంగుడు - గిల్గమేశ చరిత్రలో ఎంకడూ - ఒకే తీరు వాళ్ళు. వీళ్ళను ఆనాడు పశువులనుండి భాష ఒక్కటే వేరు చేసినట్టుగా గమనించగలం.

మ ధ్య మ మ హా ర్ద శ: ఈ దశలో మానవుడు నిప్పును కనుక్కున్నాడు. దాని ఉపయోగాన్ని గుర్తించాడు. ఆహారంకోసం కాయా కసరూ ఏరుకోవడంతో బాటు జలచరాలైన చేపలూ, గుల్లలూ, తాబేళ్లూ వినియోగించుకోవడం తెలుసుకున్నాడు. పచనానికి నిప్పు తోడ్పడింది. దీనివల్ల పరిసర వాతావరణం నుండి దాన్ని తట్టుకోగల సామర్థ్యం అబ్బింది. ఈ దశలో గుంపులు గుంపులుగా ఉండే మానవులు సముద్ర, నదీ తీరాలవెంట యాత్రలు సాగించారు. పురావస్తు శాస్త్రజ్ఞులు చెప్పే పాత రాతి యుగం ఈ దశలోనే ఆవిర్భవించింది. అహార సేకరణలోనూ, పచనానికి ఉపయుక్తంగా తయారు చేసుకోవడంలోనూ రాతి పని ముట్లు తయారు చేసుకున్నాడు. ఖండాంతరాలకు వ్యాపించడం, ఆహార సమృద్ధీ, రాపిడివల్ల నిప్పు పుట్టించే శక్తీ ఈ దశలో మానవుడికి కలిగిన శక్తులు.[132] జంతువులను వేటాడడానికి మొరటు కర్ర దుంగలు (అంటే గదలు - మంచం కోడు ఆకారంలో ఉండే ఖట్వాంగాలు) ఉపయోగించాడు. నాటి మానవుడు గదాధరుడయ్యాడన్న మాట. నిప్పును వశం చేసుకున్న ఆఖేటకుడు (వేట ప్రధానమైన వృత్తి కలవాడు.) ఈ దశలోనే నరమాంస భక్షణ కూడా చేసేవాడని శాస్త్రజ్ఞులంటారు. ఈ లక్షణాలున్న గుంపులు పొలినీషియా దీవుల్లోనూ; ఆస్ట్రేలియాలోనూ కనిపించినట్టు సామాజిక మానవ శాస్త్రజ్ఞులు దాఖలాలు చూపించారు. ఇక మన దేశంలో జలచరాల్లో తాబేలును ఆహారంగా చేసుకున్న వాళ్ళ ఉదంతం శ్రుతి - పురాణాల ద్వారా తెలుస్తుంది. వీళ్ళను తర్వాతికాలంలో 'కచ్ఛపులు' అన్నారు.[133] వీరే కశ్యపులయ్యారు.

పురాణాల ప్రకారం కశ్యపుడు ఆది ప్రజాపతి. భూమికి 'కాశ్యపి' అన్న పేరూ ఉంది. ఈ గుంపులు, తాబేళ్ళు ఎక్కువగా దొరికే సముద్రతీరంలో స్థిరావాసం ఏర్పరచుకున్నాయనడానికి - 'కాస్పియన్ సముద్రం' అన్న పేరూ తెలియ చేస్తుంది.

నిప్పునూ దాని ఉపయోగాన్నీ, గొప్పతనాన్నీ తెలియచేసే విధంగా వేదాలనుండి అనేక ప్రస్తావనలు కనిపిస్తాయి. రాపిడి అంటే మథనం. దీనివల్ల నిప్పును కనిపెట్టిన వాళ్ళకు చరిత్రలో ప్రధాన స్థానం ఉంది. గ్రీకుపురాణగాధల ప్రకారం జీయస్ అంటే దేవేంద్రుడు. అతని కొడుకు ప్రొమిథియస్. ఇతడు దేవతల అగ్నిని తస్కరించి మానవులకిచ్చి మహోపకారం చేశాడు. ఇలా చేసినందుకు దేవతలకు కోపంవచ్చి ప్రొమిథియస్‌ను బండకుకట్టి, ఇతని లివర్‌ను పొడిచి తూట్లు చెయ్యడానికి ఒక డేగను పంపారు. అయినా అతడు చలించలేదు. తప్పని ఒప్పుకోలేదు. మానవకళ్యాణం కోసం దేవతలను ధిక్కరించి చిత్రహింసలకు గురి అయి కూడా చలించని ప్రొమిథియస్‌ను మహా విప్లవకారునిగా మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌లు కీర్తించారు. షెల్లీ దీన్నే తీసుకొని ప్రొమిథియస్‌వల్ల ఉపకారం పొందిన మానవులు కలిసికట్టుగా అతణ్ణి శృంఖలా విముక్తుణ్ణి చేసి స్వర్గంపై దండయాత్ర చేసినట్టు 'ప్రొమిథియస్ అన్‌బౌండ్' అన్న కావ్యం అల్లాడు.

ఇక మన దేశంలో అగ్నిని కనిపెట్టినవాళ్ళు 'అంగిరు' లని మన వేదాలు చెప్తున్నాయి. ఋగ్వేదంలో అగ్ని స్తుతులొచ్చినప్పుడు 'త్వంప్రమంథో అంగిరః' అంటే అంగిరులలో ప్రమంథుడనేవాడని అన్నారు. అంటే ఇక్కడ కూడా మంథనం వల్లనే ప్రమంథుడన్న పేరొచ్చినట్టు ఊహించవచ్చు.

వచనం ద్వారా ఆహారం సుసంపన్నం కావడంవల్ల సమాజం ప్రధానంగా రెండు తండాలుగా చీలింది.

1. అడవులను ఆశ్రయించి వేట వృత్తిగా ఉన్నది-వనచరాఖేటం.

2. తీర ప్రాంతాలాక్రమించి జలచరాల వేట వృత్తిగా ఉన్నది-జలచరాఖేటం.

ఈ దశల్లో వచనం చెసిన మాంసం తినడంవల్ల మెదడు వికసించింది మనిషిలో లాఘవం ఏర్పడింది. ఈ రెంటివల్ల అతడిలో ఉత్సుకత, జిజ్ఞాస అంకురించాయి.

ఆహార సంపాదన కోసం మానవుడు భూభ్రమణం చేస్తున్న సందర్భంలో కొత్త కొత్త తండాలతో పరస్పర పరిచయాలేర్పడ్డాయి. ఆహారం కోసం మహాయుద్ధాలు ఈ తండాల మధ్య సాగి ఉంటాయి. కాని తరాత్వ

ఒక్కొక్క తండాకి బాగా అలవాటు పడిన ఆహార . పరస్పర ఆదాన ప్రదానాలవల్ల ఎక్కువ లాభం ఉందనే గ్రహణశక్తి కూడా వచ్చింది. ఈ ఇచ్చి పుచ్చుకోవడాలకు మొట్టమొదట ఒక కొత్త నీతి కూడా సమాజానికి అవసరమైంది. దీనితో కొత్త విధి నిషేధాలు అంకురించాయి.

అంతవరకూ ఒక వృద్ధమాత కుటుంబంగా చెలామణి అయ్యే తండాలోని స్త్రీ పురుషుల మధ్య సోదరసోదరీ భావం, సోదరీగమనం పాపం అన్న భావం అవసరమైంది. కాబట్టి ఒక తండాలో ఉన్న స్త్రీలు ఆ తండా పురుషులకు నిషిద్ధం. ఇంతవరకూ అమల్లో ఉన్న ఆచారానికిది వ్యతిరేకం. కొత్తగా పరిచయమైన మిత్ర తండాలోని పురుషులకు ఈ తండాలోని స్త్రీలు సహజ భార్యలు.[134] అలాగే ఆ తండాలోని స్త్రీలు ఈ తండాలోని పురుషులకు సహజభార్యలు.[135] ఈ స్త్రీ పురుష ఆదానప్రదానానికి ప్రధానలక్ష్యం ఉభయ తండాల ప్రధాన ఆహారాన్ని మార్పిడి చేసుకోవడమే. ఎందుకంటే ఆహార సంపాదన బాధ్యత ఎవరిదైనా, దాని పంపిణీ బాధ్యత మాతృస్వామికమైన ఈ తండాలలో స్త్రీలకే ఉంది. అందుకని స్త్రీ బదలాయింపుల ద్వారా ఆహార బదలాయింపు కూడా జరిగింది. అన్నం మార్పు అంటే స్త్రీ మార్పు. స్త్రీ మార్పు అంటే అన్నం మార్పు. ఈ విధంగా ఒక తండా, ఆహారం మార్పిడి కోసం అనేక తండాలతో సంబంధం పెట్టుకోవచ్చు. ఒక తండా, అయిదారు తండాలతో సంబంధాలు పెట్టుకున్న ఉదంతాలున్నాయి. ఉదాహరణకు కశ్యప తండాతో దితి, అదితి, దను, వినత, కద్రువ తండాల స్త్రీలు సహజ భార్యలైనట్టు మనకు పురాణాలు సాక్ష్యం ఇస్తున్నాయి. కనుకనే దైత్య, ఆదిత్య, దానవ, వైనతేయ, కాద్రవేయులు కశ్యపసంతానంగా మన భారతంలాంటి గ్రంథాలలో కనిపిస్తున్నాయి.

ఉత్తమ మహర్దశ : ధనుర్బాణాలు కనిపెట్టటంతో ఈ దశ ఆరంభమైంది. మానవుడు ధనుర్ధారి అన్నమాట. ధనువును కనిపెట్టగలిగాడంటే ఈ దశనాటికల్లా మానవుడి మెదడు చాలా పదునెక్కిందనుకోవాలి. జలచరాఖేటం నుండి వనచరాఖేటం ప్రధానవృత్తిగా జీవించడానికి మానవుడు అలవడ్డాడు. ధనుర్బాణాలాంటి క్లిష్ట ఆయుధాల్ని కనిపెట్టిన మేధ అనేక ఉపయంత్రాల్ని కనిపెట్టింది. ఈ దశలోనే ఆఖేట గ్రామాలూ వెలిశాయి బహుశా కుండలు చెయ్యడం కూడా యిదే దశలోనే నేర్చుకొని ఉంటాడు. అయితే కుండను కనిపెట్టడంతో సమాజం మరో యుగంలోకి అడుగుపెట్టిందని మోర్గాన్ అభిప్రాయం. ఇతర మానవశాస్త్రజ్ఞుల మతం ప్రకారం కొయ్యపాత్రలూ, అల్లిక బట్టలు (చేతితో అల్లినవి) కూడా కనిపెట్టడం వల్లే సమాజం మరో దశలోకి

అడుగుపెట్టింది. కొత్తరాతి ఉపకరణాలు, రాతి పరశువులు, కొయ్యతో ఇళ్లు నిర్మించడం, అనేవి ఈ దశాంతంలో ఆవిర్భవించాయని చాలామంది మానవ శాస్త్రజ్ఞులంటారు.

అయితే ఈ దశలో మూడురకాల తండాలేర్పడినట్లు రుజువులున్నాయి.

1. ప్రధాన ఆహారం ద్వారా గుర్తింపు పొందిన తండా. ఇలాంటి వారిలో కచ్ఛపులు (కాశ్యపులు)

2. తండామాత పేరుతో గుర్తింపు పొందిన తండా (దైత్య, దానవాదిత్యాదులు)[136]

3. నివసించే ప్రాంతాల ఆధారంగా గుర్తింపు పొందిన తండా (టెరిటోరియల్ ట్రైబ్స్),

తమ ఆఖేట గ్రామ ప్రాంతాల అధీనంలో నివసించేవారు. తమ తండాలకు ఆది నుండీ వచ్చిన పేర్లనే ప్రాంతాలకూ వర్తింప చేశారు. రామాయణంలోని దండకారణ్యం (దండకుడన్న పేరు నుండి వచ్చింది). జనస్థానం (మారీచ సుబాహులది) మొదలైనవి. అలాగే పురాణకాలంలోని ఋషుల ఆశ్రమ ప్రాంతాలు ఒకరకంగా ఆఖేట ప్రాంతాలనే అనవచ్చు.

ఈ దశకల్లా గతంలో కేవలం అన్నంకోసం జరిగిన స్త్రీ మార్పిడి, తండాల మధ్య ఒక సామాజిక న్యాయంగా మారింది

ఇప్పటికొచ్చిన దశల్లో స్త్రీ పురుష సంబంధాలను స్థూలంగా ఈ కింది విధంగా చెప్పుకోవచ్చు.

ఒకే తండాలోని స్త్రీ పురుషుల మధ్య వివాహం అంగీకారయోగ్యంగా ఉండేది. దీన్ని భగినీ వివాహం అనవచ్చు. అంటే ఏకోదరుల మధ్య సంబంధాలు.[137] దీన్ని ఇలా వివరించవచ్చు. కన్‌శాంగ్వినేరియన్ వివాహాలు అంటే రక్తసంబంధీకుల మధ్య వివాహం అంగీకరించడం. తండాలో ఎన్ని తరాల వాళ్ళున్నా అందరూ ఏకోదరులనే భావించేవారు. వారందరూ తండామాత సంతానంగానే పరిగణనలోకొచ్చేవారు. దీనికి ఉదాహరణగా ప్రాచీన ఈజిప్టు రాజవంశాల్లో అన్నాచెల్లెళ్ళ మధ్యే వివాహాలు జరిగినట్టు చరిత్ర తెలియచేస్తోంది.[138]

ఋగ్వేదంలో యమా, యమీ సంవాదం కూడా ఈ భగినీ వివాహ ఉదాంతాన్నే వివరిస్తుంది.[139] తల్లీకొడుకుల మధ్య సంబంధాలూ ఉంటూండేవి.[140]

తర్వాతి దశలో తండాల మధ్య అన్నం మార్పిడికోసం పెట్టుకున్న సంబంధాల ఆధారంగా ఒక కొత్తరకం వివాహ వ్యవస్థ అవతరించింది. దీనికి మోర్గాన్ 'పునాలువన్ మారేజి'స్ట్ అని పేరుపెట్టాడు. ఈ వ్యవస్థ ఈ నాటికీ కొన్ని పొలినీషియన్ దీపుల్లో అమల్లో ఉంది. ఇలాంటి గుంపుల మధ్య పెళ్ళిళ్ళను ఆ భాషలో వాళ్ళు 'పునాలువన్' అంటారు.[141] అందుకని శాస్త్రజ్ఞులు దీన్నే తీసుకుని గ్రూప్ మారేజెస్ అని అన్నారు. మెక్లాన్ దీన్నే మొట్టమొదటిసారిగా ఎగ్జోగమీ అని అంటూ విశదీకరించాడు.[142] పునాలువన్ అంటే మనం వావి అని అర్థం చెప్పవచ్చు. 'వావి' అని అంటున్నాం గానీ అసలు అది 'వాయి'. అంటే పిలుపు. ఇప్పటికీ సామాన్య ప్రజానీకం దీన్ని 'వాయి' అని స్పష్టమైన పదాన్నే ఉపయోగించటం -'ఏం వాయి అవుతది' అనడంలో గమనించవచ్చు. అదే అర్థంలో ఒక సామెతకూడా ఉంది. వివాహ సంబంధాన్ని వివేచించేటప్పుడు ఉపయోగిస్తారు.

"వదిన మరదలు వాయి ఉత్తమమైందంటారు.
అత్త వాయి ఆయుష్యమంటారు.
తల్లి వాయి తప్పులేదంటారు.
కూతురు వాయి కూర్చవచ్చంటారు.
చెల్లెలి వాయి చెప్పరాదు"

దీన్లో అతిస్థూలంగా సమాజంలో వివాహానికి ఏయే వాయిలు ఎప్పుడెప్పుడుండేవో క్లుప్తంగా వివరించడం జరిగింది. మొత్తానికి 'పునాలువన్' అంటే ఇతర తండాలో వాళ్ళని ఏమని పిలిచి సంబంధం కలుపుకోవచ్చనే అర్థం కావచ్చు.

ఈ వాయి వివాహాలు ఎప్పుడు ఆరంభమయ్యాయో - మానవజాతిలో అప్పుడే తప్పు కూడా అవతరించింది. మానవ శాస్త్రజ్ఞులు దీన్నే 'టాబూ' అంటారు పొలినీషియన్ భాషలో 'తప్పు - తాపూ' అంటారు. ఇదే భావానికి వేద వాఙ్మయంలో 'పాప్మా' అనీ, లౌకిక వాఙ్మయంలో 'పాపం' అనీ పేరుంది. ఋగ్వేదంలో యమాయమీల వాగ్వివాదంలో ఈ భగినీ సంభోగం పాపం అంటాడు.

ఈ 'టాబూ' నే స్మృతికర్తలు 'అగమ్యం' అన్నారు. మానవజాతిలో తొట్టతొలిగా వివాహ సంబంధాల వివేచనలో వచ్చిన 'పాప్మా' - 'అగమ్యా భగినీ' అన్నది. ఆహార పంపిణీకి ఈ విధి ఆనాడు చాలా అవసరమైంది. సమోవా, తాహితీ తెగల్లోనూ, ఆస్ట్రేలియాలోని అనేక తెగల్లోనూ, ఇప్పటికీ ఈ భగిని గమ్యమే పాపం. ఒంస్సా మేఘాలయ ప్రాంతాల్లోని కొన్ని తండా

లలో కూడా ఈ నిషేధం ఉంది. దీనికి శిక్ష మరణమే. నాగరక సమాజంలో ఇది లేదు. పంచమహాపాతకాల్లో దీన్ని చేర్చలేదు.

ఆదిమ సమాజాల్లో ఈ నిషేధాలకు ఏడాదికోసారి అదీ ఓరోజు సడలింపు ఉండేది. ఈ సంగమాలకు ఓ పవిత్రత, దైవత్వం కూడా వస్తుందని నమ్మారు. ఆ స్వేచ్ఛలో ఈ నిషేధోల్లంఘన దైవకార్యంగా భావించేవారు స్త్రీ పురుష భేదం తప్ప-వాయి వరసలూ అంతస్తుల భేదాలుండని శాటర్నేలియా ఉత్సవం (ఇటలీ), భారత దేశంలోధర్మారావు వర్ణించినట్టు హోళీ నాటి రవికల పండుగ కూడా దీన్నే బలపరుస్తాయి. జర్మనీ, స్కాండినేవియా దేశాలు, ఉత్తర రష్యాలూ ఈ వసంతోత్సవాల వేడుకల్లో ఇదే నియమాన్ని పాటిస్తారని ఫ్రేజర్ రాస్తాడు. ఇప్పటికీ స్కాండినేవియాలోని లాప్‌లాండ్‌లో ఈ ఉత్సవం జరుగుతూంటుంది. స్వేచ్ఛా ప్రణయులకది యాత్రా కేంద్రం. ఇక దైవత్వానికి భారతదేశంలో పూరీయే ఉదాహరణ. శ్రీకృష్ణబలభద్రులకు సుభద్రే భార్య. విగ్రహం కూడా అలాగే ఉంటుంది.

ఇది తప్పుగా ఎప్పుడైతే భావించారో అది జరగకుండా తండాలన్నిట్లో ఇతర ఏర్పాట్లు కొనసాగించారు. గ్రామంలో యువతీయువకులకు వేర్వేరు సాముదాయక శయనాగారాలేర్పాటు చేశారు. ఒరిస్సా గిరిజన ప్రాంతాల్లో వీటిని 'గోటుల్' అనీ, న్యూజిలాండ్ (మలెనీషియన్) ప్రాంతాల్లో 'బూకామా తులా' అనీ అంటారు. ఈ ఆచారం ఇంకా నేటికీ ప్రబలంగా ఉంది. భగినీ వివాహాల నిషేధాల సందర్భంగా వచ్చిన పాపాలూ - ఆ పాపాలకు పడే శిక్షలూ దృష్టిలో పెట్టుకునే అలాంటి పాపాలేమీ చేయనిదీ కన్య - అంటూ వివాహ సమయంలో కన్యావరణ మంత్రం తయారు చేసి ఉంటారు.

వధువు నెత్తిమీద వరుడూ, వరుడి నెత్తిమీద వధువూ జీలకర్రా బెల్లం కలిపిన ముద్దను ఉంచే సందర్భంలో ఈ కింది మంత్రాలుంటాయి. నేడీ సమయాన్నే పెళ్లి సుముహూర్తం అని అంటున్నారు.

"అభ్రాతృఘ్నీం వరుణపతిఘ్నీం బృహస్పతే
ఇంద్రా పుత్రఘ్నీం నక్ష్మంతా మస్యై సవితస్సువ"
"అఘోరచక్షు రపతిఘ్న్యేధి శివాపతిభ్యస్సుమనా
స్సువర్చాః । జీవసూః దేవకామా స్యోనా శంనోభవ
ద్విపదే చతుష్పదే॥"143

భయంకరమైన కళ్ళులేవు, పతినీ, సోదరుణ్ణీ, పుత్రుణ్ణీ చంపనిదీ కన్య అని అర్థం.

ఇక ప్రాంతీయ తండాల మధ్య కూడా పై విధమైన వివాహాలే జరిగేవి. వీటివల్ల ఆహార పుష్కలత్వం సౌహార్దత్వం ఏర్పడుతుండేవి. ఈ దశలో ఉన్న అంశాలు ఇంకా మన పలుకుబళ్ళలో మిగిలాయి. ఇప్పుడు వృద్ధమాత తండా పేరుకు అవశేషంగా కాలక్రమేణా ఇంటి పేరుగల మానవసంఘం వచ్చింది. ప్రాంతీయ తండాలకు ఊరిపేర్లున్న మానవ సంఘం వచ్చింది. ఉదాహరణకు మీ అమ్మాయిని ఎవరికిచ్చారంటే బుద్ధిరాజువాళ్ళకిచ్చామనడం; అలాగే మధిర కిచ్చామనడం దీన్నే సూచిస్తుంది. అంటే ఆ ఇంటిపేరుగల తండా వాళ్ళంద రికీ, ఆ పేరున్న గ్రామం వాళ్ళందరికీ, ఈమె సహజ భార్య అనడానికి ఇది సూచనగా మిగిలింది.

ఇంతటితో మొదటియుగంలో మూడు మహర్దశల సమాజ పరిణామమూ అప్పటి స్త్రీ పురుష సంబంధాల వివరణా ముగుస్తుంది. మనకొచ్చిన పురాణ గాథల్లో ఎక్కువ ఈ మహర్దశల యుగానికి సంబంధించినవనే అనవచ్చు. పురాణ రచనా కాలానికి చెందిన నాగరికత పైపూత కింద పాశవిక యుగపు ఉత్తమ, మధ్యమ మహర్దశల అవశేషాల రేఖలు స్పష్టంగా కనిపిస్తాయి. మధ్యమ దశలో గదాధరులూ, ఉత్తమ దశలో ధనుర్ధారులూ ఉన్నట్టు అర్థ మవుతుంది. కనుక మన ప్రాచీన పురాణాల్లోని యుద్ధాలన్నీ ఈ గదాధర, ధనుర్ధారుల మధ్య సాగిన యుద్ధాలుగానే మనం చూడాలి.

బర్బర మహాయుగం : పాశవిక యుగం తర్వాత వచ్చిన మహాయుగం ఇది. దీన్ని బార్బరస్ ఏజ్ అనంటారు. పాశవిక యుగంలో మాదిరిగానే ఈ యుగంలో కూడా అధమ, మధ్యమ, ఉత్తమ మహర్దశలున్నాయి. కొందరి మతంలో కుండలు తయారు చెయ్యడం, బట్టలు నెయ్యడం నేర్చుకోవడంతో ఈ యుగంలో అధమ మహర్దశ ఆరంభమవుతుంది.

అధమ మహర్దశ : భౌగోళికంగా మానవజాతిలో ప్రాక్పశ్చిమాల విభ జన కూడా ఈ యుగంలోనే ఏర్పడింది. వ్యవసాయం, పశుపోషణలు అవత రించాయి. ప్రాక్ భాగాలైన ఆసియా ఖండంలో మచ్చిక చేసుకోవడానికి వీలైన అనేక జంతువులూ, అనేక రకాల పంటలూ ఉన్నాయి. ఇక్కడున్న వాతావరణానికి అనుకూలంగా సమాజం ఏర్పడి స్థిరనివాసాలారంభమయ్యాయి. తూర్పు, పశ్చిమాల మధ్య కనిపించని ఒక విభజన రేఖ ఏర్పడింది. ఈ దశలో వివాహానికి సంబంధించి పెద్ద మార్పులేం రాలేదు. ఆయుధాల్లో కూడా చెప్పుకో తగ్గ మార్పులు కనిపించవు అయితే కొన్నిచోట్ల లోహం వాడకం ఆరంభ మైంది సమాజం కులాల చక్రాలనూ రథచక్రాలనూ కనిపెట్టింది. మానవుడు క్రమంగా స్థిరత్వాన్ని సంతరించుకుంటున్నాడు.

మధ్యమ మహర్దశ: అధమ మహర్దశలోని అంశాలలో పశుపోషణ, పంటలు పండించటం మరింత నైపుణ్యంతో ఈ దశలో అమల్లోకొచ్చింది. అన్ని అపరాలూ పండించేవారు చక్కబల్లలే కాకుండా రాళ్ళతో కోటల్లాటి ఇళ్ళు నిర్మించుకోవడం, రాళ్ళను చెక్కడం, ఉన్నితో బట్టలు తయారు చేసుకోవడం, రంగులు వేసుకోవడం వంటివి ఆరంభమయ్యాయి.

పశుపాలనా, వ్యవసాయం బాగా స్థిరపడ్డాయి. ఇక పశువుల కోసం దాడులూ (గవేషణలు), గో అపహరణాలూ ఆరంభమయ్యాయి. ఆదిమ పశు పాలకులైన సెమైట్స్, ఆర్యులూ బాగా బలవంతులుగా రూపొందారు. గోయాత్రకు గవేషణ అనీ, అతిథి వస్తే గోవును కోసి పెట్టే మర్యాదతో అతిథికి 'గోఘ్న' (గోహంతకుడన్న పేరు) అన్నదీ స్థిరపడింది. ఆవుకు ప్రాధాన్యం వచ్చింది. ఆతిథేయుని మర్యాదకు 'గవేష్టి' అన్న పేరు నిశ్చితమైంది. ఆడవారికి పాలు పిండడం, పాల ఉత్పత్తుల్ని తయారుచెయ్యడం వృత్తిగా మారింది. అందుకనే సంస్కృతంతో సహా సకల యూరోపియన్ భాషల్లోనూ వీటికి సమాన పదాలు కనిపిస్తాయి. ఉదాహరణకు సంస్కృతంలోని గో - ఉక్ష అన్న పదాలకు కౌ - ఆక్స్ అనే పదాలున్నాయి. సంస్కృతంలో అవి(గొర్రె)కు గ్రీకు భాషలో 'అవిన్' అని ఉంది. ఇవి అందరికీ తెలిసినవే. ఇలాటివే ఇతర భాషల్లోనూ చూడవచ్చు. జర్మన్ భాషలో అతిథిని కానీ అతిథి మర్యాదను కానీ 'గుయేష్ఠ్' - అంటే; అదే ఆంగ్లంలో 'గెస్టు' అని అంటాం స్పెల్లింగ్ మాత్రం 'జి యు ఇ ఎస్ టి' 'గుయేష్ఠ్' లాగానే ఉంది. రష్యన్ భాషలో 'గోస్త్' గోస్త్ నిత్స - అంటే అతిథి గృహం (హోటల్). గోమాంసాన్ని సంస్కృతంలో గవ్యాదిన అనే అనడం జరిగింది కదా. పాలు పిండుట అనే భావానికి దుహిత, దోహిత్రి అనే పదాల్లోనూ, దీన్నే జర్మన్ భాషలో ఉన్న 'డొఘతర్' అన్న దాంతోనూ ఆంగ్లంలో దీన్నే డాటర్ అన్నాంసూ ఒకే మూలం గమనించగలం. పారశీకంలో 'దుఖర్' అంటారు

ఈ పదాలను చూపి ఒకప్పుడీ జాతులన్నీ ఒకటే అని ఎస్. ఎ. డాంగే ఒక సిద్ధాంతం చేశాడు.[144] దీన్ని ప్రముఖ భారతీయ చరిత్రకారుడు ప్రొఫెసర్ డి. డి. కోశాంబి ఆక్షేపిస్తూ "పాలకు లేని సమాన వాచకం 'పాలు పిండేవాడికి' ఎలా వచ్చిందని" అపహాస్యం చేసి దాన్ని ఖండించాడు.[145]

కానీ నామవాచకాలు ప్రాంతాలను బట్టి మారితే మారవచ్చు. వాటి క్రియారూప పదాలు మాత్రం మారవు. ఉదాహరణకు తెలుగు దేశంలో కొయ్య, కలప, చెట్టు, మాను, కర్ర ఇన్ని మాటల్నీ వాడతారు. మనం కొయ్య కుర్చీ అంటే తమిళ ప్రాంతంలో మాను కుర్చీ అంటారు. కానీ నరకడమో కొట్టడమో

రావేలు గలవాడ రార పొలిగాడ

అనే క్రియకు మాత్రం అందరూ సమానపదాన్ని ప్రయోగిస్తారని ప్రకటిస్తారు. (సమానార్థకం) భాషలో క్రియాపదాల్లో సామ్యాన్ని చూడాలిగాని నామవాచకాన్ని కాదు. ఈ వాదంతో కొందరు భాషాశాస్త్రజ్ఞులు జాతి సామ్యాన్ని సమర్థించటానికి పూనుకున్నారు. ఏమైనా జాతులొక్కటనీ, పశుపాలన ప్రధానవృత్తిగానూ, వ్యవసాయం ఆరంభదశలోనూ ఉందన్న నిజాన్నే ఈ దశలో చూడాలి. అందుకే ఈ వివరణ

ఈ దశలో కూడా వివాహ వ్యవస్థ చెప్పుకోతగినంతగా మారలేదు. కానీ, పశుపాలకుల్లో పురుష ప్రాధాన్యం పెరుగుతూ వచ్చింది. సంతానాన్ని అటు తండ్రి పేరుతోనూ ఇటు తల్లి పేరుతోనూ పిలిచే సంప్రదాయం ఏర్పడింది రాముణ్ణి దాశరథి అనీ, కౌసల్యా తనయుడనీ, అర్జునుణ్ణి పార్థా అనీ, కవలలను మాద్రేయులనీ పిలిచేవారు - అందర్నీ కలగలిపి పాండవులనీ అన్నారు. వ్యాసుడిని సాత్యవతేయుడనీ - పారాశరుడనీ అనడం ఎరిగిందే. వ్యవసాయవర్గాల్లో మాత్రం స్త్రీ ప్రాజాపత్యం పెద్దగా మారలేదు. అయితే ఈ వర్గాల సాహిత్యమేదీ మనకింతవరకూ దక్కలేదు. కాబట్టి నాటి పేర్లు ఎలా ఉండేవో తెలుసుకోవడం కష్టం. అయినా తెలుగు దేశాన్నేలిన మొదటి రాజవంశం పేర్లన్నీ మాతృప్రాధాన్యాన్ని సూచిస్తున్న విషయం ఇదివరకే గమనించడం జరిగింది. జానపద ప్రాకృత సాహిత్యాలలో ఆధారాలు బహుళంగా ఉండి ఉండవచ్చు.

**ఉ త్త మ మ హ ర్ద శ:** దీన్నే మానవ శాస్త్రజ్ఞులు, చరిత్రకారులూ లోహయుగం అన్నారు- 'ఆయస' యుగం అనవచ్చు. ఇనుము కనిపెట్టడంతో ఈ యుగావతరణం జరిగింది. వ్యవసాయం - దాని ఉపాంగాలైన వివిధ రకాల చేతివృత్తులూ తామరతంపరగా అభివృద్ధి చెందాయి. అడవుల్ని కొట్టి కొత్త ప్రాంతాలను సాగులోకి తేవడమూ; నదులకూ వాగులకూ ఆనకట్టలు కట్టి పంట కాలువలు తవ్వడమూ; రాళ్లతో సుందరంగా ఇళ్ళు నిర్మించుకోవడం మొదలైనవన్నీ ఈ దశలోనే వచ్చాయి. పశుశక్తిని వ్యవసాయానికి వినియోగించటం ఆరంభమైంది.

గ్రీకుల వీర యుగం, రోమ్‌నగర స్థాపన, వైకింగుల విజృంభణ, మన పురాణ గాథాయుగం - అన్నీ, ఈ మహర్దశకు చెందినవనే చెప్పవచ్చు. ఇంతవరకూ వేటకుపయోగించే ఆయుధాలూ ఇతర ఉపకరణాలూ వ్యక్తి ఆస్తిగా వుండేవి - అతడి మరణానంతరం అవి తిరిగి సమాజానికి చెందేవి. మన పురాణాల్లో మహాపురుషుని మరణానంతరం వారి ఆయుధాలన్నీ దివ్యలోకాలకు చేరేవనే కథలన్నీ వీటికే సాక్ష్యాలు అలాంటి ఆయుధాలను వాడగల

వాడు ఆ తండాలో పుట్టినప్పుడు దివ్యులు ప్రాచీనాయుధాలను వానికిచ్చేవారని కూడా ఆ పురాణాలే చెప్తున్నాయి. శివధనుస్సు, పరశురాముడి ధనుస్సు, దేవదత్తం, గాండీవం, పాశుపతం వంటివి పురాణ వీరులకొచ్చినట్లు వివరించే కథలన్నీ దీన్నే సూచిస్తున్నాయి.

ఈ దశలో వ్యవసాయం బాగా అభివృద్ధి చెందిందనీ, పశుపోషణ కూడా వృద్ధి పొందిందనీ గమనించాం. అవన్నీ సమిష్టి కృషిగానే కొనసాగుతూండేవి. అయినా ఈ దశలోనే గృహాలూ, కుటుంబాలూ ఏర్పడటానికి అనుకూల వాతావరణం ఏర్పడింది. గృహానికీ, కుటుంబానికీ మూలం దంపతులు. అందుకని ఈ దశలో వివాహ వ్యవస్థలోనూ, నీతిలోనూ మార్పు సహజంగానే అవసరమైంది.

గుంపు పెళ్ళిళ్ళలో అందరికీ వాయి కలిసేది. భగినీ వివాహానికే నిషేధం వుండేది. వ్యవసాయం పెరిగీ, పశుపోషణ అధికం అయిన తర్వాత 'వాయి' కలిసిన అనేక తండాలు ఒకే జనావాసంలో కలిసివుండడం తప్పనిసరైంది. క్రమంగా కన్యాగారాలూ, యువాగారాలూ వేర్వేరు గ్రామాలకు ఉపాంగాలుగా కట్టవలసి వచ్చింది.[146] ఆయుధాలన్నీ ఉమ్మడి ఆస్తిగా ఉండేవి. అవే కాకుండా ముఖ్యంగా సోమరసం, మద్యమైరేయాలూ సమాజాగారాల్లో ఉంచేవారు. సాధారణంగా ఆయుధాలు యువాగారాల్లోనూ, మద్యమైరేయాలు కన్యాగారాల్లోనూ దాచటం పరిపాటిగా ఉండేది. కన్యాగారానికి సోమ, మద్య మైరేయ నిపుణులూ, వృద్ధులూ పాలకులుగా ఉండేవారు. యువాగారాలకు వృద్ధస్త్రీలు పాలకులుగా ఉండేవారు. అందువల్ల అటు యువకులూ ఇటు యువతులూ లైంగిక ప్రథమ పాఠాలన్నీ వీళ్ళనుండే నేర్చుకొనే అవకాశం ఉండేది. సాయం సమయాల్లో యువతీయువకులు ఊరి మొగదలలో కలిసి ఆడుతూ పాడుతూండడం ఆచారం. ఆ సమయంలో మనసుపడ్డ జంటలు సమయ మేర్పరచుకోవడం, సంకేతం నిర్ణయించుకొని అడవుల్లోకి పోవడం కూడా ఆనవాయితీయే. అప్పుడు పుట్టిన సంతానానికి తల్లే తప్ప తండ్రిని నిర్ణయించవలసిన అవసరం వుండేదికాదు. అందువల్లా, వాయి తప్పచేయటానికి అవకాశం ఉండనినీతి అప్పుడు ఉంది కనుకా ఎలాటి సామాజిక సమస్యలూ తలెత్తడానికి ఆస్కారం లేకపోయింది. పోతే వాయి తప్పు చేస్తే మాత్రం సమాజం దోషిని చాలా తీవ్రంగా శిక్షించేది. ఆదిలో వాయి తప్పు ఎవరివల్ల జరిగినా స్త్రీప్రాజాపత్యంఉన్న ఆ సమాజంలో పురుషుడికే శిక్షపడేది. పొలినీషియా దీవుల్లో యిలాటి తప్పును 'సువసోవా' అంటారు. దీన్ని మలినొవస్కీ చాలావిపులంగా వివరించాడు.[147] కొన్ని తండాల్లో పురుషుల్నీ,

మరికొన్నిట్లో స్త్రీ పురుషులిద్దర్నీ శిక్షించే ఆచారం ఈనాటికీవుంది. పురుష ప్రాజాపత్యమున్న నేటి ఆధునిక వ్యవస్థలో ఈ తప్పుకు స్త్రీనే ఎక్కువగా శిక్షించడం చూస్తున్నాం.

పైన వివరించిన తండాల ఆచారాల ప్రకారం కొంతకాలం సాగిన ఈ స్థితినుండి, యువతీయువకులు జతకట్టడం అన్న నిర్ణయానికొచ్చిన తర్వాత వారిద్దరికీ ఉమ్మడి శాలల్లో ఉండే అధికారం పోతుంది. తల్లిదండ్రుల ఇళ్ళ కెళ్ళాల్సి వస్తుంది. అలాంటి స్థితిలో ఆ స్త్రీ తండ్రికి భార్యగానే లెక్కకొస్తుంది. స్త్రీ తన గోత్రానికి చెందదు. కనుక వాయి కుదిరింది. అందుకని తప్పుకాదు. జతకట్టటానికి పరిస్థితులు అనుకూలించినప్పుడు దీన్నే 'దాంపత్య వివాహం' అన్నారు. సమాజంలో యీ దశలో వివాహ వ్యవస్థలో వచ్చిన ఒక కొత్త పరిణామం ఇది. అప్పుడు వాయి కలిసిన సమాజానికంతటికీ చెందిన ఈ స్త్రీ ఒక వ్యక్తి వ్యక్తిగతాస్తిగా మారాలి. దీన్ని సమాజం అనుమతించాలి. ఈ అనుమతి అనేకరూపాల్లో ఆనాడుండేది.

i. పెండ్లి అయిన మొదటిరాత్రి తండాలో వాయి కల్సిన వారంతా ఆమెను వరసగా అనుభవించి అంతటితో ఆమె మీద తమ హక్కును వదలుకోవడం.

ii. తండాలో వాయి కల్సిన వారందరికీ వేర్వేరు బహుమతులిచ్చి వధువు మీద వారికున్న హక్కును విడిపించుకోవడం.

ఇదే కాలక్రమేణా తండా మొత్తానికి కాక తండా నాయకునికి మొదటి రాత్రి హక్కు ఇవ్వడం గానూ, వధువు తండ్రికి తండా పక్షాన బహుమతి ఇవ్వడంగానూ పరిణామం పొందింది.[148] వీటిల్లో మొదటిదాన్ని రైట్ ఆఫ్ ది ఫస్ట్ నైట్ అనీ ఫ్రెంచిలో జస్ప్రైమేనాక్టిస్ అనీ మధ్య యుగాల్లో అనేవారు. అది ఓ ఆచారంగా మారింది. ఇప్పటికీ ఎస్కిమోలు, దక్షిణ అమెరికాలోని అలాంటి మరికొన్ని తండాలలో ఈ ఆచారం ఉంది. కెల్టిక్ దేశాల్లో కూడా ఈ ఆచారం చాలా కాలంగా ఉంది. ఇక రెండోది 'ఓలి,' 'కన్యాశుల్కం' రూపంలో నిన్నమొన్నటివరకూ విస్తారంగా ఉంది. ఇప్పటికీ కొన్ని గిరిజన తండాల్లో ఇది కనిపిస్తుంది.[149]

వాయి పెళ్ళిళ్ళు, దంపతీ వివాహంగా మారిన ఈ పరిణామం నేటి మన వివాహ మంత్రాల్లో చాలా స్పష్టంగా కనిపిస్తుంది.

''సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిధ ఉత్తరః
తృతీయో అగ్నిష్టే పతి స్తురీయస్తే మనుష్యజాః''[150]

"సోమోఽదదద్గంధర్వాయ గంధర్వో దదదఘ్నయే
రైయింశ్చ పుత్రాంశ్చా దాదగ్నిర్మహ్యా మథో ఇమాం"[151]

ఈ మంత్రాలను పాణిగ్రహణం జరిగే సందర్భంలో చదువుతారు దీనిలో సోముడు మొదటి భర్త. అతడు ఆమెను తర్వాత గంధర్వుని కప్పగిస్తాడు. కన్యాగారాల్లో ఉన్నప్పుడు - అవే నాటి మద్యాగారాలు - ప్రథమ పాఠాలు సోముల నుంచి అంటే సోమం తయారు చేసే వారి నుండి తెలిసికొనేవారు. కనక ఆ సోముడు ప్రథమ భర్త. తర్వాత సాయం సమయాల్లో ఆటపాట లప్పుడు ఇష్టులతో సమయ సంకేతాలేర్పరచుకొనే కాలం ఉంది. అప్పటి భర్త గంధర్వుడు. అంటే ఆ పద్ధతిని గాంధర్వం అన్నారు. అదే నేడు 'డేటింగ్'గా అన్వయించుకోవచ్చు. కనుక గంధర్వుడు రెండో భర్త.

ఇద్దరు జంట కట్టాలని నిర్ణయించుకున్నప్పుడు ఆ పిల్ల తండ్రి ఇంటి కొస్తుంది. వేదకాలంలో ఇంటిని 'అగ్ని' అని పిలిచేవారు. ఇప్పటికీ అగ్ని కుండం అయిన 'హార్త్' కు ఇల్లు అన్న అర్థం ఉండడం గమనార్హం. ఇల్లు అంటే యజమానురాలని మాతృ సమాజంలోనూ, ఇంటి యజమానుడని పితృ సమాజంలోనూ ఉంది. వాయిననుసరించి ఆమె ఆ ఇంటి యజమానికి భార్య అన్నమాట. అంటే ఆమెకు మూడో భర్త అగ్ని. ఇక జతకట్టే చివరివాడు నాలుగోవాడవుతాడు. ఇతడు ధనం కోసం పిల్లలకోసం మాత్రమే ఆమెతో జత కడ్తాడు. ఆ విషయాన్నే "గృహ్ణామితే సుప్రజాస్త్వాయి హస్తం మయాపత్యా జరదష్టిర్యథా సంభగో అర్యమా సవితా పురంధిర్మహ్యాంత్వా దుర్గార్హపత్యాయ దేవాః" - అన్న మంత్రం ద్వారా ఈనాటి పెళ్ళిలో పాణిగ్రహణం చేస్తూ వరుడు వివరిస్తాడు.

వరుడికి సోముడూ - గంధర్వులూ ఎవరో తెలిసే అవకాశం లేదు. ఇక తెలిసినవాడు పిల్ల తండ్రి అంటే అగ్ని. ఆ పిల్ల ఉన్న ఇంటి యజమాని. కనుక ఆ యజమాని సాక్షిగా అంటే 'అగ్ని' సాక్షిగా ఆ అమ్మాయీ అతడూ జతకడ్తున్నారు. ఈ విధంగా దంపతీ వివాహాలు ఏర్పడ్డాయి.

దంపతీ వివాహాలు ఏర్పడిన కాలంలోనే ఓలిపెళ్ళితో పాటు కొన్ని తండాల్లో ఇతర పద్ధతుల్లో జత కట్టడాలు కూడా ఉంటూండేవి. వాటినే రాక్షస[152] వివాహం, పైశాచీ వివాహం, అసుర వివాహం అనేవారు. మన గృహ్యసూత్రాలు చెప్పే ఎనిమిదిరకాల వివాహాల జాబితాలో ఒక్కొక్కటి కొన్నికొన్నిటినే అంగీకరించింది. కొన్నిటిని వదిలేశాయి. అశ్వలాయనం ప్రకారం చివరకు తేలినవి బ్రాహ్మం, ప్రాజాపత్యం, ఆర్షం, దైవం,

గాంధర్వం, అసురం, రాక్షసం, పైశాచికం అనేవి. ఇందులో మొదటి నాలుగూ తర్వాత్తర్వాత అమోద యోగ్యాలనీ మిగిలినవి కావనీ అన్న ధోరణి ప్రబలింది.

అయితే నేటి మన సమాజంలోని పెళ్ళి తతంగాల్లో అన్ని వివాహ పద్ధతుల చిహ్నాలూ కనిపిస్తూంటాయి. వాయి కలిసినవారి హక్కు విడిపించడంలో ఉన్న ఒక పద్ధతే మరదలిమాడగా నిలిచింది. పిల్ల మేనమామ పిల్లను దాచేసి కొంత కట్నరూపేణా పొందిన తర్వాత ఆమెను బుట్టలో కూర్చోపెట్టి పీటల దగ్గరకు తీసుకుని రావడం ఈనాడు కనిపిస్తుంది. అలాగే స్థాలీపాకం తర్వాత నాగవల్లి అన్న తంతు జరుగుతుంది. ఇందులో కల్లయుద్ధం ప్రధాన భాగంగా ఉంటుంది. ఈనాడు అది పోయి చక్కగా ముగ్గులేసిన జాగాలో అన్నిటితోపాటు ఓ ఆయుధాన్ని తూర్పు దిక్కున ఉంచి ఆ కల్ల యుద్ధానికి చిహ్నన్ని ఊహించారు. దీని పేరు 'నాగబలి' (నాక బలి) అనీ 'నాకవల్లి' అనీ అంటూ దేవతా పూజ కింద మార్చేశారు.153 ఇది మారేజ్ బై కాప్చర్ - అన్న పద్ధతికి సూచన. ఉత్తర హిందూస్థానం పెళ్ళిళ్ళలో బరాత్ వెళ్ళే పెళ్ళి కొడుకు గుర్రం మీద కత్తి అవీ పట్టుకెళ్ళడం పూర్తిగా దీని ఛాయలే. ఇలాగే ఆసుర, పైశాచిక వివాహచ్ఛాయలూ కనిపిస్తాయి. మొదటి రాత్రి హక్కు యూరోపియన్ దేశాల్లోలాగానే మన దేశంలో; అందులో తెలుగునాట ఉండేదని వాత్స్యాయనుడంటాడు. పల్లెపిల్లను పెళ్ళిచేసుకున్నప్పుడు దొర, జమీందారు, రాజు ఎవరుంటే వారికి ముందుగా ఆ పిల్ల తన శరీరాన్ని అర్పించటం ఆనవాయితీగా ఉండేది.

> ''ప్రత్తా, జనపదకన్యాం, దశమేహని కించిదౌపాయనికం
> గృహీత్వా, ప్రవివేశ అంతఃపురం ఉపభోజ్య, విసృజ్య
> ఇత్యాంధ్రాణామ్'' (వాత్స్యాయన కామసూత్రాలు -
> కన్యా సంప్రయుక్తాధికరణమ్ 42 సూ.)

దీని అర్థం తెలుసుకోడం అవసరం. నవవధువు ప్రత్తాకన్యా. సంపర్కం పొందనిది. జనపదాల్లో పెళ్ళి అయి భర్తతో సంసారం చెయ్యకముందు ఏదో ఒక రోజున కొన్ని బహుమతులు తీసికొని దొరవారి అంతఃపురం చేరుకోవాలి. అక్కడ దొరవారు ఉపభోగించిన తర్వాత భర్తదగ్గరకు వెళ్ళాలి. ఇప్పటికీ కేరళలో ఈ ఆచారం ఉంది. ఇది ఆంధ్రుల్లో ఉన్న ఆచారం అంటాడు. ప్రపంచంలోని పెళ్ళి తంతులన్నిట్లో దీని ఛాయలు కొద్దోగొప్పో ఉన్నాయి. జర్మనీలో ఈ ఆచారాన్ని కేథలిక్ మతస్థుడైన ఫెర్డినాండ్ రాజు నిషేధిస్తూ 1486 లో ఈ కింది ఉత్తర్వు జారీచేశాడు.

"ఒక రైతు పెళ్ళాన్ని కట్టుకున్నప్పుడు .. ఈ చెప్పబడిన ప్రభువులు (సెన్యోర్, బారన్‌లు) .... ... మొదటి రాత్రి ఆమెతో నిద్రించకూడదు. పెళ్ళి నాటి రాత్రి వధువు పడుకొని ఉండగా తమ ఆధిక్య చిహ్నంగా ఆ పక్క మీదుగా గాని, ఆమె మీదుగా గాని దాటి వెళ్ళకూడదు .... మేము ఆలోచించి నిర్ణయిస్తున్నాం.''154

వాత్స్యాయనుడు చెప్పిన ఈ సంప్రదాయం అలాస్కా ప్రాంతంలోని ఆదిమ వాసులందరిలోనూ ఉంది. ఉత్తర మెక్సికోలోని 'తాహు'లలో ఉంది కెల్టిక్ జాతుల్లో ఉంది. కాస్పియన్ దేశంలో అరగాన్ ప్రాంతమంతటా ఈ ఆచారం ఉంది.

ఇలాటి నిషేధాలు తెలుగుదేశంలో ఉన్నట్టు ఎలాటి దాఖలాలూ కనిపించవు. కనుక పౌరులే ఈ ఆచారానికి రాజీమార్గంగా ఒక ముగింపును కనిపెట్టారనుకోవచ్చు. అదే బాల్యవివాహం.155

పెళ్ళయిన పదోరోజున దొరవారి గడికెళ్ళడం ఆచారం. దాన్ని మార్చడానికి వీల్లేదు. ఎనిమిదేళ్ళ పిల్లకు పెళ్ళిచేస్తే పదోరోజుకెళ్ళినా శీలభంగం కాదు. కానుకలన్నవి ఎప్పుడైనా తప్పవు. ఈ దురాచారాన్ని మొత్తంగా పక్కదారి పట్టించడానికే ఇది వచ్చి ఉండవచ్చు. యుక్తవయస్క అయిన తర్వాత తన దగ్గరకా పిల్లను పంపలేదేం ? అనీ - పెళ్ళి చెయ్యలేదేం ? అనీ అడగకుండా దొరగారి ముద్రను కోటకెళ్ళినప్పుడు ఆ పిల్లకు దొరగారు కట్టటం అన్న ఆచారం పెట్టారు ఒకసారి ఈ బిళ్ళ ఉన్న తర్వాత ఆమె పాతివ్రత్యానికిక భంగం లేదు. ఆలా దొరగారు పెట్టిన 'తాడూ బొట్టూ' 'తాళిబొట్టై' మంగళసూత్రమైంది. మన పెళ్ళితంతులో ఈ సందర్భంలో చదవటానికి అర్థవంతమైన మంత్రాలేవీ లేవు. "మాంగల్యం తంతునా అనేన" అనే మామూలు అనుష్టుప్ శ్లోకాలున్నాయి.

బళ్ళారి ప్రాంతంలో 'కురుబా' కులం వారి పెళ్ళిళ్ళలో బ్రాహ్మణుడే వధువు మెడలో తాళిబొట్టు కడ్తాడు. అతడు తండా పూజారి అనే అర్థం. 'అరుమైక్కారన్' అనే వాళ్ళలో వధువుకి తాళి మంగలివాడు కడ్తాడు. ఆ తెగకు మంగలివాళ్లు ఆచార్యులు. ఆ వంశంలో పలువురు పిల్లలున్న మునలాడు కడతాడు 156 ఇలాటి ఆచారాలన్నీ పై అంశాన్నే బలపరుస్తున్నాయి. ఈ సందర్భంలోనే చదివే మరో మంత్రం గమనించడం అవసరం.

"కన్యాం, కనక సంపన్నాం, కనకాభరణైయుతాం,

దాస్యామి, విష్ణవేత్తుభ్యం బ్రహ్మలోక జిగీషయా'' -అంటూ కన్యాదాత పిల్లచేతిని వరుడి చేతిలో ఉంచి నీళ్ళధార వదుల్తాడు. అంటే కన్యాదానం అన్న మాట. ''డబ్బుంది, నగలున్నాయి, నావిష్ణుపృధివీపతి అయిన దొరవారూ దీన్ని బానిసగా ఏలండి.''- అని గడి ముందర మొత్తుకునేవాడన్నమాట. ఆ

తర్వాతది బ్రహ్మస్వం. బ్రహ్మలోకం అంటే కొద్దిపాటి పన్ను ఉండే భూమి (క్విట్ రెంట్). అలాగే ఈ కన్యను కూడా పన్ను లేకుండా ఉండేందుకు, దాన్నే ఆశించి అర్పిస్తున్నానని అంటాడు ఎక్కువ బహుమతులిచ్చుకోలేను అన్న అర్థం ఇందులో స్ఫురిస్తుంది. 157

ఈ మాంగళ్యధారణ ఆచారం తెలుగు దేశంలోనూ దాని ప్రభావం ఉన్న పరిసర ప్రాంతాల్లోనూ తప్ప ఇతర ప్రాంతాల్లో మరెక్కడా లేదు. తూర్పు భారతంలో పాపట సింధూరం ఉంటుంది. మహారాష్ట్రలో నల్లపూసలే ఉంటాయి. వేదాల్లో దీని ప్రస్తావనే లేదు. భారత భాగవతాల్లో లేదు. రామాయణంలో వెదికినా కనిపించదు. మన పురాణాలలో అందులోనూ 11వ శతాబ్దం నాటి స్కాంద పురాణంలో తొలిసారిగా దీని ప్రస్తావన కనిపిస్తుంది.158 రామాయణంలో జనకుడు సీత చేతిని రాముడికి అందిస్తూ

''ఇయం సీతా మమ సుతా సహధర్మచరీతవ
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా''159

అనే అంటాడు. పాణిని గ్రహించడంతో పెళ్ళితంతు ముగించాడు వాల్మీకి. తాళిబొట్టు ప్రసక్తే లేదు. అదంతా పాణిగ్రహణమే.

బర్బరయుగం లోని ఉత్తమ మహర్దశలో వ్యక్తి ఆస్తి కుటుంబ ఆస్తిగా పరిణమించడానికి అన్ని హంగులూ ఏర్పడ్డాయి. అప్పటికే 'గవేషణ' యుద్ధాల ద్వారా కండబలం కలవాళ్ళే ఆల మందలకు యజమానులయ్యారు. ఈ యుద్ధాల్లో ఓడిపోయినవాళ్ళు వ్యవసాయం తదితర వృత్తులలో దాసులుగా పనికివచ్చారు. పట్టుబడ్డ స్త్రీలు భోగకాంతలుగా ఉపయోగపడ్డారు. ఈ విధంగా దాస, దాసీ, గోగణాలు కొంత మంది కండగలవారికి సంప్రాప్తించడంతో సమాజంలో సమిష్టి తత్వం మీద వ్యష్టి తత్వం విజయం సాధించింది. సమాజంలో మొదటిసారిగా స్వతంత్రులూ, బానిసలూ అనే వర్గాలవతరించాయి. ఈ వర్గాలు ఒక పరిమితికి చేరుకున్న తర్వాత వర్గ సమాజం ఆవిర్భవించింది. దీనికే చరిత్రకారులు 'సివిలైజేషన్'' అంటే నాగరికత అని పేరెట్టారు. పాశవిక-బర్బర యుగాలంతరించాయి. కానీ నాటి సామాజిక పరిస్థితులు సముద్రాలలో దీవుల్లా అక్కడక్కడా మిగిలి ఉన్నాయి. తతిమాదంతా నాగరికత కిందికొచ్చింది. అయితే అంతకు ముందు కూడా ఆధునిక యుగ ఖండాలతోపాటు, పూర్వయుగ ద్వీపాలూ లేకపోలేదు. వ్యావసాయికగణాలు ఉత్తమ మహర్దశలో ఉన్నప్పుడు, పశుపాలకగణాలు అధమ మహర్దశలో ఉండేవి. భిన్న మహర్దశల వారి మధ్య యుద్ధాలు తరచుగా జరుగుతూండేవి.

వేదకాలంలో మనకు తెలిసిన గణాలన్నీ పశుపాలక గణాలు. నాటి వ్యావసాయిక గణాలు వీరికన్నా ఉన్నతదశలో ఉండేవి. వీరిద్దరి ఆహార

వ్యవహారాలూ రీతులూ భిన్నంగా ఉండేవి. దీనివల్ల సంఘర్షణలు కూడా జరుగుతూండేవి. ఇలాటి దశలో గుంపు పెళ్ళిళ్ళ దశ దాటనిది గౌతమ గణం. దీని పక్కనే దంపతీవివాహ దశకు చేరిన మాతంగగణం ఉండేది. ఈరెండుగణాలూ విభిన్న ఆచారాలతో పక్కపక్క నేజీవిస్తూండేవి. గౌతమగణంలో త్రిలోకసుందరి అరుంధతి. ఆ గణం ఆచారం ప్రకారం - ఆమె సంపర్కం కోసం ఆ గోత్రం లోని వాళ్ళే ఆమె చెయ్యిపట్టుకోవడానికొచ్చారు. ఈ పద్ధతిని గతంలోనే పునాలువన్‌లో వివరించడం జరిగింది. పొరుగున ఉండే ఉత్తమ దశలో ఉన్న మతంగుల దంపతీ వివాహపద్ధతి అరుంధతికి తెలిసింది. తమ గోత్రం నీతి ఆమెకు నచ్చలేదు. ఒకనాడు అందరితోపాటు ఆమె తండ్రి కూడా పాణిగ్రహణానికి అరుంధతి దగ్గరకొచ్చాడు. నాటి సంప్రదాయం ప్రకారం పిల్లలు తల్లి గోత్రాలవాళ్ళు. తండ్రి మరో గోత్రికుడు కనుక తప్పులేదు. ఈ ఆచారాన్ని ఉల్లేఖిస్తూనే యమాయమీ సంవాదంలో యమి అన్నతో వాదిస్తుంది.

"ఉశంతిమాతే అమృతా సఏ తదేకస్య చిచ్యజనం మర్త్యస్య నితే మనో మనసి దాయ్యాస్మే జన్యుః ; పతిస్తన్వ మా విభిశ్యాః'160 అంటూ బ్రహ్మ తన కూతుర్ని పెళ్ళాడలేదా అని ఉదాహరిస్తుంది.

ఇకఇక్కడ తండ్రి కోరికను అరుంధతి అంగీకరించనందుకు ఆమెను గౌతములు తమ తండానుండి బహిష్కరించారు. పక్కనున్న మాతంగుల ఆశ్రయాన్ని పొందింది. ఆమెను వాళ్ళు దత్తత తీసుకున్నారు. ఒక తండావాళ్ళు వేరొక తండా వాళ్ళను దత్తత తీసుకోవడం ఇప్పటికీ ఉంది. నిర్దిష్టమైన కర్మకాండలూ ఉన్నాయి. అప్పటి వరకూ గౌతమి అయిన అరుంధతి నాటితో మాతంగి అయింది. అయితే మతంగుల దాంపత్య పద్ధతి ఆమెకు అంగీకారం అయినా, ఆమె ఉద్దేశం ఆ పద్ధతిని గౌతముల్లో ప్రవేశపెట్టాలని. అందుకని ఎవరో ఒక మతంగుణ్ణి పెళ్ళాడటానికి ఆమె అంగీకరించలేదు. తమ గౌతమ తండాలో వాడితోనే జతకట్టాలన్నది ఆమె ఆశయం. దానికోసం వెతగ్గా వెతగ్గా ఆదే పశుపాలక గణాలకు చెందిన ఒక వాశిష్ఠుడు ఆమె అభిప్రాయాల్తో ఏకీభవించాడు అప్పుడు వాళ్ళిద్దరూ జతకట్టి ఆర్యగణాల్లో దంపతీ వివాహాన్ని మొదటిసారి ప్రచారం చేశారు. ఆచార్యత్వం వహించారు కనుకనే నేటికీ వేదవిహితాలనుకునే వివాహాల్లో పురోహితుణ్ణి వశిష్ఠుడనీ, పెద్ద ముత్తైదువను అరుంధతనీ పిలుస్తూంటారు. ఈ రకంగా వీళ్ళు ఆది గణాల్లో దాంపత్య వివాహానికి ఆది దంపతులైనారు. ఇందుకు ఆమె పడ్డకష్టాలు మన పురాణాల్లో కోకొల్లలు. ఈ సందర్భంలో "సమాజం ప్రతి మలుపులోనూ స్త్రీ సాహసగాధ-

ఆత్మార్పణం ఉండి ఉంటుందన్న"-సూక్తికి ఈ అరుంధతి కథే ఒక ఉదాహరణ. కష్టాలెన్నొచ్చినా చలించక దాంపత్య జీవితాన్ని ప్రతిష్ఠించిన అరుంధతిని స్మరించుకోవడం కొత్త దంపతులకు ఆనవాయితీ అయింది. అయితే అది అసలు కథకు మర్చిపోయి, అరుంధతీ నక్షత్రదర్శనంగానే మిగిలింది. పెళ్ళితంతులో ఈ ఘట్టం ఆఖరిది. ఈ సందర్భంలో

"ధ్రువక్షితిః ధ్రువయోనిః ధ్రువమసిధ్రువతః
స్థితంత్వం నక్షత్రాణాం మేధ్యసి సమాపాహిపృతన్యతః"
"సప్తర్షయ ప్రథమాం కృత్తికానాం అరుంధతీ యత్ధ్రువతాం
హనిన్యుః షట్కృత్తికా ముఖ్యయోగం వహతీయం
అస్మాకం ఏతత్వష్టమీ."

ఈ భూమి, స్త్రీ ఉత్పత్తి స్థానమే స్థిరమైనవి నీవూ అలాగే స్థిరమైనదానవు. సప్తరుషులూ నక్షత్రాలలో అరుంధతిని స్థిరమైనదిగా చూశారు. వారి భార్యలూ అరుంధతి ప్రాధాన్యాన్నంగీకరించారు. అరుంధతిని చూసిన ఈమె ఎనిమిదవ కృత్తికగా వర్థిల్లుతుంది. తాను ఎనిమిదవ రుషి అన్నమాట. ఇంతకుమునుపు వివరించిన అర్థం ఇందులో కొంతకుకొంత స్ఫురిస్తుంది.

నాగరిక సమాజం: సమాజంలో సంపద బాగా పెరిగింది దాంతో పురుష ప్రాజాపత్యం కూడా పెరుగుతూ వచ్చింది. ఇదే మేరకు స్త్రీ వాల్లభ్యం తగ్గుతూనూ వచ్చింది. ఆస్తి ఒక స్థాయికి చేరిన తర్వాత పురుషుల ఆస్తి పురుషులకే సంక్రమించాలన్న కోరిక పుట్టడం అసహజం కాదు. ఆ దశలో సమాజం ఒక్కసారి శీర్షాసనం వేసినట్టయింది. సంతానాన్ని స్త్రీ పరంగా కాక పురుషపరంగా లెక్కించటం మొదలుపెట్టారు. పిల్లలు తండ్రి గోత్రానికి చెందుతారు గానీ గతంలో లాగా తల్లి గోత్రానికి చెందరు. అయితే దంపతీ వివాహం కుటుంబ సౌలభ్యాన్ని కల్పించిందే కానీ గుంపు పెళ్ళిళ్ళ పద్ధతిని పూర్తిగా రద్దు చెయ్యలేకపోయింది. పైగా 'గవేషణ', 'నరేషణ' మూలంగా యుద్ధాల్లో సంక్రమించిన దాసీజనంతో బహుభార్యాత్వం అనే కొత్త పద్ధతి ఒకటి వచ్చింది. ముర్డక్ పండితుని పరిశోధనల ప్రకారం 250 సమాజాలలో 195 సమాజాలు దీన్ని పాటిస్తున్నాయట.161 దీన్ని మొదట అనుమతించింది ఐతరేయ బ్రాహ్మణం. ఋగ్వేద కాలంలో అధిపతులు మాత్రమే బహుభార్యాత్వాన్ని అమలుపర్చేవారనీ, క్రమంగా యజుర్వేద కాలానికి సామాన్యజనంలో కూడా ఈ ఆచారం ప్రబలంగా ఉందనీ ఉషా ఆప్టే అంటారు.162 మెగస్తనీసు, అల్ బిరూనీ తమ యాత్రాగ్రంథాల్లో దీన్ని పేర్కొన్నారు 'పునాలువన్' సంప్రదాయంలో కూడా ఒక వ్యక్తికి

వాయి కల్సిన స్త్రీలంతా భార్యలే. అలాగే స్త్రీకి కూడా. కనుక బహుభార్యాత్వంతోనే బహుభర్తృత్వాలు కూడా ఆ కాలంలోనే ఉన్నాయి. కానీ దాసీజనం వల్ల వచ్చిన బహుభార్యాత్వానికీ, 'పునాలువన్' దశలోని బహుభార్యాత్వానికి ఒక భేదం ఉంది. రెండోదానిలో ప్రతి స్త్రీ మీదా ప్రతి పురుషుడికీ హక్కుంటుంది. దాసదాసీజనం వల్ల వచ్చిన సంప్రదాయంలో, యజమానికి తప్ప ఆ స్త్రీలపై ఇతరులకు న్యాయరీత్యా హక్కులేదు. పునాలువన్ దశలోని బహుభార్యాత్వ, బహుభర్తృత్వ అవశేషాలు ఇప్పటికీ కేరళలోని నాయర్లలో అక్కడక్కడా కనిపిస్తూంటాయి. కొందరు కల్సి ఒక ఒప్పందం మీద ఒక స్త్రీతో సంసారం చేస్తూంటారు. ఒకే వ్యక్తి ఇలాంటి ఒప్పందం అనేక గుంపులతో చేసుకోవచ్చు. ఒక గుంపులోని మేరకు అది బహుభర్తృత్వం అయితే మరో గుంపుతో సంబంధంతో అది బహుభార్యాత్వం అవుతుంది.

కానీ నాగరిక సమాజంలో ఏర్పడ్డ బహుభార్యాత్వం దీనికి విరుద్ధం. యజమానికి అంటే భర్తకు భార్యలు సొంత ఆస్తి కింద మారారు.

దాసదాసీజనం ఎందరున్నా ఒక్క స్త్రీనే ఎంచుకొని ఆమెకు పుట్టిన బిడ్డకే ఆస్తిని సంక్రమింపచెయ్యాలన్న ఆలోచన ఈ దశలోనే వచ్చింది. దీనికి కట్టుదిట్టం చేసి అన్యపురుష సంపర్కం లేకుండా చూసుకొని ఆమెకు పుట్టిన బిడ్డనే తన బిడ్డగా భావించి ఆస్తినిచ్చేవాడు. ఆమెకు పుట్టిన బిడ్డే రాజ్యాధికారి కాగల అధికారం ఉంది. హక్కుంది.163 ఈ హక్కులను కోరుతూనూ, రక్షించుకుంటూనూ ఉన్న అనేక కదలు మనకు ఇతిహాసాలూ, పురాణాలలో చాలా కనిపిస్తాయి. శంతనుడు సత్యవతుల కథలో భీష్ముడిచ్చిన వరం; దుష్యంతుడి నుండి శకుంతల కోరిన వరం ఇలాటివే కావచ్చు 164 మొదటి భార్యను 'మహిషీ' అనీ, ఇష్టసఖి అంటే రెండవది 'వవాతా', తర్వాతది 'పరివృత్తా' అనీ అనేవారు దీన్ని శతపథ బ్రాహ్మణం వివరించింది. ఈ రక్షణలో మిగిలిన స్త్రీల సంతానానికి ఆస్తి హక్కు లేనందువల్ల వారికి రక్షణ కట్టుదిట్టాలంతగా ఉండేవికావు. వీరందరూ ఆస్తిలో భాగంగానే ఉండేవారు. వీరిని అమ్మవచ్చు దానం చెయ్యవచ్చు. కుదువ పెట్టవచ్చు చివరకు చంపి తిననూ వచ్చు.165

"ఋణానుబంధ రూపేణా పశుపత్నిసుతాలయాః" అనే సూక్తి ఈ పై అంశాన్నే తెలుపుతుంది. భార్యను దానం చెయ్యటమనే సంప్రదాయాన్ని తెలిపేదే 'దైవం' అన్న వివాహపద్ధతి. ఇందులో రాజు భార్యను కానీ, కుమార్తెను కానీ యజ్ఞ సందర్భంలో ఋత్విక్కుకు దానం చేస్తాడు.

"ఋత్విజే వితతే కర్మణి దద్యాదలంకృత సద్దై వరి"

"దక్షిణా సుదీయమానా స్వాంతర్వేది యద్వృత్విజే సద్దై వః"

(బోధాయన సూత్రం)

దీన్ని స్మృతికారులంతగా అంగీకరించలేదు అయినా జరిగేవసటం సత్యం. క్రమేణా ఉత్తమ వివాహాల్లో ఇదీ ఒకటైంది.

ఇక అంతఃపురరక్షణ లేని స్త్రీలల్లో సహజంగానే స్వైరవిహారం ఉండేది. ఇక్కడ ఇది ఏకపత్నీ దశ అని అన్నా నిజానికి బహుభార్యాదశ పట్టపు రాణులు స్వైరులన్నాం కనుక బహుభర్తృత్వ దశ కూడా అని గమనించాలి. ఈ సందర్భంలో రిస్లే పండితుని అభిప్రాయాన్ని కూడా పరిగణించడం మరింత స్పష్టతకు దారి తీస్తుంది.

"బహుభర్తృత్వానికి సంబంధించిన సమాచారం ప్రకారం ఇది రెండు విధాలు. మొదటిది సహోదర పరంపర. ఇందులో సోదరులంతా కలిసి ఒక స్త్రీని వివాహమాడతారు. రెండవదానిలో ఒక స్త్రీకున్న భర్తలందరూ సోదరులు కావలసిన అవసరం లేదు. ఇది మాతృస్వామికం." 166

కాణే పండితుడి అభిప్రాయంలో ఈ ఆచారం వేదకాలంలో లేదని. కానీ ఎన్. సి. సర్కార్, సర్వదామన్ సింగ్ లాటి ప్రముఖులు ఈ ఆచారం రుగ్వేదకాలం నుండీ ఉందని ధ్రువీకరించారు. భారతంలో ద్రౌపదీ వివాహ సందర్భంలో ద్రుపదుడు లేవనెత్తిన అనుమానానికి ధర్మరాజు, 'జటిల' అనే స్త్రీ ఏడుగురు రుషుల్నీ, 'వరాక్షి' అనే ఆమె పదిమంది అన్నదమ్ముల్నీ పెళ్లాడిన ఉదంతాలు చెప్పి శంకా నివృత్తి చేస్తాడు.

అలాగే రామాయణకాలంలో వాలి, సుగ్రీవులకు తార, రుమా అనేవాళ్ల ఉమ్మడి భార్యలు. అలాగే ఒకే స్త్రీకి ఇంద్రుడూ, సూర్యులవల్ల వాలి సుగ్రీవులు జన్మిస్తారు. ఇప్పటికీ హిమాలయ ప్రాంతాల్లోని తెగల్లోనూ; ఖాసా, తోడా తెగల్లోనూ ఈ బహుభర్తృత్వం ఆచారం విధిగా ఉంది.

కుటుంబ ఆస్తి అవతరణతో స్త్రీ ప్రాజాపత్యం నశించిందన్న అంశం తెలిసిందే. పురుషస్వామ్యం ఏర్పడింది. దానితో ఏకపత్నీత్వం, ఏకపత్నీ వ్రతం అన్న 'అందమైన' పదబంధాలు కూడా అవతరించాయి. దీనితోబాటే బహుభార్యాత్వం, బహుభర్తృత్వం, వ్యభిచారం, విటస్వైరిణీ వ్యవస్థలూ-ఒకే ముహూర్తంలో ఆవిర్భవించాయని ఎంగెల్సు అభిప్రాయపడ్డాడు. అంశలు అధికంకావడం, స్త్రీ బానిసగా మారడం, పురుషాధిపత్యం సమాజాన్నేలడంతో ఈ లక్షణాలన్నీ వచ్చాయని ఊహించాలి.

ఇవన్నీ జవనసరళితోనూ, సంపద ఉత్పాదన సౌలభ్యంతోనూ ఏర్పడ్డ పరిణామాలు. సమాజం నూతనదశలో ప్రవేశించిన వెంటనే అన్నీ కొత్త లక్షణాలే ఉండవు. పాత లక్షణాలంత సులభంగా అంతరించిపోవు. కానీ పాత కొత్తల ఘర్షణలో కొత్తవి పాతవాటిని జీర్ణంచేసుకుంటాయి కనుక ఒకసామాజిక దశలో అన్నివిధాలైన వివాహ పద్ధతులుండడానికి అవకాశం ఉంది. లేకపోతే అవశేషాలన్నా మరో రూపంలో వుంటాయి. అందుకనే మానవ పరిణామ దశల్లో వివిధ స్థితుల్లో వచ్చిన వివాహావశేషాలను ఆధునిక వివాహవ్యవస్థలో కూడా చూస్తున్నాం. అర్థాలు తెలియవు. ఏ కారణంతో అవి ఏర్పడ్డాయో చూడం. ప్రస్తుతానికి వాటి అవసరం ఎంతుందన్న ఆలోచన వుండదు. అన్నీ సంప్రదాయం పేరు కింద చెలామణీ చేస్తున్నాం. ఈ స్థితి ప్రపంచంలోని అన్నిమతాల వివాహ సంప్రదాయాల్లోనూ వుంది. శాస్త్రీయదృష్టితోనూ, చారిత్రక అవగాహనతోనూ, సత్యాన్వేషణాజిజ్ఞాసతోనూ పరిశీలించాలన్న భావం ఉన్నవారికి ఇదంతా ముంగొంగు బంగారం. ఆ భావంతోనే ధర్మారావు ఈ వ్యాసాలను రాశాడు.

ధర్మారావు 'పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు' వ్యాసాలకు 'చిన్న మనవి' అని రాస్తూ మానవ జీవిత పరిణామం విషయం గమనంలోకి తీసుకోవా లన్నాడు. ''ఎన్నో అంచెలలో మార్పులుచెంది ఈ నాడు ఈ రూపంలోనికి వచ్చారు.. అలాగే పెళ్ళి సంగతి కూడాను" అని అన్నాడు. (పేజి V, VI)

ఈ వ్యాసాలు రాసేనాటికి సామాజిక శాస్త్రాలలో వివిధ దేశాల పరిశోధనా గ్రంథాలను ధర్మారావు క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు మానవశాస్త్ర పరిశోధకులందరికీ వుండాల్సిన నిష్పక్షపాత బుద్ధి వీరికి అలవడింది. ఇటువంటి సామాజికాంశాలను ఇతర సంస్కృతులతో అంచనా కట్టాలంటే, అభిమాన దురభిమానాలు ఉండకూడదు. ఈ అంశాన్నే ధర్మారావు ఇలా ప్రకటించాడు.

"మహామేధావులైన విదేశీ పరిశోధకులు, అభిమానాలకు లొంగిపోకుండా, భిన్నభిన్న నాగరికతల గురించి అనేక గ్రంథాలు వ్రాశారు వారికి సాధారణంగా భారతీయ సంప్రదాయాలూ ఆచారాలూ తెలియవు. మన పరిశోధకులు చాలామంది స్వాతిశయముతో ఇతర నాగరికతలను లెక్కలోనికి తీసుకోరు. తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం. ఈ రెంటిని సమన్వయము చేయడమూ, సమ్మేళనకు ప్రయత్నించడమూ అవసరమనే-నేనీ రచనకు పూనుకున్నాను''. (పేజి VII)

దీనివల్ల ధర్మారావు రచనోద్దేశం తెలుస్తుంది. ఈ రచన వెనక తానెంతటి పరిశోధక దీక్షనూ, లక్షణాలనూ అవలంబించాడో చెప్పినట్టయింది. అలా

రచన చేయడం, అందులోనూ ప్రతి వ్యక్తికీ అంతో ఇంతో ఆచారరూపంలో అనుభవంలో ఉన్న పెళ్ళి గురించి ఏమంత తేలికైన పనికాదు. అటు సనాతనులకు మింగుడు పడని అంశాలుంటాయి. ఇటు అధునాతనులకు కొరుకుడు పడని కారణాలుంటాయి. అందుకే "ఇది ఎదురీత - తలలో నాటుకున్న విషయాలకు విరుద్ధం" (పేజి VII) అన్న స్పృహతోనే ఈ రచనలో 'నూటికి నూరు పాళ్ళూ సప్రమాణమయిన విషయాలే, సత్యాన్ని పాఠకులకందించాలనే గాని వారిని మోసపుచ్చాలని ఈ రచనకు పూనలేదు" అని నిర్దిష్టంగా ధర్మారావు చెప్పాడు.

మన వ్యవహారంలో 'పెళ్ళి' అన్న పదానికి -

1. పరిణయం 2. ఉద్వాహం 3. కళ్యాణం 4. పాణిగ్రహణం 5. పాణిపీడనం 6 పాణిబంధం 7. దారోపసంగ్రహం 8. దారపరిగ్రహం 9. దారకర్మ 10. దారక్రియ - అన్న పర్యాయపదాలున్నాయి.[167] ఇవన్నీ సంస్కృత పదాలు.

'పెళ్ళి' అన్న పదానికి ఉత్పత్తి చూడాలంటే దీన్ని శ్రీ కాళహస్తీశ్వర మహత్యంలో "పెణ్ణాసయు, మణ్ణాసయు, పొణ్ణాసయు'' అన్న ప్రయోగంతో చూడాలి. ద్రావిడ భాషలో 'పెణ్' అంటే పిల్ల. పై ప్రయోగంలో 'పెణ్ణాస' అంటే పిల్లమీద ఆశ అనే అర్థం. 'ఇల్' అంటే ఇల్లు. 'పెణ్ ఇల్' అనేదే పెండిలి, పెండ్లిగా మారి ఆఖరికి పెళ్ళి అయింది. ఈ విషయాన్ని గూడా ధర్మారావు గ్రహించాడు. (పేజి 64) దీంతో - ఇంతకుముందే సమాజ పరిణామ దశల్లో స్త్రీ కుటుంబంలోకి ఎలా వచ్చి చేరిందో చర్చించినదానివల్ల వారి- అర్థ వివరణ సబబైందనే అనిపిస్తుంది.

అయితే, మిగిలిన పదాలకున్న అర్థాలనుకూడా పరిశీలిస్తే అనేక దశల్లో, ఈ పెళ్ళి వ్యవస్థలో వచ్చిన పరిణామాల అంచెలు కొంతకుకొంత కనిపిస్తాయి పరిణయం అంటే నడిపించుకుపోవడం. పిల్లకు దబ్బిచ్చి నడిపించుకొని తమ తండాలోకి తీసికెళ్ళే సంప్రదాయార్థం ఇందులో ఉండవచ్చు వ్యవసాయం, నాగరికతలో భాగం అయిన తర్వాత స్థిరనివాసం ఏర్పడటం జరిగింది. ఒక తండాలో ఉంటూ పనిపాటల్లో కలిసొస్తూ సంపదుత్పత్తిలో పాలు పంచుకునే పిల్ల, మరో తండాలోకి పోవాలంటే సామాన్యం కాదు. దీనికి పరిహారార్థంగా గొర్రెలో, ఆవులో ఇచ్చి ఆమెను తన తండాకు నడిపించుకెళ్ళేవారు దీనికి క్రమంగా సప్తపదులకూ అర్థంలేని లంకె వేశారు. ఇలాటి పెళ్ళితంతును ఇంగ్లీషులో 'లీడింగ్ టు అల్టార్' అని కూడా అంటారు. ఇన్ని ధర్మారావు చాలా విపులంగా వర్ణించాడు 'పరిణయం' అన్న భాగంలో.

'సఖ్యం సా సప్తపదీన ముచ్యతే'-అన్న లోకోక్తితో సప్తపదిని దీనికి కలిపారు. అయితే సప్తపదుల మంత్రార్థం చూస్తే అందులో ప్రధానంగా స్త్రీ, తాను వెళ్ళే తండా అభివృద్ధికి పిల్లల్ని కనటం అన్నదే ఆశించినట్టు కనిపిస్తుంది.

| | | |
|---|---|---|
| 1. ఏకమిషే విష్ణుస్త్వా అన్వేతు | - | విష్ణువు నీకు శక్తి ఇవ్వటానికి అనుసరిస్తాడు. |
| 2. ద్వే ఊర్జే విష్ణుస్త్వా అన్వేతు | - | బలం ఇవ్వటానికి విష్ణువు నిన్ను అనుసరిస్తాడు. |
| 3. త్రీణి వ్రతాయ విష్ణుస్త్వా అన్వేతు | - | వ్రతం కోసం విష్ణువు అనుసరిస్తాడు. |
| 4. చత్వారి మయోభవాయ విష్ణుస్త్వా అన్వేతు | - | ఆనందం కోసం విష్ణువు అనుసరిస్తాడు. |
| 5. పంచపశుభ్యో విష్ణుస్త్వా అన్వేతు | - | ఇంద్రియ కార్యాల్లో పుష్టికోసం అనుసరిస్తాడు. |
| 6. షడృతుభ్యో విష్ణుస్త్వా అన్వేతు | - | ఋతుకాలం కోసం విష్ణువు అనుసరిస్తాడు |
| 7. సప్తభ్యో హోత్రాభ్యో విష్ణుస్త్వా అన్వేతు | - | ఇంట్లో చేసే హోమాల కోసం అనుసరిస్తాడు. |

ఆ తర్వాత చదివే - ''సఖాసప్తపదాభవ ..ఇష మూర్జమభిసంవసానౌ సంనౌమనాగ్ంసి సంవ్రతా సముచిత్తాన్యాకరం''-అన్న మంత్రంలో ప్రధానంగా ఇద్దరూ నిండు మనస్సుతో ఆహారాన్ని పెంపొందిస్తూ, బలాన్ని సంపాదిస్తూ కలిసి ఉండాలని కలిసి ఆలోచించాలన్న ఆకాంక్షే కనిపిస్తుంది. మానవుడు ప్రకృతిలోని విషయాలను కూడా తనకున్న అనుభవాలతో పోల్చుకుంటూ ఊహించుకునేవాడు. ఆకాశం పురుషుడనీ, భూమి స్త్రీ అనీ తలచేవాడు వీరి సంగమంవల్ల తండా అభివృద్ధి చెందినట్లే ఆకాశం నుండి వానపడ్డ తర్వాత భూమిమీద మొక్కలు మొలవటాన్ని చూసి ఆ రెంటికీ ఈ భావాన్నే ఊహించాడు. ఇలాటి భావనలను మానవ శాస్త్రజ్ఞులు 'కాస్మాలిజీ' అని అన్నారు ఫ్రేజరు దీన్ని చాలా విపులంగా వర్ణించాడు. సప్తపది తంతులో చివరి మంత్రం -

''సాత్వమస్యమూహ మమూహ మస్మిస్వాత్వం ద్యౌరహం పృథివీ త్వగ్ం రేతోఽహగ్ం రేతో భృత్య మనోఽహమస్మి వాక్త్వగ్ం సామాఽహ వస్మృక్తగ్ం సామామనువ్రతాభవ పుగ్ం సే పుత్రాయ వేత్తవ ఏహి సూనృతే''-అన్నది.

దీనిలో ప్రధాన భావం ఇలా ఉంది. సంభోగక్రియలో నేను ఆకాశాన్ని. నీవు భూమితో సమానం. నేను వీర్యాన్ని విడిస్తే నీవు గ్రహిస్తావు ..నీవల్ల భోగభాగ్యాలుండే కొడుకులు కావాలి. ఇటురా.

ఇంతటితో స్త్రీకి తన తండా ఆచార వ్యవహారాలతో సంబంధం పోతుంది. తనను నడిపించుకెళ్ళిన కొత్త తండా ఆచారాలతో మెలగాలి. ఈ విధంగా 'ఓలి' ఇచ్చి స్త్రీని తీసికెళ్ళే ఆచారం సంపదుత్పత్తిలో భాగస్వామిగా ఉన్నప్పుడు ఏర్పడితే, ఈనాడిది తల్లకిందులైంది. అర్ధరహితం కూడా అయింద. మన హిందూ వివాహ న్యాయంలో సప్తపది ప్రముఖ స్థానమాక్రమించింది. దక్షిణ భారత దేశంలో స్వాభిమాన ఉద్యమం ముమ్మరంగా సాగి పెళ్ళి తంతులో మార్పు తెచ్చింది. అందులో ఈ సప్తపది లేదు. తర్వాత ఆస్తి వ్యవహారాల్లో న్యాయస్థానం దీన్ని పెళ్ళిగా గుర్తించని ప్రమాదం కూడా ఏర్పడింది.168 కాలక్రమేణా ఈ ఆటంకం కూడా చట్టం నుండి తొలగిపోయింది.

తర్వాతిది ఉద్వాహం. అంటే పైకెత్తటం ఎత్తుకొని పోవటం తన తండాలో పిల్లను చేసుకోకూడదు. ఇతర తండానుండి తెచ్చుకోవాలి. దీన్నే ఎగ్జోగమీ అనంటారు. ఇలా ఎత్తుకొచ్చి పెళ్ళి చేసుకునే శక్తి ఉన్న వాడే పెళ్ళాడటానికి అర్హుడు. కృష్ణుడు రుక్మిణిని పెళ్ళాడినా, భీష్ముడు తమ్ముడి కోసం పిల్లలను తెచ్చినా, సుభద్రను అర్జునుడూ చివరకు ఎత్తుకెళ్ళినా ఈ ఆచారబలమే గ్రీకు నాగరికతలో కూడా ఈ ఆచారప్రసక్తి ఉంది. 'కొట్టుకోక పోతే కట్టుకోవడం లేనే లేదని'-బెర్జెత్ పండితుడి అభిప్రాయం. ఈ సందర్భంలో ధర్మారావు అనేక ఉదాహరణలిచ్చాడు. (పేజి 90-91)

'మూర్ధానాం పత్యురారోహ'-అనీ, 'వరారోహ' అంటే 'ఆలు' అన్న అర్థాలన్నీ ఈ ఆచారం ఆధారంగా ఏర్పడ్డవే అనవచ్చు. టిబెట్, కొరియా, భూటాన్ ప్రాంతాల్లోని తెగల్లో ఇప్పటికీ ఉంది. మన వివాహాల్లో చివరకు నాగవల్లి నిష్ఠూరమంటూ చిన్న కల్లయుద్ధం జరుగుతూంటుంది. వీటన్నిటినీ సమర్థిస్తూ బ్రిఫాల్ట్ అనేక ఉదంతాలిచ్చాడు. గోండు తెగవారు దీన్ని అభినయిస్తారు వధువు కూడా ఏడుస్తూ పెడబొబ్బలు పెట్టి నటిస్తుంది. అయితే ఈ వివాహాన్ని రాక్షస వివాహం అంటూ సనాతనులు ఈసడించారు. క్షత్రియుల్లో ఇది ఇప్పటికీ సదాచారం కిందే లెక్క.

తర్వాత 'కళ్యాణం' అంటే సుఖప్రదమైందన్న అర్థం తప్ప పెళ్ళి అనే అర్థం లేదు. "కళ్యాణాద్భుతగాత్రాయ కామితార్థప్రదాయనే'' అనడంలో ఈ సుఖాన్నిచ్చే శరీరమన్న భావనే ఉంది. ఆలుమగల కలయికవల్ల సుఖం. తర్వాత కుటుంబం వృద్ధి అవుతూ తండా పెరగటం వల్ల ఆహార పౌష్కల్యం

తద్వారా సుఖం అనే దీని అర్థం. ఇవన్నీ కలిగించే కార్యక్రమం కనుక పెళ్ళిని కళ్యాణం అంటారని ఊహించవచ్చు. ఇందులో కూడా ఆదిమ తెగల భావమే కనిపిస్తుంది. కళ్యాణం బొట్టు ఆకారంలో కూడా స్త్రీ మర్మావయవపు చిహ్నమే ఉండటం గమనార్హం. ఈ భావం గుంపు పెళ్ళిళ్ళ దశనుండి దంపతీ వివాహాలు రాబోయే దశ వరకూ స్త్రీ పురుష సంబంధాల్లో ఉంది స్త్రీ ప్రాజాపత్యం లోనూ, పురుష ప్రాజాపత్యపు తొలిదశలోనూ కొంత వరకు కనిపిస్తుంది. ఇది ఆడ, మగల పరంగా ఉన్న మాట.

ఇక పాణిగ్రహణం. ఆడ, మగలు వారి వారి ఆగారాల్లో ఉంటూ కొంత కాలానికి సమయ సంకేతాలేర్పర్చుకొని చెట్టాపట్టాలేసుకుని అడవుల్లోకి వెళ్ళడం. తాము వివాహం చేసుకోబోతున్నామంటూ పిల్ల తండ్రికి చెప్పిన తర్వాత ఆ పిల్లకా తండాతో సంబంధాలు తెగిపోతాయి. ఈ ఆచారం దంపతీ వివాహాల దశ ముందు వరకూ సాగి ఉండవచ్చు. ఏకపత్నీవ్రతం వచ్చే కాలం నాటిది. అందుకనే వాల్మీకి రాముడి పెళ్ళిని కేవలం "పాణింగృహీత్వా పాణినా"- అంటూ ముగించాడు. ఇతిహాసాలూ పురాణాల్లో 'పాణిగ్రహణం' జరిగినట్టే ఉందిగాని అంతకు మించి కనిపించదు. పాణిపీడనం అన్నా, పాణిబంధనం అన్నా ఇదే. ఇప్పటికీ పెళ్ళిళ్ళలో ఇద్దరూ చేతులు పట్టుకొని అగ్నిని చుట్టి తిరుగుతూంటారు. ఆ సందర్భంలోనే 'పాణిగ్రహణాఖ్య కర్మ కరిష్యమాన' - అని మంత్రం చదువుతారు.

దారోప సంగ్రహం, దార పరిగ్రహం, దార కర్మ, దార క్రియ అన్న పదాలన్నీ పూర్తిగా నాగరిక సమాజం ఆవిర్భవించి పితృస్వామ్యం బలపడ్డ తర్వాత వచ్చినవి ఎందుకంటే దానం వల్ల వచ్చింది దార అంటారు. కన్యాదానం అన్న స్పృహ, వర్గసమాజంలోనే, అదీ స్త్రీ దానం చేసే ఒక వస్తువు, బానిస అయిన తర్వాతనే. ఈ భార్య బానిస కావటం అదే ఫామిలీ అనడం, దాన్ని మోర్గాన్ తన ఏన్షియంట్ సొసైటీ అన్న గ్రంథంలో చక్కగా వివరించాడు. క్షేమేంద్రుడు తన అవధాన కల్పలతలో స్త్రీని పురుషుడు ఎలా అయినా దానం చెయ్యవచ్చునంటాడు. 'శ్రీసేన' అనే 'అరిష్ట' దేశం రాజు తన భార్య జయప్రభను గురువుకిచ్చి పెళ్ళిచేస్తాడు బౌద్ధజాతక కథలూ ఇలాటి ఆచారాలను చాలా పేర్కొన్నాయి. అందులో విశ్వపురి రాజు కథ, 'వెస్సంతర' కథ అలాటివే భారతం అనుశాసనిక పర్వంలో ఓఘవతీ సుదర్శనుల వృత్తాంతం ఇలాటిదే. రాహుల్ సాంకృత్యాయన్ తన 'ఓల్గా నుండి గంగా తీరం వరకు' అన్న గ్రంధంలో కాశీ బ్రాహ్మలకు భార్యాదానం చేయటాన్ని ప్రస్తావిస్తాడు. ఈ దాన సమయంలో నేడు -

"అష్టవర్షాత్ప్రియం కన్యా పుత్రవత్ పాలితామయా
ఇదానీం తవదాస్యామి దత్తాం స్నేహేన పాలయ" - అని మంత్రం చదువుతారు. తండ్రి కుమార్తె చేతిని వరుడి చేతిలో ఉంచి సీళ్ళోదుల్తాడు. దాసీగా పంపుతున్నానంటాడు. ఇక్కడ కన్య అంటే పెళ్ళికానిది అనీ కోర దగినది అనే అర్థం. కన్యార్థాన్ని బంకుపల్లి మల్లయ్యశాస్త్రి చాలా వివరంగా తమ వివాహతత్వంలో చర్చించాడు.

ఈ భార్యా దానం అన్నది కొరియాలో క్రీ.శ. 1000 - 1400 సంవత్స రాల వరకూ బాగా అమల్లో ఉండేది. తన అప్పుల్ని విడిపించుకోవడానికి భార్యను దానం చేసేవాడు.169 పిల్లల్ని, బానిసలనూ ఇవ్వడం కూడా ఉంది. థాయిలెండ్‌లో మంగ్‌కుట్ రాజు (1850 - 1868) నిషేధం పెట్టే దాకా భార్యలను వాళ్ళ అనుమతి లేకుండా అమ్ముకొనేవాళ్ళు. అలాగే 15 సంవత్స రాల పైబడిన కూతుళ్ళను కూడా అమ్ముకునేవాళ్ళు.170 పురాణ కాలంలో హరిశ్చంద్రుడు చేసింది ఇలాటి ఆచారం కిందికే వస్తుంది.

ఈ విధంగా పెళ్ళికున్న పర్యాయ పదాలన్నీ కొన్ని కొన్ని సమాజాల ఆచార దశలను తెల్పుతున్నాయని అనడంలో సందేహం లేదు. ఇదంతా ధర్మారావు ఆలోచించే 'పెళ్ళి' అంటే ఖచ్చితంగా అందరికీ ఆమోద యోగ్యమైందీ అర్థమయ్యేదీ అంటూ, ఇలా ఏ ఒక్క నిర్వచనమూ లేదన్న భావం వ్యక్తపరిచాడు. "ఈ పెళ్ళి అన్నది ప్రపంచంలో ఒక దారినా, ఒక తెన్నునా ఉన్నట్టు కనబడదు" అని అంటూనే (పేజి 3) దీన్ని గురించి వివరించడానికి పూనుకున్నాడు.

ఈ పుస్తకంలో సుమారు 25 చిన్న చిన్న ప్రకరణాలను రాశారు. మగ, ఆడ అన్న తెగలు ప్రకృతిలో ఆవిర్భవించాయి. జతకట్టడం ప్రకృతి పని అయితే పెళ్ళి అన్నది మన పని. దీనికి ప్రకృతితో సంబంధంలేదు. బుద్ధి ఉన్నవాడెవ్వడూ ప్రకృతికి వ్యతిరేకంగా నడవడు జతకట్టడం అలాటిది. దీనికి వయసూ, రూపం, గుణం, ప్రేమ వంటివాటితో పనిలేదన్నది. ప్రాచీన తండాల్లో స్త్రీ పురుషుల మధ్య సంబంధ బాంధవ్యాలు చూస్తే అర్థ మవుతాయి. ఆఫ్రికాలో బాగా ముసలివాళ్ళు పడుచుపెళ్ళాలతో కాపురం చేస్తూంటారు. ఈ ఆడవాళ్ళు ఇష్టం వచ్చిన ఇతరులతో జతకట్టడం తప్పుగా భావించరు. 171 (పేజీ 77) ఇక మనకున్న, ఇంతకు ముందు వివరించిన అష్టవిధ వివాహాల్లో ఎందులోనూ మనసూ, ప్రేమకు స్థానం లేదనీ కేవలం సంతానోత్పత్తే ప్రధాన అంశమన్నది గమనించవచ్చు నాగరిక సమాజం వచ్చిన తర్వాత రూపానికి ప్రాధాన్యం ఇవ్వటం జరిగి హెచ్చరికగా

'భార్యా రూపవతీ శత్రుః' అయింది కానీ అంతకు పూర్వమాభావన ఉన్నట్టే కనిపించదు పొలినీషియా చరిత్రను బాగా అధ్యయనం చేసిన మలినవాస్కీ 'మగడు పెళ్ళాం అన్న ప్రేమ లేదు. భర్త చచ్చి నాలుగురోజులన్నా కాక ముందే తనకేం జరగనట్టు ఆమె మరోడితో జతకడ్తుందని' చూసింది రాశాడు (పేజీ 6.). కుమారి కింగ్ స్లే అన్న పరిశోధకురాలు కూడా ఆఫ్రికాలో దంపతి ప్రేమ ఎక్కడా కనిపించదని రాసింది. ఇక బ్రిటిష గయానాలో ఇండియన్ తెగల్లో పడుచువాడు ముందో ముసలిదాన్ని పెళ్ళాడ్తాడు. ఆమె చని పోతేనో, కొంత కాలం తర్వాతనో మరో యువతిని అతడు పెళ్ళాడవచ్చు.

ధర్మారావు 'మేనరికా'లను గురించి రాస్తూ ఇది కేవలం లైంగిక సంబంధం అన్న 'మేహన' పదంతో వచ్చిందన్నాడు. ఆరుద్ర ఇది 'మేన' అంటే శరీరం అన్న అర్థం నుండి వచ్చిందన్నాడు. ఏమైనా దీని తత్వంలోకి పోయి విచారిస్తే 'ఎగ్జొగమీ' లక్షణంగా చూడవచ్చు. తండాలో నిషేధాలు వచ్చిన తర్వాత వీటిని నిషేధించి ఉండవచ్చు. వంశ రక్తం పవిత్రత కోల్పోకుండా ఉండటానికి ఈజిప్టు రాజవంశాల్లో అన్నా చెల్లెళ్ళ మధ్య సంబంధాలుండేవని బ్రిఫాల్ట్ రాస్తాడు. ఈజిప్టు 19,20 రాజరిక వంశాల్లో ప్రతి రాజూ తన చెల్లెల్ని పెళ్ళాడి రాజవంశానికీ, రాజ్యానికీ వారసుణ్ణి కనేవాడు. ఆ సంబం ధాలు చాలా ఆరోగ్యవంతంగా, దృఢంగా కూడా ఉండేవట. సేతి, రామేసెస్ లాంటి దృఢకాయులు ఈ సంబంధాల పర్యవసానమే నంటాడు బ్రిఫాల్ట్.[172] ఈ బాంధవ్యాలే ఇప్పటికీ మేనమామ మేనకోడళ్ళ వరుసలుగా క్రమంగా వేలువిడిచిన బాంధవ్యంలో అవుతాయి. వీటినే మేహన జట్టులు అంటూ అవే మేనరికాలని ధర్మారావు సమర్థించాడు. (పేజి 48)

అదే విధంగా 'అక్కమగడే అందరికీ మగడు' అన్న ప్రకరణంలోనూ, 'నిషేధాలే నిదర్శనం' అన్న ప్రకరణంలోనూ 'లెవిరేటు', 'సొరొరేటు', సంప్రదాయాలను విశదీకరించాడు.

'ఏమగడూ లేకపోతే అక్కమగడే గతి'- అన్నదొక సామెత. భార్య చనిపోతే ఆమె చెల్లెల్ని వివాహం చేసుకునే సంప్రదాయానికిది సాక్ష్యం ఒక స్త్రీకి పెళ్ళయితే ఆమె చెల్లెళ్ళందరికీ మగడున్నట్టే లెక్క. దీన్ని 'సొరొరేటు' అంటారు. అదే విధంగా అన్న భార్యను పెళ్ళాడటం 'లెవిరేటు' అంటారు. వీటినే నియోగం' వివాహాలనవచ్చు. అతి పురాతన హీబ్రూ లాటి కొన్ని దేశాల ఆచారాలలో పిల్లలు లేకుండా అన్న చనిపోతే అతని భార్యను తమ్ముడు పెళ్ళాడాలి అని స్కాట్ తన గ్రంథంలో వివరిస్తాడు.[173] భారతంలో ఇలాటి ఉదాహరణలు చాలా కనిపిస్తాయి. ఇది అతి ప్రాచీన కాలం నుండీ ఉన్న

ఆచారమని కాణే తన ధర్మశాస్త్రాల చరిత్రలో అంటాడు వశిష్ట, బోధాయనులు ఈ ఆచారం మంచిది కాదని తమ సూత్రాలలో పేర్కొన్నారు ఆపస్తంబగృహ్యసూత్రం దీన్ని నిషేధించింది కూడానూ. అయితే మనువు మాత్రం పిల్లలకోసం తప్పనిసరైనపుడు ఈ ఆచారం పాటించమన్నాడు. పిల్లలు జన్మించటంతో సంబంధం తెగిపోవాలని ఆంక్షపెట్టాడు. కౌటిల్యుడు కొంత మేరకే ఈ నియోగాన్ని అంగీకరించాడు. ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురులు జన్మించిన పద్ధతి ఈ 'లెవొరేటు' ఆధారంగానే. భారత దేశంలో ఇప్పటికీ 'ఖాసా' తెగల్లో ఈ ఆచారం ప్రబలంగా ఉందని కపాడియా సాక్ష్యమిస్తున్నాడు.[174]

ఆనాడు వర పరీక్షలూ, వధు పరీక్షలూ ఉండేవి. యువకుడు అన్ని విధాలా బలాఢ్యుడేనా కాదా, చాకచక్యం ఉందా లేదా అని కూడా పరీక్షించేవారు. వరుడ్ని ఆడవాళ్ళు నానాబాధలూ పెట్టారు. ఈజిప్టులో కొన్ని ప్రాంతాల్లో ఆడవాళ్ళు వరుణ్ని కొరడాలతో చావగొట్టారు.[175] నవ్వుతూ భరించాలి. గ్రీసులో ఒక ఆబోతుకు మత్తెక్కించి దాని కొమ్ముకు గుడ్డకట్టి రెచ్చగొట్టి విడుస్తారు. వరుడు దానితో పోట్లాడి ఆ కొమ్ముకు కట్టిన గుడ్డను తీసుకునిరావాలి. ఒక డొంగోలా పిల్ల కోసం ఇద్దరు యువకులు వస్తే మరో ఆచారం ఉంది. ఆ యిద్దరూ చెరోదిక్కూ మొఖంపెట్టి యువతి దగ్గర కూర్చుంటారు. ఆ యువతి కత్తితో ఇద్దరి తొడల్లో గుచ్చుతుంది. బాధపడ్తున్నట్టు ఎవరు కనిపిస్తే వాడు పనికిరాడన్నమాట.[176] మడగాస్కర్‌లో మరో పద్ధతి. వరుణ్ని దూరంగా నిలబెట్టి ఆడ పెళ్ళివారు అతడి మీద ఈటెలు విసుర్తారు. అతడు చాకచక్యంతో వాటినన్నిటినీ పట్టుకొని చంకలో ఉంచుకోవాలి. ఒక్కటీ తప్పి పడిపోకూడదు. ఒక కొండ జాతిలో కొరివితో కాల్చటం ఉంది. ఇది ఆదిమ స్త్రీల ఆచారం. వారి దృష్టిలో మగవాడు కష్టనష్టాలకు ఓర్చుకుంటూ తమ తండాలో పనిచెయ్యాలని వాళ్ళ భావం. అందువల్లే 'సీ డయక్' తెగల్లో పురుషుడు జబ్బుపడ్డే అతణ్ని స్త్రీ వదిలేస్తుంది. ఉత్తర అమెరికా తెగల్లో యువకుడు మంచి వేటగాడై ఉంటేనే పెళ్ళి అయ్యేది. అలాస్కాలో కోయుకుహొతనా అనే తెగల్లో కనీసం లేడినన్నా చంపని మొగాడికి పెళ్ళియ్యే యోగ్యత లేదు. ఫార్మోజా తెగలో వరుడు కనీసం ఒక్కడైనామనిషినన్నా చంపకపోతే వాడు పెళ్ళి ప్రస్తావనే తలపెట్ట కూడదు. బోర్నియా పడమటితీరంలో వరుడు, ఒక్కడి తలనరికి తెచ్చి చూపిస్తేనే వాడికి ఆ ఊళ్ళో యువతులు హారతి పట్టేది; పెళ్ళి జరిగేది. ఈ విషయం హిర్ ఫ్రాన్సిస్ తెలిపాడు. సూదులు గుచ్చటం, కత్తుల్తో పొడవటం, ఒంటి

నిండా కందచీమల్ని పాకించడం బ్రిటిషు కొలంబియా, దక్షిణ అమెరికాల్లో కారిబ్ తెగల్లో; గినీలో మకూసీ తెగల్లో ఈ ఆచారాలున్నాయి. ఆఫ్రికా తెగల్లో కుస్తీ చేస్తారు. అమెరికా తెగల్లో సాధారణంగా ద్వంద్వయుద్ధంతో వరుణ్ణి తేలుస్తారు. మలై దీవుల్లో పెళ్ళికూతురుతో సమానంగా పెళ్ళికొడుకు గుర్రపు స్వారీ చెయ్యాలి. సాయంకాలంలోపు తిరిగొచ్చిన జంటకు పెళ్ళి. ఇలాంటి పరీక్షలను బ్రిఫాల్ట్ చాలా పేర్కొన్నాడు.177 సేవచేస్తూ వాళ్ళను మెప్పించి పెళ్ళాట్టం కూడా ఉంది. నైగీరియాలో వరుణ్ణి కొర్యక్ అనీ చుక్చీ అనీ అంటారు. అతడి కాబోయే మామ ఓ పెద్ద చెట్టును అడవిలో మొదలు నరికి పడేస్తాడు. ఈ వరుడు దాన్ని సునాయాసంగా వాళ్ల గుడిసె దాకా తేవాలి.

మన పురాణాల్లో, కథల్లో విల్లు వంచడాలూ, యంత్రాలు కొట్టడాలూ ఇవన్నీ ఇలాటివేనని భావించాలి. ఇప్పటికివి వరుడి చాకచక్యం పరీక్షించేవిగా మారాయి. పెళ్ళిళ్ళలో బిందెలో ఉంగరం పడేసి ఇద్దర్నీ చేతులు పెట్టి తియ్యి మనటం, పూల చెండ్లు విసురుకుంటూ కింద పడకుండా పట్టుకోవడాలన్నీ వీటి చిహ్నాలే. మర్చెంట్ ఆఫ్ వెనిసులో చిక్కు ప్రశ్నలివ్వటం, కాశీ మజిలీ కథల్లో చదరంగం ఆటలూ, నాయిక వేసే ప్రశ్నలకు సమాధానాలు చెప్పడం అన్నీ వాటి గుర్తులే. వీటన్నిటి వెనకా ఆనాడు పురుషుడు స్త్రీకి అన్ని పనుల్లో సహాయకారిగా ఉండాలన్న భావం మాత్రమే ఉన్నట్టు స్పష్టమౌతుంది.

వధువుకు కూడా అలాటి పరీక్షలుండేవి. చాలాజాతుల్లో కన్నా భారత దేశ తెగల్లో వీటి చిహ్నాలు కనిపిస్తాయి. ఇవన్నీ పితృస్వామ్యంతో వచ్చి ఉంటాయి. ఎత్తుకు రావటం శక్తి పరీక్షగా ఆరంభమైనా, పురుషుని ఆస్తి సంపాదనా దశలో ఇది బాగా కనబడుతుంది. ఆ తెచ్చిన స్త్రీల చేతులకూ, కాళ్ళకూ, మెడలకూ చాలా బరువైన కొమ్ము ఆభరణాలూ, రాళ్ళ ఆభరణాలూ, లోహాల ఆభరణాలూ తగిలించేవారు. వీటన్నిటినీ భరించి తండాలో ఆమె పనిచెయ్యాలి. ఈ ఆచారమే ఇప్పటికీ ఓఢ్రదేశంలో ఉందని ధర్మారావు అన్నాడు. (పే 91)

ఈనాటి పెళ్ళిళ్ళలో చేతికి గాజులు, మెడలో పూసలు, కాలికి కడియాలు వేలికి మట్టెలు తొడగడం ఆచారం. కనోజు బ్రాహ్మల్లో మట్టెలు, ముక్కుకు నత్తు (పుడక) వెయ్యటం పెళ్ళి చిహ్నం. గిరిజన ప్రాంతాల్లో ఆడవాళ్ళ కాళ్ళకూ చేతులకూ మెడలకూ చాలా రకాల ఆభరణాలూ - అవీ చాలా బరువైనవి - ఉండడం చూస్తూంటాం ఇవన్నీ వధువు పరీక్షకు గుర్తులే. బ్రిఫాల్టు

పరిశోధన ప్రకారం ఇవన్నీ తొలి దశల్లో పురుషులకే ఉండేవనీ, క్రమంగా అలంకార ప్రాయాలుగా మారాయనీ అంటాడు. ఆనాటి తెగల్లో ఆడవాళ్ళు ఏ ఆభరణాలూ తగిలించుకునే వారు కారు.178 క్రమంగా అధికారం చేతులు మారడంతో ఆభరణాలు కూడా శరీరాలు మారి ఉంటాయి. అర్థాలు మారిపోయి అలంకరణల స్థాయికొచ్చి నిలిచాయి. ఆర్నమెంట్ అంటే నిరుపయోగంగా ఉంటూ అందంకోసం ధరిస్తూ భరించే వస్తువని అర్థం. దీని సంస్కృత పదం 'ఆ - భరణం' అంటే కూడా ఇదే అర్థాన్ని తెల్పటం గమనించవచ్చు.

'శవ వివాహా'లనే మరో ప్రకరణంలో ధర్మారావు బాల్యం, యవ్వనం, వార్ధక్యం లాగే 'పెళ్ళి' ఒక మజిలీ అని నిరూపించాడు. ఈ అంచెను చేరుకోకుండా ఎవరైనా చనిపోతే, శ్మశానంలో అలాటి పురుషునికీ స్త్రీకీ గోరీల దగ్గర పెళ్ళి తంతు నడిపిస్తారన్నాడు. ఈ లాంఛనం ఇప్పటికీ కన్నెగాఉన్న స్త్రీ చనిపోతే జరిగే కర్మకాండలో కొంత కనిపిస్తుంది.179 ఫిజీ ఆదిమవాసుల్లో పెళ్ళి కాకుండా చనిపోయినవారి ఆత్మలను ఒక 'నంగనంగ' అనే దేవత బాధపెడ్తుందన్న నమ్మకం ఉంది. చైనాలో ఇలాటి శవవివాహాలు చేయించేవాళ్ళను 'మధ్యవర్తు'లంటారు. ఈ విశేషాలను 'గ్రూట్' అన్న పరిశోధకుడు చాలా వివరించాడని తాపీవారు దాఖలా చూపించారు.

పాతివ్రత్యం అన్నదాన్ని వివరిస్తూ ఆదిమ తెగల్లో ఈ భావం లేదన్న అంశాన్ని చెప్పాడు ధర్మారావు. పితృస్వామ్యం వచ్చిన తర్వాత, ఈముసుగులో స్త్రీని బానిస కింద కట్టిపడేశాడు. మగవాడికి లేని పత్నీవ్రతం ఆడదాని కెందుకన్న ప్రశ్న ఇరవయ్యో శతాబ్దం దాకా రాలేదు 'వుమెన్స్ లిబ్' ఆశయాల్లో పాతివ్రత్య నిరసనం ఒకటిగా ఈనాడు చెప్తున్నారు. మన పురాణగాథల ప్రకారం మనం పతివ్రత లనుకుంటున్నవారెంతమంది ఏకభర్తృకలో నిదానంగా ఆలోచిస్తే తెలుస్తుంది.180 పాతివ్రత్యం అంటే ఏకభర్తృకం అయింది.

వెస్టర్‌మార్క్ క్రైస్తవ మతం ప్రకారం ఈ సమాజ పరిణామాన్ని అధ్యయనం చెయ్యాలని భావించాడు.181 అందుకే సమాజం మొదటినుండీ పితృస్వామ్యమనీ, మధ్యలో మాతృస్వామ్యంగా వచ్చిందంటూ ఆడమ్ కథ చెప్తూ ప్రయాసపడ్డాడు అలాగే జంట పెళ్ళిళ్ళ నుండి గుంపు పెళ్ళిళ్ళొచ్చాయని రుజువుచెయ్యడానికి శ్రమించాడు. కానీ తన తప్పును క్రమంగా తెలుసుకొని తర్వాతి ప్రచురణలో దాన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నించాడు. దీన్ని బ్రిఫాల్ట్ చాలా శాస్త్రబద్ధంగా ది సోషల్ ఇవల్యూషన్ ఆఫ్ మోనోగామిక్ మారేజ్ అన్న ప్రకరణం182 లో వివరించాడు. వ్యవసాయం బాగా

అభివృద్ధిచెందిన చోట, సంపద పెరిగినచోట, స్త్రీ పనుల్లో సహాయకారిగా కాకుండా వంశోద్ధారకుడ్ని కనే వ్యక్తిగా మిగిలింది. అరబ్బులు స్త్రీని ఏపనులూ చేయకుండా నిషేధించారు. యూరపు దేశాలన్నీ ఏకపత్ని అంటూ పాతి వ్రత్యం బీజాలు నాటితే, తూర్పు దేశాలు భిన్నంగా ఉండేవి. ఆర్థికస్థితుల కారణంగా కూడా 'లంక' లో 'వెడ్డ' జాతులు దీన్ని ప్రోత్సహించాయి. అడవుల్లో తిండ సరిగా దొరక్కపోవటం వల్ల ఏకపత్నీత్వాన్ని ప్రచారం చేశాయి. అలాగే ఏకభర్తృకం కూడానూ.

ధర్మారావు ఈ గ్రంథంలో చివర, పెళ్ళి తంతులో ప్రధానాంగాలను సూక్ష్మంగా వివరించాడు.

పెళ్ళి కన్యలకే జరగాలన్నది చాలా అర్వాచీనమైన ఆచారం. పెళ్ళికి ముందు సంగమం, పిల్లలుండడం తప్పు కానేకాదు. సుభగ అంటూ కన్నెను పిలవటమంటే ఈ భావమే స్ఫురిస్తుంది. ఈనాడు కూడా పెళ్ళి పత్రికల్లో 'చిరంజీవి సౌభాగ్యవతి' అని అనటంలో ఈ అర్థం తోస్తుంది. అయితే మన నాగరికత పిల్లలున్నదాన్ని పెళ్ళాడ్డం ఒప్పదు. కనుక ఆ భావా నికి 'సంపద' అని చెప్పుకుంటున్నాం. అతి ప్రాచీనకాలంలో జనసంపదే 'జన సౌభాగ్యం'. ఈ భావాన్ని ధర్మారావు 'ఈగ వాలని రొట్టె'లో నిరూపించాడు.

కన్నె ఎవరో నిర్ణయించటానికి ధర్మశాస్త్రాలు చాలా తబ్బిబ్బులయ్యా యని కాణే ధర్మశాస్త్రాల చరిత్ర చూస్తే మనకు తెలుస్తుంది. అయితే మనువు మాత్రం తెగేసి కొన్ని నిబంధనలు రాశాడు. అవి ఎంత అసమంజసంగా ఉన్నాయో బంకుపల్లి మల్లయ్యశాస్త్రి తమ 'వివాహ తత్వం' అన్న గ్రంథంలో విశదీకరించాడు. కన్నెను వరుడు పెళ్ళాడటం కేవలం ఈనాటి పెళ్ళి తతంగం.[183]

చైనా భాషలో 'చెవి పట్టుకు లాక్కురావటం' అంటూ పెళ్ళికి వాడ్తారు. 'కూడే ఆలు' రావటం అంటే 'కోడలు' అని మనం అనవచ్చు. ఆ రావటానికి జరిగే కర్మకాండలో ప్రముఖంగా ఈ కింది అంశాలు కనిపిస్తాయి.

| | |
|---|---|
| 1. స్నాతకం | 7. కన్యాదానం |
| 2. రక్షాబంధనం | 8. ప్రమాణం |
| 3 కన్యావరణం | 9. సుముహూర్తం - సప్తపది |
| 4. గౌరీపూజ | 10. యోక్త్రధారణం |
| 5. వరపూజ | 11. మాంగల్యధారణం |
| 6. మదుపర్కం | 12. తలంబ్రాలు [184] |

ఇవి కాక - పాణిగ్రహణం, అగ్నిప్రదక్షిణం, గంధర్వపూజ, ధ్రువ నక్షత్ర దర్శనం, (అరుంధతీ నక్షత్ర దర్శనం) శేషహోమం, గర్భాధానం

ఇందులో భాగాలు. శేషహోమాన్ని కొన్నిచోట్ల స్థాళీపాకం అంటారు. నాగవల్లి తర్వాత గర్భాధానం ఆచారంగా ఉంది.[185]

స్నాతకం: బ్రహ్మచర్యం అనుసరించడం అన్నది మానవజాతికి ఆత్మహత్యా సదృశం. స్త్రీలు అవివాహిత దశనూ, బహుళ సంఖ్యాక పురుషులు శాశ్వతబ్రహ్మచర్యాన్ని పాటించడాన్ని వ్యతిరేకిస్తారని సర్వదామన్ సింగ్ తన పొలియాండ్రీ ఇన్ ఏన్షియంట్ ఇండియా అన్న గ్రంథంలో వివరిస్తాడు.[186] ఇంతకు ముందే బ్రహ్మచర్యం కేవలం విద్యార్జన లక్ష్యమన్నదాన్ని వివరించడం జరిగింది. స్నాతకుడు అంటే బ్రహ్మచర్యం ముగిసి గృహస్థాశ్రమం స్వీకరించడానికి యోగ్యుడని అర్థం.[187] అతడు విద్యార్జన కొనసాగించడానికి పూర్వకాలంలో విద్యాపీఠమైన కాశీకి పోతాననడం, వద్దని అంటూ గృహస్థాశ్రమం స్వీకరించమని గురువు చెప్పడం అన్న తంతు ఉంటుంది. గురువే ఇతనికి తగిన కన్యను వెతికి తెచ్చి పెళ్ళిచేయటం జరిగేది. వరుణ్ణి వెతికి తీసుకుని రావడమనేది ఆదిమకాలం నుండీ వధువు వైపు వారి బాధ్యతే. పరీక్షలు పెట్టి ఎంచుకోవడం చూసిందే. 'ఎండోగమీ' మీద నిషేధం వచ్చిన తర్వాత ఈ ఆచారం వచ్చి ఉంటుంది. అందుకే కాబోయే బావమరిది వరుడి కాళ్లు కడిగి చెల్లిని చేసుకోమంటాడు. కొన్ని సందర్భాల్లో మామగారే 'సాలంకారాం కన్యాం మమసుతాం ద్విజతే దాస్యాం' అని అంటూ వరుడిని ఆహ్వానిస్తాడు.[188]

కన్యావరణం: బ్రహ్మచారికి తగిన కన్యను వెతికే తంతు ఇది. స్నాతకుడు, అతడికి సంబంధించిన పెద్దలు, మంత్రం తెలిసినవాళ్ళు ఉంటే వాళ్ళని పిలిచి 'మదర్థంకన్యాం వృణీధ్వం' (నాకోసం కన్యను వరించండి) అని అడుగుతాడు.వాళ్ళందుకు'వృణీమహే'అలాగేవరిస్తామంటారు.దీనిని గురించి ధర్మారావు రాస్తూ వరుడికి ముందర ఆ కన్యను "నాయకుడితోనో, రాజుతోనో, ఆచార్యుడితోనో, బ్రాహ్మడితోనో జతకట్టించేవారని" (పేజి 123) అన్నారు. వీటికి బహూశా ఒక కారణం కావచ్చు రజస్వల రక్తం చాలా అపవిత్రమని ఒక కాలంలో భావం ఉండేది.[189] ఏవేవో భూతాలు ఆవహిస్తాయని నమ్మేవారు. ఆ కీడు పోవడానికి పెళ్ళికి ముందు కన్నెరికం చెయ్యటం అవసరమని భావించి ఉండవచ్చు. కొన్ని దేశాల తండాల్లో ఒక చెట్టుకిచ్చి పిల్లకు పెళ్ళి చెయ్యడం, ఆ చెట్టును నరికేసి నిజమైన వరుడికిచ్చి ఆ పైన పెళ్ళి చెయ్యడం ఆచారంగా ఉంది. అందువలన ఇక్కడ మంత్రంలో ఇతర్లను వరించండి అంటే వాళ్ళు అలాగేనని తలూపడం వెనక ఈ కధ ఉండి ఉండవచ్చు. ఒక

కాలంలో రజస్వల రక్తం చాలా పవిత్రమైందిగా భావించేవారని హ్యూబర్ట్ రైట్స్ అన్న గ్రంథంలో ఛటోపాధ్యాయ వివరిస్తాడు.[190]

గౌరీపూజ : ధర్మారావు 'దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు ?' అనే గ్రంథంలో కోహ్ అంటే కొండ, దాని స్త్రీలింగం కొహరీ అంటే స్త్రీ దేవత, అదే క్రమంగా గౌరీ అయిందని అన్నారు. ఏది ఏమన్నా ఇది కామ్య తంత్రంలో భాగంగా పరిగణించాలి. ప్రాచీనుల భావాల్లో, విశ్వాసంలో దేవు డుండే స్థలాల్లో కొండ ఒకటి. ఆ దేవుడే సంతానాన్నిచ్చి తండాను పెంచు తాడన్న భావంతో ఆ స్త్రీ దేవతను పూజించటం ఆచారంగా పరిణమించి ఉండవచ్చు.

వరపూజ : ఇందులో ఇంతకు పూర్వం తెలిసికొన్నట్టు, వరుడి దార్ఢ్యాన్ని పరీక్షచేసిన తర్వాత అతడు భగవంతుడితో సమానుడని భావిస్తారు. "శ్రీలక్ష్మీ నారాయణ స్వరూపస్య, బ్రాహ్మణస్య, ఇదం ఆసనం. అపఃపాదావనే జనేర్ద్విషంతం నాశయంతుమే" - అని మంత్రం చదువుతారు. అంటే ఇతడు చాలా గొప్పవాడు, ఇతడి కాళ్ళు కడిగిన జలాలే మా శత్రువులను నాశనం చేస్తాయని భావం. 'అస్మిన్‌కులే బ్రహ్మవర్చస్యసాని' అని అంటారు. నా కులంలో ఇంతటి బ్రహ్మతేజస్వంతుడు చేరుతున్నాడు కనుక నాకిక భయం లేదన్న అర్థం ఇందులో ఉంది. తన తండాలోకి చేరేవాడి వల్ల తమ తండాకు భయం లేదన్నదే దీనర్థం.

ఈ సందర్భంలో మధుపర్కం గురించి తెలుసుకోవడం అవసరం. ఈనాడు మధుపర్కాలంటే పెళ్ళికొడుక్కిచ్చే బట్టలు. భరద్వాజుడు రాముడికి ఆవుమాంసం పెట్టినట్టు అదే మధుపర్కమని కొందరంటారు. అశ్వలాయన గృహ్యసూత్రం 1 వ అధ్యాయం 24 వ ఖండిక 33 వ సూక్తంలో మాంసం లేనిది మధుపర్కంకాదు. అలాగే ఆ సందర్భంలో ఇచ్చే అర్ఘ్యంలో మాంసం ఉండడం అవసరమని పరాశర గృహ్యసూత్రం 1 వ కాండ, 3 వ ఖండిక 29 వ'సూత్రం చెబుతోంది అలాగే హిరణ్యకౌశిక, అపస్తంబగృహ్యసూత్రాల్లో అతిథికి మాంసంతో ఇవ్వడమే మధుపర్కం. ఇప్పటివరకూ వరుడు అతిథి. అందుకే మధుపర్కం తినిపించడం. ఇక్కడ

"త్రయై విద్యాయైయశో సి యశశోయశోసి బ్రహ్మణో దీప్తి రసితం

మాప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనాం'' - మధుపర్కం ప్రకాశాన్నీ కీర్తినీ పెంచేది. ప్రజలకు ఇష్టమైంది పశువులు అధికంగా కలిగేటట్టు చేస్తుంది-అన్నది దీని భావం.

వెన్న, నెయ్యి, పాలు, పెరుగు, తేనె కలిపి ఆ సందర్భంలో వరుడికి ప్రస్తుతం తినిపిస్తున్నారు. వరుడు పరీక్షకు తట్టుకున్న తర్వాత అతడి ఆరోగ్యానికి తండాలు చేసే భోజనాదులు సపర్యలుగా వీటిని భావించవచ్చు. అంతా పశుపాలక ఆచారాలు. మధుపర్కం ఎలా తయారు చెయ్యాలో ఒక్కొక్క గృహ్యసూత్రం ఒక్కో విధంగా చెప్పింది అయితే ఈ మధు పర్కం పొందడానికి ఋత్విజుడు, గురువు, వరుడు, రాజు, స్నాతకుడు, గృహస్థుకు ఇష్టుడు—వీళ్ళకే అర్హత ఉందనడంలో అన్ని సూత్రాలూ ఏకీభావం వహించాయి. వరుడితోపాటు అతడి తండాకంతా ఈ ఆతిథ్యం ఇవ్వడం ఆచారమని ఋగ్వేదార్యులన్న పుస్తకంలో రాహుల్ సాంకృత్యాయన్ అంటాడు.

ఈ ఆచారమంతా ఉత్తర భారత సంప్రదాయ వివాహాల్లో 'బరాత్' అన్న తంతులో ఆచరిస్తారు. ఇందులో వరుడు యుద్ధానికెళ్తున్నట్టుంటుంది. బరాత్‌లో స్త్రీలు సాధారణంగా రారు. వెళ్లేది యుద్ధానికి కనుక. యుద్ధంలో వరుడు తన సామర్థ్యం చూపి పిల్లను గెలిచి తీసుకొస్తాడు ఆపైనే వరుడి పక్షం స్త్రీలు–తతంగంలో పాల్గొంటారు. 'వర్ ఆత్' అనేదే 'బరాత్' అయింది.

కన్యాదానం : కన్నెధార అంటూ ఈనాటి పెళ్ళిళ్ళలో ఇది చాలా ప్రాధాన్యాన్ని సంతరించుకుంది. షోడశ మహాదానాలని ప్రసిద్ధి పొందిన వాటిల్లో కన్యాదానం గొప్పది.

''కన్యా కనక దాసీచ శకటాశ్వ గజా గృహమ్
లాంగలం కాలపురుషం కాలచక్రం తథాక్షితిః
మేధశ్చ మహిషీచైవ శయ్యాచోభయతో ముఖీ
తిలపర్వత విజ్ఞేయా మహాదానానిషోడశః''

ఇదీ సూత్రం. ఇందులో ఉన్న దానాల్లో ఎక్కువ వ్యవసాయ నాగరికత వచ్చిన తర్వాత ఏర్పడ్డ వస్తువుల దానాలే. నాగలి, కులాల చక్రం, భూమి, తిలలు, వస్త్రం మొదలైనవి. సంపద పెరగడంతో వచ్చిన బానిస సంపద. దాసీదానం, నల్లని మనిషి దానాలు. అప్పటికి, వివాహపద్ధతిలో దంపతీ వివాహాలు వచ్చినట్టే అనవచ్చు. మాతృస్వామ్యం అడుగుబట్టింది కనుకనే కన్నెను దానం చేస్తూ ధారపొయ్యడం. స్త్రీ, వినిమయంలో మార్పిడి వస్తువుగా మారడం కూడా గమనించగలం. వరుణ్ని కన్యాదాత 'ధర్మేచ అర్థేచ కామేచ నాతి చరితవ్య' - అని శాసిస్తే వరుడు కూడా 'నాతిచరామి' అని అభయం ఇస్తాడు.

ఈ సందర్భంలో ఆదిమ కాలం నాటి ఆచారాలను ఇంతకు ముందే వివరించడం జరిగింది. ఈ తతంగం ఉత్తర హిందూస్థానం పెళ్ళిళ్ళలో అంతగా పాటించరు.

సుముహూర్తము: ఏది సుముహూర్తం అన్న దాంట్లో భిన్నభిన్న ఆచారాలు - నమ్మకాలూ కనిపిస్తాయి. వరుడికీ వధువుకీ ఇద్దరి మధ్య ఉండే తెర తీయడం ఉత్తర హిందూస్థానం ఆచారంగా ఉంది. "కన్యా నిరీక్షణ ముహూర్తస్సుముహూర్తో అస్తు ఇతి అనుగృహ్ణంతు" - అంటారు పిల్లను చూడడమే ముహూర్తం అయ్యేలా దీవించండని తాత్పర్యం.

వెంటనే జీలకర్రా బెల్లంముద్దను వధువు తలమీద వరుడూ, వరుడి నెత్తిమీద వధువూ ఉంచడం జరుగుతూండగా ఇద్దరి మధ్యా ఉన్న తెర తొలగించడం ఒక ఆచారం. ఇక్కడే 'అభ్రాతృఘ్నీం', 'అఘోరచక్షు' - అన్న మంత్రాలను చదువుతారు. వీటిభావం ఆచారాల నిజస్వరూపం ఇంతకుముందే వివరించడం జరిగింది.

ఈ జీలకర్ర, బెల్లానికి వేర్వేరు అర్థాలు చెప్తారు. జీలకర్ర ముసలితనం త్వరగా రానీయదట. బెల్లంశుభప్రదమైందట.[191] అతి ప్రాచీన కాలంలో మనిషిలో ప్రాణం ఏవో పిట్టల రూపంలో ఉండేదన్న నమ్మకం ఉంది. ఆ పిట్టలు ఆహారం కోసం బయటకెళ్తాయని మనిషి తల వగులకొట్టుకుంటూ వెళ్తాయనీ నమ్మేవారు. అలా వెళ్ళడం అంటే మనిషికి చావు రావడం. ఆహారం కోసం బయటకు పోకుండా వారి తలలపై జీలకర్ర, బెల్లం పెట్టి పిట్టలను శరీరంలోనే ఉంచే విధంగా ఈ తంతు జరుగుతుంది. అదే విశ్వాసం ఆచారంగా మిగిలిందని కొందరంటారు. ప్రాణం పిట్టల రూపంలో, కాకుల రూపంలో ఉండేదన్న భావం ఉండడం మాత్రం నిజమే. అదే శ్రాద్ధ కర్మల్లో పిండాలను కాకులకు వేసే ఆచారంగా మారింది. అనేక జానపద కథల్లో వాళ్ళ ప్రాణాలను చిలకల్లో, పిట్టల్లో ఉన్నట్టు ఊహించడం మనకు తెలిసిందే.

ఉత్తర దేశవాసుల ఆచారంలో వధువు పాపటలో సింధూరం ఉంచే సమయం ముహూర్తం. వాళ్ళకు జీలకర్రా లేదు; ఆవాలూ లేవు.

ఇక్కడే వధువు నెత్తిమీద కాడి ఉంచి దాని రంధ్రం గుండా నీళ్ళు వదుల్తారు. కాడి రంధ్రానికీ - వధువు తలకూ మధ్య దర్భల చుట్టనుంచుతారు. ఇక్కడ చదివే మంత్రాలను శ్రద్ధగా పరిశీలిస్తే పశుపాలక, వ్యవసాయ నాగరికతావశేషాలు ఎలా నమ్మకాలుగా మారాయో తెలుస్తాయి వీటి వెనక కామ్య తంత్రం ఉన్న విషయమూ బోధపడుతుంది. "అర్యమ్ణో అగ్నిం పరియంతు క్షిప్రం ప్రతీక్షం తాగ్శ్వశ్రో దేవరాశ్చ''. అంటే ఈ వధూవరుల తల్లులూ, బావా మరదళ్ళూ ఈ పెళ్ళి చుట్టూ ఉండి రక్షిస్తూండండి-అన్న అభ్యర్థన. తండ్రా

లలో ఏక్షణంలోనైనా ఎత్తుకు పోయే ఆచారం ఉంటె కనుక ఈ రక్షణను కోరి ఉండవచ్చు.

ఈ పిల్ల, పెళ్ళి సమయంలో తన తండా నుండి వెళ్ళిపోతూనూ, కొత్త తండాలో చేరబోతూనూ ఉన్న సంధి దశలో ఉంది. కనుక రక్షణ అవసరం. "ఖేఒనసః ఖేరధః ఖేయుగస్య శచీపతే; అపాలామింద్రత్రిః పూర్త్వాక ర్త్సూర్య వర్చసం" - ఇది ఇంద్రుణ్ణి గూర్చిన ప్రార్థన. రథం రంధ్రం గుండా నీళ్ళు పోసి, కాడి బెజ్జం గుండా నీళ్ళు పోసి ఈమెను పవిత్రంచేసి రక్షించమని అర్థం. రథాలు పశుపాలక దశకైతే, కాడి వ్యవసాయదశకు కావచ్చు. రెండు దశల్లోనూ వీటి ప్రాధాన్యం అధికం. ఆనాడు ఇంద్రుడు జలాధిపతి. దేవేంద్రుడు కూడానూ. అందుకే ఈమెను రక్షించమని ప్రాధేయపడటం కావచ్చు. 'అపాలాం' అనడాన్నిబట్టి రక్షకులు లేరు అని బోధపడ్తుంది. ఇక్కడ తండాల ఆచారాన్నిబట్టి తండానాయకుడు, పురోహితులు ఎవరో ఒకరు కీడు తీసేశారని చెప్పడం కూడా అయి ఉండవచ్చు తిర్వాతి మంత్రం ఇది.

"శంతే హిరణ్యాగ్ంసముశంత్వా పశ్యంతే మేధీ భావతుశం యుగస్య తృద్మ - శంత ఆపశ్చత పవిత్రాభవంత్వధాపత్యా తన్వగ్ం సగ్ం సృజస్వ."

కాడి రంధ్రం సుఖాన్ని కలిగిస్తుంది. అందులోని నీరు నీకు సుఖాన్ని కలిగిస్తుంది. ఆ నీరు అనేక వస్తువుల్ని పవిత్రం చేసేది - ఈ అర్థాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే కామ్యతంత్ర భాగమనిపిస్తుంది. కాడి రంధ్రం పురుషేంద్రియం అయితే నీరు వీర్యం. తలపైన దర్భచుట్ట యోనివత్ కావచ్చు. పైన వివరించే మంత్రంలోని జలం అది.

ఇదంతా కామ్యతంత్ర భాగంగా పరిగణించడంలో తప్పులేదు. అయితే ఆదిమకాలం నాటి భావాలు ఎలా రూపాంతరం చెంది, నాగరిక దశలో ఉన్నామనుకున్న వాళ్ళ వెంట ఎలా ఉంటాయో తెలుస్తుంది. ఈ భావమే క్రమంగా ఉంగరాలుగా మారి ఆఫ్రికా మధ్య భాగంలో, అమెరికా, ఇండియాలో కొన్ని ప్రాంతాలలో బలపడిందన్న ధర్మారావు అభిప్రాయం సమంజసం.

ఆ వెంటనే సూత్రధారణ భాగం వస్తుంది. ఇది వధువు నడుముకు ఒక దర్భతాడు కట్టడంతో ఆరంభమవుతుంది. దీన్ని యోక్త్రధారణమంటారు. స్త్రీకి ఉపనయనం చేయడానికిది గుర్తు.192 ఉపనయనంలో యజ్ఞోపవీతం ఒక ప్రముఖ భాగం అంటారు. అతి ప్రాచీన కాలంలో ఇది ఎక్కడా లేదు. ఏ గృహ్యసూత్రం యజ్ఞోపవీత ధారణలు చెప్పలేదని కాణే పండితుడంటాడు. దీన్ని గురించి తిలక్ చక్కని పరిశోధనా గ్రంధం 'ఓరియన్' రాశాడు. దీన్ని నక్షత్ర మండలంలో మృగశిరకు జోడించాడు. ఒక వేటకాడు

వేట సందర్భంలో నడుముకు కట్టుకొనే పటకా ఇది. దీన్ని బిగించాడంటే వేటకు సిద్ధమయ్యాడనే. విశ్రాంతికాలంలో దీన్ని వదులు చేస్తే నడుమునుండి జారిపోతుంది. అలా కాకుండా భుజానికి తగిలించుకుంటాడు. వేటకెళ్ళే టప్పుడు నడుముకు బిగిస్తాడు. పని ఆరంభానికిది సూచన. ఇదే క్రమంగా 'వాడి పనికి నడుం కట్టాడు - నడుం బిగించాడ'న్న విధంగా వాడుకలో కొచ్చింది.

అలాగే విద్యార్జనకు నడుం కట్టటం సూచనగా ఈ జందెం వచ్చి ఉంటుంది. జింక చర్మంతో ప్రాచీన కాలంలో పటకా కట్టుకునేవాళ్ళు. అదే నేడు చిన్న చర్మం ముక్క జందానికి ఉపనయనం నాడు కట్టే ఆచారంగా పరిణమించింది. ఈ వేటకు ఆనాడు స్త్రీ పురుషులందరూ వెళ్ళేవారు. అందరూ తోలు పటకాచో అంతకు పూర్వం గడ్డి తాడో వాడి ఉండేవారు.[193] ఈనాడు దీన్ని ముంజి అంటారు. మౌంజి అనేది ఒకరకం గడ్డి అని కాణే వివరిస్తాడు. క్రమంగా స్త్రీలకు ఉపనయనం పోవడంతో ఈ మౌంజీ ధారణం పోయింది. అయినా ఆ ఆచారం పెళ్ళి సమయంలో 'యోక్త్రి ధారణం'గా పొడగడ్తుంది. వరుడు వధువుకు దీన్ని కట్టటంతో ఆమె కొత్త దశలో ప్రవేశిస్తోందన్న దానికి సూచన. ఇక్కడ -

"ఆశాసానా సౌమనసం ప్రజాగ్ సౌభాగ్యం తనూం అగ్నేరనువ్రతా భూత్వా సన్నహ్యే సుకృతాయకం"- అన్న మంత్రం చదువుతారు. మంచి సంతానం కోసం ఈ వివాహమనే పుణ్యకర్మ కోసం నడుముకు ఈ తాడును కడ్తున్నానని వరుడంటాడు. పై వివరణ దీన్ని సమర్థిస్తుంది.

ఇక సూత్ర ధారణ ఆరంభం. ఇక్కడ చదివే మంత్రం కేవలం లౌకికం అనిపిస్తుంది నా సుఖం కోసం నీవు నూరు సంవత్సరాలు జీవించాలి. అందుకే ఇది నీ మెళ్ళో కడ్తున్నానంటాడు వరుడు. ఈ మంగళసూత్రం కేవలం ఆంధ్రుల ఆచారమని వాత్స్యాయనుడి భావం ఈనాడు వీరి ప్రభావం పాకిన దక్షిణ దేశీయుల్లోనూ, మహారాష్ట్రీయుల్లోనూ అక్కడక్కడా ఇది ఉంది. ఉత్తర భారతంలో ఎక్కడాలేదు. ఇదే పెళ్ళి చిహ్నంగా మారింది. సుముహూర్తమిదేనన్న అభిప్రాయం చాలా మందిలో ఉంది. తార్తారులు ఓడించి తెచ్చిన స్త్రీల మెళ్ళలో రుమాలు కట్టేవారనీ అదే గళసూత్రంగానూ - మంగళ సూత్రంగానూ మారిందని ధర్మారావు అంటాడు. (పేజి 89). అదే నిజమైతే ఆ ఆచారం అటు తార్తారులకు దగ్గరగా ఉండే ఉత్తర భారతంలో ఉండాల్సింది. చైనా, మంగోలులలో కూడా కనిపించాలి. కానీ ప్రపంచంలో ఎక్కడా లేదు.



40 కంబర్‌లాండ్‌లో పూజలందుకొనే పాము ఆకారం ఉన్న పురుషజననాంగం



42. విశాఖపట్నంలో పురిపండా షష్ఠి పూర్తి 1964.



43. సాహిత్య అకాడమీ నిర్వహించిన గిడుగు శతవార్షికోత్సవ సభ - హైదరాబాదు. 1964.

దీన్ని 'తాలిబొట్టు' అంటారు. దీనికి భిన్నాభిప్రాయాలున్నాయి. తొలి బొట్టు అన్నారు కొందరు. ఆదిమకాలంలో స్త్రీకి ఈ బొట్టుపెట్టి ఆరాధించేవారని, అదే కావచ్చుని వారి భావం. ఇది స్త్రీ రజోరక్తమని కూడా అన్నారు.194 పాపట్లో సిందూరం పెట్టుకోవడమే పెళ్ళిగా భావించే వాళ్ళకిది సమంజసమే కావచ్చునని అనిపిస్తుంది. కాని ఆ బొట్టుకున్న అర్థం వేరని దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు' లో కొంత వివరించడం జరిగింది.

కొన్ని ఆటవిక జనాల్లో తాటాకును వధువు మెడలో కడ్తారనీ, కనుక 'తాడిబొట్టు' క్రమంగా తాళిబొట్టుగా మారిందని మరికొందరి ఊహ.195 ఇదే ఆచారం ఎక్కువగా తమిళ వివాహాల్లో ఉందనీ 'తాళి' అంటే ఆకుతో చేసిన ఆభరణం అనీ ఒక అభిప్రాయం.196

ఈ ఆచారం వెనక జనం బాధ ఎంతటిదో, దొర జులుం ఎంతటిదో ఇంతకు ముందే వివరించాను. ఆ వివరణే సమంజసమని ఈ సందర్భంలో ఇతర మంత్రాలూ రుజువుపరుస్తున్నాయి.197 ఈ ఆచారం కేవలం అతి ఆధునికం అని కూడా వివరించాను. రామాయణ భారతాలేవీ దీన్ని పేర్కొనలేదు. అయితే దీన్ని ఆపస్తంబగృహ్య సూత్రాన్ని అనుసరించేవాళ్ళు కాడి, సూత్ర ధారణా రెంటినీ కలిపి అమలుపరుస్తారు. అదీ యజుర్వేదాధ్యాయులు మాత్రమే. అశ్వలాయన రుగ్వేదులు కాడి తీసేసి సూత్రధారణే చేస్తారు.

మహారాష్ట్రులు నల్లపూసలు ధరిస్తారు. ఇదే వారికి మంగళసూత్రం. ఇది పెళ్ళి సుముహూర్త సమయంలో కట్టాలని లేదు. ఈ నల్లపూసల ఆచారం తెలుగునాట కూడా ఉంది. 'నీలలోహితే' అనే మంత్రం చదువుతూ దీన్ని వధువు మెడలో కట్టిస్తారు. ఉత్తర భారతంలో కన్యాకుబ్జ ప్రాంతంలో ఈ ఆచారం బాగా ఉంది. ముస్లింలలో ఇదే ప్రధానం. భారతీయ క్రైస్తవుల్లో కొందరు, వారు నివసించే ప్రాంతాల ఆచారాల ననుసరించి తాళిబొట్టు కట్టిస్తున్నారు. అసలు ఈ ఆచారం వారికి లేదు.

తలంబ్రాలు తర్వాతి తంతు. బియ్యాన్ని పసుపులో కలిపి తయారు చేస్తారు. బియ్యమే ఎందుకు ఉపయోగించారో చూడాలి. ఇతర్లను దీవించడానికి, దేవతలను పూజించడానికి పూలతోపాటు బియ్యాన్ని ఉపయోగిస్తారు. వీటిని అక్షతలు - అక్షింతలు అంటారు. బియ్యంలో నూకలు లేకుండా అంటే ముక్కలుండకుండా ఏరి వీటిని తయారుచేస్తారు. క్షతం కాని బియ్యం కనుక అక్షతలనీ, అవే అక్షింతలయ్యాయనీ వాడుక. కానీ అది కాదు. ఎవరినన్నా ఆశీర్వదించడానికీ, పూజించడానికీ బియ్యాన్ని ఉపయోగించడం ప్రపంచంలో చాలా భాగాల్లోని తెగల్లో ఉన్నట్టు ఆధారాలున్నాయి దీనికి బియ్యమే ఎందుకు

వాడాలన్న దానికీ హేతువుంది.

రైస్ అన్నమాట పర్షియన్ పదం నుండి వచ్చింది. దీనర్థం 'వృద్ధి'. అది సంపద. గో సంపదన్నా, భూసంపదన్నా, సంతాన సంపదన్నా ఏదన్నా కావచ్చు. ఇది ఇరాస్ అన్న దేవతకు సంబంధించింది. ఆ దేవత సౌభాగ్య దేవత. ప్రజల సౌభాగ్యాలను వృద్ధిపరచడానికి హేతువు ఆ దేవత. ప్రేమ దేవత కూడానూ. ఈ వృద్ధిని పర్షియన్‌లో 'వృజ్' అనీ, అదే సంస్కృతంలో 'వ్రీహి' అనీ అంటున్నాం. వ్రీహి అంటే బియ్యం. ఇది- ఒక విత్తు నాటితే వందల విత్తులుగా వస్తాయన్న భావంతోనూ, 'ఇరాస్' దేవతా పరంగానూ నమ్మకం ఏర్పడి ఉంటుంది. 'ఇరాస్' అన్న పదమే 'రయిస్' అయింది. ఆశీర్వదించడంలో ఈ బియ్యాన్ని చల్లడమంటే వాళ్ళూ - వాళ్ళ కుటుంబం-సంపద తామరతంపరగా వృద్ధిచెందాలని కోరుకుంటున్నామన్నమాట. పసుపు కొన్ని ప్రాంతాల్లోనూ, కుంకుమ కొన్ని ప్రాంతాల్లోనూ కలుపుతుంటారు. అవన్నీ క్రమంగా వచ్చిన శుభచిహ్నాలు కావచ్చు.[198]

వివాహసందర్భంలో ఈ తలంబ్రాలను ముందు వరుడు వధువు నెత్తిమీద పోస్తాడు. ఆ తర్వాత వధువు. ఆ సందర్భంలో మంత్రార్థాలు ఇలా ఉంటాయి.

ప్రజామే కామ సమృధ్యతాం (వరుడంటాడు)
పశవోమే కామ సమృధ్యతాం (వధువంటుంది)
యజ్ఞోమే కామ సమృధ్యతాం (వరుడంటాడు)
శ్రియోమే కామ సమృధ్యతాం (ఇద్దరూ కలిసి అంటారు)

నేను కోరిన సంతానం కావాలని వరుడంటాడు. నాకిష్టమైన పాడిపంటలు సమృద్ధిగా కావాలని వధువు అంటుంది. యజ్ఞసంబంధమైన కామం నాకెక్కువగా ఉండాలని వరుడంటాడు. మాకిద్దరికీ శుభం, కామం సమృద్ధిగా కావాలని ఇద్దరూ అంటారు.

ఈ సమృద్ధిని ఆకాంక్షిస్తూ చదివే మంత్రాలకూ, బియ్యానికీ ఇంతకు ముందు చెప్పిన అన్వయమే సరిపోతుంది. ఈ తంతు అంతా కామ్యతంత్రంలో భాగమే. అందుకు ఉపయోగించిన బియ్యం చిహ్నం కూడా దాన్ని సూచించేదే. ప్రధానంగా తమ కుటుంబాభివృద్ధి సూచన తప్ప మరేం లేదు. నాటి పశుపాలక, వ్యావసాయిక సంపదల అభివృద్ధిని ఆశించింది. అందులో వ్యావసాయిక కామ్యతంత్రాధిదేవత స్త్రీయే. అందుకు ఆ భావాన్నిచ్చే మాటలు వధువే అనటం గమనార్హం.

ఈ తతంగాన్ని ఋగ్వేదులు మాత్రం సూత్రధారణకు ముందూ, తదితరులందరూ సూత్రధారణ తర్వాతా ఆచరిస్తూంటారు.

పాణిగ్రహణం అన్నది ఇప్పుడు జరిగే కార్యక్రమం. పూర్వం ఇదొక్కటే ఒక వివాహ పద్ధతి. ఇందులో వరుడు వధువు చెయ్యి పట్టుకుంటాడు. అప్పుడు "గృహ్ణామితే సుప్రజాస్త్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాసహ" - అని అంటాడు. గతంలో పూర్వీకులందరూ చేసినట్టే నేను, సత్సంతానం కోసం నీ చేయి తీసుకుంటున్నానని భావం. ఇందులో కేవలం సంతాన కాంక్షే కనిపిస్తుంది. మన ప్రాచీన గ్రంథాలన్నిట్లో పెళ్ళంటే ఇంతే. ఇందులో క్రమంగా ఏ వేలు పట్టుకోవాలన్న అంశం మీద తర్జన భర్జనలు జరిగాయి. వధువు తిరగవేసిన కుడిచేతిని వరుడు బోర్లించిన కుడి చేతితో పట్టుకోవాలిట. బహుశా ఇది 'కాస్మాలజీ'199 లో ఉన్న ఆకాశం-భూమీ; పురుషుడూ - స్త్రీ భావాలు కావచ్చు.200 దీనితోపాటు సప్తపది ఉంది. సప్తపది అంతరార్థం ఇదివరకే వివరించడం జరిగింది. సప్తపదికి హిందూ న్యాయశాస్త్రంలో చాలా ప్రాధాన్యం ఉంది. ప్రభు, పి. ఎన్. అనే శాస్త్రజ్ఞుని అభిప్రాయంలో పాణిగ్రహణం, సప్తపది లేనిది పెండ్లి పూర్తికాదని ఉంది.201

ఐరేణి కుండలనుంచడం అన్న ఆచారాన్ని ధర్మారావు, ఇది బహుశా ఇరాన్ దేశపు ఆచారం కావచ్చని అన్నాడు. కుండలను రంగులతో అలంకరించి పూజించడం. మన సాహిత్యంలో వీటి ప్రస్తావన చాలా చోట్ల వస్తుందంటూ తాపీవారు చేమకూర కవినే ఉదాహరించారు. ఇలాటి రంగుల కుండల పెంకులు చాలా ఇరాన్ ప్రాంతపు తవ్వకాలలో బయటపడ్డాయి. మనకు ఈ కుండలు పెట్టడం ఆచారం కింద పరిణమించింది. నాగవల్లిలో కొన్నిముగ్గుల మధ్య కుండలు పెట్టే ఆచారం ఉంది. వాటిని దారాలతో మూస్తారు. సమస్త దేవతలను పూజిస్తారు. ఈ సందర్భంలోనే -

"నీలఒలోహితే భవతః కృత్యాసక్తిర్వ్యజ్యతె
ఏధంతే స్వాజ్ఞాతయః పతిర్బందేషు బధ్యతె"

అని నల్లపూసలు వధువుకు వరుడి చేత కట్టిస్తారు.

తర్వాతిది-

శేషహోమం : ఇది పూర్తిగా సంభోగ కార్య కలాపానిది. గౌరీ - గంధర్వుల పూజగా భావిస్తారు. మంత్రార్థాలన్నీ ఈనాడు చూస్తే పరమ బూతులుగా కనిపిస్తాయి. వీటినంటి పెట్టుకున్న కర్మకాండ గర్భాదానం. కార్యక్రమమే అలాటిది కనుక మంత్రాలన్నీ సంభోగ కార్యకలాపాన్ని వివరించేవే. అయితే ఇవన్నీ ఇంద్రుడూ, సూర్యుడూ, అగ్నీ, విష్ణుమూర్తీ, భూమీ, ఆకాశమూ, అశ్వినీ దేవతల పేర్లమాటున నడుస్తూంటాయి. పీటన్నిటినీ అధ్యయనం చేస్తే గుంపుపెళ్ళినుండి - జంటపెళ్ళివరకూ పెండ్లి కూతురుకు

సంబంధం ఉన్నవాళ్ళ జాబితాగా కనిపిస్తుంది.

కేవలం స్త్రీ పురుషులు సామాజికావసరాల దృష్ట్యా జతకట్టే దశనుండి, మతం అంటుకోవడంతో దీని చుట్టూ ఎంత తతంగం అల్లుకుందో విశదంగా పరిశీలించడం జరిగింది. సమాజాలు పరిణామం చెందుతున్నప్పుడల్లా స్త్రీ పురుష సంబంధాల్లో మార్పులు జరగడాన్ని గమనించాం. వివిధ ప్రాంతాల్లో వివిధ తండాలలో ఉండే ఈ సంబంధ బాంధవ్యాలన్నిటినీ ఆయా వివాహ పద్ధతులుగా ఏర్చి కూర్చారు. వీటన్నిటిలో సమానంగా ఉన్న అంశం ఒక్కటే. అదే స్త్రీ పురుషుల కలయిక. మిగిలిన తంతు అంతా భిన్నంగా ఉన్నట్టు బోధ పడింది. ప్రవర చెప్పుకోటంలో 'వాత్స్యాయనస్య' అని కనిపిస్తుంది. దీన్ని బట్టి-ఇలాటి వివాహపద్ధతి ఈరకంగా అతని కాలం తర్వాత ఏర్పడిందనుకోవచ్చు. గృహ్య సూత్రాలు కూడా ఈ తతంగంలో ఉండే అన్ని కార్యక్రమాలనూ పేర్కొనలేదు.

ఇతర మతాల గురించి ఆలోచిస్తే సిక్కు మతస్థుల్లో ఇంత తతంగం కనిపించదు వధూవరులను గురుగ్రంథం చుట్టూ నాలుగు సార్లు తిప్పిస్తారు. ఆ తర్వాత ఆ గ్రంథంలోని ఏదో ఒక పేజి తీసి అందులో ఉండే విషయాలు వివరిస్తారు. ఈ కార్యక్రమమంతా గ్రంథాన్ని కాపాడే 'గ్రంథి' (పూజారి) జరి పిస్తాడు. అలాగే మహమ్మదీయుల్లో నికా కట్టడం. ఆ సందర్భంలో 'ఇల్ హామదుల్లా ఇల్‌మెహ్‌మూద్ . . ఉందా ఉమాఉల్‌కితాబ్' - అన్న కురాన్ భాగాన్ని మౌల్వీ చదివి వినిపించడంతో పెళ్ళి తంతు ముగుస్తుంది. (పేజి 69, పార్ట్ 1, నిసాబ్ - ఆహెల్ - ఖిద్మత్ సహేరియా. గవర్నమెంట్ పబ్లికేషను.) క్రైస్తవుల్లో కూడా వివాహ తతంగం చాలా క్లుప్తంగానే, అందుకు సంబం ధించిన బైబుల్‌లోని ఒక చిన్న భాగాన్ని బిషప్ చదవడంతో పూర్తవుతుంది. అయితే కాథలిక్ మతస్థుల్లో హిందువులకుండే చాలా ఆచారాలను అను సరించడం గమనించవచ్చు.

ఏమయినా ధర్మారావు అన్నట్టు "జత కట్టడం ప్రకృతి పని. పెళ్ళి అన్నది మన పని" - అందుకే ఇంత ఆర్భాటం. ఇన్ని రకాలు. ఈ తంతుకు ప్రకృతితో సంబంధంలేదు. జతకట్టడం జాతిని నిలిపే కిటుకు అంతే.

ఈ వ్యాసాల రచనలో ధర్మారావు చాలా గ్రంథాల నధ్యయనంచేసినట్టు కొన్ని పుస్తకాల జాబితా ఇచ్చారు. విషయాలను తెలుగు దేశపు పెళ్ళి ఆచారా లతో పోల్చిచూపడం, మన పొరుగు ప్రాంతాల ఆచారాలతో సామ్యం చెప్పడం వల్ల ఆసక్తిని పెంపొందించారు. ఎంగెల్సు, మోర్గాన్‌లు విభజించిన సామాజిక దశలను ధర్మారావు కొంతవరకు తెలుసుకున్నట్టుగా ఈరచన వెల్లడిస్తుంది.

మడిబట్టలనీ, ఆచార్యులనీ, పురోహితులనీ, శాస్త్రిలనీ- అంటూ ఈ తతంగా లను తమ పబ్బం గడుపుకోటానికి కొందరు కలిసి పురోహిత వర్గంగా మారి సమాజాన్ని, స్త్రీనీ దోచుకున్నారని తన అక్కసంతా వెళ్ళగక్కాడు. వీరంతా పరాన్నభుక్కులనీ, ఏకుల్లాగా వచ్చి మేకులయ్యారనీ దేశదేశాల ఆచారాల్లో ప్రీస్టులూ, మతగురువులూ, ఆచార్యులూ చేసిన కర్మకాండను వివరిస్తూ ధర్మా రావు ఈసడించుకున్నాడు. సమాజం ఆస్తిగా ఉండే వస్తువు - అది స్త్రీ అయినా ఏదైనా - వ్యక్తిపరంగా ఏనాడు మారిందో ఆనాడే ఇది మొదలైంది. 'ఆస్తి అంటే ఉన్న ఆశ ఎంత పనయినా చేయిస్తుంద'ని ధర్మారావు గట్టిగా అభి ప్రాయపడ్డాడు.

అనాదికాలం నాటి నమ్మకాలు, రూపం మారి ఆచారాలుగా పెళ్ళి తంతులో కనిపిస్తున్నాయన్నది నిర్వివాదం. అయితే ఎంతో నాగరికత సంత రించుకున్న ఈ సమాజంలో- సామాజిక విలువలు పూర్తిగా వేరైన ఈ సమాజంలో- పెళ్ళి పేర ఆ తతంగం ఎంతవరకూ సమంజసమన్నది ఆలోచిం చాలి. "శాఖాంతర, కులాంతర, మతాంతర, రాష్ట్రాంతర........వివాహాలను ఈనాడు ప్రపంచమంతటా హర్షిస్తున్నారు. దేశ సమైక్యతకూ, శాంతికీ ఇవి ఎంతవరకు ఉపయోగపడతాయో గుర్తించి వీటిననుసరించడం చాల అవసరం" అంటూ తాపీవారు తమ ఈ గ్రంథాన్ని ముగించారు.

ధర్మారావుకు బ్రాహ్మణేతర ఉద్యమంతో సంబంధం కలగడం, స్వాభిమాన ఉద్యమంలో ఉత్సాహంతో పాల్గొనడం, ఇంతకు ముందే గమనించాం. ఆ వెలుగులోనే ఈ పెళ్ళిని పరిశీలించాడు. ఈ తతంగంలో ప్రతి దాన్నీ అనుమానంతో చూస్తూ శాస్త్రీయంగా అధ్యయనం చేశాడు. తర్వాత ఆయనే సంస్కరణ వివాహాలు జరిపించి కార్యరంగంలోకి దూకాడు. వాటిని తన కుటుంబం నుండే ఆరంభించాడు. కేవలం యువతీ యువకుల పరస్పర అవ గాహన మీదనే జతకట్టడం ఉండాలని నమ్మి, తను చేయించిన వివాహాలన్నీ ఆ ఉద్దేశం లక్ష్యంగానే చేయించాడు. తన ఆశయానికొక చక్కని సిద్ధాంత గ్రంథంలాగా ఈ పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలను రాశారు. మనకందించారు.

## దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు - సూచికలు


1. ధర్మారావు, దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1977, పేజి 18.
2. తిరుమల రామచంద్ర తన వ్యాసంలో 'ప్రజనన తంత్రాలు' అని అన్నారు. ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక, మద్రాసు, 1973-1974, పేజీ 134.
3. 'కో' అంటే తమిళ, మళయాళ భాషల్లో దేవుడు – రాజు. ఒక దశలో రాజూ దేవుడూ ఒకడే అయినప్పుడు 'కోయిల్' అంటే వాళ్లుండే యిల్లు అయింది. తర్వాత ఆ యిద్దరూ వేరైనప్పుడు కోయిల్ అంటే దేవుడుండే ఇల్లు. కోట అంటే రాజుండే ఇల్లనీ మారింది. 'అట', 'అడ', 'అణ', అనేవి స్థలనిర్దేశకాలు. కర్నాట, కన్నడ, తెలంగాణ కో అంటే దేవుడైనప్పుడు తమ భాష దేవుడినుండి వచ్చిందన్న భావ స్ఫోరకంగా, ఆ నమ్మకంతో కోయ, కోదు, గోండు - అన్నతండాల భాషల పేర్లు వచ్చాయి.
4. జార్జ్ థాంప్సన్ రాసిన స్టడీస్ ఇన్ ఎర్లీ గ్రీక్ కల్చర్.
5. ప్రమథనాథ్ బోసు ఈ సమాజాన్ని ప్రథమ, ద్వితీయ, తృతీయ దశలుగా విభజించాడు. మొదటి యుగం క్రీ. పూ. 6000 వేల నుండి క్రీ. పూ. 2000 సంవత్సరాలు; రెండవ యుగం క్రీ. పూ. 2000 క్రీ. శ. 700 సంవత్సరాలు; మూడవ యుగం క్రీ.శ.700 నుండి నేటి వరకు.
   ప్రమథనాథ్ బోస్, ఇపోక్స్ ఆఫ్ సివిలిజేషన్, ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్, న్యూఢిల్లీ, మొదటి ప్రచురణ, 1913, తర్వాతిది 1978, పేజి. 9.
6. జెనైడ్ ఎ. రాగోజిన్, వేదిక్ ఇండియా, మున్షి రాం మనోహర్లాల్, ఢిల్లీ, 1961, పేజి 108.
7. జెనైడ్ ఎ. రాగోజిన్, వేదిక్ ఇండియా, మున్షీ రాం మనోహర్లాల్, ఢిల్లీ, 1961 పేజి, 62.
8. గ్రాంట్ అలెన్, ది ఇవల్యూషన్ ఆఫ్ ది ఐడియా ఆఫ్ గాడ్, వాట్స్ అండ్ కో, లండన్, 1931, పేజి 232.
9. డి. డి. కౌశాంబి, ది కల్చర్ అండ్ సివిలిజేషన్ ఆఫ్ ఏన్షియంట్ ఇండియా ఇన్ హిస్టారికల్ అవుట్‌లైన్, వికాస్ పబ్లిషింగ్ హవుస్ ప్రయివేటు లిమిటెడ్, ఢిల్లీ - లండన్, 1972, పే 76.

10. ప్రిఫాల్ట్, ది మదర్స్, జార్జ్ ఆలెన్ అండ్ ఆల్విన్ లిమిటెడ్, లండన్, 1959, iii పేజి 251 – 252.
11. ఈ నమ్మకం తొలి దశలో బాగా ఉండేది.
మలినొవస్కీ. సెక్స్ అండ్ రిప్రెషన్ ఇన్ సావేజ్ సొసయిటి, పేజి 10
12. గ్రీన్‌లాండ్ తెగల్లో ఈ విశ్వాసం ఉంది.
జి. యం. స్పారాట్, గేమ్స్ అండ్ స్టడీస్ ఆఫ్ సావేజ్ లైఫ్, మిస్టిక్ రోజ్ (క్రాలీ), పేజి 206.
13. దేవీ ప్రసాద్ ఛటోపాధ్యాయ, లోకాయత, పీపుల్స్ పబ్లిషింగ్ హవుస్, న్యూఢిల్లీ, 1978, పేజి 302.
14. బెర్ట్రెండ్ రస్సెల్, మారేజ్ అండ్ మోరల్స్, వాల్యూం 4, 1948, పేజి 31.
15. గ్రాంట్ ఆలెన్, ది ఇవల్యూషన్ ఆఫ్ ది ఐడియా ఆఫ్ గాడ్, వాట్స్ అండ్‌కో, లండన్, 1931, పేజి 25.
16. జె. జి. ఫ్రేజర్, ది గోల్డెన్ బౌ, మాక్మిలన్ అండ్ కో లిమిటెడ్, లండన్ 1960, పేజి 16. మాజిక్‌ని అతడిలా వివరిస్తాడు.

సింపతెటిక్ మాజిక్ అనుకంపనం

| హోమియోపతిక్ స్వకంపనం | కంటేజియస్ స్పర్శనం |
| --- | --- |

ఈ మాజిక్ ఉదాహరణ : గర్భిణిస్త్రీ సుఖ ప్రసవం కావడానికి మాంత్రికుడు తన పొట్టకు పెద్ద రాయి కట్టుకుని ప్రసవవేదన పడుతున్న వాడిలా పెద్దగా అరుస్తూంటాడు. అరుస్తూ అరుస్తూ తను కట్టుకున్న రాయిని కిందకు జారవిడుస్తాడు. అప్పుడు గర్భిణిస్త్రీకి సుఖ ప్రసవం కాగలదని భావించేవారు. (ఫ్రేజర్, గోల్డెన్ బౌ, పేజి 18)
17. ది లాస్ట్ టూ మిలియన్ ఇయర్స్, రీడర్స్ డైజెస్ట్ అసోసియేషన్, న్యూయార్క్, 1974, పేజి 24.
18. అలాగే మనిషి మళ్ళీ జన్మిస్తాడని భావించాడంటాడు గ్రాంట్ ఆలెన్.
19. వీటి కోసం సౌభాగ్యవర్ధక క్రియలు చేపట్టారు. సెక్సును గుర్తుగా వాడుకున్నారు.
సంపాదకుడు. జేమ్స్ హేస్టింగ్స్, వర్షిప్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్, వాల్యూం 12.

20. ఖిరో, ఆరు - ద్వీపవాసులు, యుద్ధంలో చనిపోయిన వీరుల మాంసం తింటారు. ప్రాచీన ఐరిష్‌లోని స్ట్రాబూ తెగలు తమ తండ్రుల శరీరం తినడం గొప్పగా భావిస్తాయి. సుమిత్రాలో బట్టా తెగ తమ బంధువుల్ని తింటుంది. వీరుల పుర్రెల మీద పడుకుంటే ఆ శక్తి తమకూ వస్తుందని భావిస్తారు వాళ్ళు.
గ్రాంట్ ఆలెన్, ది ఇవల్యూషన్ ఆఫ్ ది ఐడియా ఆఫ్ గాడ్, వాట్స్ అండ్ కో, లండన్- 1931, పేజి 226.

21. మోర్గాన్ అంచనా ప్రకారం 'టోటం' అన్న పదం అమెరికాలో ఉండే ఒజిబ్వా తెగవారి మాట. దీన్ని వాళ్ళు 'డొడాయిన్' అంటారు. ఇది తెగలకు గుర్తు. కుక్క, తాబేలు, మతంగం, మూషికం లాంటివన్నీ ఈ గుర్తులే. ఈ తెగలవాళ్ళు వాటి నుండే తాము పుట్టామని భావిస్తారు. వాటిని దైవంగా పూజిస్తారు. ఇవే చాలకాలం తర్వాత ఇంటి పేర్లయ్యాయి. ఈ పద్ధతి ఆస్ట్రేలియా, అమెరికా, మలినేషియా, ఆఫ్రికా ఇండియాలలోనూ, ఇతర ఆసియా దేశాల్లోనూ ఉంది.
దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, లోకాయత, పీపుల్స్ పబ్లిషింగ్ హవుస్ పబ్లికేషన్స్, 1978, పేజి 87-89.

22. హెచ్ నిగ్గమేయర్ అనే జర్మనీ మానవ శాస్త్రజ్ఞుడు భారతదేశంలో టోటమిజం గురించి చాలా విపులంగా చర్చించి ఓ గ్రంథం (1933) రాశాడు. జె. హెకెల్ ఈ టోటమిజం గురించి రాస్తూ

1. ఇది తమ తండాను పాలించే జంతువు, చెట్టు, మనిషి గుర్తుగా ఉండవచ్చు.
2. ఇతడు రక్షకుడు, భయంకరుడూ కూడానూ.
3 మనుషుల పేర్లూ, గుర్తులూ వీటి ఆధారంగా ఉంటాయి.
4. ఈ గుర్తులతో మనుషుల్ని చూడటం ఉంది.
5. వీటిని తాకడం - చంపడం - తినడం నిషేధం.

అంటూ వివరించాడు. ఇది ఆఖేటక దశలోనూ వ్యావసాయిక దశలోనూ ఉండేది. ఆస్ట్రేలియా, ఉత్తర అమెరికా, భారతదేశాలలో చాలా ప్రచురంగా ఉందని నిగ్గమేయర్ అంటాడు. భారతదేశంలో ఈ భావాలు; ఇండో ఆర్యులూ, ద్రావిడులూ, ముండా తెగలూ, పాలే మంగోలాయిడ్ తెగలలో కన్నా ముందే వచ్చి ఉండవచ్చని నిగ్గమేయర్ అభిప్రాయం. ఒరిస్సా ప్రజల్లోనూ, మరాఠా ప్రాంతంలోనూ, ఉత్తర ప్రదేశ్ ప్రాంతంలోనూ, రాజపుత్రస్థానం వాళ్ళలోనూ ఇది ఒక ఆచారంగా ఉంది,

వాళ్ళ టోటంలన్నీ కూడా సాధారణంగా తాబేలూ, పామూ, పులీ, గొర్రె, గుర్రం, కదంబవృక్షం, వేప, అశ్వత్థం, ఇంకా కొన్ని పక్షుల పేర్లూ అయి అదే ఇంటి పేర్లుగా మారాయి. కొందరి దేవుళ్ళ వాహనాలు ఈ టోటమిక్ గుర్తులే. ముండా తెగలో హంసిపుర్తి ఒకటి. ఈ తండా ఎలకలను తమ సోదరులుగా భావించి పూజిస్తుంది. తెగలు మారినప్పుడు తమ టోటంలను మార్చుకోవడం అన్నది ఆచారం. ఈ టోటంలన్నీ ఆయా తెగలకు ఒక దశలో ఆహారాలు, అవే క్రమంగా ఆరాధ్యాలు అయ్యాయి.

ఫెర్రీరా, టోటమిజం ఇన్ ఇండియా, ఆక్స్‌ఫర్డ్ పబ్లికేషన్స్, 1965, పేజి 37 - 114.

23. న్యూకెలిడోనియన్లు, తిమోరలాట్ జనులూ, హాల్ మెహరా, అంబోయినా, సెలెబెస్ తెగల జనులూ శత్రువుల రక్తమాంసాలు తింటే వాళ్ళ శక్తులు తమకూ వస్తాయని నమ్ముతారు. జె. జి. ఎఫ్. రైడల్, కోటెడ్ బై అర్నెస్ట్ క్రాలీ, మిస్టిక్ రోజ్, వాల్యూం 1, పేజి 135.

24. అప్పర్ బవేరియా ప్రాంతంలో ఈ ఆచారం రూపం మార్చుకుంది. శవంమీద పిండిబొమ్మ పెట్టి కొంత సేపుంచి దాన్ని మృతుని బంధువులందరూ పంచుకుని తింటారు. ఇదే ఆచారం బాల్కన్ ప్రాంతంలో కూడా ఉంది. మెక్సికోలో రాజు చనిపోతే అతని రూపంలో కేకులు చేసుకుని ప్రజలు తింటారు. ఇటలీలో కూడా ఈ ఆచారం ఉంది.

గ్రాంట్ అలెన్, ది ఇవల్యూషన్ ఆఫ్ ది ఐడియా ఆఫ్ గాడ్, వాట్స్ అండ్ కో, లండన్, 1931, పేజి 239 - 240.

25. పోతురాజు చంపిన బలిపశువు రక్తాన్ని తాగడం అన్న ఆచారం తెలుగుదేశంలో ఉంది. వీరుల రక్తాన్ని తాగితే వీరత్వం వస్తుందన్న నమ్మకాన్ని తెలిపే అనేక ఉదాహరణలు సిడ్నీ హార్ట్‌లాండ్ తాను రాసిన ది లెజండ్ ఆఫ్ పెర్సియస్ అన్న గ్రంథం రెండవ సంపుటం 'మృతుల కర్మకాండ' అన్న భాగంలో ఇచ్చాడు.

26. మధ్య ఆస్ట్రేలియాలో కొన్ని తెగలు యుద్ధానికి పోతూపోతూ బలిష్ఠుడైన ఒక యువకుణ్ణి చంపి రక్తం తాగి ఒంటికి పూసుకుని మరీ వెళ్తాయి.

డబ్ల్యూ. బి. స్పెన్సర్ అండ్ జి. యఫ్. గిల్లెన్, కోటెడ్ బై అర్నెస్ట్ క్రాల్, ది నేటివ్ ట్రైబ్స్ ఇన్ సెంట్రల్ ఆస్ట్రేలియా, మిస్టిక్ రోజ్, వాల్యూం 1, పేజి 461.

27. జెర్ట్రూడ్ జోబ్స్, డిక్షనరీ ఆఫ్ మైథాలజీ, ఫోక్‌లోర్ అండ్ సింబల్స్, పార్ట్ 2, 1962, పేజి 1296.

28 రోము, గ్రీసుల్లో ఈ పందిని బలిచ్చే ఆచారం ఉంది. బాబిలోనియన్లకు పంది పవిత్రమైంది. ప్రాచీనకాలంలో హమ్మురాబీకి, పంది మాంసం అక్కడి దేవతలకు సమర్పించే వాళ్ళు. హర్రానియన్ తెగలు ఏడాదికో సారి దేవతకు పందిని బలిచ్చి తినడం ఆచారంగా భావిస్తాయి. సిరియాలో ఆఫ్రొడైట్ సౌభాగ్య దేవతకు పందిని బలివ్వడం చాలా ముఖ్యం. కోర్ట్‌లాండ్‌లో కొన్ని జిల్లాల్లో పంటలు బాగా పండాలంటే పందిని బలిస్తారు. (పేజి 180). ఫిజీ దీవుల్లో యవ్వనం వచ్చిన వాళ్ళకు పందిని బహూకరించడం ఒక ఆచారం. బర్మాలోని కారెం జాతుల్లో పంట బాగా పండకపోతే పంది రక్తం పొలంలో చల్లుతారు. పందిని భూమిలో తొక్కుతారు. (పేజి 147) అసీరియన్లలో పాతాళ లోక దేవత తమూజ్. అలాగే చైనా, టర్కీలలో పందికున్న పేర్లలో తమూజ్ అన్నది కూడా ఉండడం గమనార్హమని బాల్ అంటాడు.
సంపాదకుడు; జేమ్స్ హేస్టింగ్స్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్, వాల్యూం 12, పేజి 147 - 195.

29. జేమ్స్ హేస్టింగ్స్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్, వాల్యూం 9, పేజి 665 - 667.

30. హెన్రీ క్రిప్టన్, కోటెడ్ బై ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, లండన్, 1921, పేజి 571 - 572.

31. జార్జ్ థాంప్సన్ తాను రాసిన అసైకులస్‌లో చాలా వివరాలిచ్చాడు.

32. జె.జి. ఫ్రేజర్, ది గోల్డెన్ బౌ, మాక్మిలన్ అండ్ కో లిమిటెడ్, లండన్, 1960, పేజి 771.

33. శాక్తేయంలో పంచమకార పూజ ప్రధానం. మాంసభోజనం, మైధునం మత్స్యభోజనం, మద్యపానం, ముద్రలు, దిగంబర స్త్రీని ఉపాసించడం ఇందులో అతి ముఖ్యం.
జేమ్స్ జె. ప్రెస్టన్, కల్ట్ ఆఫ్ ది గాడెసెస్, వికాస్ పబ్లిషింగ్ హౌస్ ప్రయివేట్ లిమిటెడ్, ఢిల్లీ, 1980, పేజి 14.

34. 'జీసస్' అన్నది 'జాషువా' కు గ్రీకు పదం. ప్రాచీన టెస్ట్‌మెంటులో జాషువా ఇజ్రాయిలులకు నాయకుడు. కాననన్ను జయించిన వీరుడు అలాగే రోముపాలననుండి ఇజ్రాయిల్‌ను రక్షిస్తాడని ఇతని పేరూ జాషువా అన్నారు. 'మెస్సయా జాషువా' అన్నదే గ్రీకుల్లో క్రైస్ట్ జీసస్ అవుతుంది. నజరత్ అనే ఊరు ప్రాచీన టెస్ట్‌మెంటులో లేదు. ఒక తెగను నట్‌జ్రి అంటారు. కొన్ని ప్రత్యేకమైన తంత్రాలు తెలిసిన తెగ ఇది.

ఆ పాత నిబంధన ఒకటవ చాప్టరులో ఒక అంశం ఉంది. ప్రాచీన బాబిలన్‌లో ప్రతి యేడూ ఒక ఖైదీని రాజదుస్తులేసి, ఐదు రోజులు రాజభోగాలనుభవింపజేసి, తర్వాత కొరడాలతో కొట్టి అతణ్ణి ఉరితీయడం అనే ఆచారం ఉండేది. పిలేత్ సైనికులు క్రీస్తును సరిగ్గా ఇలాగే చేశారు. ఈ కార్యక్రమాన్ని ఎవరూ చూడలేదంటూ మాత్యూ 26వ అధ్యాయం 56లో అంటాడు. అలాగే మార్క్ కూడా 14 వ అధ్యాయం 50లో చెప్తాడు. ఈ కాలంలో ఈజిప్టు, సిరియాలలో నరబలి ఉంది. అర్కాడియాలో లైకేయస్ కొండ మీద ఈ బలిస్తూంటారు. అలా చనిపోయిన వాడు పునరుత్థానం చెందుతాడన్నది ఈ క్రీస్తు కథతో అతుకుతుంది. దీన్నంతా పంటల పండగగా భావించాలి. వివాహ వ్యవస్థ సరిగా లేనప్పుడు పుట్టినవాడితడు. ఇతణ్ణి దేవుడిగా భావించారు. కనుక అలాటి భావాలే అంటగట్టారు. ఈజిప్టు పురాణాల్లో ఐసిస్‌కు భర్త ఆసిరిస్. అతడు చనిపోయిన తర్వాతనే ఐసిస్‌కు హోరస్ పుట్టాడు. ఇక క్రీస్తును గురించి చూస్తే అతడి జననం గూర్చి బైబిల్ నాలుగవ పుస్తకం పట్టించుకోలేదు. మాత్యూ, లూక్‌లే రాశారు. ఆరోజుల్లో పలువురు బానిసలను శిలువ వేసేవారు. ఈ బాధలనుండి విముక్తి కలిగించడానికి ఓ మెస్సయా వస్తాడని యూదులు భావించారు.

ఆర్చిబాల్డ్ రాబర్ట్‌సన్, ది ఆరిజిన్స్ ఆఫ్ క్రిస్టియానిటీ, లారెన్స్ అండ్ విషర్ట్, లండన్, 1962, పేజి 72 - 74.

35. ఆల్‌సోల్సుడే క్రైస్తవుల్లో ఇలాటి భావనను తెల్పే పండుగే.

36. ఇది మహమ్మదీయులు, క్రైస్తవుల్లో కూడా ఆచారంగా ఉండేది. తర్వాత క్రైస్తవులు మానేశారు. ముస్లిం స్త్రీలకూ మొదట్లో ఈ సున్నతి ఉండేది. యూదుల్లో అందరికీ ఉంది.

37. ఇప్పటికీ మన దత్తత మంత్రాలను జాగ్రత్తగా పరిశీలిస్తే దత్తుడు పూర్వకుటుంబంలో మరణించినట్లు షోడశీ కర్మమంత్రం చదివి, స్వీకరించిన కుటుంబంలో జాతక కర్మ చేస్తారు. తండాల్లో కూడా ఇలాటి దత్తత పద్ధతినే మోర్గాన్ వివరిస్తాడు.

38. సమరేష్ బోస్, ది తాంత్రిక్ కల్ట్ - క్వెస్ట్, సండే వారపత్రిక, 1981 జనవరి 25, పేజి 13.

39. క్రైస్తవుల పాదరీల చేతుల్లో పాము ఆకారంలో కర్ర ఉండేది. ఎస్కులాపియస్ దేవత చేతిలో సర్పం ఆయుధంగా ఉంటుంది. ప్రాచీన ఈజిప్టులో నెఫ్ - సర్పదేవత. ఈమె అమరత్వానికి చిహ్నం.

ఉత్తర అమెరికాలో పాము పూజలున్నాయి. ఓహియోలో పెద్ద సర్పం ఆకారమున్న దిబ్బను ప్రభుత్వం ఇంకా కాపాడుతోంది. గ్నాస్టిక్ తెగలు సర్పాన్ని జ్ఞానదేవతగా పూజిస్తాయి- అయితే అన్ని దేశాల్లోనూ సర్పాన్ని లైంగిక శక్తికి చిహ్నంగా భావిస్తారు.
ఓ ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీక్రిప్టన్, లండన్, 1921, పేజీ 538 - 540.

40. జెర్ట్రూడ్ జోబ్స్, డిక్షనరీ ఆఫ్ మైథాలజీ, ఫోక్‌లోర్ అండ్ సింబల్స్, పార్ట్-2, 1962, పేజి 1418, 1419.

41. సంపాదకుడు : జాన్ బౌలే, ది కన్సయిజ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వరల్డ్ హిస్టరీ, లండన్, 1958, పేజి 40.

42. పశ్చిమాసియాలో వీళ్ళను 'హిట్టయిట్స్' అంటారు. దీన్ని వాళ్ళభాషలో 'ఖత్తి' అంటారు. క్షత శబ్దానికీ దీనికీ పోలికలు చూడవచ్చు. ఈ విషయాలను ఫ్రెడరిక్ హోజ్నీ 'హిట్టయిటు' చరిత్రలో విశదీకరించాడు

43. కింగ్ అన్న పదం పురాతన ఆంగ్లంలో సిన్ (సి. వై. యన్. యన్.) అన్నదాన్నుండి వచ్చింది. దీనర్థం తెగ నాయకుడు- ప్రతినిధి. ఆంగ్లో శాక్షన్ సమాజం 'కిన్స్' అన్న గణాల నుండి వచ్చింది. అదే కింగ్‌గా మారింది. అంటే వీరుల నాయకుడు - మధ్యవర్తి.
సంపాదకుడు : డేవిడ్. ఎల్. సిల్స్, ఇంటర్నేషనల్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ సోషల్ సైన్సెస్, వాల్యూం 8, పేజి 386.

44. విల్ డ్యురాంట్ తన గ్రంథంలో వివరిస్తాడు.

45. మలెనీషియన్లు 'మన' అన్న మాటకూ, ఇరాకీవాళ్ళు 'ఒరిండా' అన్నదానికీ; పూజారులైన తమ నాయకులకు అతిలోకశక్తులు ఉన్నాయనీ ప్రకృతి శక్తులను శాసించగలరనే నమ్మకంతో ఉన్నారన్న భావం ఉంది. పురోహిత నేతలూ అలాగే ప్రచారం చేశారు.
సంపాదకుడు : జేమ్స్ హేస్టింగ్స్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్, వాల్యూం 9, పేజి 85, ఈ. లెహ్మాన్‌రాసిన వ్యాసం

46. సంపాదకుడు· జాన్‌బౌలే, ది కన్సయిజ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వరల్డ్ హిస్టరీ, లండన్, 1958, పేజి 94.

47. చిన్నచిన్న రాజ్యాలు కలిసి ఒక టైరంట్ కింద ఉండేవి. రైతులు పొలాలు చిన్న భూస్వాముల ఆధీనంలో ఉండేవి. వీటినుండి ఏథెన్స్‌లో సొలాన్ అనే నాయకుడు వాళ్ళనూ వాళ్ళ పొలాలనూ విడిపించాడు. బానిసలకు విముక్తి కలిగించాడు, దున్నే వాడికి పట్టాలిచ్చాడు అలా·

ఏథెన్స్, పైరెంట్ ప్రిన్స్ చేతికిందికి పోకుండా తెగలను కూడగట్టి కృషిచేశాడు.
సంపాదకుడు: జాన్‌బౌలే, ది కన్సయిజ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వరల్డ్ హిస్టరీ, లండన్, 1958, పేజి 64, 65.

48. జార్జ్ బెర్నార్డ్‌షా తన ఎడ్వెంచర్స్ ఆఫ్ బ్లాక్‌గర్ల్ ఇన్ సర్చ్ ఆఫ్ గాడ్ లో వివరంగా రాశాడు.

49. ది లాస్ట్ టూ మిలియన్ ఇయర్స్, రీడర్స్ డైజెస్ట్ అసోసియేషన్, న్యూయార్క్, 1974, పేజి 36.

50. హీబ్రూ జాతిలో ఈ గుడారాల ఆలయాలను గూర్చి పాత టెస్ట్‌మెంటు చాలా చెప్తుంది. జేమ్స్ హేస్టింగ్స్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్, వాల్యూం 12, జె. ఎ. మెకులోక్ వ్యాసం.

51. ఎస్.ఎ. డాంగే, ఆదిమ కమ్యూనిజం నుంచి బానిస సమాజం వరకు భారతదేశం, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1978.

52. గ్రాంట్ అలెన్, ది ఇవల్యూషన్ ఆఫ్ ది ఐడియా ఆఫ్ గాడ్, వాట్స్ అండ్ కో, లండన్, 1931.

53. దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, లోకాయత, పీపుల్స్ పబ్లిషింగ్ హవుస్, న్యూఢిల్లీ, 1978 పేజి 295.

54. మొదటి దేవాలయాల ఉనికి ఎరిడూలో శ్మశానాలలో దొరికిన రాళ్ళ ఆధారాలతో మొదలయ్యాయి. దేవుడి పూజారే రాజ్యానికి సంబంధించిన లెక్కలను తయారు చేసేవాడు. దేవాలయమే రాజధాని.
సంపాదకుడు : జాన్ బౌలే, ది కన్సయిజ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వరల్డ్ హిస్టరీ, లండన్ 1958, పేజి 38.

55. ఇవి బ్రహ్మాండమైన కట్టడాలు. నిప్పూర్‌లో ఎన్‌లిల్ దేవాలయాన్ని మవుంటెన్ ఆఫ్ స్టార్మ్ అనీ, బాండ్ బిట్వీన్ హెవెన్ అండ్ ఎర్త్ అనీ అనేవాళ్ళు.
సంపాదకుడు : జాన్ బౌలే, ది కన్సయిజ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వరల్డ్ హిస్టరీ, లండన్, 1958, పేజి 39.

56. ఫ్రేజర్ గోల్డెన్ బౌలో దీన్ని బాగా వివరించాడు.

57. అండమాన్‌లో యవ్వనం వచ్చినవాళ్ళకు పంది మాంసం, రక్తం శరీరానికి పూస్తారు. క్రాలీ, మిస్టిక్ రోజ్, పేజి 139.

58. ఒరిస్సా రాష్ట్రం కటక్‌లో పెద్ద చండీఆలయం ఉంది అందులో హనుమంతుడి గుడి, లక్ష్మీనారాయణుడి గుడి, శివలింగాలు, బలి

మంటపం అన్నీ ఉన్నాయి.
జేమ్స్. జె. ప్రెస్టన్, కల్ట్ ఆఫ్ ది గాడెసెస్, వికాస్ పబ్లిషింగ్ హవుస్ ప్రయివేటు లిమిటెడ్, ఢిల్లీ, 1980, పేజి 43.

59. గాంధార శిల్పం ప్రాచుర్యంలోకి వచ్చినప్పటినుండీ మిథున శిల్పాలు ఈ సౌభాగ్య చిహ్నాల రూపంలో వచ్చి ఉండవచ్చు. అదీ క్రీస్తుకు పూర్వం నాలుగో శతాబ్దంలో. మహాయాన బౌద్ధం వీటిని ప్రచారం చేసింది. ఆ విధంగా మొత్తానికి 9, 10 శతాబ్దాల్లో ఈ మైథున శిల్పాలు దేవాలయాలమీద మలచడం విస్తృతంగా సాగి ఉండవచ్చు. ఒరిస్సా ప్రాంతంనుండి ఇతర ప్రాంతాలకు వ్యాపించి ఉండవచ్చు.
కె. కె. పిళ్ళే. ది మిథునా ఇన్ ఇండియన్ ఆర్ట్ (ట్రాన్సాక్షన్స్ ఆఫ్ ది ఆర్కియలాజికల్ సొసయిటీ ఆఫ్ సవుత్ ఇండియా, మద్రాస్) - 1957, పేజి 28 - 31.

60. టెంప్లం అన్న లాటిన్ పదంనుండి టెంపుల్ వచ్చింది. రెక్టాంగ్యులర్ ప్లేస్ మార్క్‌డ్అవుట్ బై ది ఆగర్ ఫర్ ది పర్పస్ ఆఫ్ హిస్ అబ్సర్వేషన్స్ విచ్ వర్ టేకెన్ విత్ ఎ రెక్టాంగ్యులర్ టెంట్.

61. గాణాపత్యంలో ఆరు భేదాలున్నాయి. మహాగణపతి, హరిద్రా గణపతి, ఉచ్ఛిష్ట గణపతి, స్వర్ణ గణపతి, నవనీత గణపతి, సంతాన గణపతి ఆరాధనలు. గణపతికి రక్తవర్ణం యిష్టం. అందుకని ఎర్ర బట్టలు కట్టుకుని పూజిస్తారు. అగ్ని పురాణం 71, 179, 313, 318, 348 అధ్యాయాల్లో వ్రత విధానాలున్నాయి. "అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థయిర్య వీర్య విజయాయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం"- అని సంకల్పం చెప్పుకుంటారు. శంకరాచార్యుడు ఏర్పరచిన పంచాయతన పూజా విధానంలో గణపతీ ఉన్నాడు. పంచాయతనంలో విష్ణువు - సాలగ్రామరూపం; శివుడు - ప్రాణలింగ రూపం; సూర్యుడు - స్పటికమణి రూపం; శక్తి - లోహ శిల రూపం; గణపతి - ఎనిమిది కోణాల చతురస్రాకారపు శిల రూపంలో వస్తువులుంటాయి. ఏ మూర్తిని ప్రధానంగా పూజించాలంటే దాని చిహ్నాన్ని మధ్య ఉంచడం ఆచారం. శంకరాచార్యుడు ఒక రకంగా ఈ పంచాయతనం ద్వారా బహు దేవతారాధననూ, నాటి సౌభాగ్య దేవతలనూ అంగీకరిస్తూనే అద్వైతాన్ని బోధించాడనవచ్చు.
శ్రీధరమూర్తి, గణపతి, పునర్వసు ప్రకాశనం, బెంగళూరు, 1978, పేజి 98 - 99 - 105.

62. దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, లోకాయత, ఢిల్లీ, 1978, పేజి 301.
63. ఈజిప్షియన్ భాషలో పిరమిడ్‌ను మేరు అంటారు.
64. సంపాదకుడు: జాన్‌బౌలే, ది కన్సయిజ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వరల్డ్ హిస్టరీ, లండన్ 1958, పేజి 95-96.
65. వేదవాఙ్మయంలో 'గృత్స' - 'గృత్సపతి' 'గృత్సమద' అని ఉంది. గిరిజన ప్రాంతాల్లో తెలుగు నాట గొరగాడు అంటారు.
66. సంపాదకుడు· జాన్ బౌలే, ది కన్సయిజ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వరల్డ్ హిస్టరీ, లండన్ 1958, పేజి 97
67. యూదులు పందిని చంపరు. తినరు. అది తన ముట్టెతో భూమిని కెలికి, భూమిని దున్నడం, అనే భావనను వారికి మొదట్లో నేర్పి వ్యవసాయానికి మార్గం చూపిందని విశ్వసిస్తారు. సి.జె.బాల్, కోటెడ్ బై జేమ్స్ హేస్టింగ్స్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్, వాల్యూం 12, పేజి 195.
68. ఇదే క్రమంగా వంశపారంపర్య వృత్తిగా మారింది. తిరుపతి వెంకటేశ్వర అర్చక స్వామి వర్గం నాలుగు కుటుంబాల్లో ఉంటుంది. వీళ్ళ ఆదివ్యక్తి తిరుపతమ్మ అనే స్త్రీ అలాగే కటక్‌లో చండీ ఆలయం పూజారులు ఒక బ్రాహ్మణ కుటుంబీకులు. వీరందరూ ఆనంద పండా వంశానికి చెందిన వాళ్ళు. ఈ పూజారత్వం ఆరుగురు సోదరుల గుత్తాధికారం.

జేమ్స్ జె. ప్రెస్టన్, కల్ట్ ఆఫ్ ది గాడెసెస్, వికాస్ పబ్లిషింగ్ హౌస్ ప్రయివేటు లిమిటెడ్, ఢిల్లీ 1980, పేజి 33, 34.
69. ఈజిప్టులో కర్నాక్ గుడిలో ఒక నగ్నదేవత తలమీద ఓ కిరీటంఉంది. అర్ధచంద్రాకారంలో గుండ్రని సూర్య చిహ్నం ఉంటుంది. ఇది సూర్య చంద్రుల సంభోగ దృశ్యంగా వాళ్ళు ఆరాధించే సౌభాగ్య దేవత. ఈ గుడి థీబ్స్ దగ్గర ఉంది.

ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్ 1921, పేజి 553.
70. బైబిల్ జనిసిస్ 1, 2లో ''ది స్పిరిట్ ఆఫ్ గాడ్ మూవ్ అపాన్ ది ఫేస్ ఆఫ్ ది వాటర్స్'' అని ఉంది. గ్రీకుల్లో పెతిస్ నది సౌభాగ్య దేవత. హేడ్స్ (పాతాళలోకం) లో స్టయెక్స్ నది ఉందనీ, అది సౌభాగ్య ప్రవమైందనీ అంటారు (వైతరణి). బైబిల్‌లో దీన్ని ఆధారంగా చేసుకుని ''ఈ నీళ్ళు నీకు శాపమౌతాయి. నీ కడుపులోకెళ్తాయి. నీ కడు

పును ఊరిస్తాయి. తొడలను ఉబ్బిస్తాయి'' (నం. వాల్యూం 22) అని సౌభాగ్య భావం చెప్తారు. జోర్డాన్ నది నీటిని క్రైస్తవులకు బాప్టిజం చెయ్యడానికి తీసికెళ్తారు. నైలు నీళ్ళు పవిత్ర జలాలుగా దాచుకుంటారు. మన గంగా జలం సరేసరి. బుక్ ఆఫ్ ఎజెకెత్‌లో ఈ జోర్డాన్ నది పవిత్ర జలాల గురించి ఉంది. దేవుళ్ళ ఆవాసాలు కనుకనే మన దేవతల విసర్జనం కూడా నీళ్ళలో కలుపుతాము. వాళ్ళ ఇళ్ళకు వాళ్ళను చేర్చడం అన్న భావం ఇందులో ఉంది.

71. ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 18.

72. చెవులు ధాన్యం తూర్పారపట్టే చేటలనీ, చేతుల్లో వరికంకులు, చెరుకు గడ ఉండాలనీ ఇది భూసౌభాగ్య వర్ధన దేవతనీ తెలుపుతోంది. మధ్యప్రదేశ్, మధుర, కన్యాకుమారి, టిబెట్‌లలో శ్రీ గణపతి విగ్రహాలూ ఉన్నాయి.
శ్రీధరమూర్తి, (అను. జానమద్ది హనుమచ్ఛాస్త్రి), పునర్వసు ప్రకాశనం, బెంగళూరు, 1978, పేజి 50-76.

73. ఐతరేయ బ్రాహ్మణంలో బృహస్పతి 'గణానాంతని' అని వేదపురుషులు అన్నారని ఉంది. మోనియర్ విలియమ్స్ 'గణానాం గణరూపేణ పాలకం' అని వివరించాడు. గణపతి బడుగువర్గాల దేవతని మనువు 'శూద్రాణాం గణనాయకః' అంటూ విమర్శించాడు. గణపతికి తాంత్రికులు తాంత్రికార్థాలు ఇచ్చారు. గణానికున్న టోటం ముఖం ఏనుగు. ఏనుగుటోటం గణం, మూషికటోటం గణంమీద ఆధిపత్యం సంపాదించడంగా చూడాలి. జేస్వాల్ - మూషిక గణాలు దక్షిణ భారతంలో ఉన్నాయని అన్నారు.
దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, లోకాయత, పీపుల్స్ పబ్లిషింగ్ హవుస్, న్యూఢిల్లీ, 1978, పేజి 125 - 231.

74. ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 131

75. పిటి వేళ్ళ ఆకారం మనిషల్లే ఉంటుంది. ప్రేమ సాఫల్యానికి దీన్ని ఆరాధించేవారు.
ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 420.

76. జంతు రూపంలో అందులోనూ ఎద్దుగా అసీరియా, జపాన్, ఈజిప్టులలో పూజిస్తారు. ఐసిస్ ను ఆవుగానూ, ఆసిరిస్‌ను ఎద్దు రూపంలోనూ ఈజిప్టులో ఆరాధిస్తారు. రాణి చనిపోయినప్పుడు రాజ సౌభాగ్యానికి ఆసిరిస్ బుల్‌ను చంపి దాని అంగాన్ని కోసి రాణి జననాంగంలో పెట్టి పాతేసే ఆచారం ఉండేది. అలాగే గ్రీకు దేవాలయంలో ప్రియాపస్ దేవుడు కోడి ముఖానికి పురుష జననాంగం లాటి రూపంలో పెట్టి పూజిస్తారు.

ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 435 - 437.

77. ఇది మెండిస్ దేవాలయంలో ఉంది.
జి. ఆర్. స్కాట్, ఫాలిక్ వర్షిప్, అమర్కో బుక్ ఏజన్సీ, న్యూఢిల్లీ, 1975, పేజి 28.

78. ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 352.

79. ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 342.

80. జి. ఆర్. స్కాట్, ఫాలిక్ వర్షిప్, అమర్కో బుక్ ఏజన్సీ, న్యూఢిల్లీ 1975, పేజి 55 - 57.

81. హెచ్. యం. వెస్ట్రాప్ అండ్ సి. యస్. వేక్, ఏన్షియంట్ సింబల్ వర్షిప్, న్యూయార్క్, 1875, పేజి 31.

82. జి. ఆర్. స్కాట్, ఫాలిక్ వర్షిప్, అమర్కో బుక్ ఏజన్సీ, న్యూఢిల్లీ, 1975, పేజి 243.

83. ఇలాంటిదే 'లిబరేలియా' పండుగ. ఇటలీలో దేవత లిబర్. ఇది 'బచ్చూస్'కు సంబంధించింది. మార్చి 17 న ఈ పండుగ జరుపుతారు. పెద్ద లింగ ధ్వజాన్ని వీధుల్లో ఊరేగిస్తారు. నగరంలోని స్త్రీలందరూ దీనికి పెద్ద దండలేస్తూ పూజిస్తారు. ఆనాడు వీధుల్లో స్త్రీ పురుషులు స్వేచ్ఛా సంగమం సాగిస్తూ ఈ లిబరేకు (అరియాడ్నే - బచ్చూస్ మారు పేర్లు) పెళ్ళి జరిగిస్తున్నామని భావిస్తారు. ఈ బచ్చూస్ దేవతకు మధువు, మైధునం చాలా ప్రియతమాలు.

ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 565.

84. ఆసియా మైనర్, సిరియా, గ్రీసు, ఇరానియా, ఈజిప్టు ప్రాంతాల్లో ఉండే సమస్త దేవతామూర్తుల స్తనాలూ చాలా గుబ్బలుగా ఉండే విధంగా కనిపిస్తూంటాయి.
ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 559.
85. ఇంగ్లండులో డంబ్లేన్ ఆబీ చర్చిలో కిటికీలు చాలా అందమైన యోని ఆకారంలో ఉన్నాయని రస్కిన్ అంటాడు.
ఓ ఏ వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 478.
86. ఓ. ఏ. వాల్, సెక్స్ అండ్ సెక్స్ వర్షిప్, హెన్రీ క్రిప్టన్, లండన్, 1921, పేజి 471.
87. శిలువ క్రీస్తుకు చాలాకాలం ముందునుండే అరాధనీయంగా ఉండేది. ఇది లింగరూపమే. దీన్ని అతి ప్రాచీనకాలం గుళ్ళల్లో ఫాదరీలు ఉపయోగించేవారు. కొంతకాలం తర్వాత ఈ అనాచార చిహ్నాన్ని ఉపయోగించరాదని నిషేధించారని హోవర్డ్ తన సెక్స్ అండ్ రెలిజియన్ అన్న గ్రంథంలో అంటాడు. క్రి. శ. 336 లో ఇయాంబ్లికస్ "ఈ శిలువలు పుష్టివర్ధకానికి - జీవితం కొనసాగించడానికి చిహ్నాలు" అంటాడు. థియోడోసియస్ రాజు ఈ శిలువలను చర్చి మార్గాలలో రాయడాన్ని నిషేధించాడు.
జె. ఆర్. స్కాట్, ఫాలిక్ వర్షిప్, అమరోక్ బుక్ ఏజన్సీ, న్యూఢిల్లీ, 1975, పేజి 260.
88. ఏన్ ఎన్‌క్వయిరీ ఇంటు ది సింబాలికల్ లాంగ్వేజ్ ఆఫ్ ఏన్షియంట్ ఆర్ట్ అండ్ మైథాలజీ, 1818.
89. జె. జి ఆర్. ఫర్లాంగ్, రివర్స్ ఆఫ్ లైఫ్, వాల్యూం 1, 1883, పేజి 232.
90. ఇసాబెల్లా. ఎల్. బర్డ్, అన్‌బీటెన్ ట్రాక్స్ ఇన్ జపాన్, వాల్యూం 1, లండన్ 1880, పేజి 67.
91. జేమ్స్. జె. ప్రెస్టన్, కల్ట్ ఆఫ్ ది గాడెసెస్, వికాస్ పబ్లిషింగ్ హవుస్ ప్రయివేటు లిమిటెడ్, ఢిల్లీ 1980, పేజి 48.
92. సంపాదకుడు . డేవిడ్. ఎల్. సిల్స్, ఇంటర్నేషనల్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ సోషల్ సైన్సెస్, వాల్యూం 8, జె. హెచ్. యం. బీటీ వ్యాసం ఆధారంగా, పేజీ 387.

93. జపాన్‌లో ఆడపిల్లలు తమ తల్లిదండ్రుల అంగీకారంతో గుళ్ళలో పడుపు వృత్తి సాగిస్తూంటారు. అలా సంపాదించిన డబ్బుతో ఆ తర్వాత పెళ్ళి చేసుకుంటారు.
బెర్ట్రాండ్ రస్సెల్, మారేజ్ అండ్ మోరల్స్, వాల్యూం 11, 1948, పేజి 120.
94. బ్రిఫాల్ట్, ది మదర్స్, పేజి 209.
95. ఇస్తార్, సిరియా, గాలీ. కౌరేటిస్, పెసినాస్‌హిట్టయి, ఎఫిసియస్ అర్థిమిస్ గుళ్ళలోని పూజారులు స్వాంగ ఖండనం చేసుకుంటారు. దీన్ని దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ కూడా సమర్థించాడు.
బ్రిఫాల్ట్, ది మదర్స్, వాల్యూం 2, పేజి 543.
96. అస్సాంలో కామాఖ్య గుడిలోని మూర్తి సీతాదేవి. ఆమె యోని ఆకారంలో ఉంటుంది. సతీదేవి యోని భాగం అక్కడపడ్డదని జనం నమ్మిక.
జేమ్స్. జె. ప్రెస్టన్, కల్ట్ ఆఫ్ ది గాడెసెస్, వికాస్ పబ్లిషింగ్ హౌస్ ప్రయివేటు లిమిటెడ్, న్యూఢిల్లీ, 1980, పేజి 11.

## కచ్చడాల ముచ్చట్లు - సూచికలు

97. సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవోమనాంశ జానతాం దేవాభాగం యిథా పూర్వే సంజానానా ఉపాసతే ॥ సమానో మంత్రః సమితిః సమానీ సమానం మనః సహచిత్తమేషాం సమానమ్మంత్రమభిమంత్ర ఏవః సమానేన ఓహ విప్రాజుహోమీ ॥ ఋషిః సంవనన ఆంగీరసుడు - మంత్రం పేరు; సంజ్ఞానం. ఋగ్వేదంలో ఆఖరి మంత్రం, దశమ మండలం 191.
భారత ముద్రణాలయం, ఔధ్ సంస్థానం, శాలి. 1859, పేజి 966.
98. జె. జి. ఫ్రేజర్, ది గోల్డెన్ బౌ, వాల్యూం 1, మాక్మిలన్ అండ్ కో లిమిటెడ్, లండన్, 1960, పేజి 457-460.
99. దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, లోకాయత, పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్, న్యూఢిల్లీ, 1978, పేజి 278-279.
100. ప్రాచీన గ్రీసు దేవాలయాలైన డెల్ఫి, డోడోనాలలో స్త్రీ పూజారులే ఉండేవారు. ఇటలీ దేవాలయాలన్నిట్లో పూర్వం ప్రధాన పూజా

రిణులే ఉండేవారు. బాబిలోనియా, అసీరియాలలో పూజారిణులే దేవాలయ ప్రధాన బాధ్యులు. అసిరియన్ శాసనాలు పూజారిణులనే 'తల్లులు' అని పేర్కొన్నాయి. అతి పురాతన కాలంలో ఈజిప్టు దేవాలయాల్లోని 'రా' గుడి ప్రధాన పూజారిణి ఈజిప్టు రాణే జె. నీధాం అనే రచయిత తన సైన్స్ అండ్ సివిలిజేషన్ అన్న గ్రంథంలో (1956) పురాతన చైనాలో ముఖ్యంగా 'టావోయిస్టు'ల్లో మంత్రగాళ్ళూ పూజారులూ స్త్రీలేనంటాడు.

101. పురుష భావం పోవాలంటే ఆదిమ ప్రజల నమ్మకం ఆ బట్టలను వదిలేయాలని. ఎందుకంటే బట్టలు, ధరించిన వాడి శరీర భాగాలన్న విశ్వాసం వారికుండేదని ఫ్రేజర్ అంటాడు (గోల్డెన్ బౌ వాల్యూం 4 పేజి 43) ఈ భావాన్నే బ్రిఫాల్ట్ కూడా సమర్థించాడు. తాహితి, మార్క్వెసాస్‌లలోని 'అరోయిస్' గుడి పూజారులు స్త్రీలలా ఉండాలని తమ శరీరానికి ఓ రకమైన రంగు పూసుకునేవారు. స్త్రీలలా హావభావాలు చేసేవారు. ఇదే ఉత్తర అమెరికా ఇండియన్స్; న్యూ మెక్సికో తెగల్లో, ఇండొనేషియా పీలూ దీవుల్లో బాగా అమల్లో ఉంది. జర్మన్ గుళ్ళలో పూజారులు స్త్రీ వేషాలేసుకుంటారు. వైట్ హెడ్ అన్న రచయిత వీటికి చాలా ఉదాహరణలిచ్చాడు 'ఇస్తార్' పూజారులు, గాలీ, కేరుటిస్, పెసినాస్, హిట్టయిట్ దేశాల్లో పూజారులందరూ అంగచ్ఛేదం చేసుకుని పూర్తిగా స్త్రీవద్భావం పొందేవారని బ్రిఫాల్ట్ అంటాడు.

102. శ్రీ వారణాసి సుబ్రమణ్య శాస్త్రి, ఆస్తికత్వము - 2, తాపీవారి దేవాలయ దూషణము - సమాధానము, 1970, పేజి 41-49

103. అనువాదం యస్. సి ఉపాధ్యాయ, కామసూత్రా, తారాపూర్‌వాలాస్ ట్రెజర్ హవుస్ ఆఫ్ బుక్స్, 1970, పేజి 235-239.

104. రిచర్డ్ లూయిన్‌షాన్, ఎ హిస్టరీ ఆఫ్ సెక్స్యువల్ కస్టమ్స్, 1961, పేజి 116-120.

105. డా॥ యస్. డి. అవస్థితో ఇంటర్వ్యూ - హైదరాబాదు.

106. అనువాదం · మామిడిపూడి వెంకటరంగయ్య, రాజాంతఃపుర నియమావళి భాగం, కౌటిల్యుని అర్థశాస్త్రం, మామిడిపూడి వెంకటరంగయ్య ప్రచురణలు, సికింద్రాబాద్, 1968 అధ్యాయం 20, ప్రకరణం 17, పేజి 57-59.

107. ఫ్రెడరిక్ ఎంగెల్స్, కుటుంబం దాని పుట్టు పూర్వోత్తరాలు, ప్రజాశక్తి కార్యాలయం, విజయవాడ, 1943, పేజి 35.

108. కాని పెండ్యాల సుబ్రమణ్యశాస్త్రి మతం ప్రకారం యుధిష్ఠర భీములు టిబెట్‌నుండి వచ్చిన కిరాయి కొడుకులు. అర్జునుడే కుంతికి పుట్టిన వాడు. కనుకనే అర్జునుణ్ణి పృథ కొడుకు పార్థ అన్నారు (మహాభారత చరిత్ర).
109. ఆర్. బ్రాష్, హౌ డిడ్ సెక్స్ బిగిన్, పాన్ బుక్స్ లిమిటెడ్, లండన్, 1973. పేజి 108.
110. ఫ్రెడరిక్ ఎంగెల్స్, కుటుంబం దాని పుట్టుపూర్వోత్తరాలు, ప్రజాశక్తి కార్యాలయం, విజయవాడ, 1943, పేజి 39.
111. జేమ్స్ హేస్టింగ్స్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్ 1964, పేజి 486 - 490.
112. జేమ్స్ హేస్టింగ్స్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్, 1964, పేజి 486 - 490
113. బ్రోనిస్లా మలినోవస్కీ, క్రైమ్ అండ్ కస్టమ్ ఇన్ సావేజ్ సొసయిటీ, రూట్లెడ్జ్ అండ్ కెగాన్పాల్ లిమిటెడ్, 1961, పేజి 61-84.
114. ఆర్. బ్రాష్, హౌ డిడ్ సెక్స్ బిగిన్, పాన్ బుక్స్ లిమిటెడ్, లండన్, 1973, పేజి 225.
115. షేక్ యం. హెచ్. కిద్వాయి, ఆఫ్ గదియా వుమెన్
116. రిచర్డ్ లూయీషాన్, ఎ హిస్టరీ ఆఫ్ సెక్స్యువల్ కస్టమ్స్, ఎ ప్రీమియర్ బుక్, 1960, పేజి 133.
117. ఫ్రాన్స్‌లో ఒక కవి రాసిన పుస్తకంలో కచ్చడం - స్త్రీకి తగిలించ డాన్ని విపులంగా వర్ణించాడు. స్కాట్లండ్‌లో సర్ డేవిడ్ లిండ్సే అన్న కవి ఒక ప్రబంధం రాశాడు. అందులో నాయికకు నాయకుడు కచ్చడం బిగిస్తాడు. ఇటాలియన్ భాషలో ఓ కథ వచ్చింది(1500 సంవత్సరం). అందులో ఈ కచ్చడాల గమ్మత్తు మాంక్ - నన్‌ల మధ్య వర్ణిస్తాడు.
118. జేమ్స్ హేస్టింగ్స్, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్ అండ్ ఎథిక్స్, 1964, పేజి 490,
119. రిచర్డ్ లూయీషాన్, ఎ హిస్టరీ ఆఫ్ సెక్స్యువల్ కస్టమ్స్, ఎ ప్రీమియర్ బుక్, 1960, పేజి 134.
120. సెక్స్యువాలజీ, పత్రిక, 1979.
121. రిచర్డ్ లూయీషాన్, ఎ హిస్టరీ ఆఫ్ సెక్స్యువల్ కస్టమ్స్, ఎ ప్రీమియర్ బుక్, 1960, పేజి 133.

122. సెక్స్యువాలజీ పత్రిక, 200 పార్క్ అవెన్యూ, సవుత్ న్యూయార్క్,
1970 మే, పేజి 66.
123. వనిత, మాస పత్రిక, మద్రాసు, 1979 అక్టోబరు, పేజి 70.
124. సెక్స్యువాలజీ పత్రిక, 200 పార్క్ అవెన్యూ, సవుత్ న్యూయార్క్,
1970 మే, పేజి 66.
125. ఈ విషయాలను చాలా స్పష్టంగా ఆర్. బ్రాష్ తన 'హవ్ డిడ్ సెక్స్ బిగిన్' అన్న గ్రంధంలో వివరించాడు. 1973, పేజి 152.
126. ఇండియా టుడే, పత్రిక.
127. పి. సి. రనండినో, హిస్టరీ ఆఫ్ సర్కుంసిషన్, 1801.
128. యూరపు సమాజ పరిణామ క్రమంలో ఆర్థికాధారం ప్రత్యక్షంగా కనిపిస్తుంది. కానీ భారతదేశంలో పురుషులకున్న కచ్చడాల విషయంలో ఇది చాలా లోతుగా పరిశీలించినప్పుడే సత్యమనిపిస్తుంది.

## పెళ్ళి 'లో చూపులు'-సూచికలు

129. న్యూ మెక్సికోలో ఇలాటి తండాను 'కుంకక్' అంటారు. ఈ తండాలో తండ్రి అనే అర్థానికి పదమే లేదు
బ్రిఫాల్ట్, ది మదర్స్, 1959, పేజి 65.
130. మంచూ, తార్తారుల్లో ఇంటిపేర్లు వేరైనవాళ్ళ మధ్య పెళ్ళిళ్ళు జరగకూడదు. ఇదే ఎండోగమీకి బలమైన ఉదాహరణ.
జాన్. ఎఫ్. మెక్లానన్, ప్రిమిటివ్ మారేజ్, 1970, పేజి 60.
131. బుల్ఫించ్ తన గ్రీషియన్ మైథాలజీలో ఈ విషయాన్ని వివరిస్తాడు.
132. ఆదిమ మానవుడి జీవితంలో నిప్పు అద్భుతమైంది. దాన్ని దేవుడుగా భావించాడు. ఆరిపోకుండా తీసికెళ్తూండేవాడు. రోమన్లలో పూర్వం ఏ బ్రహ్మచారైనా నిప్పును ఆరనిస్తే అతనికి మరణశిక్ష వేసేవారు.
విల్ డ్యూరాంట్, ది స్టోరీ ఆఫ్ సివిలిజేషన్, చాప్టర్ 2, పార్ట్ 1, 1954, పేజి 12.
133. ఇదే వారి టోటంగా మారింది
బ్రిఫాల్ట్, ది మదర్స్, 1959, పేజి 262
134. లూయిూ హెన్రీ మోర్గాన్ ఏన్షియంట్ సొసైటీ, భారతి లైబ్రరీ, పేజి 68.
135. జాన్. ఎఫ్ మెక్లానన్, ప్రిమిటివ్ మారేజ్, 1970, పేజి 51.

136. చైనాలో కొన్ని తండాల్లో భార్య ఇంటిపేరే భర్తకు వస్తుంది. ఆ తండాకు ఆమే నేత. ఇది ఒక రకంగా ఇల్లరికం అనవచ్చు.
బ్రిఫాల్ట్, ది మదర్స్, 1959, పేజి 78.
137. సుమత్రాలో బతక్ తండాలో ఈ అచారం ఉంది. ఫిజీ తండాలన్నీ దీన్నే పాటిస్తాయి. డా॥ వాయిసిన్ సర్వే ప్రకారం జావాలో ఇలాటి పెళ్ళిళ్ళే ఉన్నాయి.
బ్రిఫాల్ట్, ది మదర్స్, 1959, పేజి 56 - 57.
138. 19, 20 రాజ వంశాల కాలంలో ఈజిప్టులో రాజులు సోదరీసోదరుల మధ్యే వివాహాలు చేసుకున్నారు.
బ్రిఫాల్ట్, ది మదర్స్, 1959, పేజి 58.
139. ఋగ్వేదం, మండలం 10, సూత్రం 10.
140. జావాలో 'కాలంగా'లు తల్లి కొడుకుల సంబంధం చాలా శుభప్రదమని భావిస్తారు.
బ్రిఫాల్ట్, ది మదర్స్, 1959, పేజి 59.
141. లూయీ హెన్రీ మోర్గాన్, ఏన్షియంట్ సొసైటీ, భారతి లైబ్రరీ కలకత్తా, పేజి 438.
142. జాన్ ఎఫ్. మెక్లానన్, ప్రిమిటివ్ మారేజ్, ది యూనివర్సిటీ ఆఫ్ చికాగో ప్రెస్, చికాగో, 1970, పేజి 57.
143. వెనిగళ్ళ సుబ్బారావు, పెళ్ళి మంత్రాల బండారం, వెనిగళ్ళ హేతువాద సాహిత్య నికేతన్, రేపల్లె, 1979. పేజి 96.
144. ఎస్. ఏ. డాంగే, ఆదిమ కమ్యూనిజంనుండి బానిస సమాజం వరకూ భారత దేశం, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.
145. శ్రీ డి. డి. కొశాంబి, ది కల్చర్ అండ్ సివిలిజేషన్ ఆఫ్ ఏన్షియంట్ ఇండియా ఇన్ హిస్టారికల్ అవుట్లైన్, వికాస్ పబ్లిషింగ్ హవుస్, 1972, పేజి 75.
146. 'కోదులు' అనే తండాలో ఇలాంటి ఆగారాలుంటాయి. తల్లులు తమ పిల్లల్ని పంపుతూంటారు. శ్రీ అవసరాల జగన్నాధరావు పంతులు వ్యాసం, కళింగదేశ చరిత్ర, 1930, పేజి 34 - 35.
147. బ్రోనిస్లా మలినోవస్కీ, క్రైమ్ అండ్ పనిష్మెంట్ ఇన్ సావేజ్ సొసైటీ, లండన్, 1961, పేజి 84.
148 ఆర్.బ్రాష్, హౌ డిడ్ సెక్స్ బిగిన్, లండన్, 1973, పేజి 77, 78.
149. ఆర్.బ్రాష్, హౌ డిడ్ సెక్స్ బిగిన్, లండన్, 1973, పేజి 75.
150. శ్రీ కడియాల జగన్నాధ శర్మ, భారతదేశంలో పెళ్ళిళ్ళు, టెక్నికల్ పబ్లిషర్స్, గుంటూరు, 1981, పేజి 38.

151. శ్రీ వెనిగళ్ళ సుబ్బారావు, పెళ్లిమంత్రాల బండారం, వెనిగళ్ళ హేతు వాద సాహిత్య నికేతన్, రేపల్లె, 1979, పేజి 111.

152. "హత్వాభిత్వాచ క్రోశంతీం గృహాత్ ప్రసహ్యా - కన్యా హరతో రాక్షసో విధిరుచ్యతే'' (రాక్షసం) మనుస్మృతి.
"సుప్తాం మత్తా ప్రమత్తాం వారహో యత్రోపగచ్ఛతి - సపాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమో అధమః" (పైశాచం, - మనుస్మృతి.
"జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయైవ శక్తితః - కన్యాప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మ ఉచ్ఛతే'' (అసురం) - మనుస్మృతి.

153. కాళింజులు (కాళింగులు) తెగలో వరుడు వధువును తీసికెళ్తుంటే వధువు సోదరులు వరుడి గుంపు మీద వంకాయలు విసుర్తూంటారు.
శ్రీ చిలుకూరి నారాయణరావు, కళింగ దేశ చరిత్ర, 1930 పేజి 20.

154. ఫ్రెడరిక్ ఎంగెల్స్, కుటుంబం - దాని పుట్టుపూర్వోత్తరాలు, ప్రజాశక్తి కార్యాలయం, విజయవాడ, 1943, పేజి 29.

155. కాళింగులలో చిన్నప్పుడే పెళ్లి చేస్తారు. కులపెద్దకో - లేకపోతే అక్క మగనికో ఇచ్చి కృత్రిమంగా వివాహం చేస్తారు.
శ్రీ చిలుకూరి నారాయణరావు, కళింగ దేశ చరిత్ర, 1930, పేజి 20.

156. శ్రీ వెనిగళ్ళ సుబ్బారావు, పెళ్లిమంత్రాల బండారం, వెనిగళ్ళ హేతు వాద సాహిత్య నికేతన్, రేపల్లె, 1979, పేజి 106 - 107.

157. రోము దేశంలో బ్రహ్మచారుల మీద పన్ను వేసేవారు. వారికి వారసత్వ హక్కూ ఉండేదికాదు. వాళ్ళను అతి నీచమైన పనులకు పురమాయిస్తూండేవారు.
అర్ బ్రాష్, హౌ డిడ్ సెక్స్ బిగిన్, లండన్, 1973, పేజి 76.

158. శ్రీ కడియాల జగన్నాధ శర్మ, భారత దేశంలో పెళ్ళిళ్ళు, టెక్నికల్ పబ్లిషర్స్, గుంటూరు, 1981, పేజి 68.

159. రామాయణం, బాలకాండ, 73 వ సర్గ.

160. ఋగ్వేదం, మండలం 10, సూక్తం 103.

161. శ్రీ కడియాల జగన్నాధ శర్మ, భారత దేశంలో పెళ్ళిళ్ళు, టెక్నికల్ పబ్లిషర్స్, గుంటూరు, 1981, పేజి 29.

162. ది శాక్రమెంట్ అఫ్ మారేజ్ ఇన్ హిందూ సొసైటీ, అజంతా పబ్లికేషన్స్, 1978, పేజి 41.

163. బ్రిఫాల్ట్, ది మదర్స్, 1959, పేజి 220 - 221.

164. సత్యవతికి అంతకు ముందే పరాశరుడి వల్ల వ్యాసుడు పుట్టాడు. శంతనుడి వల్ల చిత్రాంగదుడు, విచిత్రవీర్యులు జన్మించారు.

165. ఆఫ్రికాలోని కొన్ని ప్రాంతాల్లో ఈ ఆచారం ఉంది. కాంగోలో బంగాలా తెగల్లో కూడా ఇది ఉంది. 1887లో దీని నాయకుడు ఒక క్రైస్తవమత బోధకుడికి తాను ఎనిమిదిమంది భార్యలను తిన్నాననీ ఆ మాంసంతో బంధువులకు విందు కూడా చేశాననీ చెప్పాడు.
బ్రిఫాల్ట్, ది మదర్స్, 1959, పేజి 71.

166. రిసిలే హర్బర్టు, ది పీపుల్ ఆఫ్ ఇండియా, ఓరియంటల్ బుక్స్ రీప్రింట్ కార్పొరేషన్, ఢిల్లీ. 1969, పేజి 206.

167. ఇంగ్లీషులో 'వెడ్డింగ్' అని అంటారు. 'వెడ్' అంటే ప్రమాణము అని అర్థం.

168. శ్రీ ఆవుల సాంబశివరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.

169. కాంగ్ వాన్ - యంగ్, ఎ స్టడీ ఆఫ్ ది ఫామిలీ సిస్టం ఇన్ కొరియా పేజి 35 ఎ.

170. పి. ఏ. థామస్, లోటస్‌లాండ్, పేజి 69.

171. గర్భాదానం మంత్రాల్లో ఒకదాని అర్థం ఇలా ఉంటుంది. "ఓ గంధర్వుడా, కన్యాస్వామీ, ఈ పాన్పునుండి లేచిపొమ్ము. పెద్ద పిరుదులు గల మరొక స్త్రీని కోరుము '' ఇదే అర్థం గల సూక్తం ఋగ్వేదంలో ఒకటి ఉంది. అది విశ్వావసు గంధర్వ ప్రార్థన. "ఉదీర్ష్వాతో విశ్వావసోనమసేళా మహేత్వా అన్యామిచ్ఛ ప్రఫర్వ్యగ్ సంజాయాం పత్యాసృజ''
ఋగ్వేదం, అధ్యాయం 3, వ. 24, మ. 10, వ. 7, సూక్తం 75, పేజి 226.

172. బ్రిఫాల్ట్, ది మదర్స్, జార్జ్ ఆలెన్ అండ్ అన్విన్ లిమిటెడ్, 1959. పేజి 58.

173. జి. ఆర్. స్కాట్, క్యూరియస్ కస్టమ్స్ ఆఫ్ సెక్స్ అండ్ మారేజ్, టార్చ్‌రీం బుక్స్, లండన్, 1953, పేజి 132.

174. కె. యం. కపాడియా, మారేజి, ఫామిలీ ఇన్ ఇండియా, కలకత్తా, 1977, పేజి 64.

175. ప్యూబ్లో తెగలో ఈ ఆచారం చాలా ప్రబలంగా ఉందని బ్రిఫాల్ట్ రాస్తాడు.

176. బ్రిఫాల్ట్, ది మదర్స్, జార్జ్ ఆలెన్ అండ్ అన్విన్ లిమిటెడ్, 1959, పేజి. 195.

177. ,, ,, పేజి 193-196

178. ,, ,, పేజి 191.

179. సోమాలీలోనూ, అలాగే టిబెట్‌లోని సైపాన్ తెగల్లోనూ పెళ్ళికూతురుని కొరడాల్తో కొడతారు. కొన్ని తెగల్లో బల్లాలతో పొడవడం కూడా కనిపిస్తుంది.

బ్రిఫాల్ట్, ది మదర్స్, జార్జ్ అలెన్ అండ్ అన్విన్ లిమిటెడ్, 1959, పేజి 70-71.

180. 'సీతాఒరుంధత్యహల్యా ద్రౌపదీ - తారామండోదరీదమయంతీత్యాది మహాపతివ్రతానాం ...' అంటూ పెళ్ళిలో కన్యాదానం తర్వాత చూర్ణికా మంత్రంగా దీన్ని చదువుతారు. చూర్ణికలో దేవతల్ని తదితర మహా మహుల్ని పూజించటం ఉంటుంది.

181. బైబిల్‌లో ఆదాము ముందు పుట్టాడు. అతడి పక్కటెముక అవ్వ(ఈవ్) అయింది. అంటే ముందు పితృస్వామ్యం తర్వాతే మాతృస్వామ్యం అని అతని వాదం. హీబ్రూ భాషలో రిబ్ అంటే ట్సేలా అంటారు. అంటే దురదృష్టం - తడబాటు అని అర్థాలు.

ఆర్. బ్రాష్, హౌ డిడ్ సెక్స్ బిగన్, లండన్, 1973, పేజి 12.

182. బ్రిఫాల్ట్, ది మదర్స్, జార్జ్ అలెన్ అండ్ అన్విన్ లిమిటెడ్, 1959, పేజి 207 - 233.

183. కన్య అంటే భారతంలో ఇలా ఉంది. "ఋతుస్నాతు తయాశుద్ధా సాకన్యేత్యభిధీయతే"; ఆపస్తంబస్మృతిలో "రోమకాలేతు సంప్రాప్తే సోమోభుంక్తేతు కన్యకాం-రజోదృష్ట్వాతు గంధర్వః కుచౌ దృష్ట్వాతు పావకః" అధ్యాయం 2 శ్లోకం 62.

184. వీటిలో కన్యాదానం, శచీపూజ, వివాహం, చతుర్థి (గర్భాదానం) ప్రధానాలని అగ్నిపురాణం చెప్తుంది. "కన్యాదానం శచీయోగో వివాహోఒధ చతుర్థికా - వివాహమేతత్కథితం యత్రకకర్మ చతుష్ట యమ్" అ. 154.

185. ఈ భాగంలో వచ్చే మంత్ర భాగమంతా చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి గారు ముద్రించిన ప్రతులలోనుండి గ్రహించడం జరిగింది.

186 శ్రీ కడియాల జగన్నాధ శర్మ, భారతదేశంలో పెళ్ళిళ్ళు, టెక్నికల్ పబ్లిషర్స్, గుంటూరు, 1981, పేజి 62.

187. పారస్కర గృహ్యసూత్రంలో "వైవాహ్యః - స్నాతకః"— అంటూ రెండు దశలు వర్ణించినట్టుంది. వైవాహ్యుడంటే పిల్ల కుదిరి పెళ్ళికి సిద్ధమై వచ్చినవాడు, అతడే స్నాతకుడు.

188. వ్యాససంహితలో స్నాతకం అంటే స్నానం అంటూ "కేశాన్తః స్నానం ఉద్వాహః వివాహాగ్ని పరిగ్రహః" అని షోడశ కర్మల్లో స్నానం వేరే చెప్పాడు. గౌతముడు దశ సంస్కారాలు చెప్తూ - "గర్భాదానం, పుంసవనం .. స్నానం, సహధర్మిణీ సంయోగం'' అన్నాడు.

189. ఆర్. బ్రాష్, హౌ డిడ్ సెక్స్ బిగిన్, లండన్, 1973, పేజి 67.

190. ఇక్కడే ఆ పెద్దలు చూసివచ్చిన పిల్లను "శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం-ధర్మ ప్రజా సంపత్యర్థం స్త్రీయం ఉద్వహే'' అని వరుడంటాడు.

191. శ్రీ కడియాల జగన్నాథ శర్మ, భారత దేశంలో పెళ్ళిళ్ళు, టెక్నికల్ పబ్లిషర్సు, గుంటూరు, 1981, పేజి 67.

192. ఉపనయనంలో గాయత్రీ (సావిత్రి) జపం ఉంది. అది స్త్రీలూ జపించాలంటూ ఒక సూక్తి ఉంది. ''పురాకల్పేతు నారీణాం మౌంజీబంధనమిష్యతే - అధ్యాపనంచ వేదానాం సావిత్రి వచనం తదా''
- ఉపనయనం స్త్రీలకూ కూడా ఉండదంటూ వైద్యనాథీయంలో ఇలా ఉంది. ''స్త్రీణా మవ్యక్త కాలాతిక్రమే ప్రాయశ్చిత్త మాహకాత్యాయనః''.. స్మృతి ముక్తాఫలంలో ఇలా ఉంది. "సంస్కారా అతిపద్యేరన్ స్వకాలే చేత్కథంచన - హుత్వై తదేవ కర్తవ్యా యేతూపనయనా దయః"
- రామాయణంలో సీత సంధ్యావందనం చేసినట్టుంది. ''సంధ్యార్థే వరవర్ణినీ'' (సుందరకాండ 14 శ్లోకం 49).
ఉత్కళ దేశంలో స్నాతకుడు, వధువింటికి రాగానే తన పాత జందెం కన్యకు పంపితే ఆమె ధరిస్తుంది. పెళ్ళిపూర్తి కాగానే ఆమె దాన్ని వదిలేస్తుంది.

193. ఇది పార్సీ స్త్రీలలో నడుంకట్టు బెల్టుగా ఇప్పటికి ఆచారం ఉంది.

194. శ్రీ వెనిగళ్ళ సుబ్బారావు, పెళ్ళిమంత్రాల బండారం, వెనిగళ్ల హేతువాద సాహిత్య నికేతన్, రేపల్లె, 1979, పేజి 104.

195. తాళిబొట్టు ఆకారం యోని-లింగం రూపంలో కొన్ని కనిపిస్తూంటాయి. వీటి ననుసరించి ఇవి సౌభాగ్యవర్ధక తంత్ర చిహ్నంగా స్త్రీలు ధరిస్తూండవచ్చు అన్న అనుమానమూ కలుగుతుంది. స్పార్టాలో పెళ్ళి సమయంలో స్తనాకారం - యోని ఆకారంలో కేకులు చేసి వరుడి చేతా; లింగాకారం కేకులు వధువు చేతా తినిపిస్తారని అంటారు. అలాగే వధువు ఊరేగింపులో కూడా ఇలాటి ఆకారాల కేకుల్ని పంచుతూ రావడం ఓ ఆచారం.

జెర్ట్రూడ్ జోబ్స్. డిక్షనరీ ఆఫ్ మైథాలజీ, ఫోక్‌లోర్ అండ్ సింబల్స్. 1962, పేజి 815 - 830.

196. శ్రీ కడియాల జగన్నాథ శర్మ, భారత దేశంలో పెళ్ళిళ్ళు, టెక్నికల్ పబ్లిషర్స్, గుంటూరు, 1981, పేజి 68.

197. కొందరు ఈ తాళిబొట్టు, శివలింగం యోని ఆకారంలో ఉంటుందనీ ఇది అతి ప్రాచీన కాలంనాటి శివలింగారాధనా, యోని అరాధనల చిహ్నంగా ధరిస్తూంటారనీ అంటారు.
శ్రీ యలమంచిలి వెంకటప్పయ్య, మంగళ సూత్రం పవిత్రమైందా?, 1979, పేజి 7.

198. జెర్ట్రూడ్ జోబ్స్, డిక్షనరీ ఆఫ్ మైథాలజీ, ఫోక్‌లోర్ అండ్ సింబల్స్, 1962, ఇంట్రడక్షన్, పేజి 6.

199. ఇరాకుయాన్‌లాంటి తెగలు (హురాన్స్ - మొహాక్స్) తూర్పు టెన్నిసీ ప్రాంతంలో ఉన్నాయి. వీళ్ళ భావంలో స్త్రీలు ఆకాశంనుండి కింది కొచ్చారని ఉంది. బాబిలోనియన్ కథల్లో మరొకటుంది. తవ్‌తే అనే ఆమె ఉండేది. ఆమె అప్సన్ అనే అతన్ని కన్నది. అతదే ఆమె భర్త కూడా. వీరిద్దరికీ మొయిమిన్ అంటే భూమి పుట్టింది. కొన్నాళ్ళకు వెలుగు దేవతొచ్చింది. తవ్‌తే ఆ వెలుగుమీద యుద్ధం చేసింది. వెలుగు దేవత తవ్‌తేను రెండుగా నిలువునా చీల్చింది. ఒక డిప్ప ఆకాశం గానూ, రెండోది భూమిగానూ విసిరింది. వీరికే మనిషి పుట్టాడు.
ఏ. హెచ్. సేసి, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రిలిజియన్ అండ్ కల్చర్, సం. హేస్టింగ్స్, పేజి 129.

200. ప్రాచీన కాలంలో చాలా దేశాల్లో ఆకాశం - పురుషుడు - దేవుడు అన్న భావం ఉంది. మంగోల్స్‌లో టెంగ్రీ (పెద్ద దేవుడు) అంటే ఆకాశం. గ్రీకుల్లో జియస్ అంటే ఆకాశం. చైనాలో తి అంటే ఆకాశం.
విల్ డ్యురాంట్, ది స్టోరీ ఆఫ్ ది సివిలిజేషన్, 1954, చాప్టర్; 4 పార్ట్ 1, పేజి 60.

201. పి. యన్. ప్రభు, హిందూ సోషల్ ఆర్గనైజేషన్, బాంబే, 1963 పేజి 173.

# 6

# జన హృదయోల్లాసం

గిడుగు రామ్మూర్తితో ధర్మారావుకు పరిచయం కలిగి ఉండకపోతే విజయ విలాసానికి హృదయోల్లాస వ్యాఖ్య తెలుగు వ్యాఖ్యానాల్లో ఉండి ఉండేది కాదు. లెక్కల టీచరుగా జీవితం వెళ్ళమార్చుకోబోయే ఒక వ్యక్తిని, తెలుగు సాహిత్య రంగానికి ప్రసాదించిన ఘనత గిడుగు మాస్టారిదే.

ధర్మారావు ఎఫ్.ఎ. చదవడానికి పర్లాకిమిడి కళాశాలలో చేరాడు. అప్పుడక్కడ గిడుగు చరిత్ర అధ్యాపకులేకాదు వైస్ ప్రిన్సిపాల్‌గా కూడా ఉండేవారు. బొట్టు తగాదాతో ధర్మారావుకు గిడుగువారితో పరిచయం మొదలైంది. శిష్యుడి తెలివితేటల్ని ఇట్టే పట్టేశాడు. చరిత్ర పుస్తకాలన్నీ చదివీ, లైబ్రరీలో అందుకు సంబంధించినవాటిని క్షుణ్ణంగా ఎత్తి రాసుకునీ గిడుగు అభిమానాన్ని చూరగొన్నాడు. ఎడమొఖం పెడమొఖంగా ఉండే వారి సంబంధం పూర్తిగా తల్లకిందులైంది. అడిగిన ప్రశ్నలకల్లా సమాధానం చెప్పే ధర్మారావు గిడుగుకు అభిమాన విద్యార్థిగా మారాడు. ధర్మారావుకు అంతకు మునుపే బొమ్మలు గియ్యటంలో ప్రవేశం ఉంది. అది వీరికి మాపులను గియ్యడంలో

సాయపడింది. ఈ కిటుకూ, నేర్పూ కూడా ధర్మారావును గిడుగుకు సన్నిహితం చేసింది.

ఆ కళాశాలలో, ప్రిన్సిపాల్ మంగు శ్రీనివాసరావుతోపాటు అందరికీ గిడుగువారంటే హడల్. ధర్మారావులాటి వ్యక్తితో గిడుగు చనువుగా మెలగటం విద్యార్థుల్లో వీరి పరపతి పెరగటానికి కారణమైంది. లైబ్రేరియన్ ధర్మారావుకు కావలసిన పుస్తకాలన్నీ ఇవ్వాలన్న ఆర్డరు గిడుగువారే జారీ చేశారు. ఒకనాడు చదివిన పుస్తకాల మీద మర్నాడు తరగతిలో ధర్మారావుతో చర్చ సాగించే వారు గిడుగు. తరగతులను కాన్సిల్ చేయించాలంటే ధర్మారావునే పట్టుకునే వారు మిగిలిన విద్యార్థులు. గిడుగువారికి ధర్మారావు మాటంటే మరో ప్రశ్న లేకుండా అంగీకరించే స్వభావం. ఇది ఎంతవరకు వెళ్ళిందంటే ఏకారణం చేతనయినా కళాశాలకు ధర్మారావు రాకపోతే ఆ సాయంకాలం హాస్టల్‌లో ధర్మారావు గదిలో గిడుగు ప్రత్యక్షం.

పుస్తక పఠనం మీద ధర్మారావు కున్న ఆసక్తి చూసి, రామ్మూర్తి తన సొంత గ్రంథాలయంలో పుస్తకాలిచ్చి చదవమనేవారు. "అదెలా చదవాలో ఆ పుస్తకంలోని క్రీగీతలూ, పక్కనరాసి ఉండే వ్యాఖ్యలూ చూస్తేనే నాకు సవిమర్శకాధ్యయనం అలవడింద"ని ధర్మారావు అంటాడు.

చరిత్ర అధ్యాపకులైనా గిడుగువారికప్పటికి తెలుగు ప్రాచీన గ్రంథాల మీద విపరీతమైన అభిమానం ఉండేది. వీరు భాషా ఉద్యమం వైపు దృష్టి సారించింది ఆ కళాశాలలో ఉద్యోగం మానేసింతర్వాతనే. అదీ 1910 తర్వాత. ఒరిస్సా ప్రాంతంలో ఉన్నందువల్ల కావచ్చు, తెలుగు వాళ్ళందరూ దొరికిన తెలుగు గ్రంథాలు చదవటం తప్పనిసరిగా ఉండాలన్న భావం గిడుగుకుండేది. అందుకని, అక్కడి విద్యార్థులందర్నీ ముఖ్యంగా ధర్మారావు తరగతిలోని వాళ్లందర్నీ అలా చదవమనీ, ఒక రిజిష్టరు పెట్టి చదివిన పుస్తకాలనందులో నమోదు చెయ్యమనీ చెప్పాడు. అలా ప్రబంధాల మీదకు వీరి మనసును నెట్టడంలో గిడుగు చేయి పడింది. దీనికి తోడు ధర్మారావు మిత్రుడు సుసర్ల సత్యనారాయణ ప్రోత్సాహం సాయపడింది. అతడి దగ్గర ప్రబంధ పద్య రత్నావళి ఉండటం, దాన్ని ప్రకటించిన వెంకటగిరి సంస్థానంవాళ్ళకు రాస్తే చాలా పుస్తకాలు చిన్నవీ, పెద్దవీ తక్కువ ధరకు పంపడం జరిగింది. అవన్నీ ధర్మారావు కంఠతా పట్టాడు. ఈ సందర్భంలోనే "ఒకటి రెండుసార్లు శ్రద్ధగా చూచినా వినినా, నాకు కంఠస్థమయ్యేది" - అని తన ఏకసంథాగ్రాహిత్వాన్ని చెప్పారు. (పేజి 82. రాలూ-రప్పలూ.) ఆ వచ్చిన పుస్తకాలలో

"వసుచరిత్రా, మనుచరిత్రలకన్నా విజయవిలాసం మీదే నాకు అభిమానం ఎక్కువగా ఉండేది" అని విజయవిలాసం వ్యాఖ్యానం పీఠికలో అన్నారు. ఈ రకంగా వీరికి ప్రబంధాలతో పరిచయం, అందులోనూ విజయవిలాసం మీద అభిమానం పొటమరించింది. అదీ విద్యార్థి దశలోనే : గిడుగువారి నేతృత్వం లోనే. 1906 నాటి కథ ఇది.

ఆ రోజుల్లో ధర్మారావు చిన్న చిన్న పద్యాలు ఆశువుగా అల్లుతూనూ, చిన్న చిన్న బూతుసమస్యలను పూరిస్తూనూ మిత్రులను ఉత్సాహపరుస్తూండేవాడు. చిన్నతనం విజయనగరంలో గడవటం; తండ్రి కాస్త శృంగార ప్రియుడు గావటం; శ్రీకాకుళం, బొబ్బిలి, పర్లాకిమిడి, శ్రీముఖాల ప్రాంతాల్లోని దేవాలయాల శిల్పాల్లో ఎక్కువగా శృంగార ఘట్టాలుండటం, ఇవన్నీ ధర్మారావును కూడా శృంగారరసం పట్ల అభిమానం కలిగేలా చేసి వుండవచ్చు. యువకుడు కనుక సహజంగానే మనస్సు అటే ప్రసరించి ఉంటుంది. నాయక రాజుల కాలంలో వచ్చిన సాహిత్యంలో శృంగారం శ్రుతి మించి ఉంటుందన్న అభిప్రాయం వారి చెవిలో పడి ఉండవచ్చు శేషం వెంకటపతి తారాశశాంక విజయం చదవటం; దాని ధార, గొప్పతనాల గూర్చి గిడుగువారు ధర్మారావుకో ఉపన్యాసమివ్వటం, ఇవన్నీ వీరి మనసు శృంగారరసంవైపూ, విజయవిలాసం వైపూ మళ్ళించాయని భావించడం సమంజసమే. ఆ విధంగా వీరికి పద్దెనిమిదో ఏటికి పూర్వమే విజయవిలాసం అభిమాన గ్రంథమైంది.

పర్లాకిమిడి కళాశాలలో ఎఫ్. ఎ. పరీక్ష పూర్తి చేసిన వెంటనే ధర్మారావు, ఆర్థిక పరిస్థితుల కారణంగా బి. ఎ. పరీక్ష చదవలేక పోయాడు. టెక్కలి స్కూలులో కొంతకాలం, బరంపురం కళ్ళికోటకాలేజిలో కొంతకాలం (స్కూలులో) లెక్కల అధ్యాపకుడుగా పని చేయాల్సి వచ్చింది. బరంపురంలో పని చేస్తున్న కాలంలో బూర్ల బ్రదర్స్ నాటకం కంపెనీవాళ్ళు పానుగంటివారి రాధాకృష్ణ నాటకాన్ని ప్రదర్శించారు. అది ధర్మారావు తన సహాధ్యాపకులు ఇవటూరి సన్యాసిరాజుతో కలిసి చూడటం తటస్థించింది. ఆ కాలంలో నాటకాలు, నాటక సమాజాలు ప్రజల్లో చాలాబాగా భావప్రచారాన్ని చేస్తూండేవి. ధార్వాడ నాటక సమాజం రావడంతో, తెలుగు నాటకరంగాన్ని ప్రజల మధ్యకు తీసుకెళ్ళిందనవచ్చు. ప్రతి గొప్ప రచయితా ఆకాలంలో నాటక సమాజాలు స్థాపించటం, తాను రాసిన నాటకాలు వారిచేత ఆడించటం ఆనవాయితీగా ఉండేది. కందుకూరి, చిలకమర్తివంటి వారందరూ ఇందుకుదాహరణలనవచ్చు. తాను చూసిన నాటకరచనా, పద్యాలరచనా, పాత్రపోషణా తనను మూడు రోజుల్లో ఒక నాటకం రాసేలా చెశాయన్నారు ధర్మారావు. ఏ విషయం మీద

రాయాలన్న సమస్యే వారికి ఎదురుకాలేదు. ఎందుకంటే అప్పటికే విజయవిలాసం కథ ధర్మారావు మనస్సులో గట్టి ముద్రవేసింది. ఆకథనే తీసుకుని అందంగా పద్యాల రచన సాగించి నాటకం పూర్తిచేసి సన్యాసిరాజుగారికి వినిపించాడు. బూర్ల బ్రదర్సువారూ చూసి బాగుంది ప్రాక్టీసు చేస్తామన్నారు కానీ చెయ్య లేదు 'కారణాంతరాలవల్ల'అని ధర్మారావు నాటి ఘటనలను రాలూ-రప్పలూలో నమోదు చేశాడు. ఆ నాటకం కంపెనీవాళ్ళే నాటకానికి 'విలాసార్జునం' అన్న పేరు పెట్టారు. 1906 లో రాసిన ఈ నాటకం వేగుచుక్క గ్రంథమాలద్వారా 1914 లో అచ్చయింది. విజయవిలాసం మీద ధర్మారావుకున్న అభిమానం తొలిసారిగా ఇలా గ్రంథరూపంలో బయటకొచ్చింది.[1]

మిత్రులతో ప్రబంధాల ప్రసక్తి వస్తే విజయవిలాసంలోని పద్యాలను చదవటం, వాటిమీద వ్యాఖ్యానం చేస్తూండటం ధర్మారావుకు ఓ అలవాటుగా మారింది. ఆయన ఉద్యోగాల రీత్యా పనిచేస్తూ తిరిగిన అన్ని ప్రాంతాలలోని, మిత్రులకీ విజయవిలాసంలోని అందాలను విప్పిచెప్పటం ఆరంభించాడు. నిడుదవోలు వెంకట్రావుకు విద్యార్థి దశలో ఈ విజయవిలాసం గూర్చి మొదటిసారి అభిమానం కలిగేలా చెప్పింది ధర్మారావే.[2] విజయనగరం కళాశాలలో విజయవిలాసం మీద ధర్మారావు ఉపన్యాసాలు ఇవ్వటం, తామా సభలకు హాజరు కావటం జరిగిందని పురిపండా అప్పలస్వామి దాఖలాలిచ్చాడు.[3]

చేమకూర వెంకటకవి మీదా, అతని విజయవిలాసం మీదా ఉన్న అభిమానం చేత ధర్మారావు తెలుగు దేశంలో తనకెదురయిన సాహితీ బంధువులందరికీ ఆ ప్రబంధాన్ని గూర్చి చెప్తూండేవారు. కొన్ని పద్యాలకు సరయిన అర్థాలు తెలిసేవి కావు వారికి. సరయిన వ్యాఖ్యానాలు ప్రచారంలో ఉండేవి కూడా కావు.

ఇలా ఉండగా, 1920 తర్వాత ధర్మారావు చుండి జమీందారుకు సంరక్షకోపాధ్యాయుడుగా నియమితులయ్యారు ఉండటం నెల్లూరు. సాయం కాలాలు మిత్రులతో కలిసి క్లబ్బులో బిలియర్డ్సు ఆడుకోవటం ఆనవాయితీ. అలా ఓనాడా సమయంలో మిత్రులకు యథాప్రకారం విజయవిలాసంలో పద్యాలు చదివి చెప్పడం ఆరంభించాడు ఒక మిత్రుడు భైరవరపు సుబ్బారావు ఇంటి దగ్గర ఈ పద్యాలను చదవగా 'ఆలవట్టం' అంటే ఏమిటని మర్నాడు ధర్మారావును అడిగాడు.[4] వేదం వెంకటరాయశాస్త్రి విజయ విలాసానికి రాసిన వ్యాఖ్యానం ధర్మారావు అప్పుడే మొదటిసారిగా చూడటం తటస్థించిందన్నారు. మిత్రులడిగిన సందేహాలకు వేదం వారిచ్చిన సమాధానాలు ధర్మారావుకు తృప్తి నివ్వలేదు. అలాగే ఆనం పద్మనాభరెడ్డిగారికీ సాహిత్యమంటే అభి

మానం. వీరిద్దరు మిత్రులు అడిగిన అనుమానాల కోసం వీరు వేదంవారి వ్యాఖ్య చదివారు. ధర్మారావు అర్థ వివరణలకూ, వేదం వారి వ్యాఖ్యానాలకూ భేదం గమనించిన ఈ క్లబ్బు మిత్రులు నిత్యం ధర్మారావును హెచ్చరిస్తూండటం వల్ల వీరిలో పట్టుదల మరింత పెరిగింది. ఆ వ్యాఖ్యను ఆమూలాగ్రం చదివారు.[5]

ధర్మారావుకు ఈకాలంలోనే వేదం వెంకటాచలయ్యగారితో పరిచయం కూడా ఏర్పడింది. వెంకటాచలయ్య అసామాన్య పాండిత్యం కలిగినవాడు. మన ప్రాచీన నాగరికతనూ, దేశాల ఎల్లలనూ వాటిని గురించి చాలా తార్కికంగా పరిశోధనలు చేసి వినూత్నాంశాలు బయట పెట్టిన వ్యక్తి. బెంగుళూరులో ఆనాడుండే మిథిక్ సొసైటీ సభ్యులు. ఆ సంఘం పత్రికలో ఆంగ్ల భాషలో ఈ విషయాలపైన ఆసక్తి రేకెత్తించే అనేక వ్యాసాలు రాసి ప్రకటించారు. ప్రతిదాన్నీ గుడ్డిగా నమ్మకూడదన్నది వెంకటాచలయ్య ధర్మసూత్రమని వారి వ్యాసాలు చూస్తే తెలుస్తుంది. ధర్మారావుకు వీరు పరిచయం కావటం వల్ల ప్రతిపదానికీ పాత అర్థం కాకుండా సరికొత్త అర్థం ఏదన్నా ఉందేమో వెతకాలన్న ఆకాంక్ష బాగా పెంపొందింది. ఈ పరిశీలనా తత్వం వీరిలో మొదటినుండీ ఉన్న విషయం వీరి కవిత్వ రచనల్లోని విషయాలు వెల్లడిస్తూంటాయన్నది తెలిసిందే. నెల్లూరు, వేదం వెంకటరాయశాస్త్రికి కోట. అక్కడే-వారి వ్యాఖ్యానం మీదే, ధ్వజమెత్తాలంటే ఎంతటి చావా, ధైర్యం కావాలి! ఇవన్నీ ధర్మారావుకు వారి పరిశోధనా పాటవం, విమర్శనా పాండిత్యం, వివరణా నైపుణ్యం సంతరించి పెట్టాయి. చుట్టూరా చేరిన మిత్రులు ధర్మారావును విజయవిలాసానికి మరో వ్యాఖ్యానం రాయమని ప్రోత్సహించారని అనటం కంటే - చెవినిల్లు కట్టుకుని పోరారు - అని అంటే బాగుంటుంది. కనుకనే లెక్కలు చెప్పే అధ్యాపకులు, అప్పటివరకూ చేసిన సాహిత్య పరిశ్రమ వ్యాఖ్యాన రచనకేమాత్రం చాలదని తెలిసినవాడు, అంతవరకూ ఏ కవి పండితుల దగ్గరా సంప్రదాయానుసారంగా పూర్వ కావ్యాధ్యయనం చేయటానికి అవకాశం దొరకనివాడు, వ్యాఖ్యానానికి పూనుకున్నాడు.

తన అభిమాన కవికి సరైన వ్యాఖ్యానం రాలేదని ధర్మారావు అనుకున్నాడు. వేదం వారు అనేక పద్యాలలో సరైన వ్యాఖ్యానం ఇవ్వలేదనీ, కవిప్రక్రమాది కావ్య గుణాలనూ, నియమాలనూ వారు పూర్తిగా గుర్తించజాలకపోయారనీ ధర్మారావు భావించాడు. తాము చూడ గలిగిన విశేషాలనూ, సొగసులనూ, మిత్రులందరూ హర్షించిన అందాలనూ ఏంచెయ్యాలి? ప్రయత్నించడమే మంచిది - అని ధర్మారావు రచనకు ఉపక్రమించాడు.[6]

ఈ సందర్భంలోనే ఒక విషయం గమనించాలి. సుమారు 1911 ప్రాంతంలో శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రికి విజయవిలాసం అభిమాన పాత్ర మైంది. తానాకళించుకున్న అందాలను వ్యాఖ్యాన రూపంలో రాయాలని ఉత్సాహించి కొంతవరకు కొనసాగించినట్టు తన స్వీయచరిత్రలో రాసుకున్నాడు.[7] దీన్ని వారి గురువులు వెంకటరామకృష్ణ కవులు చూసి అభినందించారనీ అంటూ పొంగిపోయాడు. అయితే పూర్తిగా ఆయన దృష్టి ఆధునిక సాహిత్య ప్రక్రియల వైపు మళ్ళడంతో ఇది ఆగిపోయింది. పూర్తయిన దాఖలాలు కనిపించవు.

విజయవిలాసం ప్రబంధానికి ధర్మారావు వ్యాఖ్యానం పరిశీలించే ముందు విమర్శ, వ్యాఖ్యానాల తత్త్వాలను సంక్షిప్తంగానైనా పరిశీలించటం అవసరం.

కవిదృష్టితో, కవితా వస్తు వివేచనం విమర్శ. కవి తానాశించిన దానిని ఏవిధంగా ఎంతవరకు చేరుకున్నాడన్న దానిని సమీక్షించడం ప్రధానంగా విమర్శ చేసే పని. అంటే కవి ఆశించిన ఫలితంలో అతడి సాఫల్య వైఫల్యాలను బేరీజు వేయడమన్నమాట. ఈ వివేచనలో ప్రధానవ్యక్తిత్వం కవిదే. కొలబద్ద విమర్శకుడిది. సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనంలో రామ్మూర్తి లోపాలు కప్పడం గాక లోపాలు చూడడమే సరైన విమర్శ అనీ అదే విమర్శకుడి పని అనీ సిద్ధాంతీకరించారు. కవిపట్ల విమర్శకుడికి మమత ఉండాల్సిన పని లేదు. కవితో అతడికి తన్మయీభావం కానీ, తాదాత్మ్యంకానీ ఉండే పక్షంలో విమర్శకుడు తన పనిని నిర్వహించడంలో విఫలుడౌతాడు. కవి - విమర్శకుడు - సహృదయుడు (పాఠకుడు) అనే త్రయంలో ముందు వెనుకలను మించినవాడన్న అహమిక విమర్శకుడికుంటుంది. ప్రతిభకన్నా పాండిత్యం మీద ఓపాలు ఎక్కువ మోజు విమర్శకుడికుంటుంది. కావ్యంలోని రూపావిష్కృతిలో ఉన్న అంశిక విశ్లేషణ దృష్టే విమర్శకుడిలో చూస్తూంటాం.

వ్యాఖ్యాత - విమర్శకులవి భిన్న దృష్టులు. ఎలాగంటే కవితో పూర్తిగా తాదాత్మ్యం చెంది, కవి తన రచనలో ఆశించిన లక్ష్యాలను వెల్లడించడంలో తోడ్పడే వ్యక్తి వ్యాఖ్యాత. కవితో సమస్కంధుడైనప్పటికినీ కవిపట్ల తను తన అభిమానాన్ని సహృదయుడికి సంక్రమింపచెయ్యటం వ్యాఖ్యాత ధ్యేయం. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం అనే కావ్యకరణాంగాలతో వ్యాఖ్యాత, కవికీ సహృదయుడికీ మధ్య సుహృద్భావపు వంతెన అవుతున్నాడే కానీ కవితో స్పర్ధించడు. ప్రామాణికుడైన వ్యాఖ్యాత, ఒక్క సృజనాత్మక ప్రతిభలో తప్ప వ్యుత్పత్తి అభ్యాసాలలో కవిని మించే ఉంటాడు. అలాటి పరిస్థితిలోనే కవికి

వ్యాఖ్యాత న్యాయం చేకూర్చగలుగుతాడు. వ్యాఖ్యానం చేసేటప్పుడు వ్యాఖ్యాత కొలబద్దగా కావ్యాత్మనే స్వీకరిస్తాడుకానీ కావ్యస్వరూపాన్ని కాదు. ఇతడు కవి ప్రతిభావిష్కర్తగా అందుకనే నిలుస్తాడు.

వ్యాఖ్యాతలో విమర్శకుడుంటాడు. విమర్శకుడిలో వ్యాఖ్యాత ఉండవలసిన అవసరం లేదు. లోకశాస్త్రకావ్యాద్యవేక్షణ పరిధి వ్యాఖ్యాతకు విస్తృతమైంది. విమర్శకుడిది పృధక్ దృష్టి అయితే, వ్యాఖ్యాతది సమ్యగ్దృష్టి. కవి దృష్టితో వస్తు వివేచనం విమర్శ. సహృదయుడి దృష్టితో సౌందర్య విశ్లేషణం వ్యాఖ్యానం. సాధారణంగా తప్పులు చూపడం విమర్శకూ, మెప్పులు చూపడం వ్యాఖ్యానానికీ పర్యాయపదాలు కావడం గమనార్హం. లోపాలుకూడా చూపడం విమర్శ. అందాలు చూపడం వ్యాఖ్యానం. ప్రతిభను ప్రశ్నించడం విమర్శ. వ్యుత్పత్తిని మెచ్చుకోవడం వ్యాఖ్యానం.

ప్రతిభ పాండిత్యాల సమ్యగ్ సమన్వయం ఏ వ్యాఖ్యాతలో ఉంటుందో అతడి నుండి ఉత్తమ వ్యాఖ్యానం ఆశించవచ్చు. విమర్శకుడిలో సాధారణంగా మృగ్యమయ్యే సృజనాత్మక ప్రతిభా, కవిలో సామాన్యంగా లోపించే శాస్త్ర విశ్లేషణ దృష్టీ, వ్యాఖ్యాతలో నెలకొని ఉన్నప్పుడు- కవీ సహృదయుడూ లాభం పొందుతారు.

తెలుగులో వ్యాఖ్యాన సంప్రదాయం అన్ని ప్రక్రియల మాదిరిగానే సంస్కృతం నుండే సంక్రమించింది. సంస్కృతంలో ఈ వ్యాఖ్యానానికి చాలా ప్రాధాన్యం ఉంది. శృతి, స్మృతుల కాలం నుండీ ఈ పద్ధతి అనేకరూపాలతో, నామాలతో కొనసాగుతూ వచ్చింది.

భారతీయ వ్యాఖ్యాన సంప్రదాయంలో మొట్టమొదట వచ్చిన ప్రక్రియ సూత్రము కావచ్చు. దీన్ని మన పూర్వులు పరిమితమైన అక్షరాలతో, అసందిగ్ధమైన అర్థావబోధతో, సారవంతమై- తరచిన కొద్దీ విశేషాలు స్ఫురిస్తూ- లక్ష్య సమన్వయ రూపం కలదిగా భావించారు. సూత్రమంతా కట్టుదిట్టంగా కాకుండా స్థూల వ్యాఖ్యను 'వృత్తి' అన్నారు. ఈ రెంటిని గురించి చెప్పేది 'పద్ధతి.' ఔగాములు, సందర్భా సందర్భాలు; ఔచిత్య అనౌచిత్యాలు విశ్లేషించేది 'భాష్యం'- భాష్యానికి వివరణ ప్రాయమైంది 'సమీక్ష.' దీని తర్వాతి దశ 'టీక.' ఇక్కడొక విషయం గమనార్హం. ఇంతవరకూ వస్తుగతమైన భావావిష్కరణకే ప్రాధాన్యం ఉండగా- అవాంతరదశ 'టీక' లో అర్థం వైపు కూడా దృష్టి సారించటం చూస్తాం.8

"టీకానిరంతరవ్యాఖ్యా" - అన్న నిర్వచనాన్ని పరిశీలిస్తే శబ్దగతమైన దృష్టినుండి, అర్థగతమైన దిశగా మళ్ళిందని అనవచ్చు. అంటే తాత్పర్యం

దృష్టి నుండి ప్రతిపదార్థస్థాయికి చేరింది. దీన్నే సూక్ష్మతరం చేసి 'టుప్‌టీక' అన్నారు. తిరిగి విస్తరించి 'పంజిక' లేదా 'పంచిక' అన్నారు అంటే విపులమైన వివరణమన్న అర్థంలో దీన్ని వాడారు. ఈ వివరణను శ్లోక రూపంగా నిబంధించి 'కారిక' అన్నారు. శ్లోకానికి వ్యాఖ్యానం ఒక దశలో వచనంగా మొదలయితే, మరోదశలో వ్యాఖ్యానమే శ్లోకరూపంగా 'కారిక' అయింది. వ్యాఖ్యానం పిండితార్థం సూత్రంగా తొలిదశలో ఉండి, వ్యాఖ్యానాన్ని సూత్రీకరించడానికి శ్లోకరూపంలో కారికగా తర్వాత మారింది.

దీన్నే విశదీకరించి 'పరికరశ్లోకం' అన్నారు. తర్వాత దశ 'వార్తికం'. ఇందులో అవ్యాప్తి, అతివ్యాప్తి దోషాలను పరిహరించటం జరుగుతుంది. ఈ లక్షణాలను సవరించడమే కాకుండా మరికొంత సమాచారాన్ని చేర్చేది 'వివేకం.' దీని అనంతర దశ 'వ్యాఖ్య' లేదా 'వ్యాఖ్యానం.'

"పరిచ్ఛేదః పదార్థోక్తి ర్విగ్రహోవాక్యయోజనా
ఆక్షేపశ్చ సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణం."[9]

-అంటే వ్యాఖ్యానంలో అర్థతాత్పర్యాలూ, శబ్దసంయోజనం, అలంకార వైశిష్ట్యం, ఔచిత్యానౌచిత్య విచార చర్చలకు సంబంధించిన ఆక్షేప సమాధానాలు, శబ్ద సాధుత్వాసాధుత్వ నిష్కర్ష, గతార్థం కావాలన్న మాట. ఈ దృష్టితో పరిశీలిస్తే సంస్కృతంలో వ్యాఖ్యానాలు ఒక పరిణత దశకు చేరుకోగా, తెలుగు వ్యాఖ్యానాలు మాత్రం సర్వసాధారణంగా అర్థంతరంలోనే ఆగిపోయినట్టు కన్పిస్తాయి. సంస్కృత వ్యాఖ్యాన సంప్రదాయ పరిణామ క్రమంలో అర్ధాంతర దశ 'టీకా' రచనం. తెలుగు వ్యాఖ్యానాలు టీకారచన స్థాయికి మించి పురోగమించటం కనిపించదు.

ఈ సందర్భంలో తెలుగు వ్యాఖ్యాన సంప్రదాయం గూర్చి ఉమాకాన్త విద్యాశేఖరుల అభిప్రాయం గమనార్హం.

"మన తెలుగు దేశమందు వాఙ్మయము సంస్కృతముననుకరించినట్లుగా, వ్యాఖ్యానములు సహితము సంస్కృత వ్యాఖ్యానములను అనుకరించుచు వచ్చెను. వ్యాఖ్యానములంటే మాటలకర్థము వ్రాయుటే అయినది. సంస్కృత భాష వ్యవహారములో లేదు, గనుక దానిలో మాటలకు అర్థములు వ్రాసికొనుట కొంత వరకు ఉచితముగానే ఉన్నది. కానీ తెలుగువారికి తెలుగు మాటలకు అర్థములు వ్రాయడము వ్యాఖ్యాన మగునా? అని సంశయము కలుగక మానదు. కావ్య వస్తువును పరిశీలించి ఔచిత్యానౌచిత్యములు స్పష్టపరుపవచ్చును. అంగాంగిరసముల సందర్భములను తేటపరచవచ్చును. ఇవన్నీ

వ్యాఖ్యానమగును కానీ, తెలుగు మాటలకు తెలుగర్థములు వ్రాయుట ఈ కాలమున సహితము వ్యాఖ్యానము కానేరదని నేననుకొనెదను. అయితే తాతాచార్యులు గారేమిచేస్తున్నారంటే తప్పులు వ్రాసి దిద్దుకొంటున్నారని మన కావ్యములన్నిటిలో అనవసరములైన మూలగొట్టు సంస్కృత పదముల బాహుళ్యము చొప్పించిరి. ఆ దోషము తొలగించుటకు మాటలకు అర్థము చెప్పే వ్యాఖ్యలు అవసరములాయెను. ఈ అవసరమును శ్రీనివాసాచార్యులు (విష్ణుచిత్తీయ వ్యాఖ్యాత) మొదలైన పూర్వ వ్యాఖ్యాతలు, బహుగ్రంథ ప్రకాశకులైన శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు, వ్యాఖ్యానమును వ్రాసి సంపూర్ణముగా తీర్చిరి. కనుక మాటలకర్థము వ్రాసే వ్యాఖ్యానములు ఇక మనకవసరము కాదు."[10]

దీనిని బట్టి తెలుగు సాహిత్య వ్యాఖ్యాన సంప్రదాయం, టీక దశలోనే ఆగిందనటం స్పష్టమేకదా. దీనికి ఉపబలకంగా రెండు మూడు ఉదాహరణలు పరిశీలిద్దాం.

ముద్దరాజు పెదరామన రాసిన రాఘవపాండవీయ వ్యాఖ్య (1550) ఈ విధంగా ఉంది. భాష వ్యావహారికంలో ఉండటం విశేషం.

జనవరుడు - పాండురాజు; అది యెల్ల విని - ఆప్రకారమునంతా విని; వర్వ - ఒప్పుచుండగానూ; పరమనియతి - మంచి నియమాలనూ అని ముందటి పద్యంతో అన్వయం. ఇదేవిధంగా హరిశ్చంద్రనలోపాఖ్యానం వ్యాఖ్య (క్రి. శ. 1607 అని శ్రీ నిడుదవోలు వారు నిర్ధారించారు)ఇట్లా ఉంది.

హరిహయ - ఇంద్రుని యొక్క; హరిహయ - మన్మథుండనేటి; నానా వాసములనేటి - మకరందాలనేటి; స్ఫురణంబులు - రసములు, యజ్ఞాలచేత.[11]

ఇంతవరకూ మనకు లభించిన తొలి వ్యాఖ్యానా లివి.

ఆధునిక కాలంలో వ్యాఖ్యానాలను సముద్ధరించిన కీర్తి బ్రౌనుకు దక్కుతుంది. చార్లెస్ ఫిలిప్ బ్రౌను 1827 నుండి 1855 వరకు తెలుగు సాహిత్యాన్ని ప్రాచీన తాళపత్ర గ్రంథ పరిష్కరణ రూపంగా ఉద్ధరించి, ప్రామాణిక ప్రతులు పండితులచేత రాయించిపెట్టాడు. సాహిత్యవిషయంలో ఆప్తులుగా, ఆశ్రితులుగా ఈయన దగ్గర వర్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రి, జూలూరి అప్పయ్య పంతులు, ములుపాక బుచ్చన్నశాస్త్రి మొదలైన పండితులుండేవారు. బ్రౌను, జూలూరి అప్పయ్య పంతులుచేత మనుచరిత్ర, వసుచరిత్ర, తారాశశాంక విజయము, కళాపూర్ణోదయం, విజయవిలాసం మొదలైన ప్రబంధాలకు వ్యాఖ్యానాలు రాయించాడు. అవన్నీ వ్యావహారికంలోనే ఉన్నాయి. జూలూరి అప్పయ్య మనుచరిత్ర వ్యాఖ్య ఇలా ఉంది-

నాలుగు - నాలుగైనటువంటి; మోములనే - ముఖములయందున్నా; నిగమ - వేదముల యొక్క; నాదములు - ధ్వనులు; ఉప్పతిలన్ - పుట్టుతూ ఉండగా; ప్రచండ వాతూలహతిన్ - ప్రచండ - మిక్కిలి వడికలిగినటువంటి, వాతూల - వాయువుల యొక్క, హతిన్ - తాకుడుచేత; జనించు - పుట్టుతున్నటువంటి; రొదతోడి - ఘోషముతో గూడిన........
దీన్ని బట్టి ఆధునిక కాలంలో కూడా పుట్టిన వ్యాఖ్యానాలూ టీకనే ప్రధానంగా చేసుకున్నట్టు తెలుస్తుంది.

మనుచరిత్రకు వ్యాఖ్య వ్రాసిన శిష్టు కృష్ణమూర్తి, మహాభారత కూలంకష వ్యాఖ్యానం రచించిన భారతం లక్ష్మీపతీ - ప్రతిపదార్థ తాత్పర్యాలనే తమ వ్యాఖ్యానాల్లో ప్రధానాంశంగా చేసుకోవడం చూడచ్చు (గద్య చింతామణి, రామ్మూర్తి సప్తతి జన్మదిన మభినందన ప్రచురణ 1933).

క్రీ. శ 1899 వ సంవత్సరంలో శైవసిద్ధాంత ముద్రాక్షరశాలలో "పూర్వకవికృత వ్యాఖ్యాద్వయానుసారంబుగ రచియింపబడిన ప్రతిపదటీకారూపంబగు వ్యాఖ్యానంబు తోడ పండితులచే బరిష్కరింపబడి ముద్రింపించి ప్రకటింపబడిన'' వసుచరిత్ర వ్యాఖ్య ఈ విధంగా ఉంది.

అన్నగరి నాట్యశాలల
జెన్నగుమురజముల రవళిచే నటియించున్
గన్నియల కన్న మున్నగ
బన్నగభుక్తతులు దృష్టిపాత్రములగుచున్ (1 - 103)

అన్నగరిన్ - ఆ అభిష్టానపుర సంబంధమగునైన; నాట్యశాలల - నాటక శాలలయందు; చెన్నగు - ఒప్పిదమగుచున్న; మురజములరవళిచేన్ - మృదంగములయొక్క నాదముల చేతనూ; కన్నియలకన్న మున్నగన్ - నాట్యము చేయవలసిన కన్నె పడుచులకంటె ముందుగానే, పన్నగభుక్తతులు - పన్నగభుక్ - నెమలుల యొక్క, తతులు - వరుసలు; దృష్టిపాత్రములగుచున్ - దర్శనయోగ్యములగుచును, దృష్టిసదృశములైన చిహ్నములతోగూడిన ఈకలు గల వౌచునని అర్థద్వయము; నటియించున్ - నాట్యము చేయును. నెమలి యీకల మీద గన్నులు వంటి పొడలు కలిగి ఉండుట ప్రకటము. మృదంగ ధ్వనియందు మేఘధ్వని భ్రాంతి జనియించి నెమళ్ళు నటియించినవని భావము.12

ఈ వ్యాఖ్యాన రచయిత, ఇద్దరు పూర్వ వ్యాఖ్యాతల సరళినిబట్టి రాశానన్నాడు తప్ప వారి పేర్లు కానీ, ప్రబంధాలు కానీ చెప్పలేదు. బహుశా అతడు

చూసిన వ్యాఖ్యానాలు వసుచరిత్రకు ఇద్దరు రాసిన వ్యాఖ్యానాలు కావచ్చు. ఈ వ్యాఖ్యాత తనపేరు కూడా ప్రకటించలేదు.

దీన్నిబట్టి 1550 నుండి 1889 వరకూ, అంటే సుమారు మూడువందల యాభై సంవత్సరాల వ్యాఖ్యాన సంప్రదాయం కేవలం ప్రతిపదార్థ టీకా సహితంగానే సాగిందని చెప్పవచ్చు.

కానీ ఇరవయ్యో శతాబ్దం ఆరంభంనుండి ఈ ధోరణి మారింది. విపుల వ్యాఖ్యల పద్ధతి వస్తూనే, భాషాపరంగా ప్రౌఢ గ్రాంథికంలోనే వ్యాఖ్యానాలు సహితం ఉండాలన్న వాదమూ ప్రబలింది.

ఈ సంప్రదాయ పథప్రవర్తకులు వేదం వెంకటరాయశాస్త్రి. అభినవ మల్లినాధులన్న ప్రశస్తినీ పొందారు. 1913 లో శ్రీనాదుడి శృంగార నైషధానికి 'సర్వంకష' పేరుతోనూ, 1928 లో ఆముక్త మాల్యదకు 'సంజీవని' పేరుతోనూ వ్యాఖ్యానాలు వెలువరించారు. ఈ నూతన సంప్రదాయంలో మొదటిసారి వ్యాఖ్యానం వెలయించిన వేదం వెంకటరాయశాస్త్రి శబ్దార్థ స్వరూప నిర్ణయాన్నీ, ప్రతిపదార్థ ప్రకటీకరణనూ, భాషాభేషజంలో గిడుగు వారు తీవ్రంగా అధిక్షేపించారు. వేదంవారి ఈ తబ్బిబ్బులకు కారణం గ్రాంథిక భాష మీద మోజూ, ప్రాచీన కావ్య పరిష్కరణంలో లక్షణ గ్రంథాల ప్రమాణాలను మేరమీరకూడదనుకునే దురదృష్టకరమైన అభినివేశం, కారణాలు కావచ్చు. కానీ ఈ ధోరణి కూడా వేదం వారిలో 'సంజీవని' వ్యాఖ్య సందర్భంలో సడలింది. దీనికి కారణం అప్పటికి బలం పుంజుకున్న గిడుగువారి వ్యావహారిక భాషా వాద బలిమి అయి ఉండవచ్చు. ఆశ్చర్యకరమైన విషయమేమంటే అనంతరకాలంలో వ్యావహారిక భాషా వాదాన్ని సర్వాత్మనా సమర్థించిన గొప్ప పండితులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి; ఒకటి ధర్మశాస్త్రమూ, ఒకటి కామ శాస్త్రమూ అన్న భావంతో కాబోలు గౌతమ ధర్మశాస్త్రానికీ, వాత్స్యాయన కామశాస్త్రానికీ సరళమే అయినా గ్రాంధికాన్నే ఆశ్రయించారు. ఇంచుమించుగా ఈశతాబ్దం పూర్వార్థంవరకూ వ్యాఖ్యానాల ధోరణి వేదంవారి బాణీలోనే సాగింది. దీనికి ఒకటీ అరా అపవాదాలుండవచ్చు.

తెలుగు సాహిత్యంలో శ్రీ కృష్ణదేవరాయల యుగం గడిచిపోయిన తర్వాత, ఆ ప్రబంధ ధోరణిని కూడా మరిపించగల స్వోపజ్ఞత చాలాకాలం దాకా తలెత్తలేదు. ఒక్క పింగళి సూరన్నను మినహాయిస్తే మరో నూరేళ్ళ దాకా మహాప్రతిభావంతుడైన కవి కూడా కనపడడనే చెప్పవచ్చు. తెలుగు సాహిత్యంలో ప్రబంధ ధోరణి ఒక మిరుమిట్లు గొలిపే నవ్యతను తీసుకుని వచ్చింది. ఆ తర్వాత నూరూ నూటయాభై సంవత్సరాలదాకా అంత మౌలిక

ప్రతిభ చూపగల కవులు లేనందువల్ల పిల్లవసుచరిత్రలతోనే కవులు తృప్తి పడాల్సి వచ్చింది. బహుశా యక్షగాన సాహిత్యం - విరళంగా వచన రచనా, కాలూనడానికి ప్రబంధ రచనను మించిన ఉపజ్ఞాన్వితమైన కావ్యరచనా విదగ్ధ తను ప్రవర్శించగల కవి చేమకూర వెంకన్న - రఘునాథ నాయకుని ఆస్థానంలో విలసిల్లేటంతవరకూ మరొకరెవరూ లేకపోవడమే కావచ్చు. ఇతనిలో కావ్యకవుల ప్రతిభా, ప్రబంధకవుల వర్ణనా, పురాణకవుల లలిత పద గుంఫనమూ ముప్పిరిగొన్నాయి. అందువల్లనే తెలుగు సాహిత్యంలో అనితరసాధ్యమైన నవీన ధోరణిని కావ్యరచనలో అతడు ప్రవేశపెట్టగలిగాడు.

అల్లసాని పెద్దన్నకు శ్రీకృష్ణదేవరాయల ఆలంబనం లాగా, చేమకూర వెంకటకవికి రఘునాథ నాయకుని ఆస్థానం శోభించింది. రఘునాథుని వంటి వరగల్లు దొరికినప్పుడే; విజయవిలాసం వంటి చొక్కపు బంగారం పరీక్ష కాగుతుంది. ఆమాట చేమకూర కవే చెప్పాడు. "ఎందును విద్యలే ఎరుగ" (అవ. 55)

అల్లసాని పెద్దన్న తర్వాత తెలుగు సాహిత్యంలో న్యాయానికి కవితా యుగ కర్తృత్వం ఇతనికే దక్కాలి. కేవలం మూడాశ్వాసాలు, సుమారు 700 గద్యపద్యాలతో లఘు కావ్యాన్నే రచించినప్పటికీ, ఏగతి రచియించిరేని సమకాలపువారలు మెచ్చరేగదా అని బాధపడ్డ చేమకూర కవి అభిప్రాయానికి; అపవాదంగా అటు కావేరీ నుండి యిటు కృష్ణాతీరం వరకూ - ప్రతి పద్య రసోదంచితమైన కవితాప్రతిభ ఆయన జీవితకాలంలోనే వాసించింది. అప్పకవి వంటి శుద్ధఛాందసుడూ, లాక్షణికుడూ కూడా విజయవిలాస మాధుర్యానికి ఆకర్షితుడై ఇందులోని పద్యాలు తన అప్పకవీయంలో ఉదాహరించాడు. పరిశోధకులూ, విమర్శకులూ భావిస్తున్నట్టు రఘునాథనాయకుని ఆస్థానంలో ఆయన విజయసూచకంగా నిర్మితమైన విజయ భవనంలో విజయవిలాస కృత్యవతరణోత్సవం 1616 ప్రాంతంలోనే సంభవించి ఉన్నప్పటికీ, 40 సంవత్సరాల కాలావధిలోనే లక్షణ గ్రంథంలో (1656) చోటు చేసుకోడం - ఆ కావ్య వైశిష్ట్యానికి తార్కాణం.

19వ శతాబ్దంలో బ్రౌన్ కూడా విజయవిలాస ప్రబంధానికి ఆకర్షితుడయ్యాడు, కనుకనే పండితుల చేత దానికి శుద్ధ ప్రతి రాయించి భద్రపరిచాడు. తెలుగులో ముద్రణ ఆరంభమై ఒక స్థాయికి చేరుకున్న తర్వాత తొలి ప్రచురణల్లోనే విజయవిలాసం చోటు చేసుకోడం కూడా దీని ప్రశస్తిని వెల్లడిస్తుంది. మొట్టమొదటగా 1856లో విజయవిలాసం ముద్రితమైంది. ముఖపత్రంలో ఈ కృతి ప్రాశస్త్యాన్ని ఇలా వివరించారు.

"ప్రతిపద్యరసాస్పదంబుగా రచియింపబడి, సుభద్రాపరిణయంబను నామంబుచే ప్రసిద్ధినొంది శ్రీకృష్ణ చరిత్రాది విశిష్టంబగుటంజేసి పరనాదిజనిత పరమానందంబై విలసిల్లుచున్న విజయవిలాసము.... మా॥ వెంకటకృష్ణమాచార్యులవారిచే లేఖక ప్రమాదజనిత దోషరాహిత్యం బగునట్లుపరిష్కరింపబడి.... అచ్చు వేయించి ప్రకటింపబడియె". ఈ ముద్రణలో కేవలం మూలం మాత్రమే ఉంది.

నాటి సాహిత్యపరులందర్నీ విజయవిలాసం బాగా ఆకర్షించింది అనడానికి నిదర్శనాలున్నాయి. సాధారణంగా కావ్యాల తొలి ముద్రణల్లో ఉంటాయంటూ, గిడుగు రామ్మూర్తి పంతులు తీవ్రంగా అభిశంసించిన పరిష్కృత దుష్కృతి ఈ ప్రచురణలో ఇంకా చోటు చేసుకోలేదు. చిన్నయసూరి బాల వ్యాకరణం 1858 లో వెలువడింతర్వాత తాళపత్రప్రతులనుండి ముద్రణ ప్రతులను తయారు చేసిన పండితులందరూ గిడుగువారు బాధపడ్డ కూటకరణానికి పాల్పడ్డారు. బాలవ్యాకరణ సూత్రాలకు సరిపడే విధంగా ఆయా పూర్వ కావ్యాలను అంగ విచ్ఛేదం చేసి అంటే మార్చి అచ్చువేసేవారు. దీన్ని నిరూపించడానికే కాబోలు మా॥ వెంకటకృష్ణమాచార్యులు ప్రకటించిన ప్రతిని గిడుగువారు భద్రపరిచారు. తాళపత్ర లేఖల సంప్రదాయాన్ని, శబ్దస్వరూపాన్ని, గుర్తించే పరిశ్రమలో సాక్ష్యంగా ఈ ప్రతిలో రామ్మూర్తి అక్కడక్కడా కొన్ని వ్యాఖ్యలూ సూచనలూ రాసుకున్నారు.[13]

విజయవిలాసం అచ్చయిన కొద్దికాలానికే తెలుగునాట ప్రచారాన్ని పొంది వీరేశలింగం లాంటి వారినే ఆకర్షించింది. వీరేశలింగం తొలిరచనల్లో ఒకటైన రసికజన మనోరంజనం (1869) మీద విజయవిలాసం రచనారీతి స్పష్టంగా ముద్రవేసింది. వస్తువుకూడా చేమకూర వానిదే. అర్జునుడు - చిత్రాంగదల పరిణయ గాథనే స్వీకరించి అచ్చ తెలుగు కావ్యంగా మలిచారు. అందినంతవరకూ ఎత్తుబడిలోనూ వర్ణనల్లోనూ, పదాల విరుపుల్లోనూ విజయవిలాసకర్త కనిపిస్తుంటాడు. అప్పటికి వీరేశలింగం వయస్సు సుమారు 20 ఏళ్ళు. అంతేకాక 1872 వ సంవత్సరంలో వీరేశలింగం రచించిన శుద్ధాంధ్రోత్తరరామాయణంలో వ్యాకరణ విరుద్ధ ప్రయోగాన్ని, గుంటూరు ఆంగ్లో వర్నాక్యులర్ స్కూలు తెలుగు పండితులొకరు ఆక్షేపించగా; పురుషార్థప్రదాయిని అనే ఆనాటి ప్రసిద్ధ సాహిత్యపత్రికలో చేమకూరకవిని తనకుసాక్ష్యంగాతెచ్చుకున్నారు.దీన్నిబట్టి కవితాచమత్కారంవిషయమేకాక, భాషాపరంగాకూడా ఆనాటి సాహిత్యపరుల్లో చేమకూరవాని సాహిత్యప్రామాణికత్వానికి భంజకంలేదని తెలుస్తూంది.

కానీ, మరో పుష్కరం గడిచేటప్పటికి బహుజనపల్లివారు శబ్దరత్నాకరంలో-కవుల తారతమ్య నిర్ణయం చేస్తూ నాలుగో శ్రేణిలో చేమకూర వెంకటకవిని చేర్చడంలో ఏదో గూఢార్థం ఉండి ఉంటుంది (1885).

“పింగళి సూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్నమునకు తర్వాత విజయ విలాసమే సర్వవిధములచేతను తెలుగులో శ్లాఘ్యకావ్యముగనున్నది. జాతీయాది చమత్కృతిని బట్టి విజయవిలాసమే శ్లాఘ్యకరమైనదని అనేకులభిప్రాయపడు చున్నారు”. తెలుగులో కవుల చరిత్రను శాస్త్రీయ ప్రామాణిక దృష్టితోనూ, ప్రతిభావంతంగానూ కూర్చిన వీరేశలింగమే చేమకూర ప్రబంధానికి ఇలాటి తీర్పునిచ్చారు (1885 - 1899). కానీ బహుజనపల్లి సీతారామాచార్యులు మాత్రం వీరేశలింగం ప్రస్తావించిన అనేకుల్లో కూడా చేర్చకపోవటం విచారకరం.

బ్రౌను పుణ్యమా అని, బహుపాఠాంతర పరిష్కృత ప్రత్యంతర శోధిత ప్రతి సిద్ధమై ఉన్నప్పటికీ 1856 దాకా విజయవిలాసం ముద్రణకు నోచు కోలేదు. అప్పటికే సాహిత్యలోకంలో గొప్ప ప్రసిద్ధిని పొంది ఉన్నందువల్ల తొలిముద్రణ పొందిన నాటినుండీ విపణిలో గుజిలీ ప్రతులనేకం వెలువడుతూ వచ్చాయి. పదునాలుగు సంవత్సరాల్లోనే ఇదే పేరుతో యక్షగానంగా అమనచెర్ల కోదండరామయ్య చేత రూపొంది ముద్రితమైంది (1870) దీనివల్ల పండి తుల మెప్పేగాక సామాన్యప్రజానీకం కూడా దీన్ని బాగా ఆదరించినట్టు కనిపిస్తుంది.

ఈ విధంగా పాఠకలోకంమెప్పు సంపాదించినందువల్ల పుస్తకవిక్రేతలు, ముద్రాపకులు త్వరిత గతిలో అచ్చొత్తించడమే చూసుకున్నారు కానీ తదితర మైన సాహిత్యపరమైన శ్రద్ధ చూపించలేదు. అంటే నిర్దుష్ట పాఠనిర్ణయంగానీ, గణయతిప్రాసల భంగంకానీ గమనించలేదు. ఇదే పరిస్థితి 19వ శతాబ్దం చివరి వరకూ కొనసాగింది. ఈ విషయమే కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావు; అనేక పండితుల సహాయంతో ప్రచురించినట్లుగా పేర్కొన్న విజయవిలాసం విజ్ఞాపనం (1901)లో రాశారు. కాబట్టి మొదటిసారి ముద్రిత మైన 1856 నుండీ తాపీవారి హృదయోల్లాస వ్యాఖ్యానం వెలువడిన 1968 వరకు, నూట పన్నెండు సంవత్సరాల్లో కవులూ, పండితులూ, పరిష్కర్తలూ, వ్యాఖ్యాతలూ; విజయవిలాసం ముద్రణ, ప్రకటనల విషయంలో చేసిన కృషిని ఇలా క్రోడీకరించవచ్చు.

| | | | |
|---|---|---|---|
| 1. | మాడభూషి వెంకటకృష్ణమాచార్యులు | 1858 | కేవలం మూలం. |
| 2. | వేదం వెంకటరాయశాస్త్రి | 1901 | కేవలం మూలం. |
| 3. | కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావు | 1901 | లఘుటీక పాఠాంతర సహితం. |
| 4. | నోరి గురులింగశాస్త్రి | 1906 | ప్రతిపదటీకాతాత్పర్య సహితం. |
| 5. | వావిళ్ల రామస్వామి శాస్త్రుల్లు | 1909 | కేవలం మూలం. వీళ్లు అనేకపర్యాయాలు మూలాన్ని మాత్రమే ప్రకటించారు. |
| 6. | వేదం వెంకటరాయశాస్త్రి | 1912 | పాఠనిర్ణయ వ్యాఖ్యా రచనాది సహితం |
| 7. | బులుసు వెంకటరమణయ్య | 1952 | ముకుర వ్యాఖ్యాన సహితం. |
| 8. | విద్వాన్ విశ్వం (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి) | 1966 | కేవలం మూలం. సంపాదకుల పీఠిక. |
| 9. | తాపీ ధర్మారావు | 1968 | హృదయోల్లాస వ్యాఖ్య. |
| 10. | విశ్వనాథ సత్యనారాయణ (ఎమెస్కో) | 1971 | సంపాదకుల పీఠిక |
| 11. | అక్కిరాజు రమాపతిరావు (కాకతీ పబ్లికేషన్స్) | 198. | సంపాదకుల పీఠిక. |

ఈ మధ్యలో అనేక ప్రచురణ సంస్థలు విజయవిలాసం మూలాన్ని అనేక సార్లు ప్రచురించాయి.

కవి పండిత పరిష్కరణ సహితంగా వెలువడ్డ పై ముద్రణల్లో ప్రత్యేకత లను క్లుప్తంగా చూద్దాం.

**మాడభూషి వెంకటకృష్ణమాచార్యులు :**

విజయవిలాసాన్ని మొట్టమొదటిసారిగా (1858) ముద్రించిన ఖ్యాతి వీరిది. కేవలం మూలాన్నే ముద్రించారు. వీరు బ్రౌను దొర పండితులని ధర్మారావుగారు తమ హృదయోల్లాస వ్యాఖ్యలో పేర్కొన్నారు. గ్రంథమంతా తొలినాళ్ళ తెలుగు ముద్రణల ననుసరించి ఒకే పంక్తిగా అచ్చువేశారు. వలపల గిలక ఉపయోగించారు. వీరేశలింగం తన కవుల చరిత్ర ద్వితీయ భాగంలో చేమకూర వెంకటకవిని గురించి రాశారు. పీఠికాధార ప్రతి మాడభూషి

వారిదే. వీరేశలింగం కవుల చరిత్ర వచ్చిన తర్వాత అచ్చయిన విజయ విలాసం ప్రతుల్లోని కొన్ని పాఠాంతరాలు మాడభూషివారి ప్రతిలో లేవు.

వేదం వెంకటరాయశాస్త్రి :

వీరు కేవలం మూలం మాత్రమే సంస్కరించి 1901 లో వైజయన్తీ ముద్రాక్షరశాలలో ప్రకటించారు.[14]

కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావు :

ఇన్ని విధాలుగా పాఠకుల ప్రశంసలు పొందిన విజయవిలాసానికి శుద్ధ పాఠ నిర్ణయంతో కూడిన ప్రతిలేదని గుర్తించి, ఆకాలపు సుప్రసిద్ధ పండితులు బయ్యపునేని వెంకటజోగయ్య, వడ్డాది సుబ్బారాయుడు, దాసు శ్రీరాములు, కొత్తపల్లి పద్మనాభశాస్త్రి, పాడి వెంకటస్వామి మొదలైనవారి సాయంతో 1901 లో ఒక ప్రచురణ తెచ్చారు. వారే చెప్పినట్టు 'లఘుటీక శతఘంట కవులును, బండితులును నా మిత్రులును నగు దివాకర్ల తిరపతిశాస్త్రిగారి సాహాయ్యమున' నిర్వహించారు. వీరికి మాడభూషి వారి ప్రతే ఆధార ప్రతి కావచ్చు.

నోరి గురులింగశాస్త్రి :

ప్రతి పద టీకా తాత్పర్య సహితంగా వెలువడ్డ మొదటి ముద్రణం ఇది (1906). బరూరు త్యాగరాయశాస్త్రుర్లవారి గీర్వాణ భాషా ముద్రాక్షరశాల మద్రాసులో ముద్రితమైంది. పాఠ నిర్ణయం చేసినట్టు కనపడదు. భాష సరళంగా ఉంది. జాతివార్తాచమత్కారాదుల వివరణం జోలికి పోకుండా ఉండడం చూస్తే, గురులింగశాస్త్రికి సామాన్య పాఠకుడే దృష్టిలో ఉన్నాడని పిస్తుంది.

వావిళ్ళ రామస్వామి శాస్త్రుర్లు :

1909 లో మూలం వరకూ విజయవిలాసాన్ని ప్రచురించారు. వీరి పీఠికనుబట్టి వేదంవారు అంతకు పూర్వం ప్రచురించిన 1901 శుద్ధప్రతే ఆధారమని తెలుస్తూంది.[15] దీని ప్రచురణకు పరోక్షంగా వేదంవారూ ప్రోత్సాహపరిచారు.

వేదం వెంకటరాయశాస్త్రి :

విజయవిలాసాన్ని ఎల్లవారికి సుబోధం కావాలని పాఠ నిర్ణయాలతో స్వల్ప వ్యాఖ్యతో మొదటిసారి వెలువరించారు (1912). "అటనట లక్షణోల్లంఘనము కావించినను ఇతడు కవనమందు కడుం గడుసువాడన్న" విన్నపంలోని వేదంవారి దృష్టిని చూస్తే వారి లాక్షణిక వ్యాఖ్యాన దృక్పథం కనిపిస్తుంది. ఇదే తరవాత వారు రాసిన ఇతర ప్రబంధాల వ్యాఖ్యల రచనలోనూ చోటు చేసుకుంది.

బులుసు వెంకటరమణయ్య :

వీరి ముకుర వ్యాఖ్యానం వెలువడేనాటికి (1952) విజయవిలాసం అనేక మార్లు అచ్చువటమేకాక పాఠ నిర్ణయాల గురించీ, ప్రతిపద్య రసోదంచిత చమత్కారాల గూర్చీ ఆనాటి సుప్రసిద్ధ సాహితీపరులందరూ చర్చలు చేశారు. అవన్నీ పత్రికాముఖంగా వెలువడ్డాయి. కనుక 'పాఠ నిర్ణయంలోనూ, వ్యాఖ్యాన రచనంలోనూ కొంత సౌలభ్యాన్ని అవి బులుసువారికి చేకూర్చి ఉండవచ్చు. అచంట సాంఖ్యాయన శర్మ, త్రిపురాన సూర్యప్రసాదరాయ కవి, చెళ్ళపిళ్ళవారు, కాశీ కృష్ణాచార్యులు, వేటూరి ప్రభాకరశాస్త్రి, దీపాల పిచ్చయశాస్త్రి, మొదలైన హేమాహేమీలు విజయవిలాస కవన చాతుర్యంలోని అందచందాలను విశేషంగా చర్చించారు.

విద్వాన్ విశ్వం :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి పుస్తకాల ప్రచురణంలో భాగంగా 1966 లో కేవలం మూలంతో ఒక ప్రచురణ వచ్చింది. దానికి సంపాదకులుగా విద్వాన్ విశ్వం చక్కని పీఠిక రాశాడు. వీరు ప్రధానంగా బులుసు వారి గ్రంధాన్నే ఆధారంగా స్వీకరించినట్టు పీఠికలో రాశారు అప్పటికే అన్ని నిర్ణయాలూ స్థిరపడ్డాయి. సాహితీలోకం సుమారు నాలుగు దశాబ్దాలుగా ధర్మారావు నోట వింటున్న విజయవిలాసం అందాల హృదయోల్లాస వ్యాఖ్య కోసం ఎదురు చూస్తోంచి.

"వాఙ్నియమ రూఢినీయంత వాడికేడి" - అనీ "క్షితిలో నీ మార్గమెవరికిన్ రాదు సుమా" - అనీ కృతిపతిచేతా; "ఈ చేమకూర, చక్కెరమడిలో అమృతము పారించి పెంచినదిగాని, మట్టిలో నీరు పారించి పెంచినది గాదు. ఇందు పూమొగ్గలు బోలె తామే విడు శ్లేషలును, ద్రాక్షాపాకంబన నోరూర రసమొలుకు రచనలునూ. . .విసిగింపని వర్ణనలున్నూ, బరువులూ నెరువులుంగాని కబ్బంపు దొడవులునూ"16 కల మధుర ప్రబంధమంటూ ఈ శతాబ్దిలోని పండితులచేతా ప్రశంస పొందిన ఈ విజయవిలాసం చదివి చదివి చవులు పుట్టనుడివెదనంటూ హృదయోల్లాస వ్యాఖ్యానానికి ధర్మారావు పూనుకోవాల్సి వచ్చింది. చిన్నతనానే దీనిమీద మనసు పోవడం, కవిపండిత మిత్ర సమాగమాల్లోనూ, సారస్వత గోష్ఠుల్లోనూ; విజయవిలాస రచనా చమత్కారాలకు సంబంధించి కన్నవీ, విన్నవీ అరకుడుపుగా తనకు చాలా అసంతృప్తిని కలిగిస్తూండటంతో-తామూ ప్రాస్తావికంగా కొన్ని నిగ్గులు బయటపెట్టారు. దాంతో చేమకూర హృదయావిష్కరణకు తగినవాడివి నీవేనని రసజ్ఞుల, సహృదయుల

ప్రోత్సాహం ఎక్కువైంది. పీఠికలో వారే చెప్పినట్టు రసగ్రహణాన్నే ప్రధానంగా దృష్టిలో పెట్టుకుని వ్యాఖ్యానానికి దిగారు. చేమకూర వెంకటకవి విజయ విలాస కావ్యరచనలో "పదప్రయోగం మొదలు - రసపోషణ వరకూ అన్ని విషయాల్లోనూ స్వతంత్ర విధానం అవలంబించటానికి ప్రయత్నం చేశాడు" అన్న విషయాన్ని సిద్ధాంతీకరించటానికే ధర్మారావుగారీవ్యాఖ్యానాన్ని చేపట్టారు. అంతేకాదు వ్యాఖ్యానం విషయంలో ఇదే యోగ్యతాపత్రం వ్యాఖ్యాతకు కూడా వర్తిస్తుంది.

"కవిని గురించి బాగా తెలియకపోతే అతని రచనలను చక్కగా అవగాహన చేసుకోలేం" (హృదయోల్లాసం పీఠిక. పేజి 22) అనే ఈ అభిప్రాయం చేమకూర కవితాప్రాశస్త్య నిరూపణంలో ధర్మారావు పట్టుకున్న జీవనాడి. ఈ దృష్టితో వెంకటకవి పదమెత్తినప్పుడు, అధరస్పందనం కావించినప్పుడూ; అడుగడుగునా అతడి పోకడలను ఈ వ్యాఖ్యాత బాగా ఆకళింపు చేసుకున్నాడు. కవి స్థానాన్ని ముందుగా నిర్ధరిస్తేకానీ, కవిత్వ విశిష్టతను అంచనా కట్టలేమన్న నిర్ణయం వల్లనే, తాపీ మంచి వ్యాఖ్యానం మనకందించ గలిగాడు.

ఆనాటికి ఆరు వందల సంవత్సరాలుగా సాగుతున్న సాహిత్యపథంలో వెంకటకవి స్థానాన్ని నిర్దిష్టంగా అంచనా వేయగలిగాడు వ్యాఖ్యాత. అప్పటికి సుపరిష్కృతమైన ప్రబంధ సంప్రదాయాన్ని మలుపు తిప్పి, కొత్తబాట చూపి నన్నయ తర్వాత తిక్కనలా, పెద్దన తర్వాత తానే మజిలీ అయినాడు. ఈ సందర్భంలో, నన్నయ తిక్కనల తారతమ్య స్థాన నిరూపణం చేస్తున్న వేటూరి ప్రభాకరశాస్త్రి అంచనా - ప్రబంధానంతర యుగానికి వర్తిస్తుంది. "తిక్కన, నన్నయ సంప్రదాయంవాడే కానీ భాషలో భావములో నత్యధికముగా దేశితనము జొప్పించినాడు. పలుకు పలుకు ప్రయోజనము కలదగునట్లు, కూర్పున మర్మముండునట్లు లోతులోతుగా యోచించిన గాని యర్థము కానట్లు కల్పనాచమత్కృతితో నీతడు పద్యరచన చేయును."17 ఈ అభిప్రాయాన్ని అల్లసాని, చేమకూరలకు క్రమంగా అన్వయించవచ్చు. అంటే ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలలో; చిత్ర విస్తర సమ్మేళనం - మార్గ దేశి మేళవింపు-చేమకూరవాని పాకం రుచిని పెంచింది. దీన్ని ధర్మారావు చక్కగా గుర్తించి ఈ వ్యాఖ్యానాన్ని సంతరించాడు.

వ్యాఖ్యాన రచనను చేపట్టే ముందు - వెంకటకవి కవితాప్రాగల్భ్యాన్ని సరిగ్గా లోకం గుర్తించలేదన్న తపనతో అప్పటివరకూ వచ్చిన వ్యాఖ్యానాలన్నీ క్షుణ్ణంగా అవలోడనం చేసి ప్రధానంగా జూలూరి అప్పయ్య, వేదం వెంకటరాయ శాస్త్రి; హృదయోల్లాస ముద్రణ కాలానికి వచ్చిన బులుసువారి ముకుర

వ్యాఖ్యలను ధర్మారావు ముందుంచుకున్నారు. వీరెవ్వరూ చూపని విశేషాల మీదా, అందచందాల మీదా, అర్థవివరణల మీదా, దృష్టిని కేంద్రీకరించారు. అలాటి పట్టులలోనే కవిహృదయస్థం కావచ్చనుకున్న పాఠనిర్ణయం కోసం పరిశ్రమించారు.

ప్రతిపదరసాస్పదంగా తాను ప్రకటించానని చేమకూర ఆత్మవిశ్వాసంతో చెప్పుకున్న జాతి, వార్తా, చమత్కార, అర్థగౌరవాలను ధర్మారావు ఈ విధంగా సమర్థించారు.

ప్రథమాశ్వాసంలో 197 వ పద్యాన్ని పరిశీలిద్దాం.

కన్నె నగుమోము తోడన్
బున్నమ చందురుని సాటి బోలుపవచ్చున్
నెన్నుదురుతోడ మార్కొని
మున్నందరు జూడ రేకమోవకయున్నన్.

ఇందులో ఉన్న 'రేకమోవకయున్నన్' - అన్న పదబంధానికి పూర్వవ్యాఖ్యాతలందరూ సరైన అర్థం చెప్పటంలో విఫలమయ్యారు. దీన్ని ప్రస్తావిస్తూ ఈ పద్యం "పండితులను పరిష్కర్తలను వ్యాఖ్యాతలనూ మూడు వందల సంవత్సరాలకు పైగా చిక్కులపాలు చేసింది. జూలూరివారు, నోరివారు, వేదంవారు, బులుసువారు అసంతృప్తికరమైన (అసందర్భమైన అని అనవచ్చునేమో) అర్థాలు చెప్పి తప్పించుకోవాల్సివచ్చింది." - అని తాపీవారనడం అవినయ ప్రకటనం కాదు. జూలూరి అప్పయ్య "రేక యనగా జాబు, కమ్మ, అది మోసే పనికి యేర్పడకపోయినట్టయితేనూ; అనగా ఈచిన్నదాని నొసటితో ప్రతిఘటించి సమానం కాలేక ఓడి జాబులు మోసే హర్కారావాడైనాడని" - అన్నారు. శబ్దరత్నాకరకారుడు కూడా రేకకు జాబు అన్న అర్థమిచ్చి విజయవిలాసంలోని ఈ పద్యాన్నే ప్రయోగంగా చూపించాడు. వేదంవారుకూడా ఈ అడుగుజాడల్లోనే తప్పటడుగులు వేస్తూ "అందరు జూడన్ - ఎల్లవారి యెదుట (అనగా బట్టబయలైన అవమానమునకు బాలై) రేకమోవకయున్నన్ - జాబు మోయు పనిని (తపాలా నౌకరీని) చేయకున్న యెడల'' అని వ్యాఖ్యానించారు. ఈ విధమైన వ్యాఖ్యానాలు కవి హృదయాన్ని సమర్థంగా ఆవిష్కరించకపోవడమేకాక, పాఠకుల్ని అయోమయం పాలు చేస్తాయి. ఈ ధోరణి వ్యాఖ్యానాల్లోని అనౌచిత్యాన్ని ధర్మారావు తమ వ్యాఖ్యలో ఎలా పరిహరించారో, ఔచిత్యాన్ని ఎలా ఆహరించారో చూద్దాం.

విజయవిలాసంలోనే ప్రకరణాంతంలో ఇదే ప్రయోగం ''ఒక్కించుక రేకమోవని నాయురస్థలంబున నీ కుచకుంకుమ రేఖలంటించి నీవారికి నూడు

దీర్చితివి'' - అని అర్జునుడు సుభద్రతో అంటాడు (అ. 3. ప. 159). అలాగే శేషం వెంకటపతి రచన తారాశశాంక విజయంలో ''శశిమీదన్ రేక గానిత్తునే'' - అనే ఈ రెండు ప్రయోగాలనూ ఆధారంగా చేసుకుని 'రేక' అంటే, ఆయుధమువల్ల కలిగిన గంటూ, గాయము అంటూ - అక్షరలక్ష చేసే అర్థాన్నీ అందాన్నీ సమకూర్చారు. ఇప్పుడిక శబ్దచమత్కారం ఆహ్లాదజనకం - అప్రయత్నమూ అయింది. దీన్నిబట్టి పూర్వ వ్యాఖ్యాతలెవ్వరూ ప్రయోగాంతరం కోసం, ప్రకరణాంతర ప్రయోగం కోసం పరిశీలించినట్టు కనిపించదు. తాము వ్యాఖ్యానించ పూనుకున్న ఇదేకవి రచనలో మరోచోట ఇదే ప్రయోగం ఉందన్న విషయాన్నికూడా గమనించకపోవడం కవికి జరిగిన అన్యాయం. విజయవిలాస పూర్వ వ్యాఖ్యాతలందరూ దీన్నిబట్టి తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం దృష్టితో ఉన్నారే కాని కవి పట్ల శ్రద్ధ, ఆసక్తి ఉన్నవాళ్ళుకారేమో ననిపిస్తుంది.

ఇదేవిధంగా 1 అ. 134 వ పద్యం చాలా ప్రసిద్ధమైన వాటిల్లో ఒకటి. "ఊదుకపోవు శంఖమునహాగళరేక" - అన్నదాన్ని పరిష్కరించడంలో తాపీవారన్నట్టు వ్యాఖ్యాతలందరూ చాలా తబ్బిబ్బుల పాలయ్యారు. ''శరాసనంబులన్ వాదుకుబట్టి కన్బొమల వైఖరి వంకలు తీరుచున్'' - అనే అప్రశస్తమైన పాఠాన్నే అందరూ పఠించారు. ''శరాసనంబులన్ వాదుకుబట్టు కన్బొమల వైఖరి'' అని పఠించడంలో పద్యంలోని చిక్కంతా ఇట్టేవిడిపోయింది. ప్రక్రమభంగదోషం తొలగి పోయింది. ఇందువల్ల వ్యాఖ్యాతలూ, పరిష్కర్తలూ చేసిన పదవాక్య పరిచ్ఛేదంలోని లోపాన్ని ధర్మారావు సరిదిద్దినవారయ్యారు. అర్థవివేచనంలో సౌలభ్యాన్నందించారు. దీన్నిబట్టి ప్రత్యంశ సహితంగా ఎంత జాగ్రత్తతో పదాన్నీ పదాంశాన్నీ, వాక్యాన్నీ వాక్యాంతాన్నీ పరిశీలించారో స్పష్టమవుతుంది. పాఠపరిష్కరణ భారం వహించడమే కాకుండా, పాఠాంతర గవేషణకుకూడా తాపీవారు పూనుకోవడం విశేషం.

రసావిష్కరణ సందర్భంలోకూడా తాపీవారి పరిశ్రమను వెల్లడించే పట్టు మరొకటుంది.

గుట్టసియాడ, గబ్బిచనుగుట్టలపై బులకాంకురావళుల్
తెట్టువగట్ట, గోరికలు దేటలుపెట్టగ వేడుకల్ మదిన్
దొట్టికొనంగ, నచ్చెరువు తొంగలి రెప్పల వీగనొత్తగా
బెట్టిన దండదీయక విభాత మృగేక్షణ సూచె నాతనిన్. (అ. 126 ప)



44 విజయవాడలో విశాలాంధ్ర పత్రిక జన్మదినోత్సవం. 1966.



45. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మొదటి విశిష్ట సభ్యులు 1966



46. విశాఖపట్నంలో శ్రీ శ్రీ షష్టిపూర్తి. 1970



47 తాతాజీకి వై.బి.యస్. ప్రసాదరావు (ఏటుకూరి ప్రసాద్) శ్రద్ధాంజలి. 1973 మే 8.

అర్జునుని తొలిసారిగా చూసినప్పుడు ఉలూచి మనస్సులో కలిగిన సంచలనమంతా ఈ పద్యంలో వర్ణించాడు. క్షణక్షణ ప్రవర్ధమానమైన మానసిక పరిణామాన్ని సమర్థురాలైన అభినేత్రి రంగస్థలం మీద ప్రదర్శించినట్టుగా ఈ పద్యంలో కవి వర్ణించాడు. వేదం వారూ, అంతకు ముందు జూలూరు వారూ గుట్టసియాడ అనే పదబంధానికి చేసిన అర్థనిర్ణయం అనౌచిత్యంగా ఉందని తాపీవారి భావం. 'గుట్టు' - అన్నదానికి మర్మస్థానమన్న అర్థాన్ని ఈ ఉభయులూ చెప్పగా, 'మనస్సులోని మర్మము' అని తాపీవారు భావించడం ఔచితీ శోభితంగా ఉంది. పూర్వ వ్యాఖ్యాతలు పదప్రయోగ విషయంలో వ్యాకరణ లక్షణాన్నీ, రసవిషయంలో అలంకార లక్షణాన్నీ ఆశ్రయిస్తారు. లాక్షణికతా మర్యాదకు ఏ కొంచెం మేర మీరడం ఊహించరు, సహించరు కూడా. కవి హృదయాన్ని వ్యక్తీకరించాలన్న దీక్షగల ధర్మారావు, ఉలూచి మానసిక స్థితినీ సంచలనాన్నీ గమనించారు. అంతేకానీ, వేదం మొదలైన వారు స్థిరీకరించిన సాత్విక భావం మన్మథావస్థలోని కంపాన్ని బలవంతంగా ఆరోపించలేక పోయారు.

ఈ వ్యాఖ్యానంలో మరో అపూర్వ విషయాన్ని ధర్మారావు వెల్లడించాడు. చక్షుఃప్రీతికి సంబంధించిన మానసికోద్వేగాన్ని; ఈ శతాబ్ది మహా మేధావి, సుప్రసిద్ధ నవలా రచయిత హెచ్. జి. వెల్సు 'లవ్ అండ్ లూషేన్' అనే నవల్లోని తుల్య సన్నివేశాన్ని తీసుకుని ధర్మారావు వ్యాఖ్యానించాడు. ప్రపంచ సాహిత్యంనుంచి తుల్య సన్నివేశాలనూ, విశ్లేషణలనూ వ్యాఖ్యాత ఎన్నుకొన్నాడంటే ప్రేమా, విరహం, ప్రణయోద్వేగం మొదలైన విశ్వజనీన మానవోత్తేజనలను ప్రతిభావంతులైన మహారచయితలందరూ ఒకే భావౌన్నత్యానికి తీసుకుని పోగలరని నిరూపించడానికే. ఇంతేకాకుండా చేమకూర వెంకటకవిని విశ్వకవుల శ్రేణికి తీసుకుని వెళ్ళాలన్న అభిప్రాయం కూడా గమనించవచ్చు. "నిన్నమొన్నటి హెచ్. జి. వెల్స్ మహా మేధావికీ, మున్నూట యాభై సంవత్సరాలనాటి చేమకూర కవికీ ఉన్న భావసాదృశ్యం గుర్తించడం మనకు గర్వకారణం కాదా" అంటున్నాడు ధర్మారావు.

ఈ పద్యంలోనే "వేడుకల్ మదిన్ దొట్టికొనంగ నచ్చెలువ తొంగలి రెప్పల పీగనొత్తగా" అనే పదచిత్రానికి వీరు చేసిన వ్యాఖ్యానం చాలా హృద్యంగా ఉంది. కోరిన మగవానితో తాననుభవించబోయే ఇష్ట సౌఖ్యాలు మనస్సులో అలలవేగంతో ఒకదాన్నొకటి అతిక్రమిస్తూండగా విభ్రమంతో వాలురెప్పలు విప్పార్చి, రెప్పలే లేవన్నట్టు - ఉలూచి చూసింది. పూర్వ

వ్యాఖ్యాతలెవరూ కనిపెట్టలేని "వేడుకల్ మదిన్ దొట్టికొనంగ నచ్చెరువు... " లోని పదసంయోజనంలో 'అచ్చెరువు'లో 'చెరువు'ను గమనించి, దాని ఆధారంగా భావచిత్రాన్ని నిర్మించడం ఒక విశేషం. చెరువులో నిరంతర చలనశీలం గల అలలను, వాటిని ప్రతిరోధించే గట్లనూభావించి చమత్కారావిష్కరణం చేశాడు.

సాయంసంధ్యావర్ణనంలో చంద్రోదయాన్ని వర్ణిస్తూ వెంకటకవి రాసిన పద్యంలో -

"దాసులు వట్టు జాళువాబంగరు టాలవట్టముల
భంగి....తోయజశాత్రవ మిత్రబింబముల్"

(1 ఆ. ప. 208)

అన్నదానిలోని 'ఆలవట్టము' అన్నదానికి పూర్వ వ్యాఖ్యాతలు సరైన అర్థ వివరణం చేయలేదు. మన్మథుడు విరహుల పైకి నడిచే జైత్రయాత్ర సన్నాహంలో, మహారాజ పరివారంలో వారు ఇరువైపులా పట్టినడిచిన 'ఆలవట్టము'ల లాగా సూర్యచంద్రులున్నారని కవి భావం. ఆలవట్టానికి అర్థవివరణంలో జూలూరి వారు ఛత్రమనీ, బహుజనపల్లివారు గుండ్రని గుడ్డ విసనకర్ర అనీ అర్థం నిర్ధారించగా, వేదంవారు కూడా 'గుడ్డ విసనకర్ర' - అనే అర్థాన్నిచ్చారు. దీంతో కవి భావించిన అర్థచమత్కృతి ఆవిష్కృతం కాదు. దీన్ని గమనించిన ధర్మారావు, విశేషపరిశ్రమ ఫలితంగా రాజలాంఛనాలైన సూర్యపాను, చంద్ర పానులన్న ఆలావర్తాలను, లక్ష్మీనారాయణీయం ఆధారంగా బైటపెట్టాడు. 'ఆలావర్తం' వికృతి 'ఆలవట్టం'. ఇలాటి అర్థవివరణంతో ఈ పద్యంలోని సొగసు ఇట్టే తళుకుమంది. వ్యాఖ్యాతలను ఎన్నో సంవత్సరాలు పీడించిన ఆయాసం ఇట్టే మాయమయింది.

"నీరుచొరక లోతు నిజముగా తెలియదు" - అనీ "నీటికొలది తామర సుమ్మీ" - అని ఉన్న సామెతలు ధర్మారావుపట్ల అన్వర్థాలు. ప్రతిపద్యంలోనూ ప్రతిపదంలోనూ భంగ్యంతరంగా బహుభంగులా చేమకూర భావలహరి ప్రవహిస్తూంటుంది. ఆ భావలహరిలో ఈదులాడఁంది అందాలందవు. ప్రవాహవేగాన్ని అనుసరించని పూర్వవ్యాఖ్యాతలకు అవగతంకాని అందంమరోటుంది. చిత్రాంగదను అర్జునుడు వివాహమాడబోయే ఘట్టంలో; తన చెలికాడు విశారదుని, "మలయధ్వజ క్షితీశకమలహితునకు మామకాగమన వార్త తెలుపుము" (1 ఆ. ప. 217) అని పురమాయించాడు. జూలూరువారు మామకు అగమనవార్త అని కూడా అంటూ చమత్కారం అన్నారు. వేదంవారు మామకున్ + ఆగమనవార్త. తన కూతును నాకిచ్చి వివాహము చేయమని అయన నడుగుము అని విశదీకరించారు.

ఇంతకూ మలయధ్వజుడు అర్జునుడికింకా మామకాలేదన్న అంశాన్ని ఇద్దరూ విస్మరించారు. మామకున్ + ఆగమనవార్త అన్న పదచ్ఛేదంలో ఆ పదాలకా అర్థాలు ఎలా సాధ్యమో వివరించలేదు. దీన్నే ధర్మారావు, వ్యాఖ్యాతలు చేసిన 'కిట్టింపు' అని అంటూ తన విరుపును ఇలా చెప్పారు. మామ + కాగ + మన వార్త తెల్పుము అంటూ, అర్జునుడు చమత్కరించిన సాభిప్రాయాన్ని ఇలా సూచించారు. ఏ విధంగా నీవక్కడ నిర్వహించుకుని వస్తావో అదంతా నీకే వదిలేస్తున్నాను. నీవు చాలా సమర్థుడివి. మన సంబంధం విషయం ఆయనతో ఏ విధంగా ప్రస్తావిస్తావో అది నీ యిష్టం. ఆయన తన కూతుర్ని నాకిచ్చే విధంగా సమర్థించుకుని రావాలి - అనే భావం ఈ పదాల కూర్పులో ఉంది. ఈ ఘట్టంలో ధర్మారావు చూపిన మెరుగులు ఆనాటి కవి పండితుల ప్రశంసలకు పాత్రమయ్యాయి.

ఈ కవి కవితా సారస్యాలే కాకుండా, కృతిపతి ప్రశస్తికి సంబంధించిన చారిత్రకాంశాలలో ఎదురైన చిక్కులు కూడా ధర్మారావు తమ పరిశోధనాశక్తితో విడదీయగలిగాడు.

షష్ఠ్యంతాలలో ఉన్న 'సుస్థిరలక్ష్మీసహిత' - అనే పద్యంలోని, రఘునాధ భూపాలుని అతిశయ పరాక్రమాలను శ్లాఘించే "నేపాల నృపాల స్థాపన చణునకు'' అనే విశేషణంలోని 'నేపాలం' ఏది అన్నదాన్ని-ధర్మారావు నిర్ణయించాడు. 'నేపాల' అన్నదాన్ని హిమాలయప్రాంతంలోని నేపాల్‌గా పూర్వ వ్యాఖ్యాతలు చెప్పారేగాని చరిత్రమీద అంతగా దృష్టి సారించలేదు. రఘునాథనాయకుని కుమారుడైన విజయరాఘవ నాయకుని 'రఘునాథాభ్యుదయం', యజ్ఞనారాయణ దీక్షితుల 'సాహిత్య రత్నాకరం', రామభద్రాంబ 'రఘునాథాభ్యుదయ' కావ్యాలాధారంతో; నేపాల నృపాల స్థాపనాన్ని గూర్చి జూలూరి, వేదం వారి దురవగాహనను చెదరగొట్టాడు ధర్మారావు. సింహళంలోని జాఫ్నాయే నేపాల అని తీర్పు చెప్పాడు. వీరి ఈ నిర్ధారణను సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకుడు వంగోలు వెంకటరంగయ్య కూడా ప్రశంసించాడు. గ్రంథాలకుపయోగించే తాళపత్రాలను నేపాలపాకులనేవారు. ఇవి సింహళం నుంచే వస్తూండేవి.

ఒక ప్రాంతం నిర్దేశించడంలో పూర్వ వ్యాఖ్యాతలు పడ్డ పొరపాటును 'నేపాల' శబ్దవివరణం తెలియచేస్తే, కృతిపతి ప్రశంసకే చెందిన 'చోలగమాన భంజనా' (3 ఆ. 238 ప.) అనేదాన్లోని 'చోలగ' శబ్దవివరణంలో జూలూరి, వేదంవాళ్ళ వ్యక్తి విషయంలో వేసిన తప్పటడుగు కనిపిస్తుంది. దీనికి వెంక

త్రాయశాస్త్రి అర్థం వివరిస్తూ "చోళదేశమును బొందిన రాజుయొక్క అభి మానమును పోగొట్టినవాడా" అని వ్యాఖ్యానించాడు. ఇది అపార్థానికి దారి తీస్తుంది. స్వయంగా వారే చోళదేశ అధిపతులై ఉంటే, వారివల్ల మానభంగం పొందిన ఈ చోళగుడెవరు? అన్న ఆ శంక, పూర్వ వ్యాఖ్యాతలకు కలగ లేదు. దీన్నికూడా సాహిత్య రత్నాకరం, రఘునాథాభ్యుదయం, వంటి సమ కాలీన సాహిత్య ఆకరాలనుండి విషయం సేకరించి ధర్మారావు అర్ధనిర్ణయం చేశాడు. ఈ చోళగుడు దుర్మార్గుడైన దొంగల నాయకుడు. ప్రజాకంటకుడు. దేవకోట అనే చిన్న ద్వీపాని కధిపతి. అలజడి కలిగిస్తూ రఘునాథుడికి సమస్య అయినాడు. ఇతడిని చాలా పూనికతో రూపుమాపాడు. ఈ విషయాన్ని విజయరాఘవనాయకుడు తన గ్రంథంలో పేర్కొన్నాడు. రఘునాథ నాయ కుడు నిర్మించిన లక్ష్మీవిలాసమందిరంలో ఈ ఘట్టం చిత్రితమైంది కూడా!

ధర్మారావు ఈ విషయాలనన్నిటినీ పరిశీలించి చోళగ శబ్దానికి నిజమైన అర్థానివ్వడంలో కృతకృత్యుడయ్యాడు. వివిధాంశాల పరిశీలనా, వాటి అను సంధాన పటిమా అనేక చిక్కుల్ని విడదీయడంలో ధర్మారావుకెలా సాయ పడ్డాయో ఈపై అంశాలు స్పష్టపరుస్తాయి.

వేదంవారు 'వ్యాఖ్యసేయునపుడు ప్రకరణమును బట్టి అర్థము నిర్ణయింప వలెగాని ఏదేనొక తాత్పర్యము మన మనసున నిడికొని తదనుగుణముగా నానార్థ నిఘంటువుల సాధనమున ఇచ్చవచ్చిన శబ్దార్థములాగుట పాడిగాదు' - అని చెప్తాండేవారు.[18] ఇంతవరకూ వ్యాఖ్యానానికి ధర్మారావు వేసిన శ్రమ చూస్తే వేదంవారి నిర్వచనాన్ని హృదయోల్లాస వ్యాఖ్యాత అక్షరాలా పాటించా డని అనవచ్చు.

"తమినిగుడ గుడాకేశుం డమరనదీ. ...." (1 ఆ. 121 ప.)

ఈ పద్యంలోని గుడాకేశ శబ్దానికి వ్యాఖ్యాతలు గుడాక-అలస్యమునకు, ఈశుడు-వశుడుకానివాడు,అలస్యంలేనివాడనిఅంటేఅర్జునుడనే దూరాన్వయాన్ని; కేవలం నిఘంటువులో కనిపించే అర్థాన్నే వర్తింపచూశారు కానీ-వేదంవారన్నట్టి ప్రకరణాన్ననుసరించి అర్థవివరణం ఇవ్వలేదు. వర్ణ్యవిషయం అర్జునుడి కచ సమృద్ధికదా. ఆ అర్థంలో సరిపడే విషయంకోసం పరిశీలించాల్సి ఉంది. ఆ పని ధర్మారావు మాత్రమే చేశాడు. గుడ - అంటే చూపుడువేలు కొనా బొటన వేలుకొనా కలిసినప్పుడేర్పడే వలయం. తలవెంట్రుకలు పట్టిచూసినప్పుడు ఇంతటి కచసాంద్రతగలవాడు అర్జునుడన్న అర్థమే అందగిస్తుంది.

ప్రథమాశ్వాసంలో నగరవర్ణనలో భాగంగా, వారకాంతలను వర్ణిస్తూ

"చక్కెరమోవిచ్చి చవులదేలించు నీ
ముత్యాల కమ్మల మోహనాంగి" (1 ఆ. 81 ప.)

అన్నవిట ప్రశంసలకు పాత్రులైన వారకాంతలు కన్పిస్తారంటాడు విజయ విలాసకర్త. ఇక్కడ వారకాంతలకు ప్రియుక్తాలైన విశేషణాలన్నీ సాభి ప్రాయాలే. ఈ విషయాన్ని ప్రతిపాదిస్తూ, చవులు అనే పదానికి మంచి ముత్యాల ప్రశస్తిని నిర్ణయించే తూకపు పరిభాషగా ముత్యాలవర్తకులు ఈ పదాన్ని వాడుకచేస్తారని అంటూ ఉబ్బిపోయారు తాపీవారు. ఇట్లా వ్యాఖ్యానించా రాయన. పచ్చలూ - వజ్రాలూ తూచడానికి 'రతుల' లాగానే, రత్నవర్తకులు మంచి ముత్యాలు తూచడానికి 'చౌ' అనే ఎత్తును వాడుతూంటారు. ఈ వివణి భాష తెలీక, పూర్వ వ్యాఖ్యాతలు ముత్యముల కాంతి విశేషమన్న అర్థంతోటి సంతృప్తిపడ్డారు. చెన్నపట్నంలో ఒకసారి ఒక ముత్యాన్ని తూగించటానికి సూరజ్‌మల్ లల్లూభాయి నగలదుకాణానికి ధర్మారావు వెళ్ళాడు. దాన్ని తూచి ఆ వర్తకుడు, ఇది 42 చౌలుందన్నాడట. ఇది విని బ్రహ్మానందపడ్డాడు ధర్మారావు. ఇట్లాగే ఒకసారి విశాఖపట్నంలో బంగారం వర్తకుడి దగ్గరకు తన దగ్గరున్న బంగారం చొక్కపుతనాన్ని పరీక్ష చేయించడానికి వెళ్ళాడు. ఆ వర్తకుడు దాని శ్రేష్ఠతను నిర్ణయించడానికి 'ఉల్లాకు కట్టివ్వటం' అంటా రని చెప్పాడు. అంటే దాని మేలిమినీ,వెలనూ ఓ తాటాకు మీద రాసిస్తారు. ఈ విషయాన్నే 'ఉల్లాకు' అర్థనిర్ణయంలో వివరించి, ధర్మారావు పద సార్థకతను నిరూపించాడు.

ఇంద్రప్రస్థ వర్ణనలోని వాయువేగాన్ని చూసి స్పర్థించి గాలీ, లేళ్ళూ పందెం వేసుకున్నాయనీ, ఇందులో లేళ్ళు ఓడిపోయాయనీ చెప్తూ రచయిత లోకజ్ఞతను ధర్మారావు ప్రశంసించాడు. ఈ సందర్భంలో సామాజిక జీవనం లోని ప్రతి విషయం పట్లా కవికున్న గాఢమైన పరిచితిని ప్రతిపాదించాడు. సారంగధర చరిత్రలో పావురాలవేట సందర్భంలో వచ్చిన 'డేగ పదను' అన్న మాటకు అర్థాన్ని వెతకటంలో వ్యాఖ్యాత చాలా శ్రమించాడు. ధర్మా రావు ఒకసారి పార్వతీపురం వెళ్ళినప్పుడొక ఒరియా భూస్వామి ఇంట్లో దిగాడు. అతడు మాటల సందర్భంలో డేగవేట ప్రస్తావనకు తెచ్చి డేగపద నన్నదానికి వేటకు సంసిద్ధం చేస్తున్నప్పుడు, డేగకిచ్చే ఆహారపు పరిమాణం అన్న అర్థాన్ని చెప్పాడట. దానికి ధర్మారావు సంతోషించి సారంగధర చరి త్రలో పదానికి ఆ అర్థం సమకూర్చాడు. తనకంతకాలం అంతుపట్టని ఓ రహస్యం పిడినట్టు సంతోషించాడు. ఒక వ్యాఖ్యాత తాను రాస్తున్న గ్రంథా

నికి చెందిన విషయాల నాలోచించటమే కాకుండా, ఆ కవి రాసిన ఇతర గ్రంధాలను కూడా క్షుణ్ణంగా అధ్యయనం చేసినప్పుడే ఆ కవిని గూర్చి, అతను వాడే పదబంధాల గురించి సమ్యక్‌దృష్టి ఏర్పడుతుంది. ఏ సమయంలో ఏ అర్థంలో ఏ శబ్దం వాడే అలవాటు ఆ కవికి ఉందో వ్యాఖ్యాతకు అవగాహన అవుతుంది. అప్పుడే తాను రాస్తున్న వ్యాఖ్యానానికి వ్యాఖ్యాత న్యాయం చేకూర్చ గలుగుతాడు. కవి హృదయాన్ని పాఠకుల ముందు ఆవిష్కరించ డంలో తన పాత్రను సమర్థవంతంగా నిర్వహించ గలుగుతాడు. ధర్మారావే పీఠికలో అన్నట్టు- కొన్ని పదాలకర్థాలకోసం, పదబంధాల ముడులు విప్పడం కోసం, అన్వయం కుదిరే వివరణలు సాధించడం కోసం; నెలలూ, సంవత్స రాలూ శ్రమించడం ఈ పై అంశాలవల్ల స్పష్టమవుతుంది. 'కంగులు' అన్న పదానికి అర్థం సేకరించడంలో కూడా ఇంత శ్రమా పడ్డాడు అంతేకాదు తాను పట్టిన దీక్ష సరిగా నెరవేరేదాకా అహర్నిశలూ, అనుక్షణం ఆ విషయాల గూర్చే ఆలోచించే ధర్మారావు నిమగ్నతను కూడా మనం చూడవచ్చు.

వేదంవారి మాటల్లో చెప్పాలంటే ''విబుధ మనీషానికషములూ, కూలంకషములూ అయిన అనేక సందేహాలు" తాపీవారి విజయవిలాస వ్యాఖ్యానంవల్ల నిరస్తాలయ్యాయి.[19] అందువల్లనే ఆచంట సాంఖ్యాయనశర్మ, కాశీ కృష్ణాచార్యులు మొదలైన బహుశాస్త్రవిదులు- తాపీవారు విప్పిన గ్రంథగ్రంధులు చూసి హర్షామోదాలు తెలిపారు.

వ్యాఖ్యాతకు కనీసం ఉండవలసిన లక్షణం నిజాయితీ. వ్యాఖ్యాన సందర్భంలో ఎదురైన పాఠాలనూ, పాఠాంతరాలనూ క్షుణ్ణంగా పరిశీలించి తనకనువైన పాఠం ఏరుకునే హక్కు వ్యాఖ్యాతకుంది. అయితే అదే సందర్భంలో తన భావనకనుకూలం కాని పాఠాంతరాలను ఇవ్వటం, వాటిని ఎందుకు తాను స్వీకరించలేదో చెప్పటం అవసరం. ఇవన్నీ ధర్మారావు చేశాడు. పూర్వ వ్యాఖ్యాతలు కొందరు, పాఠాలను దిద్దే అలవాటున్న వారు. ధర్మారావు అలాకాక తనకు సరిగా తృప్తినివ్వని సందర్భాలను చెప్పి సహృదయులనే ఆలోచించమని వదిలాడు. అలాటి వాటిలో ఒకటి-

"ఈ కలహంసయాన" అన్న (ఆ 1. ప 167) పద్యంలో ఈత-ఈదే వ్యక్తి - లోతు వంటి వాటికి అర్థం కుదరటంలేదన్నారు.

ఇందులో సాభిప్రాయంగా ఉలూచి కలహంస అని కవి వాడాడు. హంసలు నిత్యం నీటిలో ఈదులాడేవి. లోతుకు భయపడనివి. ఇందులో ఉలూచి ఓర్పుకు అవతలి అంచునుండి ప్రణయతీవ్రతలో నిష్ఠురోక్తులు పలుకు

తోందనాలి. కాలహరణంతో వ్యాకులపెట్టినప్పటికీ, విరహాంబుధిలో మునిగే దానికి కొత్తగా జరిగే అపకారం లేదు. ఇది మనసులో ఉంచుకుని 'ఈతకు మిక్కిలి లోతు గల్గునే' అని అంది. విరహంలో నాయిక నాయకుడి మీద అలగటం ఓ లక్షణం. నీటిలో ఉన్న హంస నీటికీ, లోతుకూ భయపడక ఎలా ఈదుతుందో; కలహంస ఉలూచి కూడా ఆ స్థయిర్యాన్నే ప్రదర్శిస్తూ తెగువతో అన్న మాటలివి. ఇలాంటిదే ఈత ప్రస్తావన వచ్చిన మరో సందర్భంలో "మీదన్ వియోగసాగర"....మన్న (ఆ 2. ప 192) పద్యంలో కవి వాడిన "యీదాడ'న్నను మదనుడు 'కోదా' దనువాడు బిగువు కొనసాగునాకో" అన్న దానిక ధర్మారావుకి సరైన అర్థం స్ఫురించలేదన్నాడు. 'దాడి' అన్న దానికి తాడి అన్న అర్థం అన్వయించడానికి యత్నించాడు.

కాస్త ఆలోచిస్తే మరో అర్థం తట్టకపోదు. పల్లెటూళ్ళలో 'దాడి' అనే దేశీయమయిన ఆట ఒకటుంది. పులి - మేక ఆటలాంటిదే అది. ఇద్దరు, నలుచదరమైన గళ్ళలో పావులను కదిలిస్తూ; ఒకరి పావుల్ని మరొకరు చంపుతూంటారు. పావును చంపే దశలో 'దాడి' అని అరిచి ఎదుటి వారి పావును గడినుంచి తీస్తారు. ప్రతిద్వంది దీన్ని ఎదుర్కొంటూ తాను చంపుతూ 'దాడి' అంటాడు. బలులిచ్చే జాతరల్లోనూ, యుద్ధ రంగాల్లోనూ చంపేటప్పుడు 'కోబలి' అని అరవటం కద్దు. ఈ భావం తనకు పత్రికా రచయిత బి. రామచంద్రరావు సూచించారని ధర్మారావు అన్నారు. ఆపైన ఊహే ధర్మారావు చేయలేదు. ఇక ప్రస్తుతం సుభద్ర-మన్మధుడు ఒకర్నొకరు జయించాలని పరస్పరం తరుముకుంటున్నారు. వియోగ సాగరాన్ని ఈదాలని సుభద్రా, మధ్యలో ముంచాలని మన్మధుడూ పందెం కాసి 'దాడాట' ఆడుతున్నారు. అందులో ఒకరు 'ఈ దాడి' అంటే మరొకరు మరింత ఉత్సాహంతో, పట్టుదలతో 'కోదాడి' అంటున్నారు. దీన్ని సమర్థిస్తూ ఇదే పద్యంలో పూర్వార్ధ భాగంలో కవి "గబ్బి మరుడానవెట్టుక గొబ్బున బైబడును" అని ఉపయోగించాడు. దీంతో అర్థం విడివడినట్టే.

మరో సందర్భంలో ఒకటో ఆశ్వాసం నలభై రెండో పద్యం -

"పోటుగంటుల దూటి పోవుదారుణమైన....మాస్టీలగమియెందు క్రుగ్గిపోయె" అన్న దాంట్లో "పోటుగంటుల దూటి పోవ" టానికి - మాస్టీలగమికి ధర్మారావుకు సరైన అర్థం తట్టలేదన్నారు.

ఇందులోని 'పోటుగంటు' అన్నదానికి అర్థం చూడాలి. యుద్ధరంగంలో శత్రువును వలయంగా చుట్టుముట్టి బంధించడం 'గంటెకట్టడం' అంటారు.

గంటె అంటే వలయం అన్న అర్థంఉంది. నారాయణదాసు తన స్వీయ చరిత్రలో ఈ అర్థాన్ని వాడాడు. 'మాస్టీడు' అంటే సాముగరిడీలలో ఆరితేరినవాడు అన్నది వ్యవహారంలో ఉంది. తన శరీరాన్ని లాఘవంగా, అతి చిన్న ఇనుప వలయంనుండి కూడా, ఏ బాధా అనుభవించకుండా దూరి రాగల సామర్థ్యం ప్రదర్శిస్తూంటాడు. మరాఠీ భాషలో 'మాస్తీ' అంటే తాడు. ఇది చాలా ప్రాచీన రూపం. దానిమీద నడిచే వాళ్ళను 'మాస్టీలు' అంటారు. వాళ్ళు తాళ్ళతో కోటల నెగబాకటం, సంకటంగా ఉండే చిన్నచిన్న వలయాల్లో రంధ్రాల్లో దూరిపోయే లాఘవం సంపాదించి; రాజులకు సాయం చేస్తూంటారు. శివాజీ కాలంనాటి రాజులు ఇలాటి వాళ్ళనొక రెజిమెంటుగా ఏర్పరచి పోషిస్తూండేవారు. వీళ్లు సైన్యంలో ఒక భాగం. యుద్ధకాలం తర్వాత వీళ్ళు తమ సైన్యాన్ని విడిచి ఊళ్ళు దోస్తుండేవాళ్లు. దీన్ని గమనించి తర్వాతి రాజులు వీళ్ళను పోషించటం మానారు. వీళ్ళే ఈ విద్యతో భుక్తికోసం గ్రామాల్లో గారడీవాళ్ళుగా తిరుగుతూ జీవనం కొనసాగిస్తున్నారు. ఇక ప్రస్తుతం శత్రువు లీవిధంగా వలయంగా చుట్టినప్పుడు, మధ్యలోని వాడు చుట్టుముట్టిన శత్రువుల నుండి కనుగందకుండా చాకచక్యంగా బయటపడటం స్ఫురిస్తుంది. ఇదే వర్ణన విజయవిలాసంలోనే ఆ 3. ప 25 లో కవి చేశాడు. ఈ అంశాన్నే కళాపూర్ణోదయంలో శృంగారపరంగా 'పోటుగంటు' అని ఉపయోగించాడు పింగళి సూరన.

ధర్మారావు వెలిబుచ్చిన రెండు మూడు సందేహాంశాలను ఊరకంగా కూడా పరిష్కరించడానికి అవకాశం ఉంది.

కవిపండితులైనవాళ్ళుకూడా, చేమకూర వంటి మహాప్రతిభావంతుడికి గ్రంథచౌర్యాన్నీ, అనుకరణ పరాయణతనూ, భావదారిద్ర్యాన్నీ ఆరోపించటానికి యత్నించారు. తాళ్ళపాక తిమ్మక్క రాసిన సుభద్రా పరిణయం ద్విపద కావ్యానికి, వెంకటకవి ఛాయాచోరక వృత్తికి పాల్పడ్డారని వారన్నారు. వీరికి ఆధారమల్లా తిమ్మక్క వెంకటకవి పూర్వ్వరాలు కావటమే. అయితే ధర్మారావు, అనేక తాళపత్ర గ్రంథాలను సంశోధించి తిమ్మక్క-కాక అది తిమ్మప్ప అనే అంశాన్ని బయటపెట్టాడు. ఈతడుకూడా విజయవిలాసకర్తకు అనంతర కాలికుడేననీ, విజయవిలాసం కవిత్వానికి అబ్బురపడి ఒక నకిలీ వజ్రాన్ని సృష్టించడానికి తాపత్రయపడ్డాడనీ ధర్మారావు నిరూపించాడు. ధర్మారావు కీర్తిశేషులైనాక కూడా, యీ వొగుడాకు మంటను రేపాలని చూశారు కానీ సాహితీ లోకం లక్ష్యపెట్టలేదు. చప్పగా చల్లారిపోయింది. చేమకూర కవి తన పూర్వ

కవుల్లో కొందరిని అనుకరించకపోలేదు. ఆ అనుకరించిన పట్టుల్లో కూడా, మార్చి తన ప్రతిభను జోడించి మెరుగునే పెట్టాడని వ్యాఖ్యాత సోదాహరణంగా నిరూపించాడు. అనుకరించాడనటంతో ధర్మారావు విరుచుకుపడ్డ సందర్భం లేనే లేదు.

హృదయోల్లాస వ్యాఖ్యానానికి ఇంత అపూర్వమైన ప్రశస్తి రావటానికి కారణం; తెలుగులో తొలిసారిగా సర్వసమగ్రంగానూ శాస్త్రీయంగానూ ఇది వెలువడటమే. ఇందులో పీఠికొక సౌకర్యం కూడా లభించి ఉంటుంది. పూర్వ వ్యాఖ్యానాలుండటం వల్ల వాటిల్లో లోపాలు తెలుసుకుని అవి సరిదిద్దే కార్యక్రమంలో ప్రతి పద్యానికీ మెరుగుపెట్టారు. చాలా ప్రచురణలు అప్పటికే వచ్చినందువల్ల, పాఠాంతరాల చిక్కు కొంత సడలింది. పాఠనిర్ణయాల విషయంలో మాత్రం ధర్మారావుకు ఇతర ప్రపంచ విజ్ఞాన అధ్యయనం వల్ల సంతరించుకున్న లోకజ్ఞానం, సునిశిత పరిశీలనా, ఆధునికతా దృష్టి చాలావరకు సహకరించాయి. సర్వసాధారణంగా హృదయోల్లాసానికి పూర్వం వచ్చిన వ్యాఖ్యానాలన్నీ చూస్తే, విస్పష్టంగా రెండు సంప్రదాయాలకు చెందినట్టు అనిపిస్తాయి. ఒకటి ప్రతిపద తాత్పర్యార్థ పరిమితం. రెండు అతిలాక్షణిక సీమితం. బ్రౌను రాయించిన వ్యాఖ్యానాలన్నీ మొదటి కోవకు చెందుతాయి. ఈ శతాబ్దంలో ఆరంభమయిన వేదంవారి ధోరణివి రెండో సంప్రదాయానికి చెందుతాయి.

వేమన పద్యాల పరిష్కరణ ప్రతికోసం పైడిపాటి వెంకట నర్సయ్య అనే సాహితీవరుడికి సి.పి. బ్రౌన్ రాస్తూ "శబ్దమునకు శబ్దము యంత మాత్రం అల్లించకుండా తేలే తాత్పర్యం మాత్రం చెప్పుకొని అపురూప శబ్దములు తాత్పర్యం బోధచేస్తే చాలుతుంది."[20] అన్నారు. 19వ శతాబ్ది అంతం వరకూ బ్రౌన్ పెట్టిన వరవడినే ఈ వ్యాఖ్యానాల్లో చూడగలం. ఈ శతాబ్ది మొదలు వెంకట్రాయశాస్త్రిగారి వంటి గొప్ప పండితులు వ్యాఖ్యాన రచనకు పూనుకున్నారు. కాబట్టి పండిత సంప్రదాయం మొదలైంది. అయితే వీరికీ ఓ సమస్య ఎదురైంది. సంస్కృతంలో ఉన్నట్టు, తెలుగులో ఏ కావ్యానికీ అప్పటికి ప్రామాణికమైన వ్యాఖ్యానాలు లేవు. సాధు పాఠ నిర్ణయమూ లేదు. అందువల్ల పాఠ పరిష్కరణం కూడా వ్యాఖ్యాత బాధ్యతైంది. దాంతో ఉన్న పాఠాలున్నట్టుగా కాకుండా, లాక్షణిక చూపుతో చాలా పట్టుదలతో దిద్దడం వల్ల అపపాఠ సృష్టి జరిగి; కొన్ని చోట్ల వ్యాఖ్యానాలు అపార్థాలకు గురయ్యాయి. అందుకే గిడుగు తన 'భాషా భేషజం'లో చాలా బాధపడ్డాడు.

ఇంతకూ ఉత్తమ వ్యాఖ్యాత లక్షణాలను వివరిస్తూ మల్లినాధుడేమన్నాడో గమనిద్దాం, ''అన్వయ ముఖముననే సర్వమును వ్యాఖ్యానమును చేయుదును. మూలములో లేనిది కొంచెముకూడా వ్రాయను. అనావశ్యకమైనది చెప్పను''21 - ఇదీ శపధం. ఇందుకే మల్లినాధుడి వ్యాఖ్యానాలు ఇంతగా లోకాదరణకు పాత్రమయ్యాయి ''దుర్బోధమైన పట్టును స్పష్టార్థం అని విడుతురు. స్పష్టార్థమగు పట్టును వ్యర్థముగా దీర్ఘసమాసాదులతో నింపి విస్తరింతురు. అస్థానమున ననుపయోగములగు జల్పములచే భ్రమము కల్గింతురు" అని కువ్యాఖ్యాతలను భోజుడు గర్హించాడట.22 కాబట్టి సువ్యాఖ్యాన లక్షణాలను పరిశీలిస్తూ అవన్నీ ఈ హృదయోల్లాస వ్యాఖ్యానం పట్ల ఎంతవరకు అన్వయిస్తాయో చూద్దాం.

''పద విభాగము, పదముల యర్థము, సమాస పదములకు విగ్రహ ప్రదర్శనము, కావ్యము నందలి అలంకారములను సమన్వయించుట, వ్యాకరణాద్యంశములపై నాక్షేప సమాధానములు - ఈ అయిదు లక్షణములు గలది" వ్యాఖ్యానమని ప్రామాణిక నిర్వచనం. (కావ్యాలంకార సంగ్రహం) ఈ అయిదు లక్షణాలు పరిపూర్ణమైన స్థాయిలో ధర్మారావు నిర్వహించారు. 'ఊదుకపోవు శంఖమునహో' - అనే పద్యానికి వ్యాఖ్యానం రాస్తున్నప్పుడు తాము నిర్ణయించిన సాధుతమ పాఠమైన 'వాదుకు బట్టు' అనే ప్రయోగం దగ్గర, వ్యాకరణ విరుద్ధప్రయోగమంటూ ఆక్షేపించటానికి లాక్షణికుల కవకాశమిచ్చే చోట్ల పూర్వకవి ప్రయోగాలు చూపి సమర్థించారు. కేవలం పాండిత్య దృష్టే ఈ వ్యాఖ్యానంలో ధర్మారావుకు పరమార్థం కాదు. అయినప్పుడు అలంకారాలవంటి వాని వివరణ ఎందుకు చేశారన్న ప్రశ్న రావచ్చు. వ్యాఖ్యాన పంచలక్షణాల్లో అలంకార స్వరూప నిర్ణయం కూడా ఒక లక్షణం కాబట్టీ, తాను రాసే వ్యాఖ్యాన సమగ్రతకు భంగం కలగకూడదనీ భావించి ఉంటాడు అంతేకాకుండా పండితులతో స్పర్ధించి అన్ని అందాలా - తానూ సమ ఉజ్జీ అని నిరూపించుకోవటానికి ఈ పూనిక వహించి ఉంటాడు.

ఈ వ్యాఖ్యానం సౌందర్యాన్ని మరింత పెంచేదీ, ధర్మారావు వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా చూపేదీ మరో ప్రధానమైన అంశం ఉంది. పూర్వవ్యాఖ్యాతలతో అభిప్రాయభేదాలొచ్చి, తన మతాన్ని సిద్ధాంతీకరించే సందర్భాల్లో వారిపట్ల సౌజన్యాన్నే కనపరిచాడు. తొలినాళ్లల్లో విజయవిలాసం అందచందాలు ఇతరు లెరుగనివి తాను సభల్లోనూ, పత్రికల ద్వారానూ వెల్లడిస్తున్నప్పుడు ప్రదర్శించిన మమత్వం - అహమికా; హృదయోల్లాస వ్యాఖ్య పుస్తకరూపంగా సంతరించుకునేనాటికి కనిపించదు బహుశా దీనికి కారణం వీరు బహుకాలంగా చేస్తున్న

కృషికి ఆశించిన గుర్తింపు తెలుగు పాఠకులూ, పండితులనుండి లభించటమే. వేదం వారంతటి పండితులు కూడా ఈ వ్యాఖ్యాన సందర్భంగా ధర్మారావు తనపై విరుచుకుపడడాన్ని గూర్చి తన మిత్రుడు గుర్రం వెంకట సుబ్బరామయ్యగారికి లేఖ రాస్తూ ఇలా ప్రస్తావించాడు.

"నా విజయవిలాస వ్యాఖ్యానంపై శ్రీధ... గారి ఆక్షేపణలు సాధువులేనా? అవి సమంజసమైన తప్పులు - నా యెరుగమి కతముననో, పొరపాటు చేతనో దొరలి యుండిన యెడల వానిని తప్పులుగా నే నొప్పుకొనవలెను.''[23] (లేఖ తేదీ 9.4.1927)

మిత్రగోష్ఠుల్లోనూ, రసజ్ఞుల సమక్షంలోనూవెల్లడించిన విజయవిలాస సారస్యాన్ని 1920 ప్రాంతాలనుండీ నూత్నవ్యాఖ్యానంగా వెలువర్చాలన్న ఆకాంక్షతో ధర్మారావు రంగంలోకిదిగాడు. విజయవిలాసంలో చారిత్రక విషయాలన్న వ్యాసాన్ని విజయవాడనుండి వంద్రంగిరామారావు సంపాదకత్వంలో వెలువడుతున్న పుష్కరిణి మాసపత్రికలో ప్రచురించాడు అప్పటినుండి భారతి పత్రికలో బహుళంగా తన వ్యాఖ్యాన విధానాన్ని వ్యాసాల రూపంలో ప్రకటించాడు. తెలుగునాట బందరునుండి బరంపురం వరకూ అనేక పట్నాల్లో సభలు జరిపి విజయవిలాస వైశిష్ట్యాన్ని ప్రశంసిస్తూ వచ్చారు. మద్రాసులో ఒకసారి వేమపురపు రామదాసు, మరోసారి కోలవెన్ను రామకోటేశ్వరరావు, ఆతర్వాత విద్వాన్ గంటి జోగిసోమయాజి అధ్యక్షత వహించిన సభల్లో ఇదే అంశం మీద ఉపన్యాసాలిచ్చారు.[24] ఈ ఉపన్యాసలహరులు సారస్వత పరులను ఎంతగా ఆకర్షించాయంటే సుప్రసిద్ధ సాహిత్య మాసపత్రిక భారతి సాభిప్రాయ విశేషాలంటూ రాసే సంపాదకీయ శీర్షిక కింద విజయ విలాస వ్యాఖ్యాన ఆవశ్యకతను నొక్కిచెప్పింది. ఆ ప్రస్తావనలోనే, ఆ వ్యాఖ్యానం రాస్తే తాపీ వారే రాయాలని కూడా సశ్లాఘ్యంగా ప్రతిపాదించింది.[25] అంతకు పూర్వమే భారతిలో 1927 - 1933 సంవత్సరాల మధ్య విజయవిలాస వ్యాఖ్యాన విధానం అంటూ,అనేక అపూర్వాలైన అంశాలమీద తాపీవారు తమఉపన్యాసాలనే వ్యాసాలుగా రాయటం, అనేక చర్చోపచర్చలకు కారణం అయింది ఈ వ్యాఖ్యానాలలో తాపీవారుచూపిన ప్రతిపదహృద్యతాభిలాష ఆనాటికొందరి విమర్శకుల్లో, వీరిది విమర్శక లుబ్ధత్వం అనే ఆక్షేపణకు గురైంది. ఈ సందర్భంలో పూర్వ వ్యాఖ్యాతల ప్రశస్తినో అప్రశస్తినో నిరూపించడం అనివార్యమైంది కాబట్టి; వేటూరి ప్రభాకరశాస్త్రి,ఒంగోలు వెంకటరామయ్య మొదలైన పండితులూ పరిశోధకులూ అటూ ఇటూ రెండుపక్షాలుగా చీలారు. ఇలా

సాగిన తత్వనిర్ణయంవల్ల తాపీవారికి చాలా మేలే కలిగి ఉంటుంది. ఈవిధంగా నాలుగున్నర దశాబ్దాల పాటు విజయవిలాసాన్ని గూర్చి నిరంతరంగా సాగిన ధర్మారావు, మనస ధ్యాన పరాయణత్వం 1969 లో పుస్తకం వెలువడటంతో సాఫల్యం పొందింది. ముద్రణ యోగ్యంగా ప్రతిని సంసిద్ధం చేసే వివిధ దశల్లో కూడా ధర్మారావు వ్యాఖ్యానానికి సమగ్ర రూపం సంతరించటానికి శ్రమించారు. బెంగుళూరు, తంజావూరు, మద్రాసు మొదలైన చోట్ల తిరిగి విజయవిలాసానికున్న వ్యాఖ్యానాలను పరిశీలించారు. ఈ విషయంలో ఆసక్తి ఉన్న బి. రామరాజు, ఆరుద్ర, రాంభట్ల కృష్ణమూర్తి, బి. రామచంద్రరావు, మడిపడిగ బలరామాచారి వంటి సాహితీపరులతో సంప్రదించారు. దానివల్ల తాపీవారు చాలా లబ్ధి పొందినట్టు ప్రస్తావించారు. ఈ అంశం వారి సౌజన్యాన్ని, పాండిత్య విషయంలో ఉండాల్సిన విశుద్ధాంతఃకరణనూ వ్యక్తం చేస్తుంది.[26] ధర్మారావుచేసిన ఇంతటి మహత్తరకృషికి1971 లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించడంతో అఖిలభారత స్థాయిలో గుర్తింపు వచ్చిందనవచ్చు.

ఆశించినట్టుగానే అఖిలాంధ్ర దేశం హృదయోల్లాస వ్యాఖ్యకు హర్షామోదాలు తెలిపింది. ప్రశంసలూ, సమీక్షలూ సమర్పించింది.

ప్రముఖ సాహితీవేత్త జి. వి. కృష్ణారావు ఆంధ్రప్రభ 1969 డిసెంబరు 15న రాసిన సమీక్ష, వివిధ పత్రికల్లో వచ్చినవాటిల్లో ప్రధానమైంది. చాలా విపులమైంది కూడా. ''చరిత్ర, చమత్కారం, తెలుగు పలుకుబడీ ఆపోశనం పట్టిన తాపీవారి విజయవిలాస వ్యాఖ్య'' - అంటూ ప్రశంసిస్తూ ''మొత్తంమీద ఇలాటి ఒండురెండు పాఠభేదాలకేమిగానీ తాపీవారి పాఠ నిర్ణయాలు చాలా సముచితంగా ఉన్నా'' యన్నాడు. కృష్ణారావు, ప్రథమాశ్వాసం 183 పద్యంలో ''చెంగును దాటు చూపు లిరువక్కని బేడిసలేమొ'' అన్నదానికి 'ఉరిచిక్కని బేడిసలు' అనీ; అందులోనే ''దాని అధరంబిలకింప గునేమొ నెచ్చెలీ'' అన్నదానికి 'అధరంబెలకెంపు' అనీ సూచించాడు. ఇవి, అర్థవంతంగానూ, మరింత సౌందర్యాపాదకంగానూఉన్నాయంటూ ధర్మారావు అంగీకరించాడు. ఇవి కృష్ణారావుకు, దొరికిన పాఠాంతరాలు కావుకానీ అందాన్ని మరింత పెంచే ఊహలు. వాస్తవానికి ఇంతగా జనాదరణ పొందిన కావ్యానికి బహు పాఠాంతరాలుండే అవకాశాలు తక్కువ. దీనికితోడు చేమకూర చాలా పనితనంతో ప్రతిపదాన్నీ చిత్రికబట్టి రాశాడు. అందువల్ల కూడా పాఠాంతరాల ప్రసక్తి ఉండదు. అయినా లోకంలో ఏమాత్రం సాహిత్యవాసన ఉన్నవాళ్ళకైనా అత్యంత ప్రీతిపాత్రమైన కావ్యంగా ఇది ఉండేది. దేశంలో

వివిధ ప్రాంతాల్లో దీని ప్రతులూ, వీటికి ప్రతికలూ ఈ రెండున్నర శతాబ్దాల కాలంలో తామరతంపరగావచ్చి ఉండవచ్చు. వాటివల్లా కొన్ని పాఠాంతరాలొచ్చే అవకాశముంది ఇలా దొరికిన కొన్నింటిని విజయవిలాసం-కొన్నిపాఠభేదము లన్న శీర్షికతో చింతలపాటి లక్ష్మీనరసింహదీక్షితశర్మ 1969 జులై నెల భారతిలో సమీక్షించాడు.ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి ప్రతి ఆధారంగా, ఇందులో పాఠాంతరాలను రచయిత పోల్చాడు. ఈ ప్రయత్నంలో ఒక విశేష ముంది. గతంలో విజయవిలాస ప్రతులన్నీ తీరాంధ్ర, దక్షిణాంధ్ర ప్రతులైతే ఇది తెలంగాణాలోని వేములవాడలో దొరికినప్రతి. వ్యాసకర్త నిర్ణయం ప్రకారం, పీచుకాగితాలపైన కరక్కాయ సిరాతో రాసిన ఈ ప్రతి 1883 వ సంవత్సరం నాటిది కావచ్చు. అంటే తొలిముద్రణ తర్వాత పాతికేండ్లనాటి రాతప్రతి ఇది. ఈ పాఠాంతరాల్లో ఎక్కువ భాగం. లేఖక ప్రమాదాలుగా వచ్చిన అక్షరాల మార్పిడిలాంటివే కావచ్చు. అవీ కథాభాగంలోనే ఉన్నాయి.

'శృంగార ప్రబంధంబునకు' (సా. అ.ప్ర.), ఆ ప్రస్తా; పాఠం అయితే కొత్తది "శుభోదరకు ప్రబంధంబు" అని రాతప్రతి. 'కడమాటు వగవానిగని' (1 ఆ.4.ప., అని ముద్రిత పాఠానికి) 'కడమాటు వచ్చినప్పుడు' అని రాతప్రతి. పురవర్ణనకు చెందిన ఇదే సీసంలో ఎత్తుగీతి మాత్రం పూర్తిగా విభేదించింది కానీ విశేషమేం లేదు. ఇందులో నాలుగోపాదం "వీటిపాటైన నాగేటిపాటున నేమియని, హలాయుదు మెచ్చ రంభ్రిమితవులు" ముద్రిత పాఠమైతే; "అందు నాలవజాతి హలముఖైశ్వర్యంబుచే, వృషధ్వజుని వంచింపదలతు" అనేది రాతప్రతి. బహుశా మనుచరిత్ర పురవర్ణనలోని "అచట నాలవజాతి హల ముఖాప్తవిభూతి" అనే పాఠం లేఖకుడి మీద పనిచేసి ఉండవచ్చు. అప్పకవి అన్నట్టు కేవల లేఖకులతౌల్యమే దీనికి కారణం కావచ్చు. 'కుపితనాదుల' అన్న (1 ఆ. 15 ప.) దానికి, 'కుటిల నాయకుల' అనీ, 'విషమాస్త్రిగెల్చుటో' (1 ఆ. 69 ప.) అనే పాఠానికి, 'కుసుమాస్త్రిగెల్చుటో' అనేవి చూస్తే కవి హృదయావిష్కరణానికి ఈ పాఠాంతరాలు మొత్తంమీద అంతగా సాయ పడ్డాయనిపించవు.

అక్కిరాజు రమాపతిరావు పీఠికతో 1981 లో వెలువడిన ప్రతిలో ఆయన చూపిన పాఠాంతరాలు కొన్ని గమనిద్దాం. అత్యంత ప్రసిద్ధమైన 'క్షితిపై వట్టిమ్రాకులు చిగిర్పగవసంతుడు' అనే పద్యంలో (1 ఆ. 145 ప.) ఉండే 'సమకాలమువారలు మెచ్చరేగదా' అనే పాఠానికి, "సమకాలము వారల మెచ్చరేగదా" అనే పాఠాంతరం చూపాడు. విజయవిలాసం

తొలి ముద్రణంలోనూ, వీరేశలింగం కవులచరిత్రలోనూ ఇదే పాఠం ఉంది. తొలి ముద్రణ చూసి చాలా పాఠాంతరాలను సందర్భాను సారంగా హృదయోల్లాసంలో గుర్తించిన ధర్మారావు దీన్ని ఎందుకో స్వీక రించలేదు. ఇదీ గుర్తించదగ్గదే. అలాగే ఈ పద్యంలోనే రెండో పాదంలో "చంద్రుడు మిన్ను నన్ ప్రసన్నత" అన్నదానికి, రమాపతిరావు 'మిన్ననన్' అని చూపాడు. ఇది సమంజసంగానే కనిపిస్తుంది. ఇక 'పాడిదప్పక (1 ఆ. 4 ప.) అనేదానికి, 'పాటిదప్పక' అనీ; 'నెఱజోదు' (1 ఆ 11 ప.) అన్నదానికి 'నెఱవాది' అనీ; మోహనాంగి (1 ఆ 16 ప.) అన్నదానికి, 'ముద్దు లాడి' అనీ చూపిన పాఠాంతరాలు విశేషప్రయో జనకారులేంకావు - ఈ ప్రతిలో పీఠికాకర్త చూపిన పాఠాంతరాలన్నీ కాలికమైన ప్రయోజనం ఉన్నవి. అంటే తొలి ముద్రణ ప్రతిలోని పాఠాంతరాలను వీరు చూపారు. మలి ముద్రణల జోలికి పోలేదు.

అర్థవివరణ సందర్భంలో, 'విజయసమారబ్ధవేళ కౌతుకమున' (1 ఆ 40 ప.) అన్నదాంట్లో, 'కౌతుకము' అనే పదానికి పూర్వవ్యాఖ్యాతలందరూ ధర్మారావుతో సహా, 'కౌతుకము' అంటే 'కంకణము' అన్న అర్థముందన్న విషయము గుర్తించలేదంటారు జి. వి. కృష్ణారావు. పెళ్ళికి వెళ్ళుతున్నట్టు. వెళ్ళుతున్నాడే కాని, పెళ్ళికి వెళ్ళడంలేదు కాబట్టి 'కంకణమ' న్న అర్థం ఇక్కడ పొసగదనీ, దూరాన్వయం అనీ ధర్మారావు, ఈ ఆక్షేపణను తోసిపుచ్చాడు. అలాగే 'గుడాకేశుడ' న్న శబ్దానికి అర్థం లాగుతూ సూర్యరాయాంధ్ర నిఘం టువును సాక్ష్యంగా తెచ్చుకుని, "జెముడు వలె మిక్కుటముగా పెరిగిన జుట్టు కలవాడన్న" అర్థాన్ని కృష్ణారావు ప్రతిపాదించాడు. ఈ వర్ణనా సందర్భంలో కవి చెప్పాలనుకుంది కేశనైల్యమూ - సౌందర్యమూ మాత్రమే అన్నారు తాపీ. దీనికితోడు బ్రౌణ్యనిఘంటువు అర్థవివరణాన్ని, దానికి వీరేశలింగంఅంగీకారాన్ని తమకు సమర్థనీయంగా తోస్తున్నాయని అంటూ సవినయంగా కృష్ణారావు అభ్యంతరాన్ని నిరాకరించాడు అలంకార నిర్ణయంలో, కృష్ణారావు సూచనలను కొన్నిటిని అంగీకరిస్తూనే (1 ఆ. 35 ప.) ప్రతీపం కాదనీ; (1 ఆ. 44 ప.) శ్లేషకాబోదనీ, ధర్మారావు ఇలాటి విషయాల్లో భేదాభిప్రాయాలను కూడా సహృదయులు ఆమోదించాలన్నారు.

"ఎరుగవే ధర్మపరుడవు నృపకుమారా" ( 1 ఆ. 150 ప ) అనే దాంట్లో ధర్మారావిచ్చిన ధర్మతత్పరత, ధర్మరాజుకు తోబుట్టువు అన్న దాంట్లోని కాకువు సమ్మతిస్తూనే కృష్ణారావు, ధర్మం అంటే విల్లు అనే అర్థం

కూడా చేర్చడం అధికచమత్కారాపాదకం అంటారు. ధర్మం అంటే విల్లన్న భావం తాపీవారికి తెలియంది కాదు. శృంగార స్ఫోరకమైన ఈ సందర్భంలో ఉలూచి అర్జునుడ్ని ఎత్తి పొడవటానికి ధర్మరాజుని అతని తమ్ముడి ధర్మ పరత్వాన్నే ఆలంబనంగా చేసుకుంది. ప్రకరణోచేతంగా 'విల్లు' అన్న అర్థాన్ని చెప్పటం ఎరువుసొమ్ముగా తాపీవారు భావించారు కానీ సాహిత్యం ఆలోచనామృతం కనుక పరాశరం గోపాలకృష్ణమూర్తి, చేమకూర కవి కవితా విలాసం అన్న ప్రశంసా సమీక్షలో, అభయాన్ని అర్థించేటప్పుడు సమర్థుడైనవాడి అండ చేరడం సముచితం కాబట్టి చెరుకువిల్లువాని బారినుండి, గాండీవధారివైన నీవు రక్షించగలవనడంలో మరింత సారస్యం ఉందన్నాడు. ఇది సమర్థనీయమనిపిస్తోంది. తాపీవారు దీన్ని చూసుంటే సహృదయతతో అంగీకరించి ఉండేవారు. ఇదే సందర్భంలో 'ధర్మపరుడవ' నే కాకుస్వరంలో, ధర్మరాజు అనే అర్థంలో ఏకదేశమైన ధర్మశబ్దానికి ధర్మరాజన్న అర్థంరాదని గోపాలకృష్ణమూర్తి అభిప్రాయం. కానీ నామవాచకపరంగా కాక గుణవాచకంగా ఎత్తిపొడుస్తూ ఎద్దేవా చెయ్యటానికి 'ధర్మ' శబ్దాన్ని ఉపయోగించాడనాలి. రెండు మూడు సందర్భాల్లో ధర్మారావు చెప్పిన అర్థాలకంటే విశేషార్థాలు చెప్పటానికి పరాశరం వారు ప్రయత్నించారు 1 ఆ. 209 పద్యంలో 'మట్టు' అన్న పదానికి వీరు 'కొండ' అనీ; 'నెన్నుదురు చందురులో సగపాలు' (1 ఆ. 214 ప.) అన్న దాంట్లో కృష్ణ శుక్లపక్షాల్లో అష్టమి నాటి చంద్రుడు ఒకేలాగుంటాడని; 'చూపులు అంగజుని చూపులలో మేల్తరములు' (ఇదే పద్యంలో) అన్న పద్యంలో మన్మధుడి పుష్పసాయకాల్లో మొదటిదికాక నాలుగవదైన నవమల్లికలాంటిది 'బాలముద్దున్ తెలిచూపులనీ' కొత్త అందాలను చెప్పారు[27] ఇక జి. వి. కృష్ణారావుకు తాపీవారు 1969 ఫిబ్రవరి తొమ్మిదిన ఆంధ్రప్రభలో సమాధానం రాశారు. ఎస్. గంగప్ప కూడా కృష్ణారావు ఆక్షేపణలకు భారతిలో సమాధానంరాస్తూ తాపీవారిని సమర్థించాడు.

తాపీవారు తమ వ్యాఖ్యకు హృదయోల్లాసమంటూ పేరుపెట్టటంలో కవి హృదయాన్ని ఆవిష్కరిస్తాననీ, పాఠకుల హృదయాలను అలరిస్తాననీ అంటున్నారనవచ్చు. వీటన్నిటినీ మించి తమ హృదయానికి ఉల్లాసంతో కూడిన తృప్తినీ ఈ పేరులో వెల్లడించి ఉంటారనవచ్చు. ఉల్లాసమంటే అధ్యాయమన్న అర్థమూ ఉంది. పాఠకుల దృష్టిలో తెలుగు కావ్య వ్యాఖ్యాన చరిత్రలో ఇదొక నూతనాధ్యాయం అన్న అర్థం స్ఫురింపచేయటం కూడా వారి ఆశయమే. దీనికి తోడు ఉల్లాసమంటే ఇదొక మజిలీ. ఒకప్పటి కవి హృదయాన్ని

సమర్థవంతంగా అర్థం చేసుకోవటంలో ధర్మారావు ఒక మజిలీ చేరుకున్నాడనీ, తర్వాతి తరం మరింత భావస్ఫోరకంగా వ్యాఖ్యానించడానికి అవకాశం ఉందన్న వారి ఉద్దేశం కూడా కనిపిస్తుంది.

విజయవిలాసకర్త చేమకూర వెంకట కవి, మాటల్లో చెప్పాలంటే "కడుకన్నుల కప్పుకొనుం పదుండు" (3 ఆ. 173 ప.) అన్నట్టు, తెలుగు సాహితీలోకం ధర్మారావు వ్యాఖ్యానాన్ని కన్నులకద్దుకోవటమేకాదు- కన్నుల కప్పుకుంటుంది కూడా. జీవిత లక్ష్యంగా, తపస్సుగా చేసిన ఈ వ్యాఖ్యానం వల్ల తెలుగు సాహితీ జనం నోళ్ళలో విజయవిలాసానికి - తాపీ పర్యాయపదంగా ఉంటుంది.

## జన హృదయోల్లాసం - సూచికలు

1. ధర్మారావు, రాలూ - రప్పలూ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజయవాడ, 1979, పేజి 95.
2. శ్రీ నిడుదవోలు వెంకట్రావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
3. శ్రీ పురిపండా అప్పలస్వామితో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
4. శ్రీ తిరుమల రామచంద్ర, మరపురాని మనీషి, యువభారతి ప్రచురణలు, 1975 పేజి, 75.
5. ధర్మారావు, హృదయోల్లాసవ్యాఖ్య, విశిష్ట ప్రచురణలు, హైదరాబాదు, 1968, పీఠిక పేజి 10.
6. ధర్మారావు, హృదయోల్లాస వ్యాఖ్య, విశిష్ట ప్రచురణలు, హైదరాబాదు, 1968, పీఠిక పేజి 10.
7. శ్రీ శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి, అనుభవాలూ - జ్ఞాపకాలూనూ, రెండవ సంపుటం, కళాభివర్ధనీ పరిషత్తు, రాజమహేంద్రవరం, 1958, పేజి 136 - 137.
8. శ్రీ మేడవరపు వెంకటనారాయణ, తెలుగు పరిశోధన సంహిత, తెలుగు అకాడమీ ప్రచురణ, హైదరాబాదు. 1975, పేజి 140.
9. వివరణకర్త : శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి, కావ్యాలంకార సంగ్రహం, మచిలీపట్నం, 1959, రెండవ అధ్యాయం, పేజి 271.
10. సంపాదకుడు : అక్కిరాజు ఉమాకాంతం, తెలుగుదేశ వాఙ్మయ పత్రిక, 1921 నవంబరు.
11. శ్రీ నిడుదవోలు వెంకట్రావు, ఆంధ్రవచన వాఙ్మయం, రెండవ ముద్రణం, 1977, పేజి 135 - 136.
12. వసుచరిత్ర సవ్యాఖ్యానము, 1889, పేజి 48.
13. ఈ ప్రతి డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు (హైదరాబాదు) దగ్గరుంది.
14. శ్రీ బులుసు వెంకటరమణయ్య, ముకుర వ్యాఖ్యాసహిత విజయవిలాస ముద్రణ విజ్ఞప్తి, 1952, పేజి 6.
15. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు, విజయవిలాసము పీఠిక 1909.
16. శ్రీ వేదం వెంకట్రాయశాస్త్రి, సారంగధర పీఠిక, 1910, విజ్ఞప్తి పేజి 2.

17. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, సింహావలోకనం, రెండవముద్రణ, 1955 పేజి 49.
18. శ్రీ గుఱ్ఱం వెంకట సుబ్బరామయ్య, వేదం వెంకటరాయశాస్త్రి, సంస్కృతి, 1932, పేజి 62.
19. శ్రీ గుఱ్ఱం వెంకట సుబ్బరామయ్య, వేదం వెంకటరాయశాస్త్రి, సంస్కృతి 1938 పేజి 53.
20. బంగోరె, బ్రౌన్ జాబులు, యస్. వి. విశ్వవిద్యాలయం, తిరుపతి, 1977, పేజి 66.
21. "ఇహాన్వయ ముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతేమయా-నామూలం లిఖ్యతే కించిన్ నానపేక్షిత ముచ్యతే"
వేటూరి ప్రభాకరశాస్త్రి, మీగడతరకలు, 1951, పేజి 198.
22. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, మీగడతరకలు, 1951, పేజి 198.
23. శ్రీ గుఱ్ఱం వెంకటసుబ్బరామయ్య, వేదం వేంకటరాయశాస్త్రి సంస్కృతి, 1932, పేజి 94.
24. సమదర్శిని దినపత్రికల్లో ఈ వార్తలు వరుసగా ప్రచురితాలయ్యాయి, 1932 ఫిబ్రవరి.
25. భారతి, ప్రజోత్పత్తి, ఫాల్గుణం, 1932
26. ముద్రణ కోసం శుద్ధప్రతిని తయారుచేయడంలో తాపీ మోహనరావు, దేవులపల్లి ప్రభాకరరావు, కుమారి సి. హెచ్. లీల, తదితరులు తోడ్పడ్డారు.
27. పరాశరం గోపాలకృష్ణమూర్తి, చేమకూరకవి కవితావిలాసం, 1976, పేజి 32.

# 7

# నగరప్రస్థం

**వృత్తి** రీత్యా, పరిశోధనల రీత్యా, కార్యక్రమాల రీత్యా తెలుగుదేశంలో నాలుగు మూలలా తిరిగిన ధర్మారావు మద్రాసు నగరాన్నొదిలి 1958 లో హైద్రాబాద్ వచ్చారు. అప్పటికే వీరి కుమారుడు చాణక్య చిత్రరంగంలో బాగా పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు. అయితే చిత్రరంగం వీరి కుటుంబాన్ని మద్రాసులోనే ఉండనిచ్చింది కాదు. చాణక్య పిల్లల చదువులకోసం వీరంతా హైద్రాబాద్ తరలి వచ్చారు. చాణక్య సినిమా పరిశ్రమలో నిలదొక్కుకొని క్షణం తీరికలేని అభ్యుదయ దర్శకుడుగా గణనకెక్కాడు. ధర్మారావు కూడా రెండో ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత మద్రాసునుండి జనవాణి వార పత్రికను నడుపుతూ మద్రాసు వ్యక్తిగానే నిలిచిపోయారు. మోహనరావు 1953 లో విజయవాడలో విశాలాంధ్ర, దినపత్రికలో చేరడం వల్ల జనవాణి ఆగిపోయింది. చాణక్య సినిమా పరిశ్రమలో ఉండడంతో ధర్మారావు పత్రికా కార్యక్రమాలు మూతపడ్డాయి. కేవలం వీరి సాహిత్య వ్యాసంగం కోసమే మద్రాసులో కాపురం ఉండడం అనవసరమనిపించింది. అప్పటికే మద్రాసు త్యాగరాయనగర్‌లో ధర్మారావు ఒక ఇల్లు కట్టాడు (1956). ఇల్లుందికదా

అని మద్రాసులో ఉండడంవల్ల చాణక్య పిల్లల చదువు దెబ్బతినిపోయే లాగుంది. అదీకాక స్వరాష్ట్రం వచ్చిన తర్వాత ఇంకా మద్రాసులో ఉండడంలో అర్థం లేదనిపించింది. వీటన్నిటికీతోడు ధర్మారావు వృద్ధాప్యం, సినిమారంగంలో వారిని అట్టేకాలం పట్టి ఉంచేలా కూడా కనిపించలేదు. సినిమారంగంలో అప్పటికే అనేకమంది ధర్మారావు ప్రోత్సాహంతో రచయితలుగా నిలదొక్కుకున్నారు. హైద్రాబాద్‌లో కూడా సారథీ స్టూడియోస్ ఏర్పడింది. అంతగా చిత్రరంగాన్ని వదలకూడదనుకున్నా, చేయాలనిపిస్తే తాపీవారికి ఇక్కడా చేతినిండా పని ఉంటుంది. అదీకాక ధర్మారావు రచనలనేకం గ్రంథరూపాన్నింకా సంతరించుకోలేదు ప్రధానంగా, వారి జీవిత తపస్సుగా రాసిన విజయవిలాస వ్యాఖ్యానం ఇంకా వెలుగు చూడలేదు.

ఇవన్నీ మనసులో ఉంచుకుని ధర్మారావు సకుటుంబంగా హైద్రాబాద్ కొచ్చారు. కాచిగూడ స్టేషన్ ఎదురుగా ఉండే 'చిత్రకూట్' అనే అద్దెయింట్లో ఉన్నారు. ధర్మారావు హైద్రాబాద్‌కు రావడం ఇక్కడి సాహిత్యపరుల్లో చాలా ఉత్సాహాన్ని కల్గించింది. వామపక్షభావాల రచయితలకో పట్టుగొమ్మ చిక్కినట్టు సంబరపడిపోయారు. పండితులు తమకో ప్రసిద్ధ వ్యాఖ్యాతతో ప్రత్యక్ష పరిచయం అవుతున్నందుకు సంతోషించారు. గ్రాంథికభాషావాదుల గుండెల్లో గాలం పడింది. సాహిత్య అకాడమీ కార్యక్రమాల్లోనూ, కృష్ణదేవరాయ గ్రంథాలయ సభా మంటపాల్లోనూ ధర్మారావు కంఠం హైద్రాబాద్ నగరవాసులకు పరిచయమైంది. బి. రామరాజు వీరికి సన్నిహితులుగా ఉండేవారు.

ఇక ధర్మారావు, భాగ్యనగరాన్ని కేంద్రస్థానంగా చేసుకొని తెలుగు దేశంలో సాహిత్య కార్యక్రమాలకు హాజరవడం ఆరంభించాడు. ఆంధ్రవిశ్వవిద్యాలయం విద్యార్థులు నిర్వహించే ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ప్రధాన వక్తగా 1959లో (వాల్తేరు) పాల్గొని అక్కడి వామపక్ష విద్యార్థుల భావాలకొక సాహితీ ప్రతిపత్తిని కల్పించాడు నెల్లూరులో జరిగే తిక్కన జయంత్యుత్సవాలకూ, ఏలూరులో సాహితీ దర్బారుకూ ఇక్కడినుండే ప్రయాణమవుతూండేవారు.

హైద్రాబాద్‌లో అనేక సాహితీసంస్థలు ధర్మారావు సలహా సంప్రతింపులతో నడవడం ఆరంభించాయి. ధర్మారావు భార్య అన్నపూర్ణమ్మకు ఆరోగ్యం చెడి, క్రమంగా క్షీణించి చివరకు 1961 ఏప్రిల్ 4 న హైద్రాబాద్‌లోనే మరణించింది అప్పటికి ఆమెవయస్సు 68 సంవత్సరాలు. ఇది నిజంగా ధర్మారావుకు పెద్ద దెబ్బ అనవచ్చు. అడుగడుగునా ధర్మారావు కష్టాల్లో కలిసొచ్చిన వ్యక్తి

చనిపోవడం ఆయనను చాలా కాలం కుంగదీసింది. తన గ్రంథాలను అచ్చేయించాలనుకున్న వారి కోరిక తాత్కాలికంగా అడుగునపడింది. ఆ రోజుల్లో ధర్మారావుకు, బలరామాచార్య, సి. వి ఆర్. ప్రసాద్, పరుచూరి హనుమంతరావు, రాంభట్ల, రామరాజు మొదలైనవాళ్ళు మానసికంగా చాలా బలం సమకూర్చారు.

మిత్రుల అండా, సాహిత్య కార్యక్రమాలూ, సొంత గ్రంథాలను వెలుగులోకి తేవాలన్న ఆకాంక్షా; ధర్మారావును తిరిగి త్వరగా కోలుకొనేలా చేశాయి. అన్నపూర్ణ ప్రచురణలనీ, తాపీ ప్రచురణలనీ పేరుపెట్టి తన గ్రంథాలను కొన్ని ప్రచురించాడు. ఈ సందర్భంలో వీరికి చందా నారాయణశ్రేష్ఠి, శివాజీ ప్రెస్ యజమానులూ బాగా కలిసొచ్చారు. తాతాజీ 'చిత్రకూట్'ను వదిలి 1962 లో చిక్కడపల్లిలో మరో అద్దె యింటికి మారారు.

తాతాజీ రచనలంటూ ఆరంభించి, 'పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాల'ను 1960 సెప్టెంబరులోనూ; వారి ఖండకృతులలో కొన్నిటిని 'పాతపాళీ' అంటూ అక్టోబరు 1960 లోనూ మొదటిసారిగా గ్రంథరూపంలో తెచ్చారు. అలాగే ధర్మారావు సతీమణి అన్నపూర్ణమ్మ పేరుమీద అన్నపూర్ణ ప్రచురణలంటూ విజయవాడ చిరునామాతో, సాహిత్య మొర్మొరాలను 61 అక్టోబరులో ప్రచురించారు. ఇందులో వ్యాసాలన్నీ సాహిత్యపరమైనవి. అప్పుడప్పుడు కాగడా, జనవాణి పత్రికల్లో ప్రచురితమైనవి. ఆ తరువాత తాపీవారి ప్రచురణలు - విజయవాడ అంటూ, దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకన్న గ్రంథం రెండవ ప్రచురణను 62 అక్టోబరులోనూ; అవన్నీ నీ కళ్ళేనా? అన్న నాటికల సంపుటిని మొదటి పర్యాయం 65 జనవరిలోనూ వెలువరించారు. ఈ నాటికల్లో వెండి మువ్వలు తప్ప మిగిలినవి అంతకు పూర్వం రెండుసార్లు వివిధ పత్రికల్లో అచ్చయ్యాయి. ధర్మారావు, తాను నడిపిన పత్రికల్లో రాసిన వ్యాసాలను కొన్నిటిని ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ అన్న గ్రంథంగా మొదటిసారి 1961 అక్టోబరులోనే ప్రచురించారు.

హైదరాబాదుకు స్థిరనివాసం మార్చినప్పటినుంచీ తమ రచనలను ఓ వైపు అచ్చుకు సిద్ధంచేసి ప్రచురిస్తూనే; తమ హృదయోల్లాస వ్యాఖ్యకు తుది మెరుగులు దిద్దడం ఆరంభించాడు తీరిక చిక్కినప్పుడల్లా మిత్రులతో దాని ప్రచురణ విషయం ప్రస్తావిస్తూండేవాడు. చివరకు సన్నిహిత మిత్రులు పెట్టిన ఒత్తిడివల్లా, కుమారుడు మోహనరావు పట్టిన పట్టువల్లా ఎలాగైతేనేం 1966 ప్రాంతానికి ప్రెస్‌కాపీ తయారైంది. ఈ మధ్యలో నిరంతరం అధ్యయనం

చేస్తూ తన వ్యాఖ్యకు తుది రూపమివ్వడంలోనూ, తన రచన లెక్కడెక్కడున్నాయో వెతుక్కుంటూ వాటిని సరిచేసి ప్రచురిస్తూండడంవల్లా ధర్మారావుకు కంటి జబ్బు వచ్చింది దీనికితోడు వయస్సువల్ల వచ్చిన కాటరాక్టూ ముదిరింది. చివరకు చూపు బాగా మందగించడంతో 1964 జనవరిలో సరోజినీదేవి ఆస్పత్రిలో కంటికి శస్త్ర చికిత్స జరిగింది. డాక్టర్ల బలవంతాన కొంతకాలం వ్యాఖ్యకు తుదిమెరుగులు దిద్దడం ఆపారే కానీ, వారిని కలవడానికి వెళ్ళిన మిత్రులందరితో ఆ వ్యాఖ్యకు తానెలా అందాలు సమకూరుస్తున్నదీ వివరించడం మాత్రం మానలేదు. చివరకు బలరామాచార్య, రామరాజు, రాంభట్ల కృష్ణమూర్తి తదితరులు ఇచ్చిన అండదండలతో 1968 మే కల్లా హృదయోల్లాస వ్యాఖ్య వెలుగుచూసింది. ఈ గ్రంథం చిన్నదీ చితకదీ కాదు. అచ్చుబిల్లు తడిసి మోపెడైంది. హైద్రాబాద్‌లో పేరుప్రతిష్ఠలున్న కొందరు మిత్రులు దీని ప్రచురణకు విరాళాలు వసూలు చేద్దామని భావించి ఓ ఉప సంఘంగా ఏర్పడ్డారు. కానీ దానివల్ల ఆశించినంత ఫలితం కన్పించలేదు. సాహిత్య అకాడమీ కూడా ఏకొద్దో సాయంచేసింది తప్ప, ప్రచురణ వ్యయంతో అది ఏమూలకూ సరిపడలేదు.[1] ధర్మారావు ఈ దశలో చాలా బాధపడ్డాడు. ఎలాగోలా ఆ వ్యాఖ్యానం 'విశిష్ట రచనలు' అన్న ప్రచురణ సంస్థ పేరుకింద వెలువడింది. అలాగే ధర్మారావు పాతపాళీలో ప్రచురించినవీ, అప్పుడప్పుడు రాసిన ఖండికలూ కొన్ని 'మబ్బుతెరలు' అన్న ఖండకృతి సంపుటంగా ఈ 1972 లో ప్రచురణ సంస్థ పేరు కిందే ప్రచురించాడు.

తన ఇతర గ్రంథాలనూ, గ్రంథరూపంలో రాని ఇతర రచనలనూ ప్రచురించాలని ధర్మారావు ఆశించారుకానీ, విజయవిలాసం వ్యాఖ్యాన ప్రచురణ ధర్మారావును ఆర్థికంగా వెంటనే కోలుకోనివ్వలేదు. విజయవిలాస వ్యాఖ్యానం అచ్చులో ఉన్నపుడే, ఇంట్లో జారిపడితే ధర్మారావుకు కాలు విరిగింది (1967). సికింద్రాబాద్ గాంధీ ఆస్పత్రిలో చాలారోజు లుండడం అవసరమైంది. అప్పటి నుండీ వీరెక్కడకెళ్ళినా చేతికర్రతో వెళ్ళాల్సిరావడంతో, ఆ బాధ పడలేక వెళ్ళడం తగ్గించుకున్నాడు. ఆరోజుల్లోనే అంటూండేవారు - అసలీ విజయవిలాస వ్యాఖ్యానానికి - దరిద్రుడి పెళ్ళికి వడగళ్ళ వానలాగా - అన్నీ ఆటంకాలే ఎదురౌతున్నాయని. అన్ని ఆటంకాలనూ అధిగమించి ఆ వ్యాఖ్యానం జనంలో కొచ్చింది. ప్రజలు దాన్ని కళ్ళకు కప్పుకోవడం జరిగింది. ఈ గ్రంథాన్ని వీలైనంత తక్కువ ధరకు ప్రజల కందివ్వాలని ధర్మారావు చాలా తాపత్రయ పడ్డాడు.

ఈ మధ్యలో ధర్మారావూ; వారికి నెల్లూరులో గాఢమిత్రుడుగా ఉండే మరుపూరి కోదండరామిరెడ్డి, మరికొందరూ కలిసి హైద్రాబాద్‌లో రేఖకాపూర్ ప్రాంతంలో స్థలాలు కొన్నారు. ఇది 1965 ఒలో జరిగింది.[2] తమవాళ్ళెవరైనా హైద్రాబాద్‌లో ఇల్లు కట్టుకోవాలన్న ఆశ ధర్మారావుకు అలాగే ఉంది. సారధి స్టూడియో నిర్వాహకుల్లో ఉండే కొందరు మిత్రులతో కలిసి చాణక్య ఖైరతా బాద్ ప్రాంతంలో ఉండే రవీంద్రనగర్‌లో స్థలం కొన్నాడు చివరకు. మొత్తానికి అక్కడ ఇల్లు కట్టించడం ఆరంభించారు. మద్రాసు, హైద్రాబాద్‌ల మధ్య చాణక్య తిరుగుతూండడంతో ఆ బాధ్యత ధర్మారావుమీద పడింది. విజయ విలాసం అచ్చుకాలంలో ఇవన్నీ ఆర్థికవత్తిడులుగా ధర్మారావుని బాగా కుంగ దీశాయి.[3]

వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆరంభమైనప్పటి నుండీ ధర్మారావు దాని సెనెటు మెంబరుగా ఉన్నాడు. వీరి భార్య చనిపోయిన తర్వాత వారి పేర అక్కడి విశ్వవిద్యాలయంలో చదువుతున్న విద్యార్థికి ఏటా ఒక వంద రూపాయలు స్కాలర్‌షిప్ ఇచ్చే ఏర్పాటు చేశాడు. అందుకవసరమైన డబ్బు ధర్మారావు ఫిక్సెడ్ డిపోజిట్‌లో వేశాడు. 1961 నుండీ ఇది అమలు జరుగుతోంది.

ఇక తాతాజీ అభ్యాసాలను గూర్చి కొంత తెలుసుకోవడం అవసరం. ఆయన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవడం కూడా అవసరమే.

## గడ్డకట్టని మనస్తత్వం

పెదవి దాటితే పృథివి దాటుతుందేమోనన్నంత గంభీరంగా ఉండే తత్వం ధర్మారావుది. కానీ ఎవరైనా ఏ విషయం గురించైనా కాస్త కదిపితే చాలు, ప్రపంచ పరిజ్ఞానాన్నంతో కుమ్మరిస్తాడు. ధర్మారావులో మాట్లాడడమే ఒక ఎడ్యుకేషన్ అనవచ్చు. కళ్ళద్దాలోనుండి ఎదుటివాళ్ళ మనస్సులోకి గుచ్చి గుచ్చి చూసే చూపులు నిరంతరం దేన్నో అన్వేషిస్తున్నట్టే అనిపిస్తాయి. ఎదుటి వాళ్ళను ఎక్కువగా మాటల్లో ఉంచి, మధ్య మధ్యలో తాను కల్పించుకుంటూం టారు. సన్నగా కోలదేరి ఉండే చేతి వేళ్ళు మంచి చిత్రకారుడి వేళ్ళని

గుర్తుకు తెస్తాయి. ఏమైందో తెలీదుగాని కుడిచేతి చూపుడు వేలు కొద్దిగా మొక్కపోయినట్టుండేది. బహుశా ఎప్పుడో దెబ్బ తగిలి ఉంటుంది.

సునిశితమైన హాస్యం వారి సొమ్ము. సమదర్శినిలో పనిచేసే రోజుల్లో వీరి మిత్రులు కొందరు లోపలికివస్తుంటే అంతవరకూ గడబిడగా మాట్లాడుతున్న వాళ్ళను 'దేవాంగులొ' స్తున్నారు 'వా' దించేయండని - హెచ్చరించేవారు. దీన్లో కొంత అశ్లీలం ఉన్నా హాస్యాని కందరూ మెచ్చుకునేవారు. అసలా వచ్చే వారు దేవాంగులు - సాలెవారు. ఆ మిత్రులూ గలగలా నవ్వేసేవారు.

అలాగే ఆరుద్ర, తాపీ ఇద్దరూ; ఆరుద్ర ఇంట్లో ఏదో సినిమాపని చూసుకుంటున్నారు. మధ్యలో కాఫీ అయిందిద్దరికీనూ. పక్కనుండే హోటలుకు కాస్త త్వరగా వెళ్ళచ్చని అడ్డదారిన పోతున్నారు. ముళ్ళకంచెలొస్తే తలవంచుకు దూరిపోతున్నారు. వెంటనే తాతాజీ 'ఏం బ్రదర్ ? తలవంపులు తెస్తున్నావ్' అని జోక్ చేశారు. వెంటనే ఆరుద్ర 'ఔను. మరి అడ్డదారులెప్పుడూ తలవంపులే తెస్తాయ్' అని 'విట్' విసిరారు.

తాతాజీని అటు సాహిత్యరంగం, ఇటు చలన చిత్రరంగం రెండూ కల్సి ఓసారి మద్రాసులో సన్మానించాయి. ఆ సందర్భంలో మాట్లాడుతూ "సాహితీమిత్రులు వీడు సినిమారంగాని కెళ్ళకుండా మనకెందుకు దాపురించాడని బాధపడ్తే, సినిమారంగం వాళ్ళు వీడు సాహిత్యంలో పడక మన మధ్యకెందుకొచ్చాడని బాధపడి ఉంటార" ని తన సవ్యసాచిత్వాన్ని చమత్కరించారు.

చదువుకునే రోజులనుండీ బూతు సమస్యలను పూరించడం అభ్యాసంగా చేసుకున్నాడు ధర్మారావు. మిత్రులకు కేంద్రంగా ఉంటూండేవాడు. కనుక సహజంగానే శ్లేష సంభాషణ అలవడి ఉంటుంది.

వీరు చక్కని సరసులన్న విషయం సినిమారంగంలో తాతాజీ సమకాలికులందరికీ తెలిసిందే. అలాగే వీరి ఇతర అలవాట్లూనూ.

సాధ్యమైనంతవరకూ ఉత్తరాలకు ప్రత్యుత్తరాలు రాసే అలవాటు ధర్మారావుకుండేది. అయితే వీరికొచ్చిన ఉత్తరాలను వారానికి మించి అట్టే పెట్టేవారు కాదు. వచ్చిన ప్రతి ఉత్తరాన్నీ మడిచి లాల్చీ జేబులోనో, తలగడ కిందనో పెట్టేవాడు. వారం కాగానే సమాధానాలు రాసానా లేదా అని చూసుకుని చించేసేవాడు. అవసరమైనవీ, శాశ్వతంగా ఉంచాల్సినవీ అట్టే ఉంచేవాడు.

చాలా పొదుపరి అనవచ్చు. అదీ రాతలో మాత్రమే. చిన్నచిన్న కాగితాల మీదా, ఉత్తరాల కవర్ల మీదా, ఆహ్వానపత్రికల కవర్ల మీదా రచనలు చేస్తూండేవాడు. సినిమా పాటలన్నీ అలాగే రాసేవారని నాటి వారి మిత్రులంటూంటారు.

చక్కని దస్తూరి. చిన్న చిన్న అక్షరాలు. కొద్దిగా గొలుసుకట్టు. ఎక్కువగా ఇంగ్లీషులోనే ఉత్తరాలు రాస్తూండేవాడు. సినిమా స్క్రిప్టుకు సూచనలన్నీ ఇంగ్లీషులోనే రాసుకునేవాడు. నటనలనూ, హావభావాలను సైతం ఇంగ్లీషులో మార్జిన్‌లో రాసి ఉంచుకునేవాడు.

సాధారణంగా కొందరు రచనలు చేస్తున్నప్పుడు నిశ్శబ్ద వాతావరణాన్ని కోరుకుంటారు. కానీ ధర్మారావు అలా కాదు. పత్రికల్లో పనిచేస్తున్నప్పుడు కూడా 'స్టోన్' దగ్గర ఉండే చుట్టూరా వర్కర్ల గడబిడలూ, మెషీను దడదడల మధ్యే సీరియస్ వ్యాసాలూ రాసేవారని నార్లవారి అభిప్రాయం, వీరిల్లు ఎప్పుడూ పదిమందితో సందడిగా ఉంటూండేది. చుట్టూ పిల్లలంతా ఆడుకుంటూ కేరింతాలు కొడ్తూన్నా, తాతాజీ చాలా సీరియస్‌గా తలవంచుకు రాసుకుంటూనే ఉండేవారు. ఇంట్లోవాళ్ళు పిల్లలను గదమాయిస్తుంటే 'అవన్నీ నాకేం పట్టవు. వాళ్ళనలా ఆడుకోనివ్వండం'టూండేవారని కోడలు రాజమ్మ అనుభవం.

ఎటువంటి సందర్భాల్లోనూ చిరుబుర్రాట్టం కానీ, విసుక్కోవడం కానీ ఉండేదికాదు. పెద్దలకూ పిల్లలకూ ఒకే రీతి గౌరవాన్నందించే గొప్ప గుణం ధర్మారావుది. ముఖ్యంగా స్త్రీలకు చాలా గౌరవం ఇచ్చి మాట్లాడేవాడు. తన కోడళ్ళు సరోజిని, రాజమ్మ అంటే విపరీతమైన అభిమానం చూపేవారు. వారిని గురించి ఇతర పెద్దల దగ్గర ప్రశంసిస్తూ మాట్లాడే గొప్ప మనసు వారిది.[4]

ఎవరివల్లనన్నా తాను సాయం పొందితే దాన్ని ఏదో రూపంలో తీర్చుకోవాలని భావించేవాడు. ప్రతి చిన్న సాయానికి కృతజ్ఞత వ్యక్తపర్చే లక్షణం వీరిది. ఇది వీరి జీవితంలోనూ, సాహిత్యంలోనూ అడుగడుగునా కనిపిస్తుంది.

మాటల్లో చాలా మెత్తదనం. కటుత్వం అన్నది కనిపించనే కనిపించదు. సాహిత్యరంగంలో - శత్రువులతో చేసిన కుస్తీ పోటీల్లో ఎంతో నమ్రత, సామరస్యం, ఎదుటివారి పాండిత్యం మీద గౌరవం, ప్రదర్శించిన ఘట్టాలు; భారతి వ్యాసాల్లోనూ, విజయవిలాస వ్యాఖ్యాన ఘట్టాల్లోనూ కొల్లలుగా మనకు కనిపిస్తాయి. వేదం వారి మీద చేసిన ఉపన్యాసం (అకాడమీ ప్రచురణ) చూసినా, వేటూరి వారు చనిపోయినప్పుడు ధర్మారావు రాసిన శ్రద్ధాంజలి భాగం చదివినా ఈ అంశం స్పష్టమవుతుంది.

ఛాందసులుగా ఆరంభమై ఛాందసులుగానే అంతమయ్యేవారు కొందరు. అభ్యుదయవాదులుగా మొదలై ఛాందసులుగా మిగిలిపోయేవాళ్ళు మరికొందరు. ఛాందసులుగా జీవితంలో అడుగిడి అభ్యుదయ వాదులుగా జీవితాంతం వరకూ నిలిచేవారుకొందరు.అందులో ఈ మూడో కోవకు చెందినవారు తాతాజీ.[5]ఇలాంటి విశ్లేషణే ఆనటోల్ ఫ్రాన్స్‌ను గూర్చి చేస్తూ విల్‌డ్యురాంట్ ఇలా అంటాడు.

"చాలా మందిమి, మనలో గొంతు చించుకొని పోయేంత రాడికల్స్‌గా జీవితాన్ని ప్రారంభించి, పోనుపోనూ అభివృద్ధి అంటే పొడగిట్టనివాళ్ళంగా! ఛాందసులంగా దిగజారిపోతూంటాం. అటు బాంకులో ఇంటరెస్ట్ పెరుగుతున్న కొద్దీ, ఇటు సమాజ సంస్కరణలో ఇంటరెస్టు తగ్గిపోతూంటుంది. కానీ కొందరిలో మాత్రం అలాకాదు."

ఇది ధర్మారావు సంపూర్ణ జీవితాన్నీ పట్టిచ్చేముక్క. యవ్వనంలోకి అడుగిడకముందే మానసికంగా గిటకబారిపోతున్న జనం మధ్య, ఎనభై ఆరులో కూడా ఇరవై ఆరు మనస్తత్వంతో; మానసిక యవ్వనంతో మిసమిసలాడిన నిరంతర అభ్యుదయపథగామి తాతాజీ.

యుద్ధ ప్రచారశాఖలో పనిచేస్తూ రాయలసీమలో తిరిగే కాలంలో ధర్మారావు కాలికి పట్టిన ఎగ్జిమా; 1947 ప్రాంతంలో పట్టుకొన్న అస్త్మా, వారిని బాగా బాధించడం ఆరంభించాయి. ఒక్కో సమయంలో ఆయాసం - రొప్పు వచ్చినప్పుడు, చూసేవాళ్ళు భయపడిపోయేవారు. ఆపరేషన్ చేసిన కన్ను సరిగా కన్పించక పోయినా, విరిగిన కాలు అలాగే బాధపెడ్తున్నా, ఎగ్జిమా సతాయిస్తున్నా; సాహిత్య వ్యాసంగం, కార్యక్రమాలను మానుకునేవారుకాదు. తమను కలవడానికి ఇంటికొచ్చే మిత్రులతో నాటి రాజకీయ పరిస్థితులను గూర్చి చర్చిస్తూండేవారు. జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిణామాలను చాలా శ్రద్ధగా అధ్యయనం చేస్తూండేవారు.

1962 లో భారత - చైనా సరిహద్దు సమస్యమీద చైనా దండయాత్ర చేసినప్పుడు ధర్మారావు చాలా బాధపడ్డాడు. అయినా దేశ రక్షణలో యువకులు ముందుండాలని ఆకాంక్షించారు. ఆ భావాన్ని, అప్పుడు యువజన విద్యార్థి సమాఖ్యల మాస పత్రిక 'యువజన'లో 'ఊసుపోక' అన్న శీర్షిక కింద స్పష్టంగా వ్యక్తపర్చాడు. "ఇది వినోదాలకు వేళకాదు; వేడుకలకు సమయం కాదు. దేశానికంతటికీ ఇది పరీక్షా సమయం. యువజనులకందరకూ దీక్షా తరుణం" అన్నారు. ఇదే సందర్భంలో దేశంలో ఉండే చీడపురుగులను గురించి చెప్తూ "మన దేశంలో ఉన్న కొందరిని ప్రజాద్రోహులనాలి. వీరికి

కావలసినదంతా స్వలాభం. ప్రజలేమయినా సరే, దేశమేమయినా సరే, వీరి లాభాలు ఒకటి నూరుగా పెరగాలి. 'వట్టి పుణ్యానికి' ధరలు పెంచేస్తారు. ఉన్న సరుకులు లేవని చీకటి బజారులకు పంపుతారు. ఎటువంటి అన్యాయానికైనా, ఎలాంటి అసత్యానికైనా జంకరు. పదహారణాల ప్రజాకంటకులు. జాతికి చీడపురుగులు.'' ఇలాటి వారిని అరికట్టాలంటూ ''ఆ సామర్థ్యం ఒక్క యువజనులకే ఉందని'' వాళ్ళను ప్రశంసించారు.[6]

మొదటినుండీ ధర్మారావుకు సన్నిహితుడూ, మంచి మిత్రుడూ గురు పుత్రుడూ గిడుగు సీతాపతి. ఇద్దరూ హైదరాబాదులో స్థిరనివాసం ఏర్పరచుకున్న తర్వాత పరిచయాలు మరింత పెరిగాయి. సీతాపతి 78 వ జన్మదినం సందర్భంగా 1962 లో ఒక సన్మాన సంఘాన్ని ఏర్పాటు చేశారు. ముళ్ళపూడి తిమ్మరాజు అధ్యక్షుడు. ధర్మారావు ఆ సందర్భంలో సభ్యుడుగా ఉన్నారు.

ఆ రోజుల్లోనే గోపీచంద్ 2-11-1962 న హైదరాబాద్‌లో మరణించాడు. రేడియోలో 3-11-62 న తాపీ శ్రద్ధాంజలి ఘటిస్తూ, 'చప్పుడు చేయకండి నిద్రపోతున్నాడ'ని అన్నారు. ''ఆయన మరి పదేళ్లు బతికి ఉంటే ఆంధ్ర సారస్వతానికి ఉపకారం ఎంతో జరిగి ఉండేద''న్నారు. పాదరసం లాంటి తెలివి కలవాడు గోపీచంద్ అని నివాళులందించాడు. 11.11.1962 న భాషా నిలయం హైద్రాబాద్‌లో జరిగిన సంస్మరణ సభలో ప్రసంగించాడు.

ధర్మారావుకూ, పురిపండాకూ చాలా సన్నిహిత సంబంధం ఉంది. విశాఖ కవితా సమితిలో మొదటినుండీ ధర్మారావు సభ్యులు. వ్యావహారిక భాషోద్యమంలో ధర్మారావు అడుగు బెట్టడంతో వారిద్దరి సంబంధం మరింత దృఢతరం అయింది. వ్యావహారిక భాషోద్యమంతో పురిపండా జీవితం పెనవేసుకు పోయిందనవచ్చు. వారికి విశాఖ పౌరులు 1964 లో విశాఖ టౌన్ హాలులో షష్ఠిపూర్తి ఉత్సవం జరిపారు. ఆ సభలకు ధర్మారావే అధ్యక్షత వహించాలని పురిపండా భావించాడు. ఆసమయంలో ధర్మారావు ఆరోగ్యం బాగా దెబ్బతింది. పురిపండా ఆహ్వానించగానే తాపీ అంగీకరించాడు. డాక్టర్లు ప్రయాణం చెయ్యవద్దని సలహా ఇచ్చారు. 'బతికినన్నాళ్ళు నీ భజన తప్పను గాని మరణకాలమునందు మరతునేమొ' అని నరసింహ శతక పద్యభాగం చదువుతూ వ్యావహారిక భాషోద్యమాన్ని చివరి దశలో కూడా మరవనని వ్యాఖ్యానం చేస్తూ సభలకు రావడానికి అంగీకరించారు.[7]

ఈ సభల్లో తానెలా వ్యావహారికవాదిగా మారిందీ వివరిస్తూ పురిపండా వ్యావహారిక భాషోద్యమానికి చేస్తున్న సేవను ప్రస్తుతించాడు. విశ్వవిద్యాలయాలింకా పూర్తిగా అంగీకరించనందుకు బాధను వ్యక్తం చేశాడు.[8]

తెలుగు అకాడమీ వాళ్ళు పాఠ్య గ్రంథాలు ప్రచురించి మొదటి దఫా విడుదల చేసిన వాటిని సమీక్షించమంటూ ధర్మారావుకు ఇచ్చారు ఆంధ్రజ్యోతిలో వీటిని సమీక్షిస్తూ, ఇవి ఇంకా చాలా సరళమైన శైలిలో ఉండాలని అన్నాడు. ఆ సందర్భంగానే తెలుగు అకాడమీవారు ఒకసారి ధర్మారావుని ఇంటర్వ్యూ చేశారు. అప్పటికి మళ్ళీ వ్యావహారిక, గ్రాంథిక భాషా వివాదాలు మొదటి కొచ్చాయి. పుస్తకాల భాషమీద పింగళి లక్ష్మీకాంతం కమిటీ కొన్ని సిఫార్సులు చేసింది. ఆ కొద్దిపాటిదాన్నయినా తూట్లు పొడవాలని ఉస్మానియా విశ్వవిద్యాలయంలో నాటి తెలుగు శాఖలో కొందరు ప్రయత్నించారు. దాన్ని ప్రస్తావిస్తూ "వ్యావహారిక భాష విశ్వవిద్యాలయాల్లో అమల్లోకి రావటం ఖాయం. యువ విద్యార్థులు ఆ బాధ్యత తీసుకుంటారు. అయినా కొందరు పండితులు తమ అత్తగారి పెత్తనం కొనసాగాలని భావిస్తూ పుర్రచెయ్యి అడ్డెయ్యాలని చూస్తున్నారు. అది కొనసాగదు. భవిష్యత్తు యువకులది" అని చాలా తీవ్రంగా వ్యావహారిక భాషా వ్యతిరేకులను తాపీవారు హెచ్చరించారు.[9] (1969).

1970 ఒకరకంగా సాహిత్య రంగంలో కొంత మార్పుకు కారణమైంది. శ్రీశ్రీకి షష్ఠిపూర్తి జరపాలని విశాఖ పౌరులు, తెలుగుదేశ సాహిత్యాభిమానులూ తలపెట్టారు. ఆ సభలకు ధర్మారావే అధ్యక్షత వహించాలని శ్రీశ్రీ పట్టుబట్టాడు. శ్రీశ్రీకీ తాపీవారికీ చాలా అన్యోన్య సంబంధం ఉంది. శ్రీశ్రీ తానేది రాసినా 'తాతాజీ ఇది విను' అంటూ కూర్చోబెట్టి వినిపించేవాడు. అలాటి ఓ సంఘటన 19·3 లో హైద్రాబాద్‌లో తాపీవారింట జరిగింది. నేనూ చూశాను. ఇద్దరూ చంటిపిల్లలల్లే కవిత్వాలు చదువుకుంటూ ఆహా, ఓహోలనుకుంటూండేవారు. "తాపీవారిది సర్వతంత్ర స్వతంత్రమైన ధోరణి. ఆయనకి ఆయనే సాటి. సాహిత్యరంగంలో పెద్ద పీఠమే వీరిది"[10] అన్న భావం శ్రీశ్రీకుంది. ఈ సమయంలో కూడా ధర్మారావు ఆరోగ్యం బాగాలేదు. డాక్టర్లూ, మిత్రులూ విశాఖవరకూ ప్రయాణం చెయ్యడం తాపీవారి ఆరోగ్యానికి మంచిది కాదన్నారు. ధర్మారావు అస్మాతో బాధపడుతున్నా, కాలు విరిగి బాధపెడ్తున్నా సభలకెళ్ళి అధ్యక్షత వహిస్తానంటూ "అలాంటి సందర్భంలో ప్రాణం పోతే అంతకంటే నాకు కావలసిందేముంది"[11] అని వెళ్ళాడు. శ్రీశ్రీ అంటె ధర్మారావుకున్న ఆప్యాయత అలాంటిది.

ఆ సభలు ధర్మారావును ఉత్తేజపరిచాయి. తెలుగునాట సాహితీపరు లెందరో నాడు హాజరయ్యారు. సన్మాన సభకు అధ్యక్షత వహిస్తూ "ఎక్కువ కాలం బతికి ఉన్నవారు సాధారణంగా సాహిత్యాలోచనాపరులే గాని మరొకరు కాదు, ఎక్కువకాలం బతకాలంటే మీరంతా చెయ్యవలసింది సాహిత్య దృష్టి ఏర్పరచుకోవడం"[12] అంటూ ప్రజలకు అమరత్వం ప్రసాదించే అంజనం వెల్లడించాడు.

ఆ సందర్భంగానే ఏర్పాటు చేసిన సాహిత్య గోష్ఠిలో ఉపన్యసిస్తూ "కళ ప్రజాప్రయోజనాలకు ఉపయోగపడాలన్న సిద్ధాంతం ప్రబలింది. కళ సమాజ అభివృద్ధికి కావాలి. ఆకాశంలో విహరిస్తూ వీణ వాయించుకొని ఇంటికి చేరితే, ప్రియురాలులేదు. గంధం ఎండిపోతున్నాది అని ఏడుస్తూ కూచునే కవిత్వం పోయింది. ఆ వాయించినవారు మన సభలోనూ ఉన్నారనుకుంటాను. కవికి తనకున్న జ్ఞానం తన సొత్తుకాదు. ఇది జనరేషన్స్ నుంచి వస్తున్న కల్చర్. ఇది నాది అని ఇష్టమొచ్చినట్టు చెయ్యకూడదు"[13] అంటూ కవిత్వం ప్రజల సొత్తన్న దాన్ని నిర్మొహమాటంగానూ, ఖండితంగానూ చెప్పాడు.

ఈ సభల్లోనే విశాఖ విద్యార్థులు సాహితీవేత్తలకు సవాలుగా కరపత్రాలు పంచడం అదీ జరిగింది. అప్పటికే దిగంబరులుగా పేరు తెచ్చుకున్న కవులు కూడా దీనికి హాజరయ్యారు. శ్రీశ్రీ రచనల సంపుటాలను ఆ సభల్లోనే విడుదలచేశారు.

ఇది జరిగిన కొద్ది నెలలకు హైదరాబాద్‌లో 'సెవెన్ స్టార్స్ సిండికేటు' అనే సంస్థ సాహిత్య సభలను నిర్వహించాలనుకుంది. ఆ సభలు జూబిలీహాలు ఆవరణలో జరిగాయి అంతకుముందు ద్వారకా హోటల్లో శ్రీశ్రీ తదితరులు సమావేశమై అరసాన్ని పునర్నిర్మించాల్సిన అవసరాన్ని వివరించారు.

కానీ సభల సమయానికి శ్రీశ్రీ, రమణారెడ్డి తదితరులు నగరంలోనే ఉండి సభలకు పోలేదు. దిగంబరకవులు కొందరూ కల్సి వీరూ 'విప్లవ రచయితల సంఘం' అంటూ మరో రచయితల సంఘానికి పురుడుపోశారు

ఈ చీలిక ధర్మారావును బాగా బాధించింది. 1943లో తెనాలిలో జరిగిన అరసం ప్రథమ మహాసభలకు అధ్యక్షత వహించినప్పటినుండీ దీని వృద్ధిని కాంక్షిస్తూ, అందుకు తోడ్పడుతూ వస్తున్న వ్యక్తి తాపీ.

ఈ పరిణామాల దృష్ట్యానే 1970వ సంవత్సరానికి సాహిత్య రంగంలో ప్రత్యేకత ఉందని చెప్పడం. ఈ పరిణామాలకన్నిటికీ ధర్మారావు కూడా సాక్షులుగా నాడున్నారు.

ఎంతో కాలం నుండీ హైదరాబాదులో తనదో, తనకొడుకులదో ఇల్లు ఉండాలన్న ధర్మారావు ఆశ 1969 చివరలో సాధ్యపడింది. ఖైరతాబాద్‌లోని చాణక్య ఇంటికెళ్ళాడు. తమప్రచురణల పంపిణీ బాధ్యత విశాలాంధ్ర ప్రచురణాలయం తీసుకోవడంతో వీరికి కొంత మానసిక శాంతి కల్గింది.[14] వీరి రచనలన్నీ త్వరత్వరలో పునర్ముద్రణలకు రావడం, ఆర్థికంగా వెసులుబాటు కల్గటంతోపాటు తృప్తి కూడా కలిగింది. కొత్తపాళీ 1955లో మొదటి ముద్రణ నుండీ అన్నీ విశాలాంధ్ర ప్రచురణాలయమే వేసింది. మిగిలిన పుస్తకాలన్నీ రెండవ ముద్రణ నుండీ అన్నీ విశాలాంధ్ర ప్రచురించింది. దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు ? అన్నది మాత్రం, మూడో ముద్రణ నుండీ విశాలాంధ్ర ప్రచురణాలయం చేపట్టింది. ధర్మారావు రచనలన్నీ విశాలాంధ్ర ప్రచురణాలయం వారే అచ్చువెయ్యాలని భావించి 1955 నుండీ ధర్మారావు వెంటపడ్డారు.[15]

భాష - లిపిని గురించి ధర్మారావు బాగా అధ్యయనం చేశాడు. లిపిని గురించి 'ఓనమాలు' రాద్దామనుకున్నాడు. తిరుమల రామచంద్ర చేస్తున్న కృషి చూసి బాగా ప్రశంసించాడు. తాను మాత్రం రాయలేకపోయాడు. భాష మీద తిరుపతి సదస్సులో పాల్గొని, తన అభిప్రాయాలను వివరించి భవిష్యత్తులో పాఠ్యగ్రంథాల నిర్మాణంలో ఉపయోగించాల్సిన భాషకోరూపం కల్పించడంలో కృషిచేశాడు. అలాగే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, తెలుగు అకాడమీ సంయుక్తంగా 1971 సెప్టెంబరు 4, 5లలో హైదరాబాదులో లిపి సంస్కరణ మీద ఓ సదస్సు నిర్వహించాయి. తాపీవారినీ ఆహ్వానించాయి. తెలుగుదేశంలో ఈ అంశంలో కృషిచేస్తున్న ప్రముఖులూ, పొరుగు రాష్ట్రాల్లో తమతమ లిపుల సంస్కరణలమీద కృషిచేస్తున్నపముఖులూ, హాజరయ్యారు. ఆరోగ్యం క్షీణించినా ఆ సదస్సుకు ధర్మారావు హాజరయ్యాడు ఒకభాగానికి అధ్యక్షతా వహించాడు. 5వతేదీన అకాడమీ రెండవదఫా ప్రచురించిన పాఠ్య గ్రంథాలనువిడుదల చేశాడు. నాటి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి, విద్యామంత్రి పి. వి. నరసింహారావులు ప్రసంగించారు. ఈ సభలకు ధర్మారావే అధ్యక్షత వహించాడు. క్రియాశీలమైన పాత్ర నిర్వహించ లేకపోయినా; లిపి సంస్కరణలోనూ, అక్షరాల సంఖ్యను తగ్గించడంలోనూ, తెలుగు కన్నడాలకు ఏక లిపి ఉండాలన్న సుబ్బ రామప్పగారి వాదనలోనూ కల్పించుకున్నారు. అక్షరాల సంఖ్యా విద్యార్థులకు తల బరువు కాకూడదన్నది వారి వాదం. వీలున్నంత వరకూ సంస్కృతం ప్రభావం తగ్గించాలన్నది వారి మతం.

1970 ఏప్రిల్‌లో ధర్మారావు ఆరోగ్యం పాడవడం ఆరంభించింది. అంటుకున్న ఆస్మా ఊపిరి సలపనిచ్చేది కాదు. పర్లాకిమిడిలో అబ్బిన చుట్టకాల్చే అలవాటు మానలేకపోయేవారు. ప్రతి నెలా వీరి మిత్రులొకరు గోదావరి ప్రాంతం నుండి లంకపొగాకు పార్సెలు పంపిస్తూండేవారు. ఆయాసం తగ్గడానికి ఏదో ఒక మందు నోట్లో 'బ్లో అప్' చేసుకుంటూండేవారు. దీనికి తోడు 1971 లో ఫైలుస్ వ్యాధి వచ్చింది. అప్పటికే దూర ప్రయాణాలూ, ఊరి ప్రయాణాలూ మానుకున్నారు.

## సంస్కరణ వివాహాల నిర్వహణ

ఇక్కడుంటూ కూడా నగరంలో పలువురు మిత్రుల సంస్కరణ వివాహాలను జరిపిస్తూండేవారు. ఈ అంశంలో ధర్మారావు భావాలను ఇంతకు ముందే స్పష్టంగా చూడడం జరిగింది. తరిమెల నాగిరెడ్డి కుమార్తె వివాహాన్ని హైద్రాబాద్‌లో ధర్మారావే నిర్వహించాడు. వీరు వివాహం చేసే పద్ధతి చాలాఆదర్శప్రాయంగా ఉంటుందనేది మామిడిపూడి వెంకటరంగయ్యగారి అభిప్రాయం. అలాగే కె.కె. రంగనాధాచార్యులు పెళ్ళిని ధర్మారావుగారే నిర్వహించారు. నిర్మల, త్రిపురనేని సుబ్బారావుల పెళ్ళీ వీరే చేయించారు. ఇలాటి సంస్కరణ వివాహాలెక్కడ జరిగినా ఏమాత్రం వీలున్నా హాజరై ప్రోత్సహిస్తూండే తత్వం ధర్మారావుది. ఒక సందర్భంలో ఆవుల సాంబశివరావు కుమార్తె వివాహానికి ఆరోగ్యం బాగులేకపోయినా విజయవాడ వరకూ వెళ్ళి సంస్కరణ భావాలకు ప్రోత్సాహమిచ్చిన వ్యక్తి వీరు.

ఇలాగే సంస్కరణ వివాహాలను ఈ కాలంలోనే తన మనుమరాలు జోయాకు హైద్రాబాద్‌లోనూ, మరో మనుమరాలు విమలకు విజయవాడలోనూ జరిపారు. తన అభిప్రాయాలన్నీ తన ఇంటినుండే ఆచరణలో ఆరంభించి ఆతర్వాతే ఇతరులకు చెప్పేవారు ధర్మారావు.

ధర్మారావు కుటుంబం దానగుణం కలది. ధర్మారావు తండ్రిగారు విజయనగరంలో ఉండే రోజుల్లో ఆ చుట్టుపక్కల వాళ్లెవరికీ మంచినీళ్ళ బావి లేదు. వీరు తవ్వించాలనుకున్నారు. ఆ బావి అబ్రాహ్మణులైన వీళ్ళింట్లో ఉండే బ్రాహ్మణులకు నిరుపయోగమవుతుందని అనుకున్నారు. సగం బావి వీరింట్లోకి మరో సగం వీధిలోకి ఉండేలా గోడకట్టి నుయ్యి తవ్వించారు. అలాటి గుణమే ధర్మారావుకీ వచ్చింది. బంధువులు కాని, మిత్రులు కాని ఆపదలో ఉన్నారంటే ఆర్థికసాయం చేస్తూండేవాడు పురిపండా వారి సతీమణికి ఓసారి కాన్సరు వస్తే ధర్మారావు ఆర్థిక సాయం చేశాడు. అలాగే బంధువులిళ్ళల్లో ఎవరు చదువుకుంటున్నా సాయం పంపేవాడు. వాళ్ళవాళ్ళ జన్మదినాల సందర్భంగా కానుక రూపంలో సాయం అందజేస్తూండేవాడు. ఆ వరవడిలోనే విశాలాంధ్ర పత్రికను 1953 లో ధర్మారావు ఆరంభించింది మొదలు; పిల్లల పేరు మీదో, మనుమల పేరు మీదో, కొంత కానుక పంపించేవాడు. ఈ సంప్రదాయం ధర్మారావు మరణానంతరం కూడా వారి మనుమలూ, మనుమరాండ్రూ ఇంకా కొనసాగిస్తూండడం ఆనందాన్ని కలిగిస్తుంది.

ధర్మారావు బంధువులెవరికి ఏ అనారోగ్యం వచ్చినా హైద్రాబాదొచ్చి వీరింట్లో ఉండి నయం చేసుకుని పోతూండేవారు. వాళ్ళకు సమస్తమైన ఖర్చులూ ధర్మారావే భరించేవాడు 1972 డిసెంబరులో ధర్మారావు వదినకు (83 ఏళ్ళు) కాలు విరిగితే తన ఇంట్లో అట్టిపెట్టుకొని నయం చేయించాడు.[16] ఆ సందర్భంగా చాలా ఖర్చయింది. విశాలాంధ్ర ప్రచురణాలయం వారి వెంటబడి తన రాయల్టీ తెప్పించుకుని దానికి సర్దుబాటు చేసుకున్నారు. అలాగే వీరి బంధువులిళ్ళలో ఎవరికి పెళ్ళయినా వాళ్ళను పిలిపించి బట్టలూ అవీ పెట్టడం ఆచారంగా ఉండేది.[17] వీరిల్లెప్పుడూ జనంతో నిండి ఉంటుంది. విద్వాన్ విశ్వంగారితో తాపీ అన్నట్టు వీరిల్లు 'హౌరా స్టేషన్'. దీన్నే ధర్మారావు విశాలాంధ్ర వారికి రాసిన ఓ లేఖలో.

''హియర్ అవర్ హవుస్ ఈజ్ బిల్డింగ్ లైక్ ఎ బీ-హైవ్ విత్ అబౌట్ 15 రిలేటివ్స్''[18] అన్నారు. నిత్యం కలకల్లాడ్తూంటుంది.

ఈ రోజుల్లోనే ధర్మారావు ఆరోగ్యం బాగా క్షీణించింది. అంతకు ముందు శరీరంలో దాగి ఉన్న అనారోగ్య లక్షణాలన్నీ ఒక్కమారు విజృంభించాయి. ఇంతవరకూ ధర్మారావు తనకున్న మానసిక స్థైర్యంతో వాటిని ఎదుర్కొని తన కార్యక్రమాలను నిర్విఘ్నంగా కొనసాగించుకుంటూ వచ్చాడు. నిత్యం వెన్నంటి ఉంటూ, 'తాతయ్యా అంటూ' తిరిగే మనుమరాలు, చాణక్య భార్య సరోజిని చేసే సపర్యల బలం ధర్మారావు ఆ

బాధలను తట్టుకునేలా చేసింది. తన జీవిత ధ్యేయంగా పెట్టుకున్న హృదయోల్లాస వ్యాఖ్య పూర్తి కావడం, తెలుగు ప్రజలందరి మన్ననలూ పొందడం ధర్మారావుకు తృప్తిని కలిగించింది. కేంద్ర సాహిత్య అకాడమీ కూడా వీరి కృషికి తగిన గుర్తింపు నివ్వడం వీరికి ఆనందాన్ని కలిగించింది. ఏదో సందర్భంలో ఒక ప్రసిద్ధ జర్నలిస్టు అన్నట్టు "తెలుగు దేశంలో 'నాయుడు గారం'టే ముగ్గురే మనస్సుకు తడుతారు. రఘుపతి వెంకటరత్నం నాయుడు, ధర్మారావు నాయుడు" వెంకటస్వామినాయుడు, అదెలాగున్నా 'తాతాజీ' అంటే మాత్రం ఏ రంగంలోవాళ్ళకయినా తట్టేది ధర్మారావే.

ధర్మారావు చివరివరకూ తన కాళ్ళమీద తాను నిలబడటానికే ప్రయత్నించాడు. విశాలాంధ్ర పత్రికాఫీసులో ఓసారి వీరు నిలబడి మాట్లాడుతుంటే మోటూరి హనుమంతరావు వీరి వార్ధక్యం చూసి కూచొని ప్రసంగించమన్నారు. వెంటనే "నలుగురిలోనూ నా కాళ్ళమీద నేను నిలబడటానికే చిన్నప్పట్నుంచీ యత్నిస్తున్నా" నంటూ ఓ చెణుకు విసిరి అలా ప్రసంగిస్తూ పోయారు.19 అలా నిలబడే, తనదంటూ ఇంత సాహిత్యం ఆస్తి తెలుగునాట తన వారసులకివ్వడానికి కృషి చేశారు. దాన్ని పదిలపర్చుకుంటూ రానున్న తరం కూడా తన కాళ్ళమీద తాను నిలబడగలదన్న నమ్మకం కుదిరిన తర్వాతనే, 1973 మే 8 వ తేదీ మంగళవారం తెల్లవారు జాము 3 గంటల ప్రాంతాన, ఖైరతాబాద్‌లో తమ కుమారుడింట్లో కన్నుమూశారు. చాణక్య మినహా కుటుంబ సభ్యులందరూ ఆ సమయంలో అక్కడే ఉన్నారు.

సన్నగా కాయబారు శరీరం, సాహిత్యం బరువుతో కొద్దిగా వంగిన నడుం, అనుభవాలతో పండిన తలా, తెలుగునాట రవీంద్రుణ్ణి తలపించే వెండి గడ్డం, దగ్గరకొచ్చినవాణ్ణల్లా 'ఏం బ్రదర్, అంటూ ఆప్యాయతతో పిలిచే కంఠం మూగవోయింది. తన సాహిత్యం మాత్రం మనకొదిలి ధర్మారావు వెళ్ళిపోయారు. అభ్యుదయ సాహితీపరులకోసం కట్టిన "పాత కొత్తల పసిడి వంతెన"గా ధర్మారావు తెలుగు సాహితీ చరిత్రలో మిగిలిపోయారు.

## సాహిత్య వ్యాసంగం

ధర్మారావు హైదరాబాదులో ఉంటూ పూర్తి విశ్రాంతిదశ ననుభవించారనలేం. సాహిత్య వ్యాసంగం కొనసాగిస్తూనే ఉండేవారు. అనేక పత్రికలకూ,

సంచికలకూ, మిత్రుల గ్రంథాలకూ వ్యాసాలు రాస్తూనే ఉండేవారు. తామంతకు ముందు పాల్గొన్న ఉద్యమాల సభల కోసం కూడా ఇక్కడ నుండే వ్యాసాలు రాసి పంపుతూండేవారు. ఆరకంగా చేసిన సాహిత్యసేవను పరిశీలించడం అవసరం.

తెలుగు భాషా సమితివారు విజ్ఞాన సర్వస్వాన్ని ప్రకటిస్తూ అందులో చరిత్ర - సంస్కృతి భాగంలో ధర్మారావుచేత మూడు వ్యాసాలు రాయించారు. చేమకూర వెంకన్న గురించి చెప్పాలన్నా, రాయాలన్నా, తెలుగు దేశంలో మొదట తట్టే పేరు తాపీవారిదే. చేమకూర కవితాహృదయాన్ని తాపీలా అందించేవాళ్ళు మరొకరుండరు. అందుకే ఆ సంపుటిలో ఆరు పేజీల వ్యాసంలో అతని సాహిత్య ప్రతిభాసంపత్తులను అద్దంలో కొండలా ప్రతిబింబింపచేశారు. వెంకటపతి భోగంవాడనీ, బ్రాహ్మణుడనీ, క్షత్రియుడనీ ఉన్న వాదనలన్నీ తడుముతూ "రాజు అన్నది ఆనాటి నాయకులకు బిరుదపదము. చేమకూర వారు నాయుళ్లలో ఇప్పటికీ ఉన్నారు" అని అంటూ కుల నిర్ధారణ చేశారు. సారంగధర చరిత్ర, విజయవిలాసం కావ్యాల్లో ఉండే అనేక అందాలను స్థాలీపులాకన్యాయంగా వివరించారు.[20]

త్రిపురనేని రామస్వామి చౌదరి అంటే ధర్మారావుకు విపరీతమైన అభిమానం. వారికి గుడివాడలో జరిగిన బ్రహ్మాండమైన సన్మాన సభలకు ధర్మారావే అధ్యక్షత వహించిన విషయం ఎరిగిందే. ఒకరి మీద మరొకరు జోకులు విసురుకునేవారు. ఒక సందర్భంలో రామస్వామి, ధర్మారావును మీరు శవాలు తింటారని అన్నారట. వెంటనే దానికి మీరు పచ్చగడ్డి తింటారుగదా అని సమాధానం చెప్పారట. రామస్వామి శాకాహారులు. తాపీవారు మాంసాహారులు. వీరిద్దరికీ మానసికమైన అభిప్రాయాల అనుబంధం ఉండేది. అందుకే వారిని గురించి విజ్ఞానసర్వస్వంలో తాపీవారిచేతనే వ్యాసం రాయించారు.

'పురాణాలను ఇతిహాస దృష్టితో పరిశీలించే" గుణం రామస్వామి దన్నారు "సంఘములోగల న్యూనాధికాలు వీరి దృష్టి నాకర్షించాయి. జన్మవల్ల ఆధిక్యం రాదని వేదపౌరోహిత్యాధికారాలు అందరికీ కలవని అనేక సభలలో వాదించి బ్రాహ్మణేతరులు వేదాలనభ్యసించి స్వసంఘ పౌరోహిత్యము చేసుకో గలుగునట్లుచేసి 'వివాహవిధి' రాశారు... అస్పృశ్యతా నివారణకు గట్టిగా ప్రయత్నించడమేకాక వీరు ఇతర మతాలకు వెళ్ళినవారిని తిరుగ హిందూ మతంలో కలుపుకోడానికి 'శుద్ధి' ఉద్యమం సాగించారు. వీరిది దేశభక్తిపూరిత హృదయము."[21] ఇదీ ఆ వ్యాసంలో కవిరాజును గురించి తాపీవారి అంచనా

అలాగే ధర్మారావు మిత్రులూ సినీ, పత్రికారంగంలో సహచరులూ గూడవల్లి రామబ్రహ్మం జీవితాన్ని కూడా వీరు మరో వ్యాసంలో అందులో వివరించారు. రామబ్రహ్మం ఎక్కడుంటే అక్కడ కవికులం చేరేది. ఆ విష యాన్నే - "ఆనాడు వీరి కార్యాలయం (ప్రజామిత్ర) ఆంధ్రకవులకు, కళాకారు లకు సమావేశస్థలముగా ఉండేది. ఏ చిన్న విషయాన్నయినా కొంత ఆడంబ రత్వముతో జరిపించి మద్రాసు నగరంలో ఆంధ్రేతరుల దృష్టిని ఆకర్షించే నేర్పు వీరి కపారము... ....ఆనాటి ప్రజాసమస్యలనే కథావస్తువులుగా తీసి కొని ప్రతిభాద్యోతకములయిన చిత్రాలను నిర్మించారని"[22] విశదీకరిసూ రామబ్రహ్మానికి శ్రద్ధాంజలి ఘటించారు. ధర్మారావు అటు తొలి తెలుగు సినీ రంగంలో కాలు పెట్టడానికీ, ఇటు కొత్తపాళీ రచయితగా దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకన్న వ్యాసాల రచయితగా సాహితీలోకానికి పరిచయం కావడానికీ రామబ్రహ్మమే కారకులన్న విషయం తెలిసిందే.

సినీరంగంలో మిత్రుడు మల్లాది రామకృష్ణశాస్త్రి. ధర్మారావుకు వీరి మీద చెప్పలేనంత అభిమానం, గౌరవం ఉంది. వీరి పాండిత్యం మీద విపరీత మైన నమ్మకం తాపీవారి కుండేది.

అలాంటి మిత్రుణ్ణి గురించి 'ఆనందవాణి' తెచ్చిన స్మృతి సంచికలో ధర్మారావు ఒక వ్యాసం రాశాడు. అది వ్యాసంలా కనబడే వచన కవిత్వం. గుండెనుండి పొంగిన అక్షరాల కూర్పులా, బాధల పేర్పులా అనిపిస్తుంది.

"గుంపులో అతడూ ఒకడే - దూరానికి
ఆడంబరం కనబడదు
అతిశయం కనిపించదు ....
కమ్మని భాషా పాండిత్యం —
కావలసినంత ప్రపంచజ్ఞానం
కటువుగాని విమర్శనలు
కథానికలకు కావలసిందింకేముంది ...
అనేక విదేశీ భాషల సాహిత్యాలతో కూడా
నిత్య నూతన పరిచయము
సరికొత్త పోకడల ఆకళింపు ....
అతని కథలలో ఒక విశేషము
ఒక్కొక్కప్పుడు పై పంక్తికీ కింది పంక్తికీ మధ్యను
పాఠకుడి కాళ్ళు తేలిపోతుంటాయి

అడుగందదు -

అర్థం కాదు - సులభంగా"

అని మంచి కథకుడుగా మల్లాదివారిని మన ముందు భావోద్వేగంతో నిలబెడ్తూ 'మల్లాది ఒక మణిపూస' అంటూ తన తీర్పును తెలుగు పాఠకలోకాని కందించాడు.[23]

హైదరాబాదులో ఉంటూ అనేకమంది మిత్రుల పుస్తకాలకు పీఠికలూ - అభిప్రాయాలూ రాసి పంపుతూండేవారు. అలాంటివాటిలో కొన్ని పరిశీలిద్దాం.

అభినవ పోతన వానమామలై వరదాచార్యులు 'పోతన జీవితము' పద్య కావ్యం రాశాడు. తెలంగాణాలో వానమామలైని వినని సాహితీపరుడు లేడు. పద్యం చదివే నేర్పు చాలా గొప్పది. అనేక కష్టనష్టాలకోర్చి ఈ కావ్యం రాశాడు. ఈ గ్రంథానికి 'ధన్యవాదాల'ంటూ రాస్తూ ధర్మారావు ఇలా అంటాడు-

"విషయ పరిజ్ఞానానికి వారు తమ కుశాగ్రబుద్ధినీ విమర్శనా పాటవాన్నీ జోడించి రచనను సాగించినారు .... గ్రామ జీవనమును బాగా ఎరిగినవారు. పేదరికాన్ని సానుభూతితో గుర్తించినవారు. కవీశ్వరులకు సహజమయిన స్వాతంత్ర్యాభిలాష తెలిసినవారు" అలాటివారు "పోతన జీవితం రచించడం సమంజసమే'' అంటూ పోతన్నకూ, వానమామలై వారికీ ఉన్న సామ్యాలనూ, రాయడానికి అవసరమైన అధికారాన్నీ వివరించారు. సందర్భవశాత్తు తనకు పోతన కవిత్వం మీదున్న అభిప్రాయాన్ని "మరికొందరు కవులుపయోగించే సంస్కృత పదాలలాగా, పోతన సంస్కృతం తెలుగు పాఠకులను చీకాకు పెట్టదు .." అంటూ "తెలుగు మాటలతో కలిసిపోయి, తెలుగులో లీనమై పోగల మెత్తని సంస్కృతమునే పోతన ఉపయోగిస్తాడు."[24] అనే రహస్యాన్ని ధర్మారావు విశదీకరించాడు. అనవసరపు సంస్కృత పెత్తందారీతనాన్ని తాపీవారు సహించరు. సంస్కృతానికి విశ్వవిద్యాలయం ఒకటి ప్రత్యేకంగా పెట్టాలన్న ఆలోచనను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1972 లో వెలువచ్చినప్పుడు తీవ్రంగా గర్హించారు. "జనానికి అంతకన్నా అవసరమైన సమస్యలున్నాయి వాటి పరిష్కారానికి ఆ కోట్లాది ధనం ఖర్చుపెట్టాలి. ప్రస్తుతం ఈ సంస్కృత విశ్వవిద్యాలయం ఉద్ధరించేది ఏమీ లేద"ంటూ ఖండితంగా చెప్పారు.[25]

ధర్మారావు అంతేవాసి, మంచికవీ, చిత్రకారుడూ మడిపడిగ బలరామాచార్య 'మేనకా విశ్వామిత్రం' అన్న కావ్యం రాశాడు. దానికి విపులమైన 'ప్రస్తావన' ధర్మారావే చేశాడు. సందర్భాన్ని చూసుకుని ఇనుప కచ్చడాలలో

వాడిన భర్తృహరి శ్లోకం "తేషామింద్రియ నిగ్రహో యదిభవేద్వింధ్యఃప్లవేత్ సాగరే'' అన్న పాదాన్ని తీసుకుని, విశ్వామి త్రుణ్ణి మరులు గొల్పడానికి మేనక చేసిన చేష్టలు, వేసిన వేషం, రెంటికీ అవసరమున్న కథగా దీన్ని వర్ణించాడు. రచయిత రచనను ఆశీర్వదించాడు. ప్రాస్తావికంగా గేయకావ్యం 'అలతి అలతి ఖండికలు'గా ఉండాలనీ, 'కలము పదును చూచుకోవాల'నీ అంటూ కొన్ని సూచనలు గూడా యువ రచయితలకు చేశారు.[26]

ఇదే కాక 'గడ్డిపూల'న్న కథా సంకలనానికి పీఠిక రాస్తూ 'కథకు జనని వ్యథ - గేయానికి మూలం గాయం' - అంటూ సూక్ష్మంగా ఆ రెంటి తత్వాన్నీ చెప్పాడు.

ధర్మారావుకు మొదటినుండీ అనేక ప్రజా సంఘాలతో సన్నిహిత సంబంధం ఉండేది. భారత సోవియట్ సాంస్కృతిక సంఘానికి జాతీయ సమితిలో కూడా సభ్యులుగా ఉండేవారు. ఆ సంఘం మహాసభలకు వెలువర్చిన ఒక కరపత్రంలో ''భారత - సోవియట్ స్నేహానుబంధం'' అన్న వ్యాసం రాశాడు. అందులో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన పూర్వాపరాలను సమీక్షించాడు. ఆ సందర్భంలో భారతీయ తత్వాన్ని వివరిస్తూ ''సర్వజన సౌఖ్యమూ, శాంతీ, సహజీవనమూ, ఇటువంటివాటిని కాంక్షించే వారినందరినీ భారతీయులు ఆప్తులుగా భావిస్తార"న్నాడు. భారత - సోవియట్ మైత్రిని అంచనా వేస్తూ ''సిద్ధాంతాలూ - వేషభాషలూ ఆచారాలూ ఎంతో భిన్నంగా ఉండినా; భారత, సోవియట్ ప్రజల స్నేహ భావాభ్యున్నతికి ఎలాంటి విఘాతం లేదు. ...... మన కార్మికులతో చేతులు కలిపి పనిచేస్తుంటారు.......... పాకిస్తాన్ వంటి గడ్డు సమస్యను గురించి మనకంటే ఎక్కువగా వారే యోచించి తాష్కెంట్ ప్రకటనకు దారి కనబరిచారు.. చంద్రమండలం మీద ఒక స్థావరం ఏర్పాటు చేయడంకంటే, ఈ తాష్కెంటు ఒప్పందం ఒక అద్భుత ఘటన'' అని అన్నాడు. ఈ ''స్నేహం పరస్పర ప్రయోజనాల మీద ఆధారపడినది కాదు .. ....ఇది ఎండ వానలకు తుఫాను ఉప్పెనలకు వికలత్వం చెందదు........ఈ స్నేహబంధం అవిచ్ఛిన్నంగా ఉండక తప్పదు. ఉంటుంది, ఉండాలని మనమందరం త్రికరణశుద్ధిగా వాంఛిస్తాము''.[27] ఇదీ ధర్మారావు ఆకాంక్ష. ఇదే అభిప్రాయాన్ని మరో సందర్భంలో కూడా ధర్మారావు వ్యక్త పర్చాడు.[28]

పీటికితోడు విజయవిలాసం హృదయోల్లాస వ్యాఖ్యను సమీక్షిస్తూ ఆ రోజుల్లో వచ్చిన వ్యాఖ్యలను విమర్శనలను పరిశీలిస్తూండేవారు. ఆంధ్రప్రభలో

జి. వి. కృష్ణారావు విమర్శకు సమాధానం కూడా రాశారు. దీన్ని విజయ విలాసం పరామర్శ భాగంలో పరిశీలించడం జరిగింది. అలాగే కృష్ణారావుకు ఎస్. గంగప్ప సమాధానం కూడా ధర్మారావు దృష్టికి వచ్చింది. అందుకు రచయితకు వారు ధన్యవాదాలు చెప్పారు.

ఈ రోజుల్లోనే సౌమ్య ఉగాది ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో 'నృసింహపురాణం'లో కొన్ని పాఠ నిర్ణయాల విషయంలో రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ ఒక వ్యాసం రాశారు (పేజి 136 - 142). ఇందులో ప్రధానంగా సరస్వతీ వర్ణన సందర్భంలో పద్యాలు తీసుకున్నారు. "కరకమలంబునందు ... భారతిన్'' అన్న పద్యంతో తగాదా. దీనికి ధర్మారావు 1897 లో అచ్చయిన వైజయంతి వారి ప్రతిని సాక్ష్యంగా తెచ్చారు. ''మొదటి చరణంలో 'బొసంగ'ను 'బెసంగ' అనీ రెండో చరణం చివరను 'వాదమై' ని 'వాదియై' అనీ మాత్రం మార్చుకోవాలని'' ధర్మారావు సూచించారు

దీంతో సరస్వతీవర్ణన సందర్భోచితం - అందులో వాడిన 'కమండలువు' మొదలైనవన్నీ సరిగ్గా అమరడం జరుగుతాయనీ విశదీకరించాడు. అప్పుడే ''ఎర్రన ఉక్తి వైచిత్రికి ఈ పద్యం తార్కాణ అనవచ్చు'' అంటూ చిన్న మార్పుల పాఠాంతరాలతో సమర్పించారు.[29]

సాహిత్యవిషయక వివాదంలో ధర్మారావు చివరిసారి జోక్యం కల్పించుకున్న సంఘటన ఇదే అనవచ్చు.

## సాహిత్య అకాడమీ కార్యక్రమాల్లో భాగస్వామ్యం - 1957

ధర్మారావు సాహిత్య అకాడమీ ఏర్పడ్డ తొలినాటినుండీ దాని కార్యకలాపాల్లో పాల్గొంటూండేవాడు. అకాడమీలో ఉండే వృద్ధతరంలో యువకుడుగా వీరిని అందరూ భావించేవాళ్ళు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ తర్వాత ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ రూపుకట్టింది [30] అంతకుపూర్వం కేంద్ర ప్రభుత్వం 15 - 12 - 1952 న జాతీయ సాహిత్య అకాడమీ ఏర్పాటు చెయ్యాలని తీర్మానించింది. దానికనుగుణంగా ఆంధ్రప్రదేశ్‌లో ఈ అకాడమీ 7 - 8 - 1957 న ఆవిర్భవించింది. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ దీన్ని ప్రారంభించారు. భాషాసాహిత్యాలలో పరిశోధనను ప్రోత్సహించడం, సాహిత్యవేత్తలలో పరస్పర సహకారాన్ని

పెంపొందించడం, పదప్రయోగకోశాలు, మౌలిక శబ్దకోశాలు, విజ్ఞాన కోశాలను ప్రచురించడం, రచయితలను ప్రోత్సహిస్తూ సారస్వతాభివృద్ధికి దోహదం చేయడం అన్న ప్రధానాశయాలతో ఈ అకాడమీ ఏర్పడింది.

బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షులుగా, దేవులపల్లి రామానుజరావు ప్రధాన కార్యదర్శిగా ఏర్పడిన తొలి సాధారణ సమితి నుండి 1957-60, 1960-63, 1964 - 68, 1969 - 73 సంవత్సరాల వరకూ ధర్మారావు అందులో సభ్యులుగా కొనసాగారు.

మధ్యలో కొంతకాలం దీని కార్యక్రమాల్లో బహుశా అనారోగ్య కారణాలవల్ల పాల్గొనలేదు. 1964 -1968 కాలంలో వీరు అకాడమీ కార్యవర్గ సభ్యులుగా కూడా ఉన్నారు. అకాడమీ నిర్వహించిన కార్యక్రమాల్లో వీరు వక్తగా ఉండేవారు. 1961 లో అకాడమీ ప్రచురించిన నన్నయ పద ప్రయోగ కోశాన్ని తిరుపతిలో ఆవిష్కరించారు. ఆ సభలో ప్రధాన వక్తలుగా తాపీ ధర్మారావు, గిడుగు సీతాపతి పాల్గొన్నారు.

ప్రసిద్ధులైన పండితుల సహాయంతో భాగవతాన్ని పరిష్కరించి ప్రచురించాలని అకాడమీ భావించింది. దీని సంపాదకవర్గంలో ధర్మారావు ఉండి 1962 - 64 వరకూ పనిచేశాడు.[31] పాఠనిర్ణయాల సందర్భంలో ధర్మారావు పండితులకు చాలా సాయం చేశారని అందులో పనిచేసినవాళ్ళ అభిప్రాయం.[32] ఇది 1964 లో నాలుగు సంపుటాలుగా బయటకొచ్చింది. ఇది నడిచినంత కాలం ప్రతిరోజూ వెళ్ళి దీని సంపాదకత్వంలో పాలుపంచుకుంటూండేవాడు.[33] విషయనిర్ణయంలో శ్రద్ధవహిస్తూండేవాడు.

గిడుగు రామ్మూర్తి శతజయంతి (1963), వేదం వెంకట్రాయశాస్త్రి శతజయంతి (1966) ఉత్సవాలను అకాడమీ జరిపినప్పుడు వక్తగా పాల్గొని ఆ యిద్దరితో తనకున్న పరిచయాలను గుర్తుచేసుకున్నారు. సాహిత్యరంగంలో వారిద్దరూ మహోన్నతమూర్తులుగా వర్ణించాడు.

కందుకూరి, గురజాడల శతజయంతుల సందర్భంగా అకాడమీ ఏర్పరచిన సంఘాలలో సభ్యులుగా ధర్మారావున్నాడు. ఆ సందర్భాలలో తెచ్చిన ప్రత్యేక సంచికల ఉపసంఘంలో కూడా సభ్యులుగా ఉండి, ఆ రెండు సంచికల్లోనూ అమూల్యమైన వ్యాసాలు రాశాడు.

అనేక పర్యాయాలు, ఉత్తమ సాహిత్య గ్రంథాలను నిర్ణయించి అకాడమీకి సిఫార్సు చేసి బహుమానాలిప్పించే న్యాయనిర్ణాయక సంఘాలలో సభ్యులుగా పనిచేశాడు.

ప్రాచీన తెలుగు కావ్యాలను ముద్రించి తక్కువధరకు తెలుగు ప్రజలకం దించాలన్న ఆశయంతో అకాడమీ 1966లో ఒకపథకం చేపట్టింది. ప్రసిద్ధులైన సాహితీవేత్తలచేత ఆ గ్రంథాలను పరిష్కరింపచేసి ప్రచురించాలని సంక ల్పించింది. ఆ పథకంలో తాపీ ధర్మారావు పారిజాతాపహరణాన్ని పరిష్క రించారు. (1966) విపులంగా పీఠికనూ రాశారు. వీరికి పారిజాతాపహరణం మీద మక్కువ ఉన్న విషయం ఇంతకుముందు తెలిసిందే. దీనికి నాడు భావ ప్రకాశిక అన్న పేరుతో 'సమదర్శిని'లో గద్యరూపంలో ఓ వ్యాఖ్యానంరాశారు.

అకాడమీవారు, సాహితీవేత్తలలో 55 నుండి 75 సంవత్సరాల వయ స్సున్న ప్రఖ్యాతులను ఎన్నుకొని వారికి విశిష్ట సభ్యత్వం ఇచ్చే ప్రణాళికను 1966లో ఆరంభించారు. ఈ మేరకు మొదటి పర్యాయం ఎన్నికైన నలుగురు విశిష్ట సభ్యులలో తాపీధర్మారావు ఉన్నారు. సర్వేపల్లి రాధాకృష్ణన్, కాశీ కృష్ణా చార్యులు, గిడుగుసీతాపతిగార్లు మిగిలిన ముగ్గురు. ఆ సందర్భంలో వీరికి లాంఛ నాలను బహూకరిస్తూ వీరిని గురించి చెప్పిన వివరణ ధర్మారావు సాహిత్య సేవను దిఙ్మాత్రంగా సూచిస్తుంది.

దేవులపల్లి రామానుజరావు వీరికి సన్నిహితులు అకాడమీ ఆరంభమైన దగ్గర్నుంచీ ధర్మారావుకూ, రామానుజరావుకూ సాన్నిహిత్యం మరింత పెరిగింది.

కేంద్ర సాహిత్య అకాడమీ సాధారణంగా వ్యాఖ్యానానికి బహుమానం ఇవ్వదు. అటువంటిది ధర్మారావు విజయవిలాసానికి రాసిన హృద యోల్లాస వ్యాఖ్యాన గ్రంథానికి ఇచ్చింది (1971). పురిపండా, నార్ల, పద్మరాజు,34 రామానుజరావులు కేంద్ర సాహిత్యఅకాడమీ చేత ధర్మా రావుకిలాటి అఖిల భారత గుర్తింపు వచ్చేలా కృషిచేశారు. విజయవిలాసం ప్రచురణకు కూడా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కొంత ఆర్థిక సహాయం చేసింది.

విజయవిలాస వ్యాఖ్యాన ఆవిష్కరణను ఒక పెద్ద పండుగలా సాహిత్య అకాడమీ నిర్వహిస్తుందని ధర్మారావూ, వారి మిత్రులూ భావించారు. కాని అకాడమీలో కొందరి శల్యసారథ్యం వల్లే ఇది జరగలేదని నాటి సాహితీ మిత్రుల కందరికీ తెల్సు.

## అభ్యుదయ కళాసమితితో సంబంధం - 1959

హైదరాబాద్‌లో ఉన్న వివిధ కళాశాలలకూ, ఉస్మానియా విశ్వవిద్యా లయానికీ చెందిన అనేకమంది యువ రచయితలూ కళాకారులూ కలిసి

స్థాపించిన సంస్థ ఇది. ధర్మారావు హైదరాబాద్‌కు రావడంతో వీరంతా వారి అధ్యక్షత కింద దాన్ని నెలకొల్పారు.[35] అనేక సాహితీ కార్యక్రమాలు నిర్వహించిందీ సంస్థ. శ్రీశ్రీతోపాటు ఇష్టాగోష్ఠి సభ ఏర్పరచినప్పుడు తాపీయే దానికధ్యక్షుడు. అప్పుడప్పుడే 'గురజాడ అకవి' అంటూ కొందరు దుష్ట ప్రచారాన్ని లేవదీశారు. ఈ సవాలును ఈ సంస్థ స్వీకరించి 1959 నవంబరులో రెండు రోజులు గురజాడ జయంతి ఉత్సవాలు నిర్వహించింది. శ్రీశ్రీ, ఆరుద్ర, కె.వి. రమణారెడ్డి, తుమ్మల, దాశరథి తదితర సాహితీవేత్తలెందరో పాల్గొన్నారు. సోవియట్ ప్రతినిధి వర్గం కూడా పాల్గొంది. ఈ సభలు ధర్మారావు అధ్యక్షతా, నేతృత్వాలకిందే జరిగాయి. ఈ సంఘం తాతాజీ జన్మదినోత్సవాలను కూడా సాహిత్య ఉత్సవాలుగా జరిపేది. దేవులపల్లి ప్రభాకర్ కార్యదర్శిగా ఇది చాలాకాలం పనిచేసింది.

## భాష మీద సదస్సు - తిరుపతి - 1965

విద్యార్థులకు తెలుగు బోధించడంలో ఎలాటి భాషను ఉపయోగించాలి? గ్రంథాలలో ఎటువంటి భాషను వాడి విద్యార్థుల్లో జ్ఞానాన్ని పెంచాలన్న అంశాల మీద అనేక సదస్సులూ, చర్చాగోష్ఠులూ జరిగాయి. గ్రాంథిక, వ్యావహారిక భాషా వివాదంలో ఇలాంటి కార్యక్రమాలు, 1910 నుండి బాగాలుగానే ఉంటూ వచ్చాయి.

ఆంధ్రప్రదేశ్ అవతరించిన తర్వాత రాష్ట్ర ప్రభుత్వం హైస్కూలు స్థాయి వరకూ పాఠ్యపుస్తకాలను జాతీయం చేసింది. ఆ పుస్తకాలలో తెలుగు భాష, శైలి ఎలా ఉండాలన్న ప్రశ్న తలెత్తింది. తెలుగు మాతృభాషగా ఉంటూ తెలుగు చదివేవాళ్ళ తెలుగు ఎలా ఉండాలి? మాతృభాష తెలుగు కానివాళ్ళకు బోధించాల్సిన గ్రంథాలలో తెలుగు భాష, శైలి ఏవిధంగా ఉండాలన్న మీమాంస వచ్చింది. ఇవికూడా ప్రధానంగా నాలుగు, అయిదు తరగతులవారిని దృష్టిలో ఉంచుకునే.

రెండవ భాషగా తెలుగు చదివేవాళ్ళ కోసం ప్రభుత్వ అభ్యర్థన మీద భద్రిరాజు కృష్ణమూర్తి సంపాదకుడుగా, ఉత్పల సత్యనారాయణాచార్య రచయితగా ఓ పాఠ్యపుస్తకం వ్యావహారిక భాషలో వెలువడింది. తర్జనభర్జనలు జరిగాయి. హైస్కూలు స్థాయిలో, రెండో భాష తెలుగు పాఠ్యపుస్తకాలన్నీ వ్యావహారికభాషలోనే ఉండాలని చాలామంది అభిప్రాయం వెలిబుచ్చారు.

జాతీయ వాచకాల సంఘం కార్యదర్శి పి. యస్. ఆర్. అప్పారావు ఈ వాగ్వి వాదాన్ని ప్రభుత్వం దృష్టికి తెచ్చారు.

అప్పటి విద్యాశాఖామంత్రి యం. ఆర్. అప్పారావు అధ్యక్షులుగా, మూడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులు సభ్యులుగా 27-1-1964 న ఒక సమావేశం జరిగింది. ఈ సమస్యను చర్చించి ఒక పరిష్కారం కనుక్కోవ డానికి అన్ని అకాడమీలు, విశ్వవిద్యాలయాలు, రచయితలు, పండితులు, భాషావేత్తలతో ఒక 'వర్క్‌షాపు' నిర్వహించాలని వారు అభిప్రాయపడ్డారు.

తిరుపతి విశ్వవిద్యాలయం ఆహ్వానం మేరకు ఈ సదస్సు - వర్క్ షాపు 19, 20, 21 ఏప్రిల్ 1965 న అక్కడే జరుగుతుందని ఆహ్వానాలు పంపారు.[36]

సదస్సులో తెలుగుదేశంలోని ప్రముఖ పండితులూ, ప్రసిద్ధ సాహితీ వేత్తలూ, ప్రభుత్వ ప్రతినిధులూ పాల్గొన్నారు. ప్రభుత్వం ఆహ్వానించిన వ్యక్తుల్లో తాపీ ధర్మారావు, విశ్వనాథ సత్యనారాయణ, జాషువా, బి. రామ రాజు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పింగళి లక్ష్మీకాంతం, గిడుగు సీతాపతి, నిడుదవోలు వెంకట్రావ్, పురిపండా అప్పలస్వామి, భద్రిరాజు కృష్ణమూర్తి, జి. యన్. రెడ్డి, సి. నారాయణరెడ్డి, యస్వీ జోగారావు ఇంకా అనేకమంది ప్రముఖులున్నారు.

సదస్సు జరిగిన మూడు రోజుల్లో, 19 న ఉదయం సభలో రాళ్ళపల్లి, ధర్మారావు, నిడుదవోలు వెంకట్రావులు ప్రసంగించారు.

ధర్మారావు భాషావిర్భావాన్ని చారిత్రకంగా వివరించాడు. "చిన్నయ సూరి 1857 లో ప్రెసిడెన్సీ కళాశాలలో ఆచార్యుడైనాడు. 1757 లో ప్లాసీ యుద్ధం వల్ల దేశానికెంత అరిష్టం వచ్చిందో 1857 లో చిన్నయసూరి ఆచార్యుడు కావడం వల్ల తెలుగు భాష కంత నష్టం సంభవించిందంటూ" నిర్భయంగా తన అభిప్రాయాన్ని వెల్లడించాడు. "గ్రామ్యం అని అనటం ఆత్మ నైచ్యం లాంటిది - సరే ఇప్పుడు గతాన్ని గురించి శోకించి ప్రయోజనంలేదు" -అని అన్నాడు.[37]

ఈ సదస్సులో ప్రధానంగా మూడు పంథాలు బయటపడ్డాయి. తాపీ, పురిపండా, గిడుగు, రామరాజూ ఇంకా అనేకమంది వ్యావహారికంలో రచన లుండాలన్నారు. రామరాజు మాండలికంలో కూడా ఉండాలనీ; సర్కారు మాండలికం మా మీద రుద్దవద్దని కూడా హెచ్చరించాడు.

రెండవ వర్గం కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, గడియారం శేషశాస్త్రి. గ్రాంథికంలో పాఠ్యగ్రంథాలు ఉండాలన్నారు.

దివాకర్ల వెంకటావధాని మరికొందరు, వ్యావహారికం ఉండకూడదనీ సరళగ్రాంథికం ఉండాలనీ పట్టుబట్టిన మూడోవర్గంగా మిగిలింది.

ఈ చర్చల్లో ఎవరో వ్యావహారికాన్ని 'బజారు భాష' అనడంతో భద్రిరాజు కృష్ణమూర్తి ఆవేశపడి సభను కాస్త గదమాయించాడు.

అనేకులు అటూ ఇటూ కాకుండా ఉన్న ఈ సదస్సులో, ధర్మారావు ''విద్యా ప్రణాళికలో విద్యార్థులకు మార్గదర్శకంగా వ్యావహారికభాషకు అవకాశం కల్పించమని పండితుల్ని, ఆచార్యవర్గాన్ని నేను కోరుతున్నాను. ఇరవై సంవత్సరాల అనంతరం, లేదా 50 సంవత్సరాల అనంతరం నేటి దుస్థితికంటే భాష అన్ని విధాలా బాగుపడ్తుందని నేను పండితులకూ, ఆచార్య వర్గానికీ హామీ ఇస్తున్నాన''నీ ఎంతో ఆశాభావంతో విజ్ఞప్తి చేశాడు. అయినా సదస్సు ఏటికొకరు కోటికొకరు లాగుతున్నట్టనిపించింది తాపీవారికి. అప్పుడు ''మనం ఈ సమస్యమీద 40, 50 సంవత్సరాల నుంచీ గింజుకుంటున్నాం. ఇంతటితోనన్నా ఐక్య కంఠంతో స్వస్తి చెప్పడం మంచిది. ఈ ప్రయత్నం వల్ల తెలుగువారి కృతజ్ఞతకు పాత్రులై, యువకులలో మాతృ భాషాభిమానాన్ని అంకురింపచేస్తారని ఆశిస్తున్నా''నని తమ ప్రసంగాన్ని ముగించారు.

సభ్యులలో చాలామంది ఈ అభిప్రాయంతోనే ఏకీభవించినట్టు కనిపించింది. తీర్మానాలు చూస్తే ఈ అంశం మనకు తెలుస్తుంది. వీటిని భద్రిరాజు కృష్ణమూర్తి, దివాకర్ల వెంకటావధాని, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, బోయి భీమన్నలు రూపొందించారు.

తీర్మానాలు :

1. పాఠశాలల్లో; భాషావాచకాల్లోనూ, భాషేతర వాచకాల్లోనూ ఉండే భాషలో వివాదానికి ఇప్పట్నుంచీ స్వస్తి చెప్పాలి.
2. ఆరంభంలో 1-7 తరగతులకు భాషేతర పుస్తకాల్లోనూ, రెండవ భాషా పుస్తకాల్లోనూ శైలి నవీనంగానూ, భాష శిష్ట వ్యావహారికంలోనూ ఉంచాలి.

**సూచన :-** శిష్ట వ్యావహారికం అంటే రేడియో, నవల, పత్రికల్లో ఉపయోగించే భాష.

ఇలాంటి తీర్మానాల అమలు కోఉపసంఘాన్ని ఏర్పాటుచేశారు కూడా.

ఈ భాషా సదస్సు నిర్ణయాలపైనే తెలుగు అకాడమీ తన పుస్తకాల్లోని శైలిని నిర్దిష్టం చేసింది. ఈ సదస్సుకు తర్వాతి కాలంలో చాలా ప్రాధాన్యం

వచ్చింది. తన అభిప్రాయాలను వెల్లడిస్తూ ఒక నిర్దిష్ట మార్గంలో కార్యక్రమం చేపట్టడానికి ధర్మారావు చేసిన సూచనలు బాగా ఉపకరించి ఉంటాయి. తీర్మానాంశాలనూ, తాపీవారి ఉపన్యాస భాగాలనూ పరిశీలిస్తే ఈ అంశం గోచరిస్తుంది. ధర్మారావు ఈ సదస్సు - వర్క్‌షాప్‌లో క్రియాశీలమైన పాత్ర నిర్వహించాడు.

## ఆంధ్ర రచయితల సహకార సంఘంలో తాపీ పాత్ర – 1965

తెలుగుదేశంలో రచయితలు, పుస్తకాలు రాయడం ఒక ఎత్తూ వాటిని అమ్ముకోడం మరో ఎత్తూ అయింది. గురజాడ ఎప్పుడో దీన్ని ఊహించే అని ఉంటాడు. తెలుగుదేశంలో రచయిత తన పుస్తకాలను తానే అచ్చొత్తించాలి, తానే అమ్ముకోవాలి అని.

తాను రాసిన వాటిని అచ్చువేయడం గగనం. ప్రచురణ కర్తలు రచయితను మింగుదామనుకుంటారు. రచయితలు ప్రచురణకర్తల నెత్తిన మనీ పూద్దామనుకుంటారు. ఈ వలయంలో చివరకు నష్టపోయేది రచయితే. దీన్ని గమనించి కేరళలో ఒక రచయితల సహకార సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఈ సంఘం గ్రంథాల ఎన్నిక, ప్రచురణ, పంపిణీ; తిరిగి రచయితలకు మూల్యం చెల్లించడం వంటి కార్యక్రమాలను చేపడ్తూంది. ఇది చాలా ఆదర్శవంతంగా అక్కడ నడుస్తోంది.

ఆ సూత్రాల మీదే హైద్రాబాద్‌లో కూడా ఆంధ్ర రచయితల సహకార సంఘాన్ని 1965-1966 లలో ఏర్పాటు చేశారు. బూర్గుల రామకృష్ణారావు, తాను కేరళ గవర్నరుగా ఉన్నకాలంలో అక్కడి సహకారసంఘ నిర్వహణ తీరు తెన్నులను చూశాడు. ఇక్కడి సాహితీ బంధువులకు కొందరికి వివరించాడు. ఆ ఉద్రేకంతోనే ఖండవల్లి లక్ష్మీరంజనం, చలంచర్ల రంగాచార్యులు, తాపీ ధర్మారావు మరికొందరూ కల్సి సంఘాన్ని స్థాపించారు.

ధర్మారావు కార్యవర్గంలో ఉంటూ ఈ సంఘ కార్యకలాపాల్లో పాలు పంచుకుంటూండేవాడు. ఈ సంఘం ద్వారా ఒక కథల సంపుటినీ, విశ్వనాథ మధ్యాక్కరలనూ మాత్రమే ప్రచురించారు. దీని ప్రెస్‌లో ఉస్మానియా విశ్వవిద్యాలయం పరిష్కరించిన భారతం అయిదు వాల్యూములూ, ఖండవల్లి వారి సంపాదకత్వాన వచ్చిన సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం అచ్చేశారు.

రచయితలు అనేకులు ఇందులో సభ్యులుగా ఉండేవారు. కార్యవర్గంలో హేమాహేమీలుండేవారు. ప్రెస్‌కు కావల్సినంత పని ఉండేది. అయినా ఈ సంఘం అతి తక్కువ కాలంలోనే రద్దయింది. ధర్మారావు దీన్ని సరైన మార్గాల మీద నడిపించే ప్రయత్నం అనేకసార్లు చేశారని ఖండవల్లి వారంటారు.[38] కార్యవర్గంలో ఉంటూ సమావేశాలకు తప్పనిసరిగా వస్తూ తాపీవారు సంఘం నడిచినంత కాలం దీని బాగోగుల కోసం కృషిచేశారు. తానంతవరకూ ఈ రంగంలో సంతరించుకున్న అనుభవాన్ని, ఈ సంఘం నిర్వహణకు సూచనల ద్వారా అందిస్తూండేవారు. ఇంత చేసినా ఈ సంఘం అతి తక్కువ కాలమే బతకడానికి కీలక స్థానాల్లో ఆనాడున్న కొందరు వ్యక్తులు కారణమై ఉండవచ్చని ఖండవల్లివారు తమ ఆవేదనను వ్యక్తపర్చారు.

## గురజాడ స్మారక పరిశోధకమండలి

తెలుగు సాహితీ వైతాళికుడు మహాకవి గురజాడ రచనల మాతృకలు, విశాలాంధ్ర ప్రచురణాలయం వారి దగ్గర ఉండేవి. వాటిని ఒక క్రమంలో జాబితా చేయడం, వాటికి సరైన కాపీలు తీయించడం గురుతరమైన పని. పండితులూ, శ్రద్ధ ఉన్న యువకులూ చేపట్టాల్సిన కార్యక్రమం. ఇంకా అశ్రద్ధ చూపితే అవన్నీ తెలుగు జాతికి దక్కకుండాపోయే ప్రమాదమూ ఉంది. ధర్మారావు దృష్టికి ఈ అంశం వచ్చింది.

హైద్రాబాద్‌లో ఉండే కొందరు మిత్రులనూ, సాహిత్యవేత్తలనూ చిక్కడపల్లిలోని తమ యింట్లో సమావేశపర్చి ఈ పై ఆశయ సాధనకోసం కృషి చెయ్యాలని వివరించారు. మిత్రులందరూ అంగీకరించడం, ఓ సంస్థకు రూపకల్పన చేయడం జరిగింది. అదే గురజాడ స్మారక పరిశోధక మండలి. 1963 లో ఏర్పడ్డ ఈ సంస్థకు ధర్మారావు అధ్యక్షులు. సి. నారాయణరెడ్డి, మరి కొందరూ ఉపాధ్యక్షులుగానూ, పోరంకి దక్షిణామూర్తి ప్రధాన కార్యదర్శిగానూ, ఏటుకూరి ప్రసాద్ కోశాధ్యక్షుడుగానూ, అబ్బూరి గోపాలకృష్ణ, ఇంకా కొందరు ప్రసిద్ధులు కార్యవర్గంలోనూ ఉన్నారు.

విశాలాంధ్ర వారి నుండి గురజాడ రచనలు తెప్పించి, రాత ప్రతులతో సరిచూసి జాబితా రాయడం ఆరంభించి అబ్బూరి గోపాలకృష్ణ కొంతకాలం చేశారు. కానీ ఆ ప్రతులు చాలా శిథిల దశలో ఉండడంతోనూ, అసలు ప్రతులకే మోసం వస్తుందన్న భయంతోనూ అంతటితో ఆ పని ఆపేశారు.

ఈలోగా గురజాడ కన్యాశుల్కాన్ని, కలకత్తాలో ఉండే ఎస్. ఎన్. జయంతి ఆంగ్లీకరించారని తెలిసింది. దాన్ని ఈ పరిశోధకమండలి ప్రచురణగా వెలువర్చడానికి అనువాదకులు అంగీకరించారు. ఈ కృషిలో దక్షిణామూర్తి ఎక్కువ శ్రద్ధ చూపారు.

చివరకు హైద్రాబాద్‌లో జరిగిన ఈ పరిశోధక మండలి ప్రారంభోత్సవం (1964) లో, కన్యాశుల్కం ఆంగ్లానువాదాన్ని ఆవిష్కరించారు. ధర్మారావు నేతృత్వంలో నాటి సభ జరిగింది.

ఈ మండలి కార్యాలయం ధర్మారావు ఇంట్లోనే ఉండేది. చాలా ఉత్సాహంతో, పెద్ద కార్యక్రమాలను చేపట్టాలన్న ఊపుతో ఆరంభమైన ఈ మండలి ఎక్కువకాలం నిలదొక్కుకోలేకపోయింది. ధర్మారావు ఆరోగ్యం అంతగా బావుండని కారణంగానూ, గురజాడ రాతప్రతులను జాబితా చేసే కార్యక్రమం కూడా అర్థాంతరంగా ఆగిపోవడంతోనూ ఆ ప్రతులు విశాలాంధ్రకు తిరిగి అప్పగించారు.

## కూచిపూడి కళాక్షేత్రం

సారథి స్టూడియోను నిర్వహించే వాళ్ళలో సి. వి. ఆర్. ప్రసాద్ ఒకరు. వీరికి భరత నాట్యంలో ప్రవేశముంది. సారథి పేరుమీద నిర్మించిన చిత్రాల నిర్మాణంలో వీరూ భాగస్వాములే. వీరికి కూచిపూడి నృత్యం అంటే చాలా అభిమానం. వేదాంతం లక్ష్మినారాయణశాస్త్రి కుమారుడు జగన్నాథ శర్మ దగ్గర చిన్నతనంలో నాట్యం నేర్చుకున్నారు.

ధర్మారావు హైద్రాబాద్ వచ్చిన తర్వాత, వీరికి నాట్యం మీదా, కళల మీదా ఉన్న అభిరుచి తెలిసిన సి వి. ఆర్. ప్రసాద్‌గారు- ఒక నృత్య అకాడమీ స్థాపించాలని భావించారు. జగన్నాథ శర్మ కూడా హైద్రాబాద్‌లో ఉండేవారు అందుకని తమ గురువు ద్వారా ఇతరులకు శాస్త్రీయ పద్ధతిలో నాట్యం చెప్పించవచ్చనీ, ఇలాటి అవకాశం భాగ్యనగరం పౌరులకు కల్పించవచ్చనీ తలపెట్టి, ఓ నృత్య పాఠశాల ఆరంభించారు. దానికి ధర్మారావు హితవరి. ధర్మారావు కూడా మొదట్లో దీనిమీద చాలా శ్రద్ధ చూపిస్తూ దీని అభివృద్ధికి కృషి చేస్తూండేవాడు. క్రమంగా, వయస్సు తెచ్చిన భారంతో దీనిమీద మునుపటంత ఆసక్తి చూపలేకపోయారు. ఇదీ కొంతకాలం బాగా నడిచి తర్వాత ఆగిపోయింది.

## రాష్ట్ర ప్రభుత్వ పుస్తకాల అవార్డ్స్ కమిటీ సభ్యత్వం

తెలుగు రచయితలను; విద్యార్థులకవసరమయ్యేవీ, వారిలో పఠనాసక్తిని పెంచేవీ రచనలను రాయించి ప్రోత్సహించాలన్న సంకల్పం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికొచ్చింది. కేవలం పాఠ్య పుస్తకాల రచనలే కాకుండా, ఆసక్తి దాయకాలైన ఇతర అంశాలమీద రాసిన గ్రంథాలను కూడా ప్రతి సంవత్సరం ఆహ్వానించి ఒక పోటీని ఏర్పాటు చేసేది. అలాటి పథకంలో భాగంగా పన్నెండవ పుస్తకాల బహుమతి నిర్ణాయక సంఘంలో తాపీ ధర్మా రావును ప్రభుత్వం నియమించింది. అనేకాలైన అభ్యుదయాంశాలున్న గ్రంథా లను శ్రద్ధగా పరిశీలించి బహుమతులకు అర్హమైన గ్రంథాల జాబితా తయారు చెయ్యడంలో (1966 లో) ధర్మారావు బాగా కృషి చేశాడు.

## నందీ అవార్డ్స్ నిర్ణాయక సంఘ సభ్యత్వం

తెలుగులో నిర్మించిన చలన చిత్రాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రోత్సహించాలని భావించింది. అప్పటికే అఖిలభారత స్థాయిలో, దేశభాషల్లో నిర్మించిన చలన చిత్రాల్లో ఉత్తమంగా నిర్ణయించిన వాటికి స్వర్ణకమలాలని ఇస్తూ, భారత ప్రభుత్వం ప్రోత్సహిస్తోంది.

అదే ప్రాతిపదిక మీద రాష్ట్ర ప్రభుత్వం కూడా తెలుగు సినీ పరిశ్రమను ప్రోత్సహించాలని ఆశించింది. ఒక్కో సంవత్సరంలో నిర్మాణమయిన చిత్రా లను పరిశీలించి, అన్ని విధాలా యోగ్యాలైన వాటికి 'నందీ బహుమానాలి'చ్చే పథకాన్ని ప్రవేశపెట్టింది. అందుకో సంఘాన్ని ఏర్పాటు చేసి అది సిఫార్సు చేసిన వాటిని ఆ సంవత్సరం ఉత్తమ చిత్రాలుగా బహుమతులకు అర్హమైన విగా నిర్ణయించేది.

కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో 1964 లో అలాటి బహుమతి నిర్ణాయక సంఘంలో తాపీ ధర్మారావు న్యాయ నిర్ణేతగా పనిచేశాడు. ఆ సంఘానికి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పి. సత్యనారాయణ రాజు అధ్యక్షుడుగా ఉంటే, నార్ల వెంకటేశ్వరరావు మరొక సభ్యులు. నాటి ప్రజా సంబంధాల శాఖ డైరెక్టరు టి. రామచంద్రరావు ప్రభుత్వం పక్షాన మెంబర్ సెక్రటరీగా వ్యవహరించారు. ధర్మారావు అంత వయస్సులో కూడా సుమారు ఇరవై చిత్రాలను జాగ్రత్తగా పరిశీలించి ఆ సంఘంలో తమ వంతు బాధ్యతను సమర్థవంతంగా నిర్వహించారు.

## సారథీ స్టూడియోస్‌లో ధర్మారావు 74వ జన్మదిన సన్మానం

హైదరాబాద్ సారథీ స్టూడియోస్‌లో ధర్మారావు 74 వ జన్మదినోత్సవం 1963 సెప్టెంబరు 19 న జరిగింది. ఆనాడు బి. రామరాజు, కృష్ణశాస్త్రి, నార్ల తదితరులెందరో ప్రసంగించారు. వక్తలందరూ "ఒక కాలంలో తెలుగు దేశంలోని కవులు, తాము తిరుపతి వెంకట కవుల శిష్యులమని చెప్పుకోవడం గౌరవంగా భావించేవారు ఈనాడు గద్య రచయితలు తాము ధర్మారావుగారి అనుయాయులమని చెప్పుకోవడం గౌరవంగా భావిస్తున్నార" న్నారు.

దేవులపల్లి కృష్ణశాస్త్రి ధర్మారావుతో తన పరిచయాన్ని వివరిస్తూ ఆయన గొప్పతనాన్ని చక్కగా అంచనా వేశాడు. ఇంగ్లీషు బాగా వచ్చిన తెలుగువాడు, తెలుగు తెలుగు రాయడం వీరికి తప్ప మరెవరికీ రాదన్నాడు. జాతీయమైన తెలుగు వీరే రాస్తారు. మనం చాలా త్వరగా గడ్డకట్టుకుపోతాం. ధర్మారావుగారు అలా బిగుసుకొనిపోరు. వీరిలో మనస్సులో ఉన్న యవ్వనం పోతే దని అంటూ "మీలాంటి వాళ్ళను అడ్డుగా పెట్టుకొంటే మేంకూడా వెనకనుండి వస్తూంటాం" అని వారి నేతృత్వాన్ని ఆకాంక్షించారు.

తర్వాత రామరాజు, ధర్మారావుకీ తమకీ ఉన్న సన్నిహిత సంబంధాన్ని విశదీకరించాడు. తానెలా వారి కుటుంబ సభ్యులుగా ఉంటున్నదీ తెల్పారు. అలాగే ఆ సభలో సుందరయ్య, దాశరథి ఇంకా మరికొందరు సన్నిహితులూ, తాతాజీకి పలు రంగాల్లో ఉన్న అభినివేశాన్నిగూర్చి ప్రసంగించారు.

అనేకులు అనేక బహుమానాలతో ధర్మారావును సత్కరించారు. ఆ సభకు పండితారాధ్యుల నాగేశ్వరరావు అధ్యక్షత వహించాడు.

## అకాడమీ బహుమతి ప్రదాన సన్మానం

హృదయోల్లాస వ్యాఖ్యకు 1971 వ సంవత్సరం కేంద్ర సాహిత్య అకాడమీ బహుమానం ధర్మారావుకి వచ్చింది. అనారోగ్య కారణాలవల్ల ఢిల్లీ వెళ్ళి ఆ బహుమతిని అందుకోలేదు. ఆ సభను ప్రత్యేకంగా హైదరాబాద్‌లో 1972 మే 7న సాహిత్య అకాడమీ ప్రాంగణంలో ఏర్పాటు చేశారు. నగరంలోని సాహితీపరులందర్నీ ఆ సభకు ఆహ్వానించారు.

సభలో నాటి విద్యాశాఖా మంత్రి భాట్టం శ్రీరామ్మూర్తి పాల్గొని ఆ బహుమానాన్ని ధర్మారావుకి అందించారు. విజయనగరంలో తానొక చిన్న తెలుగు వారపత్రికను నడిపినప్పుడు ధర్మారావును ఆహ్వానిస్తే వారు వచ్చారనీ, అక్కడ గుమ్మా శంకరరావుగారి అష్టావధానం అదీ ఏర్పాటు చేస్తే అందులో వారూ పృచ్ఛకులుగా పాల్గొన్నారనీ గుర్తు చేసుకున్నారు. ధర్మారావు బహుముఖ ప్రజ్ఞను కొనియాడారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖ అధ్యక్షులు దివాకర్ల వెంకటావధాని విజయవిలాస వ్యాఖ్యానంలో ధర్మారావు చూపిన అందాలను వివరించాడు.

అభ్యుదయ కవి శశాంక, ధర్మారావు వ్యక్తిత్వాన్ని పొగుడుతూ యువకులనూ వారి ప్రతిభనూ ప్రోత్సహించే వారి గుణాన్ని - విశదీకరించాడు. కేంద్ర సాహిత్య అకాడమీ ఉపకార్యదర్శి బి. బి. అగర్వాల్ వందన సమర్పణ చేశాడు. దేవులపల్లి రామానుజరావు సభను నిర్వహించారు.

ధర్మారావు తన కృషిని - అదీ వ్యాఖ్యాన రచనలో సాగించిన దాన్ని- కేంద్ర సాహిత్య అకాడమీ గుర్తించినందుకు కృతజ్ఞత చెప్పాడు. ఒక వ్యాఖ్యానానికి అలాటి బహుమతి రావడం ఇదే ప్రథమమన్నారు. వ్యాఖ్యాన రచనలో తాను చేపట్టిన పద్ధతులను ధర్మారావు సభ్యులకు ఎరుకపర్చాడు.

## సాహిత్య బంధువు చేసిన సన్మానం

నగ.ంలో సాహితీ బంధువులు కొందరు ఇలా ధర్మారావును సన్మానిస్తుంటే ఏరవెంకటరమణ, శ్రీమతి లక్ష్మి వెంకటరమణ తమ నివాసంలో ఏర్పాటుచేసిన రచయితల సభలో తాతాజీని సన్మానించారు. (12 - 4 - 72).

అదొక రచయితల కుటుంబం. పండగలా నడిచింది - నార్ల, బోయి భీమన్న, సి. నారాయణరెడ్డి, జె. బాపురెడ్డి, కె. రామగోపాలరావు, గుంటూరు శేషేంద్ర శర్మ తదితరులెందరో ఆ సన్మానంలో పాల్గొన్నారు.

ధర్మారావు తనను దయతో చూడకపోయి ఉన్నట్టయితేకాతాను గుమాస్తాగా పడి కొట్టుకుంటూ ఉండేవాడిననీ, కవిని అయ్యేవాడిని పుననీ అంటూ తన జనవాణి పరిచయాలను బోయి భీమన్న తెలిపారు. బాపురెడ్డి మాట్లాడుతూ ''తాపీవారు సాహిత్యవేత్తలే కాదు, తత్త్వవేత్తలూ, సంఘసంస్కర్తలూ" అన్నారు. వీరి గ్రంథాలను విశ్వవిద్యాలయాలలో విద్యార్థులకు పాఠ్యవిషయాలుగా ప్రవేశపెట్టాలన్న ఆకాంక్షను గుంటూరు శేషేంద్ర శర్మ వ్యక్తపర్చాడు.

ఈ విషయాలను ఆంధ్రపత్రిక రాస్తూ ''తాపీ ధర్మారావుగారి వంటి వారిని ఎవరు, ఎప్పుడు, ఎందుకు సన్మానించినా జనం సంతోషిస్తారని'' వివరించింది.

ధర్మారావుకు భాగ్యనగరంలోని పలు సాహితీ సంస్థలు 1972 మే 13న యువతీమండలి భవనంలో గొప్ప సన్మానం చేశాయి.

సభకు అప్పటి శాసన సభాధ్యక్షులు పిడతల రంగారెడ్డి అధ్యక్షత వహించారు. తోట రామస్వామి (విధానపరిషత్తు అధ్యక్షులు) ధర్మారావు ఖండకృతుల సంపుటి 'మబ్బుతెరలు' ఆవిష్కరించారు. సభలో కె వి. రమణారెడ్డి, జ్వాలాముఖి, శ్రీదేవి, యశోదారెడ్డి, కె. వి. గోపాల స్వామి నాయుడు, కపిల కాశీపతి, బోయి భీమన్న, పోతుకూచి సాంబశివరావు, వీరాస్వామి, పి. యస్. ఆర్. అప్పారావు తదితరులు ప్రసంగించారు.

రమణారెడ్డి, తాతాజీని కులపతిగా సంభావించారు. జ్వాలాముఖి ''ధర్మారావుగారు విజయవిలాసానికి వ్యాఖ్య రాయడంతో సాహిత్యంలో చనిపోయారు'' అని అన్నాడు. సభ్యులు ఒక రకంగా ఈ అభిప్రాయాన్నీ, అది చెప్పే పద్ధతినీ ఈసడించుకున్నారు. అజాతశత్రువనీ, ఆంధ్ర రవీంద్రు డనీ పలువురు వక్తలు అభిభాషించారు.

సన్మాన సంఘం పక్షాన నార్ల, ధర్మారావును సత్కరించాడు. బల రామాచార్య సన్మానపత్రం అందించాడు. కళానికేతన్ పక్షాన నర్రా కోటయ్య 85 తులాల వెండితో ధర్మారావు చిత్రాన్ని మలిచిన ఓ ఫలకం బహూకరిం చాడు. నగరంలోని 30 సాంస్కృతిక, సాహిత్య, కళా సంఘాలవారు ధర్మారావును అనేక బహూకృతులతో ఘనంగా సత్కరించారు.

నార్ల - సభను ఆహ్వానిస్తూ ధర్మారావుతో తనకున్న అనుబంధాన్నీ, పత్రికారంగంలో వారు చేసిన కృషినీ ప్రశంసించాడు. 'భౌతికంగా 85 సంవ త్సరాలు వచ్చినా మానసికంగా నిత్యనూతనసత్వంతో తొణికిసలాడిపోతున్న సాహితీకారునిగా' ధర్మారావును వర్ణించాడు.

ధర్మారావు తన సాహిత్య జీవితాన్ని క్లుప్తంగా సభకు వివరించాడు. అకాడమీ అవార్డు వచ్చినప్పటికన్నా తాను తన గద్యరచనలను, కావ్యాలనూ రాసేందుకు కనుగొన్న సూత్రాలను తెలుసుకున్నప్పుడు కల్గిన సంతోషం, దివ్యానుభూతి చాలా గొప్పదని అన్నారు.

తెలుగు రచన గూర్చి యువకులకు సందేశమిస్తూ, తెలుగు కావ్యంలో సంస్కృత పదాలు పెట్టటం శైలికీ, రచనా గౌరవానికీ భంగమన్నారు.

తెలుగు మాటలోని శక్తి దేశానికి ప్రదర్శించి ఆ శక్తి బలపడేందుకు ప్రోత్సాహం ఇవ్వాలన్నారు. తిరుమలరావు వందన సమర్పణతో సభ ముగిసింది.

# సన్మానపత్రాల ధోరణికి మచ్చు

భాగ్యనగరంలోని సచివాలయం సమస్త సాంస్కృతిక, సాహిత్య కార్యక్రమాలకు పట్టుగొమ్మ. అందులో ఉద్యోగులు ఈ రంగంలో నిష్ణాతులు.

ధర్మారావును, 1972 జులై 20న ఏర్పాటు చేసిన ఒక పెద్ద సభలో ఆ సాంస్కృతిక సంఘం సన్మానించింది. వారు సమర్పించిన సన్మానపత్రంలో ధర్మారావును కందుకూరి, గురజాడ, గిడుగుల వారసుడన్నారు. హేతువాద దృష్టినీ, అభ్యుదయదృక్పథాన్నీ వెలికి తెచ్చి, దశాబ్దాలుగా అందుకోసం కృషి చేస్తున్నారని ప్రశంసించారు. అన్నిటికన్నా ఆ సన్మానపత్రంలో ఉన్న ప్రధాన విషయం "ఇనుప గుగ్గిళ్ళుగా వున్న చిన్నయసూరి మార్కు వచనాన్ని చక్కగా వచనం చేసి 'కాగడా' సహాయంతో తెలుగు దేశం నలుమూలలా పంచిపెట్టి, దానిని మీరు 'జనవాణి'గా వినిపింపచేశారు. కటిక ఛాందసుల చేత కూడ తినిపింపచేశారు. తెలుగు దినపత్రికను, వారపత్రికను గ్రాంథికవాద బ్రహ్మజెముడు డొంకల్నుంచి తప్పించి, సరళమైన రాచబాటన రవాణా చేశారు" అని రాశారు. క్లుప్తంగా ధర్మారావు జీవిత కృషిని అందంగా వివరించిన సందర్భమిది. చాలా సన్మానపత్రాలున్నా ఆదర్శమైన ఉదాహరణగా ఇదొక్కటి చాలు.

హైద్రాబాద్‌నుండి విజయవాడ ఏ సొంత పనిమీద వెళ్ళినా విశాలాంధ్ర ఆఫీసులో రచయితల సమావేశం జరగడం, ధర్మారావును సత్కరించడం ఆనవాయితీ. విశాలాంధ్రకు బొడ్డుకోసినవారు ధర్మారావే. కనుక ఆపాటి కృతజ్ఞత ధర్మారావుపట్ల వారికీ, వారిమీద ఆప్యాయత వీరికీ సహజంగానే ఉంటుంది.

1972 సెప్టెంబరు 19న విశాలాంధ్ర ప్రాంగణంలో ధర్మారావు 86వ జన్మదినోత్సవం చాలా పెద్ద ఎత్తున జరిగింది. ఆరోజే అదే వేదికపై మోహనరావు కుమార్తె విమల వివాహం కూడా సోహన్‌సింగ్‌తో ధర్మారావు జరిపాడు.

మద్రాసులో పలువురు రచయితలు తాతాజీ 81వ జన్మదినోత్సవాన్ని ఘనంగా జరిపారు. అప్పటికి అభ్యుదయ రచయితల సంఘం ఇంకా పునరుజ్జీవనం కాలేదు. అలాటి భావాలున్న రచయితలందరూ మద్రాసులో 'ఆధునిక రచయితల సమాఖ్య'గా ఉంటూండేవారు. వృద్ధుల నుండీ యువకుల వరకూ అందులో సభ్యులు.

వారందరూ 1972 సెప్టెంబరులో తాతాజీ జన్మదినోత్సవ సందర్భంగా వెలువర్చిన 'క్రాంతిగీతి' గేయసంకలనాన్ని వారికి అంకితమిచ్చారు. అందులో ప్రసిద్ధులైన తెలుగుకవుల రచనల నుండీ యువ కవుల రచనల వరకూ ఉన్నాయి.

"కుసంస్కారం అభ్యుదయ సాహిత్యోద్యమం మీద దాడి చేసిన సమయంలోనూ, అభ్యుదయ వేషధారులూ ఆషాఢభూతులూ అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని విచ్ఛిన్నం చేస్తున్న దశలోనూ, సంయమనం, సమ్యక్‌దృష్టి, అచంచలమైన అభ్యుదయ దృక్పథమూగల తాతాజీ సారస్వత సేవ ఆదర్శంగా, ఉత్తేజంగా ఉండదగ్గది" - అంటూ ఈ కావ్య సంకలనాన్ని అంకితమిచ్చారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అనీ, ఆంధ్ర సారస్వత భీష్మాచార్యుడనీ కొత్త పాతల మేలు కలయిక అనీ ధర్మారావును అందులో అభివర్ణించారు.

సాహితీలోకంలో తాపీ ధర్మారావంటే తెలియని వారొకవేళ ఉంటే ఉండవచ్చేమోగానీ, 'తాతాజీ' అంటే ఎరగనివాళ్ళు లేరు. వృద్ధుల్లో యువకులుగా, యువకుల్లో జ్ఞానవృద్ధులుగా మసలిన వ్యక్తి తాతాజీ.

## తాతాజీకి తెలుగుజాతి నివాళి

ధర్మారావు మరణం తెలుగుదేశంలో అన్ని వర్గాల ప్రజలనూ, అన్ని రంగాల ప్రజలనూ కన్నీళ్ళతో ముంచెత్తింది. "తెలుగు సాహిత్యాకాశంలో వెలుగుజుక్క రాలిపోయిందన్నారు" (ఆంధ్ర జనత 9-5-73). "మహా పండితుడు, రచయిత శ్రీ తాపీ ధర్మారావు నిర్యాణం" (ఆంధ్రజ్యోతి 9-5-73). "బహుముఖ ప్రజ్ఞాశాలి తాతాజీ కన్నుమూత" (ఆంధ్ర వాణి). "ఆంధ్ర విశారద శ్రీ తాపీ ధర్మారావు కాలధర్మం"(ఆంధ్రప్రభ 9-5-73) "ప్రముఖ కవి, విమర్శకుడు తాపీ ధర్మారావు మృతి"(ఆంధ్ర పత్రిక 9-5-73). "తాపీ

'ధర్మారావు అస్తమయం'' (విశాలాంధ్ర 9-5-73). ఇవీ నాటి తెలుగు దినపత్రికలు వీరిని గురించి వ్యక్తపర్చిన అభిప్రాయాలు. ఆంగ్ల పత్రికలన్నీ కూడా ఈ విషాద వార్తను ప్రకటించాయి. పై పత్రికల శీర్షికలు చూస్తే ధర్మారావు స్పృశించని రంగం లేదనీ, నైపుణ్యం, ప్రావీణ్యం చూపని అంశం లేదనీ తెలుస్తుంది. అంతేకాదు ఆ అన్ని రంగాల్లోనూ నాయకత్వ పాత్రనే చేపట్టారన్న విషయం కూడా స్పష్టమౌతుంది. దాదాపు అన్ని పత్రికలూ సంపాదకీయాలు రాశాయి.

ధర్మారావు సహచరుడుగా పనిచేసిన నార్ల ఆంధ్రజ్యోతిలో రాసిన సంపాదకీయం అన్నిట్లోకి చాలా గొప్పది. ధర్మారావు విశిష్ట వ్యక్తిత్వాన్ని వ్యక్తపరుస్తూ నార్ల, తన కలాన్ని గుండెల్లో ముంచి రాశాడా అనిపిస్తుంది ఆ సంపాదకీయం.

ధర్మారావు సహచరుడూ, మిత్రుడూ, శిష్యుడూ విద్వాన్ విశ్వం మాణిక్యవీణలో ఇలా రాశాడు. ''ఆయన ఏనాటి వాడో.. .తొలినుంచీ నలుగుడుపడిన దారిలోనే నడవడంకాక, కొత్త దారులకోసం వెదకినవాడు. అటు పాశ్చాత్య సాహితీ సంస్కృతులనూ, ఇటు జాతీయ సారస్వత సభ్యతలనూ చక్కగా జీర్ణించుకొని; ఆధునిక దృక్పథంతో, అపూర్వ రచనా సంవిధానంతో తన తావు తాను చూచుకొని తన గొంతు తాను వినిపిస్తూ విశిష్ట వ్యక్తిత్వం వెలార్చిన మనీషి ఆయన. నవ్యాతినవ్య దృష్టితో సమాలోచించగల ధీశాలి. తెలుగు దిన పత్రికలలో తొలిసారిగా వ్యావహారిక భాషను ప్రవేశపెట్టిన సాహసి కూడా ఆయనే .... రెండు చేతులా వ్రాసి, రెండు చేతులా జీవితాన్ని అనుభవించి చిరమూ, స్థిరమూ అయిన కీర్తిని వదలి ఆయన వెళ్ళిపోయారు'' (ఆంధ్రప్రభ వార పత్రిక 8-5-1973).

ఇలాగే మద్రాసునుండి వెలువడే వనిత మాస పత్రికలో ధర్మారావుకు ఆరుద్ర శ్రద్ధాంజలి ఘటిస్తూ ఇలా రాశాడు.

''మరణించిన వాళ్ళందర్నీ మనం 'కీర్తిశేషుల'నే పేర్కొంటాం గానీ, నిజంగా చాలా కొద్దిమందే చనిపోయాక కీర్తిని వదిలిపెట్టి పోతారు. కొందరి విషయాల్లో ఆ కీర్తి కొన్నాళ్ళ పాటే ఉంటుంది. శాశ్వతంగా కీర్తిశేషించిన వాళ్ళు చరితార్థులు. తాపీ ధర్మారావు అనేక విధాల చరితార్థులు ... . (తాతాజీని) పుస్తకంలాగ చదువుకొన్నాను. చలోక్తులకు ఆయన నిధి. ఎదుటి వారిమీద తాను జోకు వేసినా, తనమీద ఎదుటివారు జోకు వేసినా నిండుగా నవ్వుకోగలరు. మన తెలుగు సినిమాల్లో వ్యావహారిక భాష ఆయన పెట్టిన

భిక్ష. నిత్యజీవితంలో షష్టిపూర్తి చేసికొనడం ఘనకార్యంగా భావిస్తే సాహిత్య జీవితంలో షష్టిపూర్తి చేసుకొన్న మహనీయుడు ఆయన'' (వనిత మాస పత్రిక).

తన ఆవిర్భావం దగ్గర్నుండీ ఇప్పటి వరకూ తనకు హితవరిగా ఉన్న ధర్మారావుకు 'విశాలాంధ్ర' పత్రిక ఇలా నివాళి సమర్పించింది.

''శిథిలమై పోయిన మతసాంఘిక వ్యవస్థను కూల్చివేయడానికి, నూతన సమాజ నిర్మాణానికి సాగిపోడానికి, తెలుగుదేశంలో సాగిన సమరశీల ప్రజా ఉద్యమాలను, కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఆయన అభిమానించారు. తెలుగునాట ప్రజా ఉద్యమాలు, అభ్యుదయ ఉద్యమాలు నిర్బంధకాండకు గురైనపుడు తమ పత్రికలద్వారా ధైర్యస్థైర్యాలు ఇచ్చిన ధీరులు శ్రీ ధర్మా రావుగారు .. ... శాంతి సోషలిజం ప్రపంచ మానవాళికి వెలుగుబాటలు కావాలని ఆయన మనసారా వాంఛించారు ... అర్థ శతాబ్దికాలం ఆయన సాగించిన సాహిత్యోద్యమం, సంస్కరణోద్యమాల ద్వారా ఆయన తెలుగు జాతికి చిరస్మరణీయులైనారు'' (విశాలాంధ్ర 9.5.73)

దివాకర్ల వెంకటావధాని ఓ ప్రత్యేక వ్యాసం వ్రాస్తూ తాతాజీని ఇలా ప్రస్తుతించాడు.

''అభ్యుదయ భావములు ప్రచారముచేసి వయసుచే, విజ్ఞానముచే, వర్తన ముచే అఖిలాంధ్ర ప్రజా గౌరవాదరములు చూరగొన్న సుధీవతంసులు శ్రీ తాపీ ధర్మారావుగారు ........ వారి బృహద్వ్యాసములు, పరిశోధనా పాటవము నకు పట్టుగొమ్మలు . విజయవిలాసమునకు పారిజాతాపహరణమునకు... వారు రచించిన వ్యాఖ్యానములు, వారి విమర్శనా వైదుష్యమును చెప్పక చెప్పు చున్నవి. అందలి కొన్ని పద్యములకు వారు సూచించిన అపూర్వార్థములు సహృదయుల నానందకందళిత తరంగాంతరంగుల కావించినవి. వీరు బహుముఖ ప్రజ్ఞావంతులు. గంభీర భావ సంభరితులు, యువజనానంద సంధాయకులు, అభ్యుదయ మార్గాన్వేషణ తత్పరులు''. (పాత కొత్తల మేలు కలయిక 'ఆంధ్ర విశారద' తాపీ ధర్మారావు.) (ఆంధ్రప్రభ దినపత్రిక 9.5.73)

హైద్రాబాద్ ఆకాశవాణి కేంద్రం నుండి దేవులపల్లి రామానుజరావు తదితరులూ; మద్రాసు కేంద్రం నుండి శ్రీశ్రీ తదితరులూ ధర్మారావుకు అశ్రు తర్పణం సమర్పించారు. తాతాజీకి శ్రీశ్రీ సమర్పించిన నివాళి కవితా స్ఫోర కంగా, ఉద్వేగంగా ఉందని అనేకమంది అభిప్రాయపడ్డారు.

పలు సంతాప సభల్లో ధర్మారావు గుణగణాలను స్మరించటం జరిగింది. ప్రధాన సభలు హైదరాబాద్, మద్రాసుల్లో జరిగాయి.

హైద్రాబాద్‌లో మే 10న జరిగిన సభలో పలు సంఘాలూ, సాహితీ వేత్తలూ పాల్గొన్నారు. రైతు సంఘం, అభ్యుదయ రచయితల సంఘం, భారత కమ్యూనిస్టు పార్టీ, విద్యార్థి, యువజన, మహిళా, శాంతి సంఘాల ప్రతినిధులు ప్రసంగించారు. సాహిత్య అకాడమీ కార్యదర్శి దేవులపల్లి రామానుజరావు అధ్యక్షత వహించాడు.

మద్రాసులో ఆధునిక రచయితల సమాఖ్య (అభ్యుదయ రచయితల సంఘం అప్పుడీ పేరుతో ఉండేది) ఇంటూరి వెంకటేశ్వర్రావు అధ్యక్షతన సభ జరిపింది. దాశరథి, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, నాటి మద్రాసు శాసనసభ్యులు కోదండరామయ్య, కాకరాల, శ్రీకాంత్ తదితరులు ప్రసంగించారు. తమిళనాడుకు చెందిన పలు ప్రజా సంఘాలు కూడా పాల్గొన్నాయి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం, ప్రజా సేవాదళ్, ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖ, చైతన్య భారతి, మొదలైన అనేక సంస్థలు సంతాప తీర్మానాలు పంపాయి. విజయవాడ, హైద్రాబాద్‌లలో పుస్తకాల దుకాణాలను వారి గౌరవార్థం ఆనాడు మూసేశారు.

వామపక్ష భావాలున్నవారే కాదు, తెలుగు నేర్చిన వారంతా తమ బంధువెవరో, తమ సచివుడెవరో, తమ నెచ్చెలి యెవరో తమను వదిలి వెళ్ళినంతగా బాధపడ్డారు. వారి స్మృతికి మనసారా నివాళులందించారు. ఇదీ తెలుగు జనం గుండెల్లో ధర్మారావు ముద్ర.

## ఆరని కాగడా

ధర్మారావు సాహిత్య జీవనం ఓ హరివిల్లు. అందులోని అన్ని వర్ణాలూ ఒకే స్వచ్ఛమైన కేంద్రకిరణం నుండి వెలువడ్డాయన్న విషయం తెలిసిందే. అలాగే వీరి సాహిత్య కృషి వెనక ఒకే ఆశయం ఉంది. కొందరి నిజజీవితం, సాహిత్య జీవితాల మధ్య భేదం ఉండవచ్చు. సారూప్యం ఏ కొద్దిగానో ఉండవచ్చు. కానీ ధర్మారావు విషయంలో ఈ రెండూ పడుగూ, పేకల్లా అల్లుకుపోయాయి. రెంటినీ విడదీసి చూడడం అసాధ్యం. దీనికి కారణం లేకపోలేదు

దేనిని సాహిత్య జీవన లక్ష్యంగా ధర్మారావు ఎంచుకున్నాడో ఆలక్ష్యమే వారి నిజజీవితాన్ని కూడా నడిపింది. అదే .... సమాజం మారాలి.

సమాజం పరిణామశీలమైంది. అయినప్పుడు ధర్మారావు ఆకాంక్షలో కొత్తేముంది అని అనిపించవచ్చు. కానీ అది కాదు ఆ పరిణామం ఎలా ఉండాలో, ఏ దిశలో సాగాలో, ఆపైన ఏర్పడబోయే నూతన సమాజం ఎలా ఉంటుందో - అన్న విషయాల్లో వారికి స్పష్టమైన అవగాహన ఉంది. నిర్దిష్టమైన చూపు ఉంది.

సమాజం మారాలి అన్న అభిప్రాయం ఉన్న వీరికి, అప్పటివరకూ ఉన్న ఏ చెడు లక్షణాలనుండి విముక్తి పొంది మారాలి?- అన్న అంశం కూడా తెలుసు. ఆ చెడు లక్షణాలు ఏయే చారిత్రక పరిస్థితుల ప్రభావం వల్ల వచ్చాయో, ఏయే సామాజికదశలూ, శక్తులూ దానికి కారణభూతాలయ్యాయో, వాటినీ ధర్మారావు అర్థం చేసుకున్నాడు. ఈ లక్షణాలు సమాజంలో రావడానికి ఎంత కాలం పట్టాయో వాటిని వదిలించుకోడానికీ అంతేకాలం పట్టవచ్చన్న అభిప్రాయం వీరికుంది. అయితే ఆ చెడును తిట్టుకుంటూ కూర్చునే వ్యక్తికాదు వీరు. వీటిని ఎదుర్కొన్న తనకన్నా పూర్వీకుల చరిత్రను సాకల్యంగా అధ్యయనంచేశాడు. వారందరి కృషినీ కలపోసి ముందుకెళ్ళాలని అనుకున్నాడు

కొన్నివర్గాల సంఘర్షణలో ఒక సామాజిక దశ ఆవిర్భావాన్నీ, చరిత్రనూ చూసిన ధర్మారావుకు; మరికొన్ని కొత్త వర్గాలు సమైక్యమై ఘర్షించడం అవసరం. అప్పుడే తాననుకున్న సమాజంలోని చెడు లక్షణాలు పోయే అవకాశం ఉంది, అన్న స్పృహ వీరికుంది గతంలో ఏ వ్యక్తులు, ఏయే రూపాల్లో శ్రమించి ఇలాటి ఘర్షణను వేగవంతం చేశారో చూశాడు. వాళ్ళే కందుకూరి, గురజాడ, గిడుగులు.

ధర్మారావూ, వీళ్ళూ ఉన్న సమాజం కొంచెం ఇంచుమించుగా ఒకటే. అందువల్ల సమాజంలో ఉన్న చెడుగేదో వీళ్లందరికీ కనిపించింది. కానీ అందరూ వేర్వేరు మార్గాల్లో, విభిన్నాలైన ఆయుధాలతో తిరుగుబాటు చేశారు. సామాజిక విప్లవం త్వరితం కావటానికి భావ విప్లవం అవసరమని అందరూ గుర్తించారు.

ఫ్యూడలిజం జనజీవితం అంతటా పరచుకుంది. అందులో మత సంబంధమైన ఫ్యూడలిజం నాశనంకాంది సమాజం బాగుపడదని కందుకూరి భావించాడు. దీనికి కారణం ఉంది. తన చుట్టూ ఉన్న ప్రజలను నడిపిస్తున్నది వాళ్ళ ఆలోచన కాక, మతం - మతాధిపతులా - ఆచారాలూ - వాటిని తలకెత్తే ఆచార్యులూ, వంటి నిరంకుశ శక్తులేనని కందుకూరి గమనించాడు. వాళ్ళలో

ఆలోచనలకు కొత్త కిటికీలు తెరిచి, పేరుకున్న గబ్బిలాల కంపును దులిపే కొత్త గాలులు అవసరం అని తలచాడు. అందుకు మొదటి దెబ్బ పీటికి మూలమైన మతం, మూఢవిశ్వాసాలపై కొట్టడం అవసరమనిపించి కందుకూరి, అదే లక్ష్యంగా తన సాహిత్యం - జీవితం, ఆ పోరాటానికే అంకితం చేశాడు. అందుకే కలం నిలపకుండా, క్షణం ఆగకుండా తుది శ్వాస విడిచేవరకూ ఆ మతపరమైన ఫ్యూడలిజం మీద పోరాటం సాగించాడు. ఇందులో మిత్రులు శత్రువులైనారు, శత్రువులు మిత్రులైనారు. కానీ యువకులు మాత్రం కడకంటా వెన్నంటివచ్చారు.

సమాజంలో రెండో రంగంలో ఈ ఫ్యూడలిజం వికటాట్టహాసాన్ని గురజాడ గమనించాడు. అదే సాహిత్యరంగం. సామాజిక సంస్కరణ గాలులు తెలుగు నేలమీద వీస్తుండడం శుభసూచకమనుకున్నాడు. కానీ సాహితీరంగం ఏళ్ళ తరబడి చలనంలేని మురికి నీరుచేరిన గుంటగా ఆయనకు కనిపించింది. అనేక వ్యాధులు ప్రకోపిస్తున్న దశనూ, అవి జనం మూలుగులు పీలుస్తున్న అంశాలనూ స్పష్టంగా చూశాడు గురజాడ. సాహిత్యంలో పెత్తందారీతనాన్ని, అది తెస్తున్న చీడనూ పసిగట్టాడు. సామాన్యులు పడుతున్న మానసిక ఆందోళనలను ఎక్స్‌రే కళ్ళతో చూశాడు. ప్రపంచ సాహిత్యంలో ఉండే భాష, ఛందస్సు, భావాలలో వచ్చిన, వస్తున్న మార్పులనూ గమనించాడు. విశాల దృష్టిని పెంచుకున్నాడు. దాంతో తెలుగు సాహిత్యంలో కొత్త పుంతలూ, కొత్త దారులూ వేశాడు. సామాజిక పరిణామానికి సాహిత్యం బాధ్యత గుర్తించి, దాన్ని విప్లవ పంథాలో వేగవంతం చేశాడు. ఆ గమనం అభ్యుదయం దిశగా సాగడానికి శ్రమించాడు. భవిష్యత్తు మీద విశ్వాసంతో ఆ పనికోసం పోరాడాడు.[39] సాహిత్యరంగంలో యథా పూర్వస్థితి కోసం పెనుగులాడే అభివృద్ధి నిరోధకుల భావాలపై గురజాడ కత్తికట్టి ఎదుర్కొన్నాడు. ఈ విధంగా సాహిత్య ఫ్యూడలిజం 'పుట్టకీటు' కదల్చడంలో గురజాడ, కన్నుమూసేదాకా కలం దించలేదు.

''సంకెళ్ళను ప్రేమించేవాళ్ళు దాన్ని - అనగా గ్రాంథిక భాషను . ఆరాధిస్తారుగాక. నామట్టుకు నా మాతృభాష సజీవమైన తెలుగు. ''ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు'' అనిపించుకున్న ఈ తెలుగుతో మన సుఖాల్నీ దుఃఖాల్నీ వెల్లడించడానికి మనం యెవరమూ సిగ్గుపడలేదుగాని కాగితం మీద పెట్టడానికి మాత్రం మనలో కొంతమంద్కి బిడియపడుతున్నార'' ంటూ గురజాడ మన భాషను గురించి వాపోయాడు. అప్పటికి భాషావిషయకంగా గిడుగు ఉద్యమంలోకి

చూకలేదు. ఈ రంగంలో కూడా గ్రాంథికవాదుల మోతుబరితనం తెలుగుభాష పెరగడానికి వీల్లేకుండా నెత్తిమీద మేకులు కొట్టింది. చిన్నయసూరి లాంటి వాళ్లు ఉక్కుచట్రాలే బిగించారు. గురజాడ సాహిత్య సృజన గిడుగుకు లక్ష్యంగా కనిపించింది. వ్యావహారిక భాషోద్యమం తీవ్రతరం చెయ్యాలనిపించింది. ఇందుకు ప్రపంచంలోని భాషల పెంపుదలా, ఆయా శాస్త్రజ్ఞుల కృషీ గిడుగు అధ్యయనం చేశాడు. అక్కడ కరుడుకట్టిన ఛాందసభావాలను, వాటిని ప్రచారం చేసినవాళ్ళను ఎలా ఎదుర్కొన్నారో అధ్యయనం చేశాడు. సశాస్త్రీయంగా, అధికారికంగా ఈ రంగంలో ప్రబలిన ఫ్యూడలిజం భావాలను మొదలంటా నరకాలనీ వ్యావహారికానికి సభామర్యాద కల్పించాలనీ కృషి చేశాడు. ఇందుకు కందుకూరి, గురజాడలు అప్పటికే చేపట్టి సాగించిన ఉద్యమాల ప్రభావం బాగా తోడ్పడింది. అసహాయశూరుడిలా, కాకలుతీరిన యోధుడిలా పోరాటం సాగించాడు.

ధర్మారావు నిలదొక్కుకునే కాలానికి ముందు ఈ రంగాలన్నిటా ఫ్యూడలిజం నిలదొక్కుకోడం చూశాడు. తొలి దశలో తానూ ఆ దశలో వ్యక్తే కనుక దాన్ని ఎదిరించడానికి కొంత సమయం తీసుకున్నాడు. మొదట్నుంచీ సామాజికంగా ఉండే మతసంబంధమైన ఫ్యూడలిజం గుప్పిట్లో తానూ నలిగినవాడు గనుక, దాని మీద తిరుగుబాటుతో ధర్మారావు తన కృషి ఆరంభించాడు. సమకాలిక జీవనాన్ని నిత్యం అధ్యయనం చేస్తున్నందువల్లా, ఒక రకమైన రంగంలో ఫ్యూడలిజాన్ని ఎదిరించడానికి నిశ్చయించుకున్నందువల్లా, అలాటి అసహ్యించుకోదగ్గ లక్షణాలు ఇతరరంగాల్లో కూడా చూడగలిగాడు. ఆ రంగాల్లో కృషిచేస్తున్నవారి శ్రమను మొదట సరిగా అంచనా వేయకపోయినా క్రమంగా తన తప్పు తెలుసుకుని మారాడు. దానితో ఆ మూడు రంగాలలో మిగిలిన ఫ్యూడలిజం లక్షణాలను తూర్పారబట్టాలని తలచాడు. ఆ రంగాలలో కృషిచేసినవాళ్ళనే తనకు మార్గదర్శకులుగా భావించాడు.

అంతేకాదు కందుకూరి, గురజాడ, గిడుగుల కాలానికి అంతగా కనిపించందీ; క్రమంగా తీవ్రమై ధర్మారావు రంగంలో దిగే కాలానికి స్ఫుటంగా కనిపించిందీ, మరోటి ధర్మారావు దృష్టిలో పడింది. అదే రాజకీయాల్లో ఫ్యూడలిజం. తనకు పూర్వమున్న విప్లవ వైతాళికత్రయం దీన్ని బహుశా గమనించినా తమ కృషి ఇతర కోణాలలో సాగించారు. పారిశ్రామిక విధానం పెరుగుతున్న కొద్దీ; గత దశకు చెందిన భావాలకూ - నూతనంగా వచ్చిన భావాలకూ ఘర్షణ జరగడం అనివార్యం. పాత, కొత్త వర్గాల మధ్య వైరుధ్యం సహజం

శిథిలమవుతున్న సామాజిక భావాలూ, కొత్తగా రూపుకడుతున్న సామాజికాంశాల భావాలూ పోటాపోటీలు పడడం జరుగుతుంది. దీన్ని రాజకీయరంగంలో చాలా స్పష్టంగా ధర్మారావు చూశాడు.

అది జాతీయ పోరాటంగా కనిపిస్తున్నా; అందులో ఈ పెత్తందారీ భావాలు దేశ సమైక్యతకూ, అందర్నీ ఒకే ఆశయంతో కలుపుకుపోవడానికి ఆటంకంగా పరిణమిస్తాయని ధర్మారావు భావించాడు. అంతేకాదు. దేశంలోని అన్ని వర్గాలూ, వర్ణాలూ, జాతులూ సమానంగా అభివృద్ధి సాధించడానికి ఈ భావాలే అడ్డుకుంటున్నాయని కూడా గమనించాడు. అది కాంగ్రెసుకానీ, జస్టిసు పార్టీ కానీ, ప్రజామిత్రపక్షం కానీ ఏదైనా ఈ ఊబిలో పడే కొట్టు మిట్టాడ్తోందని గ్రహించాడు. కనుక తను పోరాడాల్సిన శత్రువర్గంలో ఈ నాలుగో అంశాన్ని కూడా చేర్చుకున్నాడు.

ఒక సాహిత్యకారుడుగా సాహితీపరంగానూ, భాషాపరంగానూ ఎలాటి ఫ్యూడల్ లక్షణాలనూ సహించకూడదని భావించడం సహజమే. సంస్కరణ భావాభిలాషిగా, ఒక నూతన సమాజాన్ని ఊహిస్తున్న వ్యక్తిగా, ఆ సమాజంలో వర్గరహిత స్వభావం ఉంటుందని కాంక్షిస్తున్న మనిషిగా, మత సంబంధమైన ఫ్యూడల్ లక్షణాలను అసహ్యించుకోడం సబబే. సాహిత్యకారుడూ, కవీ - తన చుట్టూ ఉన్న సమాజంలో ఒకడుగా ఉండకమానడు. తన సమకాలిక సమాజాన్ని నడిపే రాజకీయ భావాల ప్రభావానికి గురికాక మానడు. అలాంటప్పుడు తాను వింటున్న సరికొత్త సోషలిస్టు సమాజం కోసం ఆరాటపడే వ్యక్తి, అలాటి సమాజం వస్తేనే సమస్త కళలూ - సాహిత్యమూ సంపూర్ణంగా ప్రజలపరం కాగలవని విశ్వసిస్తున్న వ్యక్తి, తన చుట్టూరా ఉండే రాజకీయాల్లో ఫ్యూడలిజం భావాల నెలా సహించగలడు? అందుకే తిరుగుబాటు చేశాడు. అయితే ఈ రంగంలో ధర్మారావు చేసిన తిరుగుబాటుకు, మిగిలిన మూడు రంగాలకన్నా కాస్తకాలం ఎక్కువ తీసుకుంది. అయినా సరే నిర్దిష్టమైన దిశలో సాగాడు. ఆ మహోన్నత సమాజం కోసం కృషిచేసే అన్ని ప్రజాసంఘాల, ఉద్యమాల కార్యక్రమాల్లో పాలు పంచుకున్నాడు.

అది సాహిత్య రంగం కానీ, పత్రికా రంగం కానీ, చలనచిత్ర రంగం కానీ- అన్నిటా ఈ ఫ్యూడలిజాలను తుదికంటా నిర్మూలించడానికే ధర్మారావు జీవితం అంకితమైంది. కందుకూరి, గురజాడ, గిడుగులందించిన కాగడాలను సంలీనం చేసుకుని ముందుకు సాగాడు ధర్మారావు. తన సాహిత్యజీవితమంతా- తానందుకున్న ఆ కాగడాను జ్వలింపజేయడానికే ధారపోశాడు.

తెలుగు దేశం వ్యవసాయ ప్రధానంగా ఉంది. అలాటి సందర్భంలో ఎంత పారిశ్రామికీకరణ జరిగి, కొత్త వర్గాలు పుట్టి సామాజిక దశల్లో పరిణామాలు వస్తున్నా, శిథిలమయ్యే ఫ్యూడలిజం దశకు సంబంధించిన అవశేషాలు పూర్తిగా నశించడం కష్టం. సామాజిక పరిణామ దశల్లో ఇవన్నీ అంచెలు. ధర్మారావు ఆశించిన మహోన్నత దశకు చేరుకోవాలంటే ఈ అంచెలను చేరకుండా అడ్డుదారి లేదు. ఉండదు. అథవా ఉందని కొందరు భ్రమించినా, అది లక్ష్యానికి చేర్చబోదన్నది ప్రపంచ ప్రజాపోరాటాల చరిత్ర విప్పిచెప్తోంది. కనుక ఈ మార్గంలో ప్రయాణం అనివార్యం. అయినప్పుడు చీకిచివికిపోతున్న గతకాలపు దుర్లక్షణాలు ఈ సమాజంలో కూడా కనిపిస్తాయి. అవి ఉన్నంత కాలం, తన పూర్వీకుల దగ్గర మార్గమధ్యంలో ధర్మారావు అందుకున్న కాగడా ఆగదు. దాన్ని ధర్మారావు వారసులమైన మనం అందుకోక తప్పదు. ధర్మపథంలో, నిత్యం జరిగే ఈ భావవిప్లవ పోరాట క్రమంలో - మనమందుకున్న ఈ మండే కాగడా ఆరదు.

# నగరప్రస్థం - సూచికలు

1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ రెండువేలు సాయం చేయగా, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ నాలుగువేలు గ్రాంటుగా ఇచ్చింది - 1969.
2. శ్రీ మరుపూరి కోదండరామిరెడ్డితో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
3. ప్రముఖ సాహితీవేత్తలకు ఆర్థికసాయం పథకం కింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ధర్మారావుకు నెలకు యాభై రూపాయల చొప్పున 1965 నుండి 1968 వరకు సాయం చేసింది.
4. శ్రీ దేవులపల్లి రామానుజరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
5. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
6. 'కర్తవ్యం' యువజన మాసపత్రిక, గుంటూరు,నవంబరు 1962, పేజి 2
7. శ్రీ పురిపండా అప్పలస్వామితో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
8. శ్రీ పురిపండా అప్పలస్వామి దగ్గరున్న షష్టిపూర్తి సభల టేపు ఆధారంగా.
9. హైదరాబాదు తెలుగు అకాడమీ కోసం ధర్మారావును ఇంటర్వ్యూ చేసిన టేపు ఆధారంగా (1969).
10. ప్రశ్నావళికి లండన్ నుండి శ్రీశ్రీ పంపిన సమాధానం.
11. ప్రశ్నావళికి లండన్ నుండి శ్రీశ్రీ పంపిన సమాధానం.
12. ధర్మారావు ఉపన్యాసంలో భాగం. 1-2-1970.
13. ధర్మారావు ఉపన్యాసంలో భాగం. 1-2-1970. చలసాని ప్రసాద్ చేసిన టేపు ఆధారంగా.
14. పుస్తకాల అమ్మకంలో ప్రకటనల ప్రాధాన్యత తాపీవారికి బాగా తెలుసు. దాన్నే "నల్లబల్ల ప్రకటనలో, పోస్టర్లు ఏజంట్లకు పంపడమో, పత్రికలలో విమర్శలు ప్రకటించడమో లేకపోతే దానితో సంబంధించిన కాంట్రొవర్సల్ విషయము మీద వాదోపవాదాలు రెచ్చగొట్టడమో" .......చెయ్యాలని విజయవిలాసం వ్యాఖ్యానం సేల్సు గురించి తాతగారే విశాలాంధ్రకు దగ్గులు నేర్పారు. ఈ అంశాలన్నీ ధర్మారావు తాను నడిపిన పత్రికల్లో ఆచరించారన్నది ఇప్పటికే గమనించడం జరిగింది.

   హైదరాబాదు నుండి విశాలాంధ్ర ప్రచురణాలయానికి రాసిన లేఖ 8.5.1968.

15. శ్రీ తుమ్మల వెంకట్రామయ్య ఉత్తరానికి, తాపీ మద్రాసునుండి సమాధానం రాస్తూ తన 'రచనల పాత బూజు దులుపుతున్నా'నన్నాడు.
మద్రాసు నుండి రాసిన లేఖ 2.6.1955.

16. విశాలాంధ్ర ప్రచురణాలయం మేనేజరు జోషికి రాసిన లేఖాంశం. హైదరాబాదు 14.12.1972.

17 ''కొత్త పెళ్ళికొడుకులనూ పెళ్ళికూతుళ్ళనూ ఆహ్వానించి, వాళ్ళకు తగిన కట్నాలివ్వడము,(ధోవతులు - చీరలు మొదలైనవి) కనిపెట్టుకునుండేవాళ్ళకు ఈనాములు, దానధర్మాలు - ఇవన్నీ నా భార్య మాకిచ్చిపోయిన 'లెగసీ'. ఎంత క్లుప్తంగా చూచినా ఒక 500/- (అయిదు వందలకు) తక్కువకాదు'' - పంపమన్నారు.
హైదరాబాదు నుండి విశాలాంధ్ర ప్రచురణాలయానికి రాసిన లేఖ 8.1.1972

18. లేఖ 9. 10 1970

19. శ్రీమతి తాపీ రాజమ్మతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.

20. విజ్ఞాన సర్వస్వం - తెలుగు సంస్కృతి రెండవ వాల్యూము. తెలుగు భాషాసమితి 1961 పేజి 1103 - 1109.

21. విజ్ఞాన సర్వస్వం - తెలుగు సంస్కృతి రెండవ వాల్యూము తెలుగు భాషా సమితి 1961 పేజి 1031 - 1032.

22. ఇదే వ్యాస సంగ్రహాన్ని గూడవల్లి రామబ్రహ్మం స్మారక సంచిక - తెనాలిలో పునర్ముద్రించారు. విజ్ఞాన సర్వస్వం - తెలుగు సంస్కృతి రెండవ వాల్యూము. తెలుగు భాషా సమితి 1961 పేజి 1017-1018.

23. మల్లాది రామకృష్ణశాస్త్రి సంచిక - ఆనందవాణి పత్రిక పేజి 2,3,4.

24. వానమామలై వరదాచార్యులు, పోతన చరిత్రం 1966 పేజి 95, 96.

25. హైదరాబాదు యువతీ మండలిలో జరిగిన ధర్మారావు సన్మాన సభలో ఇచ్చిన ఉపన్యాసం. 1972 మే

26. మడిపడిగ బలరామాచార్య మేనకా విశ్వామిత్రం - ప్రస్తావన హైదరాబాదు పేజి 3 - 8.

27. భారత సోవియట్ సాంస్కృతిక సంఘం, ఆంధ్రప్రదేశ్. కరపత్రం. మార్చి 1966.

28. గుంటూరులో జరిగిన ఇస్కస్ జాతీయ మహాసభల (1968) ప్రత్యేక సంచికలో ప్రచురించారు. అప్పుడు తాపీవారు అనారోగ్యంతో బాధ పడ్తున్నారు.

29. నృసింహపురాణ పాఠశోధన - ఒక పాఠనిర్ణయ సూచన. భారతి 1970 జులై. పేజి 29, 32.
30. హైదరాబాదు పబ్లిక్ సొసైటీ రిజిస్ట్రేషన్ అక్టు ప్రకారం నెం. 1 (ఫసలీ 1350) అనగా 1957-1958 నాటి నెంబరు 42గా రిజిస్టరైంది.
31. ఆచార్య రాయప్రోలు సుబ్బారావు, డా॥ బిరుదురాజు రామరాజు, డా॥ దివాకర్ల వెంకటావధాని, దీపాల పిచ్చయ్యశాస్త్రిగార్లు మిగిలిన సంపాదకవర్గ సభ్యులు.
32. దీని పర్యవేక్షణకు తాపీవారినీ, దీపాల వారినీ ఆహ్వానించి పాఠనిర్ణయాల మీద తుది నిర్ణయం చేయించారు. 1962లో ఆరంభించి దీని అసలైన కాపీని ఈ సంపాదకవర్గం 1963 లో అందించింది-భాగవతం పీఠికలో రామరాజు అభిప్రాయం.
33. శ్రీ దేవులపల్లి రామానుజరావుతో ఇంటర్వ్యూ - హైద్రాబాదు.
34. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
35. శ్రీ దేవులపల్లి ప్రభాకర్‌తో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
36. జి. ఓ. నెం. 1995 - తేది : 27 - 7 - 1964.
37. ఈ సదస్సు 'మినిట్సు' డా॥ భద్రిరాజు కృష్ణమూర్తి ద్వారా తీసుకుని పరిశీలించడం జరిగింది.
38. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంతో ఇంటర్వ్యూ - హైదరాబాదు.
39. శ్రీశ్రీ 'గురజాడ' మన సాహితి హైదరాబాదు 1959 పేజి 45 - 47.

## అనుబంధం

## జీవితంలో ముఖ్యఘట్టాలు

| | |
|---|---|
| 1887 సెప్టెంబరు 19 | జననం - గంజాం జిల్లా, బరంపురం. |
| 1903 | మెట్రిక్ పరీక్షకెళ్ళే యత్నం విఫలం. |
| 1904 | మెట్రిక్ పరీక్షలో మొదటి శ్రేణిలో కృతార్థత - విజయనగరం. |
| 1904 | గురజాడను సుదూరంగా దర్శించడం. |
| 1904 | ఎఫ్.ఎ. - పర్లాకిమిడి రాజా కళాశాలలో ప్రవేశం - పర్లాకిమిడి. |
| 1904 | గిడుగు రామ్మూర్తితో పర్లాకిమిడి కళాశాలలో పరిచయం. |
| 1904 | కోరాడ ఆదెమ్మ కుమార్తె అన్నపూర్ణమ్మతో వివాహం. |
| 1906 | మిడిల్ స్కూల్ టీచరుగా కొంత కాలం ఉద్యోగం - టెక్కలి. |
| 1906 | బరంపురం కళ్ళికోట కాలేజిలో ఉద్యోగం. |
| 1906 | 'విలాసార్జునం' నాటక రచన - బరంపురం. |
| 1906 | బి.ఎ. చదువుకు ప్రయత్నాల ఆరంభం. |
| 1907 | బి. ఎ. కోసం మద్రాసు ప్రయాణం. |
| 1909 | పచ్చయ్యప్పాస్ కాలేజినుండి ప్రథమ శ్రేణిలో బి.ఎ. ఉత్తీర్ణత. |
| 1911 | వేగుజుక్క గ్రంథమాల స్థాపన - బరంపురం. |
| 1911 | కందుకూరిని కలుసుకొని తన ఉషఃకాలము బహూకరణ |
| 1912 - 1914 | 'కొండెగాడు' పత్రికల నిర్వహణ - విశాఖపట్నం, బరంపురం. |
| 1915 | చీకటి సంస్థానం సర్వే శాఖలో ఉద్యోగం. |
| 1916 | కెనెడియన్ బాప్టిస్టు స్కూల్లో ఉద్యోగం - విశాఖపట్నం. |
| 1917 | న్యూయింగ్టన్ కళాశాలలో ఉద్యోగం - మద్రాసు. |
| 1921 | మిథిక్ సొసైటీ - బెంగుళూరు - తో సంబంధాలు. |
| 1921 | చుండి సంస్థానంలో ఉద్యోగం - నెల్లూరు. |

1925 ఊర్కాడు సంస్థానంలో ఉద్యోగం.

1926 శృంగేరీ పీఠాధిపతి చంద్రశేఖర భారతీ శంకరాచార్యులు 'ఆంధ్ర విశారద' బిరుద ప్రదానం - ఊర్కాడు.

1926 - 1928 ట్యుటోరియల్ కాలేజీ నిర్వహణ - విజయనగరం.

1929 అంతరంగిక కార్యదర్శి, దివాను పదవుల నిర్వహణ - బొబ్బిలి.

1930 సౌత్ వల్లూరు మైనర్ జమీందారుకు ట్యూటర్ గార్డియన్ ఉద్యోగం - మద్రాసు.

1930 జస్టిసు పార్టీ పత్రిక 'సమదర్శిని' సంపాదక బాధ్యత స్వీకరణ - మద్రాసు.

1932 - 1933 ట్యుటోరియల్ కాలేజిలో ఉద్యోగం - మద్రాసు.

1933 అభినవాంధ్ర కవిపండిత సభలకు హాజరు - బరంపురం.

1934 ట్యూటర్ గార్డియన్ ఉద్యోగం - మందసా.

1933 - 1936 ఏ రచనా చేయని కాలం. భాషాపరంగానూ, భావాల పరంగానూ మార్పులకు గురౌతున్న కాలం.

1936 వ్యావహారిక భాషా వాదిగా మారినట్టు గిడుగుకు ఉత్తరం.

1936 - 1939 పీపుల్స్ పార్టీవారి 'జనవాణి' దినపత్రికకు సంపాదకత్వం.

1937 మోహినీరుక్మాంగద రచనతో సినీరంగ ప్రవేశం.

1940 కల్చరల్ కాన్ఫరెన్స్ ప్రారంభోత్సవం - గుంటూరు.

1940 స్థానిక కళాశాల ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ప్రసంగం - కాకినాడ.

1940 పత్రికా సంపాదకుల మహాసభకు అధ్యక్షత - విజయవాడ.

1940-1942 'కాగడా' వార పత్రిక నిర్వహణ -మద్రాసు.

1941 సినిమాల కారణంగా కలకత్తా పర్యటన.

1942 త్రిపురనేని రామస్వామి చౌదరి ౫౬వ జన్మదినోత్సవాల ప్రారంభకులు - గుడివాడ.

1942-1947 వార్ టెక్నీషియన్స్ రిక్రూటింగ్ ఆఫీసర్, వార్ పబ్లిసిటీ ఆఫీసర్ పదవుల నిర్వహణ - విజయవాడ.

1943 ఫిబ్రవరి 13, 14 ఆంధ్ర అభ్యుదయ రచయితల మొదటి మహాసభ అధ్యక్షత - తెనాలి.

1943 అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షవర్గానికి ఎన్నిక - బొంబాయి.

| | |
|---|---|
| 1946 ఫిబ్రవరి 19 | మోహనరావు, రాజమ్మల వర్ణాంతర వివాహ నిర్వహణ - విజయవాడ. |
| 1947 | ఆస్త్మాకు గురవడం. |
| 1949-1953 | 'జనవాణి' వారపత్రిక నిర్వహణ - మద్రాసు. |
| 1951 | ఇంటింటి విజ్ఞానమాల నిర్వహణ - మద్రాసు. |
| 1951 | తెలుగు సంస్కృతీ సభలకు అధ్యక్షత - మద్రాసు. |
| 1952 | పెకింగులో శాంతి సంఘ సభలకు వెళ్ళడానికి ప్రభుత్వ అనుమతి నిరాకరణ. |
| 1952 | 'విశాలాంధ్ర' దినపత్రిక ప్రారంభకులు - విజయవాడ. |
| 1953-1954 | గడ్డం మీద కురుపు లేవడంవల్ల గడ్డం పెంచడం ఆరంభం. |
| 1954 | హనుమంతరావు, సరళల వివాహ నిర్వహణ - మద్రాసు. |
| 1956 | ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ సన్మాన సభలకు అధ్యక్షత - మద్రాసు. |
| 1956 | జయప్రద, సి. కె. నారాయణరెడ్డిల వివాహ నిర్వహణ - మద్రాసు. |
| 1956 | వివిధ రంగాలలో ప్రముఖులు వీరి 70వ జన్మదినోత్సవం నిర్వహణ - మద్రాసు. |
| 1956 | సొంత ఇల్లు నిర్మాణం - మద్రాసు. |
| 1957 | శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం సెనేటు సభ్యులుగా నియామకం - తిరుపతి. |
| 1957 | భారత ఫిలిం జర్నలిస్టుల సంఘం చలనచిత్ర పరిశ్రమ రజతోత్సవాల సందర్భంగా జరిపిన సన్మానం - మద్రాసు. |
| 1957-1973 | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యత్వం. |
| 1958 జూన్ | హైదరాబాదు స్థిరనివాసానికి నిశ్చయం. |
| 1959 | అభ్యుదయ రచయితల సమితి అధ్యక్షత - హైదరాబాదు. |
| 1959 | ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ప్రసంగం - వాల్తేరు. |
| 1960 సెప్టెంబరు 19 | భాగ్యనగరంలోని పలువురు ప్రముఖులు సారథీ స్టూడియోస్‌లో వీరి 74వ జన్మదినోత్సవం నిర్వహణ-హైద్రాబాద్. |
| 1960 | 'తాతాజీ' రచనలు ప్రచురణ సంస్థ ఆరంభం - హైదరాబాదు. |

| | | |
|---|---|---|
| 1961 ఏప్రిల్ 4 | | ధర్మపత్ని అన్నపూర్ణమ్మగారి నిర్యాణం - హైదరాబాదు. |
| 1961 | | అన్నపూర్ణమ్మ స్మారక స్కాలర్‌షిప్ శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో నెలకొల్పడం. |
| 1962 | | చిక్కడపల్లిలో ఇంటికి మారడం. |
| 1962 | | 'తాపీవారి ప్రచురణలు' నెలకొల్పడం - విజయవాడ. |
| 1962 నవంబరు 11 | | గోపీచంద్ స్మారక సభలో ప్రసంగం - హైదరాబాదు. |
| 1963 | | 'భీష్మ' చివరి చిత్ర రచన. |
| 1963 | | గిడుగు శతజయంతి సభలో ప్రసంగం - హైదరాబాదు. |
| 1963 | | గురజాడ స్మారక పరిశోధక మండలి అధ్యక్షత - హైదరాబాదు. |
| 1964 | | కంటికి శస్త్రచికిత్స - హైదరాబాదు. |
| 1964 | | పురిపండా అప్పలస్వామి షష్టిపూర్తి సభలకు అధ్యక్షత - విశాఖపట్నం. |
| 1964 | | నంది అవార్డ్స్ సంఘ సభ్యత్వం - హైదరబాదు. |
| 1964 - 1969 | | ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యత్వం. |
| 1965 | | ఆంధ్ర రచయితల సహకార సంఘ సభ్యత్వం - హైదరాబాదు. |
| 1965 | | భాషమీద సదస్సులో ప్రసంగం - తిరుపతి. |
| 1966 | | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వం. |
| 1966 | | వేదం వెంకట్రాయశాస్త్రి శతజయంతి సభలో ప్రసంగం - హైదరాబాదు. |
| 1966 | | రాష్ట్ర ప్రభుత్వ పుస్తకాల అవార్డ్స్ కమిటీ సభ్యత్వం - హైదరాబాదు. |
| 1967 | | కాలు విరిగిన కారణంగా గాంధీ ఆసుపత్రిలో చేరడం - హైదరాబాదు. |
| 1968 మే | | హృదయోల్లాస వ్యాఖ్య ప్రచురణ పూర్తి - విశిష్ట రచనలు. ఆరంభం - హైదరాబాదు. |
| 1969 | | తెలుగు అకాడమీ ప్రచురణల విడుదల సభాధ్యక్షత - హైదరాబాదు. |
| 1969 | | ఖైరతాబాదులోని చాణక్య కట్టుకున్న ఇంటికి నివాసం మార్పిడి. |
| 1970 | | శ్రీశ్రీ షష్టిపూర్తి సభలకు అధ్యక్షత - విశాఖపట్నం. |

| | |
|---|---|
| 1970 | ఢిల్లీలో జరిగిన 4 వ ఆఫ్రో ఏషియన్ రచయితల సభల్లో జాతీయ కార్యనిర్వాహక వర్గ సభ్యుడుగా ఎన్నిక. |
| 1970 ఏప్రిల్ | తీవ్ర అస్వస్థత. |
| 1971 | పైల్సు వ్యాధి ప్రకోపం. |
| 1971 సెప్టెంబరు 5 | తెలుగు లిపి సంస్కరణ సభల్లో పాల్గొనడం - హైదరాబాదు. |
| 1972 మే 7 | 1971 వ సంవత్సరానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం - స్వీకారం. |
| 1972 మే 13 | భాగ్యనగరంలోని అనేక రంగాల్లోని పలువురు మిత్రులు, సాహితీవేత్తలు, కళాకారులు; యువతీ మండలిలో పెద్ద ఎత్తున వీరిని సన్మానించారు. ఇందులో వీరి చివరి ఖండి కల సంపుటం 'మబ్బు తెరలు' ఆవిష్కరణ. |
| 1973 మే 8 | తెల్లవారు జామున ఖైరతాబాదులోని చాణక్య ఇంట్లో ధర్మారావు నిర్యాణం. |

## వంశవృక్షం



(బండారు) తాపీ లక్ష్మన్న
కొడుకు + కోడలు (అప్పన్నకు 5 సం. లప్పుడు చనిపోయారు)
అప్పన్న + నరసమ్మ
నరసింగరావు
+
రమణమ్మ
ధర్మారావు
+
అన్నపూర్ణమ్మ (కోరాడ ఆదెమ్మగారి కుమార్తె)
తులసీరావు
వెంకటనర్సమ్మ
+
గోలకొండ వెంకట్రావు
వెంకట అప్పారావు
బంగారమ్మ
తిరుపతమ్మ
+
మాచర్ల అప్పారావు

# ఇట్లా సరిచూడాలి

| పుట | పంక్తి | సవరణ |
|---|---|---|
| 16 | 17 (మూడో పేరా) | వెల్లటూరి |
| | 18 (అదే పేరా) | సూగూరు |
| 19 | 3వ పేరాలో అక్కిరాజు ఉమాకాంతం ప్రస్తావన. | ఉమాకాంతం అప్పటికి మద్రాసు చేరలేదు. ధర్మారావు పొరబడ్డట్టున్నది. |
| 33 | 8 | ప్రోత్సాహం |
| 36 | 13 | బాగానే |
| 93 | 13 | కొల్లా గురుస్వామి |
| 96 | చివరి పంక్తి | ప్రోచేంజర్స్ |
| 140 | మొదటి పంక్తి | పండిత ప్రమదమెపుడు |
| 193 | కింది నుంచి రెండో పంక్తి | 1936 |
| 219 | 2వ పేరా కిందినుంచి పైకి ఏడో పంక్తి | కొండా వెంకటప్పయ్య, మాడపాటి హనుమంతరావుల ప్రసక్తి పొరపాటు. నాయని వెంకట రంగారావు, రావిచెట్టు రంగారావు అని ఉండాలి. |
| | ఇదే పేరా కింది నుంచి మూడో పంక్తి | చిలుకూరివారి 'ఆంధ్రుల చరిత్ర' |
| 225 | కింది నుంచి పైకి 5వ పంక్తి | అలంపల్లి |
| 229 | మొదటి పేరా రెండో పంక్తి | ముష్కర నైజాం |
| 338 | చివరిపేరా రెండో పంక్తి | వెలువడింది. |
| 393 | 4వ పేరాలో కింది నుంచి మూడో పంక్తి | శపప్రాయుడు మాత్రమే |
| 439 | కింది నుంచి పైకి రెండో పంక్తి | గార్హస్థ్యం |
| 555 | కింది నుంచి పైకి రెండో పంక్తి | ఒంగోలు వెంకట రంగయ్యా |
| 583 | కింది నుంచి పైకి రెండో పేరా | కందుకూరి శతజయంతి కాదు. సంస్మరణ సంఘం. |
| 592 | రెండో పంక్తి | 1960 సెప్టెంబర్ 19. |